# 1058
# ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

www.thraithashakam.org







# 1058
# ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు


రచయిత

**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (72) దశ సప్తాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–38 ఐదవ ముద్రణ : మే–2016

ప్రతులు : 1000 **వెల : 400 /-**

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

## ఇందూ జ్ఞానవేదిక మరియు ఇతర సంఘముల ప్రచురణలు

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
**71) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**72) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**73) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**74) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
75) లు అంటే ఏమిటి? (తెలుగు)
76) ఆదిత్య.
77) చెట్టుముందా! విత్తుముందా?
78) ఒక్కడే ఇద్దరు.



### ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

### సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?
7. ముందు చూపు.

### ద్రావిడ శ్రేష్ఠి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

### రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్
3. కాలజ్ఞానములో ఆనంద గురువు.
4. అంతర్ ధన శతకము (ధన్వంతరి శతకము)

## 04 యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూ మహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవుని జ్ఞానము-మాయ మహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

*DVD'S*

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము?
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది!
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ప్రజలు - మానవులు.
112. ఆస్తి - దోస్తి.
113. దంతము-అంతము.
114. ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్,
చిత్తూరు జిల్లా.
Cell : 9491773455, 9032903955.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు జిల్లా.
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964
92239, 92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16469

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)**
(ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848741703.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# విషయ సూచిక


| విషయములు | | | పుట సంఖ్య |
|---|---|---|---|
| ముందుమాట | | ..... | 11 |
| పరిచయము | | ..... | 15 |
| **ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు** | **మొదటి భాగము** | ..... | **17** |
| **జ్ఞాన పరీక్ష ప్రశ్నలు-జవాబులు** | **రెండవ భాగము** | ..... | **229** |
| స్థలము | తేది : | | |
| తాడిపత్రి | తేది 28-01-1986 | ..... | 229 |
| తాడిపత్రి | తేది 28-01-1987 | ..... | 244 |
| తాడిపత్రి | తేది 28-01-1988 | ..... | 258 |
| తాడిపత్రి | తేది 28-01-1989 | ..... | 271 |
| తాడిపత్రి | తేది 28-01-1991 | ..... | 283 |
| ధర్మవరము | తేది 28-01-1992 | ..... | 294 |
| హంపాపురము | తేది 14-08-1998 | ..... | 309 |
| మాల్యవంతము | తేది 13-09-1998 | ..... | 323 |
| అనంతసాగరము | తేది 10-10-1998 | ..... | 329 |
| తిరుపతి | తేది 08-11-1998 | ..... | 335 |
| మాల్యవంతము | తేది 05-12-1998 | ..... | 342 |
| మల్లికార్జున కోన | తేది 16-01-1999 | ..... | 346 |
| గుత్తి | తేది 05-04-1999 | ..... | 351 |
| ముష్టికోవెల | తేది 04-07-1999 | ..... | 356 |
| మాల్యవంతము | తేది 08-08-1999 | ..... | 361 |
| ధర్మవరము | తేది 02-09-1999 | ..... | 367 |
| కొత్తకోట | తేది 03-11-1999 | ..... | 372 |
| కళ్యాణ దుర్గము | తేది 13-05-2000 | ..... | 377 |
| మాల్యవంతము | తేది 10-09-2000 | ..... | 382 |
| తాడిపత్రి | తేది 08-12-2000 | ..... | 388 |
| కొత్తకోట | తేది 01-01-2001 | ..... | 392 |
| తాడిపత్రి | తేది 03-02-2001 | ..... | 397 |
| చెన్నేకొత్తపల్లి | తేది 03-03-2001 | ..... | 405 |
| చెన్నేకొత్తపల్లి | తేది 05-04-2001 | ..... | 410 |

# విషయ సూచిక


| | | | |
|---|---|---|---|
| చిన్నపొడమల | తేది 07-05-2001 | ..... | 414 |
| కొత్తకోట | తేది 04-07-2001 | ..... | 423 |
| కొత్తకోట | తేది 12-08-2001 | ..... | 428 |
| ధర్మవరము | తేది 08-09-2001 | ..... | 432 |
| కొత్తకోట | తేది 06-10-2001 | ..... | 437 |
| కె. నర్సాపురము | తేది 24-12-2001 | ..... | 443 |
| తాడిపత్రి | తేది 28-01-2002 | ..... | 449 |
| కె. నర్సాపురము | తేది 01-03-2002 | ..... | 454 |
| చిన్నపొడమల | తేది 28-03-2002 | ..... | 458 |
| చిన్నపొడమల | తేది 27-04-2002 | ..... | 467 |
| నరసాపురము | తేది 26-05-2002 | ..... | 481 |
| తాడిపత్రి | తేది 26-06-2002 | ..... | 488 |
| ధర్మవరము | తేది 24-07-2002 | ..... | 500 |
| కొత్తకోట | తేది 30-08-2002 | ..... | 507 |
| కె. నర్సాపురము | తేది 28-09-2002 | ..... | 511 |
| చిన్నపొడమల | తేది 21-10-2002 | ..... | 518 |
| యాడికి | తేది 19-11-2002 | ..... | 529 |
| కె. నర్సాపురము | తేది 18-01-2003 | ..... | 548 |
| బందర్లపల్లి | తేది 16-02-2003 | ..... | 556 |
| చిన్నపొడమల | తేది 04-05-2004 | ..... | 568 |
| చిన్నపొడమల | తేది 28-10-2004 | ..... | 575 |
| చిన్నపొడమల | తేది 26-11-2004 | ..... | 584 |
| చిన్నపొడమల | తేది 07-09-2006 | ..... | 592 |
| చిన్నపొడమల | తేది 18-09-2006 | ..... | 598 |
| చిన్నపొడమల | తేది 25-09-2006 | ..... | 602 |
| చిన్నపొడమల | తేది 07-10-2006 | ..... | 606 |
| చిన్నపొడమల | తేది 05-11-2006 | ..... | 611 |
| చిన్నపొడమల | తేది 04-04-2015 | ..... | 617 |
| చిన్నపొడమల | తేది 04-04-2016 | ..... | 647 |

# రచయిత ముందుమాట

పాఠకులకు మేము ముందుగా తెలియజేయు విషయమేమనగా! ఈ గ్రంథములో కేవలము ఆధ్యాత్మికమునకు సంబంధించిన 1058 ల ప్రశ్నలు వాటికి జవాబులు గలవు. ఈ ప్రశ్న-జవాబులను రెండు భాగములుగ వ్రాయడము జరిగినది. మొదటి భాగములోని 388 ప్రశ్నలు ఇతరులు మమ్ములనడిగినవి. అలాగే రెండవ భాగములోని 670 ప్రశ్నలు మేము ఇతరులనడిగినవి. మొదటి భాగములో ఇతరులడిగిన ప్రశ్నలకు, రెండవభాగములో మేము అడిగిన ప్రశ్నలకు జవాబులు మేమే వ్రాయడము జరిగినది. ఇంక కొంత వివరముగ చెప్పాలంటే 1988 నుండి 1992 వరకు మాచే ప్రచురింపబడిన **"ప్రబోధాత్మజమ్"** అను మాసపత్రిక ద్వార పాఠకులు మమ్ములనడిగిన ప్రశ్నలకు పత్రికా ముఖముగ జవాబులిచ్చెడివారము. ఆ ప్రశ్న జవాబులే మొదటి భాగముగ ముద్రింపబడినవి. ఇక రెండవ భాగములోని ప్రశ్నలను మేము 1986 నుండి నిర్వహించుచున్న జ్ఞానపరీక్షలలో ఇచ్చినవి. మేము ప్రశ్నించిన ప్రశ్నలకు తర్వాత వివరముగ జవాబులు కూడ మేమే చెప్పాము. వాటినన్నిటినీ కూర్చి **"ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు"** అను గ్రంథము చేశాము. ఆత్మ జ్ఞానమునకు సంబంధించిన ప్రశ్నలగుటవలన దీనికి ఆ పేరు పెట్టవలసి వచ్చినది.

ఆధ్యాత్మికములో మనిషికి ఎన్నో ప్రశ్నలు రావడము సహజము. ప్రశ్నలు రావడము సహజమే అయినప్పటికీ కొందరు అన్ని ప్రశ్నలకు జవాబులు వెతకరు. కొందరు మాత్రము ప్రశ్నలకు జవాబులు దొరుకు వరకు అన్వేషిస్తారు. అలాంటివారికి గురువులు స్వాములనువారు జవాబులు చెప్పకపోతే వారు దేవుడే లేడను నిర్ధారణకు వచ్చి నాస్తికులైనారు. జవాబులను పూర్తి తెలుసుకోక సర్దుబాటగువారు ఆస్తికులుగ మిగిలిపోయారు. సరియైన వివరముతో జవాబు తెలుసుకోక ఎవరు ఏది చెప్పినా నమ్ము ఆస్తికులకంటే పూర్తి వివరము కొరకు అన్వేషిస్తు సరియైన జవాబివ్వనపుడు ఎంతటివారినయిన తోసిపుచ్చువారే మేలనుకుంటాము. ప్రశ్నకు జవాబు లేక ఆధ్యాత్మికమంతా కల్పితమను భావముతో కొందరు నాస్తికులైనారు, కానీ జవాబు దొరికితే జ్ఞానమార్గములో ఇపుడున్న ఆస్తికులకంటే వారే ముందుండగలరు. ఒకప్పుడు

మేము కూడ చాలామంది స్వాములను, గురువులను కొన్ని ప్రశ్నలడిగాము. కానీ వారినుండి సంతృప్తియైన జవాబు రాలేదు. చివరకు నిజము ఎవరు చెప్పక పోయేసరికి సత్యమేదో మేము తెలుసుకొని అందరికి అన్ని ప్రశ్నలకు జవాబివ్వాలను కొన్నాము. నావలె ప్రశ్నించి జవాబు దొరకక నిరుత్సాహముతో ఎవరు ఉండకూడదనుకొన్నాము. మా ధ్యేయములో ఎవరు ఏ విధముగ ప్రశ్న అడిగిన దానికి సమాధానమివ్వాలనుకొన్నాము. ఆ ఉద్దేశ్యముతోనే వ్రాయబడినదీ గ్రంథము. ఈ గ్రంథములోని 1058 ల ప్రశ్నలలో నాస్తికులు, ఆస్తికులు అడిగెడివి అన్ని ఉన్నాయి. కొందరి ఊహకు కూడ రాని ప్రశ్నలను కూడ మేమే ప్రశ్నించి వాటికి జవాబివ్వడము కూడ జరిగినది.

ఎన్నో విధముల ప్రశ్నలను వాటికి జవాబులను అందించినప్పటికి కొందరు వాటిని అర్థము చేసుకోలేనివారు కూడ కలరు. అటువంటి వారు తమకు సంబంధములేని తమకు ఉపయోగపడని కొన్ని ప్రశ్నలను పట్టుకొని, వాటికి జవాబులడుగుచుందురు. ఆ ప్రశ్నలకు దేవుడు దిగివచ్చిన జవాబు చెప్పలేడు. ఆ ప్రశ్నలకు జవాబే ఉండదు. అటువంటి అవసరము లేని వాటిని పట్టుకొని కాలమును వృథా చేసుకొనుచున్నారు. జవాబులు లేని ప్రశ్నలెలా ఉండునని కొందరడుగవచ్చును. అటువంటి వాటికి ఉదాహరణగ ఒక ప్రశ్నను చెప్పెదను చూడండి. ఒక జొన్నదంటును ఒక దూడ తింటున్నది. జొన్నదంటు తొమ్మిది అడుగుల పొడవున్నది. దూడ మూడు అడుగుల పొడవున్నది. మూడు అడుగుల పొడవున్న దూడ, తొమ్మిది అడుగుల దంటును తింటున్నపుడు, ముందర నోటి ద్వార లోపలికి పోవు దంటు, వెనకల రావడము లేదే? అని అడుగుచుందురు. వారి ఉద్దేశ్యములో దూడ ఆరు అడుగుల దంటును తిన్నపుడు ఇటువైపు నోటి ప్రక్క మూడు అడుగులు కన్పిస్తున్నది అటువైపు వెనక ప్రక్క మూడు అడుగులు కనిపించవలయును కదా! అన్నది వారి భావము. అట్లు కనిపించదని చెప్పిన అది జవాబుగ తలచరు. కన్పించునని చెప్పితేనే వారి దృష్టిలో జవాబగును. అటువంటి వారికి ఈ లోకములో జవాబు ఎక్కడ దొరకదు. ఇటువంటి ప్రశ్నలను చొప్పదంటు ప్రశ్నలనవచ్చును. వారికి సత్యము చెప్పితే అర్థముకాదు. అటువంటపుడు వారి ప్రశ్నలకు జవాబే ఉండదు.

జవాబు చెప్పినా అర్థము కానివారు వారి ప్రశ్నలకు జవాబే లేదనుకోవడము జరుగుచున్నది. అటువంటివారు రెండు రకములు గలరు. ఒక రకమువారు చొప్పదంటు ప్రశ్నలవారు. రెండవ రకమువారు ధర్మవిరుద్ధ ప్రశ్నలు గలవారు. చొప్పదంటు ప్రశ్నల ఉదాహరణ చెప్పుకొన్నాము కదా! ఇపుడు రెండవ రకమైన ధర్మవిరుద్ధ ప్రశ్నలవారిని చెప్పెదము చూడండి. దేవునికి సంబంధించినవి ధర్మములు. పరమాత్మ భూమి మీదకు వచ్చినపుడు ఆయన తన ధర్మములనే తెలియజేసి పోవును. ఆయన భూమి మీద ఉన్నపుడు ఆయన ధర్మములనే ఆచరించును. అటువంటి ధర్మములు మానవునికి అర్థము కానపుడు తెలుసుకోవలెను. అలా తెలుసుకోకుండ భగవంతుడు నడచిన నడకనే తప్పు పట్టుచుందురు. ధర్మవిరుద్ధమైన ప్రశ్నల నడుగుచుందురు. ధర్మబద్ధముగ శాస్త్రబద్ధముగ సమాధానము చెప్పినప్పటికీ ధర్మ విరుద్ధ భావములో నుండువారికి అది జవాబేకాదనుకొందురు. వారి భావము ఎట్లుండునో కొంత వివరించుకొని చూచినట్లయితే, వారు ప్రపంచ ధర్మములను తీసుకొని, పరమాత్మ ధర్మములతో పోల్చుకొని, రెండు ఒకే మాదిరి ఉండవలెను కదా! అనుకొనుచుందురు. ప్రపంచ ధర్మములకు పరమాత్మ ధర్మములకు పోలిక ఉండదను మాట వారికి తెలియక ఒక మారు ఒక పనిని చేయగలిగిన వాడు తర్వాత ఎపుడైన ఆ పని చేయును కదా! అని ఒక మారు అద్దము ద్వార ఒక వస్తువును చూచినపుడు ఆ అద్దము ద్వార ఎపుడైన ఏ వస్తువునయిన చూడవచ్చును కదా! అని ప్రపంచ ధర్మమును తీసుకొని అడుగుచుందురు. ఒకమారు ఒక రోగి యొక్క రోగమును నయము చేసిన యోగి ఎపుడైన ఏ రోగినయిన బాగుచేయవలెను కదా! అని ఏసుప్రభువు గ్రుడ్డి వానిని కుష్టు రోగిని బాగుచేసి చనిపోయిన వానిని కూడ లేపాడందురు. మిగత కుష్టురోగులను, మిగత గ్రుడ్డి వారిని, మిగత చనిపోయిన వారిని ఎందుకు బాగుచేయలేదు? ఇతరుల చావును పోగొట్టిన వాడు తనెందుకు చావునుండి తప్పించుకోలేదు? అని ప్రపంచ సూత్రములను పరమాత్మ సూత్రములతో పోల్చి జ్ఞానము జ్ఞానశక్తి అంతా బూటకమని అందురు. పరమాత్మ జ్ఞానము జ్ఞానశక్తి ప్రపంచములోని శక్తివలె ఉండవలెనని వారి భావము. పరమాత్మ ధర్మము వేరు, ప్రపంచ ధర్మము వేరని చెప్పిన అవగాహనకాక జ్ఞానమనునదే బూటకమని

అనుకొందురు. ప్రపంచము అవగాహనైనట్లు పరమాత్మ కూడ అవగాహన కావలెనన్నది వారి భావము. ఆ భావము ప్రకారము సరియైన జవాబు కూడ వారికి సరికానిదనియే తెలియును. అటువంటి వారికి జవాబు దొరకదు.

ఈ రెండు రకముల వారికి ఎక్కడ జవాబులుండవు. మేము ఈ పుస్తకములో చాలా వరకు అందరికి అర్థమగులాగున ప్రశ్న-జవాబు సమకూర్చి ఉన్నాము. మా ప్రశ్నలకు ఒక్క పదము లేక ఒక్క వాక్యములో జవాబుండును. ఆ జవాబును వివరించిన ఎడల కొద్దిగ పెద్దదగును. అర్థము చేసుకొనువారికి ఒక మాట లేక ఒక పదముతోనే అర్థమగును. అక్కడికి అర్థము కాని వారికి వివరము చదవ వలసి ఉండును. మా భావములో అందరు వివరము చదవడమే మంచిదని అనుకొంటాము. అలా చదువుటవలన ఆ ప్రశ్నలో ఎటువంటి సంశయము మిగలదు. 1058 ప్రశ్నలకు జవాబులు చదివిన తర్వాత ఎవరి బుర్రలోను ఎటువంటి ప్రశ్నలేకుండ పోవునని, పూర్తి ఆధ్యాత్మిక విద్యయంతయు తెలిసిపోవునని మా ఉద్దేశము. ఆధ్యాత్మికములో ఎవరికి ఏ ప్రశ్న వచ్చిన ఆ ప్రశ్నకు జవాబు ఈ పుస్తకములో తప్పక ఉండునని మేము తలచుచున్నాము. ఈ గ్రంథములోని మొదటి భాగము అందరి తలలలోని ప్రశ్నలు కాగా రెండవ భాగము మా ఒక్క తలలోనివి మాత్రమేనని తెల్పుచున్నాము. మీ తలలోని మా తలలోని ప్రశ్నలు ఆధ్యాత్మికమును పూర్తి ప్రశ్నించి వేరు ప్రశ్న మిగులకుండ చేసినవని అనుకుంటాము. ఈ గ్రంథము చదివి బ్రహ్మవిద్యలో ప్రశ్నలిలా ఉంటాయని జవాబులు కూడ ఈ విధముగా ఉండునని తెలియవలెనని కోరుచున్నాము.

ఇట్లు

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (72) దశ సప్తాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**







रेल राज्य मंत्री
भारत सरकार
नई दिल्ली-110 001
Minister of State for Railways
Government of India
New Delhi-110 001

# బండారు దత్తాత్రేయ

(భారత రైల్వే సహాయ మంత్రి)

## పరిచయము

ఆధ్యాత్మికత కరువైపోతున్న ఈ రోజులలో ఈ గ్రంథము వెలువడడము చాలా సంతోషింపతగిన విషయము. ఈ గ్రంథములో 1058 ప్రశ్నలుండడము చూస్తే బ్రహ్మావిద్యలో ఇన్ని ప్రశ్నలుండునా! అని ఆశ్చర్యమేస్తుంది. ప్రపంచ విద్యలలో ఏ సబ్జెక్ట్‌లో లేని ఇన్ని ప్రశ్నలను చూస్తే అన్ని విద్యలకంటే బ్రహ్మావిద్య పెద్దదన్న విషయము జ్ఞాపకము రాకతప్పదు.

ప్రశ్నలు అడుగకూడదు మేము చెప్పినది మాత్రము వినవలెనని చెప్పెడి గురువులున్న ఈ కాలములో, ప్రజలచేత ప్రశ్నలడిగించుకొని, వారికి బ్రహ్మావిద్యలో ఏమి అవగాహన కాలేదో తెలుసుకొని, వారి ప్రశ్నలకు జవాబులిచ్చి ప్రజలందరికి కూడ బ్రహ్మావిద్యలో ఆసక్తి కల్గించడము గొప్ప విశేషమేనని చెప్పవచ్చును.

గురువులు శిష్యులు అను సాంప్రదాయము హిందూమతములో ఉండినప్పటికి శిష్యులకు గురువుల వద్ద కావలసింది ఉపదేశము, గురువులకు శిష్యుల వద్ద కావలసింది కానుకలు. అంతకంటే పెద్ద సంబంధము గురుశిష్యుల మధ్య ఏమి ఉండదు. ఇక్కడ **ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు** గారు గురు శిష్య సంబంధము ఉపదేశము కానుకలతో సరిపోదని తలచి, సమయము

దొరికినపుడంతా జ్ఞానము బోధించడము గురువుల కర్తవ్యమని, అలా బోధించడమేకాక శిష్యులు ఎంత వరకు అవగాహన చేసుకొన్నారని వారికి వ్రాత పరీక్షలు నిర్వహించడము, పరీక్షానంతరము ప్రశ్నలను వివరించి చెప్పి వాటిని పుస్తకరూపముగ అందించడము చూస్తే, ఈ పద్ధతిని అందరు అంతట ఆచరిస్తే భారత దేశములో దేవుని గురించిన అజ్ఞానమే ఉండదనుకొంటాను.

మనిషిలో దైవ జ్ఞానము లేకుండపోయి మత ద్వేషములు పెంచుకొని, మతసామరస్యము లేకుండ పోయిన ఈ కాలములో, ఆధ్యాత్మికత అంటే ఏమిటో తెలియని ప్రస్తుత పరిస్థితిలో, ఇటువంటి గ్రంథము వెలువడడము చాలా సంతోషదాయకమైన విషయము.

నిత్యము ఎన్నో సామాజిక విషయములలో మునిగి తేలుచున్న మమ్ములను **"ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు"** అను ఈ గ్రంథమునకు పరిచయము వ్రాయమని అడిగి మా దృష్టిని కూడ కొంతసేపు జ్ఞానవిషయము లలో లగ్నమగునట్లు చేసి, ఈ గ్రంథమునకు పరిచయ వాక్యములు వ్రాయుటకు అవకాశమిచ్చినందుకు ఆచార్య ప్రబోధానందుల వారికి మా కృతజ్ఞతలు తెలియజేస్తూ...

ఇట్లు

(బండారు దత్తాత్రేయ)

భారత రైల్వే సహాయ మంత్రి



# ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు

## మొదటి - భాగము

ఈ మొదటి భాగములోని 388 ప్రశ్నలు ఎంతోమంది పాఠకులు అడిగినవి. ఒక్కొక్కరు ఒక ప్రశ్న మొదలుకొని పది ప్రశ్నల వరకు అడిగారు. ఎవరు ఏ ప్రశ్నలు అడిగినది తెలియుటకు ఆ ప్రశ్నల పై భాగమున వారి పేరు, ఊరిపేరు కూడ ఇవ్వడము జరిగినది. ఎందరో ఎన్నో సంశయములతో అనేక రకములుగ అడిగిన ప్రశ్నలన్ని మొదటి భాగములోనే సమకూర్చాము. రెండవ భాగములోనున్న 670 ప్రశ్నలు మా బుద్రనుండి వచ్చినవి. అవి అర్థము కావాలంటే ముందు మొదటి భాగములోని ప్రశ్నలు అర్థము కావలసి ఉన్నది. మొదటి భాగములో జవాబులు అర్థమైతే మా భావము కొంత వంటబట్టును. తర్వాత కొంత క్లిష్టమైన మాప్రశ్నలు సులభముగ అర్థము కాగలవు. మొదట మీ నుండి వచ్చిన ప్రశ్నలు మీకర్థమైతే తర్వాత మా నుండి వచ్చిన ప్రశ్నలు అర్థము కాగలవు. అందువలన ప్రథమముగ మొదటి భాగము చదివి, తర్వాత రెండవ భాగములోనికి ప్రవేశించుదురని కోరుచున్నాము.

### ఆదిలక్ష్మి, మేలాలత్తూరు, రాయవేలూరు (జిల్లా)

**1. దేవుడున్నాడనుచున్నారు ఉంటే ఎందుకు కనిపించడు?**

జ. హారములో దారము ఉన్నది, కానీ కనిపించదు. అట్లే దేవుడున్నాడు కానీ కనిపించడు. కనిపించునదంతయు ప్రపంచమే. కనిపించనిదే దేవుడు, దేవుడు ఒక వస్తువు కాదు, ఒక పదార్థము కాదు, ఒక ఆకారము కాదు, ఒక పేరు కాదు, ఒక స్థానము కాదు, స్త్రీ కాదు, పురుషుడు కాదు, పోల్చి చెప్పుటకు ఈ ప్రపంచములో ఏ దానికీ సాటియైనవాడు కాదు. రంగు, రుచి, వాసన, ఆకారము లేనివాడు, ఇంద్రియములైన కంటికి కనిపించు దృశ్యము కాదు, చెవికి వినుపించు శబ్దము కాదు, ముక్కుకు తెలియు వాసన కాదు, నాలుకకు తెలియు రుచి కాదు, చర్మమునకు తెలియు స్పర్శ కాదు, ఇంద్రియాగోచరుడు. అందువలన ఇంద్రియముల సంబంధమున్న వారికి ఎవరికి తెలియడు. ఇంద్రియ

విషయములకు అతీతునిగ ఉన్నపుడే ఇంద్రియాతీతుడైన దేవుడు తెలియును. అందువలన ఇంద్రియ విషయములందే ఎల్లవేళల సంబంధపడి ఉన్న వారికి తెలియదు. పూలహారమునకు ఆధారమై ఉన్న దారమును హారమందే వెదకిన కనిపించినట్లు ఎల్ల శరీరములకు ఆధారమైన దేవున్ని శరీరములందే వెదకి తెలుసుకొనదగును.

**సి. నారాయణ రెడ్డి, తాడిపత్రి**

**2. చాలామంది పాపమును మాత్రము కర్మ అనుచున్నారు. పుణ్యమును ఏమనవలయును?**

జ. చాలా మంది పాపమును ఉద్దేశించే కర్మ అనుచుండుట వాస్తవమే. కర్మంటే ఒక్క పాపమే కాదు, పాపము మరియు పుణ్యము యొక్క మిశ్రితమును కర్మ అనవలయును. పుణ్యము సుకర్మ, పాపము దుష్కర్మ. సుకర్మయిన, దుష్కర్మయిన కర్మ ఒక్కటియే అగును.

**పి. ధనలక్ష్మి, కర్నూల్**

**3. గురువుకు గుణములున్నట్లు తెలిపారు. గుణములున్నపుడు గురువెట్లగును?**

జ. శరీరము కదలుచు ఒక పని చేయుచున్నదంటే లోపల ఆ పనికి కారణమైన గుణము పని చేయుచుండును. ఆ గుణము కర్మ వలన ప్రేరేపింపబడి ఉండును. ప్రతి కార్యమునకు మూల కారణము కర్మ. కర్మ గుణములచే శరీరమును శాశించుచున్నది. గుణములకు అనుగుణముగ శరీరము పనిచేయుచున్నది. గురువు కూడ శరీరముతో కార్యము జేయుచున్నాడు. కావున సూత్రము ప్రకారము గురువు శరీరములో కూడ గుణములు పనిచేయుచుండును. అందరివలె గుణములు కర్మ వలనే ప్రేరేపింపబడి ఉండును. కాని జరుగు కార్యములో క్రొత్తగ వచ్చు కర్మ గురువునకు అంటదు. సామాన్యునికి చేయుచున్న పనియందు గల కర్మ అంటును. గురువు గుణములచే అందరివలె పని చేసిన కర్మ అంటదు. కావున గురువును

కర్మాతీతుడు, గుణాతీతుడు అనుట జరిగినది. కర్మము వలన కల్గు గుణములు పనిచేసినా గుణముల వలన కల్గు కర్మ అంటదు. కావున గురువును గుణాతీతుడని చెప్పుట జరిగినది. గురువునందు గుణములేదని చెప్పుట సరికాదు. అన్ని గుణములచే అన్ని పనులుజేయుచు ఏ కర్మ అంటని వాడు గురువు. గురువైన వాడు కర్మ యోగియై, కర్మను అంటనివాడై ఉండును.

శరీరమందు కర్మ గుణముల విభాగము తెలియని అజ్ఞానులు పనులు చేయువాడు గురువు కాదని తలచి, గురువులు ఏ పని చేయక అందరికి దూరముగ గుహలలోనో అడవులలోనో ఉంటారని అనుకొనుచుందురు.

**పద్యము :-** గుహలలోన జొచ్చి గురువుల
నెదుకంగ క్రూర మృగ మొకండు
తారసిల్లిన ముందుగ ముక్తి మార్గమదియే చూపు
విశ్వదాభిరామ వినుర వేమ.

పై విధముగ వేమన యోగి కూడ అన్నాడు. గుహలలో అడవులలో మృగములుంటాయి కాని గురువులెందుకుంటారు? గురువు మనుష్యుల మధ్యలోనే ఉండి, అందరివలె కనిపించుచు, అందరివలె గుణములచే పని చేయుచు గుణాతీతుడై ఉంటాడు. గీతయందు కూడ పనులు మానునతడు జ్ఞానికాడు అని శ్రీకృష్ణుడు తెలిపాడు. తామరాకు నీటియందుండి తేమ అంటనట్లు గురువు గుణములందుండి గుణాతీతుడుగ ఉన్నాడు.

**సయ్యద్‌వలి, రాజమండ్రి**

**4. దేవుడొక్కడేయైనపుడు మత కలహములెందుకున్నాయి?**

జ. "దేవుడొక్కడే" అని తెలియకపోవడమే కలహములకు కారణము.

**తులసిదాసు, నర్సాపురము**

**5. గుణములు ఎన్ని ఉన్నవి?**

జ. ఆరు మంచివి, ఆరు చెడ్డవి రెండు గుంపులుగ ఉన్నవి. ఒక్కొక్క గుణము

9 భాగములుగ ఉంటు 12 X 9 = 108 గుణములుగ ఒక గుణ భాగములో ఉన్నవి. సాత్త్విక గుణభాగములో 108, అలాగే రాజస భాగములో 108, తామసములో 108 గుణములు గలవు.

**జి. వెంకటనారాయణ, మాల్యవంతము**

**6. ప్రాణము, జీవుడు వేరు వేరుగ ఉన్నారా? వేరుగ ఉంటే వాటికున్న వ్యత్యాసమేమి?**

జ. ప్రాణము వేరు, జీవుడు వేరుగ ఉన్నారు. శరీరములోని 25 భాగములలో ప్రాణము ఒక భాగము, జీవుడు ఒక భాగము. నిర్ణీతమైన పని చేయు శరీర అవయవమును నిర్ణీత భాగముగ తెలిపి ఉన్నాము. ప్రాణము నిర్ణీతమైన పని చేయుచున్నది. అట్లే జీవుడు నిర్ణీతమైన పని చేయుచున్నాడు. అందువలన ప్రాణమును జీవున్ని వేరువేరు భాగములుగ గుర్తించుచున్నాము. కొందరు శరీరములోని ప్రాణమును జీవముగ పోల్చుకొని ప్రాణమన్న జీవమన్న ఒక్కటేనను యోచనలో ఉన్నారు, అది తప్పు భావము. ప్రాణము జీవము వేరువేరని గ్రహించ వలయును. శరీరములో వేరుగ ఉన్న ప్రాణమున్నపుడే జీవముండును, జీవమున్నపుడే ప్రాణముండును. ఇపుడు ప్రాణమునకు జీవునకు ఉన్న వ్యత్యాసములు క్రింద చూడవచ్చును.

| జీవుడు | ప్రాణము |
|---|---|
| 1. జీవుడు అనగ శూన్యము. | 1. ప్రాణము అనగ గాలి. |
| 2. జీవుడు విభజింపబడక ఉన్నవాడు. | 2. ప్రాణము ఐదు భాగములుగ విభజింపబడి ఉన్నది. వాటినే పంచ ప్రాణములనుచున్నాము. |
| 3. జీవుడు తలలో గుణచక్ర మూడు భాగములలో ఏదో ఒక భాగములో ఉన్నాడు. | 3. ప్రాణము శరీరమంతటా వ్యాపించి ఉన్నది. |

| | |
|---|---|
| 4. జీవుడు ఒక్క భాగమై ఉండి శరీరము లోని కార్యములకు ఏ మాత్రము ఉప యోగపడక సుఖ దుఃఖములను అను భవించుటకే నియమింపబడి ఉన్నాడు. | 4. ప్రాణము ఐదు భాగములుగ ఉండి శరీరములో ఐదు నిర్ణీతమైన పనులు చేయుచున్నది. |
| 5. జీవమే తానుగ ఉన్నాడు. కావున ఎవడు తన్ను తాను స్థంభించుకోలేడు. | 5.శరీరములోని గాలిని సాధన ద్వారా స్థంభింప జేయవచ్చును. |
| 6. శరీరములోని జీవుడు నిద్రయందు ఏ అనుభవము లేక ఉండును. | 6. శరీరములోని ఐదు భాగముల గాలి జీవితమున్నంత వరకు అహర్నిశలు పని చేయుచునే ఉండును. |

**తెన్మఠం సత్యగోపాలాచార్యులు, నరసాపురము**

**7. జ్ఞానులగువారు పూర్వ జన్మములను చూచినారా? జ్ఞానమునకు, పూర్వ జన్మ స్మృతికి సంబంధము కలదా?**

జ. జ్ఞానులకంటే గొప్పవారు యోగులు. యోగులకు కూడ పూర్వ జన్మ విషయము తెలియదు. కావున జ్ఞానులు పూర్వ జన్మ విషయములను చూడలేరు. జ్ఞానమునకు, పూర్వ జన్మ స్మృతికి ఎలాంటి సంబంధము లేదు.

**8. పూర్వ జన్మములను తెలుసుకొనుటకు సాధన మార్గములు కలవా?**

జ. బ్రహ్మ విద్యలో జన్మలు కడతేరుటకు సాధనలున్నవి. కాని జన్మలు తెలుసుకొనుటకు ఏమాత్రము సాధనలు లేవు. ప్రపంచ విద్యలలో “హిప్నాటీజం” ద్వార తెలుసుకోవచ్చునన్నారు. దానిని కూడ మేము నమ్మడము లేదు.

**9. బ్రహ్మవేత్తలకు పునర్జన్మ కలదా?**

జ. కర్మ పూర్తిగ లేకుండ పోవునంత వరకు బ్రహ్మవేత్తలకైన జన్మ కలదు.

ఆత్మను తెలిసినంత మాత్రమున కర్మ కాల్చు శక్తి ఏర్పడుచున్నది. కర్మంతయు ఒక్క మారు భస్మము కాదు. తత్త్వవేత్తయిన (ఆత్మ దర్శనమైన) వానికి ఆ జన్మలోనే మోక్షము ప్రాప్తించునని చెప్పలేము. అదివాని కర్మ నిలువను బట్టి ఉండును. ఒక వేళ కర్మంతయు ఆ జన్మలోనే అయిపోతే ఆ జన్మలోనే ముక్తి పొందవచ్చును. లేకపోతే మరుజన్మముండును.

**10. పాపాత్ములు తిరిగి ఎప్పటికీ మానవులుగా పుట్టరా? వారికి ముక్తి లేదా?**

జ. పాపాత్ములు తిరిగి మానవులుగా పుట్టవచ్చును. పాపాత్ములు మానవులుగ పుట్టకపోతే భూమి మీద ఘోరమైన బాధలు, రోగములు అనుభవించువారు కనిపించరు. పాపాత్ములు వారుచేసుకొన్న పాపమును మానవులందు అనుభవించుట చూస్తున్నాము కదా! పాపము చేసుకొన్న వారికి పరిమితి జన్మలు లేవు. ఏ జన్మలకైనా పోవచ్చును. మానవ జన్మకైనా రావచ్చును. అది వాని కర్మే నిర్ణయించును.

పాపాత్ములకు ఎన్నటికీ ముక్తి లేదనుట అసత్యము. అనేక జన్మల తర్వాతనైన వారు పాపము లేనివారై జ్ఞానమును సంపాదించుకొని ముక్తులు కావచ్చును.

**11. మరణించిన తర్వాత ఆత్మ ఉన్నదని కొందరు, లేదని కొందరు అనుచున్నారు. ఏది నిజము?**

జ. మరణము శరీరమునకే గాని ఆత్మకు కాదు. మరణించిన తర్వాత కూడ ఆత్మ ఉన్నది. ఈ ప్రశ్న కేవలము జీవాత్మను గూర్చి అడిగినదిగ లెక్కించుకొను చున్నాము. ఆత్మ అన్ని శరీరములందు ఉన్నది. జీవాత్మ ఒక్క శరీరమునందు మాత్రమున్నది. వేరువేరు శరీరములందు వేరువేరు జీవాత్మలు గలవు. ఉద్యోగి ఉద్యోగము చేయు ఊరు అప్పుడప్పుడు మారునట్లు, జీవాత్మ నివశించు శరీరములలును అప్పుడప్పుడు మారుచుండును. ఊరు మారినంత మాత్రమున

ఉద్యోగి ఉన్నాడు కదా! అట్లే శరీరము మారినంత మాత్రము జీవాత్మ వేరొక చోటున్నాడు. కాని పూర్తిగా లేదనలేము.

**చింతా నారాయణ, నరసాపురము**

**12. మానవుని తెలివి (బుద్ధి) ప్రయత్నము చేత ఏదైనా సాధింపబడు చున్నదా? లేక వాని కర్మనుబట్టి జరుగుచున్నదా?**

జ. కార్య సాధనలో ఉపయోగపడు తెలివి కూడ కర్మను బట్టియే ఉన్నదని తెలియవలయును. కర్మననుసరించి ఒక్కొక్కనికి ఒక్కోవిధముగ తెలివి ఉండును. అందువలన ఒక్కొక్కడు ఒక్కోవిధముగా పనులు చేయుచున్నాడు. ఎవరి తెలివి వారి సొంతము కాదు. వారి వారి తెలివి వారి వారి కర్మను బట్టియే పని చేయుచుండును. ఎంత గొప్ప తెలివియైన వారి కర్మానుసారమేనని తెలియ వలయును. అందువలన ఏ పనియైన వారి కర్మానుసారమేనని చెప్పవచ్చును.

**చింతా తులసిదాసు, నరసాపురము**

**13. పరమాత్మకు సంకల్పమున్నదా?**

జ. ఉన్నది. పరమాత్మ సంకల్ప ఫలితమే ఈ ప్రపంచము. కాని మన కొచ్చినట్లు ఆయనకు సంకల్పములు అనేకములు రావు. ఒక్క సంకల్పఫలితమే ఈ యావత్ ప్రపంచము పరంపరగ సాగుచున్నది. దీనికి ప్రమాణము గీతలోని "మద్భావా మానసాజాతా" అను శ్లోకము చూడుము.

**ధనలక్ష్మి, కర్నూలు**

**14. కుటుంబమునకు ఒక యజమాని, ఊరికొక ప్రెసిడెంటు, మండలాని కొక మండలాధిపతి, జిల్లాకొక కలెక్టరు, రాష్ట్రానికొక ముఖ్యమంత్రి, దేశానికొక ప్రధాని ఉన్నట్లు మొత్తము ప్రపంచానికి ఎవరైన అధిపతి ఉన్నారా?**

జ. ఉన్నారు. మీరు చెప్పు అధికారులందరు కేవలం మనషులకే. మనుషులకే కాక యావత్ ప్రపంచములోని సర్వజీవరాసులకు అధిపతి ఉన్నాడు. అతనే

పరమాత్మ అతనికి నిజమైన పేరు లేదు, అతడు కనిపించడు. భూమి మీద కనిపించువారు చేయలేని పరిపాలనజేయువాడు. సర్వాధిపతి పరమాత్మ ఒక్కడేనని తెలియవలయును. వానినే పురుషోత్తముడని, ఖుదాయని, ఎహోవాయని, అల్లాయని, చెప్పుకొనుచున్నాము.

**బి. రవీంద్రరెడ్డి, చెన్నేకొత్తపల్లి**

**15. కుంటి, గ్రుడ్డి అనాధలను చూస్తున్నాము. వారు పోయిన జన్మలో పాపము చేసి ఉందురా?**

జ. బాధ ఏదైన అది పాప ఫలితమే. కుంటి, గ్రుడ్డివారు పాపము చేశారు. కావుననే వారికి ఆ కర్మననుసరించి అంగలోపమేర్పడి ఉన్నది. ఈ జన్మ అంగలోపమునకు కారణమైన పాపము వెనుకటి జన్మదేనని చెప్పలేము. రెండు జన్మల క్రితముదో లేక మూడు జన్మల క్రితముదో, దానికంటే ముందుదో కూడ అయివుండవచ్చును. వరుస క్రమముగా వచ్చు కర్మ గడచిన జన్మలలోనిదే కాని వెనుకటి జన్మదేనని చెప్పలేము.

**16. నైవేద్యములను ప్రసాదములుగ మనమే స్వీకరించుటయందు అంతరార్థమున్నదా?**

జ. లేదు. నైవేద్యము భావము కోసము పెట్టుచున్నాము. దేవుడేమి తినడు కదా! ఆ పదార్థము వ్యర్థము కాకుండ మనమే తీసుకొనుచున్నాము. పూజా విధానమునకే అర్థమున్నది మనము తినే దానికి అర్థము లేదు. పూజా విధానము యొక్క అర్థము తెలిసి పూజ చేస్తే పదార్థము ప్రసాదముగ మారగలదు. లేకపోతే పదార్థము నైవేద్యముగనే ఉండగలదు. ప్రసాదమునకు 798 ప్రశ్నలోను జవాబు చెప్పబడినది.

**చింతా చౌడప్ప, నరసాపురము**

**17. ఒక వ్యక్తి రోగ బాధ అనుభవిస్తు మా పెద్దలు చేసిన పాపము**

**నేను అనుభవిస్తున్నానని అంటున్నాడు. వాస్తవముగ పెద్దలు చేసిన పాపము పిల్లలకంటుతుందా?**

జ. ఏ వ్యక్తి తిన్న తిండి ఆ వ్యక్తియే అరిగించుకోవలయును. ఒక వేళ తిన్న తిండి అరగకపోతే ఆ వ్యక్తే బాధపడవలసి ఉంటుంది. కాని వానికి బదులుగ ఇంకొకడు బాధపడడు. అట్లే ఏ వ్యక్తి చేసుకొన్న కర్మ ఆ వ్యక్తి తిరిగి అనుభవింపవలసి ఉంటుంది. వానికి బదులుగ ఇంకొకడు అనుభవించుటకు వీలులేదు. పెద్దలు చేసిన కర్మ చిన్నలకంటేటట్లయితే పెద్దల జాతకమును చూచి పిల్లల భవిష్యత్తు చెప్పవలసి ఉంటుంది. కాని అట్లు జరగడము లేదు. ఎవరి జాతకము వారికే చెప్పుచున్నారు కదా!

పూర్వము వాల్మీకి నారదుని వద్ద కూడ ఇదే సంశయము తెలుపగా అందులకు నారదుడు ఎవరు చేసిన కర్మ వారు అనుభవించవలసి ఉంది. నీవు చేసుకొన్న కర్మ నీవే అనుభవించవలసి ఉండునని చెప్పగ సంశయము తీరని వాల్మీకి వారి తల్లిదండ్రులను చివరకు భార్యను కూడ అడిగెను. నారదమహర్షి చెప్పిన వాక్యమునే వారు చెప్పగ తాను చేస్తున్న కర్మను తలచి వాటినుండి తప్పించుకొనుటకు జ్ఞానమార్గమవలంభించెను.

ఒక వేళ తల్లిదండ్రులు చేసిన పాపము పిల్లలకు వస్తే ఉన్న సంతతి అంతయు సమముగా కర్మ అనుభవించవలయును, అట్లు జరగడము లేదు. నలుగురు పుత్రుల్లో ముగ్గురు బాగుంటే ఒకడు చెడిపోయి నానా బాధలు అనుభవిస్తున్నాడు. తల్లితండ్రులు తాతలు మంచివారై వారు ఏ పాపము చేయని వారైనా వారి సంతతి కొందరు చాలా బాధపడుచున్నారు. కొందరు తల్లితండ్రులు ఎంతో పాపము చేసినా వారి పిల్లల జీవితము ఏ బాధ లేక సుఖముగ సాగిపోవుచున్నది. ఇట్లు అనేక యదార్థసంఘటనల ద్వార తల్లితండ్రుల పాపము పిల్లలకు రాదని తెలుస్తున్నది.

**చిప్పల ఆదినారాయణ, నరసింహులనిపల్లె**

**18. భూత, భవిష్యత్, వర్తమాన కాలములు తెలుసుకొనుటకు జ్ఞానము పనికి వచ్చునా?**

జ. జ్ఞానము వలన భూత భవిష్యత్తు వర్తమాన కాలములు తెలియవు. జ్ఞానము వలన తెలియబడునది తనలోని ఆత్మ (దేవుడు) ఒక్కడేనని తెలియవలయును.

**19. ఆత్మ, అనాత్మ అంటే ఏమిటి?**

జ. ఆత్మ అనగా సర్వ జీవశరీరములకు కదలిక శక్తి నిచ్చునది. అనాత్మ అంటే ఆత్మ కానిది, అంతకంటే వేరైనది పరమాత్మ అని అర్థము.

**20. మానవుడు ఐదువందల సంవత్సరములు బ్రతకగలడా?**

జ. శ్వాసను బంధించి ఎన్ని సంవత్సరములైన ఉండవచ్చును.

**21. గాలిలో పరమాత్మ ఎక్కడ ఉంటాడు?**

జ. గాలిలోనే కాదు శూన్యములో కూడ పరమాత్మ అణువణువున వ్యాపించి ఉన్నాడు. కంటికి కనిపించడు కావున చూడలేము.

**కె. గంగప్ప, కిరికెర**

**22. భగవంతుడు సాకారుడా? నిరాకారుడా? వివరముగ తెలుపవలయునని కోరుచున్నాము.**

జ. భగవంతుడు సాకారుడే, నిరాకారుడు కాడు. నిరాకారుడు పరమాత్మ. నిరాకారమైన పరమాత్మ ఒక శరీరమును ధరించి పుట్టినప్పుడు భగవంతుడు అవుతాడు. భగము అనగ జన్మ స్థానము (స్త్రీ గర్భ స్థానము). భగవంతుడనగ స్త్రీ గర్భము నుండి పుట్టినవాడని అర్థము. శరీరము ధరించిన వానినే భగవంతుడనడము జరుగుతుంది. శరీర ఆకారము లేని నిరాకారుని పరమాత్మ అనడము జరుగుతుంది. శ్రీకృష్ణుడు సాకారుడు కావున భగవంతుడని అనుచున్నాము.

**బి. రవీంద్ర రెడ్డి, చెన్నేకొత్తపల్లి**

**23. యోగములు ఎన్ని? అవి ఏవి?**

జ. యోగములు రెండు విధములు. అవి 1. రాజయోగము (కర్మయోగము), 2. బ్రహ్మయోగము (జ్ఞానయోగము) అని అందురు. అహము మీద ఆధారపడినది రాజ యోగము. మనస్సు మీద ఆధారపడినది బ్రహ్మయోగము. ఈ రెండు మార్గములు తప్ప కర్మనాశనమగు విధానము ఏది లేదు. దేవుని ధర్మములకు సంబంధించినవి ఈ రెండు యోగములే. ధర్మములకు అతీతమైనది కూడ ఒక యోగము కలదు. అది భక్తియోగమని చెప్పబడినది.

రాజయోగము విధానము వలన ఆగామి కర్మ (జరుగుచున్న పనిలో వచ్చుకర్మ) నాశనమగును. బ్రహ్మయోగ విధానము వలన సంచిత కర్మ నాశనమగును.

**సి. చిదంబర రెడ్డి, అనంతపురము**

**24. మన వెంట వచ్చేది జ్ఞాన ధనమని, ఖర్చు కానిదని అంటారు అట్లే అజ్ఞానము జన్మ జన్మలకు ఎందుకు అంటి పెట్టుకొని ఉండదో తెల్పుము?**

జ. అజ్ఞానము ఎందుకు అంటిపెట్టుకొని ఉండదు? తప్పనిసరిగ అంటి పెట్టుకొని ఉండును. జన్మ సంస్కారమును బట్టి జ్ఞానమున్నట్లే అజ్ఞానము కూడ ఉండును. ఏ గుణములో చనిపోయిన జీవుడు తిరిగి ఆ గుణములోనే జన్మించునని గీతలో దేవుడు కూడ చెప్పాడు.

**25. మీ వద్దకు విచ్చేసిన ఆశ్రితుల మనోగతముల గూర్చి స్వాముల వారి విధానము ఎట్టిది?**

జ. వారి వారి మనో భావములను బట్టి మా విధానముండును. మూఢులకు మూఢునిగ, జ్ఞానులకు జ్ఞానిగ, అజ్ఞానులకు అజ్ఞానిగ కనిపిస్తుంటాము. ప్రత్యేకించి స్వామి మాదిరి కనిపించము.

**26. ఒకరి కర్మలు మరొకరు పంచుకుంటారంటారు. అది ఎంత వరకు నిజము?**

జ. అలా పంచుకొనుట దుస్సాధ్యము. ఎవరి కర్మ వారనుభవించవలసిందే కాని వాని బదులు ఇంకొకడు అనుభవించడు.

**27. దైవశక్తి అనగానేమి? మానవుడు ఆ శక్తిని ఎపుడు పొందుతాడో వివరించి తెల్పుము?**

జ. పాప పుణ్య కర్మను భస్మీపటలము చేయు అగ్నియే దైవశక్తి దానిని మానవుడు యోగమాచరించినపుడే పొందును.

**28. దైవజ్ఞానమును పొందుట ఎట్లు? అట్లు పొందిన వానికి ప్రయోజన మేమిటి?**

జ. దైవజ్ఞానము మీద శ్రద్ధ ఉన్నపుడు అంచలంచెలుగ జ్ఞానమును పొందవచ్చును. జ్ఞానమును పొందుట వలన మానవుడు తన్ను తాను తెలుసుకోగల్గును. యోగమాచరించి కర్మను కాల్చుకోగల్గును.

**29. నిజమైన మనశ్శాంతి మానవునికెప్పుడు కల్గును?**

జ. తనలో ఏమాత్రము ప్రపంచ విషయము జ్ఞప్తికి రానపుడు.

**30. "పెంజీకటికవ్వల నెవ్వండే కాకృతి వెలయునతనినే సేవింతున్" వీటిని నిర్వచించి వెలయునతడు ఎవరో అతనిని గూర్చి తెల్పుము?**

జ. ఏ గుణ జ్ఞప్తిలేని నిర్వికారమైన స్థితిని పెంచీకటని పోతనగారు వర్ణించారు. అట్టి స్థితి లభించిన తర్వాతనే అసలైన దైవము (ఆత్మ) తెలియును. అందువలన "పెంజీకటి కవ్వల" అని వర్ణించారు. ఆత్మ అందరియందు ఒక్కటిగా ఉన్నది. కావున "ఏకాకృతి వెలయు" అన్నారు. అందరియందు సర్వవ్యాపిగ ఉన్న దైవమునే నేను ఆరాధింతునని పోతన అన్నాడు.

**31. ముక్తికాంతను గూర్చి వివరింపుము?**

జ. ముక్తి కాంతను గూర్చి నేను కాదు కదా ఎవరూ చెప్పలేరు. దానిని ఎటూ చెప్పలేని స్థితిలో కాంత అన్నారు. కాని నిజముగ అది కాంత కూడా కాదు, సత్యము చెప్పవలయునంటే అది ఏదీ కానిది.

**32. "ముగ్గురు మూర్తులు జూట! మూలము నెరుగుట బాట!" అన్నారు. ముగ్గురు ఎవరు? మూలము ఏమిటి?**

జ. తామస, రాజస, సాత్త్విక గుణములను ముగ్గురు మూర్తులుగ వర్ణించారు. మూడు గుణముల కావలయున్న ఆత్మను మూలముగ చెప్పారు. మూడు గుణములను వదలి ఆత్మను చేరమనడమే పై మాట అర్థము.

**33. "ఓం" కార స్వరూపమేనా దైవము? లేక ఓంకారమున కావల ఉన్నదా దైవము తెల్పుము?**

జ. ఓం కారమునకు ఆధారమైనది దైవము. ఓం కారమును పల్కించు శక్తి దైవము. మన శరీరమున శ్వాసలో ఓంకార శబ్దము మ్రోగుచున్నది. ఆ శ్వాసకు చైతన్య శక్తియైన ఆత్మయే దైవము.

**34. మానవుడు దైవముగా పూజింపబడవలెను. అది ఎట్లు సాధ్యమో తెల్పుము?**

జ. మానవుడు దైవముగ మారినపుడు సాధ్యమగును. దైవముగ మారవలె నంటే సంపూర్ణముగ జ్ఞానము తెలిసి యోగివై ఆత్మ శక్తిని సంపాదించవలసి ఉంటుంది.

**టి. రంగనాథము, దంపెట్ల**

**35. జ్ఞానము తెలిసి పద్ధతి ప్రకారము ధ్యానము చేసిన కర్మ తొలగునన్నారు. కావున దయచేసి ధ్యానము చేయు పద్ధతి తెలియగోరు చున్నాము?**

జ. **"శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్"** అని గీతయందు కూడ కలదు. అభ్యాసము చేయుటకంటే ముందు జ్ఞానము తెలుసుకొమ్మన్నారు పెద్దలు. దారి తెలియక మునుపు ప్రయాణము సాగదు కదా! అట్లే జ్ఞానము తెలియక మునుపు ధ్యానము కూడ సాగదు, కుదరదు. అందువలన మొదట జ్ఞానము తెలుసుకొంటే ధ్యానము చేయు పద్ధతి ఎలాగ ఉండునో తెలియును.

ఒక విధముగ చెప్పవలయునంటే నీలో ఉండు మనస్సును నీవు పని చేయక నిలిపి వేయడమే ధ్యానము లేక యోగ సాధన అవుతుంది. అలా మనస్సును జయించవలయునంటే ముందు మనస్సు విషయము పూర్తిగ తెలిసి ఉండవలయును. ఒక శత్రువును జయించవలయునంటే ఏ విధముగ వాని విషయములన్ని సేకరించి వాడు ఎక్కడ ఉండేది, ఎంత మందితో ఉండేది, వారి వద్ద ఏ ఆయుధాలు ఉండేది, ఎప్పుడు ఆయుధాలుండవు అని తెలుసుకున్నట్లు మనస్సు గూర్చి పూర్తి తెలిసినపుడు ధ్యానము చేయుట కూడ తెలియును. అందువలన మొదట సంపూర్ణ జ్ఞానులుకండి తర్వాత సంపూర్ణ యోగులుకావచ్చును.

**బి. రవీంద్ర రెడ్డి, చెన్నేకొత్తపల్లి**

**36. దేవాలయముల ముందు మరియు దేవాలయములయందు జీవహింస చేయుచున్నారు. అలా చేయమని ఏ దేవుడైనా చెప్పినాడా?**

జ. పరమాత్మ మినహా ఎన్నియో దేవతలను మానవుడు ఆరాధిస్తున్నాడు. ఆ దేవతలలో మహాదేవతలు, క్షుద్రదేవతలని రెండు విధములుగ ఉన్నవి. మహాదేవతలుగ చెప్పబడిన వారికి బలి అను పేర జీవహింస పూజ చేయరు. క్షుద్రదేవతలను వారికి మాత్రము పూజా విధానములో జీవహింస చేయుచున్నారు. క్షుద్రదేవతలు వేరొకరి శరీరములను ఆవహించి జీవులను తమకు అర్పించమని కోరుచున్నవి. అందువలన అవి చెప్పినట్లు కొందరు క్షుద్ర దేవాలయముల వద్ద జీవహింస చేయుచున్నారు. ఏది ఏమైన జీవహింస చేసెడి వారికి పాపమే వస్తుంది. దాని వివరము తెలియని వారు మూర్ఖముగ చేయుచు పోవుచున్నారు.

**కె. శివరాము, ఎర్రగుంట్ల**

## 37. గురువు శిష్యుని వెతకవలయునా? శిష్యుడు గురువుని వెతకవలయునా? తెల్ప ప్రార్థన.

జ. గురువు శిష్యుని వెతకవలయునంటే శిష్యులను వెతికే దానికి గురువు ఆయుస్సు అయిపోతుంది. జ్ఞానము బోధించేదెపుడు? ఆకలికొన్న వారి దగ్గరకు వెదకుచు అన్నము పెట్టు వాడొస్తాడనుట ఎంత సమంజసమో అట్లే శిష్యుల వద్దకు గురువు వస్తాడను మాట కూడ అంతే సమంజసము. ఒక్కనిని అందరు వెతకవచ్చును గాని అందరిని ఒకడు వెతకవలయునంటే సాధ్యమా? శాస్త్రాను సారము శిష్యుడే గురువును అన్వేషించవలయును. అప్పుడే గురువు మీద భయము, భక్తి సేవా భావము ఏర్పడును. వెతకంగ వెతకంగ దొరికిన వస్తువును భద్రముగ దాచి పెట్టుకుంటారు కదా! అట్లే వెతికితే దొరికిన గురువును ఎన్నటికి వదలము. వెతకకనే గురువే తనవద్దకు వస్తే చులకనగ చూచుకొనే శిష్యులుంటారు. అందువలన గీతా శాస్త్రములోని **"తద్విద్ధి"** అను శ్లోకము ప్రకారము శిష్యుడే గురువు వద్దకు చేరవలయును.

## 38. మాయను జయించడము ఎట్లు?

జ. నన్ను శరణుబొందిన వారు మాత్రమే మాయను జయించగలరని " మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తితే" అని దేవుడన్నాడుగా! దేవుని యొక్క ధర్మాన్ని ఆశ్రయించడముగాని, భగవంతున్ని ఆశ్రయించడము గాని చేయవలెను.

## 39. మనస్సును బంధించడము ఎట్లు?

జ. మనస్సును గూర్చిన జ్ఞానము సంపూర్ణముగ తెలుసుకొని అభ్యాసము చేస్తే సాధ్యమగును.

## 40. ప్రళయము అయిన తర్వాత సృష్ఠి ఎందుకు వచ్చినది?

జ. బ్రహ్మాచక్రము తిరుగుచున్నది. కావున వేయి యుగములకొక మారు

ప్రళయము. వేయి యుగములకొకమారు ప్రభవము జరుగుచుండును. మనకు రాత్రింబవళ్ళు ఏర్పడినట్లు ప్రళయ, ప్రభవములు దానంతకవే జరుగుచుండును.

**41. జ్ఞానము దేనిని ఆచరించితే వస్తుంది?**

జ. ఆచరించితే వచ్చేది జ్ఞానము కాదు. జ్ఞానము గురువుల వద్ద వినయముగ ఉండి శ్రద్ధ కల్గి తెలుసుకోవడము వలనగాని, పుస్తకములు చదవడము వలనగాని వస్తుంది. శ్రద్ధయున్నంత జ్ఞానము లభిస్తుంది. జ్ఞానమును ఆచరించితే వచ్చేది యోగము.

**తెన్మఠం సత్యగోపాలాచార్యులు, నరసాపురము**

**42. సర్వరక్షకులైన శివకేశవాది ప్రధాన దేవతలుండగ తిరిగి గ్రామ దేవతలను ఎందుకు పూజించాలి? జంతుబలులు ఎందుకివ్వాలి?**

జ. సర్వ ప్రపంచానికి మూలము ఆదిశక్తియైన పరమాత్మ ఉండగ అందరు అతనినే పూజించక ఎందరో దేవతలను పూజించుట, వారి వారి గుణముల సంస్కారమని తెలియవలయును. బహుదేవతలను ఆరాధించుటకంటే ఒక్క దేవుని ఆరాధించుట మంచిదని శాస్త్రము తెలియజేయుచున్నది. బహు దేవతా పూజ జంతుబలులు మానవుని తప్పు దారి పట్టించుచున్నవి.

**43. శివ కేశవుల ఆరాధించిన భక్తులు మరణించిన తర్వాత వారికి ఏ మార్గము లభించును?**

జ. "యాన్తి దేవ వ్రతాన్ దేవాన్" అన్నట్లు శివకేశవుల నారాధించిన వారు శివకేశవుల వద్దకే చేరుదురు.

**44. పాపములు చేసిన వారిని నిర్ణయించుటకు శిక్షించుటకు అధికారము యమధర్మరాజుకు తప్ప ఇతరులకు లేదా?**

జ. నిజము చెప్పాలంటే యమధర్మరాజే లేడు. మనము చేసుకొన్న పాప

పుణ్యములు రెండు మన కపాలములోని కర్మచక్రములో చేరి ప్రతిష్ఠింపబడి తిరిగి మరుజన్మలలో కష్ట సుఖరూపములుగ ఆచరణకొస్తున్నవి. అందువలన యమ లోకములో ఉన్నవను సంఘటనలన్ని ఇక్కడే చూస్తున్నాము. కాలమే కాలుడై భూమి మీదనే బాధిస్తున్నాడని తెలియవలయును. కర్మచక్రమునకు సాక్షిగా ఉన్న ఆత్మే యమధర్మరాజు, కర్మచక్రమే చిత్రగుప్తుని గ్రంథముగ ఉన్నది.

**45. ఆత్మ అంతట నిండి ఉన్నపుడు అన్ని ప్రాణులకు ముక్తి ఉండాలి. అటువంటపుడు వృక్షములకు పశుపక్ష్యాదులకు ముక్తి ఉన్నట్లే కదా! తెల్పవలయును?**

జ. సిద్ధాంతము ప్రకారము ఏ జీవియైన ఆత్మనారాధించి ముక్తి పొందవచ్చును. అయితే ఎంతో యోచించు తెలివి ఉన్న మానవులే బ్రహ్మవిద్య నేర్వ లేక అర్థముకాక ఆచరణ లేక ముక్తి పొందలేక ఉన్నారు. తెలివి తక్కువ జన్మలైన మిగతా జీవరాసులు జ్ఞానమును తెలుసుకోలేవుకాని మానవులకంటే ముక్తి మార్గములో ముందు కలవని చెప్పవచ్చును. మానవునికంటే మిగతావి కర్మ సంపాదించడములో తక్కువ, కర్మ అనుభవించడములో ఎక్కువ. మానవులకున్నంత బంధనములు గుణముల ప్రేరణ వాటికుండదు. ఎప్పటికైన మిగత పశుపక్షి మృగాదులు వృక్షలతాదులు మోక్షము పొందవలసిందే.

**46. బ్రహ్మ ప్రళయమున ఆయనను ఆశ్రయించిన జ్ఞానవంతులు (ఉపాసకులు) జీవించి ఉందురా? వారికి ముక్తికలుగునా?**

జ. ప్రళయము సంభవించినప్పటికి కర్మ ఏ మాత్రము శేషము లేకుండ పోయివుంటే ముక్తి పొందుదురు. కర్మ కొద్దిగ శేషమున్న మరియు ప్రభవములో పుట్టవలసిందే. ఎంత ఉపాసకులైన కర్మను బట్టియే ముక్తి లేక జన్మ ఉండును. అందువలన యోగులందరు కర్మ నాశనము చేయు ఆరాధనయైన యోగమునే ఆచరించుచుందురు.

**పి. పుల్లయ్య, తేరన్నపల్లి**

**47. స్వామీ! ఏ విత్తనము వేస్తే ఆ చెట్టే మొలుస్తుంది కదా! అట్లే మానవులు చనిపోతే మానవ జన్మకు, ఆవు చనిపోతే ఆవు జన్మకు పోవుచున్నారని, ఒక జాతి మరొక జాతిలో జన్మించదని కొందరు తెల్పుచున్నారు. ఇది నిజమేనా? తెల్ప ప్రార్థన.**

జ. ఏ విత్తనము వేస్తే ఆ మొలకే వస్తుంది. విత్తనము స్థూల ఆకారము గలది, కంటికి కనిపిస్తు ఉన్నది. అట్లే ఆ విత్తనమునకు మొలచు మొలక కూడ కంటికి కనిపిస్తు ఉన్నది. అందువలన ఏ విత్తనమునకా మొలక అనుచున్నాము. మనిషి స్థూలముగ కంటికి కనిపిస్తు ఉన్నాడు, అతనికి పుట్టు శిశువు కంటికి కనిపిస్తున్నాడు. అందువలన మనిషికి మనిషి, జంతువుకు జంతువు పుట్టుచున్నదనుటలో తప్పులేదు. కాని ఇక్కడ సమస్యేమిటంటే స్థూలముగ ఉన్న శరీరముగాక సూక్ష్మముగ కనిపించని జీవాత్మ యొక్క విషయము కావలయును. అందువలన పై ఉదాహరణ సరిపోదు. మనిషి శరీరానికి మనిషి శరీరమే పుట్టినప్పటికి, పుట్టిన శిశువులోనికి వెనుక జన్మలో ఏ జాతి శరీరము ధరించి ఉండిన జీవరాసియైన ప్రవేశించి ఉండవచ్చును.

పుట్టిన మానవ శిశువులో పలానా జీవుడే ప్రవేశించాడని ఎవరు నిర్ణయించలేరు. అటువంటపుడు మానవుడు తిరిగి మానవునిగనే పుట్టుననుట సత్య దూరము. కర్మననుసరించి మానవజన్మలోని జీవాత్మ తిరిగి మానవజన్మకైనా రావచ్చు లేక ఇతర జన్మలకైన పోవచ్చును కావున కర్మానుసారము జన్మలు కాని గత శరీరమును బట్టి జన్మలు ఉండవు.

**48. సర్వ జీవులందు ఆత్మ ఒక్కటే ఉండినప్పటికి వృక్షములందు చైతన్యము లేదని కొందరనుచున్నారు. తమ అభిప్రాయము కోరుచున్నాము.**

జ. ఆత్మ చైతన్య స్వరూపము. అన్నిటియందు ఆత్మ ఉండినప్పుడు అన్నిటియందు చైతన్యముండును. ఒక స్థలము నుండి మరొక స్థలమునకు పోవు చలనము

లేనంత మాత్రమున చైతన్యమే లేదనుట సమంజసముకాదు. చైతన్యములేనిదే చెట్టు పెరగ జాలదు. చైతన్యములేనిదే భూమి నుండి నీటిని, గాలినుండి కార్బన్ డై ఆక్సైడ్‌ను గ్రహించి సూర్యరశ్మి చేత పిండి పదార్థములను ఆకులందు తయారు చేసుకోజాలదు. 'అత్తపత్రి' చెట్టును తాకినంత మాత్రముననే ఆకులన్నిటిని ముడుచుకొనుచున్నది కదా! చైతన్యములేనిదే అట్లు ముడుచుకొనలేదు. అందువలన చెట్లయందు కూడ చైతన్యము ఉన్నదని చెప్పగలము.

**యమ్. నాగభూషణము, ధర్మవరము**

**49. ధ్యాన మనగా ఏమి? యోగమనగా ఏమి? ఈ రెండింటి యొక్క భేదాన్ని వివరముగ తెలియగోరుచున్నాము.**

జ. ధ్యాస లేక మనోజ్ఞప్తి అనునది మన శరీరములో ఉన్నది. మనోజ్ఞప్తి ఏ వైపు మళ్ళితే ధ్యాస అక్కడికి పోయింది అనుట గలదు. మనకు ఎక్కువగ అహర్నిశలు విషయ ధ్యాసలే ఉండును. ఐదు జ్ఞానేంద్రియములకు సంబంధించిన ధ్యాసలను విషయ ధ్యాసలనుచున్నాము. మొదట ఆత్మ జ్ఞానమును సంపాదించు కొన్న వ్యక్తి తన ధ్యాసను ఇంద్రియ విషయముల నుండి మరల్చుకొనుటకు చేయు ప్రయత్నమే ధ్యానము. 'ధ్యాస' అను పదము నుండి పుట్టినది 'ధ్యానము'. బయట ధ్యాసను అంతర్ముఖముగ మళ్ళించడమే ధ్యానము అంటున్నాము. ఇదియే యోగసాధన అని కూడ చెప్పవచ్చును.

ధ్యానము వలన లభించునది యోగము. ఉడికే బియ్యమునకు మన చేతికి మధ్యన గరిటలాంటిది ధ్యానము. చేరవలసిన గమ్యమునకు చేరవలసిన వానికి మధ్యన గల దారిని ధ్యానము అంటున్నాము. ఉడికే బియ్యము యోగమైతే, చేయి జ్ఞానము, జ్ఞానమునకు యోగమునకు మధ్యన గరిటగ ధ్యానమున్నది. చేయి లేనిది గరిటె తనకు తాను ఉడికే బియ్యములోనికి పోదు. అందువలన ధ్యానము కంటే ముందు జ్ఞానము శ్రేష్ఠము. దాని తర్వాత ధ్యానము శ్రేష్టమని గీతయందు కూడ తెలుపబడినది. జ్ఞానము లేనిది ధ్యానము ఏమాత్రము యోగమును చేర్చలేదు.

ఇప్పటి కాలములో జ్ఞానము లేకనే చాలామంది ధ్యానము చేయుచున్నారు. అటువంటివారు నిజమైన యోగమును పొందలేరు. నీలోని ఆత్మను కలిసినపుడు ఉండే స్థితినే యోగము అంటున్నాము. యోగసమయములో యోగ శక్తి లభించు చుండును.

**బి. మోహన్ రావు, హస్తినాపురము**

**50. రూపాకారములేని పరిపూర్ణమును ఆకారముగల మానవుడు ఎలా తెలుసుకొనును?**

జ. ఆకారముగల మానవుడు యోగమాచరించుచు పూర్తిగ కర్మను నాశనము చేసుకొన్నపుడు, కర్మ ఏ మాత్రము శేషము లేకుండ పోయినపుడు, శరీరమును వదలి నిర్వికార పరిపూర్ణమందు ఐక్యమై తానే పరిపూర్ణ పరబ్రహ్మమై పోవును. అపుడే పరిపూర్ణ పరబ్రహ్మము తెలియనగును. కాని శరీరమున్నపుడు నిర్వికార పరమాత్మను ఎవడు తెలియలేడు. శరీరమున్నపుడు యోగమాచరించితే ఆత్మ తెలియును, కాని పరమాత్మ తెలియడు.

**51. యోగి త్రి అవస్థాతీతుడు. అట్టి యోగి అవస్థల చెందడము ఎలా?**

జ. అఖండమైన యోగమును యోగి ఆచరించలేడు కనుక యోగ అవస్థయైన తురీయము నుండి త్రి అవస్థలు పొందుచున్నాడు. ఎంత యోగి అయిన త్రి అవస్థలను అనుభవించుట సహజము. ఒకే అవస్థయందు ఉండుట అరుదు.

**52. జ్ఞాని మరణమునకు అజ్ఞాని మరణమునకు తేడా ఏమిటి?**

జ. జ్ఞాని అజ్ఞాని మరణములకు ఏమి తేడా ఉండదు. కర్మ శేషము లేని యోగికి కర్మ శేషమున్న యోగికి మరణములో తేడా ఉండును. కర్మ శేషములేని యోగి సూర్య ప్రకాశము బాగ ఉన్న పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము కల్గిన సమయములోనే మరణించును. కర్మశేషమున్న యోగి ఆ సమయము తప్పి మరణించును.

**యమ్. వెంకటరామయ్య, బెంగుళూరు**

**53.** ఒకటి గొని రెంటి నిశ్చల యుక్తి జేర్చి
మూటి నాల్గింటకడు వశ్యములుగ జేసి
యైదిటిని గెల్చి యారింటననిచి
యేడు విడచి వర్తించువాడు వివేక ధనుడు.

**ఈ పద్యమునకు వివరము తెల్పగోరుచున్నాము.**

జ. మన శరీరములో అంతరేంద్రియములకు బాహ్యేంద్రియములకు మధ్యన ఉన్నది మనస్సు. మనస్సు ఒక్కటి పని చేసిన మన శరీరములోని స్థూల సూక్ష్మ అవయవములన్ని పని చేయును. అది ఒక్కటి నిలిచిపోయిన అన్ని నిలిచిపోవును. అందువలన అన్నిటికంటే ముఖ్యమైనది మనో నిలకడయని పెద్దలందరన్నారు. ఈ పద్యమందు ఆ విషయమే తెలియజేసారు.

| | | |
|---|---|---|
| ఒకటిగొని | = | మనస్సు ఒక దానిని బంధించిన, |
| రెంటి నిశ్చలయుక్తి జేర్చి | = | ఆత్మ జీవాత్మలను ఒకటిగజేసి, |
| మూటి | = | మూడు గుణములు, |
| నాల్గింటి | = | మూడు గుణ భాగములకావలయున్న నాల్గవ స్థానమైన ఆత్మ స్థానమందు, |
| కడు వశ్యముగ జేసి | = | అణిచి వేసి, |
| ఐదిటిని గెల్చి | = | ఐదు జ్ఞానేంద్రియముల స్తంబింపజేసి, |
| ఆరింటినణచి | = | గుణ భాగములలోని ఆరు గుణములననచి వేసి, |
| ఏడు విడచి | = | సప్తనాడీ కేంద్రముల పని వదలి, |
| వర్తించు వాడు | = | యోగము పొందిన వాడు, |
| వివేకధనుడు | = | జ్ఞాన ధనము కల్గిన వాడు. |

**భావము :** ఒక మనస్సును నిలుపుట వలన శరీర అంతర్గతమున ఉన్నవన్నియు నిలిచిపోవును ఆ విషయమునే ఈ పద్యములో వివరించడము జరిగినది. మనస్సు

నిలిచి పోయినపుడు జీవాత్మ ఆత్మయందు చేరి ఉండును. మూడు గుణములు నాల్గవ స్థానమైన ఆత్మయందు లయమై ఉండును. బాహ్యేంద్రియము లైన ఐదు జ్ఞానేంద్రియములు పని చేయని స్థితిలో ఉండును. గుణభాగములలోని ఆరు గుణములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అణగి పోయి ఉండును. శరీరములోని సప్త నాడీ కేంద్రముల పనియే మాత్రము లేకుండ ఉండును. ఏడు స్థానముల పని కూడ లేదు కావున దానిని యోగసిద్ధి అంటారు. ఈ స్థితిని పొందినవాడు కొంత కాలమునకు శరీరమును కూడ వదలి పరమాత్మ యందైక్యమగును.

**54.** కన్నెవరుడు చేరి కలియంగ నొక్కప్పు
ఉచ్చ యందు పిండ ముద్భవించు
హెచ్చుకులజుడెవడు? హీనుడెవండురా?
విశ్వదాభిరామ వినుర వేమ.

**దయచేసి ఈ పద్యమునకు కూడ భావము తెల్ప ప్రార్థన.**

జ. పరమాత్మ పురుషుడు, ప్రకృతి స్త్రీయని గీత యందు చెప్పబడినది. సర్వ జీవరాసులకు తల్లి ప్రకృతి తండ్రి పరమాత్మ. ప్రకృతి పరమాత్మ కలయిక చేతనే చైతన్యమైన జీవ శరీరములు భూమి మీద ఉద్భవించినవి. ప్రకృతి చేత శరీరము, పరమాత్మ చేత చైతన్యము కల్గుచున్నవి. పుట్టిన ప్రతిజీవి కర్మ బంధములో చిక్కి జీవితమును సాగించుచున్నది. ఈ విధముగ జన్మతః అన్ని జీవరాసులు సమానమే. కాని హెచ్చుతగ్గు అను రెండు కులములు ఆది నుంచి ఉన్నవి. అవి ఏవో నీకు తెలియునా అని వేమన ప్రశ్నించుచున్నాడు. నీకు తెలియునా? తెలియక పోతే కొద్దిగ తెలియవలయునంటే పరమాత్మ వైపు పయణించువాడు హెచ్చుకులజుడు. ప్రకృతివైపు పయణించువాడు హీనకులమువాడు. పై పద్యమందు కన్య అనగ ప్రకృతి, వరుడనగ పరమాత్మ అని తెలియవలయును. పిండమనగ శరీరము, ఉచ్చయందనగ కర్మయందని తెలియవలయును.

**చితంబరరెడ్డి, అనంతపురము**

**55. అచల యోగమనగా ఏమి? దాని ద్వారా మోక్షమెలా పొందవలెను?**

జ. అచల మనునది యోగము కాదు. అచల మనగ పరమ పదము లేక మోక్షమని చెప్పవచ్చును. వాస్తవముగ అచలమనునది ఏది కాని పరమాత్మ అని అర్థము. సర్వ యోగులకు అదియే గమ్యము, దానిని అచేలమని చెప్పవలెను. అచేలమనునది మార్గము కాదు గమ్యమని తెలియవలయును. అచేలమను పదము అచలము అను పదముగ మారినది.

**56. సాంఖ్య, తారక, అమనస్కములనగా ఏమి?**

జ. 'సాంఖ్య' మనగ శరీర యంత్రాంగ మంతయు తెలిసి యోగమాచరించుట, 'తారకమనగా' మన శరీరములోని శ్వాస ఆధారముతో యోగము ఆచరించుట, 'అమనస్కమనగ' మనో సంకల్పములను అణిచి వేసి మనస్సును ఆత్మ వైపు మరల్చడము. వీటినే సాంఖ్య, తారక, అమనస్క యోగములంటాము. వీటి ద్వార సిద్ధించునదే అచలము. పూర్వము అచలమును అచేలమనెడివారు.

**57. ఆదిశక్తి, పరాశక్తి, మహాశక్తిని గురించి వివరింపుము?**

జ. ఆది శక్తి అనిన, పరాశక్తి అనిన, మహాశక్తి అనిన, పరమాత్మ శక్తియేనని ఇవి మూడు ఒకటేనని తెలియవలయును.

**58. పురాణములననుసరించి గాని, శాస్త్రములననుసరించి గాని కొందరు నిత్య జీవితమును గడుపలేరు వారి ఎడల మీ ఉద్దేశము ఏమిటి?**

జ. మొదట భక్తి తర్వాత జ్ఞానము మానవునికి తప్పనిసరిగ ఉండవలయును. భక్తిని బోధించు పురాణములను గాని, జ్ఞానమును బోధించు శాస్త్రములను గాని ఆచరించనివాడు నిష్ప్రయోజకుడు. ఏదో ఒక దానిని ఆచరించవలెను.

**తెన్మఠం సత్యగోపాలాచార్యులు, నరసాపురము**

**59. ముక్తిని పొందుటకు యోగసాధనములు ఏవి?**

జ. 1. కర్మయోగము, 2. జ్ఞానయోగము వీటినే రాజయోగము, బ్రహ్మ యోగములని కూడ అందురు. ఈ రెండు యోగములే కాకుండ మరి ఒక భక్తియోగ మార్గము కూడ కలదు.

**60. విగ్రహారాధన పద్ధతి ఎందుకు ప్రవేశపెట్టారు?**

జ. నిరాకారమైన ఆత్మను తెలియుటకు విగ్రహారాధన ప్రవేశ పెట్టారు. పద్దతులు తెలిసి విగ్రహారాధన చేస్తే జ్ఞానమగును. తెలియక చేస్తే మూఢనమ్మక మగును. మా రచనలలోని **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథము చదివిన విగ్రహారాధన యొక్క అంతరార్థము తెలియగలదు.

**61. సాకారముతోనే భక్తి కలుగునని నాభావన, లేదు నిరాకారముతోనే భక్తి కలుగగలదని మరియొకరి వాదన మీరే మంటారు?**

జ. నిరాకారము అన్నపుడు ఆకారములేనివాడని అర్థము, ఆకారము లేనివానిని ఆకారముతో చూడడమును సాకారము అంటాము. నిరాకారునికి సాకార రూపమును ప్రతిమల రూపములో కల్పించి కొందరు చూపారు. ఇంకొక విధముగ నిరాకారుడైన పరమాత్మ అవతారమెత్తి మనిషిగ పుట్టినపుడు ఆ ఆకారమును కూడ సాకారము అన్నారు. దీనినిబట్టి సాకారమనగా రెండు విధములని తెలిసిపోయినది. భక్తి అనునది నమ్మికను బట్టి ఉంటుంది. కొందరికి సాకారమైన కదలని ప్రతిమల మీద భక్తి ఉంటుంది. వారికి సాకార భగవంతుని మీద గాని, నిరాకారము మీద గాని భక్తి ఉండదు. మరికొందరికి సాకార భగవంతుని మీద భక్తి ఉంటూ సాకారమే నిరాకారమని నిరాకారమే సాకారమని తెలిసి యుందురు. అటువంటి వారికి సాకార ప్రతిమల మీద భక్తి ఉండదు. ప్రతిమల మీద భక్తి ఉన్న వారికి నిరాకారము మీద గాని, భగవంతుడైన సాకారము మీద గాని భక్తి ఉండదు. అలాగే నిరాకారము మీద భక్తి ఉన్నవారికి ప్రతిమల మీద ఉండదు. మొత్తానికి రెండు పద్ధతులలోను భక్తి కలుగునని తెలియుచున్నది.

**62. భక్తియందు రకములున్నవా?**

జ. భక్తియందు ఎన్నో రకములున్నవి. జ్ఞానము మాత్రము కొన్ని రకములే ఉన్నది. యోగము రెండు రకములే ఉన్నది. మూడవ యోగము ప్రత్యేకముగ ఉన్నది.

**63. మనో నిశ్చలత సాధన సమయములో భౌతిక విషయములు ఉద్భవించి తికమక పరచుచుండును. తరుణోపాయ మేమిటి?**

జ. ఈ విషయమే అర్జునుడు పరమాత్మనడిగాడు. భగవంతుడు పట్టుదల, అభ్యాసము అవసరమన్నాడు.

**64. త్రిమతాచార్యుల వారి ద్వైత అద్వైత విశిష్ఠ ద్వైతములు మతములుగ ఎట్లు రూపొందెను?**

జ. త్రిమతాచార్యుల వారి సిద్ధాంతములు త్రివిధములైనప్పటికి వారి మతములు వేరుకాదు. వారి ముప్పరి మతము హిందూమతమే.

**పరిమినాగరాజు, ఎ. కొండాపురము**

**65. విగ్రహారాధనపై మీరిచ్చే సందేశమేమిటి?**

జ. మా సందేశము ఒక గ్రంథరూపమై ఉన్నది. అంతటి పెద్ద సందేశమును ఇక్కడ వివరించుట కష్టము కనుక మీరు మా రచనలలోని **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథము చదవండి.

**66. దేవుడున్నాడనుటకు నిదర్శన మేమిటి?**

జ. దేవుడున్నాడనుటకు ప్రబల నిదర్శనము నీవే. ఆ దేవుడు ఉన్నపుడే నీవు ఉంటావు. కనుక దేవునికి నిదర్శనము నీవే. ఆ దేవుని నిజముగ తెలియవలయునంటే నిన్ను నీవు పరిశోధించుకో నిదర్శనమే కాక నిజముగనే తెలియబడును.

**67. అష్టాదశ పురాణములను అసత్యమన్నారు. భగవద్గీతా శాస్త్రాన్ని కూడ అసత్యము, కవుల కల్పన అని ఎందుకు అనకూడదు?**

జ. పురాణములు నిరూపనకు రావు కనుక అసత్యమన్నాము. గీతా శాస్త్రము నిరూపణకు అనుభవమునకు వస్తుంది కావున కల్పన, అసత్యమని అనలేక పోయాము. చంద్రునిలోని మచ్చలలాగ గీతయందు కూడ కల్పన కవిత్వము కన్పించుచున్నది. దానిని తీసివేసి సశాస్త్రీయముగ బహిర్గతము చేయబడినదియే మేము రచించిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** గీతశాస్త్రమని సత్యమని తెలియ వలయును.

**ఆదిమూలమ్ రెడ్డి, పెద్దమిట్టూరు, తమిళనాడు**

**68. ద్వైతము, అద్వైతము అంటే ఏమిటి?**

జ. జీవాత్మ ఆత్మ వేరు వేరుగ ఉండడము ద్వైతము. జీవాత్మ ఆత్మను చేరి ఒక్కటై పోవడము అద్వైతమని తెలియవలయును. ద్వైతమంటే రెండని, అద్వైతమంటే రెండు గాని ఒకటని అర్థము.

**69. మూడవస్థలంటారు అవి ఏవో తెలుపవలయును?**

జ. 1. జాగ్రత్త, 2. నిద్ర, 3. స్వప్నము. ఇవియే మూడవస్థలు. వీటిని ప్రతి దినము మనము అనుభవించుచున్నాము.

**యమ్. నాగభూషణము, విజయనగర్, బెంగుళూర్**

**70. గురువర్యా! జ్ఞానార్జనకై గురువుల నాశ్రయించి శిష్యుడు ప్రణవ మంత్రమైన "ఓం" ను కాని పంచాక్షరి అయిన "ఓం నమః శివాయ" కాని, అష్టాక్షరి అయిన 'ఓం నమో నారాయణ' అని మొదలగు మంత్రములను పఠించవలెనా? లేక సర్వకాల సర్వావస్తలయందు గురు నామమును ఉచ్చరించవలెనా? ఏది శ్రేష్టము?**

జ. నిజముగ ఏది శ్రేష్టము కాదు. గురువు తెల్పిన యోగమును అహర్నిశలు ఆచరించవలయును. మంత్రములను జపించకూడదు. నిజమైన జ్ఞాని మంత్రములకు చాలా దూరముగ ఉండును. నిజ గురువులు కూడ మంత్రములను ఉచ్చరింపమని చెప్పరు. గురువులు దేవునియందైక్యమగు యోగమునే బోధించుదురు. దానినే ఆచరించమని చెప్పుదురు. మంత్రము చెప్పువాడు మధ్యముడు, ఊరకుండు మనువాడు ఉత్తముడని వేమన యోగి కూడ చెప్పాడు.

**71. "పైకి వ్రేళ్లు క్రిందికి కొమ్మలు వ్యాపించిన పురాతనమైన అశ్వర్థ వృక్షమిది. ఇదే శుద్ధము, ఇదే బ్రహ్మ, అమృతము ఏదియు దీనిని అతిక్రమింప లేదు. ఇదియే ఆత్మ" అని ఎవరో జ్ఞానసంపన్నులు వ్రాసారు. అర్థము కాలేదు తమరు వివరింతురని కోరుచున్నాము.**

జ. శ్లో॥ ఊర్ధ్వ మూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్ ।
చన్దాంసి యస్య పర్ణాని యస్తం వేద సవేద విత్ ॥

పైకి వ్రేళ్లు క్రిందికి కొమ్మలుగ వేదములే ఆకులుగ వెలసి ఉన్న అశ్వర్థ వృక్షమును తెలిసినవాడు వేదములు తెలిసినవాడే అని భగవంతుడన్నాడు. అశ్వర్థ వృక్షమనగ మన శరీరములోని గుణప్రభావములు గల నాడీమండలము. ఇది ఆత్మ కాదు. పరమాత్మ కాదు, కేవలము గుణ కర్మ మిళిత ప్రభావ శరీరాంతర్గత భాగము. దీనిని తెలిసిన జన్మలకు కారణమైన మొత్తము గుణములు, కర్మ తెలియును. అందువలననే **"సవేదవిత్"** అన్నాడు. **"త్రై గుణ్య విషయా వేదా"** అని గీతలో చెప్పబడినట్లు మూడు గుణ విషయములే వేదములు, ఆ మూడు గుణముల చేత వృద్ధి అగు అశ్వర్థ వృక్షమును తెలిసినవాడు వేదములు తెలిసినవాడే.

ఇక్కడ అశ్వర్థ వృక్షము గుణములకు సంబందించినదేనని పూర్తిగ తెలిసిపోతూ ఉన్నది. కావున అది శుద్ధ బ్రహ్మ కాదు. పరబ్రహ్మకాదు. పరమాత్మను తెలియగోరు వాడు గుణ రాహిత్యముచే ఈ అశ్వర్థ వృక్షమును నరికివేయ వలయునని గీతయందు శ్లో. **"అశ్వర్థ మేనం సువిరూఢమూల మసంగ శస్త్రేన**

**దృఢేన చిత్వా"** అని దేవుడన్నాడు. అటువంటపుడు అశ్వర్థ వృక్షము ఎలా దేవుడగును. అశ్వర్థ వృక్షము కేవలము గుణ కర్మలతో కూడుకొన్న శరీర యంత్రాంగ మండలమని తెలియవలెను. అది ప్రతి ఒక్కరియందు ఉన్నది. దానిని నాశనము చేసినవాడే మోక్షము పొందును.

**యమ్. పురుశోత్తమనాయుడు, కూచివారిపల్లి**

**72. భగవంతుడు మనిషిలో ఉంటాడా?**

జ. భగవంతుడు మనిషిలో ఉండడు. ఆత్మ, పరమాత్మ మనిషిలో ఉంటారు. పరమాత్మ అంశ ప్రత్యేకముగ పుట్టినపుడు భగవంతుడు మనిషిగ ఉంటాడు. అంతే కాని సాధారణ మనిషి భగవంతుడు కాడు.

**73. భగవంతుని పూజించిన వానికి కష్టాలెక్కువంటారు నిజమా?**

జ. శుద్ధ అబద్ధము. వచ్చేకష్టాలు భగవంతుని పూజించిన పూజించకుండిన వస్తాయి. కష్టాలు సుఖాలు కర్మను బట్టి ఉంటాయి. పూజలు భక్తిని బట్టి ఉండవు.

**74. మానవుడు మట్టికుండతో సమానమంటారు ఎందుకు?**

జ. పగిలిపోతే పనికిరాని కుండవలె చనిపోతే ఎందుకు పనికిరాని శరీరమున్నది కనుక అలా అంటారు.

**75. స్వామి మీరు ఎంతవరకు చదువుకొన్నారు?**

జ. మీరు ఏ చదువు అడిగారో! ప్రపంచ చదువైతే 11 తరగతులు, పరమాత్మ చదువైతే మూడు పూర్తి చదివి నాలుగులో ఉన్నాను. ఐదుకు పోవాలని.

**యమ్. ఖాజామైనుద్దీన్, గరుగుచింతలపల్లె**

**76. "కామము వలన అర్థము కల్గుచున్నది" అని మీరన్నారు ఇది ఎంత వరకు సమంజసము?**

జ. ధర్మార్థకామ మోక్షములనడము సహజము. దీని అర్థము ధర్మము వలన

అర్థము, కామము (ఆశ) వలన మోక్షము లభించునని అంటున్నారు. మరి కొందరు ధర్మముతో కూడుకొన్న అర్థము (ధనము), ధర్మముతో కూడుకొన్న కామము, ధర్మముతో కూడుకొన్న మోక్షము అని కూడ అంటున్నారు. ఈ రెండు అర్థములు సరికానివి. ఎందుకనగా! ధర్మము వలన ధనము రాదు. మోక్షము ఎట్లు లభించునని తెలియజేయునదే ధర్మము. ధర్మము డబ్బు వచ్చుటకు మార్గము తెలియజేయునది కాదు. ధర్మమనగా దేవుని తెలుసుకొను శాసనముతో కూడుకొన్నది. అందువలన ధర్మముల వలన ధనము రాదు, ధర్మార్థ అను పదము సరికాదని తెలియవలయును.

కామము అనగ ఆశ, ఆశ వలన ప్రపంచ డబ్బును సంపాదించు కోవచ్చును. కాని మోక్షము రాదు. ఆశ ఒక గుణము. గుణముల వలన కర్మ ఏర్పడి జన్మకు పోవును. కాని మోక్షమునకు పోవుననుట సమంజసము కాదు. అందువలన కామ మోక్షము అనుమాట సత్యము కాదు. **"ధర్మార్థ కామ మోక్షము"** అను వాక్యము సరికాని వాక్యమనుటలో సందేహము లేదు. ధర్మము వలన మోక్షము తెలియును అట్లే ఆశ వలన ధనము లభించును. కావున **"కామార్థ ధర్మ మోక్షము"** లనడము సరియైన వాక్యము.

మరి కొందరు ధర్మముతో కూడుకొన్న కామము ధర్మముతో కూడుకొన్న అర్థము (ధనము), ధర్మముతో కూడుకొన్న మోక్షమనడము కూడ సరికాదు. ధర్మమునకు వ్యతిరేఖమై, జ్ఞానమునకు నిత్యము వైరము కల్గినది కామమని గీతయందు వర్ణించబడినది. ధర్మమునకు కామమునకు ఏ మాత్రము పొత్తు కుదరదు. అందువలన ధర్మముతో కూడిన కామమనడము సరికాదు. అట్లే ధర్మముతో కూడిన ధనమంటున్నారు. ధర్మము ఆత్మ విషయము తెలియ జేయునదియే కాని ప్రపంచ డబ్బును సంపాదించడములో ఏమాత్రము ఉపయోగపడునది కాదు. ధర్మమునకు ఆత్మకే సంబంధమున్నది. కాని ఏ ప్రపంచ విషయములతో సంబంధము లేదు. కావున ధర్మముతో కూడుకొన్న ధనమనుటలో ఏమాత్రము అర్థము లేదు. అదే విధముగనే ధర్మముతో కూడుకొన్న

మోక్షమంటున్నాము. ధర్మము తెలియనిది మోక్షము రాదు. మోక్షమెప్పుడు ధర్మముల మీద ఆధారపడి ఉన్నది. కావున ధర్మముతో కూడుకొన్న మోక్షము అని అనవలసిన అవసరమే లేదు.

నిజముగ పూర్వము ధర్మార్థకామ మోక్షములని ఎవరు అనలేదు. పూర్వము పెద్దలు "కామార్థ ధర్మ మోక్షము"లనెడి వారు. కాలక్రమమున ఆ మాట ధర్మార్థ కామ మోక్షములుగ మారినది. కామము (ఆశ) వలన ధనము, ధర్మము వలన మోక్షము లభించునను భావముతో ఆనాడు పెద్దలు కామార్థ ధర్మ మోక్షములు అన్నారు.

**చందా చిన్నమునెప్ప, నరసాపురము**

**77. గ్రుడ్డివాల్లకు, కుంటివాల్లకు, కుష్ఠ రోగులకు దానము చేస్తే పుణ్యము వస్తుందని చాలామంది అంటున్నారు. ఈ మాట నిజమేనా ?**

జ. గీతాశాస్త్రములో ఇచ్చే దానము ఎవరికియ్యవలయునని ఆలోచించి దానమునకు పాత్రుడా కాదా అని యోచించి పాత్రుడైనపుడే ఇమ్మన్నాడు. అంతలోతుగ చెప్పడములో ఏదో ఒక అర్థముంటుంది కదా! ఎందుకంత యోచనగ చెప్పాడంటే ఇచ్చే దానములో పుణ్యము వస్తుంది మరియు పాపము వస్తుంది. పుణ్యము రావడము వలన మనకు ఇబ్బంది లేదు. కాని పాపము రావడము వలన దాని ఫలితముగ కష్టమనుభవింపవలసి వస్తుంది. అందువలన యోచించి మరీ దానము ఇమ్మన్నాడు.

నీవు ఇచ్చే దానము మంచి పనికి ఉపయోగింపబడితే నీకు పుణ్యము వస్తుంది. లేక చెడ్డ పనికి ఉపయోగింపబడితే పాపమొస్తుంది ఇది సూత్రము. ఈ సూత్రము ప్రకారము మీరే దానముల విషయములు లెక్కించుకోవచ్చును. కుంటి గ్రుడ్డివారికిచ్చు దానము పెద్దదిగ ఉండదు. ఏమి ఇచ్చిన ఒక పూట భోజనమునకు ఇస్తాము. ఆ దానము వాని ఆకలి తీర్చుచున్నది. మూడు గంటల కాలము వానిని ఆకలి నుండి కాపాడుచున్నది. అందువలన పుణ్యమే వస్తుంది. కాని

వాడు తిని ఊరకుండక కడుపు నిండిన తర్వాత మూడు గంటల కాలములో ఏదైన చెడ్డపని చేశాడా! అందులో భాగముగ నీకు కూడ పాపమొస్తుంది. అందువలన కుంటి గ్రుడ్డి అనునది ముఖ్యము కాదు. వారు నడుచుకొను ప్రవర్తన ముఖ్యమని తెలియవలయును.

ఈ విషయము సర్వ సాధారణ వ్యక్తికి వర్తించును. అహంకారమును అణచివేసి కర్మ యోగమాచరించు వానికి పైన చెప్పినట్లు పాపము గాని, పుణ్యము గాని రాదు. అటువంటివాడు దానము చేయుటయందేకాక ఏ కార్యము చేసినప్పటికి వానికి పాప పుణ్యములంటవు.

**యమ్. ఖాజామైనుద్దీన్, గరుగుచింతలపల్లె**

**78. "అండ, పిండ, బ్రహ్మాండము నిశ్శబ్దములో నిక్షిప్తమైనాయి" వాస్తవమా?**

జ. అండమనగ అండము (గ్రుడ్డు) నుండి పుట్టినవి. పిండ మనగ పిండము (గర్భము) నుండి పుట్టినవి. అట్లే బ్రహ్మాండమనగ చెట్లు చేమలు మొదలగు కనిపించు ప్రకృతి అంతాయున్నవని అర్థము. పుట్టిన జీవరాసులనన్నిటిని ప్రపంచమును విభజించి చెప్పడమే అండ పిండ బ్రహ్మాండమని అనుచున్నారు. పుట్టిన జీవరాసులు నిశ్శబ్దముతో ఏమాత్రము కూడుకొని లేవు. అన్ని శబ్దముతోనే కూడుకొని ఉన్నాయి. ప్రకృతితో పుట్టినది శరీరము. ఆ శరీరముల పుట్టుకను బట్టి అండ పిండ బ్రహ్మాండమనుచున్నాము. ప్రకృతి శరీరములోని ఒక భాగము శబ్దము. శబ్దము శరీరములలో ఒక భాగమైనపుడు అండ పిండ బ్రహ్మాండము నిశ్శబ్దముతో లేదని చెప్పవచ్చును.

ప్రపంచమంత ముగిసి ప్రళయమేర్పడినపుడు అండ పిండ బ్రహ్మాండ మంతయు అనగ యావత్ ప్రపంచమంతయు అవ్యక్తమై పోవుచున్నది. కంటికి కనిపించక పోయిన అప్పటి స్థితి ఏమియు చెప్పలేనిది. అపుడు ఆకాశమే లేదు కావున అది ఏ శూన్యముగనుండునో చెప్పలేము. అపుడు ప్రకృతియే లేదు.

కావున నిశ్శబ్దమను మాట కూడ చెప్పలేనిదై ఉన్నది. అందువలన అండ పిండ బ్రహ్మాండమున్నపుడు అంతా శబ్దముతోనే కూడుకొని ఉన్నది. అండ పిండ బ్రహ్మాండము లేనట్టి స్థితియేమిటో ఊహించరానిది. నిశ్శబ్దమని కూడ నిర్ణయించలేని అగమ్యగోచరమైనది.

**పొత్తురు క్రిష్ణయ్య, బి. పప్పూరు**

**79. మానవుడు గత జీవితంలో చేసుకొన్న పాపము ఇపుడు పుణ్య కార్యములు చేయుట ద్వార, తీర్థయాత్రలు చేయుట ద్వార, యజ్ఞయాగాది వ్రతక్రతువులు చేయుట ద్వార పరిహారమౌతుందా?**

జ. మానవుడు జీవితములో చేసుకొన్న పాపము ఎటువంటి పుణ్యకార్యముల వలన తొలగదు. పుణ్యకార్యములు చేయుట వలన పుణ్యము వచ్చును. పాపకార్యములు చేయుట వలన పాపమొచ్చును. తీర్థయాత్రల ద్వార మరియు యజ్ఞయాగాది వ్రత క్రతువుల ద్వార విశేషమైన పుణ్యము వచ్చును. జీవితములో జరిగెడి కాలములో పాపము కాని, పుణ్యము కాని నీ తలలోని కర్మచక్రములోనికి చేరుచునే ఉండును. పాపము వలన పుణ్యము, పుణ్యము వలన పాపము తీసి వేయబడవు. పాపము కాని అట్లే పుణ్యము కాని ఒక్క జ్ఞానాగ్ని చేత మాత్రమే దహించబడును. ఇతరత్రా ఏ కార్యముల వలన తీసి వేయబడవు.

ఈ కాలములో పాపము చేసినవారు దాని పరిహారార్థము దానము చేయుట, అభిషేకములు చేయించుట, అనేక పుణ్య క్షేత్రములు దర్శించుట మొదలగునవన్నియు చేయుచున్నారు. అట్లు చేయుట వలన పుణ్యమొచ్చును. కాని పాపము పోదని వారికి తెలియదు. గీతయందు దేవుడు నేను ఎవరి పాపమును, ఎవరి పుణ్యమును తొలగించను అని అన్నాడు. వాస్తవముగ జ్ఞానాగ్ని చేతనే పాపము మరియు పుణ్యము పోవును. కాని జ్ఞానాగ్నిలేని వానికి ఏ విధముగ కర్మ పోదు. చివరకు చేసుకొన్నది తప్పక అనుభవించవలయును. అందువలననే పెద్దలు కర్మను విష్ణు, ఈశ్వర, బ్రహ్మలు కూడ అనుభవించక తప్పించుకోలేరని అన్నారు.

**కె. శీతారామయ్య, ప్రొద్దుటూరు**

**80. భగవంతుడు సాక్షిభూతుడు నిమిత్త మాత్రుడు అని పెద్దలు చెప్పగా వింటున్నాము. మన కర్మ వలన మనకు జన్మలు వచ్చునని చెప్పుదురు. అటువంటపుడు భగవంతుని ధ్యానించినందున ప్రయోజనము లేదు. పూజించక పోయినందు వలన నష్టం ఉండదు గదా! అటువంటి పరిస్థితులలో భగవంతుని ఎందుకు పూజించవలెనో చెప్పకోరినాము.**

జ. భగవంతుడనగా భగము నుండి పుట్టినవాడని అర్థము. ధర్మసంస్థాప నార్థము పుట్టిన సాకార రూపమునే భగవంతుడని అందురు. నిరాకారమైన ఆత్మను సాక్షిభూతుడని పెద్దలందురు. కాని భగవంతుని సాక్షిభూతుడన కూడదు. మీ ఉద్దేశ్యములో దేవుని గూర్చి అడిగిన ప్రశ్న కావున భగవంతుడను పదము వద్ద ఆత్మ లేక దేవుడని వ్రాసుకొనిన ప్రశ్న సారాంశమైన అర్థముతో కూడుకొన్నదవును.

వాస్తవముగ కర్మ వలననే మనకు సర్వము కలుగుచున్నవి. గీత యందు సాకారమైన భగవంతుడు కూడ నేను ఎవరి కర్మను తీసివేయువాడను కాదని కర్మ సన్యాస యోగమను అధ్యాయములో 15వ శ్లోకమున **"నాదత్తేకస్యచి త్పాపంన చైవసుకృతం విభుః"** అన్నాడు. తప్పు చేశానని ఎన్ని నమస్కారములు చేసినా దేవుడు పాపమును తీసివేయడు. అటువంటపుడు దైవాన్ని ఆరాధించడము దేనికని ప్రశ్న ఉద్భవించకమానదు. ఆ విధమైన విమర్శ వచ్చినపుడే మానవునికి జ్ఞానముత్పన్నమగును.

దేవుడు కర్మకు దూరముగ ఉండువాడు. కర్మంతయు ప్రకృతి సంబంధించి ఉన్నది. ప్రకృతి పరిపాలనలోని కర్మను దేవుడు తీసివేయడు. కర్మ నుండి బయటపడవలయునంటే దేవుడే ఒక మార్గము తెలిపియున్నాడు. ఆ మార్గము అనుసరించినపుడు మాత్రమే మానవుడు కర్మనుండి బయటపడగలడు. ఆ మార్గమునే "యజ్ఞ కర్మ" అంటున్నాము. దేవుడు కర్మను తీసివేయకుండ కర్మ నుండి బయటపడు మార్గమును తెలుపుట వలన మానవుడు సంతోషపడవలసి ఉన్నది.

దైవజ్ఞానము తెలుసుకొని దేవుని మనసు చేత ధ్యానించుట వలన మన శరీరములో యోగాగ్ని అనునది ఉద్భవించును. ఆ యోగాగ్ని కర్మను కాల్చగలదు. ఆ విధముగ కర్మను కాల్చు విధానమునే యజ్ఞకర్మ లేక జ్ఞానయజ్ఞము అని అందురు. దేవుడు స్వయముగ కర్మ తీసివేయడు. కాని దైవ ధ్యానము వలన జనించెడి యోగశక్తి చేత కర్మకాలిపోవును. కావున దేవుని ధ్యానించవలసి ఉన్నది.

**"జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసాత్"** అను గీత వాక్యము ప్రకారము జ్ఞానము చేత ఉద్భవించిన అగ్ని చేతనే కర్మ కాలిపోవును. మరి ఏ ఇతర విధానము వలన పోదు. కావున జ్ఞానమును తెలిసి పద్ధతి ప్రకారము దైవ ధ్యానము చేసిన కర్మ తొలగును. అట్లుకాక ఎన్ని మ్రొక్కులు మ్రొక్కిన దైవము కర్మను తీసివేయ జాలడు.

**81. తేది 28-02-88 "ప్రబోధాత్మజమ్" మాస పత్రికయందు సంపాదకీయములో అపాయము తెలియని పసిపిల్లలకు బూచివాడున్నాడని అసత్యములు చెప్పి భయపెట్టి రక్షణ చేస్తామని, అదే విధముగ భక్తి ఏ మాత్రములేని వారికి కల్పిత పురాణములు చెప్పి ఆశ కల్పించి భక్తి మార్గమును అవలంభింప చేసి, అజ్ఞానమునకు దూరము చేస్తారని వ్రాశారు. ఆ ఉదాహరణ మాకు బాధ కల్గించినది. పురాణములు కల్పితములు అయిన అవి పెద్దలు మానవునికి భక్తి కల్గించుటకేనని వ్రాశారు. పురాణములు అసత్యములుకావని మా భావము. దేవున్ని మానవుడు అర్థి, అర్థార్థి, జిజ్ఞాసు, జ్ఞానిలాగ ఆరాధిస్తారని మీలాంటి పెద్దలు చెప్పుతారు. అర్థార్థికి పురాణములే ఆధారము కదా! పురాణములు ఎట్లు అసత్యములో తెలియ చెప్పకోరుచున్నాము.**

జ. పురాణములు చెడ్డవని మేము చెప్పలేదు. అసత్యములైనప్పటికి మూఢుని భక్తి గల వానిగ జేయుటకే పెద్దలు వ్రాశారని చెప్పాము. బాధకల్గవలసిన విషయము అందులో ఏమి ఉంది? ఇంకా ముందుకు పోవు విషయమున్నది. కావున

సంతోషించక పోగా బాధ కల్గినదని వ్రాయుట చూస్తే మీరు పురాణ విషయములలో లోతుగ ఉన్నట్లు తెలియుచున్నది.

వాస్తవముగ పురాణముల వలన ఏమి తెలియనివారు ఆశ కోసము భక్తులగుచున్నారు. పురాణములవలన భక్తులైనవారు ఆత్మజ్ఞానమును తెలుసు కోవలయునని ప్రయత్నము చేసి జ్ఞానులు కాకపోగా నాస్తికులగుచున్నారు. జ్ఞాన మార్గములో వచ్చిన అనేక సంశయములను పురాణములు తీర్చలేక పోగా, పురాణములు అనేకమైన అనుమానములు కల్గించి, చివరకు దేవుడే లేడను వారిగ మార్చి వేయుచున్నవి. ఈనాడు నాస్తికులను చూడండి వారికి శాస్త్రమొకటున్నదని తెలియక పురాణ విషయముల ఆధారముతోనే దేవుడు లేడని వాదిస్తున్నారు. వారికి శాస్త్రమేదో, పురాణమేదో తెలియదు. బహుళ ప్రచారములో ఉన్న పురాణములను ఆధారము చేసుకొని వాదించడమే వారి పనియై పోయినది. పురాణ విషయము ద్వారా వారి ప్రశ్నలకు జవాబులేదు. కావున నాస్తికులను ఆస్తికులుగ మార్చలేని స్థితిలో మన పెద్దలున్నారు.

మేము అలాంటి స్థితి ఇందూ మతములో రాకూడదని నాస్తికులను కూడ ఆస్తికులుగ చేయు శాస్త్రములనే బోధించుచున్నాము. అటువంటి సందర్భములో పురాణముల గూర్చి వాస్తవము చెప్పవలసి వస్తున్నది. అలా కాకపోతే ఇందూ మతము క్షీణించి ఇతర మతములలో లీనమగుటకు అవకాశమున్నది. అలాంటపుడు ఇందూ మతమును ఆదుకొనుటకు ఉన్న ఏకైక మార్గము శాస్త్ర ప్రచారము తప్ప మరి ఏమి లేదు. అందువలన పురాణముల నుండి దూరము చేసి శాస్త్రముల వైపు మల్లించడమే మా ముఖ్య ఉద్దేశ్యమైన దానివలన పురాణములను విమర్శించ వలసి వచ్చినదని తెలుపుచున్నాము. పురాణములకంటే సారాంశము నిచ్చు శాస్త్రము తెలియుట వలన సంతోషపడవలెను కాని బాధ ఎందుకు ?

శాస్త్రములకు, పురాణములకు చాలా భేదమున్నది. పురాణములు కేవలము కల్పితములు. శాస్త్రములు కల్పితములు కావు. శాస్త్రములు అనగా శాసనములను తెలియజేయునవి. శాసనము అంటే మనము చేయు పనులు ఏవి అయిన ఈ

విధముగానే జరుగవలయునని చేసిన నిబంధనని తెలుసుకొనుము. ఏ విషయములకైన సిద్ధాంతములను తెలియజేయు శాసనములుగల గ్రంథమునే శాస్త్రము అని అందురు. పురాణములు ఏ విధమైన శాసనములతో కూడుకొని ఉండవు. చరిత్రను ఆధారముగా తీసుకొని దానికి ఎన్నో కల్పితములు చేసి వ్రాయబడినవే పురాణములు మరియు ఇతి హాసములు. పురాణములు విచారణ విమర్శలకు నిలువవు. శాస్త్రములు కల్పితములు కావు కాబట్టి ఎటువంటి విచారణకు అయిన నిలుచును. శాస్త్రముల సిద్ధాంతములు ఎప్పటికి మారునవి కావు. ఉదాహరణకు గణిత శాస్త్రములో 3 X 3 = 9 అని ఉన్నది. అది ఎప్పటికి అట్లే ఉండును. ఎప్పటికి మారునది కాదు. హెచ్చించిన, భాగించిన, కూడిన, తీసి వేసిన విలువ మారక ఉండును.

పురాణములు కల్పితముగా ఎందుకున్నవంటే చిన్న పిల్లలకు ఖాళీ చేయి పిడికిలిగా పట్టుకొని చూపి పప్పులు ఇస్తాను దగ్గరకు రమ్మని పిలిచినట్లుగా, మూఢులుగ, భక్తిహీనులుగా ఉన్న ప్రజలలో మొదట భక్తి బీజములు నాటుటకు, జ్ఞానమునకు దూరముగా ఉన్న వారిని దగ్గరగా చేయుటకు, కల్పితములు చేసి పురాణములను మన పెద్దలు సృష్టించారని తెలియుచున్నది. పురాణములు శాస్త్రములు తెలియని వారికి మాత్రము అవసరము. జ్ఞానములో ప్రవేశించి ముందుకు పోవువారు పురాణములను పూర్తిగా వదలి వేయడము మంచిది. ఈ కాలములో కొంతమంది ప్రజలయందు పురాణముల ప్రభావము పూర్తిగా ఇమిడి ఉన్నది. అందువలన పురాణ ఆచారముల ప్రకారము ప్రవర్తించుచు ఇంత కంటే మించిన భక్తిమార్గము లేదని పూర్తిగా చెడిపోవుచున్నారు. జ్ఞానమార్గము ఏమాత్రము గుర్తించకున్నారు. కొందరు గురువుల వలన జ్ఞానము పొంది ఎప్పుడో ఒకప్పుడు పురాణ విషయములు తెలిసినంతనే తనకున్న జ్ఞానము మీద నమ్మకము విడచి అజ్ఞాన మార్గమున వర్తించుచున్నారు. నిజముగ చూచిన పురాణముల వలన ఒకటి మేలు రెండు చెడ్డగ ఉన్నది. పురాణముల విషయముల ప్రభావములు తెలియని వారు జ్ఞానమార్గము నుండి కూడ భ్రష్టులగుటకు వీలున్నది. కావున

పురాణముల యొక్క వాస్తవమును విమర్శించడమైనదని తెలుసుకొనుము. నేను పురాణములను విమర్శించునది మీకు జ్ఞానము తెలిసి మోక్షమొచ్చుటకు కాని నాకు మోక్షమొచ్చుటకు కాదని తెలుసుకొనుము.

పురాణములు భక్తిని బోధించునవియై ఉన్నవి. కాని జ్ఞానమునకు చాలా ఆటంకమయినవి. శకుని దుర్యోధనునికి మేలు చేకూర్చునట్లు నటించుచు కీడు చేకూర్చినట్లు మన పురాణములు కూడ మానవునికి మేలు చేకూర్చునట్లు ఉన్నవి. కాని వాటి వల్ల చివరకు అజ్ఞానమే మిగులుచున్నది. పురాణములు మొత్తము పదునెనిమిది కలవు. వాటినే అష్టాదశ పురాణములు అని అనుచుందురు. అవి 1. బ్రహ్మ పురాణము, 2. పద్మ పురాణము, 3. విష్ణు పురాణము, 4. శివ పురాణము, 5. భాగవతము, 6. నారద పురాణము, 7. మార్కండేయ పురాణము, 8. అగ్ని పురాణము, 9. భవిష్యత్పురాణము, 10. బ్రహ్మకైవర్తన పురాణము, 11. లింగ పురాణము, 12. వరాహ పురాణము, 13. స్కంద పురాణము, 14. వామన పురాణము, 15. కూర్మ పురాణము, 16. మత్స్య పురాణము, 17. గరుడ పురాణము, 18. బ్రహ్మాండ పురాణము. ఇవికాక ఉప పురాణములు అనేకముగ గలవు. ఈ పదునెనిమిది పురాణములు భక్తిని బోధించుచున్నవి. వీటియందు భాగవతము ఎక్కువ పేరు గాంచినది. ఇవి అనేక వ్రతముల తోను, వివిధ ఆచార ఆరాధనలతోను కూడుకొని ఉన్నవి. జ్ఞానమును బోధించు శాస్త్రములకు కొంత వ్యతిరిక్తముగ పురాణములు బోధించుచున్నవి. శాస్త్రములు ఆరు మాత్రము గలవు. బ్రహ్మ విద్యకు సంబంధించిన శాస్త్రములలో ముఖ్యమైనది నేడు మన అందరికి దగ్గరగా ఉన్న భగవద్గీతా శాస్త్రమే. బ్రహ్మ విద్య నిలయమని, యోగశాస్త్రమనియు పేరు పొందినది మరియు పరమాత్మయే స్వయముగా పల్కినది అయిన భగవద్గీతా శాస్త్రమునకే విరుద్ధముగ పురాణములు బోధించుచున్నవి. అందువలన పురాణములకొన్నిటిని విమర్శించవలసి వచ్చినది. విమర్శ చేయని ఎడల భగవద్గీతను వదలి కొందరు పురాణములనే అనుసరించి జ్ఞానమార్గములో చెడి పోవుటకు కారణమున్నది.

**ఉదాహరణకు :** శివ పురాణాంతర్గతమైన మాఘ పురాణమందు ఒక విషయము ఇట్లున్నది. రాముడు అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యమేలుచున్న సమయమున, ధర్మము నాల్గుపాదముల నడచుచున్న సమయమున, ఒక బ్రాహ్మణుని ఇంట 5 సంవత్సరముల వయస్సు గల బ్రాహ్మణ కుమారుడు చనిపోయాడట. అపుడు ఆ కుమారుని తండ్రి ఆ శవమును తీసుకొని వచ్చి రాముని మందిరము ముందరుంచి వాపోవుచు అయ్యో కుమారా! నీకింతలోనే నూరు సంవత్సరములు ఆయువు తీరినదా! తల్లిదండ్రులు సజీవులైయుండ తనయులు మృతినొందు అన్యాయము ఈ అయోధ్యయందుకాక ఇంకెందైననున్నదా! ఓ రామచంద్ర ప్రభూ! మేము పుత్రశోకముతో నిటు విలపించుచుండ, ఈ అన్యాయము జరుగుటకేమి కారణమని విచారింపక రాజసౌధములో కూర్చుండి ఉండుటయేనా నీ రాజ్యపాలనలోని ప్రత్యేకత? ఇదియేనా ధర్మము? ఇదియేనా రాజనీతి? మేమిటు శోకించుచుండ వలసిందేనా అని బ్రాహ్మణుడు వాపోవుచుండ, అంతట రాముడు మేడదిగి వచ్చి శోకించవలదని చెప్పి, ఈ అన్యాయమునకు కారణము విచారించెదనని పుష్పక విమానము ఎక్కి, ఎచ్చట అధర్మము నా రాజ్యములో తలెత్తినదో అచ్చటికి పొమ్మని విమానమును ఆజ్ఞాపింపగ విమానము ఆకాశ మార్గమున పోయి ఒక చోట దిగెను. అప్పుడు రాముడు అక్కడ పరికించగా ఒకడు తపస్సు చేయుచుండెను. అతనిని రాముడు సమీపించి అయ్యా నీవెవరవు? ఎందులకు తపమొనరించుచుంటివి అని అడుగగ, ఆయన రామచంద్రా నేను శంభుకుండను శూద్రుడను, బొందితో కూడ స్వర్గమునకు పోవు ఉద్దేశ్యమున తప మాచరించుచుంటినని జవాబు చెప్పెనట. అందులకు రామచంద్రుడు "నీవు శూద్రుడవు కాన తప మాచరించుటకు అనర్హుడవు. నీవు చేయుచున్న తపస్సు అధర్మయుతము, శూద్రుడవైన నీవు తపమాచరించుట వలన మా రాజ్యములో ఒక విప్రకుమారుడు చనిపోయెను. ఈ అధర్మ కార్యము చేసినందులకు నీ శిరస్సు ఖండించుచున్నాను, దీనితో నీవు కోరుచున్న మోక్షము లభించును. ధర్మరక్షణ జరుగును" అని అతని శిరస్సు ఖండించినట్లు వ్రాయబడినది. ఈ కథలో శరీరముతో

స్వర్గమున కేగవలయునని శూద్రుడు అడిగినట్లు ఉన్నది. రాముడు నీవు కోరుచున్న మోక్షము ఇచ్చెదనని చెప్పినట్లు ఉన్నది. వాడు కోరుకొన్నది స్వర్గము కాని మోక్షము కాదు కదా! అదియు శరీరముతోనే. రాముడు ఇచ్చినది మోక్షము. ఈ కథలో స్వర్గమునకు మోక్షమునకు భేదమేలేనట్లు ఉన్నది. ఈ పురాణము రాసిన వారికి స్వర్గమునకు మోక్షమునకు భేదము తెలియనట్లున్నది. ఇందులో శాస్త్రవిరుద్ధము ఏమనగా! శూద్రుడు తపమాచరించకూడదను మాట. పరమాత్మను తెలుసుకొను నిమిత్తము మానవుని పవిత్రము చేయు సాధనలలో తపస్సు ఒకటి. అట్టి తపస్సు శూద్రుడు చేయకూడదనుటకు ఏ ప్రమాణము లేదు. సర్వ మానవులు భక్తి సాధనలు చేయవచ్చుననుటకు ప్రమాణము కలదు. గీతాశాస్త్రములో రాజ విద్యా రాజగుహ్యా యోగమున **"మాం హి పార్థ! వ్య పాశ్రిత్య యేపిస్యుః పాపయోనయః స్త్రీ యో వైశ్యా స్తథా శూద్రాస్తేపి యాన్తి పరాంగతిమ్"** నన్ను పూజించుట వలన పాపయోనియందు పుట్టినప్పటికి, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు నా అనుగ్రహము పొందినవారై ముక్తిని పొందగలుగుచున్నారని పరమాత్మ పలికినాడు. యోగ శాస్త్రమైన భగవద్గీతకు వ్యతిరిక్తముగ శూద్రుడు తపమాచరించ కూడదనుట అధర్మము. శాస్త్రమునకు వ్యతిరేఖమైన మాటలు పురాణములు చెప్పుచున్నవి. దీని వలన శాస్త్రములకు పెద్ద ఆటంకమేర్పడుచున్నది. ఉన్న వాస్తవము మట్టిపాలై పోతున్నది. పై కథలో స్వర్గమును శూద్రుడు కోరినట్లు ఉన్నది. రాముడు నీ వడిగిన మోక్షము నిచ్చుచున్నానని చెప్పినట్లు ఉన్నది. ఇక్కడ మోక్షము స్వర్గము రెంటికి భేదములేనట్లు వ్యక్తమగుచున్నది. దీనితో మోక్షము యొక్క నిజస్థితి నాశనమై పోవుచున్నది. స్వర్గము మోక్షము రెండు ఒకటేనను భావన ప్రజలలో పుట్టుచున్నది. జ్ఞాన మార్గములో పోవు కొందరికి మోక్ష స్వర్గములు రెండు ఒకటేనని తెలియడముతో మేము చేయు సాధనయంతయు సుఖముల కోసమా? పరలోక ప్రాప్తి కోసమా? అని వారంతకు వారు వెనుకంజ వేయుస్థితి ఏర్పడుచున్నది. జన్మరాహిత్యమంటే ఏమిటి? అను ప్రశ్న ఉద్భవించి వారిని పీడింప మొదలు పెడుతుంది. గీతా శాస్త్రములో మోక్షమనునది నాశనము కాని స్థితిగా ఉండి, పరలోకముకానిది,

కాల ప్రమాణములేనిది, సుఖదుఃఖములకంటనిది అని తెలిపి ఉండగ, ఈ పురాణములలో అందులకు విలక్షణముగా ఉండుట ఎట్లున్నదో చూడండి.

మార్కండేయ పురాణమందు యమధర్మరాజు మార్కండేయుని కొని పోవుటకు రాగ, ఆ సమయములో మార్కండేయుడు శివలింగమును కౌగిలించుకొని కదలక ఉండెనని, యమధర్మరాజు మార్కండేయుని మెడకు పాశము వేసి లాగుచుండగ, ఈశ్వరుడు ప్రత్యక్షమై నాభక్తుని లాగుటకు నీకెంత భయములేదని యమధర్మరాజును తన ఎడమ కాలితో తన్ని నటుల, ఆ దెబ్బకు యమధర్మరాజు మూర్ఛిల్లెనని, దేవతల ప్రార్థనతో యమధర్మరాజుకు ఈశ్వరుడే తిరిగి జ్ఞప్తికి వచ్చునట్లు చేశాడని, పైకి లేచిన యమధర్మరాజును నా భక్తుడైన మార్కండేయుని దగ్గరకు నీవు రాకూడదు. మార్కండేయుడు చిరంజీవిగా ఉండునని చెప్పినట్లును, మరియు మార్కండేయుడే కాక ఎవరైన శివభక్తులైన వారి వద్దకు పోవలదనియు ఈశ్వరుడు యమధర్మరాజుకు చెప్పినట్లు ఉన్నది. ఈ విషయము **"జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధువం జన్మ మృతస్యచ"** అని ఉన్న గీతా ధర్మమునకు వ్యతిరేఖముగా ఉన్నది. కొందరు గీతనే ఎందుకు ప్రమాణముగా తీసుకోవలయును పురాణములను ఎందుకు తీసుకోకూడదని అడుగవచ్చును. మరియు ఎన్నో పురాణములు చెప్పిన వాక్కులు తీసివేయడము, ఒక్క భగవద్గీతను మాత్రము ముందుకు తేవడము, గీత మీద పక్ష పాతముండుటయేనని అనవచ్చును. దానికి సమాధానము ఏది నిజమో దానినే తెలిపిన వారు ఒప్పుకొందురు. నిజము కాని దానిని ఎట్లు ఒప్పుకొనదగును. పలువురాడు మాట నిజము, ఒక్కడాడు మాట నిజము కాదని ఎట్లు చెప్పనగును. ఒక్కడు పల్కినంత మాత్రమున నిజము అబద్ధమగునా! పది మంది పల్కినంత మాత్రమున అబద్ధము నిజమగునా! ప్రతి దానిని యోచించి నిజమేది అబద్ధమేది అని విశదీకరించినపుడే వాస్తవము తెలియును. విన్న దానినంతయు గ్రుడ్డిగ నమ్ముచు పోయిన వాస్తవమును పొందలేరు. మార్కండేయుడు చిరంజీవైన ఇప్పటికి ఉండవలయును కదా! ఇప్పుడు మార్కండేయుడు ఎక్కడ లేనట్లే తెలియుచున్నది. మరియు శివభక్తులను యముడు

వదలివేయవలయునంటే వారికి మరణము రాకూడదు కదా! ఇపుడు శివ భక్తులైన వారు కూడ అందరూ మరణించుచునే ఉన్నారు కదా! కావున మార్కండేయుని కథ ఎట్లు నిజమగును. ఈ కథ నిజము కాక పోవడమేకాక **"పుట్టినవాడు చావ వలసినదే, చచ్చినవాడు పుట్టవలసినదే"** అను గీతా వాక్యమునకు ఎంతో వ్యతిరేఖముగా ఉన్నది. అందువలన మార్కండేయ పురాణము కూడ శాస్త్రవిరుద్ధమై ఉన్నదనుటకు ఎటువంటి సందేహము లేదు.

సావిత్రి పురాణమందు సావిత్రి భర్తయగు సత్యవంతుని ప్రాణమును యమ ధర్మరాజు తీసికొని పోవుచుండగ, సావిత్రి భర్త ప్రాణముల కోసము యమ ధర్మరాజును వెంబడించెనని, చివరకు యముడు ఎంత భయము చెప్పిన వినక యమపట్టణము వరకు యముని వెంటపోయి, యమపురిలో యమునితోనే పుత్ర సంతతి వరము బడసి, చివరకు భర్తను విడిపించుకొని వచ్చెనని ఉన్నది. ఈ కథలో యమలోకమనునది నిజముగా ఉన్నదని, దానికి రాజైన యమధర్మరాజు జీవులనుకొని పోవుననియు తెలియుచున్నది. ఈ పురాణముల ప్రభావమువలననే నేటి మానవులలో యమలోకముందని, అచ్చట పాపములకు శిక్ష వేయబడునను విషయము పూర్తిగా జీర్ణించి పోయినది. ఈ విధముగ యమలోకమనునది వేరుగా ఉందని తెలియుట వలన మానవులలో పాపభీతి అనునది ఏమాత్రము లేకుండ పోయినది. ప్రతి ఒక్కరు ఎంత పెద్ద పాపమునైన భయము లేకుండ చేయుచున్నారు. యమలోకమునకు పోయిన రోజు కదా పాపమనుభవించేది. ఎప్పుడో వచ్చు కష్టమునకు ఈ రోజు వచ్చు సుఖములను ఎందుకు వదలు కోవలయును. యమలోకముండునని అనుకొనుచున్నాము, కాని ఎవ్వరయిన చూచి వచ్చినారా? ఒక వేళ ఉండుననుకొందాము అయిన అక్కడ ఏమి అనుభవించేది మనకు తెలియదు కదా! ఒక వేళ అనుభవించిన అక్కడది ఇక్కడకు జ్ఞప్తికి ఉండదు కదా! జ్ఞప్తికి లేని దానిని ఎవరు చూడని దానిని ఉన్నదని ఊహించుకొని మనకు అనుకూలమైన పనులను పాపము అని వదలి వేయుట తెలివి తక్కువ అనువారు చాలామంది ఉన్నారు. కొందరు నీవు చేయు పాపపు పనికి చిత్రహింస

యమలోకములో అనుభవించుతావు అని చెప్పిన అక్కడకు పోయినప్పుడు అనుభవించుతానులే అని అనువారున్నారు. ఈ విధముగ మానవులలో పాపభీతి లేకుండ పోవడానికి కారణము పురాణములే. యమలోకమనునది భూమి మీదనే ఉన్నదని, ప్రతి క్షణము మనము అనుభవించు కష్టములే యమబాధలని తెలియక పోవుటవలన, మానవుడు భయము లేకుండ ఏ పని చేయుటకైన వెనుకాడుట లేదు. పురాణములో యమలోకమనునది ఎక్కడో ఉన్నదని, మానవులను భయపెట్టవలయునని, పురాణములను వ్రాసిన వారి ఊహ ఉండవచ్చును కాని వారనుకున్నట్లుకాక అందులకు వ్యతిరేఖముగా ప్రజలలో భయమే లేకుండ పోయినది. యదార్థముగ యమలోకము భూమి మీదనే ఉన్నదని తెలిసిననాడు, యమలోకములో ఉండు బాధలన్ని ఇక్కడ భూమి మీదనే ఉన్నవని తెలిసిననాడు, ప్రత్యక్షముగ ఒక బండి క్రిందపడి ముక్కలు ముక్కలుగా చీలి పోయిన శరీరమును చూచి ఇదియే యమ బాధ, ఇది మనము చేసుకొన్న పాపఫలితమే అని తెలిసిననాడు పాపభీతి ఏర్పడగలదు. యమలోకములో ఉన్నవని అనుకొనుచుండిన కుక్కలు కరచుట, పాములు కరచుట, తేల్లు కుట్టుట, బల్లెములతో చెక్కుట, నూనెలో కాలుట, అగ్నిలో మండుట, బండిక్రింద పడవేయుట, కట్టెలతో కొట్టుట, కత్తులతో నరకుట, జంతువులతో హింసింపజేయుట మొదలగునవి అన్నియు ఇక్కడే ప్రత్యక్షముగా జరుగుచున్నవని తెలిసిననాడు మానవులలో పాపభీతి పుట్ట గలదు. పాపమునకు ఉన్న ప్రతి ఫలిత మెట్టిదో నిజముగ తెలిసిననాడు మానవుడు పాపము చేయుటకు వెనుకాడును. పాపము చేయువారు తగ్గిపోదురు.

నేడు భూమి మీద పాపము చేయు వారు పెరిగి పోయినారంటే పురాణముల ప్రభావమేనని తెలుసుకొనుము. పురాణములు మనకు మేలు చేకూర్చుతాయని కొందరభిప్రాయముండవచ్చును. కాని పురాణములు మనకు ఎక్కువ నష్టమునే చేకూర్చినాయని గట్టిగ చెప్పవచ్చును. భక్తి బీజమును నాటుటకు ప్రయత్నించిన పురాణములు చివరకు మానవుని దైవజ్ఞానమునకు దూరము చేయుచున్నవని చెప్పవచ్చును.

పంచమ వేదమని పేరుగాంచిన భాగవతమందు అజామీ లోపాఖ్యాణములో అజామీలుడు తన జీవితకాలములో ఎన్నో పాపకృత్యములను చేసి భయంకర పాపము సంపాదించుకొని ఉన్నవాడై, కొంత కాలమునకు మరణ సమయము రాగ, ఆ సమయములో మంచము మీద పరుండినవాడై నారాయణ అను పేరు గల తన చిన్న కుమారుని మీద ఎక్కువ ప్రేమ ఉండుట వలన, వానిని చూడవలయునను తలంపుతో నారాయణ అని పిలిచెనట. అవసాన దశలో నారాయణ అనుటవలన వైకుంఠము నుండి విష్ణు దూతలు వానిని కొనిపోవుటకు వచ్చిరట, వాడు జీవిత కాలములో ఎక్కువ పాపము చేసిన వాడు గనుక యమలోకము నుండి యమభటులు వచ్చిరట. అక్కడికి వచ్చిన విష్ణు దూతలు అజామీలుడు అంత్యములో నారాయణ అన్నాడు కావున మా లోకమునకు తీసుకొని పోయెదమని యమదూతలతో పల్కిరట. అందులకు యమదూతలు వీడు ఎక్కువ పాపము చేసినవాడు యమలోకమునకే తీసుకొని పోయెదమని వాదించిరట. ఈ విధముగ అజామీలునికథ ఉన్నది. ఇందు అజామీలుడు తన కుమారుని పిలువగా ఎవరిని పిలుస్తున్నాడని గ్రహించక తన దూతలను పంపిన విష్ణువు అంత అవగాహన లేనివాడుగ యుండునా!

ఎవడు ఏ భావమును అంత్యములో కలిగి ఉండునో దానినే పొందునని శాస్త్రమన్నది కదా! అజామీలుడనుకొన్నది తన కుమారుడనయితే విష్ణుదూతలు ఎందుకు రావలయును?

శ్లో॥ యం యం వాపిస్మరన్ భావం త్య జత్యన్తే కలే బరమ్ ।
తం తమే వైతి కౌంతేయ, సదా తద్భావ భావితః ॥

అను గీతవాక్యమునకు అజామీలుని కథ వ్యతిరిక్తమైనది. **'శరీరమును వదిలి పోవునపుడు ఏది స్మరణకు వచ్చునో దానినే వాడు పొందునని'** ఉన్నది. అట్లుకాక అనుకొన్నది కుమారుని, ఫలితముగా వచ్చినది విష్ణుదూతలు. అంటే మానవుని ఎడల దేవుడు పెట్టిన సిద్ధాంతములను ఆటంకపరచడమే కానివేరు కాదు. ధర్మమునకు ముప్పు తెచ్చు కథలను మేము ఏమాత్రము ఒప్పుకోము.

అజామీలుని కథ వలన చాలామంది ప్రాణము పోవునపుడు దేవుని స్మరించుకుంటే చాలుకదా!. ఇప్పటి నుంచి ఎందుకు అనుకోవలయును? ఇప్పటి నుంచి దైవస్మరణ మన పనులకు ఆటంకముగా ఉండును. అజామీలుడు అనుకున్నట్లు చివరిసమయములో దేవుని అనుకుంటే సులభముగా దైవసాన్నిధ్యము చేరవచ్చునని భ్రమించుచున్నారు. తెలిసిన వారు జ్ఞానమును గురించి బోధించి ఇప్పటి నుంచి సాధన చేయమని చెప్పితే ఆ మాట వినక భాగవతములో అజామీలుడు ఎంతో చెడ్డవాడైనప్పటికి చివరిలో నారాయణ అన్న మాత్రమున విష్ణుదూతలు వచ్చారట. ఆ విధముగానే మేము చివరిలో అనుకుంటాము. ఈ విషయము మీకు తెలియక ఇప్పటి నుంచి ప్రయత్నము చేయమని చెప్పుచున్నారని ఎక్కిరించుచున్నారు. గీతలో అక్షర పరబ్రహ్మ యోగమున చెప్పిన **"త స్మా త్స ర్వేసు కాలేసు మా మనుస్మర యుధ్యచ, మయ్యర్పిత మనో బుద్ధి ర్మా మే వైష్య స్య సంశయః" "సర్వ కాలములో మనస్సు బుద్ధియు నా మీదనే ఉంచి నన్నే స్మరించుకొను చుండిన చివరకు నన్నే చేరగలవు"** అను మాట వీరి ఎడల వృథా అయిపోవుచున్నది. ఒక్క పురాణకథ శాస్త్రమైన వాక్యమునే క్రిందబడదోయుచున్నది. కొందరు పురాణమువైపే మళ్ళి శాస్త్రమునే వెక్కిరించుచున్నారు. పురాణములను నమ్మి చిన్న దారము వలన పర్వతముల పైకి ప్రాక గలమనుకొని చెడిపోవుచున్నారు. అటువంటి వారిని బాగుపరచు నిమిత్తము మేము పురాణములను విమర్శించడ మైనది.

వరాహ పురాణాంతర్గతమైన గీతామహత్యములో విష్ణువు భూదేవికి భగవద్గీత మహత్యమును గురించి చెప్పుచు, గీతను అధ్యయనము చేయుట వలన పుణ్యము లభించునని, గంగా స్నాన ఫలితము లభించుననియు, సోమ యాగ ఫలము లభించుననియు, కైలాసములో ప్రథమ గణములో నివాసము లభించుననియు, మన్వంతరము వరకు మానవ జన్మయే ప్రాప్తించుననియు, చంద్రలోక ప్రాప్తి, వైకుంఠ ప్రాప్తి గలుగుననియు పల్కినట్లు ఉన్నది. ఈ మాటతో చెప్పబడిన మహత్యముల మీద మానవులు ఆశతోనే గీతను పఠింతురు, కాని

మోక్షము లభించునను ఉద్ద్యేశము వారిలో ఏమాత్రము ఉండదు. గీతను చదివి గీతామహత్యము చదవని వానికి ఏ ఫలితముండదని, ఫలశూణ్యమగు కార్యము చేసినట్టి వాడగునని గీత మహోత్యములో వ్రాసియుండుట వలన గీత మహత్యము తప్పక చదివి తీరవలయునని, ప్రజలు గీతకంటే గీతామహత్యమే ముఖ్యమని ప్రజలు తలంచకపోరు. అప్పుడు గీత మహత్యము ముందర గీతయే తక్కువదని పించుకొను భావము ఏర్పడుచున్నది. బ్రహ్మవిద్యయైన గీతకే పెద్దలోటు గీతా మహత్యము వలన ఏర్పడుచున్నది. గీతా మహత్యమునే ముఖ్యముగ ఎంచుకొన్న వారు, అందు చెప్పినటుల గీతను చదువుట వలన ఫలితములు కలుగుననియే పూర్తిగా నమ్ముచున్నారు. గీత పుణ్య పాపములనెడు బంధములను తొలగించుటకు, మోక్షమును ప్రాప్తింపజేయుటకు ఉన్నది. అట్లుకాక సోమ యాగ పుణ్యము, గంగా స్నాన పుణ్యము కలుగజేసి చంద్రలోకప్రాప్తి, వైకుంఠప్రాప్తి కలుగజేయుననుట యోగశాస్త్రమునకు పెద్దకళంకము కలుగజేసినట్లువుచున్నది. బ్రహ్మవిద్యా ధర్మ శాస్త్రమునకు గీతా మహోత్యము చేత అధర్మముల అంటగట్టుట సరియైన పని కాదు.

భగవద్గీత ఒక యోగశాస్త్రము, గీతామహత్యము వరాహ పురాణము. గీత యొక్క మహత్యము వెదజల్లు నిమిత్తము పైకి కనిపించిన, లోపల గీత పైనే అనుమానం కల్గించు గీతామహత్యమును ఏమనవలెనో! అందులకే నేను దుర్యోధనుని మేలుకోరు శకుని లాంటివి పురాణములని అనుచున్నాను. శకుని మాటలు చేతలు దుర్యోధనుని మేలు కోరునవిగా పైకి కనిపించినను చివరకు ఫలితము దుర్యోధనుని నాశనమే. ఆ విధముగానే పురాణముల పలుకులు భక్తిని బోధించి జ్ఞానిగా చేయునట్లు పైకి కనిపించినను వాటి ద్వార చివరకు మిగులునది అనేక సంశయములతో కూడిన అజ్ఞానమే.

భాగవతమునందు హిరణ్యకశిపుడు బ్రహ్మ గూర్చి మరణము జయించుటకు పదివేలేండ్లు తపమొనర్చెనని ఉన్నది. వరము పొంది ఇంటికి రాగ కుమారునికి ఐదు సంవత్సరములని ఉన్నది. తపస్సుకు పోవునపుడు భార్య

గర్భిణికాగ వేల సంఖ్యలో తపము చేసి ముగించిన తర్వాత కుమారునికి ఐదు సంవత్సరముల వయస్సు అనడము ఎంత విడ్డూరము. ఎంత పురాణములైన ఇంత అసత్యములా! దీని వలన ఇందూ మతము పరమతములకంటే తక్కువ కాదా! నీ దేవుడెక్కడున్నాడను హిరణ్యకశిపుని మాటకు ప్రహ్లాదుడు అందుగలడిందు లేడని సందేహము వలదని సమాధానమిచ్చాడు. ఆ మాట నిజమని నమ్మిన వానికి గజేంద్రమోక్షములో అలవైకుంఠపురములో ఆ మేడలో అన్న మాట వినగానే ముందు ప్రహ్లాదుని మాట నిజమా లేక అసత్యమా అని అక్కడనే ఆ పురాణము మీదనే అపనమ్మకము ఏర్పడుచున్నది. ఈ విధముగా ఉండుట ఇందూ మతమునకు క్షేమమా?

వామన ఘట్టములో బలిచక్రవర్తి ఇచ్చిన మూడడుగుల దానమును వామనుడు కొలుచుకొనుచు ఒక అడుగు ఆకాశమునకు మరియొక అడుగు భూమండలమునకు పెట్టినపుడు సమస్త భూభాగము రెండవ పాదమునకే సరిపోయినపుడు భూమి మీద ఉన్న బలిచక్రవర్తి ఎలా మిగిలి ఉండును. మూడవ పాదము బలిచక్రవర్తి తల మీద పెట్టాడనుటకు బలిచక్రవర్తి నిలుచుకొనుటకు కొంతయిన భూమి ఉంటే కదా అది సాధ్యము. యోచించువారికి సంశయములు కల్గును. కావుననే ఇందూ మతములో నాస్తికులు తయారైనారు. మరియే ఇతర మతములలో నాస్తికులు లేరు. ఒక్క హిందూ మతమునందే నాస్తికులున్నారంటే అది మన పురాణముల ప్రచారము వలన, శాస్త్రములు తెలియక పోవడము వలన అని తెలియాలి. ఇప్పటికైనా పెద్దలు, గురువులు పురాణములు ఎంత వరకు అవసరమని గ్రహించి, పురాణములు చెప్పవలసిన వారికి పురాణములు చెప్పి, తర్వాత శాస్త్రములు తెలియజెప్పవలయునని సవినయముగ కోరుచున్నాము.

మా అనుభవములో శాస్త్రమును చెప్పి నాస్తికులను కూడ ఆస్తికులుగా చేశాము. కావున పురాణములను విమర్శించామని అనుకోక విశాలమైన భావముతో అర్థము చేసుకొంటారని, ఇందూమతమును ఉద్ధరించుతారని తలచుచున్నాము.

**కె. సీతారామయ్య, శ్రీరాములపేట, ప్రొద్దుటూరు**

**82. పురాణములు ప్రతి మానవునికి ప్రారంభవిద్య. ఆ తర్వాత శాస్త్ర విద్య అవసరమని మా ఉద్దేశము. మీరు 18 పురాణముల పేర్లు తెల్పారు. అట్లే శాస్త్ర వివరాలు కూడ తెల్పవలెనని కోరుచున్నాము?**

జ. విజ్ఞానవంతులైన తమవంటివారు గ్రహించగలరను భావముతో పురాణ వివరములు తెలిపాము. అందులో మేము కూడ పురాణములు ప్రాథమిక విద్య అనియే తెల్పాము. సాధారణ మానవునికి జ్ఞానము గ్రహించని స్థితిలో పురాణములు అవసరమని చెప్పాము కదా!

ఇప్పుడు మీరు అడిగారు కావున శాస్త్ర విషయములు తెలుపవలసి ఉన్నది. సవ్యమైన మీ ప్రశ్నల వలన ఎంతో మందికి సత్యము తెలుసుకొను అవకాశము కల్గినది కావున సంతోషముగ తెల్పుచున్నాము. శాస్త్రములు ఆరు ఉన్నవి. వాటినే షట్ శాస్త్రములని అందురు. సిద్ధాంత నిబంధనలతో కూడుకొన్నదే శాస్త్రము. అందువలన శాసనములతో కూడుకొన్నదే శాస్త్రమని పెద్దలను చున్నారు. శాసనము నుండి పుట్టిన పదమే శాపము. శాపమనగ జరిగి తీరునదని మనకు తెలిసిన విషయమే. అట్లే శాసనమనగ తూచ తప్పకుండ జరిగి తీరునదని అర్థము అటువంటి శాసనములతో కూడుకొన్నదే శాస్త్రము. ఉదాహరణకు **"జాతస్య హి ధృవో మృత్యు"** (పుట్టిన వాడు చచ్చి తీరవలయును) అను మాట తూచ తప్పకుండ జరుగుచున్నది కదా! అట్లే 5X4 = 20 అని గణిత శాస్త్రములో ఉంది. అది ఏ దేశములోయైన అమలుకు వచ్చుచున్నది. ఈ విధముగ మార్పు చెందక నిరూపణకు వచ్చు నిర్ణయమైన శాసనములతో కూడుకొన్నదే శాస్త్రము.

శాస్త్రములు ఆరు అన్నాము కదా! అవి 1. గణిత శాస్త్రము, 2. జ్యోతిష్య శాస్త్రము, 3. ఖగోళ శాస్త్రము, 4. రసాయన శాస్త్రము, 5. భౌతిక శాస్త్రము, 6. యోగశాస్త్రము. వీటికి అనుబంధమైనవి కూడ కొన్ని గలవు. ఉదాహరణకు వాస్తు శాస్త్రమనునది ఉందనుకొండి అది వేరు శాస్త్రము కాదు. జ్యోతిష్యశాస్త్రము

లోని భాగమే వాస్తుశాస్త్రమని తెలియవలయును. అట్లే వృక్ష శాస్త్రమని ఒకటుందనుకోండి అది భౌతిక శాస్త్రమునకు అను బంధమైనదే కాని వేరు కాదని తెలియవలయును. ఇంకా అనేకముగ శాస్త్రములుకాకున్న శాస్త్రములను పేరుతో చలామణి అగు పుస్తకములు కూడ కలవు. వాటిని మన జ్ఞానముతో శాస్త్రములు అవునా కాదా! అని తెలుసుకోవచ్చును.

శాస్త్రములు ఆరు వేరు వేరుగ ఉండిన ఒక దానితో ఒకటి సంబంధము కల్గి ఉన్నవి. గణిత శాస్త్రమునకు జ్యోతిష్య శాస్త్రమునకు సంబంధము కలదు. అట్లే జ్యోతిష్య శాస్త్రమునకు ఖగోళ శాస్త్రమునకు సంబంధమున్నది. ఖగోళమునకు రసాయనిక శాస్త్రము, రసాయనిక శాస్త్రమునకు భౌతిక శాస్త్రము, భౌతిక శాస్త్రమునకు యోగ శాస్త్రమునకు సంబంధమేర్పడి ఉన్నది.

అన్నిటికంటే ముఖ్యమైనది చివరిది యోగ శాస్త్రము. అది అన్ని మతముల వారికి ఉన్నది. ఒక్కొక్క మతము వారు ఒక్కొక్క పేరు పెట్టుకొని ఆ శాస్త్రమును పిలుచుచున్నారు. అట్లే ఇందూ మతములో కూడ భగవద్గీత అను పేరున యోగ శాస్త్రమున్నది. అది ఒక్క ఇందువులకేకాక సర్వజీవరాసులకు వర్తించునదిగ ఉన్నది. అన్ని శాస్త్రములకంటే యోగశాస్త్రము ఉన్నతమైనది, పవిత్రమైనది కావున **"సర్వశాస్త్ర శిరోమణి"** గీత అనుచున్నారు. మిగత ఐదు శాస్త్రములు దీనియందు మిళితమై ఉన్నవి. అందువలన **"సర్వ శాస్త్రమయి గీత"** అని పెద్దలంటున్నారు.

శాస్త్రముల గూర్చి మేము చెప్పు విషయమువిన్నారుగా! ఇపుడు మరికొందరు శాస్త్రముల గూర్చి వ్రాసిన విషయము కూడ కొద్దిగ తెలుపుతాము. ఈ రెండు విషయములకు మీరు తక్కెడ (త్రాసు) లాంటివారు. ఏది బరువు (సత్యము) గల విషయమో మీరే ఆలోచించండి.

1. శిక్ష, 2. వ్యాకరణము, 3. ఛందము, 4. నిరుక్తము, 5. జ్యోతిష్యము, 6. కల్పము. ఇవి షట్ శాస్త్రములని అనుట గలదు. వీటిలో ఐదవది జ్యోతిష్యము తప్ప మిగతావేవి ఎలా శాస్త్రములో మాకు అర్థము కాలేదు. వాటిని గూర్చి ఇంకా వివరమడిగిన ఇలా ఉన్నవి.

**1. శిక్ష :** ఇందు వేద శబ్దముల యొక్క అక్షరముల స్థాన జ్ఞానములను ఉదాత్త, అనుదాత్త, స్వరిత స్వరముల జ్ఞానమును జెప్పబడును. ఉదాత్తమనగ ఉచ్చము, అనుదాత్తమనగ నీచము స్వరితమనగ సమానము అని తెలియ వలయును. ఈ శిక్షా శాస్త్రమును వ్యాస శిక్ష, భరద్వాజ శిక్ష, నారద శిక్ష అను మూడు విధములుగ చెప్పుచున్నారు.

**2. వ్యాకరణ :** ఇందు వేద శబ్దము యొక్క ప్రకృతి ప్రత్య జ్ఞానము వివరింపబడి ఉన్నది.

**3. ఛందము :** దీని యందు వేదములలో చెప్పబడిన గాయత్రి మొదలగు ఛందముల యొక్క పరిజ్ఞానముండును.

**4. నిరుక్తము :** ఇందులో వేదమంత్రముల యొక్క ప్రయోజనమును స్పష్టపరచు నిమిత్తము అప్రసిద్ధ పదముల యొక్క అర్థములు బోధింపబడి ఉన్నవి. మరియు వేద శబ్ద వివరణ శాఖ పూర్ణ నిరుక్తమును ఇందు గలవు.

**5. జ్యోతిష్యము :** ఇందు వైదిక కర్మల నారంభించుటకు తగు ముహూర్త జ్ఞానమును ఆ ముహూర్త బలమును, భవిష్యత్ సూచనలు వివరింపబడి ఉన్నవి.

**6. కల్పము :** ఇందు వేదములందు జెప్పబడిన యజ్ఞ కర్మల ననుష్టించు రీతిని బోధించుట గలదు.

చూచారా! ఇవీ మన శాస్త్రముల విషయములు. ముందు వచ్చిన చెవుల కంటే వెనుక వచ్చిన కొమ్ములు పొడవు గదా! అని హేళన చేయక వెనుక వచ్చినవియైన చెవులకంటే గట్టివి, పొడవైనవను మాట నిజమేనని సత్యము గ్రహించవలయునని కోరుచున్నాము. అట్లే ముందు చెప్పిన పెద్దలకంటే నేడు నీవు చెప్పుమాట ముఖ్యమా? అని అనక ముందు వెనుకతో పని లేక సత్యమొక్కటే నిత్యమైనదని తెలుసుకోవలయును.

**83. జనన మరణములకు కారకుడు ఈ జన్మ పరంపరలలో జీవుడొక్కడే కదా! జన్మ పరంపరలో ఆ జీవుడు చేసిన కర్మను బట్టి జన్మ వచ్చునని**

**పెద్దల వలన విన్నాము. ఆ జన్మ మానవ జన్మ కావచ్చు, పశుపక్షాదులు, క్రిమికీటకాదుల జన్మ కావచ్చును కాని ఇంత మానవ జనాభా వృద్ధి అగుటకు కారణము తెల్పప్రార్థన. 20/30 సంవత్సరముల నాటికి ఇప్పటికి జనాభా బాగా వృద్ధి అయినది దీనికి కారణము తెల్ప ప్రార్థన?**

జ. ఈ ప్రశ్నకు జవాబు మీ ప్రశ్నలోనే ఇమిడి ఉన్నది. జన్మ మానవ జన్మ కావచ్చు, పశుపక్షి, క్రిమి కీటకమైన కావచ్చు అన్నారు కదా! కర్మను బట్టి క్రిమి కీటక పశు పక్షి శరీరములలోని జీవాత్మ మానవ జన్మ తీసుకొని ఉండవచ్చు కదా! అందువలన మానవ జాతి సంఖ్య ఎక్కువైనది.

జీవుడు చేసిన కర్మను బట్టి జన్మ వచ్చునని మీ ప్రశ్నలో ఉన్నది కదా! ఆ మాట నిజమే. పశు పక్షి మృగాలుగ ఉన్న జీవుల పుణ్య ఫల విశేషము వలన మానవ జన్మలోనికి వచ్చాయనుకుంటాము. మీరు చెప్పినట్లు 20 లేక 30 సంవత్సరములలో మానవుల సంఖ్య ఎక్కినది. మేము చెప్పునట్లు అడవులలో పక్షుల, మృగముల సంఖ్య తగ్గినది. అసలుకు కొన్ని జాతులు చాలా తక్కువగా ఉన్నాయని ప్రభుత్వము వారు వాటిని స్వయం రక్షణ చేస్తున్నారు.

మానవుడు మానవునిగ జంతువు జంతువుగనే జన్మ తీసుకొనునని, మానవుడు జంతు జన్మలోనికి, జంతువు మానవ జన్మలోనికి రాదను వాదనను బ్రహ్మకుమారి సమాజము వారు చెప్పుచున్నారు అయిన అది అసత్యము. శాస్త్రబద్ధము కాని మాటయని తెలియవలెను.

**84. మా స్నేహితుడు గొప్ప ధనవంతుడు, వ్యాపారి, మంచి ధార్మికుడు సత్య భావములు గల వ్యక్తి తెలిసిన వారందరు మంచివాడని కొనియాడబడిన వ్యక్తి 30 సంవత్సరముల వయస్సులో అతని ఫ్యాక్టరీ కూలీలలో కొందరి వల్ల హత్య చేయబడినాడు. ఫ్యాక్టరీ కూలీలందరు చాలా మంచి వ్యక్తి అని బాధపడినారు. దీనికి అనగా ఈ అకాల దుర్మరణమునకు కారణము తెల్పగోరినాను?**

జ. ప్రతి పనికి కారణము ఒకటి ఉంటుంది. దానినే కర్మ అంటాము. కర్మ లేనిది ప్రపంచములో ఏ కార్యము జరుగదు. మీ స్నేహితుని హత్యకు బయటి రూపములు ఎన్ని ఉండిన అన్నిటికి కారణము కంటికి కనిపించని కర్మయేనని తెలియవలయును. మీ స్నేహితుడు మంచివాడు అన్నారు. అందువలన అన్ని విధముల ఆయనకు పుణ్యమే ఈ జన్మలో వచ్చి ఉంటుంది. ఇంత మంచి వానికి దాన, దయ గుణములు గలవానికి హత్యకావింపబడు దుష్కర్మ ఎందుకు పట్టిందని మీ మనస్సునందు ప్రశ్న ఉద్భవించి ఉన్నది. మనము చేయు పనులయందు దుష్కర్మ, సత్ కర్మ అను రెండు విధములగు కర్మలున్నవి. వాటినే పాప పుణ్యములు అంటాము. మీ స్నేహితుడు ఈ జన్మలో మీ మాట ప్రకారము పుణ్యమే ఆర్జించి ఉండవచ్చును. ఈ జన్మ పుణ్య ఫలము తర్వాత వచ్చు జన్మలలో ఆచరణకు వచ్చును. అందువలన అతడు సంపాదించిన పుణ్యమునకు, హత్యకు ఎలాంటి సంబంధము లేదు.

హత్యకు సంబంధమున్న కర్మ వెనుకటి జన్మలలో అతడు సంపాదించు కొన్నదని తెలియవలయును. వెనుకటి జన్మల సంచితము ఈ జన్మ ప్రారబ్ధముగ మారి హత్యాకార్యమునకు కారణమైనది. వివరముగ చెప్పవలయునంటే మనము ఈ జన్మలో చేసుకొన్న పుణ్యము గాని, పాపము గాని ఈ జన్మలోనే అనుభవించలేము. ఇపుడు కంటికి తెలియకుండ వచ్చు పాప పుణ్యములు తర్వాత జన్మలలో అనుభవానికి వచ్చును. ఈ జన్మలో మనమనుభవించు సుఖ దుఃఖములన్నియు గడచిన జన్మలలో మనము సంపాదించుకొన్నవేనని తెలియవలయును. ఉదాహరణకు మూడు నెలల శిశువుకు భయంకర వ్యాధి సంభవించి ఆ శిశువు విపరీత బాధ అనుభవించుచున్నాడు. నిజముగ ఆ శిశువు ఈ జన్మలో ఏ కార్యము చేయలేదు. పాపము కాని పుణ్యము కాని సంపాదించుకోలేదు. ఈ జన్మలో ఏ పాపము చేయని వానికి భయంకర బాధ ఎందుకు లభించినదని యోచిస్తే వెనుకటి జన్మ కర్మయే కారణమని తెలియుచున్నది. ఈ విధముగ ఈ జన్మలోని ప్రతి సంఘటన వెనుకటి జన్మలోని కర్మ కారణము చేతనే జరుగుచున్నవి.

బహుశ కొన్ని జన్మల వెనుకల మీ స్నేహితుడు ఈ జన్మలోని సంఘటనకు కారణమైన కర్మ సంపాదించి ఉండును. అది కాలక్రమమున ఈ జన్మలో అనుభవానికి వచ్చింది. ఎంతటి మంచివానికయిన వెనుకటి జన్మల పాప ఫలము వలన కష్టములు, ఎంతటి చెడ్డవానికైన వెనుకటి జన్మల పుణ్య ఫలముల వలన సుఖములు అనుభవించుట మనము చూస్తున్న సత్యమే కదా!

ఒక వైపు అనుభవానికి వచ్చి కర్మ అయిపోవుచు ఉంటే మరియొక వైపు క్రొత్త కర్మను మానవుడు సంపాదించుకొనుచున్నాడు. అందువలన కర్మ కారణము చేతనే జరిగిన హత్య కార్యములో హత్య చేసినవారు కూడ కర్మ సంపాదించు కోవడము జరిగి ఉంటుంది. తిరిగి ఆ కర్మ వచ్చే జన్మలలో వారిని కూడా హత్యకే గురి చేయును. ఇది కర్మ సిద్ధాంతము. కర్మ చేత జరిగే ప్రతి పనిని తానే చేయుచున్నానని అనుకొను ప్రతివానికి క్రొత్త కర్మవచ్చుచునే ఉండునని యోగశాస్త్రము తెలియజేయుచున్నది. అట్లుకాక కర్మ యోగమాచరించుచు ప్రపంచములో ఏ కార్యము చేసిన చివరకు హత్య చేసిన కర్మ అంటదని యోగశాస్త్రమే తెలుపుచున్నది. హత్య చేసినవారు బహుశ కర్మ యోగులై ఉండరనుకొంటాను. అందువలన వారికి తిరిగి బంధనము (కర్మ) అంటి ఉండును.

మీరు చెప్పు విధానమును బట్టి మీ స్నేహితుడు అకాల మరణము పొందినాడు. కావున ఆయనకు కాల మరణము సంభవించు వరకు వేరు జన్మకు పోక సూక్ష్మరూపముగ ఈ జన్మలోనే ఉండును. అతని దృష్టికి మీరు కనిపిస్తూనే ఉంటారు. అయిన ఆయన మీ కంటికి కనిపించడు. అంతమాత్రమున ఆయన లేడనుకోవద్దు. ఆయన మీ మధ్యనే ఉంటాడు.

**ఆదిమూలమ్ రెడ్డి, పెద్దమిట్టూరు, తమిళనాడు**

## 85. రుద్రాక్ష కాయలను ధరించుట వలన లాభమేమిటి?

జ. 'రుద్రము' అనగ నాశనము. 'రుద్ర భూమి' అనగ శరీరములు నాశనమగు భూమి, అనగ శ్మశానము. 'రుద్రుడనగ' రుద్ర భూమినందు సంచరించువాడు

శంకరుడు (శివుడు) అని అర్థము. రుద్ర భూమినందు భూత ప్రేత పిశాచములు, యక్ష కిన్నెర కింపురుష, గరుడ గంధర్వ గ్రహాలు అనేకములు నివశించుచుండును. వాటన్నిటికి రుద్రుడు అధిపతి. ఆ రుద్రుడు ధరించిన పూసలను రుద్రాక్షలని అనుచుందురు. ఆ రుద్రాక్షలను మనము ధరించుటవలన పిశాచ గణముల బాధలుండవని పూర్వమనుకొనెడివారు. రుద్రాక్షలను పిశాచ గణములు రుద్రునితో సమానముగ చూచుకొనునని పూర్వము అనుకొనెడివారు. రక్షణ నిమిత్తము రుద్రుని పేరుతో ధరించు కాయ కావున వానిని రుద్రాక్ష అనుచున్నారు. ఒక యంత్రమును (తావెత్తును) ధరించుటను కూడ రక్ష కట్టుకొనుట అని అనుచుందురు. తావెత్తులు కట్టుకొనుట కూడ పిశాచ గణ పీడల నివారణకేనని అందరికి తెలుసు. అటువంటి రక్షణ నిమిత్తమే రుద్రాక్షను కూడ కట్టుకొనెడివారు. అందువలన దానిని రుద్ర రక్ష అని కూడ విడదీసి చెప్పెడివారు. అది ఉండుట వలన రుద్రుడే తమ వద్ద నుండి రక్షణ నిచ్చునని ధైర్యము కలిగి ఉండెడి వారు. పూర్వము పిశాచ బాధలు కలవారు మరియు వాటికి భయపడు వారు కట్టుకొనెడివారు. కాలము గడచుకొలది భావనలు మారిపోయాయి. శివుడు ధరించాడు కదా అని శివభక్తులు ధరించను మొదలు పెట్టినారు. చివరకు వేదాంతులు, స్వాములు ధరించను మొదలు పెట్టారు. వీరందరిని చూచిన మానవుడు రుద్రాక్ష పిశాచ గణ నిమిత్తమని తెలియక రుద్రాక్షలు ధరించిన వారికి మ్రొక్కను మొదలు పెట్టాడు. ఈ విధముగ రుద్రాక్ష అర్థము ఏనాడో మారిపోయినది. రుద్రాక్షలు వేసుకొనుట వలన ఇంకాకొన్ని శరీర ఆరోగ్యములు కూడ చేకూరును. అన్నిటికంటే ముఖ్యముగ దయ్యాల బాధల భయముకే వాటిని వాడవచ్చును. దయ్యాలకు భయపడువారు వాడినా ఫరవాలేదు కాని జ్ఞానమున్నవారు కూడ రుద్రాక్షలు వాడుట ఆశ్చర్యముగనున్నది. ఒకరు వేశారు కదా! అని ఇంకొకరు వేసుకొనుచున్నారు. కాని నిజముగ అర్థము తెలిసివేసుకోవడము లేదు.

**కె. సీతారామయ్య, శ్రీరాముల పేట, ప్రొద్దుటూరు**

**86. పూర్వ జన్మలలోని కర్మలు ఈ జన్మలో అనుభవించక తప్పదను**

**విషయము సత్యము. అయితే ఈ జన్మలో దైవకార్యములు కాని తోటి మానవులకు ఆపదలో మంచి చేసిన, మంచి కార్యములు కాని ఇంకా మనో నిష్ఠతో చేసిన జప తపాదుల వలన ఈ జన్మలోని కర్మ తీవ్రత తగ్గదా? చేసిన పాపము ఈ జన్మలో చేసిన సత్కర్మ పుణ్యము వలన తగ్గదా? పాపమునకు పుణ్యము చెల్లుబెట్టకూడదా! తప్పనిసరిగ పాపమును అనుభవింప వలసినదేనా?**

జ. ఈ జన్మలో మంచి చేస్తే పుణ్యము, చెడ్డ చేస్తే పాపము సంభవిస్తాయి. ఈ జన్మలో ఎంత సత్కర్మ పుణ్యము చేసుకొన్న అది వరుసక్రమములో చేరి తర్వాత అనుభవానికి వచ్చును. పాపమునకు పుణ్యము చెల్లు బెట్టుట కర్మ సిద్ధాంతములో లేదు. టేపురికార్డులో శబ్దము రికార్డు అయినట్లు కర్మ చక్రమందు కర్మ రికార్డవుచుండును. టేపు తిరుగుచు ఉంటే ముందు పాడిన పాట ముందు వెనుక పాడిన పాట వెనుక వచ్చినట్లు, ముందు చేసుకొన్న పాపము కష్టరూపముగ అనుభవించిన తర్వాత ఇపుడు చేసుకొన్న పుణ్యము తర్వాత జన్మలలో సుఖ అనుభవముగ తటస్థించును. ఈ జన్మలో ఎంత దైవారాధన చేసిన, ఎన్ని పుణ్య కార్యములు చేసిన వెనుకటి కర్మను ఏ మాత్రము మాన్పలేవు. కర్మను నశింప చేయునది ఒక్క జ్ఞానాగ్ని తప్ప మరియొకటి లేదు. కర్మ నాశన వివరము తెలియవలయునంటే మా రచనలలోని **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** చదువుము.

**87. భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ "చాతుర్వర్ణం మయా సృష్టం గుణ కర్మ విభాగశః" అన్నాడు. శ్రీ స్వామి వారు కూడ కులము మతము మనము ఏర్పరచుకొన్నవేనని వ్రాసినారు. అయితే "చాతుర్వర్ణం మయా సృష్టం" అనేది వివరించవలయునని కోరుచున్నాము?**

జ. **చాతుర్వర్ణం** అని గీతలో దేవుడు చెప్పాడు. వాస్తవమే మేము కూడ ఒప్పుకుంటున్నాము. ఆయన చెప్పిన మాటలో నాలుగు పలాన కులములని ఏ మాత్రము లేదు కదా! ఆ శ్లోకములో లేని కులములను మనము ఊహించుకొని

పేర్లు పెట్టుకొని పైగా ఆయన చెప్పాడని దేవుని మీద నిందవేయడము ఏమయిన మంచిదా? ఆయన ఆ వర్ణములను కూడ **"గుణ కర్మ విభాగశః"** అన్నాడు. "కార్య విభాగశః" అనలేదు. ఈ శ్లోకమేకాదు గీతలోని చాలా భాగము భూమి మీద ఇంత వరకు అర్థము కాలేదని మా భావన. మనము ఆపాదించుకొన్న బ్రాహ్మణ వైశ్య క్షత్రియ శూద్ర కులములు కాకపోతే చాతుర్వర్ణం అను పదము యొక్క భావము ఏమిటని మీకు సంశయము వచ్చి ఉంటుంది.

మన శరీరములో కర్మ ఉన్నవి, కర్మ లేనివి మొత్తము నాలుగు భాగములు ఉన్నవి. కర్మ ఉన్నవి మూడు, కర్మ లేనిది ఒక్కటి. ఈ మొత్తము నాలుగు భాగములను గుర్తించుటకు వీలుగ ఉన్న నెమలి పింఛమును కృష్ణుడు ధరించి చూపించాడు కూడ. వీటినే బయటి నుంచి 1. తామస గుణ భాగము, 2. రాజస గుణ భాగము, 3. సాత్త్విక గుణ భాగము, 4. గుణ రహిత (ఆత్మ) భాగము అంటాము. వీటిని కర్మ గుణముల చేత విభాగించి చెప్పుకుంటున్నాము. అందువలననే **"గుణ కర్మ విభాగశః"** అని గీతయందన్నారు. మన శరీరములోని నాల్గు భాగములను పటములో చూడవచ్చును. బయటి నుండి మొదటిది తామస గుణభాగము, రెండవది రాజస గుణభాగము, మూడవది సాత్త్విక గుణభాగము నాల్గవది గుణరహిత భాగము. మూడు భాగములలో గుణములుండును, నాల్గవ భాగములో ఆత్మ ఉండును. వీటిని బట్టి మనుషులను నాల్గు వర్ణములుగ విభజించవచ్చును. 1. తామసులు, 2. రాజసులు, 3. సాత్త్వికులు, 4. యోగులు. ఇవియే దేవుడు చెప్పిన నాలుగు వర్ణములు. ఇవియే దేవుడు నెమలి పింఛము ద్వార చూపిన నాలుగు వర్ణములు.

దేవుడు ఏమి తెల్పిన జ్ఞాన పరముగ తెల్పును కాని మానవులు ఏర్పరుచుకొన్న కుల మతములను తెల్పునా! ఆయనే మానవులందు కుల భేదములు కల్పించి వీనికి మంచి పనులు, వీనికి చెడ్డ పనులని నిర్ణయించునా!! దేవుడు ఏమి తెల్పిన ఉన్నత విషయములనే తెల్పును.

**88. గృహ వాస్తుశాస్త్రము యొక్క ఫలితములు గృహ యజమాని జీవితము మీద పని చేయునా? గృహ యజమాని జాతకము బాగుంటే ఇంటి వాస్తు దోషములు యజమాని జీవితము మీద పని చేయునా?**

జ. మానవుడు పుట్టినప్పటి నుండి మరణించువరకు ప్రారబ్ధ కర్మ ఆధీనములో ఉండును. ప్రతి క్షణము ప్రతి పనిని కర్మయే నడుపుచుండును. యోగ శాస్త్రరీత్యా జీవుని సుఖపెట్టుటకు దుఃఖపెట్టుటకు కర్మయే కారణమై ఉన్నపుడు గృహఫలితము మానవుని సుఖదుఃఖములకు కారణమనుట పూర్తి అసత్యము. మానవుని జాతకమును ఏ ఫలితములు ఏ దోషములు మార్చలేవు. అలా మార్చగలిగే శక్తి మానవుని చేతిలో ఉంటే కర్మతో పనిలేకనే తమంతట తామే జీవితమును సుఖవంతము చేసుకోవచ్చును కదా! జరుగునంత వరకు తన తెలివి గొప్ప అని, జరగనపుడు కర్మయను మానవుడు సృష్టించుకొన్న గృహములు జాతకములను మార్చగలవనుమాట హాస్యాస్పదము. కర్మ తప్ప ఏ ఫలితములు మానవుని మార్చలేవు. "సర్వం కర్మమయం" అని తెలియవలెను.

**89. వాస్తు శాస్త్ర దోషము ఉంటే ఆ ఇల్లు వదలివేయవలెనా? ఆ దోషములకు ఏదైన పరిహారమున్నదా? మత్స్య కూర్మ యంత్రముల చేత దోషములను పరిహారము చేయవచ్చునా?**

జ. వాస్తు శాస్త్రమన్నది జ్యోతిష్య శాస్త్రములోని ఒక భాగము. అది కొలతలు, ఆయములు, మూలలు అను పద్ధతిలో ఉండదు. మానవుని వాస్తు జాతక చక్రమందు నిర్ణయించబడి ఉండును. దానిని బట్టి వీనికి పలానా రకము ఇల్లు ఉండునని చెప్పవచ్చును. ఒక వేళ జాతకములో వాస్తునందు దోషమున్న వీని ఇల్లు బాగుండదు. అందులో సౌకర్యములు ఉండవు అని కూడ చెప్పవచ్చును. వాస్తు దోషములుంటే జాతకములోనే ఉండును. అటువంటి దోషము ఉంటే అవి తూచ తప్పక జరుగును, ఏ మానవుడు తప్పించకోలేడు. కొందరు ఇంటిలో దోషములున్నవని వాటిని శాంతుల ద్వార లేక కొలతలు, మూలలు మార్చుట

ద్వార సవరించవచ్చుననుచుందురు. జాతకచక్రములో కర్మ బాగలేనంత వరకు ఎవరు ఏ శాంతుల ద్వారా, ఏ యంత్రముల ద్వార వాటిని నివారింపలేరు. యంత్రములు భూత ప్రేత పిశాచముల మీద పని చేయును. కాని ఇంటి యజమాని జాతక చక్రము (కర్మ చక్రము) మీద పని చేయవు.

పనిలేని పండితులు కొందరు వాస్తుశాస్త్రమని ఒక దానిని సృష్టించి దానికి వీదులు, సందులు, మూలలు, కొలతలు, హెచ్చుతగ్గులని చెప్పి మానవునికి అనుమానములు కల్గించి, వాటిని సరి చేయుటకు వాటి వివరము తెలిసిన వారము మేమున్నామని, గ్రుడ్డిగ నమ్ము ప్రజలను తమ చుట్టు త్రిప్పుకొనుచు వ్యాపార జీవితమును గడుపుచున్నారు.

**స్థాన బలము గాని, తన బలము** కాదని వేమన చెప్పిన పద్యములు కూడ ప్రమాణముగ చూపించుచు, తన జాతక బలముకంటే స్థానమైన ఇల్లు బలము గొప్పదని బుకాయిస్తున్నారు. తానంటే జీవాత్మనా? లేక శరీరమా? శరీరము నివశించునది ఇల్లు అయితే, జీవాత్మ శరీరములోని గుణచక్రములో నివశించునది. వేమన చెప్పుచున్నది శరీరమునకా, లోపల ఉన్న జీవాత్మకా అని తెలియలేనివారు ఆయన పద్యములు ఎందుకు వాడుకోవాలి? వేమన చెప్పినది జాతకచక్రములోని 12 స్థానముల బలమేకాని బాహ్యమైన ఇల్లు బలము కాదు. జ్యోతిష్యశాస్త్రములో 4వ ఇంటిలో గురువు, 5వ ఇంటిలో శని అనుట లేక 4వ స్థానములో గురువు, 5వ స్థానములో శని అనుట వినుచునే ఉందుము గదా! ఇల్లు, స్థానము అంటే మేష వృషభాది స్థానములనే ఇల్లులని తెలియవలయును.

వాస్తు శాస్త్రీయమైనది కాదు కావున జ్యోతిష్యశాస్త్రమునకు సంబంధము లేదు. ప్రత్యేక శాస్త్రముగ వెలసిన గృహ వాస్తుశాస్త్రము సిద్ధాంతములతో కూడుకొన్నది కానే కాదు. ఇది నిరూపణకురాని మాటలతో కూడుకొన్నది. కావున ఇది శాస్త్రము కాదు. మానవుని ఇల్లు యొక్క విషయము జ్యోతిష్య శాస్త్రము ప్రకారము జాతక కుండలిలోనే ఉండునని దానినుండే ఇంటి ఫలితములు, దోషములు గ్రహించనగునని తెలియవలెను.

**90. మానవుడు చేసుకొన్న కర్మ వలన జన్మ వచ్చును. పూర్వ కర్మవలన ఈ జన్మలో ఫలితములు జరుగుచుండును అని తమ బోటి మహాత్ములు చెప్పుదురు. అటువంటి పరిస్థితులలో గృహవాస్తు దోషము మానవుని జీవితములో జన్మతః వచ్చిన కర్మల మీద పని చేయునా?**

జ. కర్మసిద్ధాంతముల ప్రకారము కర్మ వలన జన్మ, కర్మ వలన జన్మలోని సుఖదుఃఖములు మొదలగు జీవితము ఉండును. అటువంటి పరిస్థితులలో జన్మతః వచ్చిన కర్మను ఎవరూ మార్చలేరు. ఏ దోష నివారణలు మానవుని కర్మ మీద పని చేయవు. ఇంతకు ముందు చెప్పాముగ అసలు వాస్తు దోషములు లేవు, కర్మ దోషములే మానవునకున్నవని. నాకు తెలిసిన ఒక విషయము ఉదాహరణకు తెల్పుచున్నాము. ఒక గ్రామమందు ఒక ధనికునికి కర్మ ప్రకారము కష్టములు మొదలు పెట్టాయి. ఆ సమయములో అతనికి తను నివశించు ఇంటిలో దోషమున్నదని వాస్తు తెలిసిన వారు చెప్పారు. అపుడా ఇల్లు వదలి వాస్తు శాస్త్రవేత్తల సలహామేరకు క్రొత్త ఇల్లు కట్టించాడు. ఆ ఇంటిలో కాపురము చేసిన అతనికి ముందు వచ్చులాగానే కష్ట నష్టములు తరచు సంభవించుచు ఉండెను. తెలిసిన వారిని అడిగితే దశ బాగలేదన్నారు. మరి కొందరి సలహామేరకు ఆ ఇల్లు కూడ వదలి మరియొక ఇల్లు చేరిన అతనికి అలాగే కష్టములుండుట వలన కర్మే కారణము గాని ఇల్లుకాదని ఆయన తెలుసుకొన్నాడు.

జాతక చక్రములోని స్థానముల బలమే కాని, నా బలమేమి కాదని, నేను శరీరము ద్వార వచ్చు కష్ట సుఖముల అనుభూతిని అనుభవించు జీవాత్మనని గ్రహించుకొని ఒక్క జ్ఞానాగ్ని తప్ప కర్మను ఏ క్రియలు మార్చలేవని తెలియవలెను.

**డి. అనూరాధ, ధర్మవరము**

**91. శ్రీ రామక్రిష్ణ పరమహంస, ఆయన శిష్యులు, శ్రీ వీర బ్రహ్మేంద్ర స్వాముల వారు విగ్రహారాధకులే. విగ్రహారాధన కూడదని నిరసించి బ్రహ్మ సమాజములో చేరిన కేశవ చంద్రసేన కూడ శ్రీ పరమహంస వల్ల**

**మారిపోయారు. విగ్రహారాధన మూలంగా బ్రహ్మమునే చేరిన గొప్ప మహానుబావులంతా మీ దృష్టిలో ఎటువంటి వారు. విగ్రహారాధన ఎందువలన చేయరాదు?**

జ. మేము ఎప్పుడు విగ్రహారాధన మంచిది కాదు చేయవద్దు అని చెప్ప లేదు. మా ఉద్దేశ్యమును మీరు పూర్తి అవగాహన చేసుకోలేదని తెలుపుచున్నాము. మా ఉద్యేశమును మరొకమారు మీకు తెలుపుచున్నాము. అర్థములేని విగ్రహారాధన చేయకూడదు. అర్థము తెలిసి చేయండి అన్నాము. అర్థములేని ఆచరణ నిష్ప్రయోజనము కదా! అందువలన ఆచరణకు అర్థము తెలిసినపుడు తెలుసు కొనునంతవరకు ఆ పని మానివేసి తెలిసిన తర్వాత చేయవచ్చునన్నాము. ఎద్దు ఈనిందంటే గాటికి కట్టివేయమనడము సమంజసమేనా? కాదు కదా! ఎద్దు ఏ విధముగ ఈనునని వివరణ తెలియక కనిపించిన దూడను కట్టి వేస్తే మంచిది కాదని చెప్పడము తప్పు కాదు. దూడను ఆవు ఈనిందని తెలిసి కట్టి వేస్తే పరవాలేదు. ఉన్నది ఒకటయితే అనుకొన్నది వేరొకటయితే అది పొరపాటని చెప్పడములో మా తప్పులేదు. నేటి సమాజములో దేవాలయములు కోర్కెలు కోరు కేంద్రములుగ, పూజార్లు దేవుళ్ళకు రెకమండెషన్ చేయువారిగ, దేవుళ్ళు కోర్కెలు తీర్చువారిగ, మనము సమర్పించు నైవేద్యములు, మొక్కుబడులు వారికి ఇచ్చు ప్రతి ఫలితముగ లెక్కించి పూజలు చేయడముకంటే పూర్తి మానివేయడము మంచిది. ఆ విధముగ పూజలు చేసిన దైవత్వమునకు ఏమాత్రము అర్థమే లేకుండ పోవును.

కొబ్బరి కాయలు (టెంకాయలు) కొట్టమన్నాము కాని అర్థము తెలిసి, దీపము పెట్టమన్నాము కాని అర్థము తెలిసి, నైవేద్యము పెట్టమన్నాము అది కూడ అర్థము నెరిగి, అట్లే విగ్రహమును ఆరాధించమన్నాము. పూర్వకాలములో పెద్దలు ఏ దృష్టితో దేవాలయములు స్థాపించారో ఆ భావముతోనే పూజలు చేయమన్నాము. భావములేని పూజ, అర్థము తెలియని ఆచరణ వ్యర్థమన్నాము.

కోర్కెల నిమిత్తమే దేవుళ్ళు దేవాలయములు పూజలు అంటే వాటిని పూర్తి నిరసిస్తాము. మీరు పూర్తి దేవాలయముల విషయము విగ్రహారాధన విషయము తెలియవలయునంటే మా రచనలలోని **"దేవాలయ రహస్యములు"** అను పుస్తకమును చదవండి.

**92. సమాజములో శకున అపశకునాలు ఎక్కడ చూచిన ఉన్నాయి. బల్లి మీదపడితే స్నానము చేయాలంటారు. వాస్తవముగ శకునములున్నవా?**

జ. వాస్తవముగ చెప్పాలంటే శకునములనునవి మూఢ నమ్మకములు. మనము చేసుకొన్న కర్మ ప్రకారము ప్రతిది జరుగును. చెడ్డ జరిగిన మంచి జరిగిన అది అంతయు మన కర్మ కారణము చేతనే జరుగుచున్నది. శకునములు మన కర్మను మార్చలేవు. నిత్య జీవితములో జరుగు మంచి చెడును శకునములతో పోల్చుకుంటే నిజమేననిపించును. ప్రతి దినము మనకు మంచి చెడ్డ జరుగుచునే ఉన్నది కదా! అయితే ప్రతి దినము మంచి చెడ్డ శకునములు మనకు కనిపించలేదు కదా! అందువలన వాస్తుశాస్త్రమున్నట్లే శకున శాస్త్రము కూడ ప్రొద్దుపోని పెద్దలు తయారు చేశారు. వాస్తవముగ అవి శాస్త్రములు కావు. వాటిని తమ బోటివారు నమ్మ వలసిన పని లేదు. బల్లి చర్మము మీద చిన్న చిన్న విష గ్రంధులుండును. అది పడుట వలన దాని విషము మన చర్మమునకు అంటుకొని ఉండవచ్చు, అందువలన స్నానము చేయమన్నారు. ఈ వివరము తెలియక దానికి ఒక శకునము సృష్టించారేమో కాని స్నానము చేయుట వలన భౌతికశాస్త్రము ప్రకారము మంచిది.

**93. వివాహ శుభ కార్యములలో పట్టు బట్టలను ధరించడము శుభముగ తలుస్తారు, పవిత్రము అంటారు. పట్టు పురుగుల్ని చంపడము వలన వస్తుంది పట్టు అది హింస కాదా? హింస వలన తయారు చేయబడిన పట్టు ఎందువలన పవిత్రముగ భావింపబడుచున్నది.**

జ. పట్టు బట్టలు పవిత్రమనుటకు ఏ ఆధారము లేదు. డబ్బున్న వారు హోదాను చూపుకొనుటకు పట్టు బట్టలు పనికి వస్తాయి కాని పవిత్రతను చూపుటకు కాదని తెలియవలయును.

**94.** మీరు "ప్రబోధాత్మజమ్"లో శాస్త్రము అనగ ఎప్పటికి మారనిది, నిరూపణకు వచ్చునది, హేతువాదనకు నిలబడి సమాధానము చెప్పునదని వ్రాసినారు. శాస్త్రాలలో జ్యోతిష్య శాస్త్రము కూడ ఒకటని మీరే అన్నారు. అటువంటపుడు జ్యోతిష్య శాస్త్రము హేతు వాదమునకు ఎదురొడ్డి నిలచి సమాధానము చెప్పగలగాలి. కాని "సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు" గ్రహీత మరియు బల్గేరియా ప్రభుత్వ "జార్జి డిమిటోవ్" స్వర్ణ పతకము గ్రహీత అయిన శ్రీ జె. నరేంద్రదేవ్ గారు **30** సంవత్సరములు కృషి చేసి వ్రాసిన "విశ్వ విజ్ఞాన దర్శిని" అను గ్రంథములో జ్యోతిష్య శాస్త్రమనే విభాగమునందు ఈ విధముగ తెలిపారు.

## శాస్త్రవేత్తల ఖండన

సూర్య చంద్ర గ్రహాల కదలికను బట్టి మానవ జీవిత విధానము ఉండుననుట అబద్ధమని, జ్యోతిష్యము అశాస్త్రీయమైనదని, ఆధారము ఏమి లేని కట్టు కథ మాత్రమేనని, 192 మంది శాస్త్రవేత్తలు వివరిస్తు "అబ్జెక్షన్ టు ఆస్ట్రాలజీ" అనే ప్రకటన విడుదల చేశారు. దాని పై సంతకము చేసిన వారిలో ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఖగోళ శాస్త్రజ్ఞులు, అంతరిక్ష పరిశోధనల వివిధ రంగాల్లో నిష్ణాతులు ఉన్నారు. ఆ పత్రము మీద సంతకము చేసిన వారిలో 19 మంది "నోబుల్" బహుమతి పొందిన శాస్త్రజ్ఞులు కూడ ఉన్నారు. జ్యోతిష్యానికి సైంటిఫిక్ ఆధారము ఏమాత్రము లేదని వారు తమ ప్రకటనలో తెలియజేసారు.

పై విధముగ ఆ గ్రంథములో ఉన్నది. ప్రజలు దేనిని నమ్మాలి? ప్రజలు అసలు ఏ మార్గములో పోవాలో తెలియక వారి వారి స్వంత అభిప్రాయము ప్రకారము నడచుకొంటూ పోతూ ఉంటే ఇందులకు బాధ్యులెవరు? ఆధారము లేదని చెప్పిన శాస్త్రవేత్తలా? శాస్త్రవేత్తలకు జవాబు చెప్పలేని జ్యోతిష్యులా? ఎవరు బాధ్యులు? దయచేసి సర్వజ్ఞులు

**మరియు సత్యమునే ప్రకటించు మీరు ఈ విషయమై పూర్తి వివరాలతో వివరిస్తారని ఎదురు చూస్తుంటాము?**

జ. మీరు చాలా పెద్ద ప్రశ్న వేసి మా మెదడుకు కొద్దిగా పని కల్పించారు. జవాబు అడిగింది మీరైన నేను చెప్పవలసింది మేథాశక్తిలో అతిరథ మహారథులైన శాస్త్రజ్ఞులకు నిజముగ చెప్పవలసిన బాధ్యత జ్యోతిష్య శాస్త్రవేత్తలది. నేను జ్యోతిష్య శాస్త్ర పరిశోధకుడను గాను, ఆ శాస్త్రవేత్తను గాను. నేను కేవలము యోగ శాస్త్ర పరిశోధకుడను. ఇది మా యోగశాస్త్రములోని ప్రశ్నకాదు. అయినప్పటికి మీ ప్రశ్న సమంజసమైనది కావున మీ ప్రశ్నకు జవాబు చెప్పుచున్నాను.

ప్రజలను తప్పుదారి పట్టించుటకు బాధ్యులు జ్యోతిష్య శాస్త్రమును విమర్శించిన శాస్త్రజ్ఞులా? జ్యోతిష్యులా? అన్నారు కదా! సత్ విమర్శ అనగ హేతుబద్ధముగ విమర్శించుటలో శాస్త్రజ్ఞులది తప్పులేదు. వారికి హేతు బద్ధముగనే సమాధానము చెప్పలేని జ్యోతిష్యులదే బాధ్యత. కాని నేటి కాలములో ఎవరు జ్యోతిష్యులో తెలియలేకున్నాము. చిలకశాస్త్రమని చిలక చేత చీటి తీయించు వారిని మొదలుకొని గవ్వలు వేసి చెప్పువారు, పుస్తకములో పుల్ల పెట్టి చెప్పువారు రకరకములైన జ్యోతిష్యులు తయారై జ్యోతిష్య శాస్త్రము చీడ బట్టి పోయినది. ఆదిత్యాది గ్రహముల వివరము తెలిసి వాటి మూలముగనే జ్యోతిష్యమున్నదని తెలిసిన వారు కూడ కలరు. నిజమైన జ్యోతిష్యులు సూర్య చంద్ర గ్రహములను ఆధారము చేసుకొన్నవారే. వారిలో జ్యోతిష్యశాస్త్రమును క్షుణ్ణముగా తెలిసినవారు కొందరుండగ, అనేక కారణాల వలన పూర్తి శాస్త్రమును తెలియని వారు కూడ కొందరున్నారు. ముఖ్యమైన కారణము ఆర్థిక లోపము, ఏ ప్రభుత్వము జ్యోతిష్య శాస్త్రమునకు విలువ ఇవ్వలేదు. అందులో పరిచయమున్న వారిని ఎవరు పోషించడములేదు. జ్యోతిష్యులంటే పొట్ట కూటికి ఏవో నాలుగు మాటలు చెప్పువారిగ సమాజము లెక్కించుచున్నందులకు అందరు ముందుకు పోలేక పోయారు. ఏది ఏమైన ప్రజలలో జ్యోతిష్యులపైన నమ్మకమున్నది. జ్యోతిష్యులకు సమాజములో విలువ ఉన్నది. ఇది జ్యోతిష్యుల విషయము.

మరి ఖగోళ శాస్త్రజ్ఞుల విషయమందామ, వారు విస్తృతమైన పరిశోధనలు చేయుచు చివరకు అనంతాకాశములోని **"బ్లాక్ హోల్"** నే కనుగొనగలిగారు. పూర్వకాలము నుండి వీరు కూడ అనేక రకములైన పరిశోధనలు చేయుచునే ఉన్నారు. ఒక ఖగోళ శాస్త్రజ్ఞుడు కనుగొన్న విషయము అది అప్పటికి సత్యమే అన్నట్లు నిరూపించబడిన, మరియొక శాస్త్రజ్ఞుడు ఇంకా గొప్ప పరిశోధన చేసి ముందు కనుగొనబడిన సిద్ధాంతమునకు అనుసంధానమైన మరికొన్ని విషయము లను తెలుసుకొని నిరూపించి మొదటి శాస్త్రజ్ఞునికంటే ముందుకు పోవుచున్నాడు. అపుడు ముందు కనిపెట్టబడిన సిద్ధాంతము ఖండింపబడి దానికంటే సత్యమైన సిద్ధాంతము బయల్పడుట వలన ముందు చేయబడిన సిద్ధాంతము తెరమరుగై పోవుచున్నది. ఈ విధముగ శాస్త్రవేత్తలు బహిర్గతము చేసిన ఎన్నో సిద్దాంతములను మార్చివేయగల క్రొత్త సత్యమైన సిద్ధాంతములు కనుగొనబడుచున్నవి.

ఉదాహరణకు 05-08-1988 ఉదయము వార్తాపత్రికలో ప్రచురించిన "న్యూటన్ సిద్ధాంతానికి సవాల్" వార్త చదివితే మేము చెప్పినట్లు సత్యము కాని సిద్ధాంతములు మాయమవుచుండునని తెలియును. 300 ఏళ్ల క్రితము ప్రతిపాదించిన గురుత్వాకర్షణ సిద్ధాంతము పూర్తిగ సత్యము కాదని నేటి శాస్త్రవేత్తలు తెలుపుచున్నారు. గ్రీన్ లాండ్‌లోని మంచు ప్రాంతములో భూమి ఉపరితలము నుండి ఒక మైలు లోతు వరకు వేసిన పెద్ద రంధ్రమందు శాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనలో లోపలికి వెళ్ళే కొద్ది గురుత్వాకర్షణలో మార్పులు వస్తాయన్న న్యూటన్ సిద్ధాంతము నిరూపణకు రాలేదట. ఈ విధముగా కొన్ని సిద్ధాంతములు ఖండింపబడుటకు కారణము సిద్ధాంతమునకు పూర్తి అనుసంధాన విషయములు తెలియకపోవడమే. అన్ని విషయములు తెలిసిన రోజు ముందు సిద్ధాంతము మారి పోవును. ఇవి ఖగోళ శాస్త్రజ్ఞుల అగచాట్లు.

ఖగోళ శాస్త్రవేత్తల విషయమును అవగాహన చేసుకొంటే ఆ శాస్త్రమునందు కొన్ని విషయములలో సత్యమును తెలుసుకొని ప్రకటించారు. ఇంకా ఎన్నో విషయములలో ఖగోళ శాస్త్రజ్ఞులు తెలుసుకోవలసి ఉన్నది. ఎన్నో ఖగోళములో

ఊహాగానాలుగనే నిలిచిపోయిన విషయములున్నవి. ఉదాహరణకు ఉత్తర అమెరికాకు దాదాపు 1500 మైళ్ల దూరమున అట్లాంటిక్ మహాసముద్రములో **"బెర్ముడా"** అను పేరుగా గుర్తించిన ముక్కోణాకారము గల సముద్ర స్థలము యొక్క ప్రభావము నేటికి అంతుదొరకడము లేదు. సూర్య కుటుంబములోని గ్రహ కిరణములుపడు భూగోళమున కొంత సముద్ర భాగములోని విషయము అగమ్యగోచరముగా శాస్త్రజ్ఞుల పాలిట నిలిచిపోయినది. ఆ సముద్ర స్థల పరిధిలోనికి పోవు నావలుకాని, పైన ఆకాశములో పోవు విమానములుగాని, అదృశ్యమై పోవడమే అక్కడి విశేషమైనపుడు, అది అర్థము కానపుడు, ఖగోళమున కంటే ముందు కనుగొనబడిన జ్యోతిష్యము ఎట్లు అర్థమగును. "ఫ్లైయింగ్ సాసర్స్" ఎగిరే పల్లాలను గురించి చాలాసార్లు విన్నాము. వాటిని ఒక సందర్భములో యుద్ధ విమానాలు కూడ వెంబడించాయి. వాటిని పట్టుకోవడమో లేక కూల్చి వేయడమోనని వెంబడించిన వారికి వాటికి సమీపించగానే నీలిరంగు పొగ వాటినుంచి వచ్చి అవి అదృశ్యమైనట్లు కూడ చదివాము. వాటిని గూర్చి కూడ ఊహాగానాలే ఉన్నాయి.

ఈ విధముగ ఎన్నో ఖగోళములో తెలియని విషయములు పెట్టుకొని శాస్త్రములలో ఒకటయిన జ్యోతిష్య శాస్త్రమును ఖండించడము సమంజసముకాదు. పైన తెలిపిన విషయములకన్నిటికి జవాబు చెప్పలేక పోయిన ఖగోళ శాస్త్రమునకు అబ్జెక్షన్ మేము కూడా ప్రకటించవచ్చును కదా! కాని మేము ఏ శాస్త్రమును తీసివేయము. శాస్త్రము నేడు అర్థముకాక పోయిన రేపయిన అర్థమగును. శాస్త్రము ముమ్మాటికి సత్యమైనది. కాని దానిని అర్థము చేసుకొనుటకు కొంత సమయము పట్టును. దానిని పూర్తి తెలుసుకొను ఓపిక లేక శాస్త్రమేలేదంటే ఏమి బాగుండును. ఎప్పుడు జ్యోతిష్యశాస్త్రము అబద్ధమగునో అపుడు ఖగోళ శాస్త్రము కూడ అబద్ధమగును. ఆరు శాస్త్రములు ఒక దానికొకటి అనుసంధానమైనవి అందువలన ఏ శాస్త్రము ఖండింపబడదు.

జ్యోతిష్య శాస్త్రము రెండు భాగములుగ ఉన్నది. కొంత గణిత శాస్త్రముతో కూడుకొని ఉన్నది. మరికొంత శాస్త్ర ఫలితముతో కూడుకొని ఉన్నది. నేటి కాలములో జ్యోతిష్య శాస్త్రఫలిత భాగము జ్యోతిష్యులకు పూర్తి అవగాహన లేక పోవుటచే గ్రహముల స్థితిగతుల బట్టి ఈ ఫలితము జరుగుచున్నదని చెప్పి నిరూపించలేక పోవుచున్నారు. అందువలన ఖగోళశాస్త్రజ్ఞులు గ్రహములకు మానవుని జీవితఫలితమునకు సంబంధములేదని వాదించి ఉండవచ్చును.

ముఖ్యముగ తెలుసుకోవలసిన విషయము ప్రతి జీవరాసి తల భాగములో సూక్ష్మముగ ఉన్న 12 భాగముల చక్రములో 12 గ్రహములు ప్రతిబింబించి ఉన్నాయని వాటి ద్వార ప్రతి జీవరాశి కదలికలు జరుగుచున్నవని, ఆకాశముననున్న గ్రహములను మానవున్ని బాహ్యముగ చూచిన మధ్యనగల సంబంధము తెలియదని అంతమాత్రమున జ్యోతిష్యము అబద్ధముకాదని ఖగోళ శాస్త్రవేత్తలకు తెలియ జేస్తున్నాము.

**95. మాంసాహారము వలన తామస గుణాలు వచ్చే అవకాశ ముందంటారు. నేను మాంసాహారము మానివేశాను. గోవుకు పులికి ఉన్న తేడా వాటి ఆహార మూలంగానే అనిపిస్తున్నది. ఇదే ప్రశ్న ఎవర్నో అడిగితే "ఏసు ప్రభువు మాంసాహారే కదా! ఆయనలో ఎంతో గొప్ప దేవుని గుణాలున్నాయి ఏమంటారని ప్రశ్నించారు" సమాధానము చెప్ప లేక పోయాను. మీరు సందేహాన్ని తీరుస్తారని ప్రార్థిస్తున్నాను.**

జ. మనము తీసుకొను ఆహారము కేవలము స్థూల శరీరమునకే సంబంధ మగును. శరీరము స్థూల సూక్ష్మమని వేరయినపుడు ఆహారములు కూడ వేరు వేరుగ ఉన్నవని తెలియవలయును. మనము తీసుకొను ఆహారములో శరీర పోషక పదార్థములుండును. అవి జీర్ణింపబడి చిన్న ప్రేవుల ఆంత్ర సూచకముల నుండి కాలేయము చేరి అక్కడ శుద్ధిగావింపబడి తర్వాత శరీర ధాతువులలో చేరి శరీర ఆరోగ్యమును కాపాడును. తినెడి ఆహారములను బట్టి శరీర ఆరోగ్య

అనారోగ్యములు, బలము బలహీనములుండును. కాని తినెడి ఆహారము మనస్సును నిగ్రహింప చేయలేదు, బుద్ధిని మార్చలేదు. గుణములను స్థంబింప చేయలేదు. ఆహారమునకు మనస్సుకు గుణములకు ఎలాంటి సంబంధము లేదు.

మంచి వారి సహవాసము, మంచి వినుట, మంచిని చూచుట, సద్బోధలు సత్ సాంగత్యము ఇవియే మనస్సుకు మంచి ఆహారము. వీటి వలన మనస్సు మంచిగ మారి మంచి గుణములే అలవడును. చెడ్డను చూచుట వినుట చెడ్డవారి సహవాసము అజ్ఞాన బోధలు ఇవి అన్నియు మనస్సుకు చెడ్డ ఆహారము. వీటి వలన మనస్సు చెడ్డగ మారి చెడు గుణములే అలవడును. స్థూల శరీరమునకు ఆహారము ప్రధానమైనట్లే సూక్ష్మమైన మనస్సు బుద్ధికి అలవాట్లు ఆహారముగ ఉన్నవని తెలుసుకొనుము.

గీతయందు సాత్త్వికాహారముచే సాత్త్విక గుణములు, రాజసాహారముచే రాజస గుణములు, తామసాహారముచే తామస గుణములు కల్గునని ఉన్నట్లు చాలామంది తెలుపుచున్నారు. సంస్కృతమును తెలుగులోనికి అనువదించిన స్వాములు కొందరు గీత యందు ఆహారమును బట్టి గుణములున్నాయని వ్రాశారు. తెలియని వారందరు అదియే నిజమని నమ్ముచున్నారు. సంస్కృతపాండిత్యము గల గురువులు కూడ ఆ విధముగనే చెప్పి గీతను వారికి అనుకూలముగ మార్చుకొన్నారు.

గీతయందు గుణముల బట్టి ఆహారముందని దేవుడు తెలిపినాడు. కాని ఆహారమును బట్టి గుణములున్నాయని తెలుపలేదు. "సాత్త్విక ప్రియాః" అంటే సాత్త్విక గుణము కల వారికి ప్రియమైనదని ఎందుకు యోచించకూడదు. అట్లే తామస ప్రియమ్ అన్నపుడు ముందు గుణముల వలన ఆహారము మీద ప్రేమ వస్తా ఉందని ఎందుకు అర్థము చేసుకోకూడదు.

కర్మచేత సర్వము లభించుచున్నది. అట్లే ఆహారము కూడ లభించుచున్నది. నీకు మంచి ఆహారము మీద ప్రీతి ఉండినప్పటికి కర్మాను సారము అది

లభించనపుడు, చెడ్డ ఆహారమే లభించినపుడు, ప్రీతిని బట్టి సాత్త్విక గుణము కలవానిగనే లెక్కించుకోవలయును. కాని కర్మ వశమున చెడ్డ ఆహారము తిన్నంత మాత్రమున తామసునిగ లెక్కించకూడదు. అట్లే చెడ్డ ఆహారము మీద ప్రీతి ఉండిన, కర్మరీత్యా మంచి ఆహారమే లభించిన, వానిని మాత్రము తామసునిగనే లెక్కించవలయును. కాని సాత్త్వికునిగ లెక్కించ కూడదు. ప్రీతిని బట్టి గుణమును, కర్మను బట్టి ఆహారములు ఉండునని తెలియవలయును. గీతయందు కూడ తినువాడు అని చెప్పక ప్రీతి గలవాడు అని చెప్పుటను గమనించవలెను.

యోగులు మిత ఆహారము తీసుకోవలయునని గీత యందు దేవుడు చెప్పాడు. కాని పలానా ఆహారము తీసుకొమ్మని, పలానా ఆహారము తీసుకోవద్దని తెలుపలేదు. దేవుడు మితాహారమన్నాడు కాని అంతకు మించి తెలుపలేదే! తెలియకనా!! సర్వము తెలుసు కనుక!!! కర్మ వలననే మంచి చెడు ఆహారము లభించునని తెలుసు కనుక ఆయన ఆహార నియమములుంచలేదు. అనుభవరీత్య తెలుసుకొనిన మంచి ఆహారమును తీసుకొను ధనికులంతా సాత్త్వికులుగా ఉన్నారా? లేరు కనుక ఆహారమును బట్టి గుణములు లేవని తెలియుచున్నది. చెడ్డవానికైన మంచి ఆహారము లభించుట వాని పుణ్యమని తెలియుచున్నది. మరియు ఒకే రక ఆహారమును భుజించు సైనికులందరికి ఒకే గుణము లేదు. కనుక ఆహారమును బట్టి గుణములు లేవని, గుణములను బట్టి ఆహారము మీద ప్రీతి ఉందని, ఆహారము లభించుట కర్మను బట్టి ఉండునని తెలియవలయును.

**నర్మదమ్మ, తాడిపత్రి**

**96. సూక్ష్మములో మోక్షమని అంటారే నిజమేనా?**

జ. సర్వ ప్రపంచమునకంతటికి అధిపతి, సర్వాంతర్యామి, అనంతుడైన పరమాత్మ యొక్క సాకారము (మానవరూపు)ను ఎవడయితే కనుగొనగల్గునో వానికి ఏ యోగ సాధనతో, ఏ జ్ఞాన విషయములతో సంబంధము లేకనే, ఎటువంటి కృషి చేయకనే మోక్షము పొందగల్గును. దానినే సూక్ష్మములో మోక్షమంటారు.

కొన్ని జన్మల సహితము కృషి చేసిన లభించని మోక్షము సులభముగ లభించడమునే సూక్ష్మములో మోక్షమని అంటారు. ఉదాహరణకు భీష్ముడు అటువంటి మోక్షమునే శ్రీకృష్ణ పరమాత్మ ద్వార పొందగలిగాడు.

**పెద్దకోట్ల మోహన్, ధర్మవరము**

**97. మానవుడు సంతతి కోసము ఎందుకు తాపత్రయపడుచున్నాడు?**

జ. మానవునిలో ఆరు ముఖ్య గుణములున్నవి. అందులో ప్రముఖ పాత్రవహించు మోహమను గుణమున్నది. ఆ గుణము నాదియను భావములోనే ముంచి వేయును. నా అను ప్రతిది మోహ గుణము వలననే కల్గుచున్నది. ఆ గుణమే నా కుమారులను బంధము కల్గించి సంతతి కోసము తాపమునపడునట్లు చేయుచున్నది. కర్మానుసారమే ప్రతిది లభించును. కర్మ ప్రకారమే సంతతి లభించును. తాపత్రయపడినంత మాత్రమున సంతతి కల్గునని నమ్మకము ఏమిలేదు. ప్రాప్తానుసారమే సంతతి సంసారము ఉండును.

**నర్మదమ్మ, తాడిపత్రి**

**98. భగవంతుడే పలికించాడని అంటూ ఉంటారు. నిజముగ భగవంతుడు మనుషుల ద్వారా పలికిస్తాడా?**

జ. అసంభవము. భగవంతుడు సాకారుడు, నిరాకారుడు కాదు. శరీరము ధరించిన పరమాత్మను భగవంతుడనడము జరుగుతుంది. వేరొకరి శరీరములోని నోటి మాటను సాకారుడైన భగవంతుడెట్లు పలికించును. గుణముల చేత ప్రేరేపింపబడి పలుకు మానవుడు భగవంతుడు పలికిస్తు ఉన్నాడని దేవుని మీద నిందవేయడము క్షమింపరాని పాపము నెత్తికెత్తు కోవడమే కాని వేరు కాదు.

**99.** "సర్వ భూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వ త్ర సమదర్శనః"

**ఈ శ్లోకము ప్రకారము యోగమాచరించువాడు అందరిని**

**సమానముగ చూడవలెనని, అందరియందు ఆత్మ ఉందని, అందరు ఆత్మ సంబంధులేనని, వేరొకడు నిందించినప్పటికీ ఆత్మే తనను నిందించినదని అనుకోవలయునని అంటుంటారు నిజమంటారా?**

జ. దేవుడు చెప్పిన శ్లోకమేమో బాగున్నది కాని అర్థము చేసుకొను మానవుని బుద్ధిహీనత ఇందులో కనిపిస్తున్నది. యోగ యుక్తాత్ముడు అని శ్లోకములో ఉన్నది. ఏ యోగ యుక్తుడని యోచించడము మానవుని కర్తవ్యము. పై శ్లోకము బాహ్య సంబంధము త్యజించిన బ్రహ్మయోగులకు చెప్పినది. కాని బయట ప్రపంచ సంబంధము కల్గిన కర్మ యోగులకు అది వర్తించదు.

బ్రహ్మయోగులకు మిత్ర శత్రు భేదములు లేవు. వారు ఆత్మ మీదనే దృష్టి కల్గి బాహ్య ప్రపంచమునే మరచి ఉందురు. కర్మ యోగులకు మిత్ర శత్రు భేదములుండును. అందువలన గీతయందు దేవుడే రాక్షసులైన వారిని పాపయోనులందు పుట్టించి జ్ఞానము యొక్క గట్టు తెలియకుండ జేస్తానని దైవాసుర సంపద్విభాగ యోగమను అధ్యాయము 19, 20 శ్లోకములలో చెప్పాడు. అందరు అక్కడ దేవునికే సమానముగ లేరే? దేవతలు రాక్షసులను భేదము ఆయనకెందుకు కల్గినది దీనికి సమాధానము చెప్పగలరా? ముందు గీతలో చెప్పిన కర్మ బ్రహ్మ యోగములను గురించి తెలుసుకొని, ఎవరికి ఏ శ్లోకము వర్తించునని ఆలోచించు. అపుడు తెలుస్తుంది గీత యొక్క రహస్యము, గీతను అర్థము చేసుకోలేనివారు అన్న మాటలు శాస్త్రబద్ధముగ హేతుబద్ధముగ నిలువ జాలవు.

**100. రాహు కేతువుల పుట్టుక పురాణములలో ఉన్నది. మీరేమో పురాణములు అసత్యమని అన్నారు. జ్యోతిష్య శాస్త్రములో రాహు కేతువులున్నారని అంటున్నారు. అటువంటపుడు రాహు కేతువులను నమ్మాలా, వదలి వేయాలా?**

జ. పురాణము మాట అబద్ధమే. రాహువు కేతువుల విషయము నిజము చెప్పితే అర్థముకాదని నా మాటే అబద్ధమనుకుంటారని 10 సంవత్సరముల క్రితము

మేము రాహు కేతువుల పుట్టుక కథ పురాణ సంబంధముగనే చెప్పాము. కాని ఈనాడు పూర్తిగ ఖండించుచు సత్యమే ప్రకటించవలెనని తెలుపుచున్నాము. రాహు కేతువులు ఖగోళమున సూర్య కుటుంబములోనికి మధ్యలో వచ్చిన వారు. వాటికి నిజముగ స్థూలశరీరము లేదు. కేవలము సూక్ష్మ శరీరములు మాత్రమే గలవు. ఖగోళములో జరిగే మార్పుల వలన రాహు కేతు ఛాయగ్రహములు మధ్యలో సూర్యకుటుంబములోనికి ప్రవేశించాయి. విచిత్రమేమంటే మిగత ఏడు గ్రహములకంటే ఈ రెండు గ్రహములు చాలా శక్తివంతమైనవి. నిజము చెప్పాలంటే రాహు కేతువులు గురు శని పార్టీలలో ఆ గ్రహముల మీద ఆధిపత్యము వహించి వాటి గమనములలో మార్పు జరగకుండ చూస్తున్నవి. మానవ జీవితములకు సప్త గ్రహములకు మధ్య రాహు కేతువుల వలన పూర్తి సంబంధమేర్పడినది. వాటి విషయము చాలా ఉన్నది. కనుక ఇంతటితో ముగిస్తు అవి శాస్త్రబద్ధమైనవని తెలుపుచున్నాము.

**101. విష్ణు, ఈశ్వర, బ్రహ్మ సామాన్య దేవతలుగ మీరు తెల్పారు. గీతలో బ్రహ్మ పగలు, బ్రహ్మ రాత్రి అని గొప్పగ మీరే చెప్పారు. కారణము?**

జ. గీత చెప్పిన బ్రహ్మకు త్రిమూర్తుల బ్రహ్మకు చాలా తేడా ఉన్నది. గీతలో పరమాత్మకే బ్రహ్మ అని పేరు పెట్టబడినది. అందువలన గీతలో బ్రహ్మను గొప్పగ చెప్పాము. బ్రహ్మ అనగ పెద్ద అని అర్థము గలదు. గీతలో చెప్పిన బ్రహ్మను పరమాత్మగ అర్థము చేసుకోవాలి.

**102. శాస్త్రజ్ఞులు బుధ గ్రహము మీద మనుషులున్నట్లు తెలియజేశారు. వారు దేవతలై ఉంటారా?**

జ. బుధ గ్రహము మీద మనషులున్నారేమోనని శాస్త్రజ్ఞులు ఊహించి ఉండవచ్చును. కాని అక్కడ మనుషులు లేరు. దేవతలనువారు గుణములబట్టి వారికున్న దైవశక్తిని బట్టి ఉంటారు కాని ఇతర గ్రహాల మీద ఉండువారు దేవతలుకారు.

**103. కొందరు భూమి మీద కొంత ఎత్తులో ఏ ఆధారము లేకుండ కూర్చొని యోగమాచరించారని విన్నాము నిజముండునా?**

జ. ఉండవచ్చును. అది ప్రాణాయామము చేయువారికే సంభవము. శరీరములోని గాలి పీడనశక్తికి శరీరము పైకి లేచి గాలిలో తేలియాడును.

**పురుషోత్తమనాయుడు, కూచివారిపల్లి**

**104. ప్రబోధానంద స్వామిగారు మీకు దేవుడు కనిపిస్తే ఏమి అడుగదలచు కొన్నారు?**

జ. దేవుడు కనిపించడు నాయనా! కనిపించే వాడు, వినిపించేవాడు దేవుడు కాదు. కర్మ ప్రకారము అన్ని జరుగునని నిశ్చయములో ఉండాలి, గాని కోర్కెలు కోరే ఆశలో ఉండకూడదు.

**105. దేవుడు ఒక్కడే అంటారు మరి త్రిమూర్తులు ముగ్గురున్నారు కదా! వారేమవుతారు?**

జ. దేవునికి ఆకారములేదు. త్రిమూర్తులకు ఆకారమున్నది కావున వారు మన మాదిరి వ్యక్తులే. మనకంటె యోగశక్తి ఎక్కువ కలవారని చెప్పవచ్చును. వీరిని పరమాత్మతో పోల్చకూడదు. సాధారణ దేవుళ్ళుగ చెప్పుకోవచ్చును.

**106. దేవుడు లేకుండ మానవుడు, మానవుడు లేకుండ దేవుడు ఉన్నాడా?**

జ. తలలేకుండ శరీరము, శరీరము లేకుండ తల ఉన్నదా? అట్లే దేవుడు మానవుడు ఉన్నారు.

**నారాయణ శంకరనారాయణ, రాజంపేట**

**107. కుల భేదములు మొదట వచ్చాయంటున్నవి గీతలోని కొన్ని శ్లోకములు దానికి మీ సమాధానము?**

జ. శాస్త్ర వాక్యము చేత ఖండింపబడనిదే శాస్త్రమగును. మీరు చెప్పిన కొన్ని

శ్లోకములు గీత చేతనే ఖండింపబడుచున్నవి. అందువలన అవి గీత కాదని చెప్పుచున్నాము. గీత వాక్యము చేత ఖండింపబడునది గీతలోనిదియైన శాస్త్రము కాదు, నిరూపణకు రాదు. గీతలో కుల భేదములు లేవు, గీతలో గుణ భేదములున్నవని తెలుసుకోవాలి.

**పి. రాంబొజ్జి, ధర్మవరము**

**108. ధ్యానము చేయునపుడు లౌకిక విషయములే జ్ఞప్తికి వస్తుంటాయి వాటిని నిరోధించుటకు మార్గము ఏమున్నది?**

జ. గీతలో భగవంతుడు చెప్పినట్లు వైరాగ్య అభ్యాసముల చేతనే వీలగును.

**ఇల్లూరు సూర్యనారాయణ శెట్టి, గుంతకల్**

**109. మీ "ప్రబోధాత్మజమ్" పత్రిక మీద హిందూ, ముస్లిం, క్రైస్తవ మతాలకు సంబంధించిన చిత్రము వేసినారు. అదియే ధర్మాచరణయో తెల్పవలయును.**

జ. అది నా స్వహస్తములతో వేసిన చిత్రము. అందులో ఉన్నవి ఎన్ని మతాలైనా మతముల ధ్యేయము దైవ సామీప్యము చేరడమే, కావున ఆత్మ ధర్మము ప్రకారము ఆ చిత్రమును అందులో వేయడము జరిగినది. ఓం కారములోనే మిగత రెండు చిత్రాలు ఇమిడి ఉన్నాయి కావున మీకు ఓంకారమే దేవుడైతే, పూజ్యనీయమైతే అన్ని మతములు దేవునిలోనివే, దేవుడు అన్ని మతములవాడే, ఒక్కొక్క మతమునకు ఒక్కొక్క దేవుడు లేడని, అందరికి ఒక్కడే దేవుడని తెలియవలయును. దేవుని ఒక్క అంశతోనే ఈ జగత్తంతయు ఉన్నది, కావున అన్ని మతములు ఆ ఒక్క అంశలోనివే కావున ఏకాత్మతా ధర్మము ప్రకారము ఆ చిత్రము వేయబడినది.

**కె. గంగప్ప, కిరికెర**

## 110. ఆత్మ ఎట్టిది?

జ. అన్ని శరీరములందు జీవాత్మతో పాటు సూక్ష్మముగ ఉన్న నాశనము లేని అంశ ఆత్మ.

## 111. పరబ్రహ్మము యొక్క రూపు ఎట్లుండును?

జ. పరబ్రహ్మమునకు ఆకారము లేదు.

## 112. గురువును దూషించిన వారికి ఏమి సంప్రాప్తమగును?

జ. క్షమించరాని పాపము.

## 113. శిష్యుని దూషించిన గురువుకు ఏమి సంప్రాప్తమగును?

జ. గురువు శిష్యుని దూషించుట భావ్యము, సవ్యము. కావున పాపమును క్షమించ గలుగు శక్తి కలుగును. గురువు శిష్యునికి శిక్షణ నివ్వడములో దూషణలుండవచ్చును. శిక్ష నుండి శిక్షణ అను పదము శిష్యుడు అను పదము పుట్టినది. కావున శిక్షణలో దూషణ కూడ ఉండవచ్చును.

## 114. మాయ ఎవరి స్వాధీనములో ఉన్నది?

జ. ప్రకృతి పరమాత్మ స్వాధీనములో ఉన్నది. కావున మాయ కూడ పరమాత్మ స్వాధీనములోనే ఉన్నది.

**బి. సాంబశివ, అనంతపురము**

## 115. ఆర్యా!

శ్లో॥ ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దే శేర్జునతిష్టతి! ।
భ్రామయన్ సర్వ భూతానియంత్రా రూఢానిమాయయా ॥

“సంసార యంత్రమున తగుల్కొని ఉన్న ఈ చరాచర భూతములను తన మాయాశక్తి చేత ఆడించుచు పరమేశ్వరుడు హృదయములందు నెలకొని ఉన్నాడు అని

గీతావాక్యము" అయితే ఆ హృదయ స్థానమేది? జీవుల శరీరములందు ఈశ్వరుడు నివశించు స్థానమేది? అను విషయము భిన్నాభిప్రాయములుగనున్నది?

**1.** **(ఎ). తైత్తిరీయోపనిషత్తు :** పద్మకోశ ప్రతీకారం హృదయం చాప్యథో ముఖం

**(బి). సుచోలోపనిషత్తు :** హృదయస్య మధ్యేలో హితం మాంస పిండం మధ్యే అను శ్లోకాలలో జీవుల కంఠమునకు జేనెడు క్రిందుగను నాభికి జేనెడు పై భాగముననను మాంస పిండమయమై వ్రేలాడుచున్న తామర కమలాకృతిలో ఉన్న దానియందు మధ్య రంధ్రమున గల జలములో ఈశ్వరుడు విరాజిల్లుచున్నాడు. అదియే హృదయ పద్మము అని నిర్ణయింపబడినది.

**2.** **(ఎ).** **ఉమాసహస్రము గ్రంథమందు**

తస్య దక్షిణతో ధామ హృత్పీఠేనైవ వామతః
తస్మాత్ ప్రవహతి జ్యోతిః సహస్రారం సుషుమ్నయా

**"ఈశ్వరుడు (ఆత్మ) స్వయంగా ప్రకాశించు చోటు దహరాకాశము అను పేరుగల హృదయము. ఇది వక్ష స్థలమునకు కుడివైపు ఉన్నది." అని ఉద్ఘాటించుచున్నది. భగవద్గీతాచార్యుడు చెప్పిన ఈశ్వరుడు నివశించు జీవుల హృదయ స్థానము ఏది? సహస్రారమందున్న పరమాత్మ (గురు) స్థానమునకు హృదయ కమల మధ్యవర్తి ఈశ్వరునకు సమన్వయ మెట్లు?**

జ. ఉపనిషత్తులంటేనే నూటికి నూరుపాల్లు సత్యమని నమ్మువారు చాలామంది కలరు. అందువలన ఉపనిషత్ వాక్యరీత్యా గుండెనే హృదయముగ అందరు లెక్కించుచున్నారు. వాస్తవముగ గుండెకు హృదయానికి సంబంధము లేదు. అవి రెండు వేరుగ వేరుగ ఉన్నవి. వాటి పనిలోను తేడా ఉన్నది. గుండె రక్తమును మాత్రము పంప్ చేయుచున్నది. అది పని చేయుటకు కూడ ఒక శక్తి అవసరము ఆ శక్తి బ్రహ్మనాడి నుండి వస్తున్నది. కావున గుండెకు స్వయంశక్తి లేనిదని

తెలియుచున్నది. చైతన్యమే లేనిది అందులో ఆత్మ నివాసముందనుట అసత్య మగును. ఆత్మ చైతన్య స్వరూపమైనది. ఆత్మ చైతన్యము చేతనే జీవరాసుల శరీరములు కదలుచున్నవి. అటువంటపుడు వేరొక చోటు నుంచి ప్రవహించు ఆత్మ శక్తి చేత కదలు గుండెయందు ఆత్మ కేంద్రముగ ఉందనడము అసత్యమగును.

గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయములో 15 వ శ్లోకము "సర్వస్య చాహం హృదిసన్ని విష్టో మత్తః స్మృతిర్ జ్ఞాన మపోహనంచ" **నేను (ఆత్మ) సర్వ జీవుల హృదయ స్థానములలో ఉన్నాను. నా వలననే జ్ఞప్తి, జ్ఞానము, ఊహ కలుగుచున్నవి.** అను దేవుని వాక్యము ప్రకారము గుండెలో దేవుడు లేడని తెలియుచున్నది. గుండెవలన జ్ఞానము జ్ఞప్తి ఊహలు కలుగలేదు కావున గుండెకు హృదయమునకు తేడా ఉన్నదని తెలియుచున్నది. ఎక్కడయితె హృదయమున్నదో అక్కడ నుండే జ్ఞప్తి ఊహలు కలుగుచున్నవని పై శ్లోకము ప్రకారము తెలియుచున్నది. కావున జ్ఞప్తి జ్ఞాన ఊహలు కలుగు మెదడునే హృదయమని శాస్త్రబద్ధముగ చెప్పవచ్చును. శరీర మధ్యలో ఉన్న మెదడు నుండి క్రిందికి ప్రాకిన వెన్ను పాము (బ్రహ్మనాడి)నే హృదయమని చెప్పవచ్చును. దేవునిశక్తి నివాసముండు నాడి కనుక దీనిని బ్రహ్మనాడి అనడము జరుగుచున్నది. ఆ శక్తికి మూలస్థానము మెదడు. అందువలన మొత్తము మెదడు దాని నుండి బయలుదేరిన వెన్ను పామును హృదయము అనవచ్చును. మెదడు దాని నాడి వెన్నుపాము చేతనే సర్వ జీవరాసులు కదలించబడుచున్నవి. కావున నేను హృదయ స్థానములో ఉండి జంత్రగాడు బొమ్మల నాడించురీతిగ కనిపించక ఆడించుచున్నానని గీతయందు చెప్పాడు.

మీరు చెప్పిన 1) తైత్తిరీయోపనిషత్ శ్లోకములో హృదయము పద్మాకారముగ ఉండి అదో ముఖముగ వ్యాపించి ఉన్నదని ఉన్నది. పద్మమువలెనున్నది మెదడు దాని నుండి బయలుదేరిన నాడి అదో ముఖముగ ఉన్నది కనుక ఆ శ్లోకము సరిపోయింది. ఎన్ని విధములు పరిశోధన జేసిన హృదయమను పదము మెదడుకే వర్తిస్తుంది కాని గుండెకు ఏ మాత్రము వర్తించదని తెలియవలయును. హృదయమే గుండె అనువారి వాదనను గీత పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయములో 15వ శ్లోకమొక్కటే ఖండించి వేస్తుంది.

**యం. రామక్రిష్ణయ్య, బి. పప్పూరు**

**116. మానవుడు పుట్టినప్పటి నుండి మానవునిలో పెరగనిది తరగనిది ఏది? అని ప్రశ్నించగా పరమాత్మ అని చెప్పబడినది. కాని మా నమ్మకము శరీరములోని శ్వాస అని ఉన్నది మీరేమంటారు?**

జ. పరమాత్మ అను సమాధానమే సరియైనది. మానవుడు పుట్టినప్పటి నుండి పెరగనిది తరగనిది పరమాత్మ సంబంధమైనదే కాని ప్రకృతి సంబంధముకాదు. శ్వాస ప్రకృతితో తయారయినది కావున అది ఒకపుడు పెరగడము ఒకపుడు తరగడము జరుగుచున్నది. మనస్సు ఏకాగ్రత పొందినపుడు శ్వాస తగ్గిపోవడము, మనస్సు ఉద్రేకము పొందినపుడు శ్వాస ఎక్కి పొడవురావడము జరుగుచున్నది. అందువలన శ్వాస పెరుగునది తరుగునదని తెలియవలయును.

**దూళిపాటి శ్రీనివాసయ్య, రాజంపేట**

**117. దేవుడు మన ఇంట జంట వెంట సర్వత్రా ఉన్నాడు అనే సత్యాన్ని మానవులు తెలిసీ తెలియక ఎక్కడో దేవుడున్నాడను భావముతో దూర ప్రదేశములకు పుణ్యక్షేత్రములకు పరుగిడుచున్నారు. అట్లు పోవుటకు కారణమేమి?**

జ. అంతట దేవుడు ఉన్నాడను సత్యము తెలియకపోవడము ఒక కారణము. ఆ కారణముకంటే మించినది మానవునిలో ఆశ అను గుణము అక్కడికి పోతే ఏదో నెరవేరునను భావము కల్పించి కష్ట నష్టములనైన ఓర్చి అక్కడికి పోవునట్లు చేయుచు ఉన్నది. నిజ జ్ఞానము కలవాడు ఏ క్షేత్రములకు పోనవసరము లేదు. తెలిసిన వానికి శరీరమే దేవాలయము అందులోని ఆత్మ దేవుడు.

**118. మీరు గత సంచికలో మంత్ర జపముకంటే యోగసాధనే ముఖ్య మన్నారు. ముసలి తనములో నుండు మానవుడు శరీరము కృషించి ఉండుటచేత యోగ మాచరింపనలవి కాదు కదా! అట్టి వాడు ఆత్మానందము పరబ్రహ్మ ఐక్యము పొందుటకు సాధ్యమగునా?**

జ. పరమాత్మను పొందుటకు రెండే మార్గములున్నవని చాలాసార్లు మేము చెప్పాము. ఒకటి ఆసనము వేసి మనో నిగ్రహము పొంది ఆత్మను చేరు యోగము. దానినే బ్రహ్మయోగము అంటారు. రెండవది ఆసనము వేయక మనో నిగ్రహముతో పనిలేక కేవలము అహంకారమును అనచి వేసి అన్ని పనులు చేయడము, దీనినే కర్మయోగము అంటారు. వృద్ధులకు బ్రహ్మయోగమాచరించుటకు శరీరము అనుకూలించదు కావున కర్మ యోగమాచరించ వచ్చును. అన్ని వయస్సుల వారికి అనుకూలమైనది కర్మయోగము. మనో నిగ్రహము మీద ఆధారపడినది బ్రహ్మ యోగము. అహంకార నిగ్రహము మీద ఆధారపడినది కర్మ యోగమని తెలియవలయును.

**బి. కాటమయ్య, బి. పప్పూరు**

**119. రాజయోగి, బ్రహ్మయోగి వీరిద్దరిలో ఎవడు అద్వైతుడు?**

జ. జీవాత్మ ఆత్మ ఏకమైనవాడే అద్వైతుడు. కావున బ్రహ్మయోగియే అద్వైతుడగును. రాజయోగి అద్వైతుడు కాడు.

**120. పెళ్లి కాని వారిని బ్రహ్మచారి అందురు. పెళ్లి చేసుకొన్న వారిని కూడ బ్రహ్మచారి అందురా?**

జ. 'బ్రహ్మచారి' అను పదము పెళ్లిని బట్టి ఉండునని చాలామంది అభిప్రాయము. కాని పెళ్లి చేసుకోని వానికి బ్రహ్మచారి పదమునకు సంబంధము లేదు. బ్రహ్మ యొక్క ఆచరణ ఆచరించువాడు బ్రహ్మచారి అగును. అంటే దేవుడు చెప్పినట్లు జ్ఞానము ప్రకారము నడచుకొను వాడు బ్రహ్మచారి అగును. వివాహము అయిన వాడు కాని, కానివాడు గాని జ్ఞానము ప్రకారము నడచినపుడే బ్రహ్మచారి అగును. అట్లు నడచుకోలేని వివాహితులు గాని అవివాహితులు గాని బ్రహ్మచారులు కారు. బ్రహ్మచారి అను పదములోనే ఉన్నది అందులోని అర్థము.

**121. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ వేరు వేరుగా ఉన్నారని మీరే తెలిపారు, వీరు ముగ్గురు ఒకటై పోయేదెపుడు?**

జ. జీవుడు మోక్షము పొందినపుడు.

**122. పంచ భూతములకు ఆత్మకు తేడా ఉన్నదా?**

జ. పంచభూతములు నాశనమగునవి, ఆత్మ నాశనము కానిది ఇంతే తేడా.

**123. పంచ భూతములతో శరీరము తయారైనదని మీరే తెలిపారు. అది ఏ విధముగనో వివరముగ తెలుపవలయును?**

జ. దేహ నిర్మాణము.

ప్రకృతి అనగా పంచభూతములని అర్థము. అవి 1. ఆకాశము, 2. గాలి, 3. అగ్ని, 4. నీరు, 5. భూమి. ఈ ఐదు భాగముల చేత ఏర్పడినదే ప్రపంచము. పంచము అనగ ఐదని, ప్ర అనగ పుట్టినదని అర్థము. ఐదు చేత ఏర్పడిన దానినే ప్రపంచమను పేరు పెట్టబడినది. పంచ భాగములు ఉన్న ప్రకృతి, రెండు విధములుగ ఉన్నది. 1. మార్పు చెందని ప్రకృతి, 2. మార్పు చెందు ప్రకృతి. మార్పు చెందని ప్రకృతి అనగా నేడు మనకు గోచరమగు ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. ఇవి ప్రపంచ పుట్టుక నుంచి ప్రపంచ అంత్యము వరకు ఒకే ధర్మము కల్గి ఉన్నవి. ఉదాహరణకు అగ్ని కాలును కదా! అది ఎప్పటికి ఆ స్వభావమే కల్గి ఉండును. ఇపుడు మనము ముఖ్యముగ తెలుసుకోవలసినది మార్పు చెందు ప్రకృతిని.

మార్పు చెందు ప్రకృతి (ప్రపంచము) జీవరాసులు శరీర రూపములుగ ఉన్నది. పంచ భూతముల చేతనే శరీరములు తయారయినవి. పంచభూత నిర్మితమైన శరీరములు బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్యమను మార్పు గలిగి నిత్యము ప్రతి క్షణము మార్పుతో కూడుకొని ఉన్నవి. అందువలన శరీర నిర్మాణమైన పంచ భూతములను మార్పు చెందు ప్రకృతి అనుచున్నాము. మార్పు చెందు ప్రకృతి నుండి శరీరములు ఎలా తయారైనది తెలుసుకోవడము ఇక్కడ ముఖ్యాంశము.

మార్పు చెందు ప్రకృతియైన పంచభూతములు ఒక్కొక్కటి ఐదు భాగములుగ చీలిపోయినవి. అపుడు మొత్తము 25 భాగములయినవి.

| | |
|---|---|
| ఆకాశము 5 భాగములు | (ఆకాశము 1+1+1+1+1 = 5) |
| గాలి 5 భాగములు | (గాలి 1+1+1+1+1 = 5) |
| అగ్ని 5 భాగములు | (అగ్ని 1+1+1+1+1 = 5) |
| నీరు 5 భాగములు | (నీరు 1+1+1+1+1 = 5) |
| భూమి 5 భాగములు | (భూమి 1+1+1+1+1 = 5) |

మొత్తము 25 భాగములైనవి కదా! అందులో ఆకాశము మొదటి భాగము, గాలి రెండవ భాగము అగ్ని మూడవ భాగము, నీరు నాల్గవ భాగము, భూమి ఐదవ భాగము ఒక్కొక్కటి 5 భాగములుగ చీలి పోయినవి. ఇక్కడ పంచ భూతముల 1వ, 2వ, 3వ, 4వ, 5వ భాగములు మాత్రమే తిరిగి 5 భాగములుగ చీలిపోయినవని గమనించవలెను. పంచ భూతములలో ప్రతి దానియందు 4 భాగములు చీలక మిగిలినవి. ఇపుడు చీలినవి 25, చీలనివి 20 భాగములు ఉన్నవి. ఆకాశము 1వ భాగము, గాలి 2వ భాగము, అగ్ని 3వ భాగము, నీరు 4వ భాగము, భూమి 5వ భాగములు చీలికలైనవి 25 పదార్థములు, మిగత చీలని 20 పదార్థములతో కలిసి మార్పు చెంది క్రొత్త పదార్థములుగ ఏర్పడిన భాగములే శరీర అవయవములు. ఒక పదార్థము వేరొక పదార్థముతో కలిసినపుడు క్రొత్త పదార్థము ఏర్పడునను సైన్సు సూత్రము ప్రకారము అయిదు భాగముల చీలికలైన 25 భాగములు మిగత 25 భాగములతో కలసినపుడు ఒక క్రొత్త భాగములు ఏర్పడినవి. అవియే శరీర భాగములు. అదియే దేహ నిర్మాణము. ఇక్కడొక అనుమానము రావచ్చును. అది ఏమనగా! చీలికలు 25 ఉన్నవి కదా! మిగత చీలనివి 20 మాత్రమే కదా అపుడు 5 భాగములు తక్కువవచ్చును కదా అని సంశయము ఏర్పడును. దానికి సమాధానము తక్కువ బడిన ఆ ఐదు భాగముల స్థానములలో ఆత్మ అంశ చేరినది. అందువలన చీలని భాగములు

20 + ఆత్మ అంశ 5 భాగములు మొత్తము 25 భాగములైనవి. ఇపుడు చీలిన 25 భాగముల పదార్థములు, చీలని 20 + 5 = 25 పదార్థములు కలసి శరీరము ఏర్పడిన విధానము క్రింద తెలుపుచున్నాము.

1. ఆకాశము మొదటి భాగములోని 1వ భాగము + ఆత్మ 1వ అంశ = జీవుడు
ఆకాశము మొదటి భాగములోని 2వ భాగము + గాలి 1వ భాగము = మనస్సు
ఆకాశము మొదటి భాగములోని 3వ భాగము + అగ్ని 1వ భాగము = బుద్ధి
ఆకాశము మొదటి భాగములోని 4వ భాగము + నీరు 1వ భాగము = చిత్తము
ఆకాశము మొదటి భాగములోని 5వ భాగము+భూమి 1వ భాగము = అహంకారము

ఈ విధముగ ఆకాశము మొదటి భాగములోని 5 చీలికల చేత పుట్టినవి అయిదు అంతఃకరణములు

2. గాలి రెండవ భాగములోని 1వ భాగము + ఆత్మ 2వ అంశ = వ్యాన వాయువు
గాలి రెండవ భాగములోని 2వభాగము+ఆకాశము2వభాగము = సమాన వాయువు
గాలి రెండవ భాగములోని 3వ భాగము + అగ్ని 2వ భాగము = ఉదాన వాయువు
గాలి రెండవ భాగములోని 4వ భాగము + నీరు 2వ భాగము = ప్రాణ వాయువు
గాలి రెండవ భాగములోని 5వ భాగము + భూమి 2వ భాగము = అపాణ వాయువు

ఈ విధముగ గాలి రెండవ భాగములోని 5 భాగముల చేత పుట్టినవి పంచ వాయువులు.

3. అగ్ని మూడవ భాగములోని 1వ భాగము + ఆత్మ 3వ అంశ = కన్ను
అగ్ని మూడవ భాగములోని 2వ భాగము + ఆకాశము 3వ భాగము = చెవులు
అగ్ని మూడవ భాగములోని 3వ భాగము + గాలి 3వ భాగము = చర్మము
అగ్ని మూడవ భాగములోని 4వ భాగము + నీరు 3వ భాగము = నాలుక
అగ్ని మూడవ భాగములోని 5వ భాగము + భూమి 3వ భాగము = ముక్కు

ఈ విధముగ అగ్ని మూడవ భాగములోని 5 భాగముల చేత పుట్టినవి జ్ఞానేంద్రియములు.

4. నీరు నాల్గవ భాగములోని 1వ భాగము + ఆత్మ 4వ అంశ = రుచి
నీరు నాల్గవ భాగములోని 2వ భాగము + ఆకాశము 4వ భాగము = శబ్దం
నీరు నాల్గవ భాగములోని 3వ భాగము + గాలి 4వ భాగము = స్పర్శ
నీరు నాల్గవ భాగములోని 4వ భాగము + అగ్ని 4వ భాగము = రూపు
నీరు నాల్గవ భాగములోని 5వ భాగము +భూమి 4వ భాగము = గంధం

ఈ విధముగ నీరు నాల్గవ భాగములోని 5 భాగముల చేత తయారైనవి పంచతన్మాత్రలు.

5. భూమి ఐదవ భాగములోని 1వ భాగము + ఆత్మ 5వ అంశ = గుదము
భూమి ఐదవ భాగములోని 2వ భాగము + ఆకాశము 5వ భాగము = వాక్కు
భూమి ఐదవ భాగములోని 3వ భాగము + గాలి 5వ భాగము = చెతులు
భూమి ఐదవ భాగములోని 4వ భాగము + అగ్ని 5వ భాగము = పాదములు
భూమి ఐదవ భాగములోని 5వ భాగము + నీరు 5వ భాగము = గుహ్యము

ఈ విధముగ భూమి అయిదవ భాగములోని 5 చీలిన భాగముల చేత తయారయినవి 5 కర్మేంద్రియములు.

84 లక్షల రకముల జీవరాసుల శరీరములు పై విధముగ తయారై నిలచినవి. ముఖ్యముగ గమనించవలసిన విషయమేమంటే తల్లి తండ్రికి పుట్టిన బిడ్డ తల్లి తండ్రి శరీర పోలికలున్నట్లు పంచ భూతముల చేత తయారయిన శరీర 25 భాగములలో ఆ భూత భాగముల లక్షణములు ఇమిడి ఉన్నవి. ఉదాహరణకు ఆకాశ మొదటి భాగము, గాలి మొదటి భాగము కలిసి తయారైన మనస్సు ఆకాశ గాలి లక్షణములు కలిసి ఉన్నది. ఆకాశము (శూన్యము) కనుపించునది కాదు కావున ఆకాశముతో తయారైనవి కనిపించని లక్షణము కలిగివున్నవి. అందువలన

మనస్సు కనుపించునది కాదు. అట్లే గాలి లక్షణము చలించుట కావున మనస్సు కూడ చంచల స్వభావము కల్గి ఉన్నది. ఈ విధముగ మన శరీర భాగములు పంచ భూతముల లక్షణములను కల్గి ఉన్నవని తెలియవలయును. బ్రహ్మ విద్యాభ్యాసములో శరీర నిర్మాణము తెలియుట ముఖ్య జ్ఞానము. ఈ విషయము తెలియకపోతే ఎవరు జ్ఞానులు కారని పెద్దలు ఈ విధముగ అన్నారు.

**పద్యము :** *పంచ తత్త్వములను పంచీకరించక*
*మంచి యతుల మన్న మాటలన్న*
*కుంచమందు గజము గ్రుడ్డు పెట్టినవిధంబు*
*అఖిల జీవసంగ ఆత్మ లింగ.*

"పంచ భూతములు విభజింపబడి శరీరమెట్లు తయారైనదని తెలియకపోతే ఏనుగు గంప క్రింద గ్రుడ్డు పెట్టుననుట ఎంత సత్యమో అటువంటివారు జ్ఞానులను మాట కూడ అంతే సత్యమగును." అందువలన బ్రహ్మవిద్యలో ప్రాథమిక పాఠమైన శరీర నిర్మాణమును అందరు తెలియండి ఇతరులకు తెలుపండి.

**వి. శంకరనారాయణ బి.ఎ., ధర్మవరము**

**124. సంపూర్ణ జ్ఞానులు అయిన తర్వాత దైవ ధ్యానము చేయమన్నారు. మనము సంపూర్ణ జ్ఞానము పొందినాము అని ఏ విధముగ తెలియవలయును. జ్ఞానమునకు ఏమైన హద్దు ఉన్నదా? తెలియజేయ ప్రార్థన.**

జ. సంశయ రహితముగ సవివరముగ ఆత్మ విషయాలు తెలిసినపుడే సంపూర్ణ జ్ఞానమనబడును. ఆత్మ సంబంధమైన ప్రతి ప్రశ్నకు సమాధానము వెదకకనే ఎవనికయితే వచ్చునో అతనినే సంపూర్ణ జ్ఞానులందుము. అటువంటి సంపూర్ణ జ్ఞానులను తెలుసుకొను నిమిత్తము జ్ఞానపరీక్ష మేము నిర్వహిస్తూ ఉంటాము.

**125. శ్వాసను బంధించి ఎన్ని వందల సంవత్సరములైన ఉండవచ్చును, కాని ఈ దేహమునకు మరణమున్నది కదా! అన్ని వందల సంవత్సరముల వరకు భౌతికదేహము ఎట్లుండగలదు?**

జ. మన శరీరమునకు శ్వాస సంఖ్యను బట్టియే మరణము సంభవించును. ప్రారబ్ధము ప్రకారము ఎన్ని శ్వాసలు నియమించబడి ఉన్నాయో అన్ని అయిపోవు వరకు దేహమునకు మరణము లేదు. శ్వాస నిలుపుటకు ముందు ఏవయస్సు ఉండునో నిలిపిన తర్వాత ఎంతకాలమైనప్పటికి అదే వయస్సే ఉండును. శ్వాస జరిగినపుడే వయస్సు జరుగునని తెలియవలయును.

**126. పుట్టిన వెంటనే ప్రతి శిశువు "కేర్" మని అరుస్తారు. ఇది ఏ భాష పదము అట్లు అరవడానికి కారణమేమిటి?**

జ. పుట్టిన బిడ్డ అరుపులు ఒక "కేర్" మనియే కాక "క్వా" అని, ఊంగ అని రకరకములుగ అరుస్తుంటారు. ప్రపంచములోని దాదాపు రెండు వేల భాషలలో ఏ భాషకైన ఆ పదములు సంబంధించి ఉండును. అంతమాత్రమున వీరి అరుపులకు అర్థములు లేవు. వారు అర్థములతో అరవడము లేదు. ఉన్న స్థితిని కోల్పోయి క్రొత్త స్థితి పొంది దిక్కు తెలియని అయోమయ స్థితిలో అరిచే అరుపే కాని వేరు కాదు. ఒక్కసారిగా పాత ఇంద్రియముల సంబంధము కోల్పోయి సామర్థ్యములేని లేతవైన క్రొత్త ఇంద్రియముల సంబంధము ఏర్పడుటను జన్మ అంటాము. జన్మ సమయములో పాత వాటిని కోల్పోయినానను జ్ఞాపకము కూడ లేని జీవుడు అర్థములేని అరుపులు అరచును. వాటికి మన పెద్దలు కొందరు నేనెక్కడికి వచ్చానని, నా ఇంద్రియములు లేవని రక రకములుగ అర్థములు చెప్పారు. కాని అప్పటి జీవునకు ఏ యోచన కాని, ప్రశ్నించు తెలివి కాని ఏ మాత్రము లేవు. అందువలన మనము అర్థములు చెప్పుకొనిన వాడు మాత్రము ఏ అర్థముతో అరవడము లేదు.

**127. ఆహారములో ఉప్పు పులుపు కారము తగ్గిస్తే కామము (స్త్రీ సంబంధ ఆశ) తగ్గుతుందంటారు వాస్తవమేనా?**

జ. ఆహారము శరీర ఆరోగ్య అనారోగ్యముల మీద పని చేయును. మానసికముగ గుణముల మీద ఏ మాత్రము పని చేయదు. ఆహారలోపము

వలన శరీరమునకు స్త్రీ సంయోగ కార్యము చేయలేని బలహీనస్థితి ఏర్పడవచ్చును. కాని గుణము మాత్రము లోపల ఉండనే ఉండును. ఆహార మార్పిడివలన శరీరము బలాబలములుగ మారవచ్చును కాని శరీరములోని గుణము మారదు. చింత చచ్చిన పులుసు చావదన్నట్లు శరీరము కృశించిన అందులోని గుణములు కృశించవు. అందువలన మీలాంటి యువకులు అనుభవమునకు రాని, శాస్త్రము కాని, మూఢ నమ్మకములైన మాటలను ఖండించి నిరూపణకు వచ్చు విషయముల మీద ఆధారపడవలెను. ఎంతో ఉన్నతమైన దైవజ్ఞానము అశాస్త్రీయమాటలతో మూఢ నమ్మకములతో నేడు నిండి ఉన్నది. అందువలన హేతువాదమునకు నిలువ లేక పోవుచున్నది. మీలాంటి యువకులు హేతుబద్ధము కాని మాటలను ఖండించి దైవ విషయములకు వెలుగును చేకూర్చుదురని కోరుచున్నాము.

**బత్తుల నాగేశ్వరరావు, రెడ్డిపల్లి**

**128. స్వామి! దేవుడు ఉన్నాడని అంటున్నారు కదా! ఆ దేవుడు ఎక్కడ ఉన్నాడు. ఆయనకు ఆకారము ఏమైన ఉన్నదా?**

జ. దేవుడు సర్వ జీవరాసుల శరీరములలో ఉన్నాడు. ఆ దేవునికి ఆకారము లేదు.

**129. మానవుడు చనిపోయిన తర్వాత అతని తల వెనుక భాగమున దీపమును వెలిగిస్తారు. దీనికి కారణము ఏమైన ఉన్నదా?**

జ. పూర్వకాలములో పెద్దలు చేసిన ప్రతి దానికి అర్థముండెడిది. కాని నేడు అది లోపించింది. ముఖ్యముగ పూర్వకాలములో పరకాయ ప్రవేశ విద్య నేర్చినవాడు శరీరమును వదలి వేరొక శరీరమును ఆశ్రయించినపుడు ఆ శరీరము యొక్క తల వెనుకల దీపముంచెడివారు. ఆ విధముగ పెట్టమని శరీరము వదలి పోయేవాడే చెప్పియుండును. అదియు రాత్రిపూట మాత్రమే ఆ విధముగ పెట్టేవారు. పగలు అవసరమే లేదు. శరీరము వదలిన వాడు తిరిగి శరీరమును చేరవలయునంటే చీకటిలో తన శరీరమును గుర్తించలేడు కనుక వెలుగు కోసము ఆ విధముగ

పెట్టేవారు. శరీరము యొక్క ముఖమును చూచియే కదా ఎవరైనది గుర్తించగలము. అందువలన ముఖము కనిపించునట్లు తలకు దగ్గరగ ముంతనో లేక చెంబునో బోర్లించి దాని మీద దీపము పెట్టి ముఖము స్పష్టముగ కనిపించునట్లుంచేవారు. ఆ విధముగ ఉంచుటవలన తిరిగి శరీరము చేరే వానికి ఏ ఇబ్బంది ఉండదు. ఇది పూర్వకాల పద్ధతి ఇపుడేమో చనిపోయిన వారికి కూడ దీపముంచడము మొదలు పెట్టాము. ఒకరిని చూచుకొని ఒకరు చేస్తున్నారు, ఎందుకు చేస్తున్నామను యోచన మానవునికి రాలేదు. మీ అటువంటి జిజ్ఞాసులు అడుగుట వలన మేము ఉన్న సత్యమును చెప్పినప్పటికి నేటి మానవుడు వినిపించుకొనే స్థితిలో లేడు. పెద్దలు చేసినది మనము చేయాలను రోగము జాడ్యమై ఇమిడి ఉన్నది. పూర్వము పెద్దలు ఎందుకు చేసారు, ఏ సందర్భములో చేసారు అను యోచన ఏ మాత్రము లేదు.

**130. మానవుడు చనిపోయిన తర్వాత అతనిలో ఉన్నటువంటి జీవి ఎక్కడకు పయణిస్తుంది? మానవునిలో ఉన్నది గాలి అని కొందరు జీవి అని కొందరు అంటున్నారు. జీవికి గాలికి ఏమైన తేడా ఉన్నదా?**

జ. మానవుడు చనిపోయిన తార్వత ఆ జీవి కర్మానుసారము వెంటనే మరొక శరీరమును ధరించడము జరుగుతుంది. మానవునిలోని గాలిని ప్రాణము అంటారు. అది మన ముక్కురంధ్రములలో చలించునపుడు ప్రాణముందని, చలించనపుడు ప్రాణములేదని అందురు. మన శరీరములోని పంచవాయువులనే పంచప్రాణము లని కూడ అందురు. గాలి వేరు, జీవుడు వేరు. జీవునికి ప్రాణమునకు ఎంతో తేడా ఉన్నది. గాలి కూడ కాని ఆత్మతత్త్వము జీవుడు.

**131. స్వామీ! ఆడవారు భర్తను పోగొట్టుకొన్న తర్వాత నిత్యము ధరిస్తున్న గాజులు, కుంకుమ, పూవులు, భర్తతో పాటు పోగొట్టుకుంటారు కారణము ఏమిటి?**

జ. భర్త లేడను గుర్తుకు భర్తతో పాటు వచ్చిన తాళిబొట్టు, మెట్టెలు భర్త

చనిపోయిన తర్వాత తీసివేయవచ్చును. గాజులు మొదటి నుండి వచ్చినవి. కుంకుమ పూవులు కేవలము దేవుని నిమిత్తము పెట్టిన వస్తువులు వాటికి భర్తకు సంబంధము లేదు. అయినా మానవుడు భర్త లేని స్త్రీని అందహీనము చేయ వలయునను ఉద్దేశ్యముతో చేసిన ఆచారమే కాని మరివేరు కాదు. బ్రాహ్మణులలో మరీ విపరీతముగ తల వెంట్రుకలు కూడ కోల్పోవలసి వస్తున్నది. అట్లే రంగు రంగుల చీరలు కూడ వదలి కాషాయ గుడ్డకు దగ్గరగ ఉన్న ఎర్రగుడ్డనే ధరించవలసి వస్తున్నది. అంతే కాకుండ విధవ ముఖము చూడరాదని అపశకునమని భర్తను కోల్పోయి మానసిక వ్యథకులోనైన స్త్రీని మరీ నీచముగ చూడడము కూడా జరుగుచున్నది. కొన్ని ప్రాంతములలో విధవను బంధువులు కూడ ఇంటిలోనికి రానివ్వరు.

సాటి మనిషిగ పుట్టి ఎన్నో సేవలందించిన స్త్రీని మానవుడు స్వార్థ బుద్ధితో అనుమానించి అందవిహీనము చేయవలయునను ఉద్దేశ్యము తప్ప చిన్నతనము నుండి ఉన్న జుట్టు బొట్టులను మార్చడములో మరియే అర్థము లేదు. ఇది అంతయు కపటమని తెలిసిన పెద్దలు చనిపోయే ముందు తమ భార్యలను ముండ మోయవద్దని చెప్పిన సంఘటనలు కూడ కలవు.

**132. భారతములో అర్జునుని కృష్ణుని నరనారాయణులందురు. ఎందుకు? నరునికి నారాయణునికి తేడా ఏమిటి?**

జ. నారాయణుడంటే నాశనములేని వాడని, నరుడంటే నాశనము కలవాడని కొందరనుచుందురు. పరమాత్మయే మానవునిగ వచ్చినపుడు మానవుని పరిధిలోనే ఉండి ధర్మములు నెలకొల్పును. సామాన్య మానవుడు పుట్టి ఎంత గొప్ప యోగిగ మారిన విన్న ధర్మములను ప్రచారము చేయగలడు గాని నశించిన ధర్మములను తిరిగి తెలియబరచలేడు. నరునికి నారాయణునికి అంతే తేడా.

**పి. యన్. వెంకటనాయుడు, కూచివారిపల్లి**

**133. డబ్బు ఎవరికి చేదు. అందరికి డబ్బు అవసరము. మరి డబ్బు లేనివారు ఎవరు?**

జ. తృప్తి లేనివాడు ఎప్పటికీ లేనివాడే.

**134. దేహమేరా దేవాలయము జీవుడేరా సనాతన దైవము అంటారు. మరి దేవుడెక్కడ?**

జ. దేహము దేవాలయము కావచ్చు జీవుడు దేవుడు కాడు సుమా! ఆత్మ దేవుడుగ శరీర దేవాలయములో ఉంటే ఆ దేవుని అదే గుడిలోని భక్తుడైన జీవాత్మ పూజించాలి. అందువలన దేహము దేవాలయము, జీవుడు పూజించువాడు, ఆత్మ దేవుడు, ఇది సరియైన పద్ధతి. అట్లుకాక జీవుడే దేవుడైతే పూజారి లేని గుడి దేహమవుతుంది. కనుక జీవుడేరాదైవమను మాట అసత్యము.

**135. దేవుని నమ్మినవాడు చెడిపోడు అని అంటారు. మరి దేవుని నమ్మిచెడి పోయిన వారున్నారె?**

జ. తనను నమ్మినవాడు ప్రపంచములో బాగుపడగలడని, నమ్మనివాడు చెడిపోగలడని దేవుడు ఎక్కడ చెప్పలేదు. నమ్మిన వానికి మోక్షము, నమ్మని వానికి కర్మ జన్మలు కలుగుతాయన్నాడు. కాని లాభమొస్తుంది, నష్టము రాదు, సుఖమొస్తుంది, కష్టమురాదని ఎప్పుడు చెప్పలేదు.

**136. నేను దేవుని పూజించునపుడు మనస్సులో పిచ్చి ఆలోచనలు వస్తాయి అవి రాకుండ చేసుకోవాలంటే ఏమి చేయాలి?**

జ. మనస్సులో పిచ్చి ఆలోచనలన్నావు కదా! ఆ నీలోని మనస్సును గూర్చి సంపూర్ణముగ తెలుసుకో ఆ తర్వాత అన్ని ఆలోచనలు రాకుండ పోవు విధానము సులభముగ తెలుస్తుంది.

**ఎ. నల్లప్ప, కొర్రకోడు**

**137. తిరుపతి దేవునికి ఆయన అడగకనే లక్షలు వేసి వస్తారు. సాటి మనిషి కష్టపడుచు అవసరము పది రూపాయలిమ్మంటే ఇవ్వరు ఎందుకు స్వామి?**

జ. కదిలే మనిషికంటే కదలని ఆ రాయి ఎక్కువ లాభము చేకూర్చుతుందని వారి నమ్మకము. అందువలన కష్టపడే మనిషిని వదలి కష్టపడని ఆ ప్రతిమకు ఎక్కువ మనుషులే లాభము చేకూర్చుతుంటారు. సత్యము చెప్పాలంటే మానవునికి ప్రతిది కర్మ ప్రకారమే లభ్యమగుచున్నది. అది తెలియని మనిషి మనము మ్రొక్కిన మ్రొక్కకున్నవచ్చు దానిని ఆ దేవుడిచ్చాడని భ్రమపడి లేని దానికి ఆశపడి ఉన్న దానిని ఇచ్చి వస్తున్నాడు.

**తెన్మఠం సత్యగోపాలాచార్యులు, నరసాపురము**

**138. సుఖ దుఃఖ, ఆకలి దప్పులు, ధన కాంక్ష, కామ క్రోధ, జరా మరణములు బాధించని మార్గము తెలియజేయండి.**

జ. జ్ఞానము తెలిసి ధర్మ మార్గమనుసరించినపుడు లభించు మోక్షగమ్యమొక్కటే మీరడిగిన స్థితిని కలుగజేయు ఏకైక స్థానము.

**139. అదృశ్యమైన దేహానికి పితృ దేవతా ప్రీతితో శ్రార్ధాలు, పిండ ప్రదానములు హోవ్యకావ్యాలు ఎందుకు ఆచరించాలి?**

జ. ఎవరో చెప్పారని అందరు చేస్తున్నారు. అవన్ని అనవసరమని మా భావము. చనిపోకమునుపే మంచిగ చూచుకుంటే బాగుండును. బ్రతికున్నపుడు అన్నము పెట్టలేని వాడు కూడ చనిపోయిన తర్వాత పిండ ప్రధానమని అన్ని వంటలు వండి పెట్టిన కాకులు గ్రద్దలు తినవలసిందేగాని ఏమి ప్రయోజనముండదు.

**140. జీవుడు ప్రేతముగ మారుటకు కారణమేమి? ప్రేత రూప విమోచనానికి విధులెవ్వి?**

జ. ప్రారబ్ధములో శారీరక కర్మ అయిపోయి మానసిక కర్మమాత్రము మిగిలిన వారికి మరణము తర్వాత ప్రేత మగుట గలదు. విమోచనానికి ఏ విధులు ఉపయోగపడవు. వాని కర్మ అయిపోయినపుడే విమోచనమై మరుజన్మకు పోవును.

**141. జీవుడు ఏ కోరికతో ప్రాణము వీడునో మరల ఆ కోరిక తీర్చుకొనుటకై అనువగు శరీరము ధరించగలడా?**

జ. అంత్య సమయములో ఉన్న జ్ఞప్తిని బట్టి జన్మ కలగడము సహజము, ఆ జ్ఞప్తి బ్రతికిన జీవిత సారాంశమును బట్టి ఉండును. అంత్యకాలములో ఏ జ్ఞప్తి ఉండునో ఆ విషయ సంబంధ జన్మ కలుగునని శాస్త్ర సిద్ధాంతము కూడ గలదు. చివరి జ్ఞప్తి దైవము మీద ఉంటే శరీరము ధరించక దైవమును చేరును. భగవద్గీత అక్షర పరబ్రహ్మ యోగములో ఆరవ శ్లోకమును చూచిన పూర్తి వివరము అర్థము కాగలదు.

**142. తమకు చేసిన మంచిని మరచి పోయి కృతఘ్నులై, ఉపకారము చేసిన వారికే అపకారము తలపెట్టిన గురుద్రోహులు యమదండనకు శిక్షార్హులా? లేక ప్రేత రూపులగుదురా?**

జ. ప్రేత రూపము మానసిక కర్మ మీద ఆధారపడినది. అందువలన ప్రేత రూపము రాదు. మరుజన్మలలో భూమి మీదనే యమదండనకు (కర్మ ప్రభావమునకు) గురి అవుదురు.

**143. ప్రకృతి సంబంధ ప్రళయము ఎప్పుడు వస్తుంది?**

జ. గీతలో చెప్పినట్లు కలియుగము 250 మార్లు జరిగినపుడు. 250వ మారు జరుగు కలియుగ అంత్యములో ప్రళయము సంభవిస్తుంది. అనగ మొత్తము వెయ్యి యుగములు జరిగినపుడు.

**సి. చిదంబర రెడ్డి, అనంతపురము**

**144. ధ్యానము లేనిది యోగమును చేరలేమా?**

జ. జ్ఞానమును ఆచరించడమే ధ్యానమంటాము. అది బ్రహ్మయోగములోనే ముఖ్యముగ చెప్పబడుచున్నది. కళ్ళు లేకనే దృశ్యమును చూడలేనట్లు ధ్యానము లేకనే ఆత్మను తెలియలేము.

**145. ఇంతకు ముందు ప్రశ్న-జవాబులందు ఒక ప్రశ్నకు మీ జవాబు పరమాత్మ చదువైతే "మూడు పూర్తి చేసి నాలుగులో ఉన్నాను ఐదుకు పోవాలని అన్నారు. మూడు నాలుగు ఐదు అంటే ఏమిటో అర్థము కాలేదు తెల్ప ప్రార్థన.**

జ. మూడు గుణ స్థానములను వదలి నాల్గవదైన ఆత్మ స్థానములో ఉన్నాను. ఐదవదైన మోక్షము పొందాలని వ్రాశాము. పరమాత్మ చదువు గుణములు ఆత్మ పరమాత్మ మీద ఉండును. కనుక నేను చదివిన దానిని గూర్చి చెప్పాను.

**146. పుత్రులు లేని వారికి పున్నామ నరకమన్నారు నిజమేనా?**

జ. శుద్ధ అబద్ధము. ఎవని కర్మను బట్టి వానికి నరకముండును. కాని పుత్రులను బట్టిగాని మరి ఏ ఇతరులను బట్టి కర్మ మార్పు ఉండదు.

**147. బాల్యములో బాల బాలికలకు ఆధ్యాత్మిక చింతన అనవసరమని కొందరు పెద్దలు అంటారు నిజమేనా?**

జ. కొంత కాలమే ఉపయోగపడు ప్రపంచ విద్య నేర్పుటకు బాల్యము రాకమునుపే శిశుదశలోనే మొదలు పెట్టించే పెద్దలు శాశ్వితమైన గొప్పదైన బ్రహ్మ విద్యను బాల్యములో ఎందుకు నేర్పరాదన్నారంటే బ్రహ్మవిద్య యొక్క విలువ వారికి తెలియదు కనుక వారు వయస్సుకు పెద్దలే కాని తెలివికి పెద్దలు కారు. బాల్యములో నుండి నేర్పితేనే బ్రహ్మవిద్య బాగా పట్టుబడును. బ్రహ్మవిద్య కాషాయ గుడ్డలు వేపిస్తుందని కొందరు భయపడి ఆ విధముగ కూడ చెప్పి ఉండవచ్చును. నిజమైన బ్రహ్మవిద్యలో కాషాయగుడ్డలు వేయవలసిన అవసరము లేదు. ఈ విషయములో ఇస్లామ్ మతమును, క్రైస్తవమతమును చూచి నేర్చుకోవలసి ఉన్నది.

వారు చిన్న తనములోనే ఇస్లామ్‌ను గురించి క్రైస్తవమును గురించి పిల్లలకు తెలియజేస్తున్నారు.

**148. గ్రామ దేవతలు, క్షుద్ర దేవతలు ఎవరు? వారి ద్వారా మోక్షము పొందవచ్చునా?**

జ. గ్రామ దేవతలు క్షుద్ర దేవతలు ఇరువురు ఒకటే వేర్వేరు కాదు. వారి ద్వార కర్మలు వస్తాయి కాని మోక్షము రాదు.

**జి. మల్లేశ్వరి, మద్రాసు**

**149. కాలక్రమేపి ధర్మాల స్థానములో అధర్మాలు తయారైతాయని మీరే అన్నారు అటువంటపుడు ఏమి తెలియని మేము దేనిని ధర్మము అనుకోవాలి?**

జ. నిరూపణకు వచ్చునది ధర్మము, రానిది అధర్మము. కావున శాస్త్రము ప్రకారము నిరూపణకు వచ్చునదే ధర్మమని తెలియవలయును.

**150. ధర్మము అంటే ఏమిటి?**

జ. దేవుని గూర్చి తెలియజేయు శాసనము లేక సిద్ధాంతము.

**151. కాలము విలువైనదా, జ్ఞానము విలువైనదా?**

జ. కాలమును తెలుపునది జ్ఞానము. జ్ఞానము తెలిసిన తర్వాతే కాలమంటే ఏమిటో తెలియును. అందువలన మొదట జ్ఞానము తర్వాత కాలము గొప్పది. కాలమే నేనని పరమాత్మ గీతలో విశ్వరూపసందర్శన సమయమున జవాబిచ్చాడు. దైవ స్వరూపమైన కాలము యొక్క నిజస్వరూపమును తెలియవలయునంటే మొదట జ్ఞానమవసరము.

**152. తుమ్ములు, కట్టెలు అశుభముగ తమలపాకులు, టెంకాయలు శుభ సూచకముగ భావిస్తారు నిజమా?**

జ. తుమ్ములు, కట్టెలు అశుభము గాదు. తమలపాకులు, టెంకాయలు

శుభముగాదు. గ్రహచారము బాగలేనపుడు తుమ్ములు, కట్టెలు అశుభమనిపించును గ్రహచారము బాగున్నపుడు అన్ని శుభములే అవుతాయి.

**153. కొన్ని పంచాంగములలో పలాన సమయములో ప్రయాణిస్తే బాగుండునని, ఇది మంచి కాలము, ఇది చెడ్డ కాలమని వ్రాసి ఉంటారు. అది నిజమేనా?**

జ. మంచిచెడులు జ్యోతిష్యశాస్త్రము ప్రకారము పంచాంగము ద్వార తెలుసుకొను ఫలితమని, నామ నక్షత్రమును బట్టి చూచుకోవచ్చని వ్రాసినవి సత్యములు కావు. పంచాంగము తిథి వార నక్షత్రములను గణిత రూపముగ తెలుపగలదు, కాని ఫలితములను తెలుప లేదు. అందులో ఉన్నవన్ని సత్య ఫలితములు కావు.

**154. మేము మనస్సు ద్వార చేయు ప్రార్థనలు గురువుకు చేరుతాయని దాని ద్వార ఆశీర్వాదములు గురువు నుండి లభిస్తాయని మా నమ్మకము మీరేమంటారు?**

జ. ఒక విధముగ నమ్మకము చాలా గొప్పది. ఆ నమ్మకము ఎంతటి గొప్ప కార్యములనయిన చేయగలదు. నిజ గురువు మీలోనే ఉన్నాడు కాని ఆయనకు దయలేదు ఆశీర్వాదము ఇవ్వడు. అట్లని ఊరకుండు వాడు కాడు. మీకు ఆయన మీద ఎంత భక్తి శ్రద్దలు పెరుగుతాయో అంత జ్ఞానము ఆయన వద్ద నుండి లభించగలదు.

**155. సూర్య గ్రహణ సమయములో కొన్ని కిరణాల వల్ల చెడు జరుగునని, వాటి దోష నివారణకు ధర్భలు అన్నిటిలోను వేయాలని స్నానము చేయాలని ఇల్లంతా కడుగుకోవాలని చాలా నియమాలు చెప్తారు అవన్ని అవసరమా?**

జ. సూర్యగ్రహణ సమయములో సూక్ష్మ కిరణాలు ప్రసరించడము నిజమే కాని వాటి వలన అందరికి ప్రమాదముండదు. జాతకరీత్యా సూర్యుడు వ్యతిరేఖియై

ఆరవ స్థానమున ఉన్నపుడు గానీ ఆ స్థానమును చూచుట గాని జరిగిన అటువంటి వారికి సూర్య గ్రహణ సమయములో ప్రసరించు కిరణముల ద్వార దోషముండ వచ్చును. మిగత వారికి ఏ దోషములేదు. ఆ కిరణములు ఏవైన మానవునికి దేహము మీదనే పని చేయును. కావున అన్నిటిలో దర్భలు వేయడమునకు అర్థము లేదు. కొన్ని రోగములు కలవారు సూర్యగ్రహణ సమయములో బయట సూర్యరశ్మిలో ఉండుట వలన వారి రోగములు నివారణ అయిన సంఘటనలు గలవు. కావున సూర్యగ్రహణము అందరికి కీడు చేయదు.

**156. చెట్టు చేమలకు ప్రాణమున్నదన్నారు. మన ఆహారము వాటి మీదనే ఆధారపడినది. చివరకు కూరలు తినిన వాటిని బాధించిన వారవుతాము. ఆహార పచనమునకు ఉపయోగించు కట్టెలు కూడ చెట్టు కొట్టనిది రాదు. అటువంటపుడు మనకు పాపము వస్తుందంటారా?**

జ. హింస అన్న తర్వాత ఏద్దైన హింసే కదా! పాపమన్న తర్వాత ఏదయిన పాపమే కదా!! మనము చేసే ప్రతి పనికి పాపమో పుణ్యమో ఉండి తీరును. కావున హింసకు పాపము తప్పకవచ్చును. అట్లని ఆహారము మానుకోలేము. అహింసగ ఉండి బ్రతుక జాలము. ఇటువంటి సమయములో గీతలో దేవుడు చెప్పిన **"యజ్ఞార్థా త్కర్మణోన్య త్ర లోకోయం కర్మ బన్దనః"** అను విధానమాచరించిన ఏ కర్మ అంటక బ్రతుకగలము.

**157. వీరబ్రహ్మము గారు ఏడవ మాసములోనే గర్భమందు శిశువుకు ప్రాణము వచ్చునన్నారు. మీరేమో గర్భము నుండి శిశువు బయటపడిన తర్వాతే ప్రాణము వచ్చునన్నారు. ఏది నమ్మాలి?**

జ. గ్రుడ్డిగ దేనిని నమ్మవద్దండి ఏది నిరూపణకొస్తే దానిని నమ్మండి. వీర బ్రహ్మము గారు భవిష్యత్ కాలమును గూర్చి తాటి ఆకుల మీద వ్రాసాడు కాని గర్భస్థ శిశువును గురించి వ్రాయలేదు. ఆయన ఉన్నపుడు ఆయన బోధవిన్నవాడు

ఒక సిద్దయ్య మాత్రమే. ఆ బోధ సిద్దయ్య వరకే పరిమితమైనది. ఈనాడు బ్రహ్మముగారి పేరు పెట్టి వ్రాసినవారు ఆనాటివారు కారు. వీరు ఆయన పేరు మీద వ్రాసిన వ్రాతలు ఆయన (బ్రహ్మము) గారివి కావు. బ్రహ్మము గారు రహస్యముగ సిద్దయ్యకు తెల్పిన షట్చక్రవివరమును గూర్చి ఆనాడు దొంగగ విన్న కక్కయ్యకే అర్థము కాలేదు. ఆ విషయమును ఈనాటి వారు ఎలా వ్రాయగలిగారు? ఆయన తాటి ఆకులను గ్రంథరూపము చేసిన కాల జ్ఞానము తప్ప ఆయన పేరు మీద వెలువడుకొన్ని విషయములు చెట్టు పేరు చెప్పి కాయలను అమ్ముకోవడము లాంటిది. బ్రహ్మముగారు గొప్ప యోగి. నేటికి సజీవముగ యోగమునందున్న వాడు. ఆయన ఎప్పటికీ అసత్య వాక్యములు చెప్పి ఉండరు. నిరూపణకు రాని విషయములు ఆయన పేరు మీద కల్పించినవని తెలియాలి. శిశు జన్మ గురించి మేము ప్రకటించినది నూరుపాల్లు శాస్త్రబద్ధమైన సత్యము. దానికి గీత ఆధారమున్నది. నేడు ప్రత్యక్షముగ జరుగుచున్నది.

**158. ప్రతి జీవి మరణించిన వెంటనే జన్మిస్థాడా లేక ఏవైన లోకములలో కొంత కాలముంటాడా?**

జ. చనిపోయిన క్షణమే వేరు శరీరమును ధరించడము జరుగుచున్నది. వేరు లోకములకు పోయేది ఏ మాత్రము లేదు, వేరే లోకములు అసలుకు లేవు. అకాల మృత్యువు పొందినవారు మాత్రము వారి ఆయుస్సు అయిపోయి కాల మరణము వచ్చువరకు సూక్ష్మముగ ఉందురు. పూర్తి మరణము సంభవించిన తర్వాత క్రొత్త దేహము ధరింతురు.

**159. అంగ సౌష్టవము ఉన్న వారికి తొందరగ జ్ఞానము పట్టుబడునని అందహీనముగ మెల్లకన్ను, పిల్లి కన్నులు, తుట్టె పెదవులు ఉన్న వారికి పరమార్థ విషయములు ఆలస్యముగ పట్టుబడునని అంటారు నిజమేనా?**

జ. అంగ సౌష్టవమునకు జ్ఞాన అవగాహనకు సంబంధము లేదు.

**160. రామక్రిష్ణ పరమ హంస, రమణ మహర్షి, వివేకానంద మొదలగు వారు గొప్ప యోగులని వారు దేవునియందైక్యమైన వారని నమ్ముచున్నాము. మీరే మంటారు.**

జ. గీతయందు దేవునియందైక్యమగు సమయము ఒక సూత్రము ప్రకారము నిర్ణయమై ఉన్నది. యోగులకు మాత్రమే ఆ సూత్రము వర్తించును. యోగులు మరణించిన సమయమును బట్టి వారు మోక్షము పొందినది లేక జన్మకు పోయినది తెలుసుకోవచ్చును. ముగ్గురు రాత్రిపూట చనిపోయారు, కావున పై ముగ్గురు మోక్షమునకు పోలేదు.

**యం. ఖాజామైనుద్దీన్, గరుగుచింతలపల్లి**

**161. మానవునికి ఆలోచన మాటలు రావడము వల్ల కుల మత వర్గ వైషమ్యాలకు దారి తీస్తున్నదని లేకున్న సర్వ మానవజాతి ఒక్కటేమోననిపిస్తుంది మా అభిప్రాయము.**

జ. మీ అభిప్రాయమే నా అభిప్రాయము గుణముల వలననే ప్రపంచములో మానవుడు అనేక వక్రమార్గములు పట్టుచున్నాడు. అందులో మతము మరియు మత ద్వేషమనునది కూడ ఒక వక్ర మార్గమే. నూటికి నూరు పాల్లు మనుషులంతా ఒక్కటే కాని మనలోని గుణములే వేరు వేరుగ ఉన్నవి.

**162. స్త్రీలలో "Y Y" క్రోమోజోములు, పురుషులలో "X Y" క్రోమోజోముల ఉనికిని బట్టి వారియందు స్త్రీ పురుష లక్షణములుంటాయి. స్త్రీ పురుష జననానికి పురుషుడే కారణ భూతుడైనపుడు ఇందులో స్త్రీ పాత్ర ఎంత?**

జ. ఈ ప్రశ్న భౌతిక శాస్త్రమునకు సంబంధించినది. మానవ జాతి ఉత్పత్తికి పురుషుని పాత్ర కొంత వరకే స్త్రీ పాత్ర చాలా ఎక్కువ ఉన్నది. స్త్రీ పురుష శరీరములు స్త్రీ గర్భములోని క్రోమోజోముల మీద ఆధారపడి తయారగు చున్నవి. కాని పురుషుని పాత్ర అందులో ఏమి లేదు. పురుష వీర్య కణములు స్త్రీ పురుష

భేదము లేనివై అన్ని ఒకే మాదిరి ఉండును. ఆ వీర్యకణములు స్త్రీ గర్భములో అండముతో చేరిన తర్వాత గర్భము నిలచి, స్త్రీ గర్భమందు గల క్రోమోజోముల మీద ఆధారపడి స్త్రీ పురుష శిశు శరీరము తయారగును.

**163. పురుషుని వీర్య కణము ద్వార ఉద్భవించిన స్త్రీ శరీరములో త్వరిత ఆలోచన, నిర్ణయము, చిత్తచాంచల్యము, పట్టుదల, ఇతరుల మాటలపై తొందరగ నమ్మకము, శక్తిని మించిన పనులు చేయుట, వెనుక ముందు ఆలోచించక పనిలో దిగుట, ఆలోచన నిర్ణయములో కఠిన వైఖరి మొదలగునవి ప్రత్యేకించి ఉండడములో మీ కూలంకశ అభి ప్రాయము తెల్ప ప్రార్థన.**

జ. స్త్రీలలో మనస్సు బుద్ధి చిత్తము అహము ఈ నాలుగు పురుషులకంటే చాలా కఠినమైనవి మరియు చాలా సున్నితమైనవిగ ఉన్నవి. కావున ప్రత్యేకించి వారిలో పై మీరు చెప్పిన లక్షణములున్నవి. స్త్రీలయంతటి సున్నితము, స్త్రీలయంతటి కఠినము ఏ పురుషులలో ఉండక పోవచ్చును.

**164. ఆడ శిశువు గర్భ విచ్ఛిత్తి వల్ల అంతరించి పోతున్న స్త్రీ జాతిపై మీ ప్రబోధాత్మక సందేశము ఏమిటి?**

జ. కర్మ కారణము వలన గుణముల ప్రేరేపణచే జరుగు పని అని మా సందేశము. స్త్రీ జాతిలేని మనుగడ అసాధ్యమనిపించి ఆ పనిని మాన్పించడము కూడ కర్మ చేతిలో ఉన్నది.

**165. స్త్రీ శక్తిస్వరూపిణి, ఆదిశక్తి అంటారు. దీని భావమేమి?**

జ. అది ప్రకృతికి పెట్టిన పేరు వాస్తవముగ శరీర స్త్రీకి వర్తించదు. దేవుని తర్వాత దేవునంతటిది ప్రకృతి. ప్రకృతిని స్త్రీతో పోల్చి గీతలో కూడ చెప్పాడు. దేవుని విషయము తెలియని వారు స్త్రీ శక్తిస్వరూపిణి ఆదిశక్తి అనడములో తప్పు లేదు.

**166. స్త్రీ చూపు భస్మీపటలము, పలుకు ప్రళయము, నడక చుక్కాని లేని**

**పడవ ప్రయాణము, ఇది పురుషునిపై ప్రభావము. దీనిపై తమ అమూల్య సందేశము ఏమిటి?**

జ. స్త్రీల వ్యామోహములోపడిన పురుషులకు స్త్రీ చూపు, పలుకు, నడక మీరన్నట్లు ఏమైన కావచ్చును. కాని స్త్రీ వ్యామోహము లేని పురుషులకు స్త్రీల చూపులో చల్లదనము, పలుకులో ప్రశాంతత, నడకలో ఆదరణ కనిపిస్తాయి.

**అనసూయ, నంద్యాల**

**167. తల్లి గర్భములో శిశువుకు గత జన్మ జ్ఞాపకాలు వస్తాయని కొన్ని పుస్తకములలో ఉన్నది. ఆ విషయము వాస్తవమేనా?**

జ. ముమ్మాటికి అసత్యము. తల్లి గర్భములోని శిశు శరీరములో జీవుడే లేడు. మీరు మా రచనలలోని **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథము చదవండి.

**మందుల నారాయణ, బిల్కల గూడూరు**

**168. మరణించిన తర్వాత జీవుడు యమలోకానికి పోయి అక్కడ పాప ఫలితము అనుభవిస్తాడని, కాగుతున్న నూనెలో వేస్తారని, రంపములతో కోస్తారని, అగ్నిలో కాలుస్తారని, శూలములతో పొడుస్తారని మొదలగునవి ఉన్నవి కదా! ఇది నిజమేనా?**

జ. మీది చాలా మంచి ప్రశ్న. ఈ విషయములో చాలా మంది మీరు చెప్పినవన్ని యమలోకములో ఉన్నాయని పొరపడుచున్నారు. కాని వాస్తవముగ యమలోకమనునది ఎక్కడోలేదు. అక్కడ ఏమో అనుభవిస్తామనునది ఏమిలేదు. జీవులు చేసుకొన్న పాపమును భూమి మీదనే తర్వాత జన్మలో అనుభవిస్తున్నారు. మీరు యమలోకములో ఉన్నాయని ఏవయితే తెలిపారో అవి అన్నియు భూమి మీదనే చూడవచ్చును. డాక్టర్ల సూదులు ఇనుప ముక్కు కాకులు గాదా! అగ్నిలో కాలేవారు లేరా! నూనెలో కాలినవారు లేరా! పార్టీలలో ఈటెలతో (శూలములతో)

చెక్కించుకొను వారు లేరా! అందువలన భూమి మీదనే యదార్థముగ యమలోకము, స్వర్గలోకము రెండు ఉన్నవి. మానవుడు ఎక్కడయితే పాప ఫలితమైన కష్టమును అనుభవించుచున్నాడో అప్పుడది వానికి యమలోకము, ఎక్కడయితే సుఖపడు చున్నాడో అప్పుడది వానికి స్వర్గలోకమని తెలియవలయును. కనపడని అసత్యమును వదలి కనపడు సత్యమును నమ్మలేకున్నారు. తమలాంటి వారు ఇది నిజమని జ్ఞానము నిరూపణకు వచ్చేదని తెలిసినదానిని ఇతరులకు తెలుపండి.

**169. ఆడవారు మగవారు అని మానవులలో రెండు జాతులున్నవి కదా! వారు మరణించిన తర్వాత ఆడవారు మగవారుగ, మగవారు ఆడవారుగ పుట్టవచ్చునా?**

జ. శరీరములో ఉన్న జీవులకు ఆడ మగ అని తేడా ఏ మాత్రము లేదు. శరీరములు మాత్రమే ఆడ మగ అని వేరుగ ఉన్నవి. జీవుడు చేసుకొన్న కర్మ ప్రకారము మగవారు తర్వాత జన్మలో ఆడవారుగ, ఆడవారు మగవారుగ కూడ పుట్టవచ్చును.

**కె. శీతారామయ్య, ప్రొద్దుటూరు**

**170. ఆరు సంవత్సరముల పిల్లవాడు అకాల మృత్యువు కాకుండ సహజ మరణము పొందినాడు. ఇంత చిన్న వయస్సులో చనిపోవుటకు కారణము? ఈ జన్మలో పాపపుణ్యములు చేసే వయస్సు కాదు, కావున అతనికి భవిష్యత్ జన్మ విషయము తెల్ప ప్రార్థన.**

జ. సంచిత కర్మ నుండి కేటాయించబడిన కర్మను ప్రారబ్ధము అంటారు. అది పుట్టినప్పటి నుండి చనిపోవు వరకు నిర్ణయించబడి నడిపించ గలదు. మీరు తెల్పిన బాలునికి ప్రారబ్ధములో మానవ జన్మ అంత వరకే నిర్ణయమై ఉండును. అతని సంచితములో మానవ జన్మకు అవసరమగు కర్మ ఆరు సంవత్సరములంతే ఉండును. తర్వాత వేరు జన్మకు సరితూగు కర్మ ఉండును. అందువలన మానవ జన్మ ప్రారబ్ధము అయిపోయిన వెంటనే చనిపోయి ఉండును.

చిన్న వయస్సులో పాప పుణ్యములు సంపాదించలేరు కావున ఈ ఆరు సంవత్సరముల వయస్సులో కర్మను అనుభవించడమే జరిగినది కాని క్రొత్త అగామి కర్మను సంపాదించి ఉండడు. ఒక జన్మలో క్రొత్త కర్మ సంపాదించకున్నను పాత కర్మ అనగ సంచిత కర్మ కొన్ని జన్మలకు సరిపోవునట్లు మిగులు ఉండును. కనుక ఆ బాలునికి వాని సంచితము నుండియే ప్రారబ్ధము నిర్ణయించబడి రెండవ జన్మకు పోయి ఉండును. మీకు ఈ విషయము బాగ అర్థము కావలయునంటే త్రి కర్మల విషయము బాగ తెలిసి ఉండవలెను. ఇక్కడ కొద్దిగ తెల్పుచున్నాము.

**ప్రారబ్ధ కర్మ :** పుట్టినప్పటి నుండి మరణించువరకు అనుభవింపబడునది.

**ఆగామిక కర్మ :** పుట్టినప్పటి నుండి మరణించు వరకు క్రొత్తగా సంపాదించు కొనునది.

**సంచిత కర్మ :** జన్మల పరంపరలో మిగులుబడినది (జమ ఖర్చు పోగ మిగిలినది)

ఒక జన్మలో సంపాదించుకొన్న అగామిక కర్మ వెంటనే సంచిత చివరి భాగములో చేరి సంచితముగ మారుచుండును.

**171. భారత భూమి పుణ్యభూమి అని సర్వ మోక్ష సాధకులకు భారత భూమి తగినదని, ధర్మమునకు, మోక్షసాధనకు, జ్ఞానసముపార్జనకు ఆలవాలమైనదని పెద్దలు చెప్పుదురు. అటువంటి భారత భూమిలో మానవుడు తెలిసి ఊహించరాని భరించరాని క్షమించరాని తప్పులు చేయుచున్నాడు దీనికి పరిహారము గలదా?**

జ. ప్రపంచ దేశములలో ఏ దేశములోనైన చేసిన తప్పును బట్టి పాపము వచ్చి చేరుచుండును. ఘోరమైన తప్పు చేసినపుడు ఘోరమైన పాపమే ఆగామిక కర్మగ వచ్చి సంచిత కర్మ వరుసలో చేరి తిరిగి ప్రారబ్ధమై ఎప్పుడో ఒక జన్మలో వరుస క్రమమున అనుభవానికివచ్చును. అపుడు చేసుకొన్న జీవుడు చేసుకొన్నంత అనుభవించును. అపుడు బాధపడుచు ఏ జన్మ కర్మో అనిన, నేనెంత పాపినో

అనిన, కర్మమాత్రము అనుభవించు వరకు పోదు. చేసుకొన్న వాడు తిరిగి అనుభవించినపుడే పరిహారమవుతుంది.

**తల్లం సుబ్బ నరసింహమ్మలు, ప్రొద్దుటూరు**

**172. జ్ఞానాన్ని యోగంగా మార్చుకోవడము ఎలాగా?**

జ. ఆత్మ సంబంధ విషయములు తెలుసుకోవడమే జ్ఞానము. తెలుసుకొన్న విషయములు అమలు పరచడమే యోగసాధన.

**173. యోగాలు అనేకము ఉన్నవి కదా?**

జ. దేవుని తెలుసుకొనుటకు ఉన్నవి రెండే యోగములు, జ్యోతిష్యములోనికి పోతే యోగాలు చాలా ఉంటాయి. అవి ప్రపంచసంబంధమైనవి. ఇక్కడ మనకు కావలసినవి దైవ సంబంధమైనవి. 1. కర్మయోగము (రాజ యోగము), 2. జ్ఞాన యోగము (బ్రహ్మయోగము).

**174. జ్ఞానాగ్నిని నిరూపించిన బ్రహ్మము గారు, ఏసు ప్రభువు మొదలగు యోగులు పూర్వముండిరని తెల్పినారు. అటువంటి వారు మోక్షాసక్తి గలవారికి జ్ఞానాన్ని యోగంగా మార్చి బోధించి నిరూపనాత్మకంగా కర్మ నాశనము చేయగల శక్తిని నిరూపించగల వారు మాకు కావాలి. ఎక్కడయిన ఉన్నారా దయచేసి తెలుప ప్రార్థన.**

జ. ఎక్కడున్నారో మాకు తెలియదు. మీకు యోగశక్తిని సంపాదించు కోవాలను ఆసక్తి ఉంటే, నిరూపనాత్మకముగ తెలుసుకోవాలంటే మేము అనుసరించు మార్గమునే మీరు అనుసరించండి. మీకు ఆ శక్తి నిరూపణకు రాగలదు. మేము అహముతో ఈ మాట చెప్పడము లేదు. ఉన్న సత్యమును తెల్పుచున్నాము. జ్ఞానాగ్ని నిరూపణార్థము మా వద్ద చాలా మంది కర్మలు కాలి పోయిన సంఘటనలు కూడ జరిగాయి.

**యం. మారుతినాయుడు, కూచివారిపల్లి**

**175. జీవుల ప్రళయ సంభవములకు నా ప్రకృతియే కారణమన్నాడు దేవుడు ఈ విషయము జ్ఞానులకేనా? లేక అజ్ఞానులకు జ్ఞానులకు వర్తిస్తుందా?**

జ. మోక్షము పొందని వారికందరికి వర్తించు సూత్రమిది. అజ్ఞానులకు జ్ఞానులకు అందరికి ప్రళయము తప్పదు, కాని మోక్షము పొందిన వారికి ప్రళయము లేదు, ప్రభవము లేదు.

**176. బ్రహ్మరాత్రి ప్రారంభములో జీవులన్నియు ప్రళయము ఎందుకు చెందును?**

జ. అది సృష్టి విధానము. మనకు రాత్రి అయిన వెంటనే నిద్ర వచ్చును కదా! దానిని ఆపలేము కదా! రాత్రి అయిన వెంటనే నిద్ర ఎందుకు వచ్చునో అట్లే బ్రహ్మరాత్రి వచ్చినపుడు ప్రళయము నిర్ణయించబడినది.

**177. వెయ్యి యుగములు ఎన్ని సంవత్సరములు?**

జ. 108 కోట్ల సంవత్సరములు. ఈ సంఖ్యను బట్టియే మంత్రారాధనలో 108 సంఖ్యకు ఎక్కువ విలువ ఉన్నది. ఈ సంఖ్య మరువకుండునట్లు జపమాలలో 108 పూసల మాల అన్ని మతములలో ఉండడము గమనించవచ్చును.

**178. బ్రహ్మరాత్రి వచ్చినపుడు సూర్య చంద్రులు ఉండరా?**

జ. విశ్వమే లేకుండా పోయినపుడు సూర్య చంద్రులు ఎలా ఉంటారు. సూర్య చంద్రులు కాని, నక్షత్రములు కాని, ఆకాశము కాని ఏమి ఉండవు. దైవముచే సృష్టి యొక్క క్రమమే అలా నిర్ణయించబడినది.

**బి. రవీంద్ర రెడ్డి, చెన్నేకొత్తపల్లి**

**179. యుగ యుగములో పరమాత్మ భగవంతునిగ అవతరిస్తారని అంటారు నిజమేనా?**

జ. అధర్మములు చెలరేగినపుడు పరమాత్మ భగవంతునిగ పుట్టడము వాస్తవమే.

కాని ప్రతి యుగములోను పుట్టవచ్చును పుట్టకపోవచ్చును. ఒక యుగములో రెండుమార్లయిన పుట్టవచ్చు లేక రెండు యుగములకొక మారయిన పుట్టవచ్చు. ముఖ్యముగ అధర్మములు చెలరేగినపుడు పుట్టుట వాస్తవము.

**ఇ. అంజిన రెడ్డి, చంద్రగిరి**

**180. ప్రబోధాత్మజమ్ పత్రికలో కూచివారి పల్లె పురుషోత్తమ నాయుడు గారి ప్రశ్నకు జవాబుగ దేవుడు కనిపించడు. చూపుకు కనిపించు వాడు దేవుడుకాదని అన్నారు. ఒకప్పుడు వివేకానందుడు రామక్రిష్ణ పరమహంసను సమీపించి తాము దేవుని చూచారా అని ప్రశ్నించినపుడు జవాబుగ అవును చూచాను. నేను నిన్ను ఎట్లు చూచుచున్నానో అట్లే దేవుని చూడవచ్చును. అని సమాధానము రామక్రిష్ణ ఇచ్చాడు. మీ జవాబుకు రామక్రిష్ణ పరమహంస జవాబుకు చాలా తేడా ఉన్నది. వివరింపగోరుచున్నాము.**

జ. అవును ఆయన జవాబుకు మా జవాబుకు చాలా తేడా ఉన్నది. ఆయన పరమహంస, నేను యోగిని అందువలన చాలా తేడా వచ్చింది. మా జవాబు తరపున మేమిచ్చు వివరము ఏమనగా! దేవుడు ఇంద్రియ అగోచరుడని గీతలో దేవుడు కూడ చెప్పాడు. అందువలన ఇంద్రియములకు తెలియునది దేవుడుకాదను సూత్రము ప్రకారము కనుపించునదంతయు దేవుడు కాదని చెప్పవచ్చును. అట్లయినపుడు దేవుడే భగవంతునిగ పుట్టినపుడు ఆ భగవంతుడు కంటికి కనిపిస్తున్నాడు కదా! అపుడు దేవుని చూచినట్లవును కదా అని కొందరికి అనుమానము రావచ్చును. దానికి సమాధానమేమనగా! దేవుడు భగవంతునిగ వచ్చిన పైన కనిపించు శరీరము ప్రకృతిదే కావున దేవుని చూడలేము. భగవంతుడే ఎదురుగ వచ్చినప్పటికి ఆ శరీరము కనిపించును కాని అందులోని దేవుడు కనిపించడు కదా! కనిపించునదంతయు ప్రకృతియే, కాని లోపలి దేవుడు కనిపించడు. కావున మేము కనిపించువాడు దేవుడు కాదు అన్నాము. దేవుడు

కనిపించడు అనే దానికి శాస్త్ర ఆధారమున్నది. దేవుడు కనిపించును అనే దానికి శాస్త్ర ఆధారము లేదు. ఆధారమున్న మాట నిజమో, ఆధారము లేని మాట నిజమో మీరే యోచించండి. దేవుడు ఇంద్రియాగోచరుడు అనగ ఇంద్రియములైన కన్నుకు కనిపించడు అన్నది దేవుడే చెప్పిన వాక్యము. కావున ఏది నిజమో ఆలోచించండి.

**పి. రంగయ్య, యు.డి.సి., మడకశిర**

**181. జీవన్ముక్తి అంటే ఏమిటి? ప్రస్తుతము ప్రపంచములో జీవన్ముక్తులు ఉండు అవకాశమున్నదా?**

జ. ముక్తి అనగ విడుదల అని అర్థము. జీవన్ముక్తి అనగ జీవుడు శరీరమను జైలు నుండి కర్మ అను శిక్ష లేకుండ అయిపోయినపుడు బయట పడడమని అర్థము. కర్మ ఉన్నంత వరకు శరీరముండును. కర్మ అయిపోయినపుడు శరీరము లేకుండ పోయి ఆ శరీరములో ఉన్న జీవుడు అణువణువున ఉన్న పరమాత్మలో వ్యాపించి పోవును. దానినే జీవన్ముక్తి అని అందురు. జీవుడు ముక్తి పొందడమే జీవన్ముక్తి అను మాటకర్థము. ముక్తి పొందిన జీవుడు అనూహ్యామైన పరమాత్మలో ఐక్యమై ఉండి కంటికి తెలియడు. కావున వారు ప్రపంచములో దృశ్యరూపమై ఉండరు. అందువలన ప్రపంచములో జీవన్ముక్తులను వారు ఉండు అవకాశము లేదు.

**182.** "ఓం త్రయం బకం యజామహే సుగందమ్ పుష్టి వర్ధనమ్
ఉర్వారు కమిప బందనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్"

**దీనిని మృత్యుంజయ మంత్రమని అన్నారు. దీనర్థము తెలియజేయాలని కోరుచున్నాము.**

జ. అర్థమా! నేను సంస్కృత పండితుడను కాను. నేను కేవలము బ్రహ్మా విద్యా పండితుడను. అందువలన అర్థము చెప్పలేము. మీరు అడిగారు కావున

కష్టపడి కొద్దిగ అర్థము చెప్పగలము. దాని సత్యము పూర్తి చెప్పగలము. శరీరము దృఢముగ బలముగ తయారయి మృత్యువు మృతించి అమృతము గలిగి నేను సజీవముగ ఉండవలెనను భావము పై మంత్రములో ఇమిడి ఉన్నది.

ఇక సత్యము చెప్పాలంటే ఈ మంత్రము 108 సార్లు జపించవలెనను నియమ సంఖ్య కూడ ఉన్నది. ఈ మంత్రము జపించువారు ఎందరో ఉన్నారు. అయిన ఈ మంత్రములో మృత్యువును జయించబడు శక్తి లేదు. మృత్యుంజయము అనునది ప్రపంచములో లేనేలేదు. పుట్టిన ప్రతి జీవి మరణించవలెనను యోగ శాసనమును ఈ మంత్రము వ్యతిరేకిస్తున్నది. ఈ మంత్ర ఫలితము ఏమాత్రము నిరూపింపబడదను నిరూపణ కూడ ఒకటి తెలియజేస్తున్నాము. అనంతపురము వాస్తవ్యుడు టి.కె.కోదండరామ నాయుడు గారి పెద్ద కుమార్తె టి.కె. సరస్వతి యం.యస్.సి., 1956 లో హృషీకేశ్ శివానంద స్వామిగారి వద్ద ఉపదేశముగ పై మంత్రాన్ని స్వీకరించి నియమము తప్పక ఉదయము సాయంత్రము జపిస్తు ఉండేది. 1957 ఆగస్టు 3వ తేదీన పై మంత్రమును ఎదిరించిన మృత్యువు ఆమెను కబళించి వేసింది. ఈ అనుభవము పై మంత్రము యొక్క సారాంశమును తెలియబరుస్తున్నది కావున మీరే యోచించండి.

**దండా జయరామ్, ఉరవకొండ**

**183. మరణించిన జీవాత్మలు బ్రతికి ఉన్న శరీరములోనికి ఆవహించుట మీరు విశ్వసిస్తారా?**

జ. విశ్వసించము. మరణించిన జీవాత్మలు ఆ క్షణమే మరుజన్మకు పోవును కాని బ్రతికి ఉన్న వారి లోనికి చేరవు. మరణించకుండ స్థూలశరీరమును కోల్పోయి సూక్ష్మశరీరము కల్గి ఉన్నవారు మాత్రము బ్రతికి ఉన్న శరీరములోనికి ప్రవేశించు అవకాశము గలదు. మరణించినప్పటికి మరుజన్మకు పోనివారు చావని వారితో సమానమే. వారు కాలమరణముకాక అకాలమరణము పొంది ఉందురు. అట్టివారు ఇతరుల శరీరములలోనికి ప్రవేశించుటకు వీలున్నది. ఈ విషయము

పూర్తి అర్థము కావలయునంటే మా రచనలలోని **"ప్రబోధ"** **గ్రంథములో "గ్రహాలు - విగ్రహాలు"** అను అధ్యాయము చదువవలెను.

**యం. రామారావు, కలుగొట్ల**

**184. 1. నీవు ఎవరు?**

జ. నేను జీవాత్మను

**2. ఎచటి నుండి వచ్చితివి?**

జ. పరమాత్మ నుండి

**3. ఎచటికి పోవుదువు?**

జ. పరమాత్మ లోనికే

**4. రాకపోకల అంతర్యమేమిటి?**

జ. కర్మననుభవించుటయే.

**చాగము నారాయణ రెడ్డి, టి. తిమ్మాపురము**

**185. భాగవతము 18 పురాణములలోనిదని మీరు చెప్పారు. అది ఉప పురాణములోనిదని అనుకొన్నాము మా సందేహము తీర్చ ప్రార్థన.**

జ. భాగవతము ఉప పురాణము కాదు. దీని పూర్తి పేరు భాగవత పురాణము. ఇందులో 18 వేల శ్లోకములుండును. ఉప పురాణములు 1. సనత్కుమారము, 2. నారసింహము, 3, స్కందము, 4, శివ దర్శనము, 5, దౌర్వాసము, 6. నారదీయము, 7. కపిలము, 8. వామనము, 9. ఔశనము, 10. బ్రహ్మాండము, 11. వారుణము, 12. కౌశికము, 13. లైంగము, 14. సాంబము, 15. సౌరవము 16. పరాశరము, 17. మారీచము, 18. భార్గవము. ఇవి మాత్రము ఉప పురాణములు.

**186. భాగవతము కల్పితములైనపుడు భగవద్గీత ఎలా వాస్తవమగును? భారతములు భాగవతములను రచించినది వ్యాసుడే కావున భాగవతము**

**కల్పన అయితే భారతము కూడ కల్పనే అగును. భాగవతాన్ని విమర్శించిన మీరు భారత యుద్ధసందర్భములో కృష్ణుడు అర్జునునికి చెప్పిన కొన్ని శ్లోకముల (భగవద్గీత)ను శాస్త్రమని ఎలా చెప్పుచున్నారు?**

జ. చూడండి మన ఇంటిలో గాటికి కట్టేసేవన్ని పశువులే. కట్టేసేవాడు ఒకడే అయినంత మాత్రాన అన్ని ఒకటే కావు. వాటిలో కొన్ని ఎనుములు, కొన్ని ఆవులు ఉంటాయి కదా! అట్లే వ్యాసుడొక్కడే చెప్పినంత మాత్రాన వ్రాసినవన్ని గ్రంథములే అయినంత మాత్రమున అన్ని ఒకటే కాదు. వాటిలో కొన్ని సత్యములు కొన్ని అసత్యములు ఉంటాయి. మన ఇంటిలోనివి పశువులే అయిన వాటికి ఎనుములు ఆవులు అను ప్రత్యేకమైన పేర్లు మనమే పెట్టినట్లు ఆనాడు వ్రాసిన వ్రాతలకు ఆ పెద్దలే 1. పురాణములు, 2. ఇతిహాసములు అను పేరు పెట్టారు. మీరు అనుకొన్న భాగవతము భారతము వ్యాసుడొక్కడే వ్రాసినప్పటికి భాగవతాన్ని పురాణమని, భారతమును ఇతిహాసమని అనుట అందరికి తెలిసిన విషయమే. భాగవత భారతములను ఒక్కటిగ ఎప్పటికి పోల్చుకోకూడదు. జరిగిన చరిత్రను తెలుపునది ఇతిహాసము, కావున ఇతిహాసమను పేరుగాంచిన భారతము అబద్ధము కాదు. అందులోని గీత అసత్యము కాదు. గీత అన్ని విషయములను నిరూపిస్తున్నది. అన్ని విషయములు శాసనములుగ ఉన్నవి. కావున గీతను యోగశాస్త్రముగ వ్యాసుడే ప్రతి అధ్యాయము చివర తెలియజేశాడు. వ్యాస విరచితమైన గీత ప్రతి అధ్యాయములో "యోగ శాస్త్రే" అను మాటను మీరు చూడగలరు ఒకడే వ్రాశాడు కావున భాగవతము కల్పన అయితే భారతము కూడ కల్పననుట, ఒకడే కట్టి వేశాడు కావున ఒకటి ఎనుమయితే అన్ని ఎనుములే అయి ఉంటాయన్నట్లు ఉంటుంది.

**187.** మూడు త్రోవల లోపల ముఖ్యమైన
నడిమి త్రోవను జనిలోన నాగకన్య
నూరడించిన వాడెపో యుచిత యోగి
నవ్య తర భోగి శ్రీసదానంద యోగి.

దీని భావమేమి?

జ. మన శరీరమునందు అన్ని నాడులపైకి ముఖ్యమైన నాడులు మూడు ఉన్నవి. అవియే సూర్య చంద్ర బ్రహ్మనాడులని అందురు. వాటిలో ముఖ్యమైనది బ్రహ్మనాడి. దీనియందే తల నుండి ఆత్మశక్తి శరీరమంత ప్రాకి చైతన్యము కలుగజేయుచున్నది. ఈ నాడి నుండియే ఊపిరితిత్తులు కదలింపబడి శ్వాస ఆడుచున్నది. శ్వాసకు కారణమైన శక్తి బ్రహ్మనాడియందే ఉన్నది. కావున శ్వాస నాడించు శక్తిని నాగకన్యగ పోల్చి ఎవడయితే సూర్య చంద్ర నాడులకు మధ్య ఉన్న బ్రహ్మనాడియందు మనస్సు లగ్నము చేయునో, వాడు అక్కడి శక్తిని (ఆత్మను) పొంది యోగిగ ఉన్నాడను అర్థమును సూచించుచు పై పద్యమును తెల్పారు. మూడు త్రోవలు అనగ మూడు నాడులు, ముఖ్యమైన నడిమి త్రోవ అనగ బ్రహ్మనాడి, లోన నాగకన్య అనగ ఆ నాడియందు గల, ఆత్మ నూరడించువాడు ఆత్మను పొందినవాడు అని అర్థము. బ్రహ్మనాడి చైతన్యము చేత ఆడు శ్వాస పాము బుసకొట్టినట్లుండును కనుక ఆత్మశక్తిని నాగకన్య అన్నారు.

**చింతా నారాయణ, నరసాపురము**

**188. వేయి యుగములు 108 కోట్ల సంవత్సరములని దాని సంఖ్య జపమాలకు కూడ ఉన్నదని తెల్పారు, 108 కోట్ల సంవత్సరములు ఎలాగో తెల్ప ప్రార్థన.**

జ. ప్రపంచ ఆయుస్సు వేయి యుగములని గీతయందు తెల్పబడినది. యుగములకు నాల్గు పేర్లు పెట్టబడినవి. 1. కృత యుగము, 2. త్రేతా యుగము, 3. ద్వాపర యుగము, 4. కలియుగము అని వాటి పేర్లు. సంవత్సరమునకు 365 దినములైన దినములకు ఏడు పేర్లు పెట్టినట్లు యుగములు వేయి అయిన నాలుగు పేర్లతో గడువ వలసిందే. ఆదివారము అవుతునే సోమవారము మొదలయినట్లు కలియుగమై పోతానే కృతయుగము అమలుకొచ్చును. 250 మార్లు 4 యుగములు జరిగినపుడే 1000 యుగములు అయిపోయి ప్రపంచ

అంత్యము ఏర్పడును. దానినే ప్రళయమంటారు. వేయి యుగములు 108 కోట్ల సంవత్సరములని లెక్క తేలుచున్నది.

| | |
|---|---|
| కలియుగము | 4,32,000 సంవత్సరములు |
| ద్వాపరయుగము | 8,64,000 సంవత్సరములు |
| త్రేతాయుగము | 12,96,000 సంవత్సరములు |
| కృత యుగము | 17,28,000 సంవత్సరములు |
| నాలుగు యుగముల మొత్తము | 43,20,000 సంవత్సరములు |
| 250 మార్లు 4 యుగములు జరిగితే | 43,20,000 X 250 |
| **మొత్తము సంవత్సరములు** | **108,00,00,000** |

ఈ విధముగ ప్రపంచ ఆయుస్సు 108 కోట్ల సంవత్సరములని గీత మూలముగ తెలియుచున్నది. ఆ సంఖ్యను మరచి పోకుండునట్లు, ప్రపంచము ఉన్నంత వరకు ఆ సంఖ్య అందరి మధ్యలో ఉండునట్లు 108 పూసల జపమాలను మన పెద్దలుంచారు. ఎవరికైన దానము ఇచ్చిన, పెళ్లిలో డబ్బు చదివించిన, విరాళాలు ఇచ్చిన 108 రూపాయలనే ఇచ్చుట ఇందువుల సాంప్రదాయమని తెలియాలి.

**రాధేయ, పందిళ్ళపల్లి**

**189. తపస్సుకు, యోగానికి తేడా ఏమిటి? యోగములో సాధించగలిగే దేమిటి? తపస్సులో సాధించగలిగేదేమిటి?**

జ. తపనతో కూడుకొన్నది తపస్సు. ఏమి లేనిది యోగము. తపస్సు వలన తపశ్శక్తి లభించును. యోగము వలన యోగ శక్తి (జ్ఞానాగ్ని) లభించును. తపస్సు వలన లభించు శక్తితో ప్రపంచములో అసాధారణమైన, అసంభవమైన పనులు కూడ చేయవచ్చును, ప్రపంచ ఖ్యాతి కాంచవచ్చును. యోగము వలన బయటి మహత్యములను చేయలేరు, కేవలము అంతరంగమున ఉన్న కర్మను మాత్రము యోగశక్తి కాల్చి వేయును. తపస్సు ప్రపంచ భూతములతో తయారైన

జ్ఞానేంద్రియముల సంబంధముతో ఉండి జేయునది. ఉదాహరణకు మంత్రమునో లేక నామమునో జపించడము. అది శబ్దముతో వినికిడిగ నీకు తెలిసినది కావున చెవుకు సంబంధించినది. యోగము మొత్తము జ్ఞానేంద్రియముల సంబంధమునే వీడి ఉండును. ఏ ఇంద్రియ సంబంధముండిన అది యోగము కానేరదు. తపస్సు వలన జన్మలే కలుగును. యోగము వలన జన్మరహిత మోక్షము లభించును. అన్ని విధముల తపస్సుకంటే యోగము గొప్పది. అందువలన గీతయందు ఆత్మ సంయమ యోగములో చివర 42వ శ్లోకములో

శ్లో॥ తపస్వి భ్యోధికో యోగి జ్ఞాని భ్యోపి మతో ధికః
కర్మ భ్య శ్చాధికో యోగి తస్మా ద్యోగీ భవార్జున !

"యోగి తపస్వికులకంటే ఉత్తముడు, జ్ఞానవంతులకంటే ఘనుడు, పనులతో కూడుకొన్న నానా ఆరాధనల చేయు వారికంటే అధికుడు, అందువలన నీవు యోగివే కమ్ము" అన్నాడు. దీనిని బట్టి యోగమునకు తపస్సుకు ఎంతో తేడా ఉన్నదని చెప్పకనే తెలియుచున్నది మరియు గీతయందు విశ్వరూప సందర్శన యోగములో 48, 53 శ్లోకములలో తపస్సు వలన దైవమును తెలియుటకు శక్యము కాదని పునరుద్ఘాటించడము కూడ జరిగినది.

నేడు యోగులంటే ఎవరో, తపస్వికులంటే ఎవరో వారి వ్యత్యాస మేమో తెలియక పోయింది. తపశ్శక్తి వలన మహిమలు చూపె తపస్వికులే ఎక్కువ గౌరవించబడుచున్నారు. తపస్సు చేసి తపస్వి అయిన వారు తపస్వి అని పేరు పెట్టుకోక యోగి అని పేరు పెట్టుకోవడము జరుగుచున్నది. మేము ధర్మము ప్రకారము నడువాలనుకొన్నాము కావున యోగులను తప్ప తపస్వికులను గౌరవించమని ఖచ్చితముగ చెప్పాము.

**గోనుగుంట్ల వెంకటనారాయణ, తాడిపత్రి**

**190. శిశువు ప్రాణమెప్పుడు పొందుచున్నాడని తెలుసుకొను అవసరము ఏమిటి?**

జ. జీవికి శరీరమెట్లు సంభవించినది తెలియకపోతే భగవంతునికి దేవునికి తేడా తెలియదు. ఈ విషయము తెలియకనే చాలా మంది స్వాములు సహితము పరమాత్మ అని చెప్పవలసిన చోట భగవంతుడని, భగవంతుడని చెప్పవలసిన చోట పరమాత్మ అని చెప్పుచున్నారు. శరీరములోనికి జీవుడెప్పుడొస్తున్నాడో తెలియక పోతే ఆధ్యాత్మికము ఎట్లు తెలిసినట్లగును. నీ శరీరములో నీవు ఎప్పుడు ప్రవేశించినది తెలియుట ఆధ్యాత్మికములో ఒక భాగమే.

**191. పరమాత్మకు దశావతారములు నిజమేనా?**

జ. విష్ణువుకు దశావతారములు ఉన్నాయంటున్నారు కాని పరమాత్మకు లేవు. దశావతారములను మాట పురాణాంతర్గతమైనది గాని శాస్త్రబద్ధమైనది కాదు. ఆధ్యాత్మికులకు దశావతారములతో పనే లేదు. భక్తి కోసము పురాణములు, జ్ఞానము కోసము శాస్త్రములున్నాయని తెలియుము.

**192. నేటి కాలములో మీరు ధైర్యముగ ఉన్నది ఉన్నట్లు చెప్పగల్గుచున్నారు. మీవలె ఇంకా ఎవరైన చెప్పగల్గుచున్నారా?**

జ. ఈనాడు దినపత్రికలో ప్రతి సోమవారము రెండు వారముల నుండి "పరదేశి పాఠాలు" అను శీర్షికలో గురు శిష్య సంవాదమను పేరుతో "కొండ వీటి వెంకట కవి" గారిచే వ్రాయబడుచున్న వ్యాసములు ఉన్నాయి. నవంబరు 7, 14 తేదీలలో వచ్చిన పేపర్లు చూచాము. అటువంటి రచనలు బయటికి వస్తే మానవుడు సత్యము తెలుసుకొంటాడు. వెంకట కవి గారు గురు శిష్య సంవాద రూపమున చరిత్రలోని విషయములను వివరిస్తు ఆనాటి అసత్యములను అద్దంపట్టి చూపించారు. రెండవ వారములో వచ్చిన "గురు శిష్య సంవాదము-2" లో చివరన వ్రాసినది క్రింద చూడొచ్చు.

పురుష సూక్తమునకు బొట్టు కాటుక పెట్టి
వేద జనుడుకేక వేసి నాడు
కల్పితము నెల్ల కాదనగా లేక
దీన జనుడు సమ్మతించినాడు

అట్లే ఆయన వ్యాసము మొదట వ్రాసినది క్రింద చూడండి.

1. నమ్మి నమ్మలేని ఉమ్మడి దమ్మిడి
కూత వ్రాత పొట్ట కూటి కొరకు
సాగినంత వరకు జాతి నిర్వీర్యమై
నీరసించు ప్రగతి నిర్గమించు

2. పాత తరములోని పండుటాకులు
పోక యున్న చిగురు పుట్టబోదు
రాతి యుగములోని పాత చట్టాలెల్ల
పోక యున్న మేలు పుట్టబోదు

ఉన్న వాస్తవమును చెప్పిన వెంకటకవి గారు ధన్యులు. వీలైతే మీరు కూడ ఆయన వ్యాసాలు ఈనాడు పేపర్లో చదవండి.

**గూనిపూటి గౌరిదేవి, రాజంపేట**

**193. ఒక జీవి సాధారణముగ మరణిస్తే మరణము అంటారు. విషము త్రాగి చనిపోతే ఆత్మ హత్య అంటారు. గీతశాస్త్రము ప్రకారము ఆత్మ చావదు, శస్త్రములు చేధించదు, అగ్ని కాల్చదు, నీరు తడుపదు అంటారు కదా! అలాంటపుడు ఆత్మహత్య అనడము ఎంతమాత్రము నిజము? తెల్ప ప్రార్థన.**

జ. గీతలో ఆత్మ నాశనము కాదు కత్తిచే తెగదు అన్నారు. ఇక్కడ మూడు ఆత్మలున్నవి. అందులో ఏ ఆత్మ గురించి చెప్పారో మీకు తెలియదు. కావున ఈ ప్రశ్న వేశారు. ఆత్మహత్య కావింపబడుట వాస్తవమే. కావున ఆత్మ హత్య అని పెద్దలన్నారు. తెగనిది, నాననిది, కాలనిది జీవాత్మ. కత్తికి తెగేది అగ్నికి కాలేది ఆత్మ. ఈ మాట ఆశ్చర్యముగ ఉంది కదా! ఇంకొక ఆశ్చర్యమేమిటంటే ఒకరి చేత చంపబడడము మీరు హత్య అంటారు అలాగే తనకు తాను చనిపోవడము

ఆత్మహత్య అంటారు. మేమలా అనము ఒకరి చేత చంపబడడము ఆత్మహత్యయని, తనకు తాను చనిపోవడము హత్య అంటాము. ఈ విషయమంతా అర్థము కావాలంటే మా రచనలలోని **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** చదవండి.

**194. ఆధ్యాత్మికంగా మొట్టమొదట ప్రవేశించు జీవి యోగసాధన ద్వార ముక్తి పొందుటకు అర్హులా?**

జ. మొదట ప్రవేశించిన వారు అన్ని విధముల జ్ఞానము తెలిసిన తదుపరి సాధన చేస్తే తప్పక అర్హులగుదురు. జ్ఞానము తెలియకుండ యోగము సాదిస్తామంటే అడ్రసు లేకుండ ఊరికి పోతానన్నట్లు ఉంటుంది. ఇప్పటి కాలములో జ్ఞానమంటే ఏమిటో తెలియని వారు మేము సాధన చేస్తున్నామనడము చాలా విచిత్రముగ ఉంటుంది.

**195. జీవుడు మనస్సు నిలుపుటకు సులభమైన మార్గము తెలుపుదురని కోరుచున్నాము.**

జ. ఇందులో సులభము కష్టము అనునవి లేవు. ఉన్నది ఒకే ఒక పద్ధతి. అది మనస్సు చేయు విషయ జ్ఞాపకములను వదలివేస్తు ఉండడము. అలా చేయంగ చేయంగ మనస్సు విషయ జ్ఞాపకములు తెచ్చి పెట్టకుండ లోపల ఉన్న ఆత్మ జ్ఞప్తిని కల్గజేయును. మనస్సును నిలుపుటకు ముందు మనస్సంటే ఏమిటి? అది ఎక్కడున్నది? దానిపనేమిటి? దాని ఆహారమేమిటి? దానికి మిత్ర శత్రువులున్నారా? అది ఎంతలావు ఉన్నది మొదలగు ప్రశ్నలకు జవాబు తెలిసి ఉండవలెను.

**196. మాయ అనగ తల్లి ప్రసవించు శిశువుకు కప్పుకొన్న తొడుగు అని అంటారు. దీని పై మీ అభిప్రాయము ఏమి?**

జ. శిశువులు కప్పుకొన్న తొడుగును మాయ అనకూడదు. దాని పేరు "మావి" అనాలి. మాయ అంటే గుణముల సమ్మేళనమని శాస్త్రము తెల్పుచున్నది.

మావి అనునది ఒక తిత్తిలాంటిది. మావి ప్రాణములేని శిశువును కప్పియున్నదైతే, మాయ అనునది కనిపించకుండ ప్రాణమున్న మనిషిని కప్పి ఉన్నది.

**దండా జయరామ్, ఉరవకొండ**

## 197. మనస్సు నిరంతర ప్రాప్తి కోసము ఆకాంక్షిస్తూ ఉంటే అది దమన హేతువు కదా?

జ. నిరంతర ప్రాప్తి కోసము ఆకాంక్షించడము కోర్కె అవుతుంది. ఆ కోర్కె కోసము తపన అవుతుంది కావున మనస్సును బయటి పనుల జ్ఞప్తితో సంబంధము వదలి వేయించిన అది లోపలి జ్ఞప్తిని తెచ్చి పెట్టుతుంది. అపుడు బయట విషయములు మనసు ద్వార తెలిసినట్లే లోపలి విషయములు (ఆత్మ) కూడ మనస్సు ద్వారానే తెలియుచున్నది. కావున అది దమన హేతువు కాదు. మనస్సును పూర్తి అణిచివేసిన కదా దమన హేతువగును. ప్రపంచ విషయములలోను ఆత్మ విషయములలోను మనస్సు లేనిది జీవునకు ఏమి తెలియదు. ఎల్లవేళల పంచేంద్రియముల జ్ఞాపకాలు చేయుమనస్సు, యోగసాధనలో ఆత్మ విషయ జ్ఞాపకము చేయుచుండును.

## 198. అహం కృతిని కర్తృత్వాన్ని మీరెలా సమన్వయ పరుస్తారు?

జ. అహంకారాన్ని కర్తృత్వాన్ని మేము సమన్వయ పరచడము లేదు. కర్మ యోగ సిద్ధాంతము ప్రకారము అహంకారమును నిర్వీర్యము చేయడమే మా విధానము. గీతలో మోక్ష సన్న్యాస యోగములో 17వ శ్లోకము "న అహం కృత భావో" అన్నట్లు మేము నడుచుకొంటాము.

**మచ్చావెంకటరామయ్య, ఉరవకొండ**

## 199. పునర్జన్మ నిజముగ కలుగుతుందా? వాటిని నమ్మమంటారా?

జ. కర్మ ఉన్నంత వరకు పునర్జన్మలు కలుగుచునే ఉంటాయి. పునర్జన్మ జ్ఞప్తి కల్గిన వారి చరిత్రలు భూమి మీద ఎన్నో ఉన్నాయి. ఇపుడు మీరున్నది కూడ పునర్జన్మయేనని తెలియవలెను.

**కె. గంగప్ప, కిరికెర**

**200. ఎరుకకు మాయకు తేడా ఏమిటి?**

జ. ఎరుక అనునది మనస్సు. మాయ అనునది గుణములు. మాయను అనుసరించి మనస్సు పని చేయుచుండును.

**201. వేదాంతమనగనేమి?**

జ. "త్రైగుణ్య విషయా వేదా" అని గీతలో ఉన్నది. దీనిని బట్టి మూడు గుణముల విషయములే వేదములని తెలియుచున్నది. గుణముల విషయములను వదలివేసి ఏ గుణ జ్ఞప్తి లేకుండ చేసుకోవడమును వేదాంతము అంటారు. అట్లు సాధన సమయములో గుణ విషయముల జ్ఞప్తిరాని నిశ్చలుని "వేదాంతి" అంటారు.

**202. మనకు ఈ ప్రపంచములో ప్రీతి కలిగించునది ఏది?**

జ. మన శరీరములో ప్రేమ అనే గుణమువలన ప్రీతి కలుగును.

**యమ్. వెంకటరాముడు, బెంగుళూరు**

**203.** ముండ మోపితోడ మునుగుచు దేలుచు
నుండగనె మోహముండె గాక
అండ బాయు వెనుక నాయాశలే లేవు
విశ్వదాభిరామ వినుర వేమ.

జ. మనస్సు విషయ సంబంధమున్నంత వరకు జీవుడు గుణములలోనె మునిగి ఉండును. ఆ మనస్సు విషయ చింతన వదలిన తర్వాత ఆశ మొదలగు గుణములందు జీవుడు తగుల్కొనడు. ముండ అనగ మనస్సని తెలియవలయును. మునిగి తేలు వాడు జీవుడు.

**యమ్. రామారావు, కలుగొట్ల**

**204.** నిన్ను జూచెనేని తన్ను దామరచును
తన్ను జూచెనేని నిన్ను మరచు
నే విధమున జనుడు నెరుగు నిన్నును దన్ను
విశ్వధాభి రామ వినుర వేమ.

జ. జీవాత్మ సాధన చేత ఆత్మను కలిసిన తన మీద జ్ఞప్తి లేక ఆత్మ జ్ఞప్తితో ఉండును. దానినే యోగమందురు. యోగ సమయములో బాహ్య శబ్ద, రూప రస గంధములతో సంబంధము లేక జీవాత్మ తన్ను తాను మరచి ఉండును. అందువలన ఆత్మను నిన్ను అని చెప్పుచు నిన్ను జూచెనేని తన్ను తామరచును అన్నారు.

యోగము వీడి ఆత్మ జ్ఞప్తిని వదలి తిరిగి ప్రపంచ ధ్యాసలోనికి వచ్చిన వాడు ఆత్మను మరచిపోవును. అందువలన తన్ను జూచెనేని నిన్ను మరచునన్నాడు. శరీరముతో ఉన్నంత వరకు యోగమాచరించిన సమయములో జీవాత్మ ధ్యాస పోవును. యోగమాచరించని సమయములో ఆత్మ ధ్యాస పోవును. అట్లుకాక పూర్తిగ జీవాత్మ మూడవ పురుషుడైన పరమాత్మలో ఐక్యమై పోయినపుడు తాను ఆత్మకు జీవాత్మకు సాక్షిగ ఉన్నాడు. సమస్త జీవులందు బయట గలడు. గనుక నిన్ను అను ఆత్మను, తన్ను అను జీవాత్మను చూడగల స్థితి మోక్ష స్థితి. అందరికి ఈ విషయము తెలియదు గనుక ఏవిధముగ నెరుగు నిన్నును దన్నును అన్నారు.

**పి. ప్రకాశ్‌నాయుడు, కూచివారిపల్లి**

**205. జీవాత్మకు, ఆత్మకు, పరమాత్మకు తేడా ఏమిటి?**

జ. శరీరములో ఒక్కచోట గలది జీవాత్మ. శరీరమంత వ్యాపించి ఉన్నది ఆత్మ. అన్ని శరీరములందు మరియు బయట అణువణువున వ్యాపించి ఉన్నది పరమాత్మ.

**206. దేవుడెక్కడున్నాడంటే ఆత్మలో అంటారు. ఆత్మను పరిశుద్ధముగ ఉంచుకోవాలంటే ఏమి చేయాలి?**

జ. ఆత్మలో దేవుడు లేడు. ఆత్మే దేవుడని తెలియవలయును. ఆత్మను పరిశుద్దముగ ఉంచుకోవలసిన పని ఏమి లేదు. అది ఎప్పుడు పరిశుద్దముగనే ఉంటుంది. పరిశుద్దముగ ఉంచుకోవలసింది మనస్సునని తెలియవలయును.

**దండా మల్లికార్జున, ఉరవకొండ**

**207. మనిషి శక్తికి, సంపదకి, శౌర్యానికి, వివేకానికి, లౌకిక జ్ఞానానికి, విజ్ఞానానికి అతీతమైనది ఏది?**

జ. "న హి జ్ఞానేన సదృశ్యం" జ్ఞానాగ్నికి సమానమైనది లేదు. అని భగవద్గీతా శాస్త్రములో భగవంతుడు చెప్పాడు. అందువలన జ్ఞానానికి సమానమైనది లేదు.

**జి. పద్మ, జి. యశోద, గుంతకల్**

**208. నారదుడు అంజనేయుడు ఇద్దరు బ్రహ్మచారులే అయిన అంజనేయుని మాత్రమే పూజిస్తారు నారదునికి పూజ లేదు కారణము తెల్ప ప్రార్థన.**

జ. అంజనేయుడు రామ భక్తుడవడము ముఖ్య కారణము. తర్వాత అంజనేయుడు నారదునికంటే ఎక్కువ శక్తి పరుడు ధైర్యవంతుడని భూత ప్రేత బాధలు అంజనేయుని వలన తొలగునను నమ్మకముతో పూజిస్తారు. తనను నమ్మిన యయాతిని మొదలగు వారిని రక్షించాడను కథ ఉండుట వలన కూడ అంజనేయుని నమ్మి పూజిస్తారు. నారదునికి అటువంటి చరిత్ర లేదు కావున నారదుని ఎవరు పూజించరు.

**209. కొందరు పుట్టిన కొన్ని దినములకే మరణిస్తారు. కొందరు శతాయుస్కులుగ ఉంటారు ఎందువలన?**

జ. వారి ప్రారబ్ధ కర్మను బట్టి జీవిత కాలముండును కనుక అట్లు

జరుగుతుంది. చేసుకొన్న వారికి చేసుకొన్నంత అనునానుడి ప్రకారము వారి వారి కర్మను బట్టి జీవిత కాలముండును.

**210. భూలోకములో పార్వతి అవతరించిందంటే శివుడు కూడ అవతరిస్తాడు అంటారు. అటులనే ఒక జన్మలో స్త్రీకి భర్తగా ఉన్నవాడు రెండవ జన్మలో కూడ ఆ స్త్రీకి అతనే భర్త అవుతాడా?**

జ. శివుడు పార్వతి అనునది పురాణ కల్పిత కథలు వాటిని నమ్మవద్దండి. కర్మ సిద్ధాంతము ప్రకారము ఒకే పురుషుడు మరు జన్మలలో భర్త అవుతాడనుటకు ఆధారము లేదు.

**ఎ. నల్లప్ప, కె. శీతారామయ్య, సి. నారాయణ రెడ్డి**

**211. నవంబరు పత్రికలో శిశువు తల్లిగర్భము నుండి బయటపడిన తర్వాతనే ప్రాణమువచ్చునని తెల్పారు. కాని ప్రహ్లాదుడు తల్లిగర్భములోనే నారాయణ మంత్రోపదేశము పొందాడని, అష్ట వక్రుడు తన తండ్రి విద్యను గర్భమునుండే గ్రహించాడని శాస్త్రములు చెప్పుచున్నవి. అదియుగాక అర్జునుని భార్య సుభద్రకు పద్మవ్యూహము చెప్పుచుండగ గర్భములో ఉన్న అభిమన్యుడు విన్నాడని కూడ ఉన్నది. మరియు గర్భిణి స్త్రీలను విచారించగ 7 నెలలకే తమ గర్భములో ప్రాణమున్నట్లు చెప్పుచున్నారు. ఈ సందేహములను తీర్చ ప్రార్థన.**

జ. మీ ప్రశ్నలో కొన్ని శాస్త్రాలలో చెప్పారు అని అన్నారు. అన్నట్లు అవి శాస్త్రములు కావు పురాణములు, ఇతిహాసములే. ఇతి హాసములు చరిత్రలే అయినా వాటికి కూడ కవులు రంగులు పూశారని మరువకండి. నేడు మేము శాస్త్ర సహితమైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పటికి నమ్మని విమర్శకులు, తెలివైనవారు, గత వ్రాతలను ఎందుకు విమర్శించలేకున్నారో అర్థము కావడములేదు.

చేప కడుపులో మత్స్య గంది పుట్టిందంటే చేప అండమునుత్పత్తి చేయును పిండము ఎలా పుట్టిందని ఎందుకు అడగరాదు.? వీర్యమును చేప మింగడము వలన గర్భమొచ్చిందన్నారు. నోటి ద్వార మ్రింగిన పదార్థము జీర్ణకోశమును చేరును కాని గర్భకోశము చేరేదానికి దారేలేదే అని ఎందుకు అడగలేక పోయారు.? ద్రోణుడు గిన్నెలోను, కర్ణుడు చెవులోను పుట్టాడంటే సులభముగ నమ్మి నారె మన సూక్ష్మదృష్టి అక్కడ ఎందుకు పని చేయలేదు.? మేము చెప్పిన విషయమును మీ ప్రశ్నలకు ఇంకా పదును పెట్టునట్లు ఈ విషయము గూర్చి ఇంకా కొన్ని ప్రశ్నలను మీకు జత చేయుచున్నాను. నేను జెప్పు ప్రశ్నలకు మీరు జవాబులు వెదకండి.

1. వెనుకటి జన్మ జ్ఞప్తి కల్గి చెప్పిన వారినైన మనము భూమి మీద చూడవచ్చును. కాని గర్భస్థ స్థితిని గూర్చి చెప్పినవారున్నారా? అసలు మీకు ఆ జ్ఞప్తి ఉందా?

2. జ్యోతిష్య శాస్త్రరీత్యా తల్లిగర్భము నుండి బయటపడిన తర్వాతనే లెక్కించి దశా శేషమును తెల్పుచున్నారు. దశలు తల్లి గర్భము చేరినప్పటి నుండి ఎందుకు లెక్కించలేదు? దశా భుక్తిని గత జన్మ భుక్తి అని వ్రాయుచున్నారు ఎందుకు? (గర్భ భుక్తి అని కొందరంటారు. గర్భములో సంవత్సరముల తరబడి ఉండరు కనుక గర్భ భుక్తి అనకూడదు గత జన్మ భుక్తి అనాలి.)

3. తల్లి గర్భము నుండి బయటపడిన శిశువుకు కొన్ని నిమిషములు, కొన్ని గంటల పాటు శ్వాస, రక్త ప్రసరణము, కదలిక, చైతన్యము ఎందుకు లేవు.?

4. మంత్రసానులు కొందరు మావిలో ప్రాణమున్నది, శిశువులోనికి రావాలని అంటుంటారు. అసలు గర్భములో ప్రాణమొచ్చినది మావికా, శిశువుకా?

5. కొన్ని ఆస్పత్రులలో ప్రసవింపబడిన శిశువులు చనిపోయినారని డాక్టర్లు నిర్ధారణ చేసిన కొంతసేపటికి ఎలా ప్రాణము పొందినాయి?

6. గర్భస్థశిశువుకు ప్రాణము లేనిదే పెరగదని, శిశువు తల్లి శరీరములో మరణిస్తే తల్లికి ప్రమాదమని అంటారు. గర్భము నిలచినప్పటి నుండి ప్రాణము

రాని ఆరు నెలల కాలము ఎలా పెరుగగలిగింది. ఆ ఆరు నెలల కాలములో శిశువుకు ప్రాణములేనట్లయితే తల్లికెందుకు ప్రమాదము జరగలేదు?

7. యోగశాస్త్రమైన గీతలో జీవుడు శరీరమును పొందినప్పటి నుండి బాల్య, యవ్వన, కౌమార, వృద్ధాప్య మరియు మరణావస్థలన్నారు కాని గర్భస్థావస్థ అని చెప్పలేదెందుకు?

8. గీతలో పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును జీవుడు ధరిస్తున్నాడన్నాడు. క్రొత్తదంటే పూర్తి తయారైనదా? లేక ఆరు నెలలకు అసంపూర్ణముగ ఉన్నదా?

9. భగము (యోని) నుండి ప్రాణముతో పుట్టినపుడు అందరు భగవంతులే అవుతారు కదా! అలా అందరము భగవంతులుగ ఎందుకు లేము?

ఇక్కడ మేము కొద్దిగ చెప్పు జవాబు ఏమంటే మన శరీరములో పంచ భూతములలో ఒకటైన వాయువు (గాలి) ఉన్నది. అది ఐదు భాగములుగ ఉన్నది. వాయువును ప్రాణము అనవచ్చును. అందువలననే పంచవాయువులను పంచ ప్రాణములు అన్నారు. మన ముక్కురంధ్రములో గాలి ఉన్నపుడే ప్రాణమున్నదని, గాలిలేనపుడు ప్రాణములేదని చెప్పడము కూడ పరిపాటి. శరీరములో ప్రాణమున్నపుడే జీవుడు కూడ ఉండును. ప్రాణములేనపుడు జీవుడుండడు. ముక్కురంధ్రములలో శ్వాస ఆడనంత వరకు శిశువుకు ప్రాణములేదని గ్రహించవలయును. తల్లి గర్భములో మావి అను తిత్తియందు ఉమ్మి నీరు అనుద్రవములో శిశువు మునిగి ఉండును. అందువలన శ్వాస ఆడుటకు అవకాశమేలేదు. జీవుడసలే లేడు. జననము గురించి మేము అడిగిన ప్రశ్నలకు జవాబులు మీరు వెదకండి. సత్యా సత్యములు మీకే అర్థమవుతుంది.

**212. మేము చదివిన కొన్ని విషయములు గ్రంథ ప్రమాణములు, కాని శాస్త్ర ప్రమాణములు కావని మీరే అన్నారు. మీరు విశ్వసించే భగవద్గీత భారత చరిత్రలోని ఒక భాగము కదా! పరమాత్మ మానవ రూపములో**

**నీతిని బోధించాడు. అదే ప్రకారము మిగత అవతారములలో భాగవత రామాయణములలో చెప్పినవి శాస్త్ర ప్రమాణములుగ పరిగణించవలసి ఉన్నది. జన్మ మాకు ఎట్లు వచ్చిందని కాదు. ఎందుకు వస్తుంది దాని రాహిత్యమునకు మార్గమేమిటి అన్నది తెల్పాలి?**

జ. మేము ఎవరికో సమాధానమిచ్చిన విషయమును చూచి గర్భస్థ శిశువును గురించి మీరు అష్ట వక్రుని దగ్గర నుంచి అభిమన్యుని వరకు వివరించి ప్రశ్న అడిగింటేనే మేము జవాబిచ్చాము. అది మాకవసరము లేదు, మాకు ఇంకొకటి కావాలంటే, అంగడిలో తీసుకొన్న సరుకు నోటిలో వేసుకొని రుచి సరిగ లేదని ఇది మాకు ఎందుకు! వేరేది కావాలని అడిగినట్లుంటుంది. మీరు అడక్కపోతే మేమెందుకు చెప్తామండి.

పరమాత్మ మానవ రూపమున నీతిని బోధించాడని మీరన్నారు. తెలియక అడుగుతాను యుద్ధరంగములో చంపనని కూర్చొని ఉన్న అర్జునుని తిరిగి యుద్ధము చేయునట్లు చేయుట నీతి ఎట్లగును? కృష్ణుని జీవిత చరిత్రలో ఎనిమిది మంది భార్యలు కాక ఎందరో పర స్త్రీల సంబంధము ఏ నీతి? యుద్ధములో ఆయుధము పట్టనని చెప్పి భీష్ముని పైకి చక్రము ధరించడము ఏ నీతి? దుర్యోధనునికి పాండవుల సందేశము చెప్పి దుర్యోధనుని అభిప్రాయము తెలుసుకోకమునుపే, ఒక వేళ నీవు ఐదు ఊళ్లయిన ఇవ్వని పక్షములో నిన్ను భీముడు, కర్ణుని అర్జునుడు చిత్రవధ చేస్తారని బెదిరించి అదే పనిగ యుద్ధమునకు ప్రేరేపింపడము ఏ నీతి. యుద్ధ రంగములో ఆయుధములు వదలి వేరే పనిలో నిమగ్నమై ఉన్న కర్ణుని చంపించడము ఏ నీతి?

వాస్తవముగ ఆయన తన జీవితములో ఏ నీతి బోధించలేదు. ఆయన తెల్పినది జ్ఞానాన్ని ధర్మమును. నీతిని న్యాయమును ఏ మాత్రము తెల్పలేదు. నీతి న్యాయము లోక సంబంధము, జ్ఞానము ధర్మము ఆత్మ సంబంధము అని ముఖ్యముగ తెలియవలయును.

ఇంతకు ముందు మా వ్రాతలలో శాస్త్రములంటే ఏమిటని చాలా మార్లు తెల్పాము. శాస్త్రములు ఆరు, వాటి ఆధారము మీదనే ప్రపంచమంత ఆధారపడింది. శాస్త్రములంటే పంచ భూతములనుండి పరమాత్మ వరకు వ్యాపించి ఉన్న శాసనములు. చరిత్రలువేరు, శాస్త్రములువేరని గ్రహించవలెను. ఉదాహరణకు గణిత శాస్త్రమున్నది. అది ప్రపంచమున్నంత వరకు 4X5=20 అన్న శాసనాన్ని తెల్పుతుంది. కాని అది మారేది కాదు. అది ఏ చరిత్రకు సంబంధముండదు. అట్లే ఖగోళ శాస్త్రమున్నది సూర్య గోళము నుండి కాంతి కిరణముల ప్రయాణము 1 సెకండుకు 1,86,000 మైళ్ళు అన్నది శాసనము. అది చరిత్రకాదు, ప్రపంచమున్నంత వరకు చరిత్రలలో ఎక్కడయిన శాస్త్ర ప్రస్తావన వచ్చి ఉండవచ్చును కాని అంతా శాస్త్రమెలాగగును. భారత చరిత్రలో ప్రస్తావనకు వచ్చిన గీత జీవాత్మ ఆత్మల మధ్య ఉన్న శాసనములు, కావున వ్యాసుడు కూడ యోగశాస్త్రే అని గీతనన్నాడు. కాని గీతలో కూడ మధ్యలో కల్పింపబడిన విషయములున్నవి. అవి శాసనములు కావని సూత్రము ప్రకారము సులభముగ తెలియును.

గణిత శాస్త్రము 4X5=20 ఖండించబడని పద్ధతి అన్నట్లు యోగ శాస్త్రములో కూడ అట్లే ఉండును. అసలుకు శాస్త్రము అంటే ఖండింపబడనిది అమలుకు వచ్చునదని తెలియవలయును. ఏదయితే ఖండించబడునో అది శాస్త్రము కాదు. ఉదాహరణకు 2X9=16 అని గణిత శాస్త్రములో ఉందనుకోండి. అది తప్పు నిరూపణకు ఎటు ఎంచిన రాదు. ఖండింపబడునది కనుక దానిని గణిత శాస్త్రమనము. అట్లే యోగశాస్త్రములో కూడ ఎక్కడయిన తప్పులుంటే వెంటనే తెలిసిపోతుంది. అమలుకురానివి ఖండింపబడునవి శాస్త్రమే కాదన్న సూచన అన్ని శాస్త్రములకు వర్తిస్తుంది.

గ్రంథములన్నింటిని శాస్త్రములనుకొంటే మాత్రలన్ని మనిషి మింగేటివే కదా అన్నట్లుంటుంది. బేదికి వచ్చేదేదో, బేదికి నిలిచేదేదో తెలియాలి కదా! అన్ని మందులే కదా! వైద్యుడే కదా తయారు చేసింది అనుకుంటే అతి సార రోగమున్నపుడు బేదికి నిలిచే మాత్రవేసుకోక వచ్చేది వేసుకుంటే మరి బాధపడవలసి

వస్తుంది. అట్లే గ్రంథములలో ప్రపంచము వైపు పోయేవి కొన్ని, పరమాత్మ వైపు పోయేటివి కొన్ని ఉన్నాయి. అన్ని శాస్త్రములే కదా అని అన్నిటిని తయారు చేసిన వాడు వ్యాసుడే అని అనుకుంటే ఎలాగ?

ఏది ఏమైన వయసు గడచిన వారికి ముందు విన్నదంత ఒకటి, నేడు మేము చెప్పేది ఒకటైతే గందరగోళము ఏర్పడి నమ్మలేకున్నారు. మా బోధలు యువకులే ఎక్కువగ అర్థము చేసుకొనుచున్నారు. మరియు విమర్శనా దృష్టి ఉన్న ప్రతివారు అర్థము చేసుకోగలుగుచున్నారు. విమర్శనాత్మకముగా చూడనివారు, గత చరిత్రలలో కవులు పూసిన రంగులన్ని నిజమనుకొన్న వారు మా బోధల వలన చాలా ఇబ్బందిపడుచున్నారు.

ఉదాహరణకు రైలు ప్రయాణములో పురాణాల పూర్ణయ్యతో మా శిష్యుడు మాట్లాడడము జరిగింది. రామాయణము కొంత నిజము కొంత కల్పన అని మా శిష్యుడన్నపుడు పూర్ణయ్య గారు అట్లు కాదు అంతా నిజమేనని మీసము మెలివేసి చెప్పాడట. అందులకు మా భక్తుడు శాంతముగా "రామాయణములో అంజనేయుడు సీత కోసము లంకకు లంఘించినపుడు ఆయన నుదుటి చమట సముద్రములో పడిందట, ఆ చెమట నీటిలో పడక ముందే ఒక చేప మ్రింగిందట, ఆ చేప చెమట వలన గర్భము ధరించి మశ్చవల్లభుడను కుమారుని కనిందట, ఆ వల్లభుడు పాతాళములో మైరావణుని ద్వారపాలకునిగ ఉంటే, తండ్రి అయిన అంజనేయుడు పోయి అతని చేతిలో ఓడిపోయాడని ఉంది. అంజనేయుడు సీతను వెతకటానికి పోయినప్పటి నుండి పాతాలమునకు పోయినప్పటి వరకు నెల రోజులు కూడ సమయము లేదే! అంతలో చేపకు గర్భమవడము 18 సంవత్సరముల ద్వార పాలకుడు కావడము ఇంత ఎలా జరుగును? చెమటకు పిల్లలు పుట్టుదురా? నోటితో మ్రింగితే గర్భమెలా నిలిచింది." దయచేసి చెప్పండన్నాడట. అందులకు పూర్ణయ్య "రామాయణములో ఉంది గదయ్యా, జరగంది వారు ఎందుకు వ్రాస్తారు వారు తిక్కవార" అని అన్నాడట. ఈ విషయమెట్లుందంటే కుందేలుకు మూడే కాల్లు ఉండాయని అన్నాడట ఒకడు, కాదయ్యా కుందేలుకు నాలుగు కాళ్లుంటాయని

వేరొకడంటే, చూడవయ్యా నాదగ్గరున్న కుందేలు అని మూడు కాళ్ల దానిని చూపాడట. చూచిన రెండవ వాడు ఇది మూడు కాళ్లదే నేను కాదనడము లేదు. దీనికి ఒక కాలు పుట్టనే లేదు. దీనికి లోపముంది ఇది కుంటిది, సహజముగ కుందేలుకు నాలుగు కాళ్లే ఉంటాయనిన నమ్మలేదట మొదటివాడు.

జన్మ ఎలా వచ్చింది అనేది వద్దు, జన్మ ఎందుకు వచ్చిందో తెలుపమన్నారు. మేము చాలామార్లు తెలిపాము. గత జన్మలలో చేసుకొన్న కర్మ ప్రకారము జన్మ కలుగుచున్నదని, కర్మను కాల్చుకొను జ్ఞానాగ్నిలేనంత వరకు జన్మలు కలుగుచునే ఉంటాయి.

**డి. శ్రీధర్ నాయుడు, పుట్టపర్తి**

**213. దేవుడున్నాడా? ఉంటే ఎక్కడ?**

జ. దేవుడున్నాడు. మన శరీరమందే. నీకు చాలా దగ్గరలో చూడాలను కొంటే జ్ఞాననేత్రముతో చూడవచ్చును.

**214. దేవుడున్నాడని ఖచ్చితముగా ఎలా చెప్పుచున్నారు?**

జ. దేవుడు అనేవాడు ఒక గుడిలో ప్రతిమ కాదు. మన శరీరములో ఉన్న చైతన్యశక్తియే దేవుడు. ఆ చైతన్యము మన శరీరమందు నిత్యము ఉపయోగ పడుచున్నది. కావున దేవుడున్నాడనుటకు ఖచ్చితమైన నిదర్శనమిదే. శరీరమందు దేవుడు లేనిది మనము కదిలేదానికే వీలులేదు.

**215. దేవుడుంటే మీరు చూచారా?**

జ. దేవుడు ఎవరి అవయవములకు తెలియువాడు కాడు. మీలో ఉన్న కదలికకు కారణమైన శక్తిని మీరు చూచారా లేదు కదా! దేవుడనబడు ఆ శక్తి ఇంద్రియ అగోచరమైనది. దేవునికి ఆకారము, పేరు రెండు లేవు కావున దేవున్ని చూచానని ఎవరైన అనిన అది శుద్ధ అబద్ధము. దేవుడు జ్ఞానదృష్టికి మాత్రము

తెలియువాడు. అందువలన దేవుడంటే ఏమిటో నా జ్ఞానానికి తెలుసుకాని నాకంటికి తెలియదు. నా కన్నులతో చూడలేదు.

**డి. హనుమంతు రెడ్డి, వెంకటాపురము**

**216. లోకములో ప్రజలు ఆడ దానికి ఐదో తనము ముఖ్యము అంటారు ఐదో తనమంటే ఏమిటి? అది లేకుంటే ఆడవారు ఆడ మనిషిగ ఉండరా?**

జ. స్త్రీకి తాళి ఉండడమును ఐదో తనము కల్గి ఉండుటని అంటారు. భర్త ఉన్నపుడు ఐదో తనము ఉన్నదని లేనపుడు లేదని అంటారు. భర్త ఉన్నపుడు స్త్రీ అయిన వారు భర్త లేనపుడు స్త్రీ కాకుండా పోతారా? ఐదోతనము ఉండిన ఆడవారే, లేకున్న ఆడవారే. ఐదోతనము ఉన్నవారిని ఒక రకముగ, లేని వారిని ఒక రకముగ చూచుకొను దురలవాటు మనము కల్పించుకొన్నదే గాని దేవుడు పెట్టినది కాదు. ఇది ప్రాపంచిక విషయము, ఇకపోతే ఆధ్యాత్మికముగ నిజమైన అర్థము ప్రకారము ఐదో తనమును ఆడ తనమును వివరించుకొందాము.

జగద్భర్త అనగ జగత్తుకంతటికి భర్తయైన వాడని అర్థము. జ అనగ పుట్టుట గతి అనగా గతించునదని చాలా మందికి తెలుసు. పుట్టుట గిట్టుటను బట్టి జగతి అని పేరు పెట్టగ పుట్టి గిట్టే మానవాళికి మరియు సమస్త జీవరాసులకు భర్త ఒకడు గలడు. వానినే జగద్భర్త అంటున్నాము. జగత్తుకంతటికి భర్తయైనవాడు పరమాత్మ ఒక్కడే. ప్రపంచములో తాళి కట్టినవాడు భర్తయితే జ్ఞానపరముగ జన్మనిచ్చిన పరమాత్మయే భర్తయని తెలియాలి. మనమనుకొన్నా అనుకోకపోయిన అందరికి భర్త ఆ పురుషోత్తముడే. స్త్రీకి ఐదో తనము తాళి కట్టిన భర్త అయితే, స్త్రీకి పురుషునికి అందరికి ఐదో తనము జగద్భర్తయైన పరమాత్మ. పరమాత్మ భర్త అయితే మనమందరము ఒక విధముగ ఆడవారమే అన్నమాట. ఆడవారను పేరు ఎట్లా వచ్చిందో కొంత ఆలోచిద్దాము.

హిందీ, ఉర్దూ మరియు చాలా భాషలలో ఆడ అనగ అడ్డము అని అర్థము. పూర్వము తెలుగు భాషలో కూడ అడ్డమును ఆడ అనెడివారు ఇపుడది కాల

క్రమమున అడ్డముగ మారినది. ఆడగాని అడ్డము గాని దేనికి అని యోచిస్తే జ్యోతిష్యశాస్త్రములో 1వ స్థానాధిపతికి 7వ స్థానాధిపతి ఎప్పటికి వ్యతిరేఖమున్నట్లు యోగ శాస్త్రములో పరమాత్మకు ప్రకృతి (మాయ) అనునది ఎప్పటికి వ్యతిరేఖముగ ఉన్నది. జగతిలో పరమాత్మ పక్షము, ప్రకృతి పక్షము అను రెండు పక్షములలో మనము ఎల్లపుడు ప్రకృతి పక్షములో ఉన్నాము. యోగ శాస్త్రరీత్యా పరమాత్మకు ప్రకృతి వ్యతిరిక్తమన్నట్లు ప్రకృతి పక్షమైన మనము పరమాత్మకు వ్యతిరిక్త దిశలోనే నడుస్తున్నాము. మనలో నుండి ఎవడైన పరమాత్మవైపు ప్రయాణించాలని ప్రయత్నము చేస్తే అందరు వానికి వ్యతిరేఖత తెలుపుట వాస్తవము. ఒక ఇంటిలో భర్త దేవునివైపు పోవాలనుకొన్నపుడు భార్య మిగతవారు ఆటంకపరచడము, ఒక వేళ భార్య దేవుని వైపు ప్రయాణించాలను కొన్నపుడు భర్త ఆటంకపరచడము జరుగుచున్న సత్యము. స్త్రీలు పురుషులు అందరు ప్రకృతి పక్షములో ఉండుట వలన పరమాత్మ వైపు పోవాలనుకొన్న వానిని ఇతరులు అడ్డగించడము సహజమే అన్నాము కదా! అందువలననే ఆటంకపరచు వారందరిని పూర్వము ఆడవారనడము జరిగినది. ఈ కాలములో ఆడవారనగా కేవలము స్త్రీలే అనుకోవడము జరుగుచున్నది. అది పొరపాటు ఆడవారనగా ప్రకృతి వైపువారని అర్థము చేసుకోవాలి. పరమాత్మ పురుషుడు, ప్రకృతి స్త్రీయని భగవద్గీత గుణత్రయ విభాగయోగములో కూడ చెప్పబడి ఉన్నది. ప్రకృతివైపు ఆడ అను పదమునకు స్త్రీ అను అర్థము గలదు. దీనిని బట్టి కేవలము భౌతిక స్త్రీలే ఆడవారని, భౌతిక పురుషాకారులను పురుషులనుకోవడము పొరపాటు. అట్లనుకోక ప్రకృతి వైపు ఉన్న స్త్రీ పురుషులందరికి ఆడవారను పేరు వర్తిస్తుందని తెలియాలి.

స్త్రీ పురుషులనందరిని ఆడవారనుకోవడమేమిటి ప్రత్యక్షముగ నేను పురుషున్నని కనిపిస్తు ఉంటే స్త్రీగ ఎట్లు పోల్చుకోవాలని కొందరు మగవారికి కొంత బాధగ కనిపించి ఉండవచ్చును. దానికి సమాధానమేమనగా! వాస్తవముగ నీవు శరీరము కావు. నీవు కేవలము జీవాత్మవే. నీవు నివశించు శరీరమును బట్టి నేను పురుషుడనని, నేను స్త్రీనని అనుకోవడము జరుగుచున్నది. శరీరమును బట్టి

ప్రపంచపరముగ సమాజములో స్త్రీ పురుషులనుకోవచ్చును. కాని ఆధ్యాత్మికరీత్యా పై లెక్క పనికి రాదు. అట్లయిన శరీర భేదములు ఎందుకున్నవని కొందరికి ప్రశ్నరావచ్చును దానికి సమాధానము ఏమనగా! పరమాత్మ సృష్టి ఆదిలో ప్రకృతిని తయారు చేసి తనకు సాటిగ పెట్టుకొన్నాడు. ప్రకృతి చేతనే సమస్తమును సృష్టించాడు. పరమాత్మ తనను పురుషునిగ, ప్రకృతిని స్త్రీగ చెప్పుచు నా వలన ప్రకృతి చేత సమస్తము సృష్టింపబడినదని చెప్పాడు. సృష్టించబడిన జీవాత్మలకు స్త్రీ అంటే ఏమిటో పురుషుడంటే ఏమిటో అర్థముగాదు. కనుక పరమాత్మ జీవులకు సృష్టి వివరము తెలియునట్లు స్త్రీ పురుష శరీరములను తయారు చేసి, పురుషుని చేత స్త్రీ గర్భము దాలుస్తుందని, పురుషుడు బీజ దాతయని వారి వలననే సృష్టి జరుగుచున్నదని తెలియునట్లు చేశాడు. శరీరములు ప్రకృతి పరమాత్మలకు గుర్తులని తెలియక, ఆధ్యాత్మికములో సృష్టి వివరమును ప్రకృతి పురుషుల గుర్తింపును తెలుపునవని గ్రహించక, శరీరమును బట్టి నేను పురుషుడనని అనుకోవడము పొరపాటు. కొందరు శిష్యులు మా గురువు పురుషుడు స్త్రీలకు ప్రవేశము, దర్శనము లేదన్నపుడు మీరాబాయి నవ్వి నేనింత వరకు ఒకడే పురుషుడున్నాడనుకొన్నాను, మీ గురువు కూడ పురుషుడేనా అని అన్నదట. పరమాత్మ ఒకడే పురుషుడని అందరు స్త్రీలేననుకొన్న మీరాబాయికి శిష్యులు మా గురువు పురుషుడంటునే నవ్వి, ఆశ్చర్యముగ ఇక్కడ మరొక పురుషుడున్నాడా అని అడిగిందట. ఆమె మాటవిన్న గురువు బయటకు వచ్చి నేను పురుషుడను కాను, జగతిలో అందరము స్త్రీలమే అని ఒప్పుకొన్నాడట.

పరమాత్మ తన విధానమును తెలుపు నిమిత్తము స్త్రీ పురుష శరీరములను తయారు చేశాడని, వాస్తవముగ మనము ఆడవారమేనని, ఆడ తనము ప్రకృతిదేనని, ప్రకృతివైపు నుండి పరమాత్మ వైపు మనము పయనించాలని, అలా ప్రయాణించు వారికి మనము ఆడ కాకూడదని గ్రహించాలి. సహజముగ బయటి ప్రపంచములో స్త్రీ శరీరమునకు యుక్త వయస్సు వస్తూనే పురుషుని మీద ధ్యాస ప్రారంభమగును. ఆ స్త్రీ పురుషుని చేరుకొనుటకు ప్రయత్నిస్తుండును. పురుషున్ని చేరుకోవాలనుకొన్న

స్త్రీకి ఎటువంటి ఆటంకములు వచ్చిన లెక్క చేయదు. ఎన్ని ఆటంకములు ఎదురైన పురుషుని దరి చేరాలన్న ధ్యాస మాత్రము పోదు. అలాగే మనమందరము ఆధ్యాత్మిక దేశములో ఆడవారమే. స్త్రీకి యుక్త వయస్సు వచ్చి పురుష ధ్యాస వచ్చినట్లు మనలో ఎవనికో ఒకనికి జ్ఞానవయస్సు వచ్చి పురుషోత్తముని కలుసుకోవాలను ధ్యాస వస్తుండును. అటువంటి వారికి భార్య బంధువులు ఎందరు ఆటంకమొచ్చిన లెక్క చేయరు. లోపల మాత్రము తన పురుషున్ని చేరుకొనుటకు శతవిధాల ప్రయత్నము చేయుచుండును. ఒక వేళ నీవు నీ పురుషున్ని చేరుకోవాలనుకొన్నపుడు నీ ఇంటిలో వారు గాని, నీ ఊరిలో వారు గాని, నీ దగ్గర బంధువులు గాని, నిన్ను హేళన చేయడముగాని, భయపెట్టడముగాని, పంచాయితీ పెట్టి ఛీ అని పించడము గాని, చివరకు నీ ఆలి (భార్య) నీకు అన్నము పెట్టకుండ పోవడము గాని, మరేమైన జరగవచ్చును. ఎన్ని జరిగిన, ఎన్ని ఆటంకములడ్డు వచ్చిన, స్త్రీ ధ్యాసలోనికి పురుషుడు వచ్చిన తర్వాత ఆమె అటువైపే ప్రయాణించుటకు ఏదో ఒక దారి వెతుక్కున్నట్లు పరమాత్మ చింతన కల్గిన వానికి ఎన్ని ఆటంకములొచ్చిన వెనుకాడడు.

యోగశాస్త్రరీత్యా మనమందరము ప్రకృతి స్వభావమున్న ఆడవారము. నీకు నాకు అందరికి పురుషుడనువాడు కావాలి. పురుషున్ని చేరుకొనేంతవరకు మనకు తపన ఆగదు. అంతవరకు ధన ధాన్యములున్నా వస్తు వాహనములుండినా, అధికారము హోదాలుండిన, ఎన్ని ఉండిన ఏదో లోటుగనే ఉండును. ఐదో తనమైన భర్త లభించినపుడే తృప్తి పరిపూర్ణత ఏర్పడును. జ్ఞానము తెలియని వారికి ఈ మాటలు చాలా విచిత్రముగ తోచుచుండును. మాకు పెళ్లి అయినది భార్య భర్తలమున్నాము కదా! అనుకోవచ్చును. వాస్తవముగ నీకు జరిగిన పెళ్లి పెళ్లికాదు. అది దైవత్వమును తెలియజేయు తంతు. మీరు భార్య భర్తలనుకోవడము వలన భార్య భర్తలు కారు. భార్య భర్తలను మాట ప్రకృతి పరమాత్మలను తెలియజేయు విధానము. భర్త అనగ భరించువాడని భార్య అనగ భరింపబడునదని అర్థము. ఈ అర్థము ప్రకారము ఆలోచించిన నీవు ఎవరిని భరిస్తున్నావు? నిజానికి నిన్ను నీవు భరించుకోలేదు. నిన్ను భరించువాడు నీ శరీరములో గలడు. వాడు

భరించునంత వరకు శరీరములో నీవుండగలవు. అందరము అలాగే ఉన్నాము. అందరికి భర్త గలడు. వాడే అందరికి ఐదోతనము. ఐదో తనమనే మాట చాలా చోట్ల వింటున్నాము. ఐదో తనమనడములో అర్థమేమిటి? ఐదో తనమని ఎందుకనాలి భర్తను మూడో తనమో లేక నాల్గవ తనమో అనకూడదా అని మనము ఆలోచించలేదు. తెలియనివాడు ప్రశ్నవేస్తే ఏదో ఒకటి చెప్పి సరిచేయక నిజార్థమేమిటో ఆలోచించి చూద్దాము.

ఒకప్పుడు నన్ను వేరొకరు నీవేమి చదువుకొన్నావని ప్రశ్నించారు. అపుడు నేను రెండు విధముల జవాబిచ్చాను. ప్రపంచ పరముగ అయితే పదకొండు చదివాను. పరమాత్మ పరముగ అయితే నాలుగు చదువుచున్నాను, ఐదుకు పోవాలన్నాను. ఈ రెండో జవాబును విపులముగ చెప్పాలంటే ఈ విధముగనున్నది. మన శరీరములో వరుసగ మూడు గుణ భాగములున్నాయి. నాల్గవది గుణములేని భాగము కూడ ఉన్నది. మానవునికి ఇవి తరగతులులాంటివి. జ్ఞానములో మూడు గుణములను అతిక్రమించినవాడు, మూడు గుణములను జయించినవాడు, మూడు గుణముల కర్మ అంటని వాడు త్రిగుణాతీతుడన్నమాట. అనగా మూడు తరగతులను దాటిన వాడని అర్థము. ఆ మూడు తరగతులే తామస, రాజస, సాత్త్వికములన బడునవి. ఇక నాల్గవ తరగతిని యోగము అంటారు. యోగమును పూర్తి చవిచూచిన తర్వాత యోగమును కూడ అతిక్రమించినవాడగును. అటువంటి వానిని యోగీశ్వరుడని అందురు. అట్లుకాక యోగములో ఉండిన వానిని యోగి అని అందురు. నాకు నాల్గు తరగతులు పూర్తి కావచ్చినవి, కావున యోగీశ్వరుడనై ఐదో తరగతికి పోవాలని ఉన్నానన్నాను. నాల్గవదైన యోగము తర్వాత ఉన్నది మోక్షము. దానినే బయలని, అచేలమని, ముక్తియని, పరమపదమని అనేక రకములుగ చెప్పుచుందురు. నాల్గవ దాని తర్వాత ఉన్న ఐదో తరగతైన మోక్షమే మానవునికి చివరి తరగతి. ప్రపంచ చదువులెన్ని తరగతులుగ ఉండిన అవి అన్నియు యోగశాస్త్రములో మూడు తరగతులలోనివేనని తెలియాలి. ఎంత పెద్ద డిగ్రీలు సహితము నాల్గవ తరగతి వరకు రాలేవు అన్ని మూడవ తరగతిలోనివే. నేను

యోగశాస్త్రములో నాల్గు తరగతులు చదివి చివరిదైన ఐదుకు పోవాలని కాచుకొన్నాను.

అలాగే ప్రతి మనిషికి ఈ ఐదు తరగతులు గలవు. చివరిదైన దానినే ఐదో తనము అని కూడ పూర్వము పెద్దలనెడివారు. అన్ని ఉన్నా ఐదోతనము తప్పనిసరిగ కావాలన్నారు. అందువలననే అన్నిటికంటే మించిన భాగ్యము ఐదో తనమని దానినే సౌభాగ్యమని కూడ అన్నారు. సౌభాగ్యమనగ భర్తను కల్గి ఉండడము. భర్తను కల్గియుండడమే ఐదో తనము. బయట శరీర భర్త ఐదోతనము కాదు. నిజముగ మూడవ తనమే అగును. నిజమైన భర్త పరమాత్మ. ఆ జగద్భర్తను వెదకుటకు ప్రయత్నించి ఐదోతనమును సాధించుకోవలెను. ప్రపంచములో స్త్రీ పురుషులకెవరికైన ఐదోతనము అవసరము. చాలామంది తామసమైన ఒకటిలోనో, రాజసమైన రెండులోనో, సాత్త్వికమైన మూడులోనో ఉన్నారు. కనీసము నాల్గవదైన యోగము వరకు కూడ రాలేదు. జనాభాలో ఎక్కువ శాతము రెండవతరగతే దాటడము లేదు. 99 శాతము మూడునే దాటలేదు. అటువంటి వారు నాల్గు ఎప్పుడు దాటగలరు. ఒక వేళ నాల్గు వరకు వచ్చిన ఎన్నో ఆటంకములచే అక్కడ పాసుకాలేక పోవుచున్నారు. కొందరేమో నాల్గులో ఉన్నామనుకొంటూ మూడులోనే ఉన్నారు. మరి కొందరేమో ఒకటిలో ఉంటూ ఐదులో కూర్చున్నామనుకొంటున్నారు. మా గురువు మోక్షములో కూర్చో బెట్టాడంటున్నారు. అయిదుకు పోయిన వాడు కంటికే కనిపించక పరమాత్మలోనికి ఐక్యమైపోవును కదా! అలాంటపుడు కనిపించే గురువు, కనిపించే శిష్యులను మోక్షములో పెట్టాడంటే గురువు శిష్యులు అందరు ఒకటో తరగతిలో ఉన్నారన్న మాటే. ఎవరెట్లు పోయిన పరవాలేదు. నీవు మాత్రము నీ భర్తను చూచుకో, నీ భర్తకే మ్రొక్కు, నీ భర్తకే సేవ చేయి, నీ ఐదోతనము పోకుండ చూచుకో. ముత్తయిదువుగ బ్రతుకు, ముండమోపిగ బ్రతుకవద్దు. మనమందరము ఆడవారమే కనుక మన ఆడవారందరికి ఐదోతనమే ముఖ్యమని తెలుసుకో.

**బి. పద్మావతి, బండి ఆత్మకూరు.**

**217. మనుషులందరు ఒకటే కదా! మరి కొందరు బీదవారిగ కొందరు షావుకార్లుగ ఎందుకు పుట్టుతారు?**

జ. గత జన్మలలో చేసుకొన్న పాప పుణ్యముల బట్టి బీద ధనికులుగా పుట్టుట జరుగుచుండును. పాప ఫలితము కష్టము, పుణ్య ఫలితము సుఖము అనుభవించక తప్పదు. అందరు మానవులే అయినప్పటికి వారు చేసుకొన్న కర్మలు ఒకే విధముగ ఉండవు. అందువలననే రకరకముల వారు భూమి మీద ఉందురు.

**నాగయ్య, ప్రొద్దుటూరు**

**218. ప్రతి మనిషి కర్మ ప్రకారము నడచునని మీరు చెప్పారు. మరి కర్మ ఎవరి ప్రకారము ఉంటుంది? ఈ కర్మకు ఎవరు మూల పురుషులు? ఈ కర్మ అనుపదానికి ఎవరు బాధ్యులు? ఈ కర్మ అను పదమును సృష్టించిన వారు మీరా లేక అంతకు ముందువారా?**

జ. మనము చేయు పనుల ప్రకారము కర్మ ఉండును. మంచి పనులు జరిగిన పుణ్యము, చెడ్డ కార్యములు జరిగిన పాపము అను ఫలితములు ఏర్పడుచుండును. కర్మ ప్రకారమే ప్రతి పని జరిగిన, ఆ జరిగిన పని కర్మ వలన కాదు నావలన జరుగుచున్నదని ఎవడనుకొనుచుండునో వానికి మాత్రమే క్రొత్త కర్మ ఏర్పడును. అలా కాక ప్రతి పనికి కర్మే కారణమని నేను కానని అనుకొనువానికి కర్మ ఏర్పడదు. పాత కర్మను అనుభవిస్తు క్రొత్త కర్మను సంపాదించుకొనేవాడు, వాడు సంపాదించుకొన్న కర్మకు వాడే బాధ్యుడు. ఈ కర్మ సిద్ధాంతమును ఉంచిన వాడు మూల పురుషుడైన పరమాత్మ. కర్మ అను పదమును ఏ మానవుడు సృష్టించ లేదు. పరమాత్మ చేత సృష్టింపబడిన ప్రకృతిలో కర్మనునది ముఖ్యమైన భాగము. కర్మలేనిది సృష్టి ముందుకు సాగదు. కర్మ రహస్యమును అవగాహన చేసుకొంటే ప్రకృతి రహస్యమునే తెలిసినట్లగును. సర్వ

సంపూర్ణజ్ఞానము కర్మను తెలుసుకోవడములోనే ఉన్నది. ఇది పురాణము కాదు. శాస్త్రబద్ధమైన మాట.

**వెంకట్, ఉరవకొండ**

**219. శరీరములో నుంచి స్వతహాగా ప్రేమ వెల్లివిరుస్తు ప్రాపంచిక చింతలేమి స్పృశించకుండా వ్యక్తిని బ్రహ్మానందములో లీనము చేసుకొను సిద్ధ వ్యవస్థ మానవునికి శరీరము ఉండగా ప్రాప్తించడము అసంభవమా?**

జ. శరీరముతో సంభవము కాదు. ప్రేమ ప్రకృతిసిద్ధముగ పుట్టినది బ్రహ్మానందములో లీనము చేసుకొను సిద్ధ వ్యవస్థ అనగ జ్ఞానముతో లభించు మోక్షము ప్రకృతి సిద్ధముగ పుట్టినది కాదు. ప్రాప్తించబడునవి కర్మను బట్టి ఉంటాయి. మోక్షము కర్మను బట్టికాక శ్రద్ధను బట్టి ఉండును.

**యం. నాగభూషణం, బెంగుళూరు**

**220. ఎవరికైన గొప్ప వారికి ఉత్తరము వ్రాసినపుడు శ్రీశ్రీశ్రీ అని పేరు ముందర ప్రస్తావించుతారు అందులో జ్ఞానపరముగ అర్థమున్నదా?**

జ. సాత్త్విక, రాజస, తామస గుణభాగములలో శుభమైన గుణముకలవాడని మూడు శ్రీలు వ్రాస్తారు. మూడు గుణములలోను మంచి గుణములే ఉన్నవాడని అర్థము.

**221. పరిపూర్ణమనగా నేమి?**

జ. మోక్షము (పరమాత్మ) దానినే అచేలము అని కూడ అంటారు.

**222. గురువులు శిష్యునికి మాయ తొలగించి పరిపూర్ణమును స్థూల కన్నులకు చూపించుదురని, అలా చూపించలేని వారు గురువులు కారని కొందరి వాదన తమ అభిప్రాయము తెల్ప ప్రార్థన.**

జ. పరిపూర్ణము స్థూల కన్నులకు కనుపించునది కాదు. చూపుకు

గోచరించునది ప్రకృతేనని తెలియవలెను. పరిపూర్ణము ఇంద్రియ అగోచరమని యోగ శాస్త్రము కూడ తెల్పుచున్నది. పరిపూర్ణమును ఏ గురువులు భూమి మీద చూపలేరు. అలా పరిపూర్ణమును గురువులే చూపునట్లయితే శిష్యులకు సాధనతో జ్ఞానముతో పని లేదని చెప్పవచ్చును. అలా చూపుదునని చెప్పువాడు గురువే కాదు.

**223. అకాల మరణమైన సూక్ష్మ దేహములు కాలమరణము వరకు కర్మలు చేయుచుందురా? అందువలన వచ్చు పాపపుణ్యములు వారికి అంటునా? వారికి కర్మను తొలగించుకొను అవకాశము గలదా?**

జ. అకాల మరణమైన వారికి 10 భాగములు స్థూలశరీరము మాత్రము లేదు. మిగత 15 భాగముల సూక్ష్మశరీరమున్నది కనుక వారు కూడ కార్యములాచరింతురు, కర్మల సంపాదించుదురు. జ్ఞానాగ్నిని సంపాదించుకొని వారు కూడ కర్మల కాల్చివేసుకోవచ్చును. స్థూల కన్నులకు మాత్రము కనిపించు అవకాశము లేదు కాని మిగతావన్ని వాటికి మనవలె కలవు.

**224. కొన్ని పనులు చేయునపుడు ఇది మంచిది ఇది చెడ్డది అంతర్గతముగ ఏదో హెచ్చరిస్తూ ఉంటుంది దీనినే "అంతరాత్మ ప్రబోధం" అని అంటారు. మీరేమో ఆత్మసాక్షిగ చూస్తు ఉంటుంది ఏమి చెప్పదన్నారు. అలా ఏమి చెప్పనపుడు లోనుండి జరుగు సూచనలను అంతరాత్మ ప్రబోధమని ఎందుకనాలి?**

జ. వాస్తవముగ ఆత్మ అన్ని జీవరాసులకు సాక్షిగ చూస్తు ఉన్నది. ఏ ప్రబోధము చేయలేదు. శరీరాంతర్గములో జరుగు మంచి చెడు విమర్శలు, మంచి చెడు గుణములతో చేయు బుద్ధి యొక్క పని అని తెలియవలయును. ఒకే బుద్ధి రెండు విధముల మంచి చెడును యోచించును. ఆ బుద్ధి యోచించిన దానిలో ఏదో ఒక దానిని చిత్తము నిర్ణయించును. చిత్తము నిర్ణయించినదే కార్యాచరణకొచ్చును. శరీరాంతర్గత యంత్రాంగము తెలియని మతితక్కువ మానవుడు లోపల జరుగు

యోచనలను నిర్ణయములను "ఆత్మ ప్రబోధ" మనుకొనుచున్నాడు. ఆత్మ ప్రబోధమనుట అధర్మము. బుద్ధి గుణానుసారిని, చిత్తము కర్మానుసారిని, జీవుడు అనుభవానుసారిని, ఆత్మ ఆడించి అనుభవింపజేయు అధికారిని అను వాక్యములను మరువకూడదు.

**పల్లా వెంకటరమణ, చిలమకూరు**

**225. 108 కోట్ల సంవత్సరముల ప్రపంచ ఆయుస్సులో జీవికి మానవ జన్మ ఎన్ని మార్లు కలుగును?**

జ. కర్మను బట్టి ఎన్ని మార్లయిన కలుగ వచ్చును. జన్మలు ఏవి వస్తాయి ఎన్ని మార్లు వస్తాయన్నది కర్మను బట్టి ఉండును.

**226. జీవికి మానవ జన్మ ఎంత పవిత్రమైనది?**

జ. జ్ఞాన పరముగ అయితే చెప్పలేనంత పవిత్రమైనది. అజ్ఞాన పరముగ నడచుకొంటే చెప్పలేనంత నీచమైనది. మొత్తానికి మానవ జన్మే మాయలో కూరుకు పోయి దేవునికి దూరముగ ఉన్న జన్మని చెప్పవచ్చును.

**దండా జయరామ్, ఉరవకొండ**

**227. ఏక ముఖ రుద్రాక్షంటే ఏమిటి? రుద్రాక్ష ధరించడము వలన ప్రత్యేకతున్నదా? ఏ రాశివారు ధరించవలయును?**

జ. రుద్రాక్షకున్న భావము (ముఖము) లను బట్టి వాటికున్న శక్తిలో తేడా ఏమైన ఉన్నదో లేదో పూర్తి మాకు కూడ తెలియదు. దయ్యాల బాధలు కలవారు, వాటి భయమున్నవారు పూర్వము రుద్రాక్షలు ధరించెడివారని గతములో కూడ తెల్పాము. రుద్రాక్షలు ధరించడము వలన చూపరులకు అలంకారము, వేసుకొన్న వారికి మెడలో బరువు తప్ప ప్రత్యేకత ఏమి కన్పించడము లేదు. పూర్వము అజ్ఞానులు వేసుకొనెడివారు. కాలక్రమేపి ఇపుడు స్వాములు వేసుకొనుచున్నారు. అంత తప్ప వీరు వేసుకోవచ్చు వీరు వేసుకోకూడదను నిబంధన ఏమి ఈ కాలములో

లేదు. పూర్వమైతే రుద్ర రక్ష (రుద్ర యంత్రము) అవసరమనుకొను వారు వేసుకొనెడివారు.

**జి. గౌరి, రాజంపేట**

**228. మృత్యువు పొందిన వారు వెంటనే వేరొక శరీరమును కర్మాను కూలముగ ధరిస్తారని తమరు తెల్పారు. మరణించిన వారికి చేయు పిండ ప్రదానములు, అమావాస్య తర్పణములు ఎవరికి చేరుతాయి?**

జ. మరణించిన వారు క్రొత్త శరీరమును పొంది అక్కడ కర్మానుసారము అనుభవిస్తూ ఉంటారు. ఇక్కడ మనము పెట్టు పిండ ప్రదానములు వారికి చేరవు. వారి పేరు మీద పెట్టు తిండి కాకులకు, డబ్బు ఇతరులకు పెట్టాననుకుంటే పుణ్యమయిన మనకు చెందుతుంది. ఉన్న వారికి ఊడేది తప్ప పోయినవారికి చెందేది ఏమి లేదు. పిండ ప్రదానములు, అమావాస్య తర్పణములు మనము కల్పించుకొన్నవే.

**229. వైష్ణవులకు దానము ఇచ్చేటపుడు క్రిష్ణార్పణమని ఇస్తే స్వీకరిస్తారు. శివార్పణమని ఇస్తే స్వీకరింపరు. అట్లే శివ మతస్తులు శివార్పణమని ఇస్తే స్వీకరిస్తారు. క్రిష్ణార్పణమని ఇస్తే స్వీకరింపరు. వీటి తేడా ఏమిటి?**

జ. ఇది వారివారి వర్గపరమైన ఆచారము తప్ప ఇందులో జ్ఞానపరమైన అర్థము ఏమిలేదు. శివుడు క్రిష్ణుడు ఒక్కడేనని తెలిస్తే అలా నడుచుకోరు. పరిపూర్ణ జ్ఞానము కల్గిన రోజు ఇద్దరు ఒక్కటేనని తెలియగలదు.

**230. కొందరు మనుష్యుల నుదుటిపైన మడతల బట్టి మడతకు 20 సంవత్సరములు ఆయుస్సు ప్రమాణమని చెప్పుతారు నిజమేనా?**

జ. నిజము కాదు. నుదుటి మీద మడతలు చూస్తే తెలియదు నుదుటిలోపల వ్రాతలు చూస్తే తెలుస్తుంది.

**231. నాకు కలలో పాము కనిపించి కరచింది. యదార్థముగ బాధను**

**అనుభవించినట్లయినది. కలలో పాము కనిపించుట కొందరు చెడని, కొందరు మంచని అంటారు. ఏది నిజము?**

జ. చెడు కాదు, మంచి కాదు. బాధ అనుభవించు కర్మ ఉన్నది. కావున అది కలలో అనుభవించారు. వాస్తవముగ శరీరానికి పాము కరిచే కర్మలేదు. కాని పాముకాటు అనుభూతి బాధ అనుభవించు కర్మ మాత్రమున్నది. అటువంటపుడు స్థూలమునకు జరుగక సూక్ష్మముచేత అలా అనుభవింపవలసి వచ్చినపుడు అది స్వప్నములో మాత్రమే జరుగును. అందు నిమిత్తమే స్వప్నములున్నాయి.

**వెంకట్, ఉరవకొండ**

**232. బిడ్డ నుదుటి వ్రాతను తల్లి నిద్ర పోతున్నపుడు బ్రహ్మ రాస్తాడంట నిజమేనా?**

జ. శుద్ధ అబద్ధము. మన కవుల కలాలకు పుట్టిన బ్రహ్మ ఏమైన ఉంటాడేమో, కాని నుదుటి వ్రాతను వ్రాసే బ్రహ్మలేడు. ఎవరు చేసుకొంటున్న కర్మ వారి కపాలములో కర్మచక్రమందు నిత్యము రికార్డు అవుచున్నది. కాని ప్రత్యేకించి వ్రాయు వారు ఎవరూ లేరు.

**యల్. చంద్రాయుడు, చిన్న మాండెము**

**233. 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే' అన్న గీతాచార్యుని వాక్యాను సారము శ్రీకృష్ణ పరమాత్మ పాండవ పక్షపాతియా? కౌరవ పక్షపాతియా?**

జ. పీర్ల పండుగకు సుబ్బరాయుని షష్టికి సంబంధము లేనట్లు మీరడిగిన శ్లోకమునకు పక్షపాతానికి సంబంధమే లేదు. నిజమునకు కృష్ణుడు ఎవరి పక్ష పాతి కాడు. ఐదూర్లతోనైన తృప్తి పడగల పాండవులకు రాయబారిగ పోయి, దుర్యోధనుడు ఇచ్చు అవకాశమే లేకుండ మాటలతో రెచ్చగొట్టి, యుద్ధమును

కల్పించి ఇరువైపుల వారిని వినాశనము చేశాడు. కావున ఎవరి పక్షమని కూడ చెప్పుటకు వీలులేదు. ప్రపంచములో ఆయన పాత్ర ధర్మసంస్థాపనే కాని మిగతావన్ని నాటకాలే ఎవరి ప్రక్కలేదు. ఒక వేళ పాండవ పక్షపాతియే అయివుంటే ఆనాడు కురుక్షేత్రములో తాను కూడ యుద్ధము చేసి ఉండే వాడు. అట్లు ఎవరి పక్షమువాడు కాదు కనుక తాను షరతుపెట్టి తప్పించుకొన్నాడు.

**యం.సి. రామలింగయ్య, చిన్న మాండెము**

**234. ఓం శ్రీం అను ప్రణవ బీజాక్షరములకు అంతరార్థముగ తేడా ఏమిటి?**

జ. ప్రతి మాట మంత్రమేనని వేమన యోగి చెప్పినట్లు మనము పలుకు శబ్దములో కనిపించని ఒక శక్తి ఉంటుంది. వాటిలో బీజాక్షరమునకు మరీ ఎక్కువ శక్తి ఉంటుంది. అందువలన బీజాక్షరముల జపమంత్రము క్రమబద్ధమై ఇన్ని వందలు, ఇన్ని వేలు అని సంఖ్య నిర్ణయింపబడి ఉండును. అటువంటి బీజాక్షరములు ఎన్నో ఉన్నాయి కాని ఓంకారము అన్ని బీజాక్షరములకు ముందు ఉచ్ఛరించవలయును. అందువలన ఏ మంత్రమునకైన ఓం అను అక్షరముతోనే మొదలవును. ఓంకార శబ్దము నీలో ఉన్నపుడే తర్వాత అక్షరములన్ని నీవు ఉచ్ఛరించగలవు. కావున అన్నిటికి ముందు ఓంకారమును పెట్టడమైనది. అది లేకుండా ఏ మంత్రము జపించరాదను నియమము మంత్ర భాగములో ఉండును. ఎర్త్ (భూమి) కనెక్షన్ లేనిది కరెంటు శక్తి ఉపయోగపడనట్లు ఓంకారము లేనిది ఏ బీజాక్షరముల శక్తి ఉపయోగపడదు. కరెంటు తీగలలో ఎర్త్ తీగకు కరెంటు తీగకు ఉన్నంత తేడా ఓంకారమునకు మిగతా బీజాక్షరములకు ఉన్నది.

**డి.వి. శ్రీనివాసన్, మదనపల్లి**

**235. మీ పత్రికలో కొన్ని అచ్చు పొరపాటులున్నవి. ఒక చోట ప్రబో "ధా" శ్రమము అని మరియొక చోట ప్ర"భో"దాశ్రమమని ఉన్నది. అసలు మీ పత్రిక ప్రభోదాత్మజమ లేక ప్రబోధాత్మజమ మీరే తెల్పవలయును. అది**

**అటుంచండి మీరు యోగివికమ్మన్నారు యోగికి అర్థము చెప్పారు. జ్ఞానికి అర్థము చెప్పారు. జన్మలు కర్మలు బట్టి వస్తాయని గీతలో చెప్పారన్నారు. ఈ ప్రశ్నలన్ని షరామామూలే. నా ప్రశ్న మీకు కొంచము కటువుగ ఉండవచ్చు జన్మలు లేకుండ పరబ్రహ్మలో ఐక్యమయ్యే పద్ధతి ఏది? అది ఉత్తర గీతలో వేదములలో ఉందా? సంశయములకు పరిష్కారము వేదములే కదా!**

జ. మా పత్రికలో అచ్చు పొరపాటులున్న విషయము మేమే గత సంచికలో చెప్పాము. ఎక్కడో ఒక చోట ఏ పుస్తకములో అయిన పొరపాట్లు ఉండవచ్చును. తెలిసిన వారు సవరించి చదువుకుంటారు కాని విమర్శిస్తూ జాబు వ్రాయరు. మేము హెడ్డింగ్ సక్రమముగ కంపోజ్ చేసి "ప్రబోధాత్మజమ్" అని పేరు పెట్టాము. కాని వెనుక ప్రక్కర్యాపర్ మీద బ్లాకు ఉన్నది దానిని మేము మార్చే దానికి కాలేదు కావున అట్లే వేయుచున్నాము. అది బ్లాకు వ్రాసిన ఆర్టిస్టు పొరపాటు.

**బోధ** : చెప్పడము

**భోద** : చెత్త గడ్డి

మీరడిగారు కదా మీ పత్రిక పేరేదని మాది జ్ఞానులకు "ప్రబోధాత్మజమ్" అజ్ఞానులకు "ప్రభోదాత్మజమ్" అని నేడు తెల్పుచున్నాము. ముందు ఒక రకము వెనుక ఒక రకము ఉండడము కూడ మంచిదేనని ఇపుడిపుడు అనుకొనుచున్నాము. ఎందుకనగా తెలియని వారికి మా జ్ఞానము చెత్త గడ్డిగనే ఉండును. కావున అర్థము చేసుకోలేని వారికి, అర్థము కాని వారికి మా పత్రిక "ప్రభోదాత్మజమ్". అర్థము చేసుకొను వారికి **"ప్రబోధాత్మజమ్".**

అది అటుంచమని జ్ఞానము యోగము షరామామూలే. నా ప్రశ్న మీకు కొంచము కటువుగ ఉంటుందన్నారు. మీ ప్రశ్నకేమి కొమ్ములు పొడుచుకరాలేదు. జ్ఞాన యోగముల ప్రశ్నలు షరా మామూలైనపుడు మీది ఆ కోవకు చెందినది కాదా? మేము చెప్పే బోధ జన్మలు లేకుండా పరబ్రహ్మములో ఐక్యమయ్యేది కాక

మరియేది? మీ ప్రశ్న మాకు కటువుగ ఉండదు. మా జవాబు మీకు కటువుగ ఉండవచ్చును. గురువులను ప్రశ్నించునపుడు **"పరిప్రశ్నేన"** అను విధానమును మరచారు. **"త్రై గుణ్య విషయా వేదా"** అని గీతా వాక్యమును మరచి వేదము సంశయములకు పరిష్కారము కదా అన్నారు. వాస్తవానికి వస్తే వేదాలు గుణములని, ఆ గుణములే మాయయని గీత బోధిస్తున్నది. 15వ అధ్యాయములో గుణముల చేత పోషింపబడు శరీరాంతర్గత వృక్షమును (విషయము) పూర్తి తెలిసినవాడే వేదములను తెలిసినవాడని కూడ ఉన్నది. కేవలము పుస్తకములు వేదములు కావు. వేదములు ప్రతి మనిషి తలలో గుణముల రూపముతో ఉన్నవి. వేదములు సంశయముల కలుగజేస్తాయేకాని సంశయములు తీర్చలేవు. నేనేదో నా జ్ఞానమే పెద్దదని సొంత డబ్బా కొట్టుకున్నాడనుకోకు. మా బోధలు నేటి సమాజములో అజ్ఞానాన్ని కూకటి వ్రేళ్లతో సహ పెరికి వేయుచున్నవి. నాస్తికులను సహితము జ్ఞానులుగ మార్చుచున్నవి. అన్ని మతాల వారిని ఒప్పించగల్గుచున్నవి.

**ఆదిమూలమ్ రెడ్డి, పెరియమిట్టూరు, తమిళనాడు**

**236. మన దేశములో హిందువులు విగ్రహారాధన చేస్తారు. మిగత ఇస్లామ్ మతమువారు, క్రైస్తవ మతమువారు విగ్రహారాధన చేయరు ఎందుకు?**

జ. నిరాకారమైన దేవున్ని తెలుసుకోవడానికి సులభముగ ఉండునట్లు గుళ్లు గోపురాలు ఉన్నాయి విగ్రహారాధన కూడ ఉన్నది. మిగతా మతము వారు నిరాకారానికి ఆకారము పెట్టడము బాగుండదని, అది మనము కల్పించిన వారమైతామని, అలా చేస్తే ప్రజలు పొరపాటు పడగలరని, విగ్రహారాధన పెట్టకుండ నిరాకారమునే ఆరాధిస్తున్నారు. ఇది పూర్వపు భావన, ఇపుడేమో ఆరాధనలలో దేవున్ని తెలియడము ముఖ్య ఉద్దేశ్యమనుకోక ఆరాధనలే ముఖ్యమనుకొని ఎవరికి చేతనైనంత వారు చేయుచున్నారు. ఎవరు డబ్బు ఎక్కువ ఖర్చు పెట్టి పూజలు చేస్తే వారిదే పెద్ద భక్తి అను కాలమిది. ఇందువులు ఇలా పొరపాటు పడడము విచారకరము.

**కె. గంగప్ప, కిరికెర**

**237. జీవుడు అకాల మృత్యువు పొందిన తర్వాత కూడ ఆత్మతో సంబంధపడి ఉండునా? ఆకలి దప్పులు, కష్ట సుఖములుండునా?**

జ. జీవుడు ఉన్నంత వరకు ఆత్మ సంబంధము కలిగే ఉండును. జీవుడు ఆత్మ రెండు జంట పక్షులలాంటివారు. అకాల మృత్యువు పొందిన తర్వాత కూడ అన్ని అవస్థలు ఉండును.

**పి. రామబొజ్జ, ధర్మవరము**

**238. రాత్రివేళ స్వప్నములు కొన్ని మంచిగ, కొన్ని భయంకరముగ వస్తాయి కారణము?**

జ. అవి కూడ కర్మ ప్రకారమే వస్తాయి. శరీరముతో అనుభవించని కర్మను స్వప్నములో మానసికముగ అనుభవించవలసి ఉండును.

**239. ఎవరైన పనులు జరగక పోతే ఈ దినము లేచిన సమయము బాగ లేదంటాము. అలా సమయము బాగుండదా?**

జ. లేచిన సమయమునకు పనులకు సంబంధము లేదు. పనులు జరగనపుడు సమయము బాగలేదనకూడదు. గ్రహచారము బాగలేదనాలి.

**240. కొందరు తిరుపతి దేవుడు రాయి అంటున్నారు. కొందరు వైకుంఠము నుండి విష్ణువు వచ్చి శిలగ మారినాడంటారు. ఏది నిజము?**

జ. మొదటి వారిదే నిజము. చంద్రగిరి కోటను పాలించిన రాజులు నిర్మించినదే తిరుపతి దేవస్థానము. ఆ దేవుని మీద భక్తి పెరగాలని వ్రాసినది వెంకటేశ్వర పురాణము. అందులో వైకుంఠము నుండి విష్ణువు వచ్చినట్లు వ్రాశారు.

**241. అందరికి ఒక్కడే దేవుడన్నారు. మరి మత మార్పిడి దేనికి?**

జ. మానవునకున్న అజ్ఞానము వలన మత మార్పిడి జరుగుచున్నది.

**వెంకటస్వామి, ఎల్లుట్ల**

**242. స్వర్గలోకము, నరకలోకము అంటే ఏమిటి? ఇంతకు అవి ఉన్నాయా?**

జ. ఎక్కడ సుఖము కలుగుచున్నదో అదే స్వర్గము. ఎక్కడ కష్టము అనుభవింపబడుచున్నదో అదే నరకము. ఇవి రెండు భూమి మీదనే చూస్తున్నాము. ప్రతి దినము మనము అనుభవిస్తున్నాము. ఇంత తప్ప ఏ లోకము ఎక్కడ లేవు.

**243. మానవుడు మరణించిన తర్వాత మానవ జన్మగ పుట్టునా?**

జ. పుట్టవచ్చును, పుట్టక పోవచ్చును అది వారువారు చేసుకొన్న కర్మను బట్టి ఉండును.

**యమ్. మారుతినాయుడు, కూచివారిపల్లి**

**244. ప్రపంచ జనాభా పెరుగుచున్నది కదా! వచ్చే క్రొత్త జీవులు ఎక్కడివి?**

జ. వారు క్రొత్త జీవులు కారు పాత జీవులే. మిగతా జీవరాసుల జన్మల నుండి మానవ జన్మకు వచ్చిన వారని తెలియవలయును.

**కె. జయచంద్రా రెడ్డి, రామ్‌నగర్, అనంతపురము**

**245. ప్రతి పనికి కర్మ వలన ప్రేరేపితమైన గుణములే కారణమని మీరు తెల్పారు. కొందరు పెద్దలు అన్నిటికి పరమాత్మయే మూల కారణము పరమాత్మయే సమస్తాన్ని కదిలిస్తున్నాడని అన్నారు. పరమాత్మ కదిలిస్తున్నాడా? గుణములు కదలిస్తున్నవా?**

జ. సమస్తము పరమాత్మ వలన పుట్టినవే, పరమాత్మ లేనిది ఏది లేదు, ఏది కదలదు. వివరముగ తెలుసుకొంటే పరమాత్మ ప్రకృతి చేతనే అన్నిటిని కదలించుట వలన మూల కారణము పరమాత్మ అనుట తప్పులేదు. వివరిస్తు పోతే ప్రకృతిలో

తయారైనవి గుణ కర్మలు. ఇవి అవినాభావ సంబంధము కలవి. గుణముల వలన కర్మ ఏర్పడడము, కర్మ వలన గుణములు కదలడము జరుగుచుండును. కర్మ వలన ప్రేరేపితమైన గుణముల చేతనే సమస్త శరీరములు కదలుచున్నవి. అందువలన

**"ప్రకృతేః క్రియ మణాని గుణైః కర్మాణి సర్వశః"** ప్రకృతిచే తయారైన గుణముల చేతనే సర్వ పనులు జరుగుచున్నవని గీత మూడవ అధ్యాయములో 27వ శ్లోకమున కూడ చెప్పబడినది. మరియొక చోట 18వ అధ్యాయములో జంత్రగాడు బొమ్మల నాడించురీతిగ సమస్త ప్రపంచమును ఆడించుచున్నానని అన్నాడు. పరమాత్మ, ప్రకృతియనుదాని చేత ప్రపంచములోని అందరిని నడుపుచున్నాడని తెలిసినపుడు, ప్రకృతి సంబంధ గుణముల చేత పనులు జరుగుచున్నవని తెలియును.

**246. సంకల్పము లేకుండ ఎరుక ఉన్న స్థితిని యోగమని మీరు తెల్పారు. ఎరుక ఉంటే మనస్సు ఉన్నట్లే కాదా! మనస్సు ఉన్నపుడు యోగమెలా అగును?**

జ. మనస్సు లేకుండ పోతే ఏమి తెలియని నిద్ర అవుతుంది. మనస్సు పంచేంద్రియములకు సంబంధించిన విషయములను జ్ఞప్తికి తెచ్చుచు ఉంటే జాగ్రత్తవును. పంచేంద్రియ విషయముల ఎరుక మాని శరీరములోపలి ఆత్మ మీద ఎరుక కల్గి ఉంటే యోగమవును. సంకల్పములు ఉన్నపుడు జాగ్రత్త అగును. సంకల్పములు లేనపుడు యోగమవును. పూర్తి ఎరుక లేకుండ పోవు స్థితిని నిద్ర అగునని తెలియవలయును.

**శ్రీలత, గడివేముల**

**247. కొందరు ఆత్మహత్య చేసుకొని చనిపోతారే వాళ్లు దయ్యాలవుతారట నిజమేనా? సరిపడని వారిని పట్టి సాధిస్తారట నిజమా?**

జ. నిజమే. వారు వారి ఆయుస్సు పూర్తి అయిపోవు వరకు సూక్ష్మశరీరము అనగ 15 భాగముల శరీరముతో ఉంటారు. వారు మన మధ్యలోనే ఉంటారు. కాని వారు మనకు కనిపించరు. అందువలన వారి ఉనికి మనకు తెలియదు. వారి దృష్టికి మనము కన్పిస్తూ ఉంటాము. ఏమాత్రము జ్ఞానము లేని వారికి వీరు పట్ట వచ్చును. కాని జ్ఞానము ఉన్నవారికి పట్ట లేరు. **"గ్రహాలు - విగ్రహాలు"** అను శీర్షిక మా రచనలలోని **"ప్రబోధ"** గ్రంథమందు చదివితే వాటి విషయము సంపూర్ణముగ అర్థమగును.

**దండా జయరామ్, ఉరవకొండ**

**248. కృష్ణుడు పుట్టినపుడు అందరిని నిద్రలో ముంచేశాడని జంతువులు కూడ నిద్రలో మునిగాయని అంటారు. మరి ఆ సమయములో గాడిద అరవడము ఏమిటి?**

జ. అది మధ్యరాత్రి సమయము కావున అందరు నిద్రలో మునిగి ఉండుట సహజమే. ప్రసవము జరిగిన వెంటనే నీవు కాపలా ఉంటూ హెచ్చరిక చేస్తూ గట్టిగ అరవమని గాడిదలాంటి మనిషికి చెప్పి ఉంటారు. అట్లుకాక నాల్గు కాళ్ల గాడిద అరిచిందని మీరు నమ్మినారా!?

**వెంకట్, ఉరవకొండ**

**249. వియోగము అహంకారాన్ని ఎలా నశింపజేస్తుంది?**

జ. యోగము అహంకారాన్ని నశింపజేస్తుంది కాని వియోగము చేయదు. అది కూడ కర్మయోగము మాత్రమే అహంకారమును లేకుండ చేస్తుంది.

**పి. వెంకటరమణ, చిలమకూరు**

**250. మానవ శరీరము నుండి జీవునకు మోక్షము పొందాలంటే పరమాత్మను ధ్యానించితే మోక్షమొస్తుందా?**

జ. పరమాత్మను కాదు. ఆత్మను ధ్యానించాలి. పరమాత్మను ధ్యానించుటకు వీలు కాదు. భగవంతున్ని ధ్యానించవచ్చును లేక ఆత్మను ధ్యానించ వచ్చును.

**251. ప్రతి జీవి పాప పుణ్యములను శరీరమునందు అనుభవించునా? లేక శరీరము పోయిన తర్వాత అనుభవించునా?**

జ. శరీరమున్నపుడే పాప పుణ్యములు అనుభవింపబడుతాయి. శరీరము పోయిన వెంటనే తిరిగి క్రొత్త శరీరమును ధరించును. శరీరము పోయిన తర్వాత యమలోకమను మాట అసత్యము. మరణించిన క్షణమే జన్మ కల్గుచున్నది. కావున శరీరములోనే అనుభవించవలసి ఉన్నది.

**252. శ్రీ మహా విష్ణువుకు 10 అవతారములంటారు. కలియుగములో ఎన్ని అవతారములు ఎత్తినాడు?**

జ. విష్ణువు శివుడు అన్నది పురాణాలు, శాస్త్రము కాదు. యోగశాస్త్రము ప్రకారము **ద్వౌ భూత సర్గౌ లోకేస్మిన్ దైవ అసుర ఏవచ** అన్నట్లు భూమి మీదనే రెండు రకముల జీవరాసులు ఉద్భవించుచున్నవి. ఆ రెండు రకముల పేర్లు దేవతలు రాక్షసులు. మానవులలోనే గుణములను బట్టి దేవతలు రాక్షసులను వారున్నారు, భూమి మీదనే అన్ని లోకములున్నవి. ఎవని లోకము వానిదని మనము ఎన్నో సందర్భములలో వారి వారి ధ్యాసలను బట్టి అంటుంటాము. మా మాటలు కొంత విరుద్ధముగ ఉన్నను యదార్థ సత్యములు. ఈ మాటలు శాస్త్రబద్ధమైనవి కూడ. కావున విష్ణువు అవతారములు అను విషయము విడచి పరమాత్మ, ఆత్మ, జ్ఞానము అనునవి తెలుసుకోవాలని కోరుచున్నాము.

**కె. సోమప్ప, యర్రగుంట్ల**

**253.** దంభో దర్పోభి మానశ్చ క్రోధః పారుష్య మేమచ
అజ్ఞానం చాభి జాతస్య పార్థ! సమ్పదమాసురీమ్

**ఈ శ్లోకమునకు సరియైన అర్థము మీరు ఏ విధముగ తెల్పెదరో తెలుసు కోవాలని ఉన్నది.**

జ. పై శ్లోకమునందు అర్థము చాల సులభముగ అందరికి అర్థమగులాగుననే ఉన్నది. కాని మీరు ప్రత్యేకించి అడిగారు కావున తెల్పుచున్నాము. దంబ, దర్పములు, కఠినత్వము, క్రోధాభి మానములు, అజ్ఞానము మొదలైనవి భూమి మీద రాక్షస తెగకు చెందిన మనుజులకుండునని భావము. ముఖ్యముగ తెలుసు కోవలసి ఉన్నదేమనగా! దేవతా గుణములకు, రాక్షస గుణములకు సంబంధములేని యోగులకు పై శ్లోకము యొక్క భావము వర్తించదు. గుణముల వలన కర్మ అంటుకొనువారికి మాత్రమే మంచి చెడ్డ, పాప పుణ్య, దేవత రాక్షస అను నిర్ణయము యోగశాస్త్రరీత్యా ఏర్పడినది. అదే శాస్త్రములో కర్మ యోగులకు గుణ సంబంధము ఉన్నను కర్మ అంటదని తెలుపబడినది. గుణముల ఫలితమైన కర్మలు అంటని వారు గుణాతీతులు. గుణములతో పని చేయుచున్నప్పటికి దానికి అతీతముగ ఉంచునది కర్మ యోగము. ఏ శ్లోకము ఎవరికి వర్తించుననుట ముఖ్యముగ తెలియవలసి ఉన్నది. అట్లు లేక పోతే దైవాసుర సంపద్వి భాగ యోగములోనే 19వ శ్లోకమున చెడ్డ వారిని, కౄరులను, అధమ జన్మలలో చిక్కుకొనునట్లు జేతు అనిన కృష్ణునికి కూడ కోపమున్నట్లు, అసుర గుణమైనట్లు, ఆయన కూడ అసుర తెగకు చెందిన వానిగ లెక్కింపనగును. ఆయనకే కాదు. ముక్కోపి అని పేరుగాంచిన దుర్వాస, విశ్వామిత్ర మొదలగు వారు కోపముతో శాపముల నొసగిన ఎందరో పెద్దలను కూడ అసుర తెగగ లెక్కింపనగును. అట్లు కాక ఈ శ్లోకము కర్మలు అంటు మనుషులకు చెప్పబడినదని కర్మలను తమ జ్ఞానాగ్నితో భస్మీపటలము చేయు యోగులకు కాదని తెలియవలయును.

**రాము, కర్నూల్**

**254. భర్త అంటే భరించువాడని కదా అర్థము. భార్య భర్తలు ఇద్దరు కర్మ జీవులుగ భూమి మీదకు వచ్చినపుడు భర్త ఎట్లు భరిస్తాడు?**

జ. భరించువాడు భర్త అనుమాట నిజమే, సర్వ జీవులను భరించువాడు దేవుడే. కనుక ఆయనే అందరికి నిజమైన భర్త, స్త్రీలకు పురుషులకు దేవుడే భర్త.

బాహ్య దృష్టితో స్త్రీ శరీరమునకు తిండి పెట్టి పోషించి భరించువాడు మగవాడు కనుక భర్త అంటున్నామని, మగవారి చేత భరింపబడు స్త్రీని భార్యని అంటున్నామని కొందరు అంటున్నారు. భరించువారు భర్తలు, భరింపబడువారు భార్యలను సూత్రము ప్రకారమైతే కొందరు మగవారు ఇంటిలో కూర్చుంటే, వారి సతీమణులైన వారే వారిని పోషించి భరిస్తున్నారు. అపుడు సూత్రము ప్రకారము ఆ సతీమణులనే భర్తలనాలి, పతులనే భార్యలనాలి. బాహ్య దృష్టితో భర్త అనుపదము మగవారికి తగిలించుకొనిన, సూత్రము ప్రకారము ఒక్కొక్కప్పుడు అర్థము తల్లక్రిందులవుతుంది. కావున పూర్వము పరమాత్మను భర్తని, ప్రకృతిని భార్యని అనెడివారు. తాలి కట్టిన వారిని "పతి" అని కట్టించుకొనిన వారిని "సతి" అని పిలిచెడివారు. కాల క్రమేపి "సతి పతులు" భార్య భర్తలైనారు.

**బి. రవీంద్ర రెడ్డి, చెన్నేకొత్తపల్లి**

**255. రావణాసురునికి పది తలలున్నాయని రామాయణములో వ్రాసినట్లు ఉన్నది. అలా ఉన్నాయా?**

జ. మనము మాటల సందర్భములో తెలివైన వానిని గూర్చి వీనిది పెద్ద బుర్ర అనియో లేక వీనిది పెద్ద తలకాయ అనియో అంటుంటాము. పెద్ద బుర్ర, తల అని అన్నంత మాత్రమున వానికి నిజముగ తల లావుగ ఉండదు కదా! అట్లే రావణాసురునికి పది తలలన్నారు. పది మందికున్న తెలివి అతనికొక్కనికున్న దని కాని పదితలలు లేవని దాని అర్థము. అలా పది తలలుంటే అతను చక్కగ పడుకొని చక్కగ లేవవలసి ఉన్నది. ఇటు అటు తిరిగే దానికి కూడ తలలు అనుకూలించవు. ఒక తల ఉన్న మనకే పళ్లుతోముకొనే దానికి, ముఖము కడుక్కోవడానికి, నూనె పెట్టి తల దువ్వుకోవడానికి కనీసమంటే అర్ధగంట పట్టును. ఇక పది తలల రావణునికి ఐదు గంటలు పట్టును. మిగత పనులు ఆయనెప్పుడు చేసుకోవాలి? అందువలన ఆయనకు మన మాదిరి ఒక తల తప్ప పది లేవని తెలియవలయును.

**256. త్రేతా యుగములో శ్రీరాముడు భగవంతుడని కొందరి వాదన అది నిజమేనా?**

జ. శ్రీ రాముడు విష్ణువాంశ చెందిన వాడే కాని భగవంతుడు కాదు. పరమాత్మ అంశతో పుట్టిన వాడు భగవంతుడని తెలియాలి.

**గడుగు క్రిష్ణమూర్తి, బనగానిపల్లె**

**257. స్వామి! నాల్గు యుగములకు ఏది మొదలు? దేవుని పగలు ఎన్ని యుగములు, రాత్రి ఎన్ని యుగములు తెలుప ప్రార్థన.**

జ. నాల్గు యుగములలో మొదటిది కృతయుగము. పరమాత్మకు పగలు వేయి యుగములు, అట్లే రాత్రి వేయి యుగములు గలవు. పరమాత్మ పగలు మాత్రమే మనకు 108 కోట్ల సంవత్సరములని తెలియాలి.

**ఎ.జి. రవి, చిత్తూరు**

**258. అకస్మాత్తుగ మరణించిన వారికి అవసానదశ కల్గుతుందా?**

జ. అకస్మాత్తుగ మరణించువారికి అవసాన దశ లేదు. వారికి సూక్ష్మ శరీరములో మరణమాసన్నమైనపుడు అవసానదశ కల్గును.

**టి, సత్యగోపాలాచార్యులు, నరసాపురము**

**259. ప్రళయ కాలములో ప్రపంచముండినదా లేదా?**

జ. పంచభూతములు లేకుండ పోవడమే ప్రళయము కావున అప్పుడు ప్రపంచములేదు.

**260. భగవంతుని స్వరూపము పెరుగుట తరుగుట లావెక్కుట చిక్కిపోవుట మొదలగు మార్పులు కలుగునా?**

జ. శరీరము ధరించినపుడే కదా భగవంతుడనేది. పద్ధతి ప్రకారము భగవంతుని శరీరమునకు కూడ పెరుగుట తరుగుట ఉండును. భగవంతునికి కూడ కర్మ ఉండును కావున అన్ని ఉండునని చెప్పవచ్చును.

**261. ద్విజుల పురుషులకే గాక స్త్రీలకు శూద్రులకు ఉపనయన సంస్కారములు సంధ్యావందన వేదాధ్యాయన సర్వ కర్మలు ఆచరించుటకు హక్కు కలదా?**

జ. అందరికి హక్కు ఉన్నది. దేవుని దృష్టిలో అందరు సమానులే.

**ఆర్. రంగస్వామి, హిందూపురము**

**262. మనిషి చనిపోయిన తర్వాత కాకికే పిండా కూడు ఎందుకు పెట్టాలి? మిగత పక్షులకు పెట్ట కూడదా?**

జ. అన్నమును అన్ని పక్షులు తినవు. అన్నముతినే అలవాటు కాకికి మాత్రమే ఎక్కువగ ఉన్నది. పైగా స్మశానమునకు ఎగిరి రాగలిగేది అది ఒక్కటే కావున అదే తింటూ ఉన్నది. కాని ఇతర పక్షులకు పెట్టకూడదని ఏమి లేదు. స్మశానానికి కోళ్ళను ఎత్తుకొని పోయిన అవి కూడ పిండాకూడును తినగలవు.

**షరీఫ్ ఖాన్, యాడికి**

**263. కొందరు దేవతల మహత్యములను ప్రచారము చేస్తు మాకు కరపత్రములు పంపారు. ఆ పత్రములను చూచిన మేము కూడ అలాగే కరపత్రములను అచ్చువేసి కొందరికి పంపవలెనని అందులో నిబంధన ఉన్నది. అట్లు చేయుట సమంజసమేనా? దాని మీద మీ ఉద్ద్యేశము తెలుపవలెను?**

జ. ఇటువంటి కరపత్రములు చాలామార్లు మేము చూచాము. అందులో దైవికముగ ముందుకు పోవు మార్గము ఏమి లేక పోవడమేకాక స్వార్థము ఆశ తప్ప ఏమి కనిపించడము లేదు. అందువలన అట్లు చేయుట కొందరికి నచ్చిన మాకు మాత్రము నచ్చదు. ఆ పని చేయక పోవడము వలన వచ్చే నష్టము కష్టము ఏమి ఉండదు.

**యస్.యన్. భాష, నందివర్గము**

**264. ఇచ్చిన ప్రతి ప్రశ్నకు ప్రతి వారికి సూటిగ సమాధానము ఇస్తున్నారు. కనుక మీ గతాన్ని గురించి తెలుసుకోవడము మీకేమైన అభ్యంతరమా?**

జ. గతాన్ని దాచుకోవడము వలన లాభము లేదు, కనుక మాకేమి అభ్యంతరము లేదు. నేను అందరిలాగ పుట్టిన వాడినే. అందరిలాగ కష్ట నష్టములు సుఖదుఃఖములు అనుభవించినవాడినే, భార్య పిల్లలతో పాటు మీలాగ సంసారములో ఉన్నవాడినే, మొత్తము మీద ప్రపంచపరముగ మీకు మాకు ఏమి తేడా ఉండదు.

**265. మీరు ఏమి చదువుకున్నారు?**

జ. మేము ప్రపంచ చదువులైన డిగ్రీలు చదువ లేదు. కాని పరమాత్మ చదువైన బ్రహ్మవిద్యను ఎవరు ఊహించలేనంత చదువుకోలేదు. ఎచ్చట వినలేదు కాని చెప్పలేనంత నేర్చుకొన్నాను.

**266. మీకు ఆలు బిడ్డలు లేరా? మీ వయస్సు ఎంత?**

జ. ఎందుకు లేరు నలుగురు కుమారులు కూడ ఉన్నారు. నా వయస్సు 2002 ఏప్రిల్ 5వ తేదికి 51 దాటి 52 చేరింది.

**267. మీకు తల్లిదండ్రులు పెట్టిన పేరేమిటి? మీరు ఇంతటి జ్ఞానాన్ని గురించి ఎలా చెప్పగలుగుచున్నారు.**

జ. తల్లిదండ్రులు పెట్టిన పేరు పెద్దన్న. గురువు పెట్టిన పేరు మీకు తెలుసుకదా! శ్రద్ధను బట్టి జ్ఞానము, ఆచరణను బట్టి అనుభవము వస్తుంది. ఆ రెండు మాలో ఉన్నాయి. కావున అనుభవమైన జ్ఞానాన్ని మీకు మేము చెప్పుచున్నాము.

**268. చేతిలోని రేఖలు మనిషి భవిష్యత్తును నిర్ణయించునా?**

జ. ప్రపంచములో ఎన్నో రకాల అనుభవాలు జీవిత నడకలు కలవారున్నారని

మనకు బాగ తెలుసును కదా! అన్ని రకములుగ చేతిలో రేఖలున్నాయా? లేవు. రేఖలు బట్టియే జీవితాలుంటే అందరి చేతులలోను కొన్ని భేదములు కల్గిన రేఖలేవున్నాయి. కావున కొన్ని రకముల భేదములు కల్గిన జీవితాలే భూమి మీద ఉండాలి. అలా లేవు కదా! ఎన్నో రకములుగ మనుజుల జీవితాలున్నవి. కావున చేతి రేఖలను బట్టి భవిష్యత్తు ఉండదు. భవిష్యత్తంతా జ్యోతిష్య శాస్త్రము ప్రకారము నవగ్రహములను బట్టి నిర్ణయింపదగును.

**269. మనిషి పాపము చాలా పవర్‌పుల్ దశలో ఉన్నపుడు మనిషి జంతువుగ పుట్టగలడా?**

జ. కర్మ వలన జన్మలు కావున పాపము ఎక్కువున్నపుడు మనిషి జంతువుగ, పుణ్యము ఉన్నపుడు జంతువు మనిషిగ పుట్టవచ్చును. కాని మనిషి జన్మకంటే జంతు జన్మ, జంతు జన్మకంటే వృక్ష జన్మ దేవునికి దగ్గరగా గలవని తెలియాలి.

**270. కొందరు ఆడ మగ అందవికారముతో చాలా మానసిక వ్యథ పొందుతుంటారు. వీరు జరిగిన జన్మలో శిక్షార్హనీయులా?**

జ. జరిగిన జన్మలో చేసుకొన్న పాపమును బట్టి ఈ జన్మలో శిక్షార్హులై బాధను అనుభవిస్తున్నారు.

**యమ్. రాబియాబి (బి.పి.సి.), చియ్యేడు**

**271. ఈ దిగువనున్న శ్రీ వేమన గారి పద్యములోని అంతరార్థమేమిటో తెల్పు ప్రార్థన.**

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలి ముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా
విశ్వదాభి రామ వినుర వేమా.

**జ. భావము :** మానవుని శరీరము లోపల జీవుడు నివాసమున్నాడు. లోపలనున్న

జీవునికి బయటి ఇంద్రియముల ద్వార ప్రపంచ విషయములు తెలియుచున్నవి. ఇంద్రియాలు మనస్సు ద్వార ప్రతి విషయమును జీవునికి చేరవేయుచున్నవి. ఆ విధముగ విషయములు చేర వేయు ఇంద్రియ భాగములు ఐదు మాత్రము కలవు. వాటినే జ్ఞానేంద్రియములను చున్నాము. అవి 1. కన్ను, 2. చెవి, 3. ముక్కు 4. నాలుక, 5. చర్మము. పంచ జ్ఞానేంద్రియముల ద్వార వచ్చు విషయములను అనుభవించుచు, జీవుడు ఎడ తెరపిలేని కర్మననుభవిస్తు, తేనెలో చిక్కిన ఈగ మాదిరి అల్లాడు చున్నాడు. పంచేంద్రియముల విషయములు, సుఖమును చూపి కష్టమును కలుగజేయునవి. జీవాత్మ పంచేంద్రియ విషయ వాసనలకు లోనయి కర్మములను సంపాదించుకొనుచున్నాడు.

చర్మ స్పర్శ వలన కలిగెడు కర్మను చెప్పులోని రాయి అన్నారు. చెవి శబ్ద విషయము వలన గలిగెడు కర్మను చెవిలోని జోరీగ అన్నారు. కంటి దృశ్య విషయము వలన గలిగెడు కర్మను కంటిలోని నలుసు అన్నారు. ఇంద్రియ విషయములు మనస్సు వలననే అనుభవమున కొచ్చును. కావున మనస్సును ముల్లుగ వర్ణించారు. శరీరములో అన్ని ఇంద్రియముల విషయములు అనుభవమునకొస్తున్నవి. కావున శరీరమును ఇల్లుగ చెప్పి అనుభవములను పోరుగ పోల్చి ఇంటిలోని పోరు ఇంతింత కాదయా అని అన్నారు. ఇది శరీరాంతర్గతముగ చెప్పిన విషయము.

**మచ్చా వెంకటరామయ్య, ఉరవకొండ**

**272. శ్రాద్ధ కర్మలు మూఢ నమ్మకాలా?**

జ. అర్థము తెలియకుండ చేయువారికి శ్రార్ధకర్మలు మూఢనమ్మకాలే అవును. అర్థము తెలిస్తే మోక్షము పొందినవారికి చేయు ఆచరణలుగ ఉన్నవి. మోక్షము పొందని వారికి చేయడము వ్యర్థము.

**273. ప్రకృతులేవి ఎన్ని? వాటి విశ్లేషణ గురించి తెలియజేస్తారా?**

జ. ప్రకృతి ఒక్కటే ఉన్నది. అది ఐదు భాగములుగ విభజింపబడినది. ఆ

ఐదు భాగములు వరుసగ 1. ఆకాశము, 2. గాలి, 3. అగ్ని, 4. నీరు, 5. భూమి. ఈ ఐదు భాగములను కలిపి ప్రకృతి అంటున్నాము. ప్రకృతి ఒకటి చర, అచర అను రెండు రకములుగ ఉన్నది.

**జి. సుబ్రమణ్య రెడ్డి, తిరుపతి**

**274. ప్రాణాయామము అంటే ఏమి? హఠ యోగమంటే ఏమి? వాటి కొకదానికొకటి సంబంధమున్నదా?**

జ. ప్రాణాయామము అంటే ఊపిరిని బిగ పట్టి నిలిపి వేయుట, పట్టుదలగ కష్టముతో చేయు దానిని హఠ యోగమంటారు. ప్రాణాయామము పట్టుదలతో కష్టముగ చేయు పనియే కావున ప్రాణాయామమును హఠ యోగమనవచ్చును. హఠ యోగమనునది చేయు పద్ధతికున్న పేరు మాత్రమే. కావున మొండిగ కష్టముగ చేయు పద్ధతులన్నిటిని హఠ యోగమునకు సంబంధించినవేనని తెలియవలయును.

**మావిళ్ళపల్లి గౌరి శంకర్, నంద్యాల**

**275. రాజయోగము మూడు విధములని అవి సాంఖ్య, తారక, అమనస్కములని విన్నాము. వీటిని వివరించి చెప్ప ప్రార్థన.**

జ. రాజ యోగము మూడు విధములనుట తప్పు. రాజ యోగము మారు పేరు సాంఖ్య యోగమనవచ్చును. అమనస్క, తారక యోగములు రెండు బ్రహ్మ యోగమునకు సంబంధించినవి. మనస్సు నిలుపుటయే బ్రహ్మయోగము. మనస్సును ప్రపంచ సంబంధము నుండి లేకుండ చేయడము అమనస్కమంటారు. శ్వాసను నిలుపుట తారకమంటాము. తారకము ద్వార కూడ మనస్సే నిలిచి పోవును. కావున అమనస్కమనిన, తారకమనిన బ్రహ్మయోగమునకు సంబంధించి నవే. ఇకపోతే సాంఖ్యమనగా శరీర అంతరేంద్రియ బాహ్యేంద్రియ వివరము తెలుపుచు పోవునది. అట్లు శరీర యంత్రాంగములో ఏది ఏమి చేయుచున్నదని తెలిసి చివరకు అహంకారమును దాని పాత్రను తెలిసి, దానిని నిలిపి వేయడమే

రాజయోగము. కావున రాజ యోగమును సాంఖ్య యోగమని కూడ అనవచ్చును. గృహస్థులకు సాధ్యపడునది రాజయోగమని తెలియవలయును.

**సి.వి. రమణ, జి. సుబ్రమణ్యం, ఎన్. సత్యనారాయణ, ఎన్. మల్లికార్జున, గడివేముల**

**276. బ్రహ్మ దేవునికి మూడు తలలున్నాయని మాస్నేహితులు వాదించారు. ఈ సందేహాన్ని తీర్చవలెను.**

జ. బ్రహ్మ దేవునికి మూడు తలలు కాదు నాలుగు తలలని కూడ అంటున్నారు, చతుర్ముఖుడని అంటుంటారు. పరమాత్మ సృష్టించిన సృష్టిని పురాణ రూపముగ బ్రహ్మదేవుడు పుట్టించువాడని, కర్మ జరిపించు జీవితములను విష్ణువు జరిపించుచున్నాడని, శివుడు చంపుచున్నాడని వ్రాశారు. అలా వ్రాసిన దానిలో బ్రహ్మదేవునికి నాల్గు ముఖములున్నవని ఒక్కొక్క ముఖము ద్వార ఒక్కొక్క రక అండజ, పిండజ, ఉద్భిజ, స్వేదజ అను రకములను పుట్టించుచున్నాడని పురాణవాదన, శాస్త్రపద్ధతి ప్రకారము పరమాత్మ సృష్టికర్తని, ఆ పరమాత్మ కర్మననుసరించి జన్మలు కలుగునట్లు చేశాడని ఉన్నది. శాస్త్రము నిరూపణకు వచ్చునది, పురాణము కేవలము కల్పితము కావున నిజము కాదు. బ్రహ్మదేవునికి మూడు గాని, నాల్గు గాని తలలు లేవు. కవుల కలాలకు పుట్టే తలలు ఎన్నియైన ఉండవచ్చును. దైవసృష్టిలో ప్రతి ఒక్కరికి ఒకే తల అని తెలియాలి.

**277. కలియుగము క్రీ. శ. 2000 సంవత్సరముల నాటికి ప్రపంచము అంతమగునని 18-03-1989 తేదీన పేపరులో ఒక పరిశోధకుడు సవాలు చేసి చెప్పాడు అది నిజమా?**

జ. కలియుగము 4,32,000 సంవత్సరములు పూర్తి గడవాలి. కాని ఇపుడు 5,150 సంవత్సరములు మాత్రమే గడిచినది. ఖగోళశాస్త్రమే పూర్తి తెలియక దానిని గురించి పరిశోధన చేసుకొంటూ వారు కనుగొన్న దానినే అతిక్రమించి

ఇంకొక దానిని కనుగొనుచున్నారు. మొదటి పరిశోధన తప్పని వేరొక దానిని కనుగొనుచున్నారు. మొదటి పరిశోధన తప్పని దానికంటే భిన్నముగ ఉన్న ఫలితము తేలిందని పేపరులో వేయడము చూస్తూనే ఉన్నాము కదా! కావున యోగశాస్త్ర పద్ధతి ప్రకారము ప్రపంచములో క్రీ॥శ॥ 2000 సంవత్సరములకు ప్రపంచము అంతము కాదు. పూర్తి ప్రళయము వచ్చుటకు 108 కోట్ల సంవత్సరములు గడవాలి.

**పల్లా విశ్వనాథం, ఆళ్ళగడ్డ**

**278. పరమాత్మ నిరంతరము ఉన్నాడని విన్నాము. ఆయనకు వేయి యుగములు రాత్రి, వేయి యుగములు పగలు అని మీరు మార్చి పత్రికలో తెలిపారు. ఇట్లు కాల ప్రమాణము జరిగినపుడు ఆయనకు కూడ ఆయుస్సు ఉన్నదని మాబోటివారు అనుకోవాలి. ఆయనకు ఆయుస్సు లేదని మేము విన్న మాట నిజమా? మీరు వ్రాసినది సత్యమా?**

జ. జవాబు అనేది శాస్త్రబద్ధముగ ఉండాలనే మా వాదన. అలా శాస్త్రబద్ధము కానపుడు అది సత్యము కాదని ఎన్నో మార్లు తెలియజెప్పాము. మేము మార్చి నెల పత్రికలో వ్రాసినది వేయి యుగములు పగలు వేయి యుగములు రాత్రి అనుమాట భగవద్గీతా శాస్త్రములోని విషయమే కదా! మేము కల్పించి వ్రాసినది కాదు కదా!! పరమాత్మ నిరంతరము లేనివాడని మేము చెప్పలేదు కదా!!! అందులో ప్రకృతికి ఆయుస్సు చెప్పబడినది కాని ప్రకృతికంటే అతీతుడైన పరమాత్మకు ఆయుస్సు చెప్పబడలేదు. పరమాత్మకు ఆయుస్సు లేదు. ఇంతని ఎవరు నిర్ణయించలేదు. నిర్ణయించువారు లేరు, పరమాత్మ తనకొక పగలు ఒక రాత్రి అను కొలత ప్రకారము ప్రపంచ ఆయుస్సు నిర్ణయించాడు. కాని తన కింత ఆయుస్సని చెప్పలేదు. మేమిచ్చిన జవాబును సరిగ అర్థము చేసుకోలేక పరమాత్మకు ఆయుస్సున్నట్లే కదా! మీరు చెప్పినట్లే కదా అంటే నేనెక్కడ చెప్పాను? మీరు ఎంత ఆయుస్సని అనుకున్నారు? పరమాత్మకు ఆయుస్సు లేదన్నమాట సత్యము. అందులకు భిన్నముగ మేము ఎక్కడ ఏ సందర్భములో చెప్పలేదు.

**వి. క్రిష్ణారెడ్డి, గౌనిపల్లి**

**279. జీవునకు అవసాన దశయందు బ్రహ్మనాడి వరకు చైతన్యశక్తి లేదన్నారు. జీవుడు మత్తు సేవించి మత్తులో ఉండినపుడు బ్రహ్మనాడి వరకు చైతన్యము లేనట్లేనా?**

జ. మత్తు సేవించినపుడు జీవుడు మత్తులో ఉండినప్పటికి చైతన్యము శరీరమంత ఉండును. చైతన్యము వెనక్కు ముకిలించుకొని బ్రహ్మనాడిలోని ఆరు నాడి కేంద్రములను కూడ వీడి పోవునది రెండే రెండు సందర్భములలో జరుగును. 1. జీవుడు బ్రహ్మ యోగములో ఉన్నపుడు, 2. జీవుడు మరణావస్థ చేరునపుడు. ఈ రెండు సందర్భములు కాక మిగత ఏ పరిస్థితిలోను చైతన్యము బ్రహ్మనాడిలోని ఆరు కేంద్రములను వదలదు.

**పి.వి. చలపతి, కర్నూలు**

**280. సూక్ష్మశరీరము యొక్క ఆయుస్సు అయిపోయి, స్థూలశరీరము యొక్క ఆయుస్సు ఉంటే అపుడు ఆ జీవి యొక్క గతి ఏమి?**

జ. సూక్ష్మము నాధారము చేసుకొని స్థూలము ఉన్నది కాని స్థూల మాధారముతో సూక్ష్మము లేదు. స్థూలము జడము, స్థూలమును ఆడించునది సూక్ష్మము. సూక్ష్మములేనపుడు స్థూలము లేదు. సూక్ష్మమెపుడై పోవునో అపుడు వేరొక జన్మకు పోవలసి ఉండును. సూక్ష్మమైపోకపోతే అయిపోవు వరకు స్థూలము లేకుండిన సూక్ష్మరూపముతోనే అదే జన్మలో ఉండవచ్చును.

**యమ్. అంజనేయులు, కరీంనగర్**

**281. మంత్రము అనగానేమి? యంత్రము అనగా నేమి? వీటి వల్ల ఉపయోగములు ఉన్నావా? కర్మ సిద్ధాంతములో వీటికి స్థానమున్నదా?**

జ. మంత్రమనగా భాషాక్షరముల వరుస క్రమమైనది మరియు మహిమగలది.

యంత్రమనగ ఒక శక్తిని ఉత్పత్తి చేయునది. యంత్రములు పరికరములచే నిర్మింపబడునవే కాక భాషాక్షరముల చేత కూడ నిర్మింపవచ్చును. వీటి వలన ఉపయోగములు కలవు. మంత్రము వలన మహిమతో కూడిన పని, యంత్రము వలన మానవుని చేత కాని పని జరుగుచున్నది. మంత్ర యంత్రములన్ని కర్మ సిద్ధాంతములకు లోబడి ఉన్నవే కాని అతిక్రమించి ఉండునవి కావు. ఒక్క జ్ఞాన మొక్కటే కర్మనతిక్రమించి ఉండును. మంత్రమనగ మహిమ గలది, యంత్రమనగ శక్తి కలది అని అర్థము.

**282. ఒక మనిషి చనిపోయిన తర్వాత వారి సంతతి పిండ ప్రదానములు చేయుదురు. అదే విధముగ సంవత్సరీకములు కూడ చేయుదురు ఎందులకు?**

జ. యోగశాస్త్రములో జీవుడు చనిపోతే మరుజన్మకు పోవునని ఉన్నది. కాని వారి సంతతి ఇచ్చు పిండ ప్రదానముల కోసము అచ్చటనే ఉండునని లేదు. మోక్షము పొందిన వారికి పిండ ప్రధానము చేయాలి, అందరికి చేయకూడదు. ఈ విషయము తెలియాలంటే మా రచనలలోని **"ఇందూసాంప్రదాయములు"** అను గ్రంథము చూడండి.

**283. పిండ ప్రధాన కర్మతంత్రములు తల్లితండ్రులకే కాక తాతముత్తాతలకు కూడ చేయుచున్నారు. నాకు తెలిసినవారు కొందరు వారికున్నా లేక పోయిన అప్పులు చేసి సంవత్సరీకములు చేయుచున్నారు. అసలుకు వారు ముత్తాతలను చూచి కూడ ఉండరు. అలా చేయడము అవసరమా?**

జ. ఆ విధముగ చేయకపోతే ఏదైన తమకు ముప్పు వస్తుందేమోనను భయముతో తప్ప భక్తితో ఎవరు చేయడము లేదు. వారి పెద్దలు చనిపోక ముందు పలానా పదార్థము తినాలని కోరినప్పటికి పెట్టనివారు చనిపోయిన తరువాత దినాల పేరుతో పెద్దలకని కాకుల గ్రద్దలకు పెట్టుచున్నారు. అదే చనిపోక ముందు పెట్టి ఉంటే తిని తృప్తిపడేవారు కదా! పెద్దలు చనిపోక ముందు వచ్చిన రోగమునకు ఐదు పైసాలు ఖర్చు చేయనివాడు చనిపోయిన తర్వాత కర్మతంత్రాలకు ఐదువేలైన

ఖర్చు చేస్తున్నాడంటే అర్థముందా మీరే యోచించండి. పెద్దలు చనిపోకముందు ఏనాడు నమస్కరించనివాడు చనిపోయిన తర్వాత గోరీకి నమస్కరిస్తున్నాడంటే ఏమైన అర్థముందా? పెద్దలు బ్రతికి ఉన్నపుడు గుడ్డలుకొని ఇవ్వనివాడు వారు చనిపోయిన తర్వాత జతల గుడ్డలు పెట్టడములో అర్థమేమున్నది? ఇతరులు పెట్టిన భయము వలన తనకు తెలియని దాని వలన ఈ కర్మ తంత్రము మానవుడు చేయుచున్నాడే కాని వేరు అర్థము ఏ మాత్రము తెలియదు. చనిపోయిన వారికి కర్మ తంత్రాలను పేరుతో ఈ అర్థము లేని పనులు చేయుటకంటే వారు బ్రతికి ఉన్నపుడే సంవత్సరమునకు ఒకమారు వారికి మంచి తిండి, మంచి గుడ్డలు పెట్టి భక్తితో నమస్కరించితే వారికి తృప్తి వీరికి భక్తియైన కుదురుతుంది. ఇందూ ధర్మములో కాలమైనవారికి అనగా మోక్షము పొందిన వారికి కర్మతంత్రాలు చేయవలెను. అది తెలియక అందరికి చేయడము అర్థములేని పని.

**కె. మదుసూదన, ధర్మవరము**

**284. ఒక వ్యక్తి మరణించినపుడు అతనిని స్మశానమునకు ఎత్తుక పోయేటపుడు శవానికి బొరుగులు చల్లుతాపోతారు ఎందుకు?**

జ. ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క అలవాటు పెట్టుకొన్నారు. రాగులు చల్లుతుపోయే వారిని కూడ మేము చూచాము. ఎందుకలా చల్లాలని మేము అడిగినపుడు "స్మశానమునకు పోయిన వారు భూతమై తిరిగి ఇంటికి రాకుండ ఉండడానికి. వారు రావాలంటే ఇపుడు చల్లిన రాగులు కాని, బొరుగులు కాని ఏరుకుంటు రావాలి. అట్లు ఏరుకుంటు వచ్చే దానికి చాలా సంవత్సరములు పట్టుతాయి. అందువలన వారు రాలేరు. అట్లు వారు తిరిగి రాకుండ ఉండడానికి ఇలా చల్లుచున్నాము" అని చెప్పారు. వీరు చల్లినవి వారు ఏరాలని ఏ దేవుడు చెప్పాడో మాకు తెలియదు. చేసే వారిది తప్పు కాదు కాని మీకు హితులమని అభూత కల్పనలు చెప్పి చేయించు వారిది తప్పు. విన్న దానిని యోచించక అర్థము లేని వ్యర్థమైన పనులు చేయు వారిది మరీ తప్పు.

**సి. లక్ష్మణ మూర్తి, చిన్నపొలమడ**

**285. భక్తి శక్తి యుక్తి డబ్బు వీటిలో ఏది గొప్పది? ఎలా గొప్పది?**

జ. డబ్బు ఉండిన దానిని ఉపయోగించు యుక్తి లేనిది ఏమి ప్రయోజనము లేదు. పిచ్చివాని వద్ద డబ్బు ఉన్న ప్రయోజనము లేదు కదా! అందువలన డబ్బు కంటే యుక్తి గొప్పది. డబ్బు యుక్తి రెండు ఉండినప్పటికి శరీరములో శక్తి లేని రోగ గ్రస్తునికి ఏమి ప్రయోజనము లేదు. యుక్తి ఉండినప్పటికి డబ్బు విలువను యుక్తి నైపుణ్యతను తాను ఉపయోగించినప్పటికి, శక్తి కృశించి మంచములో ఉన్న వానికి డబ్బు యుక్తి ఉండినప్పటికి డబ్బు విలువను నైపుణ్యతను తాను అనుభవించలేడు. వాని యుక్తి డబ్బు రెండు ఇతరులకు ఉపయోగపడునవే అగును, కాని శరీరములో శక్తి లేక నామమాత్రమున్నవారికి ఏమి పనికిరావు. కావున డబ్బు యుక్తికంటే శక్తి ముఖ్యము. డబ్బు, యుక్తి, శక్తి ఉన్న వానికి భక్తి లేక పోతే ఆ జీవితమే నిరర్థకమగును. పుట్టినందులకు అర్థమే లేకుండ పుట్టుక అను ప్రశ్నకు జవాబు లేకుండ పోవును. జీవితము మనకంటే పెద్దయైన దేవుని తెలియుటకు గలదు. అందులకు భక్తి అవసరము. కావున భక్తి లేని జీవితమే వ్యర్థము. ఈ విధముగ తెలుస్తు వస్తే అన్నిటికంటే భక్తియే గొప్పదని తెలియుచున్నది. ఇక్కడ ముఖ్యముగ తెలియవలసినదేమంటే శక్తి యుక్తి డబ్బు మూడు ప్రపంచ సంబంధమైనవి, భక్తి ఒకటి పరమాత్మ సంబంధమైనది. సుఖమయమైన జీవితము సాగుటకు ఈ మూడు అవసరమే. అట్లే జ్ఞాన మార్గములో సాగుటకు కూడ భక్తి అవసరము. భక్తి లేనివాడు జ్ఞానమును, దైవమును పొందలేనట్లు, శక్తి యుక్తి డబ్బు లేనివాడు ప్రపంచములో రాణించలేడు. అందువలన ప్రపంచ సంబంధమైన శక్తి యుక్తి డబ్బు, దైవ సంబంధమైన భక్తి ఉన్నవాడు మానవులలో మేటివాడని తెలియవలయును.

**జి. వెంకటనారాయణ, తాడిపత్రి**

**286. మరణము అంటే ఏమిటి?**

జ. జీవుని ప్రారబ్ధకర్మమంతయు అయిపోయిన తర్వాత స్థూల సూక్ష్మ శరీరములను వదలి పోవుటను మరణము అంటారు. రణము అనగ యుద్ధము. మరణము అనగ మళ్లీ యుద్ధ ప్రారంభమని అర్థము. కొత్త సైన్యముతో జీవిత యుద్ధము ప్రారంభించడమును మరణము అంటారు. క్రొత్త సైన్యమనగ క్రొత్త శరీరములోని క్రొత్త ఇంద్రియములని తెలియాలి.

**287. చనిపోవుట, చచ్చిపోవుట అని అంటా ఉంటారు. ఈ రెండు పదములలో మరణమునకు ఏది సరియైన పదము?**

జ. ఈ రెండు పదములు నిజముగ తప్పే. వీటికి సత్యమైన మూల పదము **"సత్తు పోవుట"** అని ఉండేది. సత్తుపోవుట అను పదము పలకడములో కొంత కాలమునకు చచ్చిపోవుటగ మారింది. అట్లే మరికొంత కాలమునకు చనిపోవుటగ మారింది. అయినప్పటికి చచ్చిపోవుట కొంత మొరటు పదముగ, చనిపోవుట కొంత నాగరిక పదముగ వాడుచున్నారు. ఏది ఏమైన మనము అసలైన దానిని వదలి నకిలీ పదములను పట్టుకొని ఉన్నామన్న మాట. సత్తు పోవుట అను పదము ఎట్లు అసలైనదో వివరిస్తాము.

సత్తు అంటే సారము అని అర్థము గలదు. మన శరీరములయందు సత్యమైన సారాంశమైన శక్తి గలదు. దానినే ఆత్మ లేక దైవము అని అంటారు. ఆ ఆత్మనే సత్తు అని కూడ అంటున్నాము. ఆ సత్తు ఉన్నంత వరకు మన శరీరములు కదలుచున్నవి. అనగ మన శరీరములలో గల చైతన్య శక్తినే సత్తు అంటున్నామన్న మాట. సత్తు లేకపోతే శరీరములు ఏ మాత్రము కదలలేవు. ఈ సత్తు అనే పదమునే పూర్వము సత్తువ అని కూడ అనెడి వారు. సత్తు శరీరములో ఉన్నపుడే శరీరములో జీవుడు కూడ ఉంటాడు, శరీరము సజీవమై ఉంటుంది. శరీరములో సత్తు అనబడు ఆత్మ ఎపుడైతే బయటకి పోవునో అపుడు జీవాత్మ కూడ శరీరము వదలి పోవుట జరుగుచున్న సత్యము. అటువంటి శరీరమును సత్తు పోయిన శరీర మంటాము. ఒక ఆవు మరణించిందనుకోండి, పూర్వము

దానిని ఆవు సత్తు పోయింది అనెడి వారు. అట్లే ఎనుము సత్తుపోయింది, దున్న పోతు సత్తు పోయింది అనెడివారు. కాల క్రమేపి పద మార్పిడి జరిగి ఇపుడు ఆవు చచ్చిపోయింది, ఎనుము చచ్చిపోయిందనుచున్నాము. అందువలన చనిపోవుట గాని, చచ్చిపోవుట గాని మరణమునకు సరియైన పదములు కావు నిజమైన పదము 'సత్తు పోవుటని' తెలియాలి.

**వి. చిదానందప్ప, హోలగొంద**

**288. మనిషి దైవాంశసంభూతుడంటారు. కాన మనిషికి దైవానికి గల సంబంధమేమిటి?**

జ. బాహ్యముగ మనకు మన నీడకు గల సంబంధము లాగ లోపల దైవానికి జీవానికి సంబంధమున్నది. మనిషి ఉన్నంత వరకు నీడ ఉన్నట్లు జీవాత్మ ఉన్నంత వరకు దైవము అంటి ఉంటుంది. అందువలన దైవ అంశతో కూడి శరీరమందున్న వాడని దైవాంశ సంభూతుడన్నారు. భగవద్గీతలో కూడ దైవమును కూటస్థుడని అన్నారు. జీవుడు ఎక్కడైతే ఉండునో వానితో పాటు కూటస్థునిగ దైవము కూడ గలదను గీతావాక్యము ప్రకారము మనిషి దైవాంశ సంభూతుడని తెలియవలెను.

**టి. ఓబుల నారాయణ రెడ్డి, చిన్న పొలమడ**

**289. మన మంతట ఉపయోగించు విద్యుత్‌శక్తి పుట్టుక స్థానము జనరేటర్లయినట్లు జీవరాసులలోనే కాక విశ్వమంతట వ్యాపించిన పరమాత్మ శక్తికి కేంద్రమేది. ఏ కేంద్రము నుండి ఆ శక్తి అంతట వ్యాపించుచున్నది?**

జ. విశ్వవ్యాపియైన పరమాత్మశక్తికి కేంద్రము ఒక చోట అన్నది లేదు. ప్రతి అణువులోను ఒక కేంద్రమున్నది. ప్రతి అణువులోను ఆ శక్తి కేంద్రీకృతమై ఉన్నది. కావున విశ్వమంతా ఏక శక్తిగ ఇమిడి ఉన్నది.

**పి. చెంచిరెడ్డి, జిల్లెల్ల**

**290. కొందరు చిన్నప్పటి నుండి తిక్కతో తిరుగుచుంటారు. వారికి పాపము తెలియదు పుణ్యము తెలియదు. అహంకారము ఉండదు. అటువంటి వారికి మరు జన్మ ఉంటుందా?**

జ. అటువంటి సందర్భములో వారికి క్రొత్త పాప పుణ్యములు రావు. పాత కర్మ ఆ జన్మలో అయిపోయి ఉంటే వారికి మరుజన్మ లేదు. ఒకవేళ పాత కర్మ ఇంకా మిగులు ఉంటే జన్మ తప్పదు. తిక్కవారు కర్మ ప్రకారము ఒక జన్మలో అలా అయి ఉంటారు. వారికి కర్మ మిగిలి ఉంటుంది. కావున జన్మ కూడ ఉంటుంది.

**291. చదువు గొప్పదా? భక్తి గొప్పదా? దైవజ్ఞానము గొప్పదా?**

జ. మూడింటిలోనూ జన్మరాహిత్యమును చేయు దైవజ్ఞానమే గొప్పది.

**292. గర్వము, కోరికలను ఎట్లు చంపవలెను?**

జ. సాధన ద్వారా సాధ్యమగును. అభ్యాసము పట్టుదల ఉంటే సాధ్యము కానిది లేదు. రెండు గుణములనే అడిగారు మిగత గుణములు పది ఉన్నాయి వాటన్నిటిని జయింపవలెను.

**293. మనుషులకు దేవతలు ఒల్లులోనికి వస్తుంటారు. అపుడు మనుషులు దేవతలవుతారా? అసలుకు దేవతలొస్తారా?**

జ. దేవతల పేర్లు చెప్పి దయ్యములు కూడ వస్తుంటాయని అవి నిజ దేవతలుకావని తెలుసుకోండి. మనుషుల శరీరములలోనికి గ్రహాలు కాక విగ్రహాలు కూడ రావచ్చును. శరీరములో ఎవరు ఉంటే అప్పటికి వారే అవుతారు.

**294. ఈ కాలములో కొందరు బాబాలు మహిమలు చూపుచుంటారు. అవి ఎట్లు చేయుచుంటారు?**

జ. మేము వ్రాసిన సత్యాన్వేషి కథ చదవండి తెలుస్తుంది. చాలా వరకు మహిమలు బూటకము. బాబాలు చేసే మహిమలన్ని మా శిష్యులలో చేయువారు కూడ గలరు. కొన్ని పచ్చి బూటకమైతే, కొన్నిటిని కనిపించని సూక్ష్మశరీరములతో చేయిస్తారు. అవి అన్ని మనకు మహిమలవలె తోస్తాయి.

**వెంకట్, ఉరవకొండ**

**295. కళ అనగ ఏమిటి? దానికి మూలము ఎక్కడ?**

జ. కళ అనగా ఎన్నో అర్థములు కలవు. కాని మీ ప్రశ్నకు జవాబు కళ అనగా ఒక విద్యలోని నైపుణ్యత అంటారు. దీనికి మూలము హృదయ స్థానము. హృదయ మనగ బ్రహ్మనాడి అగ్రస్థానమని తెలియవలయును.

**296. భగవానుని సాన్నిధ్యములో, భక్తుల హృదయాలలో, గుడి గంటల్లో, నిశ్చల జ్యోతిలో, అమాయకుని హృదిలో, శ్రమ జీవుల నీడల్లో విలసిల్లే హాయి మీ పై ప్రసరించాలని నా ఆకాంక్ష?**

జ. మీరు కాంక్షించడములో తప్పులేదు. కాని నేను ఆ హాయి కోసము భూమి మీదకు రాలేదు. మా జీవితమే ఎవరికి అర్థము కాని భూమిక, (పాత్ర) పైకి హాయిగ కనిపిస్తాములోన హాయి ఉండదు. అట్లే కష్టాల్లో దుఃఖాలలో ఉన్నట్లు కన్పిస్తాము కాని మాకు దుఃఖముండదు.

**కె.వి. సత్యనారాయణ, పెనుకొండ**

**297. జీవునికి ప్రతి క్షణము బ్రహ్మానందములో జీవితాన్ని కొనసాగించా లంటే ఆత్మ సాక్షాత్కారము చేసుకొన్నవారికి మాత్రమే సాధ్యమా? నిత్య కర్మలలో అది అసాధ్యమా?**

జ. ఇట్లు నిత్య కర్మలలో కాని, అట్లు ఆత్మ సాక్షాత్కారములో గాని, ప్రతి క్షణము బ్రహ్మానందము అన్న మాట దుస్సాధ్యము. ఆత్మ సాక్షాత్కారమన్నది

ఆనందము కూడ కాదు మరి బ్రహ్మానందము ఎలా అవుతుంది. నిత్య కర్మలలో కర్మాను సారము ఎపుడైన సంతోషము కలుగవచ్చును. కాని ప్రతి క్షణము కలుగదు.

**కె. హైదర్ బాషా, హంపాపురము**

**298. ఈ భూమి మధుకైటభుడనే రాక్షసుని మెదడు చేత ఏర్పడిందని, అందువలన "మేధిని" అంటారని గ్రంథాలలో వ్రాయబడినది. ఇది నిజమా?**

జ. పురాణములు, శాస్త్రములు, ఇతి హాసములు (చరిత్రలు) అన్నవి ఉన్నాయి. వాటిలో మీరు చెప్పిన విషయము పురాణములలో వ్రాయబడి ఉండును. కావున నమ్మనవసరము లేదు. భూమి ఎవరి మెదడుతో ఏర్పడినది కాదు. భూమి ఒకటే కాక నీరు, అగ్ని, ఆకాశము, గాలి అన్నియు ఒక్కమారుగ ఏర్పడినవి. వీటి సృష్టికర్త పరమాత్మ ఒక్కడే.

**299. సూర్య చంద్రులను పురాణాలలో దేవతలుగ వర్ణించారు. ఈనాడు చరిత్రలు గ్రహాలని తెలుపుచున్నవి. ఇవి గ్రహాలా? దేవతలా?**

జ. దేవతలంతా శక్తి కల్గిన గ్రహాలు. స్థూలముగ గోళాలుగ కూడ ఉన్నాయి. వాటిలో సూక్ష్మముగ జీవుడు కూడ ఉన్నాడు. ఆ జీవుడు సూక్ష్మ శరీరముతో భూగోళము మీదికి కూడ వచ్చి మాట్లాడగలడు. అందువలన పురాణాలలో దేవుడని వ్రాసి ఉండవచ్చును.

**శ్రీ సీతారామ, ఆయిల్ మిల్, ప్రొద్దుటూరు**

**300. చర్మాసనము మీద కాకుండ పీట, సాప మీద కూర్చుంటే యోగ శక్తి నష్టము అవుతుందా?**

జ. యోగశక్తిని భూమ్యాకర్షణ శక్తి నుండి చర్మములు తప్ప పీటలు, సాపలు మరియే ఇతర సాధనములు నివారింప లేవు.

**యం. రంగయ్య, విద్వాన్, హంపాపురము**

**301. ఉపవాసములు దివ్యఔషధమంటారు పెద్దలు ఇది నిజమా? ఎందువలన?**

జ. ఉపవాసములు దివ్య ఔషధమనుట నిజమైన మాటయే. ఉపవాసము ఉండుట వలన శరీరములో గ్రంథులు ఉత్తేజమై వాటి రసాన్ని సక్రమముగ విడుదల చేయగలవు. మానవుని శరీర ఆరోగ్య పరిస్థితి అంతా గ్రంథుల మీద, అవి విడుదల చేయు హార్మోన్ల మీద ఆధారపడి ఉన్న దానివలన గ్రంథులు ఉత్తేజమగు ఉపవాసము దివ్య ఔషధముతో సమానమే. ఉపవాసమని పూరీలు, ఉప్మాలు తినే వారికి వర్తించదు. ఖాళీ కడుపు చేసుకొను వారికి మాత్రము ఉపవాసము ఔషధ సమానము.

**302. దేవునికి నమస్కరించినపుడు మనము టెంకాయలు కొట్టుతాము. ఇది ఆచారమా లేక తరతరాలుగ వస్తున్న సాంప్రదాయమా?**

జ. ఇది ఆచారమే కానీ ఈనాడు అది అర్థము తెలియని సాంప్రదాయమై పోయినది. అర్థము చేసుకొంటే ఎంతో అర్థముతో కూడుకొన్న ఆచరణని తెలియును.

**దండా జయరామ్, ఉరవకొండ**

**303. సూర్య గ్రహణానికి కారణము శాస్త్రరీత్యా తెలిసినప్పటికి, మనవాల్లు రాహువు కేతువు అనే ఇద్దరు రాక్షసులు సూర్యున్ని మ్రింగి వేస్తున్నారనే మూఢ నమ్మకాలను మీరెంత వరకు ఏకీభవిస్తారు?**

జ. నేను మూఢ నమ్మకాలతో ఏకీభవించను. శాస్త్రాన్ని విశ్వసిస్తాను. రాహు కేతువులు రాక్షసులు కారు.

**మచ్చా వెంకటరామయ్య, ఉరవకొండ**

**304. జీవితములో మానవుడు ఖర్చుపెట్టేది సంపాదించేది ఏది?**

జ. మానవుడు బాహ్యముగ ఏ పని చేయకున్నను జీవితములో ఖర్చు పెట్టేది సంపాదించేది ఒకే ఒకటున్నది. అదే కర్మ. మొదటి ప్రారబ్ధకర్మ ఖర్చవుతూనే ఆగామి కర్మ సంపాదించబడుతున్నది.

**డి. శ్రీధర్‌నాయుడు, పుట్టపర్తి**

**305. ప్రతి దానికి సృష్ఠికర్త ఒకడున్నాడని అతనే పరమాత్మని మీరంటున్నారు. ప్రతి దానికి సృష్ఠికర్త ఒకడున్నపుడు మరి పరమాత్మకు సృష్ఠికర్త ఎవరు?**

జ. ప్రతి దానికి సృష్టికర్త పరమాత్మ అయిన మాట నిజమే. ప్రతి దానికి సృష్టి కర్త ఒకడున్నాడను సూత్రము పరమాత్మకు వర్తించదు. ఎందుకనగ పరమాత్మ ఏది కాదు. పరమాత్మ ప్రతి దాని మాదిరి ఒక పదార్థము కాదు. ఏదైన అయితే దానికి సృష్ఠికర్త ఉంటాడు. ఏది కాని దానికి సృష్ఠికర్త ఉండడను సూత్రము తెలియాలి.

**306. పురాణ గాధలన్నిటిలో తప్పులున్నవని అనేక సందర్భాలలో తెల్పిన మీరు "పురాణ రహిత శాస్త్ర సహిత" ఏకైక మాస పత్రికలో ప్రతి దానికి పురాణ సహితమైన గీతను ఉదహరించడము పొరపాటు కాదా?**

జ. పురాణములు ఏవి, శాస్త్రములేవని తెలియక పోవడమువలన మీరలా అడిగారు. పురాణములు 18 మాత్రమే. అందులో గీత లేదు. గీత పురాణము కాదు. గీత యోగశాస్త్రము.

**307. యోగీశ్వరుడు అను పదమునకు నిర్వచణము తెల్పేది?**

జ. యోగ + ఈశ్వరుడు = యోగీశ్వరుడు అవుతుంది. యోగమంటే మీకు అర్థము తెలుసుగ, అలాగే ఈశ్వరుడంటే అధిపతి అని అర్థము. యోగమునకధిపతి అను డిగ్రీయే యోగీశ్వరుడను మాట.

**308. లోకులకు పరమాత్మ గూర్చి తెల్పి, పరమాత్మ ఒకడేనని తెల్పి,**

**అనేక జ్ఞాన బోధలు చేయు మీరు 'సత్యాన్వేషి' సీరియల్ "హింసకు ప్రతి హింస" సిద్ధాంతాన్ని తెల్పడము అంత మంచిది కాదనుకుంటాను. దీనిని గూర్చి మీరేమంటారు?**

జ. హింస చేయనని, హింస పాపమని చెప్పి ఆయుధముల నేల వేసిన అర్జునునికి కృష్ణుడు హింసే చేయమన్నాడని మరువబోకండి. కర్మనుశక్తి ఆడించు ఆట బొమ్మలమే కాని మనము నిజముగ ఏమి చేయమని జరుగు పనులలో హింస అహింస అనుకోవడము అజ్ఞానమే అవుతుందను గీతావాక్యమును విస్మరించరాదు.

**జి. గోవిందు, ఎద్దులపల్లి**

**309. గుప్పెడంత చిన్నది, విశ్వమంత విశాలమైనది, క్షణాలలో చనిపోతు జీవించేది, జీవిస్తు మరణించేది, ఏడిపిస్తు నవ్వేది, నవ్విస్తు ఏడిపించేది, కఠిన మయినది, సున్నితమైనది, అన్ని వైరుద్య లక్షణాలను కలబోసుకున్నది. సృష్టిలో ఒకే ఒకటున్నది. అది ఏది?**

జ. మనలోని మనస్సు.

**టి. ఓబుల నారాయణ రెడ్డి, చిన్నపాలమడ**

**310. శ్రీమద్భగవద్గీతలో దేవుని గురించి రూపరహిత, నామ రహిత, సర్వాంతర్యామిగ ఉన్నాడని తెల్పుచుండగ హిందూ తత్వం అనేక రూపాలుగ అనేక పేర్లతో దేవున్ని పిలుచుచున్నారు ఎందుకు?**

జ. నామ రూప రహిత దేవున్ని అందుకోడానికే ఉపాయముగ నామ రూప సహిత దేవుళ్ళను కల్పించి, వాటి వెనుకల ఎన్నో అర్థములతో కూడుకొన్న ఆచరణలను నింపి పెట్టారు పూర్వపు మన పెద్దలు. కాని నేడు అర్థమును మరచిపోయిన మన మద్య అర్థరహితములైన ఆచరణలు మిగిలి ఉన్నాయి. అందువలన రూప నామములనే దేవుళ్ళుగ మనము నమ్ముచున్నాము. అది చాలా

పొరపాటు. రూప నామముల వెనకల అర్థాన్ని చూస్తే, ఏది కాని దేవుడే తెలుస్తాడను ఉద్దేశముతో పెద్దలు ఎన్నో విధానములను రూప నామములకు ముడి పెట్టి ఉంచారు. కాని ఆనాటి ఇందూ తత్త్వ రహస్యము తెలియని ఈనాటి పెద్దలందరు పొరపడి దేవునికి రూప నామములున్నాయనుకొన్నారు.

**311. జీవులకు తమ తమ పూర్వ జన్మ జ్ఞాపకముండదు ఎందుకు?**

జ. జ్ఞాపకశక్తికి మారు పేరైన మనస్సు ఆయా జన్మలతోనే అంతమై పోవుచున్నది. విషయములను జ్ఞాపకము తెచ్చు మొదటి మనస్సు రెండవ జన్మలో లేదు, కావున ముందు జ్ఞాపకాలు రెండవ జన్మలో ఉండవు.

**యల్లపు శ్రీరాములు, ధర్మవరము**

**312. సత్యానికి అసత్యానికి మధ్య ఎంత దూరముంది?**

జ. బెత్తడు (3 ఇంచులు) దూరము మాత్రమే ఉన్నది. ఎలాగంటే కంటితో చూచేది ప్రత్యక్ష సత్యము. చెవుతో వినేది అసత్యము కూడ కావచ్చును. కావున కంటికి చెవికి గల మధ్య దూరమే సత్యానికి అసత్యానికి ఉన్న దూరమని తెలియవలయును.

**దండాజయరామ్, ఉరవకొండ**

**313. "బ్రహ్మ సత్యము జగన్మిత్య" అనే వేదాంత సూక్తి ఆధ్యాత్మిక చింతనకు సంబంధించినంత వరకు ఇది బాగానే ఉంది. ఈ సూక్తిని వాస్తవ జగత్తుకు వర్తింపజేస్తే?**

జ. జగత్తున్నంత వరకు జగత్తు సత్యమే కావున జగన్మిత్య అనుమాట తప్పుగ జగత్తులోని వారికి తోస్తుంది. అట్లే బ్రహ్మ (దైవము) అనునదియెదో జగత్తుకు ఏ మాత్రము తెలియదు కావున బ్రహ్మ సత్యము అనుమాట కూడ జగత్తునకు పొరపాటుగనే తోస్తుంది. ప్రపంచమంత ప్రళయము పొందినపుడు జగత్ అనిత్యము బ్రహ్మ సత్యమగును. కావున పై సూక్తి ప్రళయమైనపుడు వర్తించుతుంది కాని ఇపుడు ప్రత్యక్షముగ ఉన్న జగత్తుకు వర్తించదు.

**నారాయణ, నరసాపురము**

**314. మోక్షము అంటే ఏమిటి?**

జ. జీవుడు జన్మలు లేకుండ అనంత ప్రపంచమంతట వ్యాపించి పోవడము.

**315. కారణ జన్మడంటే ఏమిటి?**

జ. ఉద్దేశ్యపూర్వకముగ పుట్టిన వానిని కారణ జన్మడంటారు. కారణ జన్మడనగా ఒక కారణమును పెట్టుకొని పుట్టడమని అర్థము. అలా పుట్టువాడు పరమాత్మ ఒకడు మాత్రమేనని తెలియాలి. ఆయన పుట్టుటకు కారణము ధర్మములు తెలియజేయాలను ఉద్దేశ్యమే.

**యం. జయపాల్, హంపాపురము**

**316. ప్రతి దినము ఉదయమున కొందరు సూర్యునికి నమస్కారములు చేస్తారు. ఇది ఆచారమా? లేక సాంప్రదాయమా? తెలిపేది.**

జ. ఉదయమున సూర్యోదయము మొదలు దాదాపు ఒక గంట వరకు సూర్యుని నుండి వచ్చు కిరణములు మానవుని శరీరమునకు మేలు చేయునవై ఉన్నవి. అందువలన ఆ సమయములో నడుముకు మాత్రము గుడ్డ చుట్టుకొని మిగతా శరీరమంతా సూర్యరశ్మి తగిలేటట్లు ఉంచుకొని సూర్యునికి ఎదురుగ నిలుచుకొంటే మంచిది. మాకు గంట సమయము లేదు ఓపిక లేదు మా ఆరోగ్యము బాగుంది కదా అని అంటారని భక్తిగ నమస్కరించడమంటే క్రమము తప్పక చేస్తారను భావముతో పెద్దలు సూర్యనమస్కారమను తంతు పెట్టారు. శరీరము శుభ్రముగ ఉంటే సూర్యరశ్మి ద్వార ఎక్కువ లాభము పొందవచ్చును. అందువలన స్నానము చేసి సూర్య నమస్కారములు చేయడము మంచిది.

**యం. రంగయ్య విద్వాన్, హంపాపురము**

**317. ఉదయము నిద్ర లేచేటప్పుడు కుడి ప్రక్కన లేవాలంటారు పెద్దలు. ఎడమ ప్రక్కన లేస్తే ఏమైన నష్టమా? తెలిపేది.**

జ. పూర్వము పెద్దలు అన్ని విషయములలోని అంతరార్థము తెలిసి మానవునికి ఉపయోగార్థము ఈ పనులు తెల్పారు. కావున ఆనాడు అవి ఆచారములై ఉండేవి. కాని నేడు అర్థము తెలియక మనము చేయుచున్నాము కావున ఇపుడు అన్ని సాంప్రదాయములై పోయాయి. మన శరీరములో ఎడమ ప్రక్క నరములకు ఒత్తిడి లేక బరువు కలిగిస్తే మనస్సు కుడి ప్రక్క సూర్య నాడి మీదికి పోతుంది. అలాగే కుడి ప్రక్క ఒత్తిడి కలిగిస్తే ఎడమ ప్రక్కన గల చంద్రనాడిలోనికి పోతుంది. ఉదయము లేచినపుడు మనస్సు చంద్రనాడి మీద ఉంటే ఆ దినము ఎక్కువ ప్రపంచ విషయములు దుర్మార్గ విషయములు మనస్సుకు రావని, అట్లే సూర్యనాడి మీద ఉంటే ఎక్కువ ప్రపంచ విషయములు జ్ఞప్తికి వస్తూ ఉంటాయని పూర్వపు పెద్దలకు తెలుసును. జ్యోతిష్య శాస్త్రము ప్రకారము చంద్రుడు జ్ఞాన చిహ్నము, సూర్యుడు అహంకార చిహ్నము. అలాగే చంద్రుడు యుక్తికి మూల కారకుడైన మంత్రి పదవికి కారకుడైతే, సూర్యుడు ఒకరి యుక్తి మీద ఆధారపడు ప్రభు (రాజు) పదవికి కారకుడు. అందువలన సూర్య చంద్రులు అధిపతులైన రెండు అతి పెద్ద నాడుల మీదనే అన్నిటిని యోచించు జ్ఞప్తియైన మనస్సు నివసిస్తున్నది. కావున ఉదయము లేచేటపుడే చంద్రనాడి మీద మనస్సు ఉండుట వలన మనస్సుకు మంచి ఉపాయములు గల యోచనలు, దైవిక జ్ఞాన సంబంధ యోచనలు కల్గుతాయని, సూర్యనాడి మీద మనస్సుండుట వలన ఆ దినమంత తెలివి తక్కువ యోచనలు, అజ్ఞాన యోచనలు కల్గుతాయని తెలిసి, లేచేటప్పుడు కుడి ప్రక్క శరీర బరువునంతటిని మోపి లేచుట వలన కుడి ప్రక్క నరములకు వత్తిడి కల్గుట వలన ఎడమ ప్రక్క గల చంద్రనాడి మీద మనస్సుండునని కుడి ప్రక్కన లేవాలనెడివారు. పూర్వము అర్థము తెలుసును కావున అందరు కుడి ప్రక్కనే లేచెడివారు. అలాగే పడుకొనేటపుడు దక్షణ దిశకే తల పెట్టుకొని పడుకొనేవారు.

**318. ఇంటి దగ్గర వేప చెట్టు ఉంటే మంచిదంటారు ఎందుకు? కంప చెట్టు ఉంటే నష్టమా?**

జ. వేప చెట్టు ఉంటే నీడ, కంప చెట్టు ఉంటే ముల్లు రాలి గ్రుచ్చుకోవడము

ఉంటుంది. ఏది మంచిదైనది బాహ్యముగ అందరికి తెలుసు కదా! ఇది కాక ఇంటి దగ్గర వేప చెట్టు ఉండుట వలన వేపాకు మీద నుండి వచ్చు గాలి వలన అనేక రక చర్మవ్యాధి క్రిములు నశించును. విషవాయువులు నిర్వీర్యమై పోవును. అందువలన తెలిసిన వారందరు వేప చెట్టును పెంచుకొనెడి వారు. పూర్వము ఇంటి వాకిలికి ఇరువైపుల పంచ గూళ్ళు పెట్టి ఆ గూళ్ళులో కల్లు ముంతలు వేపాకు పెట్టెడి వారు. కాని ఇపుడు కట్టే ఇల్లకు పంచ గూళ్ళే లేకుండ పోతున్నాయి. పంచ గూళ్ళు ఉన్న ఇల్లకు కల్లు ముంతలు లేవు, వేపాకులేదు. కల్లు వేపాకు ఉంచుట వలన వాకిలి వద్దనే రోగ క్రిముల నాశనము జరిగి ఇంటిలోనికి ఏ రోగములు ప్రాకెడివి కావు. అమ్మ వారు అను పేరుతో చిన్న పిల్లలకు వచ్చు చర్మవ్యాధులకు వేపాకు గాలి మంచి ఔషధముగ పని చేయును. కావున పూర్వము అమ్మవారు సోకిన పిల్లలకు వేపాకుతో విసరడము, వారి చుట్టు వేపాకును పెట్టడము జరిగెడిది. ఇపుడు కూడ అక్కడక్కడ ఈ ప్రక్రియ ఇంకనూ ఉన్నది. వైద్యము ప్రకారము కుష్టు రోగులు కూడ 5 సంవత్సరములు వేప చెట్టు క్రిందనే నివాసము చేస్తూ, ఆ చెట్టు క్రింద ఉండిన నీరునే త్రాగుతూ, ఆ చెట్టు క్రింద 12 గంటలు పెట్టిన నీరుతోనే స్నానము చేస్తూ ఉంటే వారి కుష్ఠు రోగము కూడ నయమవునని తెలియవలెను. అంతయేకాక ఈ చెట్టు గాలి భూత ప్రేతములకు ఇబ్బంది కలుగ జేయును. అందువలననే మాంత్రికులు వేపాకుతో విసరుతూ మంత్రించుతూ ఉంటారు. అందులో వారికి తెలిసిన తెలియకున్న మంత్ర బలముకంటే వేపాకు బలమే ఎక్కువగా ఉన్నది. ఇట్లు అనేక ఉపయోగములు గల వేప చెట్టును పెంచుకొంటే కంప చెట్టుకంటే మంచిది.

**చింతా రామదాసు, చిన్నపాలమడ**

**319. ప్రపంచములో ఎందరో మహనీయులు తపస్సు, యోగము, ప్రార్థన భజన అని వీటిని ఆచరిస్తూ ఉంటారు. ఇవి అన్ని ఎవరి కోసము దేని నిమిత్తము ఎందుకు చేస్తున్నారు?**

జ. ఇవన్నియు కొందరు తమ కోర్కెలు నెరవేరునను ఉద్దేశముతో చేస్తున్నారు. కొందరేమో దైవము కొరకు దైవ నిమిత్తము చేయుచున్నారు. కాని యోగము వలన తప్ప మరియే ఇతర క్రియల వలన దైవము తెలియదని గీతయందు విశ్వరూప సందర్శన యోగమందు దేవుడే తెల్పాడు.

**వెలుగుబాల లక్ష్మినారాయణ, గొల్లపల్లి**

**320. ప్రేమంటే ఏమిటి? దాని స్వభావము ఏమిటి?**

జ. ప్రేమంటే మన శరీరములోని ఒక గుణము. అసూయ అను గుణమునకు వ్యతిరిక్తముగ ఉండునట్లు చేయుట దాని స్వభావము. అనగ అసూయ గుణము యొక్క స్వభావమునకు ప్రేమ గుణ స్వభావము వ్యతిరిక్తము. మనుషుల మీద గాని, జంతువుల మీద గాని, వస్తువుల మీద గాని ప్రీతిని పెంచుకోవడమునే ప్రేమ అంటారు. ప్రీతిని పెంచడమే దాని స్వభావమని తెలియాలి.

**321. ప్రేమ దైవస్వరూపమా లేక కామస్వరూపమా?**

జ. గడిచిన కాలములో ప్రచురించిన పత్రికలలో ప్రేమ కామ (ఆశ) అను గుణము వేరు వేరని తెలిపాము. ప్రేమ ఆశ అనునవి రెండు రెండు గుణములే. రెండు వదలితేనే దైవ స్వరూపము తెలియును. కాని ఏ ఒక్క గుణము దైవ స్వరూపము కాదు.

**రామభజన సంఘము, యాడికి**

**322. ధరణిలోన కర్మను కాల్చేది జ్ఞానశక్తి అన్నారు కదా! జ్ఞానశక్తి నార్జించిన పురుషునకు పునర్జన్మ లేదన్నారు. మరణము వారికి ఉండదంటారే. పునర్జన్మలేదంటే వారికి మరణములేనట్లెనా? అది సాధ్యమా?**

జ. జ్ఞానశక్తి ఆర్జించిన వారికి వారి కర్మ అయిపోయిన తర్వాత ఇక పుట్టవలసిన పనిలేదు కావున వానికి పునర్జన్మ లేదనుట నిజమే. అటువంటి

వానికి చచ్చిన తర్వాత జన్మ లేదు, కాని పుట్టిన తర్వాత చావు లేదనుట శుద్ధ అసత్యము. కర్మ అయిపోతే చనిపోతాడు. చనిపోయిన తర్వాత జన్మకు రాడు.

**పి. అంకాల్ రెడ్డి, గుత్తి**

**323. స్వామీ! భారతములో ఉండే పాంచాలిని పతివ్రత అనవచ్చా?**

జ. అనకూడదు. ఎందుకనగా పతినే వ్రతముగ ఆచరించునది పతివ్రత. భరించువాడు భర్త కావున సర్వ జీవరాసులను భరించు పరమాత్మయే జగత్ భర్త జగత్ పతి. జీవుడను వానిని కాక కేవలము శరీరమును భరించువాడు భర్తకాడు. అందువలన జీవులందరికీ పతియైన పరమాత్మనే ఆరాధించు ఆడవారిని కాని మరియు మగవారిని కాని పతివ్రత అనవచ్చును. ఇక్కడ మగవారిని కూడ కలుపుటకు ఒక కారణమున్నది తర్వాత తెలుపుతాము.

ప్రత్యేకించి మగ వారిని బ్రహ్మచారి అంటారు. పరమాత్మ యొక్క అనగా బ్రహ్మ యొక్క ఆచరణ ఆచరించు వానిని బ్రహ్మచారి అని పూర్వమనెడి వారు. ఇపుడేమో పెళ్లి చేసుకోక భార్య లేని వానిని బ్రహ్మచారి అని, పెళ్లి చేసుకొని భర్త కలిగిన వారిని పతివ్రత అని అంటున్నారు. అది కాదయ్య ఇది సత్యమంటే నమ్మే వారు లేరు. కావున మనము అందరి మాట ప్రకారమే పోతే పాంచాలి పతివ్రతయే. లేదు ఇది సత్యమని మనము సత్యమునే పట్టుకొంటే ఆమె పతివ్రత కాదు కదా!

**వై. పార్వతీశం, తాడిపత్రి**

**324. గీత 18 అధ్యాయములు, భారత యుద్ధము 18 దినములు, సైన్యము 18 అక్షౌహిణులు, భారతము 18 పర్వములు, అలాగే భాగవతము 18 స్కందములు, పురాణములు 18 గా ఉన్నాయి. ఇలా ఒకే సంఖ్య 18 ఎందుకున్నది?**

జ. అంతియే కాక అయ్యప్ప స్వామి దేవాలయ మెట్లు కూడ 18 గా ఉన్నాయి.

అర్థము తెలిస్తే ఆచారము, తెలియకపోతే సాంప్రదాయము. పూర్వపు ఆచారము ప్రకారము వాటి అర్థము ఇలా ఉన్నది. ప్రతి జీవరాసి సాత్త్విక, రాజస, తామసములనెడు మూడు గుణ భాగములందే చరించుచున్నవి. ఆ మూడు గుణ భాగములలో ఒక్క దానియందు పేరుగాంచిన శత్రు గుణములు కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యమను ఆరు గుణములున్నవి. ఇట్లు ఈ గుణములు మూడు గుణ భాగములందుండుట వలన మొత్తము జీవరాసులు మూడు స్థానములలో గల మొత్తము 18 గుణములందే నివసిస్తున్నారని తెలియుచున్నది. ఆ గుణముల వలననే జరిగెడి పనుల వలన పాపమును సంపాదిస్తున్నారని, మొత్తము ప్రపంచ పాపపు పనులన్నియు ఉన్నవని, ఆ పదునెనిమిది సంఖ్యను మరువక ఉండునట్లు, ఈ పదునెనిమిది వలననే పాపము జరుగుచున్నదని తెలియునట్లు, ఆ 18 సంఖ్యను ఉంచారు. భక్తిమార్గములో మూడు గుణభాగములలోని 18 గుణములను తొక్కి వేయాలని అయ్యప్ప దేవాలయములో కాలి క్రింద మెట్లగనుంచారు. అలాగే ఈ దుర్గుణముల మీద ఎల్లపుడు జ్ఞప్తికల్గి వాటి ఆచరణకు పోకుండునట్లు ముఖ్యమైన చోటంత 18 సంఖ్యను ఇరికించారు. గీతలో, భారతములో, భాగవతములో, పురాణములలో 18 సంఖ్యనుంచడము వలన తెలియని వారు దీని విశేషమేమని ఆలోచించగలరు. ఆలోచించుటవలన ప్రశ్న వచ్చి చివరకు ఎక్కడైన వాస్తవము తెలియగలరు. 18 చెడు గుణములని, మరియు శత్రు గుణములని తెలిసిన రోజు వాటి పట్ల జాగ్రత్త కల్గి ఉంటాము. అందువలన పెద్దలు 18 సంఖ్యను అనేక చోట్ల తెలియునట్లు చేశారు.

**నాగభూషణ చౌదరి, తగ్గుపర్తి**

**325.** మనస్సు జడమా? లేక చేతనమా?

జ. శరీరములోని ప్రతి భాగము ఆత్మ చైతన్యము చేత చేతనమయ్యాయి కాని వాటికి స్వయం శక్తి లేదు. అందువలన మనస్సు చేతనమే, నిద్రలో యోగములో కదలక ఉంటుంది. జ్ఞప్తిలో కదలుచునే ఉంటుంది.

**326. హస్త మస్తక సంయోగమంటే ఏమిటి?**

జ. గురువు తన హస్తము చేత జ్ఞానాగ్నిని శిష్యుని తలలోనికి ప్రవేశింప జేయుటను హస్తమస్తక సంయోగమంటారు.

**327. నాకు తెలిసినంత వరకు ఆకాశ మొక్కటే ఉన్నది. కాని కొన్ని పుస్తకాలలో చిదాకాశము, చిత్తాకాశము అనే పేర్లు కూడ చదివాము. అవి ఉన్నవా?**

జ. మీకు తెలిసినంత వరకేకాక సర్వ ప్రపంచమునకు తెలిసేటట్లు ఒకే ఆకాశమున్నది. యోగపద్ధతిలో కూడ మాకు తెలిసినంత వరకు ఇతర ఆకాశములు ఏవి లేవు.

**328. మనము ఎక్కడికైన ప్రయాణమై పోవునపుడు గాని, పరీక్షకు పోవునపుడు గాని, శ్వాసను కుడి ముక్కురంధ్రములో ఆడునట్లు చేసి బయలు దేరితే పనులు నెరవేరునని పరీక్షలలో ఉత్తీర్ణులగుదురని ఒక గ్రంథములో వ్రాసినారు. ఇది నిజమా?**

జ. అలాగే ఆచరించి చూచినపుడు పుస్తకములో వ్రాసినట్లు నిరూపణకు రాలేదు కావున ఆచరించినా అనుభవానికి రానివి శాస్త్రములు కావు. అవి మానవుని తృప్తి కోసము చెప్పినవే కాని నిజము కావు.

**329. మీ రచనలైన 'ప్రబోధ' గ్రంథములో ఆది మంగళ గురువారములలో కుడి ముక్కున, బుధ శుక్ర శని వారములందు ఎడమ ముక్కున, శుక్ల పక్ష సోమ వారము కుడి ముక్కున, కృష్ణ పక్ష సోమవారము ఎడమ ముక్కున శ్వాస ఆడవలయునని వ్రాసారు. కాని మరియొక గ్రంథమందు ఆది మంగళ శని వారములలో కుడి ముక్కున సోమ శుక్ర బుధ వారములలో ఎడమ ముక్కున కృష్ణ పక్ష గురువారము కుడి ముక్కున శుక్ల పక్ష గురువారము ఎడమ ముక్కున అని వ్రాయబడినది. మీరు వ్రాసిన దానికి దీనికి భేదమున్నది.**

**వీటికి శాస్త్ర ప్రమాణములు లేవా? ఉంటే ఎవరు చెప్పిన ఒకటే ఉండాలి కదా?**

జ. శాస్త్ర ప్రమాణము కాని విషయములు మేము చెప్పమని చాలాసార్లు ప్రకటించాము. జ్యోతిష్య శాస్త్రరీత్యా ఒకటవ స్థానములోనున్న గ్రహకు ఏడవ స్థానములోనున్న గ్రహ బద్ధ శత్రువను మాట గలదు. అందువలన ఆ శాస్త్ర ప్రమాణమును బట్టి మేష రాసికధిపతియైన కుజునకు ఎదురుగ ఏడవ స్థానమైన తులారాశిలోని శుక్రుడు బద్ధ శత్రువు. ఈ సూత్రము ప్రకారము 1. కుజునకు శుక్రుడు, 2. గురువునకు బుధుడు, 3. సూర్య చంద్రులకు శని శత్రువులగుతున్నారు. అదే జ్యోతిష్య శాస్త్రమును బట్టి 1,5,9 స్థానాదిపతులంతయు ఒక గ్రూపు గ్రహాలైతే వారికి వ్యతిరిక్తులు మరియొక గ్రూపు గ్రహాలగుచున్నవి. అందువలన జ్యోతిష్య శాస్త్ర ప్రమాణము చేత గురు, కుజ, సూర్య, చంద్రులు ఒక గుంపని, శని, బుధ, శుక్రులు మరియొక గుంపని తెలిసి యోగ శాస్త్రానురీత్యా శరీరముతో యోగ మాచరించు వారు వారి గ్రహస్థానములను బట్టి ఆయా దినములలో ఆయా ప్రక్కలే శ్వాస ఆడవలయునని తెలిపాము. కావున మాది శాస్త్ర ప్రమాణము. తెలియని వారు వేరు విధముగ చెప్పిన దానికి ప్రమాణముండదని గ్రహించవలెను.

**యం. వెంకటేసు, చిన్నపాలమడ**

**330. కర్మ వలన జన్మ ఉంటుందంటారు. ఒక రోగము వస్తే అది గత జన్మ కర్మ వలన వచ్చినదా లేక ఈ జన్మ కర్మ వలన వచ్చినదా?**

జ. రోగాలు వస్తే ఈ జన్మలో చేసుకొన్న కర్మేనని కొందరంటారు. కాని అది వాస్తవము కాదు. ఎందుకనగ పుట్టినపుడు కొన్ని దినములకే రోగము వచ్చిందను కొందాము. అపుడు అతను పుట్టిన తర్వాత ఏ పాపము చేయలేదు కదా! అందువలన ఒకనికి రోగము కాని, భోగము కాని ఏది సంభవించిన అది గత జన్మల కర్మ వలననే సంభవించునని తెలియాలి.

**331. వర్ష మొచ్చునపుడు పిడుగు పడుతుందని అంటారు. ఆ పిడుగు అర్జునుని రథచక్రమునకున్న సీలయని, అది ఊడి క్రిందపడితే పిడుగు పడిందని అంటారు నిజమేనా తెల్పాలి.**

జ. వర్ష మొచ్చునపుడు పిడుగు పడుట నిజమే కాని అది అర్జునుని రథ చక్ర సీల కాదు. అది అర్జునుని రథ చక్ర సీల అయితే ఆ సీలే పిడుగుయైతే ఒకవేళ చక్రము పడితే మహా ప్రళయమే కావలసి ఉంటుంది. సీలపడిన తర్వాత చక్రము కూడ క్రిందపడాలి కదా! అలా అది సీల కాదు. అక్కడ రథము లేదు. వాస్తవమేమంటే వర్షమొచ్చునపుడు ఆకాశములో కరెంటు తయారగును. ఎండాకాలము తర్వాత మొదట వచ్చు వర్షములలో ఎక్కువ పిడుగులుపడు అవకాశము గలదు. ఎందుకనగ భూమంతయు వేడెక్కి భూమికి కొంత ఎత్తులో వాతావరణమందు విద్యుత్ అయస్కాంత శక్తి ఏర్పడి అది పాజిటివ్ శక్తిగ ఉండును. భూమి నెగిటివ్ చార్జి గల్గి ఉండును. వర్షమొచ్చునపుడు తడి గాలికి పైన ఉన్న పాజిటివ్ శక్తి భూమిలో ఉన్న నెగిటివ్‌తో కలియుట జరుగుచుండును. ఇంటిలో 200 ఓల్టేజి కరెంటును పాజిటివ్ నెగిటివ్‌ను కలిపితే పట్ మని శబ్దముతో అగ్గి రవ్వలేర్పడును. బయలులో ప్రకృతిలో తయారైన కొన్ని లక్షల ఓల్టేజి కరెంటు పాజిటివ్ వచ్చి నెగిటివ్ అయిన భూమిని తాకితే ఎంతో పెద్ద శబ్దము పెద్ద అగ్ని మెరుపు ఏర్పడును. దానినే పిడుగు పడడము అంటాము. అది ఎక్కువ శక్తి గల కరెంటుగాన ఆ తీగ మెరుపు భూమికి దగ్గరికి వస్తే అది మన కరెంటు తీగలకు తగిలితే ఫీజులన్ని ఎగిరిపోవును. ఒకవేళ ఏదైన చెట్లకు తగిలితే అంత బలమైన కరెంటుకు చెట్టు రెండు భాగములుగ చీలి పోవును. బావికి దగ్గరగ మెరిస్తే ఆ బావిలో నీరంత ఇంకిపోయి ఎండిపోవును. మనుజులకు దగ్గరగ మెరిసిన లేక తగిలిన వెంటనే చనిపోవుదురు. అందువలన వర్షము వచ్చునపుడు బయలు ప్రాంతములో ఉండకూడదు. పిడుగు ఇనుప కడ్డీ కాదు ఆకాశ కరెంటని తెలియాలి. హిందీలో 'ఆస్మాని బిజిలి' అంటారు.

**టి. అనుమంతు, యమ్. అగ్రహారము**

**332. నాకు చాలా దినముల నుండి దేవుడెట్టుంటాడో చూడాలనిపించింది. దేవుడు ఎట్లుంటాడు, మేము ఎట్లు చూడగలుగుతాము.**

జ. మనకు చూడాలని కోర్కె ఉండడములో తప్పులేదు కాని దేవుడిట్లున్నాడని చెప్పుటకు అతనికి ఆకారము లేదు. అతను కంటికి కనిపించు వాడు కాదు చూచేదానికి. రూపములేని దేవున్ని చూడాలంటే మనకు జ్ఞాననేత్రముండాలి. అంటే బాగా జ్ఞానము తెలియాలి. అపుడు మనయందే గల దేవున్ని సులభముగ తెలియవచ్చును. అతను మనకు చాలా దగ్గరగ మనయందే ఉన్నాడు. కావున జ్ఞానము తెలిస్తే సులభముగ చూడవచ్చును.

**ప్రహ్లాదరావు, గంగావతి**

**333. 'అహము' అంటే ఏమిటి? దానిని త్యజించాలంటే ఏమి చేయాలి?**

జ. మన శరీరమందు గల 25 భాగములలో అహమనునది ఒక భాగము అది శరీర లోపలి భాగములైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము జీవుడు అను అంతఃకరణములందు ఒకటై ఉన్నది. శరీరమందు జరుగు పనులన్నిటిని నీ వలన జరుగునవేనని జీవునికి బోధించడమే దాని పని. దాని వలననే జీవునికి నేను అను భావము ప్రతి పనిలోను పుట్టుచున్నది. దానిని త్యజించాలంటే ముందు దానిని గూర్చి, శరీరములో దాని పాత్రను గూర్చి, అది శరీరమున ఎక్కడున్నది అను విషయము గూర్చి తెలియాలి. అలా తెలిసిన తర్వాత దానిని సులభముగ త్యజించవచ్చును. దానిని త్యజించడమే కర్మ యోగమంటారు.

**334. యోగమనగా నేమి? యోగమనుసరించుటకు క్రమ నియమములు ఏవైన ఉన్నవా?**

జ. బ్రహ్మవిద్యయందు యోగమనగ కలయిక అని అర్థము. జీవాత్మ ఆత్మల కలయికనే యోగమనుచున్నాము. ఈ యోగములు రెండు విధములు 1. కర్మ

యోగము, 2. బ్రహ్మయోగము. వీటికి ఏ నియమములు లేవు గాని క్రియలు మాత్రమున్నవి. అవి ఏమనగా! కర్మ యోగమును సాధించాలంటే మనలోని అహమును అణచివేయాలి. బ్రహ్మయోగమును సాధించాలంటే మనలోని మనస్సును అణచివేయాలి. అహమును అణచి వేయుటవలన కర్మ యోగమును, మనస్సును అణచివేయుట వలన బ్రహ్మయోగమును పొందవచ్చును. కర్మ యోగమును పొందాలంటే మనలోని అహమును గురించి బాగ తెలిసి ఉండాలి. అట్లే బ్రహ్మయోగమును పొందాలంటే మనలోని మనస్సును గురించి బాగా తెలిసి ఉండాలి. మానవుడు ముక్తుడగుటకు ఈ రెండుమార్గములు కలవు.

**డి. చెన్నప్ప, న్యామద్దల**

**335. మానవుడు శిశువుగా పుట్టుతానే ఏడ్చుతాడు. మరి ఇతర జంతువులు ఏవి పుట్టినపుడు ఏడ్చవు. ఆవుకు దూడ పుట్టినపుడు అరవదు మిగత జీవరాసులు అంతే కాని కేవలము మానవ శిశువు మాత్రమే ఏడ్చును ఎందుకు?**

జ. సమస్త జీవరాసులకంటే దుఃఖము మానవ జన్మయందే ఎక్కువ ఉన్నదని సూచనగ ఆ ఏడ్పు ఉన్నది. దుఃఖములకు కారణమైన పాప కర్మ సంపాదించడము మానవ జన్మయందే అధికమని తెలియ జేయుటకు మరియు అన్ని జన్మలకంటే మానవ జన్మయందే దుఃఖమధికమని తెలియ జేయుటకు మానవ శిశువు పుట్టినపుడే ఏడ్పు ప్రారంభమగునట్లు సృష్టిలో నిర్ణయింపబడినది. ఈ విధముగ మానవ జన్మలో ఎన్నో జ్ఞాన సూచనలు చేయు మాటలు కూడ మానవునికి తెలియకనే వచ్చుట గమనార్హము. అయ్యో పాపమని, నా కర్మ అని ఇంకా ఎన్నో మాటలు తెలియకనే పలుకుచుండును. అట్లే చిన్న తనమున ఏడ్పు కూడ తెలియకనే వచ్చును.

**336. ఆధ్యాత్మికమనగా నేమి? అట్లే వేదాంతమనగా నేమి?**

జ. ఆధ్యాత్మికమనగా నేమి అని గీతలో అర్జునుడు అడిగాడు. అక్కడ శ్రీకృష్ణుడు **"స్వ భావో ధ్యాత్మ ముచ్యతే"** అన్నాడు దీని అర్థమేమనగా స్వంత

భావమునే ఆధ్యాత్మికమని అన్నాడు. స్వంత భావమనగ ఇంతకు ముందే చెప్పాము. స్వభావమంటే తాను ఎవరైనది తెలిసి ఉండడమే స్వభావము కల్గియుండడమని అర్థము. దీనినే స్వ ధర్మమని కూడ తెలియబరచబడినది. స్వభావము, స్వధర్మము, స్వ అర్థముయను పదములన్నిటియందు "స్వ" అను అక్షరము గుర్తింపదగినది. స్వంతమను నీ ఆత్మను, లేక స్వభావమను నీ భావమైన ఆత్మను, లేక స్వ ధర్మమైన నీ ఆత్మను, లేక స్వ అర్థము అను నీధనమైన ఆత్మను తెలియడమును ఆధ్యాత్మికము అంటున్నాము. ఆత్మను ఆధ్యాయనము చేయడమును ఆధ్యాత్మికము అంటాము.

అట్లే వేదాంతమనగ వేదముల అంత్యమందు గలదని అర్థము. అనగ వేదముల తర్వాత గలది అని భావము. **"త్రై గుణ్య విషయా వేదా"** అను గీతా వాక్యము ప్రకారము మూడు గుణముల విషయములే వేదములని తెలియుచున్నది. ఆ మూడు గుణముల తర్వాత ఉన్న ఆత్మనే వేదాంతమనుచున్నాము. మూడు గుణముల విషయములు వదలిన తర్వాత ఉన్న అనుభవమునే ఆత్మ అనుభవమన వచ్చును. దానినే వేదాంతమంటున్నాము.

**బి. శకుంతలమ్మ, యాడికి**

**337. మీరు "సత్యాన్వేషి కథ"లో ఖగోళములో గోళములోని సూక్ష్మ శరీరములు భూమి మీద మానవులను సామూహికముగ హింసించునన్నారు. కలరా, మశూచిలాగ కాక వేరు విధముగ హింసించిన సంఘటనలెక్కడైనా ప్రామాణికముగ ఉన్నాయా?**

జ. ఎందుకు లేవు, చాలా ఉన్నాయి. యాడికియందు దాదాపు పది సంవత్సరముల క్రితము పెద్ద గాలి లేచింది. సంతలో ఉన్న జనమంత ఉక్కిరి బిక్కిరై కొందరు అక్కడే గల ఒక షెడ్‌లోనికి పోయినారు. అపుడు ఆ షెడ్ విచిత్రముగ ఒక్కమారు కుప్ప కూలిపోయి కొందరు చనిపోయినారు. అక్కడే ఉన్న వేపచెట్టుపడి దాని క్రింద కొందరు చనిపోయారు. అపుడక్కడ ఉన్న కొందరికి మాత్రము ఆకాశము నుండి ఒక పెద్ద వికృతాకారము కాలుతో ఆ షెడ్‌ను త్రొక్కినట్లు

కనిపించింది. వారు ఆ విషయమును గూర్చి ఇలా ఏదో పెద్ద ఆకారము షెడ్‌పై కాలు పెట్టి త్రొక్కడము చూచామని కూడ చెప్పారు. అయినప్పటికీ వారి మాటలు ఎవరు పట్టించుకోలేదు. ఈ విషయమును యోచిస్తే గోళముల గ్రహాలే హింసించినవనుటకు తార్కాణము. అంతేకాక మోటారుబండ్ల ప్రమాదానికి ఎక్కువ సూక్ష్మశరీరములే కారణము అవుతుంటాయి. ప్రత్యేకించి పెళ్లి బృందాల మీద వాటి ప్రభావము ఎక్కువగ ఉంటుంది. కావున ఎక్కువ పెళ్లి బృందాలు ప్రమాదానికి గురి అవుతుంటాయి.

**మెట్టం తిమ్మప్ప, దురదకుంట**

**338. ఒకచోట కృష్ణుని భగవంతుడన్నావు. వేరొక చోట ఏసు భగవంతుడన్నావు. భగవంతుడనగా అర్థమేమి? భగవంతుడను పదము పరమాత్మకా లేక అందరికీ వర్తిస్తుందా?**

జ. భగవంతుడనగా భగము నుండి పుట్టినవాడు. అనగ స్త్రీ యోని మార్గమున పుట్టినవాడని అర్థము. ఈ అర్థము ప్రకారమైతే మనమంతా భగము నుండి పుట్టిన వారమే కదా! అయితే మనమంతా భగవంతులమేనా అని అడుగవచ్చును. ఆ సూత్రప్రకారమైతే మనము భగమునుండి పుట్టి ఉంటే భగవంతులమేకాని మనము భగము నుండి పుట్టలేదు కదా! అందువలన భగవంతులముకాము. ఈ మాటవింటే ఆశ్చర్యమై ఇదేమిమాట మనము భగము నుండి కాక మరి ఎట్లు పుట్టామని అడుగ వచ్చును. భగము నుండి మన శరీరము పుట్టినది కాని మనము పుట్టలేదు. మన శరీరము పుట్టిన తర్వాత కొన్ని నిమిషములకో లేక కొన్ని గంటలకో శరీరమందు మనము చేరుచున్నాము అపుడు అరుస్తున్నాము. అంత వరకు ప్రాణము రాలేదని మిగతావారు చూస్తూంటారు. ఇదంత ఒక్క సారిగా అర్థము కాదు. మా రచనలోని **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును చదవండి విశథముగ అర్థము కాగలదు. ఒక్క పరమాత్మ మాత్రమే సజీవముగ భగము నుండి పుట్టుచున్నాడు. కావున అతనినొక్కనినే భగవంతుడనవచ్చును. శ్రీ కృష్ణుడు,

ఏసు మన మాదిరి కాక ఎరుకతో పుట్టినవారని, వారిని భగవంతుడు అనుచున్నాము. వారు సూత్రము ప్రకారము భగవంతులే. ఆ పరమాత్మ ఏది కానిదయ్యు తన ధర్మములను మానవాళికి తెల్పుటకు భూమి మీద మానవజన్మ ఎత్తవలసివచ్చును. అటువంటపుడు దానిని భగవంతుడనడము జరుగుచున్నది. "నాకు పుట్టుక లేదు, చావు లేదు, నేను సర్వ జీవరాసులకు అధిపతినయ్యు, నాచే సృష్టింపబడిన నా ప్రకృతితో కూడి, ఒక శరీరము ధరించి భూమి మీద మాయ జన్మ ఎత్తుచున్నానని" గీతయందు కూడ భగవంతుడుగ పరమాత్మ పల్కి ఉన్నాడు. అందువలన పరమాత్మ అనబడు అతీత శక్తి మానవునిగ పుట్టినపుడు భగవంతుడనబడునని తెలియాలి.

**339. జీవునికి అవస్థలు నాలుగు, తనువులు నాలుగు అని కొన్ని గ్రంథములందు వ్రాశారు. స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములు అన్నారు. అట్లే హిరణ్య గర్భయని కూడ తెల్పారు. జాగ్రత్త, నిద్ర, స్వప్న తురీయ, తురీయాతీతమును గూర్చి కూడ తెల్పారు. వారి విషయమేమి?**

జ. జ్ఞానమంతయు సూత్రబద్ధమై ధర్మయుక్తమై ఉండాలి. అట్లే అది అనుభవమునకు వచ్చునదై కూడ ఉండాలి. తనువులు నాలుగని కొన్ని గ్రంథములందు ఉండుట మేము కూడ చూశాము. స్థూలము తప్ప సూక్ష్మ శరీరమును తెలుసుకొను జ్ఞానము కూడ లేని మానవునికి కారణము మహా కారణమని హిరణ్య గర్భ అని అంటే అర్థమవుతాయా? స్థూలమంటే కంటికి కనిపించు శరీరము అందరికి తెలిసినదే. సూక్ష్మమంటే కంటికి కనిపించని శరీరము. ఇట్లు వివరముగ అర్థమగునట్లు కారణ మహా కారణ శరీరముల గూర్చి ఎవరైన చెప్పగలరా? వాస్తవానికి అవి శరీరములా? నిజానికి చూస్తే కారణమనునది కూడ శరీరము కాదు, మహా కారణమెట్లుండును? ఎవరైన అనుభవించి వ్రాసిన మాటలా లేక పరంపరగ మా నాయన చెప్పె నేను చెప్పుచున్నానంటున్నారా? అని యోచించాలి. అట్లే అవస్థలు మూడున్నాయి వాటిని అనుభవిస్తున్నాము. ఎవరు అనుభవించని తురీయాతీతమును గూర్చి పుస్తకాలలో వ్రాసినప్పటికి అవి అసత్యములే అనుకోవాలి. మాకు ఎక్కడ తురీయాతీతమన్నది అనుభవానికి రాలేదు.

మీకేమైన వచ్చినవా? వచ్చి ఉండవు. కావున కొన్ని మాటలు పుస్తకాల వరకే వదలి వేయాల్సి ఉంటుంది. అనుభవమునకు రానివి తప్పక వదలాలి.

**340.** తేట గీతి. మాయ యనగ వేరే మరి లోకంబున లేదు
మాన సంబె మాయ పూని చూడ
మాన సంబు విడిచి మాయ దా నుండదు
మాయ విడయకుండ మానసంబు.

**ఈ రీతిగ కొన్ని గ్రంథములందు చెప్పి ఉన్నారు గాన మాకు సంశయము లున్నవి వివరము తెల్పవలెను.**

జ. వ్రాయు వారు ఎట్లు వ్రాసిన మనము యోచించడము వలన నిజా నిజములు తెలియక మానవు **"గుణమయీ మమ మాయా"** అన్న గీతావాక్యమునకు పై పద్యమునకు పూర్తి వ్యతిరేఖత కన్పిస్తున్నది. మన శరీరములోని గుణములే మాయ అని గీత యందుండగ "మాన సంబె మాయ పూని చూడ" అని పద్యమునందు గలదు. వారి మాటలట్లుంచి మనము వివరించి చూచుకొనిన మనస్సు అనగ మననము చేయునదని అర్థము. మనస్సనునది ఏది అని పరికించి చూచితే మనలోని జ్ఞప్తియేనని తెలుస్తుంది. మనస్సు సూర్య చంద్రనాడుల మీద ఉన్నపుడు మెలుకువయని, బ్రహ్మనాడిలోనికి పోయినపుడు నిద్రయని కూడ తెలియుచున్నది. ఒక విషయమును పద్యములాగ వ్రాసినంత మాత్రమున అవి సత్యమని నమ్మవలసిన పని లేదు. మనస్సుకు మాయకు ఎంతో తేడా ఉన్నది. మాయ (గుణములు) చెప్పిన మాటలు మనస్సు గ్రహించి బయటి శరీరమునకు, బయట శరీరము నుండి వచ్చు వార్తలు లోపలి బుద్ధికి అందించు కార్యము చేయుచున్నది. మనస్సు సూర్య చంద్ర బ్రహ్మనాడుల మీద నివసిస్తుండును. మాయ తలయందు సూక్ష్మముగ ఉన్న కాల, కర్మ, గుణ చక్రములలో గుణచక్రమందు మూడు భాగములలో నివసిస్తు ఉండును. అంతర్ ముఖముగ శరీర పరిశోధన చేస్తే ఏది ఎక్కడున్నది తెలియగలదు.

**రవీంద్రరెడ్డి, చెన్నేకొత్తపల్లి**

**341. జ్ఞానము విలువైనది, పవిత్రమైనది అటువంటి జ్ఞానాన్ని నీకు చెప్పుచున్నానని శ్రీ కృష్ణుడు అర్జునునకు చెప్పగ అటువంటి జ్ఞానాన్ని మీరు ప్రపంచానికి విచ్చల విడిగ చాటుచున్నారే కృష్ణుడు ఎందుకు ఈ మాదిరి అందరికి చెప్పలేదు?**

జ. తాత్విక చింతన కల్గిన ఆ కాలములో జ్ఞానాన్ని ఒకరికి చెప్పిన ఎంతో మందికి ప్రాకేది కావున ఆ రోజు కృష్ణుడు అర్జునునికే చెప్పాడు. దుష్టచింతన కల్గిన ఈ రోజులలో చాలా మందికి చెప్పినప్పటికి ఒకరి వద్ద కూడ నిలబడుతుందో లేదోనని చాలా మందికి చెప్పవలసి వచ్చినది.

**జి. నరసింహ్మారెడ్డి, జంగమరెడ్డిపేట**

**342. పుణ్య క్షేత్రముల ఎడల జనులేల పూజ్య భావము చూపుచుందురు?**

జ. నేడు కోర్కెలు నెరవేరునని, పుణ్యమొచ్చునని పూజ్య భావము చూపుచున్నారు. పూర్వ కాలమలా కాక జ్ఞాన మొచ్చునని, జన్మరాహిత్యము కల్గునని పూజ్య భావము చూపెడి వారు. పూర్వము జ్ఞానగిక్షేత్రములుగ ఉన్న వాటిని నేటి మానవుడు పుణ్యక్షేత్రమంటున్నాడు. వాస్తవముగ దేవాలయములు జ్ఞానక్షేత్రములని, పుణ్యక్షేత్రములు కావని తెలియాలి.

**343. రాత్రి సమయమున నిద్రించునపుడు ఎడమ చేతి మీదుగ తల యుంచి నిద్రించిన తల్లి ఒడిలో నిద్రించినట్లని కొందరనుచుందురు ఎందుకు?**

జ. ఈ మాట పురుషులకు మాత్రమే వర్తించుచుండును. ఎందుకనగ పురుషులకు ఎడమ ప్రక్కన జీర్ణాశయముండును. ఎడమ చేతి మీదుగ పడుకొనుట వలన జీర్ణకోశ కదలికలకు సులువుగ ఉండునను ఉద్యేశముతో అలా అని ఉందురు. కడుపు నొప్పి గల వానిని కూడ ఎడమ ప్రక్క తిరిగి పడుకో మని వైద్యులు కూడ చెప్పుచుందురు.

**344. నీకు పాపము పండుతుంది అని అంటుంటారు కొందరు. పాపమనగ నెట్టిది, పుణ్యమనగ నెట్టిది?**

జ. గతములో చేసుకొన్న పాపము కష్ట రూపముగ అనుభవానికి వస్తుందను మాటను నీ పాపము పండుతుందని అంటుంటారు. పాపమనగ కష్ట దుఃఖముల కలుగజేయునది. పుణ్యమనగా సుఖ సంతోషములు కలుగజేయునది.

**జె. క్రిష్ణ మూర్తి, సింగనహాల్**

**345. యోగమనగా నేమి? దీని అంతరార్థమేమిటి?**

జ. యోగ మనగ జీవాత్మ ఆత్మల కలయికని అర్థము. దీని అంతరార్థము బాహ్యార్థములు లేవు, ఉన్నదొకటే అర్థము.

**346. 'హంస' పదము జీవేశ్వర మైత్రి ఎట్లగును?**

జ. ఇది తల తోక లేని ప్రశ్న. హంస పదమేమిటి జీవేశ్వర మైత్రేమిటి? అలా ఎందుకు కావాలి? ఇవన్నియు వెర్రి వేదాంతపు పుస్తకములలోని మాటలు. వాటిని వదలి మీకు ఉపయోగపడునవి ఏవి కావాలో అవి అడగండి.

**347. పంచభూతాత్మకమగు ఈ దేశమునకు మీరు సెలవిచ్చిన ఉపదేశమునకు భేదమేమి?**

జ. ఈ దేశము స్థూలము, ఉపదేశము సూక్ష్మము.

**348. గురు శబ్ద వాచ్యులనగా భావమేమి?**

జ. నాయనా శబ్దవాచ్యులనునవి వింటూనే నవ్వొస్తా ఉంది. మరియు అందరు నవ్వుతారు. అవి ఎక్కడ విన్నావో వారినే అడిగి తెలుసుకో. మీరు ప్రతి నెల ప్రశ్నలడుగుదును జవాబు లివ్వండని వ్రాశారు. ప్రశ్నలడిగే ముందు అవి ప్రశ్నలగునో కాదో యోచించి అడగండి.

**భజన మండలి, యమ్. అగ్రహారము**

**349. అన్ని యోగములకంటే రాజయోగమే మంచిదంటారు. రాజయోగ మంటే ఏమిటో తెలుపగోరుచున్నాము.**

జ. మీరు అన్ని యోగములకంటే అని అడిగారు. వాస్తవముగ యోగములు ఎన్నో లేవు. ఉన్నవి రెండు మాత్రమేనని తెలియాలి. ఒకటి కర్మయోగము రెండు బ్రహ్మయోగము. కర్మయోగమునే రాజయోగమని అంటాము. బ్రహ్మయోగమునే జ్ఞాన యోగమని అంటాము. ఇందులో ఒకటి మంచిది ఇంకొకటి మంచిది కాదను సమస్య లేదు. కాని బ్రహ్మయోగము కంటే కర్మయోగము కష్టమయినది అందువలన బ్రహ్మయోగముకంటే రాజయోగము గొప్పదని కొందరన్నారు. రెండు యోగములలో దేనిని ఆచరించిన ఫలితము కర్మనాశనమై మోక్షము పొందడమే. ఆచరించడములో రాజయోగము కష్టమైనది కావున దానిని గొప్పదిగ చెప్పారని తెలియాలి. బ్రహ్మ యోగమనగ బాహ్య, స్పర్శ, శబ్ద, రస, వాసన, చూపులతో మనస్సు సంబంధపడక అణిగి ఉండడము. రాజయోగమనగ చేయుచున్న కార్యముల ఎడల నేనను అహము లేకుండ పోవడము. బ్రహ్మయోగమున యోగి స్థబ్దతగ నిలచి ఉండును. రాజయోగమున యోగి అన్ని పనులు కర్మాను సారము చేయుచుండును.

**యం.సి. అంజనేయుల శెట్టి, చిన్నమాండ్యెము**

**350. మానవుడు దేహము వదలిన తర్వాత తిరిగి మానవ దేహమే వస్తుందా? లేక వేరు దేహమొస్తుందా?**

జ. మానవుడు మోక్షాసక్తుడై నిత్య సాధనపరుడై ఉన్నపుడు అట్టి వానికి మరణము వచ్చిన, వాడు తిరిగి మానవ జన్మయందే పుట్టును. అట్టి సాధకుడు కాని ఎడల, వాడు వాని కర్మానుసారము వేరు రకముల జన్మలు పొందవచ్చును. ఈ సూత్రము మానవులకే కాక ఏ జీవరాసికైన వర్తించును. వారి వారి పాప పుణ్యముల క్రమము ప్రకారము రక రకముల దేహములు లభిస్తుండును. కాని

యోగ సాధకునకు మాత్రము మానవ జన్మయే కలుగును. మిగత జీవరాసులు కూడ కర్మ వరుస ప్రకారము మానవ జన్మ పొందవచ్చును.

**యస్. సుభాన్, సోమవారపేట**

**351. వివాహమైన వాల్లకు మంచి గురువు లభించిన తర్వాత యోగము సిద్ధిస్తుంది అంటారు నిజమా?**

జ. మంచి గురువు లభిస్తే ఆయన చెప్పినట్లు నడుచుకొన్నపుడు ఎవరికైన యోగము సిద్ధిస్తుంది. వివాహము దేహమునకే గాని మనస్సుకు లేదు కదా! యోగము మనస్సు మీద అహము మీద ఆధారపడి ఉన్నది. పై శరీరము మీద ఆధారపడలేదు. కావున మనస్సును జయిస్తే బ్రహ్మయోగము, అహమును జయిస్తే కర్మయోగము సిద్ధిస్తుందని తెలియాలి. కావున వివాహికులకే అనేది నియమము లేదు.

**352.** అంగ లింగములను హరునితో మర్థించి
జగము గ్రంధి నిలిపె సరణి తెలిసి
రంగగా వసుధలో వంగంబు చల్లారా
విశ్వదాభిరామ వినుర వేమా.

**ఈ పద్యమునకు భావమును తెలియజేయవలయునని కోరుచున్నాము.**

జ. శరీర పాత్రయందు గల జీవాత్మను కాలమను కవ్వముతో మర్థించి అనగ యోగ సాధన చేసి, అందు లభించు జ్ఞానశక్తి ద్వార జన్మల కారణమైన కర్మను ఊటను నిలుపు విధానము తెలిసి, అనగ జ్ఞానాగ్ని ద్వార జన్మ కారణమైన కర్మను కాల్చు విధము తెలిసి, ఆ విషయమును భూమి మీద వంగంబు చల్లారా అనగా జ్ఞాన విత్తనములు చల్లుము. సంతోషముగ ఇతరులకు తెలుపుమని అర్థము.

**సదా శివనాయుడు, బి. పప్పూరు**

**353.** సీ. కానని భూమిలో కస్తూరి కోనలో
మందరగిరి మీద మర్రి చెట్టు

చెట్టుకు కొమ్మలు చెర్చింప పది నూర్లు
కొమ్మ కొమ్మకు కోటి కోతులుండు
నగదరం బైనట్టి నడి కొమ్మ మీదను
నక్క ఒకటుండు చుక్క వలెను
సుస్థిరం బైనట్టి చుక్కకు తూర్పున సూర్య చంద్రులు తేజరిల్లు

తే. దీని కర్థంబు చెప్పు దేశికునకు
నెలలు పండ్రెండు గడువిత్తు నేర్పుతోడ
చెప్ప గలిగె నేని నేనిత్తు చిన్న మాడ
చెప్ప లేకుంటె నేనగుదు చిన్న నగువు.

**ఈ పద్యము యొక్క భావము తెలుపవలెనని కోరుచున్నాము.**

జ. పై పద్యమున "దీనికర్థంబు చెప్పు దేశికునకు నెలలు పండ్రెండు గడువిత్తు" అను మాట చూస్తే ఇది చాలా గొప్ప నిగూఢ భావమున్న పద్యమని తెలిసి పోవుచున్నది. అయినప్పటికి ఈ పద్యము యొక్క భావము చెప్పుటకు అంత కాలము అవసరము లేదు. క్రింద చదవండి పద్య భావము.

దైవము నిల్వ ఉన్న నిజమైన దేవాలయమైన మన శరీరములో కంటికి కనిపించని చూడబడని అంతర్గతములో, ఎముకలచే మరియు వెన్నుపూసలచే పేర్చబడిన ఎత్తైయిన శరీర భాగములో కపాల స్థానమందు జీవుల సారాంశ మంతయు ఇమిడి ఉన్నది. ఆ స్థానములోనే జీవరాసుల జరిగిన, జరుగుచున్న జరుగబోవు చరిత్రలన్ని దాచబడినవి. శిరోభాగములో మధ్యనగల గుణచక్రమందు గుణములు, కర్మ చక్రమందు కర్మ, కాలచక్రమందు కాలము కనిపించక సూక్ష్మముగ ఉన్నవి.

కనిపించు మెదడు నుండి ఒక నాడి బయలుదేరి గుదస్థానము వరకు వ్యాపించి ఉన్నది. దీనినే బ్రహ్మనాడియందురు. ఈ నాడియందు కాల కర్మ గుణ చక్రముల నడుపు ఆత్మ నివాసమై ఉన్నది. ఆత్మ కంటికి కనిపించక బ్రహ్మనాడి

పై భాగము నుండి చివరి భాగము వరకు వ్యాపించి బ్రహ్మనాడితో అంటుకొని ఉన్న చిన్న చిన్న నరముల ద్వార శరీరమంతయు ప్రాకుచున్నది. పై నుండి క్రింది వరకు చిన్న చిన్న నరములనేకము శరీర వివిధ భాగముల నుండి వచ్చి బ్రహ్మనాడితో కలసి ఉన్నవి. ఈ చిన్న నరముల ద్వారనే శరీరమందు ఏ విషయమయిన బ్రహ్మనాడిని చేరి అక్కడ నుండి కపాల స్థానములో నివాసమున్న జీవునకు చేరుచున్నవి. ఇంతేకాక బ్రహ్మనాడికి ముందర భాగములో ఇరువైపుల సూర్య చంద్రనాడులనునవి కలవు. ఈ నాడులు రెండు ముఖ్యముగ ఊపిరి తిత్తులతో సంబంధమున్నవి. మన ముక్కు రంధ్రముల ద్వార ఆడు శ్వాస సూర్య చంద్ర నాడుల ద్వారనే కదలింపబడుచున్నది.

పై విధముగ శరీర అంతర్భాగమున్నది. ఈ విషయమును యోగులైన వారు పద్యరూపముగ చెప్పినారు లోపలి భాగము కనిపించనిది. కావున కానని భూమిలోనన్నారు. శరీరము ఆత్మ నిలయమైన పవిత్ర స్థానము కావున పరిమళముగల కస్తూరి కోన అన్నారు. శరీర పై భాగమున ఆత్మ, జీవుడు, గుణములు, కర్మల నిలయము కావున శరీరమును పర్వతముగ పోల్చి మందరగిరి అన్నారు. కపాల స్థానము నుండి బ్రహ్మనాడి పుట్టినది కావున దానిని మర్రి చెట్టుగ చెప్పారు. బ్రహ్మనాడి నుండి ఎన్నియో నాడులు చీలిపోయాయి. కనుక నాడులన్నిటిని కొమ్మలుగ పోల్చి చెట్టుకు చెర్చింప పది నూర్ల కొమ్మలన్నారు. బ్రహ్మనాడి తో సంబంధమున్న నరముల ద్వార లెక్కకు రాని అనేక విషయములు బ్రహ్మనాడిని చేరుచున్నవి. కావున కొమ్మ కొమ్మకు కోటి కోతులుండు అన్నారు. చిన్న నరముల కన్నిటికి బ్రహ్మనాడియే ఆధారము. బ్రహ్మనాడి నుండియే శక్తి అన్ని నరములకు ప్రవహించుచున్నది. అందువలన బ్రహ్మనాడిని నగధరం బైన నడిమి కొమ్మ అన్నారు. బ్రహ్మనాడియందే అన్నిటికి సాక్షియైన ఆత్మ నివాసమున్నది. కావున ఆత్మను నక్కగ పోల్చి నడిమి కొమ్మ మీద నక్క ఒకటి అని అన్నారు. ఆత్మ స్థిర స్థాయిగ ఒక్క చోటుండి తన శక్తి కిరణములను నరముల ద్వార శరీరమంత వ్యాపింపజేయు చున్నది. అందువలన పగలు రేయి స్థిరస్థాయిగ ఉన్న చుక్కగ

ఆత్మను పోల్చి నక్కయొకటుండు చుక్కవలె అన్నారు. బ్రహ్మనాడికి కొద్దిగ ముందు ప్రక్కన రెండు వైపుల సూర్య చంద్రనాడులు ఉన్నాయి. జాగ్రత్తావస్థయందు మాత్రము మనస్సుకు స్థానమై ఉన్న సూర్య చంద్ర నాడులను 12 గంటల కాలమే కనిపించి 12 గంటల కాలము కనిపించని సూర్యచంద్రులుగ పోల్చి చుక్కకు తూర్పున సూర్య చంద్రులు తేజరిల్లు అన్నారు.

ఇది నిగూఢ భావము గల పద్యము. శరీర అంతర్గత జ్ఞానము పూర్తిగ తెలిసిన వారికే ఈ పద్యమర్థమగును. శరీరాంతర్గత జ్ఞానము చాలా మందికి లేని దాని వలన దీని అర్థము చెప్పుటకు చాలా కాలము పట్టునను ఉద్దేశముతో నెలలు పండ్రెండు గడువిత్తునని చెప్పారు. దీనిని చదివిన వారు శరీర జ్ఞానము శ్రేష్ఠమైనదని తెలియవలయును. భగవద్గీతలో కూడ భగవంతుడు "క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ" అన్నారు. శరీరము అందులోని ఆత్మను గురించిన జ్ఞానమే శ్రేష్ఠమైనదని శ్రీ కృష్ణుడన్నాడు.

**లక్ష్మినారాయణ, నరసాపురము**

**354. వివాహ సమయములో అక్షింతలు వేయుట, కత్తి పట్టుకొనుట, అరుందతి నక్షత్రము చూచుట మొదలగు విషయములకు ఇంతకు ముందు వివరము బాగ చెప్పారు. కాని ఇంకొక అనుమానము మిగిలి ఉన్నది. దానికి సమాధానము తెలుపవలయునని కోరుచున్నాము. అది ఏమనగా! వివాహ సమయములో వధూ వరులిద్దరు ఒకరి నెత్తి మీద ఒకరు బియ్యము పోసుకోవడము జరుగుచున్నది. దానినే తలంబ్రాలు పోయుట అంటారు. దాని వివరమేమి?**

జ. ఆత్మ జ్ఞానము అందరికి దగ్గరగ ఉండవలెనను భావముతో ఆనాడు పెద్దలు జ్ఞానసంబంధమైన ఆచరణలు ఎన్నో కార్యరూపములుగ పెట్టారు. జ్ఞానము మాటలతో చెప్పితే అర్థము కాక పోవచ్చు లేక కొంత కాలమునకు చెప్పేవారు కాని లేక వినేవారు కాని లేకపోవచ్చును. అట్లు కాకుండుటకు ఒక పద్ధతి ప్రకారము

ఆచరణ ఉంచితే, దానిని ఆచారము ప్రకారము అందరు ఆచరించితే, ఆ విషయమునకు దూరము కాకుందురని, ఎన్నో జ్ఞానవిషయములను ఆచారములుగ ఆచరించుటకు నియమించారు. అందులో తలంబ్రాలు వేయుట కూడ ఒకటి. జ్ఞానమునకు నవగ్రహములలో చంద్రుడు అధిపతికాగ అతని ధాన్యము బియ్యము. బ్రహ్మవిద్యలో జ్ఞాన చిహ్నముగ చంద్రుని, చంద్ర ధాన్యమును చెప్పుట జరుగుచున్నది. జ్ఞాన చిహ్నమైన బియ్యమును తల మీదనే పోయుటకు అర్థము కలదు. తల జ్ఞానమునకు గాని, అజ్ఞానమునకు గాని స్థానము. తలలోని గుణములనే గీతయందు మాయ అని కూడ అన్నారు. వివాహ సమయము నుండి భార్యకు భర్తయను క్రొత్త మాయ, భర్తకు భార్యయను మాయ తగుల్కొని, ఆనాటి నుండి సంసార జీవితము ప్రారంభమై వారి తల అనేక విషయముల నిలయమై పోవును. ఆనాటి నుండి కేవలము బ్రతుకు తెరువుకే వారి మెదడును ఉపయోగించి యోచించుచుందురు. వివాహమైనప్పటి నుండి వాడు ఎక్కువ మాయలో పడినాడను మాట అక్కడక్కడ అనుచుందురు. అలా వారి జీవితము మాయలోనే గడుపకుండ, భర్త అజ్ఞాని అయితే భార్య అతని మేల్కొలిపి ఇది జ్ఞానమని వాని తలకు జ్ఞానమందివ్వాలను అర్థముతో భార్య చేత భర్తకు జ్ఞాన చిహ్నమగు ధాన్యమైన బియ్యమును భర్త తల మీద పోయించెడివారు. అలాగే భార్య అజ్ఞాని అయితే భర్త ఆమెకు జ్ఞానము తెలుపాలను గుర్తుగ భర్త చేత భార్య తల మీద బియ్యమును పోయించెడివారు. ఇద్దరి తలల మీద బియ్యమును పోయించడములో వారి తలలు జ్ఞాన నిలయమై ఉండాలని, వారు జ్ఞానము తెలిసి బ్రతకాలని బాహ్యార్థము. పెళ్ళయిన భార్య భర్తలిద్దరికి జ్ఞానము తెలియక పోతే ఎవరో ఒకరు గురువు వద్ద జ్ఞానము తెలిసి రెండవ వారికి తెలుపవచ్చును. కాని ఈ కాలములో భర్త జ్ఞానియైతే భార్యకు సరిపోదు. పాపము భర్తను ముప్పుతిప్పలు పెట్టుదురు. అట్లే భార్య జ్ఞాని అయితే భర్తకు సరిపోదు. చివరకు ఇటువంటి భార్యతో నేను కాపురము చేయలేనంటున్నాడు. జ్ఞానము కల్గిన భార్య భర్తలు భూమి మీద అరుదుగ ఉందురు.

వివాహ సమయమున తలంబ్రాలను పేరుతో బియ్యమును ఈనాడు ఎందరో డాక్టర్లు ఇంజనీర్లు ఇంకా పెద్ద చదువులు చదివిన వారు కూడ తలల మీద పోసుకొనుచునే ఉన్నారు. కాని ఎందుకు ఇవి పోసుకుంటున్నాము అని మాత్రము వారిని వారు ప్రశ్నించుకోరు, లేక ఇతరులనైన అడుగరు. కుక్క కాలెత్తి ఉచ్చపోస్తుంది. దానిని చూచిన మరియొక కుక్క అలాగే చేస్తుంది. మనమలా జంతువులము కాదు కదా! ఒకరు చేస్తే ఇతరులు చేయడానికి. ఎందుకు చేశారో విచారించి అర్థసహితముగ భావపూరితముగ ఆ పనిని చేస్తే బాగుండును. ఒక తల పరిధిలో దూరుకొన్న జీవుడు జ్ఞానము చేత పరిధి లేని ఆకాశమును అనగ మోక్షమును చేరగలడు. మోక్షమును (దైవమును) బయలని శూన్యమని బ్రహ్మవిద్యయందు అనుచుందురు. ఆ దైవమును జ్ఞానము పొందింపచేయును. కావున పెళ్లి సమయమున తల మీద జ్ఞాన చిహ్నముగ వేయు బియ్యమును తల అంబరములు అని పూర్వమనెడి వారు. తల నుండి అంబరము (ఆకాశము)నకు చేర్చునవను అర్థముతో అలా పెట్టారు. ఆ పేరు పూర్వము తల అంబరములు అయితే నేడు తలంబ్రాలు అను పేరుగ చెప్పుచున్నాము. పెళ్లి సమయమున తలంబ్రాలు వేసుకొన్న మీ తలలను జ్ఞాన మయముచేసుకొన్న రోజే నిజమైన తలంబ్రాలు పోసుకొన్నట్లని తెలుపుచున్నాము.

**సంజీవయ్య వర్మ, కంభమ్**

**355. శ్రీ శంకర భగవత్పాదుల వారు బ్రహ్మ సత్యం జగన్మిత్య అన్నారు. జగన్మిత్య అనుట మీరు సమర్థిస్తారా?**

జ. శంకరాచార్యులు ఏమన్నారో ఏమో మాకు తెలియదు కాని మేము చెప్పు మాట ఏమనగా! బ్రహ్మ సత్యమే జగత్తు సత్యమే, బ్రహ్మ (దైవము) కనిపించక ఉన్నది. జగత్తు కనిపిస్తు ఉన్నది. రెండు ఉన్నవే కాని ఒకటి ఉన్నది ఒకటి లేదు అనడము పొరపాటు.

**356. "జీవో దేవో సనాతనః" అన్నారు మన ఆర్యులు. అట్టి వారే అద్వైతమని రెండు లేవని "ఏకం సత్వా" అన్నారు. ఏది నిజము?**

జ. "జీవో దేవో సనాతనః" అన్నమాట నిజము. ఎందుకనగా ప్రత్యక్షముగ జీవులము మనమున్నాము. పరోక్షముగ దేవుడను వాడు జీవుల నాడించుచున్నాడు. జీవుడు, దేవుడు, దేవ దేవుడు ముగ్గురున్నారు. వారినే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అంటున్నాము. ముగ్గురున్నారని చెప్పడమే త్రైతమని తెలియాలి.

**357. వేమన శతకమని అంటారు. వేమన పద్యములు మూడు వేలకు పైగ ఉండగ శతకమనుటలో అర్థమేమిటి?**

జ. మూడు వేల పద్యముల పుస్తకము "వేమన పద్యములు" అను పేరుతో ఉండును. వేమన పద్యములను నూరును మాత్రము తీసుకొని చిన్న పుస్తకముగ ప్రింట్ చేసిన వాటికి "వేమన శతకమని" పేరు పెట్టి ఉందురు.

**డి. భీమేష్, కళ్యాణదుర్గము**

**358. అండ పిండ బ్రహ్మాండము అనగా నేమి? ఆధ్యాత్మికముగ వాటి మూలార్థము తెలుప ప్రార్థన.**

జ. అండ పిండ బ్రహ్మాండమను వాక్యము సర్వ ప్రపంచమునకు మారుగ చెప్పబడినది. అనగ సర్వ ప్రపంచములో ఇమిడి ఉన్న మొత్తము జీవరాసులను కలిపి చెప్పుమాట అని తెలియాలి. అండ అనగ గ్రుడ్డు నుండి పుట్టినవి. పిండ అనగ గర్భము నుండి పుట్టినవి. బ్రహ్మాండమనగ భూమి నుండి పుట్టిన మొదలగునవని అర్థము. బ్రహ్మాండము అనడములో వృక్ష లతాదులే కాక భూమండలము మొదలు నక్షత్రమండలము మొదలగు ప్రపంచమునంతటిని కలిపి చెప్పినట్లని తెలియాలి. మొత్తము సృష్టినంతటిని అండ పిండ బ్రహ్మాండమన్నారు.

**సుభాన్, సోమవారముపేట**

**359. స్థూలదేహము కంటికి కనిపిస్తూనే ఉన్నది. ఇక సూక్ష్మదేహములోని భాగములు కనిపించవు. కావున మన శరీరములో అవి ఎక్కడెక్కడున్నది తెలుపవలెను.**

జ. స్థూలదేహము పది భాగములు. 1. కన్ను, 2. ముక్కు, 3. చెవి, 4. నాలుక, 5. చర్మము జ్ఞానేంద్రియములు. అట్లే కర్మేంద్రియములు 1. నోరు, 2. చేతులు, 3. కాల్లు, 4. గుదము, 5. గుహ్యాము. ఇవి బయటికి కనిపిస్తు ఉన్నవి. ఇక కనిపించని 15 భాగములలో 1. మనస్సు సూర్య చంద్ర నాడుల మీద, 2. బుద్ధి గుణచక్రములో జీవాత్మ అను ఖాళీ స్థలము చుట్టు ఉన్న పొరగ, 3. చిత్తము జీవాత్మ చుట్టు ఉన్న రెండవ పొరగ, 4. అహము జీవాత్మ చుట్టు ఉన్న మూడవ పొరగ ఉన్నది. ఇక మిగిలిన జీవాత్మ, బుద్ధి, చిత్తము, అహము అను మూడు పొరల మధ్యనున్న శూన్యముగ గుణచక్రములో ఉన్నది. పంచ వాయువులలో 1. ప్రాణవాయువు ముక్కు రంధ్రములు మొదలుకొని ఊపిరితిత్తుల వరకు వ్యాపించి ఉన్నది, 2. ఉదాన వాయువు నోటినుండి జీర్ణాశయము చివరి వరకు వ్యాపించి ఉన్నది, 3. అపాన వాయువు జీర్ణాశయము చివర ప్రారంభమగుచిన్న ప్రేగు మొదటి నుండి పెద్ద ప్రేవు ఆఖరి వరకు అనగ గుదస్థానము వరకు వ్యాపించి ఉన్నది, 4. సమాన వాయువు శరీరమంతటా వ్యాపించి ఉన్నది, 5. వ్యాన వాయువు గుండె నుండి రక్త నాడులంతా వ్యాపించి ఉన్నది. ఇక మిగిలిన ఐదు తన్మాత్రలలో 1. చూపు కంటి వద్ద, 2. వినికిడి చెవి వద్ద, 3. స్పర్శ చర్మము వద్ద, 4. రుచి నాలుక వద్ద, 5. వాసన ముక్కుపుటముల వద్ద ఉన్నవని తెలియాలి.

**360. యోగసాధన సమయములో రెండు చేతుల చూపుడు వ్రేళ్ల బొటన వ్రేళ్లకు తగిలించి నడిమి వ్రేలు ఉంగరపు వ్రేలు చిటికన వ్రేలును క్రిందికి చూపి ఉంటారు. అలా వ్రేల్లు ఉంచడములో ఏదైన అర్థము ఉన్నదా?**

జ. ఆ విధముగ చేతి వ్రేల్లు పెట్టడములో పూర్తి ఆధ్యాత్మిక అర్థమిమిడి ఉన్నది. బొటన వ్రేలు ఆత్మ అని, చూపుడు వ్రేలు జీవాత్మ అని యోగుల భావము. యోగము చేయు సమయములో జీవాత్మ ఆత్మ భావములో కలసి పోవునని జీవాత్మగ

సూచింపబడుచున్న చూపుడు వ్రేలును, ఆత్మగ లెక్కించు బొటన వ్రేలుతో కలిపి ఉంచుదురు. అలాగ కలిపి ఉన్నపుడు బొటన వ్రేలుకొన ఆకాశము వైపు ఉండును. దానికి కూడ అర్థము కలదు. జీవాత్మ ఆత్మతో కలియుట వలన తదనంతరము ప్రాప్తించునది మోక్షము. అనగ పరమాత్మ ప్రాప్తి. పరమాత్మ అంతట వ్యాపించిన శూన్యముగ ఉండువాడు గనుక జీవాత్మ ఆత్మ కలయికను చూపించు బొటన వ్రేలు కొన ఆకాశము వైపు ఉండును. ఇల మిగిలిన నడిమి వ్రేలు స్థూల శరీరమని, దానికంటే చిన్నదైన ఉంగరము వ్రేలు సూక్ష్మ శరీరమని, చివరి చిటికన వ్రేలు కారణ శరీరమని భావించుదురు. స్థూలశరీరము పైకి కనిపిస్తు ఉన్నది. దాని వెనుకల సూక్ష్మము ఇమిడి ఉన్నది. సూక్ష్మ శరీరములో కూడ ఇమిడి ఉన్నది కారణ శరీరము. కావున పెద్దదైన నడిమి వ్రేలును స్థూలమని, రెండవదైన ఉంగరము వ్రేలు సూక్ష్మమని, చిటికన వ్రేలు కారణ శరీరమని గుర్తించారు. బొటన వ్రేలుకు చూపుడు వ్రేలు కలిపి మిగిలిన మూడు వ్రేళ్లు చాచి అరచేయి ప్రక్కకు చూపునట్లు పెట్టి చూడండి. బొటన వ్రేలు చూపుడు వ్రేలు కనిపించుచు బొటన వ్రేళ్లు కొన ఆకాశము వైపు ఉన్నట్లును కనిపించును. తర్వాత నడిమి వ్రేలు కనిపించును, కాని దాని వెనుక ఉన్న ఉంగరము వ్రేలు, చిటికన వ్రేలు చూపుకు కనిపించదు. స్థూలము వెనుక అణిగి ఉన్నవి సూక్ష్మము, కారణము అని తెలియునట్లు చివరి రెండు వ్రేల్లు కనిపించవు. యోగసాధన సమయములో అరచేయి పైకి కనిపించునట్లు పెట్టక ప్రక్కకు కనిపించునట్లు పెట్టుట వలన యోగము యొక్క పూర్తి భావము అందులో ఇమిడి ఉండును. మూడు వ్రేళ్లు చాపి ఉంచుట వలన అర్థమేమిటను అనుమానము ఇక్కడ ఇంకా మిగిలి ఉన్నది. కాన దాని విషయమేమనగా! స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల మీద ధ్యాస లేకుండ పోవలెనని, ఆ శరీరములను జీవాత్మయైన తాను వదలుకోవలెనని ఉద్దేశ్యముతో ఆ మూడు వ్రేల్లకొనలు మూలగ క్రింది వైపు చూపునట్లు ఉంచుచున్నారు. ఆ మూడు శరీరములు నాశనమైన తదుపరి ఆత్మతో కలిసిన జీవాత్మ, పరమాత్మ యందైక్యమగునట్లు బాహ్యార్థముండుటకు పూర్వపు యోగసాధకులు చేతి వ్రేల్లనట్లుంచెడివారు.

కాల క్రమమున అరచేయి పైకి పెట్టడము జరిగినది. అలా ఉంచడము సరైన పద్ధతి కాదు. అరచేయిని ప్రక్కకుండునట్లుంచడము సరియైన పద్ధతని తెలియాలి. చూపుడు వ్రేలుకొనను బొటన వ్రేలుకొనతో కొందరు కలుపుచుందురు. అట్లు కలుపక చూపుడు వ్రేలుకొనను బొటనవ్రేలు మొదటి గెనుపు వద్ద కలుపవలయును. అట్లు కలిపి అరచేయిని ప్రక్కగ పెట్టి చూచిన, చూపుడు వ్రేలుకు బొటన వ్రేలుకు మధ్యలో గుండ్రని ఖాళీ స్థలము కనిపించును. చూపుడు వ్రేలు వంచి బొటన వ్రేలుతో కలుపడము వలన, జీవాత్మ దారి మల్లించి ఆత్మ వైపు మరల్చవలయునని తెలియుచున్నది. ఆ రెండు వ్రేళ్ల మధ్య ఖాళీ స్థలమేర్పడడము వలన జీవాత్మ ఆత్మ కలయిక వలన వచ్చు ఫలితము జీవాత్మ జన్మలకు పోకుండ ఖాళీ అయిపోవునని తెలియుచున్నది.

**అనూరాధ, మద్రాస్**

**361. మానవజన్మలో మోక్షమును సాధిస్తే తిరిగి మానవ జన్మ వచ్చునన్నారు నిజమా?**

జ. మోక్షమును సాధించిన వారికి ఇక జన్మ రాక పరమాత్మలో కలిసిపోవును. అట్లుకాక మానవ జన్మలో మోక్షము కొరకు ప్రయత్నము చేయుచుండు వాడు చనిపోతే, వాడు పూర్తి పరిపక్వుడుకాక మోక్షము పొందక పోతే , అట్టి వానికి తిరిగి మానవ జన్మయే వచ్చునని భగవద్గీత తెలుపుచున్నది. మోక్షమనగా విడుదలని అర్థము. దేనినుండి విడుదల అంటే జన్మలయందు దేహములను కారాగారములలో బంధింపబడి కష్టములను అనుభవించు జీవాత్మ ఇక ఏ దేహమను కారాగారమును చేరక విడుదల కావడమే మోక్షము. దేహమను పరిధిలో లేకుండ పరిధి లేనివాడై మారి పోవడమే మోక్షము.

**కడియాల శ్రీనివాసులు, డెనకల్ క్యాంపు**

**362. ఒక జ్యోతిష్యుడు ఒక రాజకీయవేత్త గురించి వ్రాయుచు అతను అత్యధిక మెజారిటీతో ప్రభుత్వమును స్థాపించి చాలా కాలము తెలివిగ**

**రాజ్యమేలునన్నాడు. కాని ఆ రాజకీయవేత్త మరుదినమే చనిపోయాడు. అపుడు జ్యోతిష్యము పూర్తి తప్పుగ మాకు తెలియుచున్నది. మీరేమంటారు?**

జ. చెప్పినది ఒకటి జరిగినదొకటైనపుడు ఆ జ్యోతిష్యమును తప్పనే చెప్పవచ్చును. జ్యోతిష్యము ఆరు శాస్త్రములలో ఒకటైనది కావున జ్యోతిష్య శాస్త్రము తప్పుకాదు కాని, దాని నుండి ఫలితములను గ్రహించుటయందు లోపమేర్పడుటవలన జరుగు సంఘటనలు భిన్నముగ కనిపిస్తున్నవి. వాసు దేవరావు, ధవళేశ్వరము నుండి వ్రాసిన విషయము ఈ నెల ఆంధ్రజ్యోతియందు "జన వాక్యము" అను శీర్షిక యందు ప్రచురింపబడినది ఇలా ఉన్నది.

## క్రొత్త ప్రధాని రాజీవ్ గాంధీ

(21-05-1991 ఈనాడు)

"ఈ నెల 17వ తేది నుంచి వక్రగతి పొందిన శనితో కుజుని (కర్కాటకం) సమసప్తక స్థితివల్ల, తదుపరి జులై మాసమున "కుజు"ని సింహరాశి ప్రవేశమున ఏర్పడు షష్టాష్టక స్థితి (శని) వల్ల ధనస్సు రాహువుతో శని ద్విదాశస్థితి, మిధున కేతువుచే కర్కాటక దృష్టి వల్ల 1991 పార్లమెంటు మధ్యంతర ఎన్నికలలో శ్రీ రాజీవ్ గాంధీ విజయం సాధించి ప్రధాని పదవినలంకరిస్తారు. శ్రీ రాజీవ్ గాంధీకి జన్మ కాలము (జన్మ లగ్నమునకు ఏకాదశ స్థానమున రవి, చంద్ర, శుక్ర, గురు, బుధ గ్రహములున్నాయి.) విశేషయోగము. ఏకాదశ స్థానం సింహరాశి కావడము మరి విశేషం, ప్రస్తుతం శ్రీ రాజీవ్ గాంధీకి గురువులో (కర్కాటకమున) మరల ఆగస్టు నుంచి సింహ రాశియందు బాగున్నది. శని కూడా ఆరింట (మకరమందు) 1990 డిశంబరు 14 నుంచి బాగున్నాడు దేశ పరిస్థితులచే రాజీవ్‌నకు ముళ్ల కిరీటము ధరించినట్టవుతుంది. 1992 లో శని ప్రభావము చేత మన దేశ సరిహద్దు లందు (వాయువ్య-ఉత్తర ప్రాంతములో) యుద్ధ ప్రమాదము సంభవించినపుడు శ్రీ రాజీవ్ గాంధీ అతి చాకచక్యంగా వ్యవహరిస్తారు." అని ఉంది.

ఆ విషయము తప్పని మేము చూచిన వెంటనే అనుకొన్నాము. అలా ఆ విషయమును వెంటనే తప్పనుకోవడానికి కారణమేమనగా! ఆయన వ్రాసిన దాని యందు చాలా లోపములు కనిపించాయి. అవి ఏమనగా 1. గుప్త పంచాంగము ప్రకారము ఈ మే నెల 15వ తేదీన పాడ్యమి, బుధవారము, కుజగ్రహము కటకరాశి యందు ప్రవేశిస్తుండగ, ఆయన వ్రాసిన దానియందు 17వ తేదీన కటకమందు కుజగ్రహ ప్రవేశమని ఉన్నది, 2. జన్మ లగ్నమునకు ఏకాదశ స్థానమున రవి చంద్ర శుక్ర గురు బుధ గ్రహములున్నాయి అనడము కూడ తప్పే. ఎందుకనగ 1983 వ సంవత్సరము ఒక పత్రికయందు యన్.టి. రామారావు గారి జాతకము మరియు రాజీవ్‌గాంధీ గారి జాతకము ప్రచురించడము జరిగింది. ఇద్దరిది తులారాసి కాగా అందులో రాజీవ్ గారి జాతకచక్రము క్రింది విధముగా ఉన్నది.

| | | | |
|---|---|---|---|
| | | | |
| శ | తులా లగ్నము | | కే |
| రా | | | |
| ర శు బు చ గు | కు | లగ్నము | |

**రాజీవ్ గాంధీ గారి జనన కుండలి**

28-08-1944 ఉదయము గం. 9-50 ని. లకు శుద్ధ విదియ ఆదివారము పుబ్బ నక్షత్రమందు తులారాసిలో జననము. జనన కాలమున శుక్ర దశా శేషము. 11 సంవత్సరముల 4 నెలల 10 రోజులు

రాజీవ్ గారి జాతక చక్రమందు మూడవ స్థానమున పంచ గ్రహకూటమి ఉండగ, పదకొండవ స్థానమున అని చెప్పడము పూర్తి తప్పు. సింహరాశి పదకొండవ స్థానమని చెప్పడము తప్పు, 3. అతని మాట ప్రకారమే సింహరాశి పదకొండవ స్థానమైనపుడు జన్మలగ్నము తులాలగ్నమనియే తేలుచున్నది. తులాలగ్నము నుండి మకరలగ్నము నాల్గవ స్థానముకాగ ఆరవ స్థానమైన మకరమందు శని 1990 డిశంబరు 14 వ తేదీ నుంచి బాగున్నాడు అని వ్రాయడము తప్పు. శని మకర మందు 1990 డిశంబరు 14వ తేదీన ప్రవేశించినది వాస్తవమే అయినప్పటికి

మకరరాశి జన్మ లగ్నమైన తులారాశికి నాల్గవ స్థానమే కాని ఆరవ స్థానము కాదు. ఇన్ని తప్పులున్న విషయము కావున అది సరియైన జ్యోతిష్యము కాదు దాని వలననే అందులో వ్రాసిన దానికి భిన్నముగ జరిగినది.

రాజీవ్‌గాంధీగారు 1991 సంవత్సరము మే నెల 21వ తేదీన చనిపోయినపుడు గల గ్రహస్థితికుండలి క్రింది విధముగా ఉన్నది.

| | | | |
|---|---|---|---|
| | | | కే శు |
| | తులా లగ్నము | | కు గు ర |
| శ | | | చ |
| రా | | లగ్నము | |

1991 మే 21వ తేదీన రాజీవ్ గాంధీ గారికి ఉన్న గ్రహచారము.

రాజీవ్ గాంధీ గారి జన్మలగ్నమున ఆయు స్థానమైన వృషభరాశిని కుజుడు చూచుట వలన, రాజీవ్ మరణము కుజగ్రహ ఆధీనములోని వాటి వలననే జరుగునని, వాటి వలననే ఆయుస్సు హరించ వేయబడునని తెలియబడుచున్నది. కుజ గ్రహ ఆధీనమందు పోలీసులు, మిలటరి, తుపాకులు, బాంబులు, కుక్కలు, పులులు, ఎద్దులు, మొదలగునవి కలవు కాన వాటి వలననే ప్రమాదమేర్పడవచ్చునని చెప్పవచ్చును కాని పలానా దాని వలనని నిర్ధిష్టముగ చెప్ప లేము.

మే నెల 21 వ తేదీ జరిగిన సంఘటనను బట్టి ఆ దినము గ్రహస్థితిని బట్టి చూచిన ఎడల మకరమున శని, కటకమున గురువు ఎదురెదురుగ ఉన్న దాని వలన 15వ తేదీ నుండి గురువుతో కుజుడు చేరుట వలన 15 వ తేదీ నుండి రాజీవ్ హత్యకు ప్రయత్నము జరుగుచున్నదని తెలియుచున్నది. కుజ గురువులు ఒకే స్థానమున కలియుట వలన మరియొకరి ప్రోద్భలము చేత చంపడము జరిగినదని తెలియుచున్నది. 1990 జులై 20వ తేదీ నుండి రాజీవ్

హత్యను గురించిన యోచన వచ్చినప్పటికి డిశంబరు 14వ తేదీ నుండి రాజీవ్‌ను హత్య చేయుటకు తగిన వ్యక్తిని గురించి వెదకడము జరిగినది. ఆ హంతక వ్యక్తి మే నెల 15వ తేదీ నుండి లభించగ అప్పటి నుండి పథకము వేసి 21వ తేదీకి హత మార్చడము జరిగింది. కుజ గురువులు కటక రాశియందుండుట వలన రాజకీయ ఉపన్యాస స్థలమే హత్య స్థలమైనది. కుజుడు కటకము నుండి శరీర స్థానమైన తులను చూచుట వలన శరీరమును విచ్ఛిన్నము చేయగలిగాడు. అంతే కాక జన్మలగ్నమున ముఖవర్చస్సుకు సంబంధించిన 2వ స్థానమున కుజుడుండుట వలన శరీరమును చంపినపుడు ముఖమును చిదిగిపోవునట్లు చేశాడు. 21వ తేదీ రాత్రి 9-25 నిమిషముల నుండి 11-37 నిమిషముల వరకు కటకరాసి మీద సూర్యుడుండుట వలన కుజ గురువులకు మరింత అనుకూలమైనది. అందువలన ఆ దిన రాత్రి 9-25 నిమిషాల నుండి హంతకులు సర్వసిద్ధముగ వేచి ఉండడము జరిగిందని తెలియుచున్నది. 9-25 ముందు కాని, 11-37 తర్వాత గాని సంఘటన జరిగి ఉండిన రాజీవ్ ప్రాణాలతో బయటపడే అవకాశముండేదని తెలియుచున్నది. ఇన్ని విషయముల బట్టి చూస్తే జ్యోతిష్యము తప్పు కాదు కాని దానిని తెలుసుకోవడములో పొరపాటు ఉండవచ్చునని తెలియవలయును.

**363. రాజీవ్‌గాంధీ మరణము పొందాడు కదా! ఆయన పూర్తిగ చనిపోయి నట్లా లేక భౌతికముగ చనిపోయి మానసికముగ బ్రతికి ఉన్నాడా?**

జ. రాజీవ్‌గాంధీ గారు పూర్తిగ చనిపోలేదని, భౌతికముగ మనకు కనిపించ కున్నను మానసికముగ ఆయన జీవించి ఉన్నాడని చెప్పవచ్చును. **చనిపోయినపుడు యోచించడానికి అవకాశము లేని చావులన్నియు పూర్తి మరణము కాదని, వారికి భూమి మీద ఆయుస్సు ఇంకనూ ఉన్నదని ఆధ్యాత్మికరీత్య చెప్పవచ్చును.** జ్యోతిష్యరీత్యా జనన కుండలియందు మరణ స్థానము 12వ రాశియైనందు వలన, ఆ స్థానాధిపతి బుధ గ్రహమైనందు వలన బుధ గ్రహ అనుకూలతగలవారికి మిధున కన్యా లగ్నములు 12 వ స్థానమై ఉంటే, అట్టి వారు మరణించినపుడు

పూర్తి మరణించక భౌతికముగ మాత్రమే పోయి మానసికముగ మిగిలి ఉందురని చెప్పవచ్చును. 21వ తేదీన కుజగ్రహము కటకము నుండి నాల్గవరాశియైన తులను చూచుట వలన తులారాశి శరీర స్థానమై ఉండుట వలన రాజీవ్ శరీరముగ మాత్రమే చనిపోయాడు. జననమున శని మేష రాశిని చూచుట వలన కూడ మానసికముగ బ్రతికి ఉన్నాడని చెప్పవచ్చును.

**గంగాధర, చెట్టుగుట్టపల్లి**

**364. నాద బ్రహ్మమని, నాదమును ఇంపుగ వినుట చేత బ్రహ్మ తెలియబడునని అంటారు నిజమా?**

జ. 'నాదము' అనగ శబ్దము కదా! అది పంచ భూతములలోని నీరు ఆకాశము ద్వార పుట్టినది. ప్రకృతి జనితమైనదని తెలియుచున్నది. కావున నాదము ప్రకృతియే కాని పరమాత్మ కాదు పెద్దగ పేరుగాంచిన గురువులు సహితము నాద బ్రహ్మమనుట మేము కూడ విని ఉన్నాము. వారి మాట ప్రకారము నాదము బ్రహ్మయైనపుడు దృశ్యము కూడ బ్రహ్మమే అగును. దానిని దృశ్య బ్రహ్మ అనవచ్చును. నాదముతో కూడిన సంగీతమును వినుటయందు మనస్సు నిలబడి బ్రహ్మను చేరవచ్చునన్నపుడు, దృశ్యముతో కూడిన టీవీ చిత్రములు చూస్తు మనస్సు లగ్నము చేసి బ్రహ్మను పొందవచ్చుననడములో తప్పులేదు కదా! అటువంటపుడు నేటి కాలములో నాదమును వినిపింపజేయు రేడియో శబ్దమును, కనిపింపజేయు టి.విలు మోక్షమును చేర్చు పరికరములుగ, పూజింపదగిన వస్తువులుగ చెప్పవచ్చును. విన్నన్న చెప్పినదే వేదమనట్లు నేడు కాషాయవస్త్రములు వేసుకొన్న ప్రతివారిని గొప్ప గురువులుగ ప్రజలు నమ్ముచున్నపుడు, వారు నాద బ్రహ్మ అనిన, దృశ్య బ్రహ్మ అనిన నమ్మేవారము మనముండగ వారిదేమి తప్పున్నది. నీవు నిజమడి గావు కావున నాద బ్రహ్మయనుట శుద్ధ తప్పు.

**365. నాదము బ్రహ్మయని నాదములో గొప్ప శక్తి ఉన్నదని, రాగముల వలన రోగాలు పోతాయని అంటుంటారు అదియు నిజమా?**

జ. నాదము ప్రకృతియని దైవముకాదని పై ప్రశ్నకు సమాధానములో తెలిపాము. నాదమునకు దైవశక్తి లేదు. నాదము వింటున్నపుడు మనోరంజకముగ ఉండి కొన్ని బాధలను మరపింపవచ్చును. కాని నాదము వలన రోగములు పూర్తి నయమవుతాయనడము పొరపాటు. నాదము వింటున్నపుడు మనస్సు నాదము మీద లయమై ప్రస్తుత రోగ బాధకాని, మనో బాధనుకాని మరచి పోవచ్చును. అంతమాత్రమున రాగాల వలన రోగాలు పోతాయనడము సమంజసము కాదు. రాగాల వలన రోగాలు పోవుకాని, రోగాల వలన రాగాలు రాగలవని తెలిసి పోయింది. రాగము అనగ లయబద్ధమైనది. ఒక్కొక్క లయకు ఒక్కొక్క రాగమని పేరు వచ్చినది. అటువంటి రాగములు పూర్వము ఎలా పుట్టాయని యోచించిన, ఒక మనిషి బాధలో చిక్కుకొన్నపుడు అతని నుండి ఒక లయబద్ధమైన శబ్దము పుట్టుకొచ్చినది. అవియే రాగాలుగ పేరు పొందినవి. ఉదాహరణకు ఒకనికి తీవ్రముగ జ్వరము వచ్చినపుడు శరీరములోని బాధకు వానికి తెలియక ఒక రకమైన మూల్గుడు ఏర్పడును. అది లయబద్ధమై ఉండును కావున ఆ నాదమును ఒక రాగముగ చెప్పవచ్చును. అట్లే కష్టము వచ్చి బ్రతకడానికి బరువైనపుడు ఒకనికి దేవుడు గుర్తుకు వచ్చి తనకు చెప్పకనే తన నోట దేవుని గురించిన ఒక లయ బద్ధమైన వాక్యము.

"నీ......వు ఇలా....... చేయుదువా...........

నే........ను ఎలా.........బ్రతుకనూ......" ఈ విధముగ వచ్చినదట. రాగమనగ లయ బద్ధమైనది కావున ఇది కూడ ఒక రాగమైనది. వాస్తవమును యోచించితే మనిషియందు సంతోషము కాని దుఃఖము కాని కలిగినపుడు అతడు మామూలుగ మాట్లాడ లేక తన మనసులోని భావమును దీర్ఘముగ చెప్పును. అవియే అనేక సందర్భములలో అనేక రాగములైనవి. తిరిగి మన మాటకొస్తే రోగాల వలన రాగాలు వచ్చిన మాట కూడ నిజమే. చలి జ్వరము వచ్చిన ఓ హో హో, ఓ హో హో అనడము, జ్వరము వచ్చినపుడు ఊ... ఊ.. అనడము తలనొప్పి వచ్చినపుడు అబ్బా అబ్బా అనడము సహజముగ మీ అందరికి తెలిసే ఉండును.

ఇవి కూడ ఒక రకమైన రాగాలే. రాగాల వలన రోగాలు పోవు, కాని రోగాల వలన రాగాలు వచ్చుననుట వాస్తవము.

**చింతా లక్ష్మీనారాయణ, నరసాపురము**

**366. అహంకార మమకారములు అనగానేమి? అవి రెండు ఒకటేనా?**

జ. అహం అనగ నేను అనియు, మమ అనగ నా యొక్క అనియు అర్థము అహంకార మనగ శరీరముతో సహ కూడు కొని నేనను భావము. మమకారమనగ నా, నా యొక్క అని అర్థము. అర్జునుడు మొదట యుద్ధములో నా బంధువులు అని, మమకారమును పొందాడు. మమకారమనిన మోహ గుణము అనిన రెండు ఒక్కటేనని తెలియాలి. దీనిని బట్టి అహంకార, మమ కారములు వేరు వేరని తెలియుచున్నది.

**డి. చెన్నప్ప, న్యామద్దల**

**367. ద్విజులు అనగా ఎవరు?**

జ. ద్విజులు అనగ రెండవ జన్మ నెత్తిన వారని అర్థము సర్వ సాధారణముగ బ్రాహ్మణులను పూర్వము నుండి ద్విజులు అనడము జరుగుచున్నది. బ్రహ్మ జ్ఞానము తెలిసిన వారు ద్విజులు. మామూలుగ ఒక మనిషి అజ్ఞానములో జన్మించి, అజ్ఞాన జీవితమునకు స్వస్తి చెప్పి, అనగ అజ్ఞాన జీవితములో మరణించి జ్ఞాన జీవితము క్రొత్తగ కొనసాగించడమని అర్థము. అజ్ఞానములో మరణించి జ్ఞానములో జీవించుచున్న వారిని రెండవ జన్మ ఎత్తినవానిగ లెక్కించి అట్టి వానిని ద్విజులు అనెడివారు. దీనిని బట్టి అజ్ఞానమును వదలి జ్ఞాన మార్గమవలంభించిన వారెవరైన ద్విజులని తెలియుచున్నది.

**శివారెడ్డి, గూడూరు**

**368. మనిషికి ఆయుస్సు 100 సంవత్సరములు అంటారు నిజమా? మనిషి నూరు సంవత్సరములకంటే ఎక్కువ బ్రతకలేడా?**

జ. మనిషికి ఆయుస్సు నూరు సంవత్సరములనడము పరిపాటి అయినప్పటికి జ్యోతిష్య శాస్త్రరీత్య మనిషి స్థూలశరీరముతో 120 సంవత్సరముల వరకు జీవించవచ్చునని చెప్పవచ్చును. స్థూలశరీరముతో నూరుకు పైన నూట ఇరవై వరకు బ్రతికిన వారున్నారు. అయితే సూక్ష్మ శరీరమునకు ఆయుస్సు ఇంత అని చెప్పుటకు ఇంత వరకు ఆధారాలు మనకు లభించలేదు. స్థూలముగ చనిపోయిన వ్యక్తి సూక్ష్మముగ కొన్ని వందల సంవత్సరాలు బ్రతికి ఉన్నట్లు అనేక ఆధారాలు దొరికాయి. అందరు సూక్ష్మముగ బ్రతుకుతారన్న ఆధారాలు లేవు. కేవలము కొందరు మాత్రము అలా బ్రతికి ఉన్నట్లు తెలియుచున్నది. అలా సూక్ష్మముగ ఎంత కాలము బ్రతకవచ్చుననుటకు కూడ ఆధారాలు లేవు. అందువలన మనిషి యొక్క స్థూల శరీర ఆయుస్సును 120 సంవత్సరములు అని చెప్పవచ్చును కాని సూక్ష్మము యొక్క ఆయుస్సు ఇంత అని చెప్పలేము.

**విశ్వనాథ్, జలదుర్గము**

**369. ఇంద్రలోకములో స్వర్గము, యమలోకములో నరకము కలవనుట నిజమేనా?**

జ. ప్రత్యేకించి ఇంద్రలోకము అందులో స్వర్గము లేదు. అట్లే యమలోకము అందులో నరకము కూడ లేవు. వాస్తవానికి స్వర్గము నరకము రెండు ఉండడము వాస్తవమే, అయినప్పటికి అవి ప్రత్యేకమయిన లోకములలో లేవు. ప్రజలకు అర్థమగుటకు కొందరు ఆ విధముగ వర్ణించి చెప్పారు. మనిషి చేసుకొన్న పాప పుణ్యములను బట్టి నరకము స్వర్గము అనుమాట నిజమే. పాప పుణ్యములు ఎక్కడ అనుభవించబడుచున్నవో అక్కడే స్వర్గ నరకములు గలవు. పాప పుణ్యములు వెనుకటి జన్మలవి, ఈ జన్మలోను, ఈ జన్మవి రాబోవు జన్మలలోను అనుభవించడము జరుగుచున్నది. మనిషి చనిపోయిన వెంటనే మరుజన్మకు పోవడము జరుగుచున్నది. అలా చచ్చిన వెంటనే జన్మలు కలుగుటవలన ఇంద్రలోకమునకు పోవడము, నరకలోకమునకు పోవడము జరగడము లేదు. మరణించిన వెంటనే

మరుజన్మకు పోవు జీవునికి మరి ఏ ఇతర లోకములకు పోవు వ్యవధిలేదు. ఎవడు చేసుకొన్న పాప పుణ్యములను వాడు భూమి మీదనే కష్ట సుఖముల రూపములో అనుభవించవలసి ఉన్నది. అనుభవించు సుఖములను స్వర్గమని అట్లే అనుభవించు కష్టములను నరకమని అనడము జరుగుచున్నది. అనుభవించు స్థితిగతులను బట్టి స్వర్గ నరకములంటున్నాము గాని అవి ప్రత్యేకించి పైన ఎక్కడోగలవను కోవడము పొరపాటు. ఒకే భూమి మీద మనుషుల గుణముల ప్రవర్తనల అనుభవములను బట్టి ఎన్నో లోకములు గలవు. ముఖ్యముగ మూడు లోకములు గలవు, అందులో ఒక్కొక్క దానియందు స్వర్గ నరకలోకములనునవి గలవు. మూడు లోకములలోను మూడు స్వర్గలోకములు, మూడు నరకలోకములు గలవు. ఇవన్నియు భూమి మీద గల మనుషుల తలలలో గలవని ఇతరత్రా ఏమి లేవని తెలియాలి.

**370. జీవితములో పెళ్ళి చేసుకోవడము మంచిదా, చేసుకోకుండడము మంచిదా?**

జ. జీవితములో పెళ్ళి అనునది రెండు రకములుగ ఉన్నది. ఒకటి బాహ్య ప్రపంచ సంబంధము, రెండవది ఆధ్యాత్మిక సంబంధము. ఆధ్యాత్మికమైనది ఎవరికి తెలియదనుకుంటాము. ప్రపంచములో జరుగు పెళ్ళి మాత్రము అందరికి తెలియును. ఒక మగవాడు ఒక ఆడమనిషిని జీవిత భాగస్వామిగ చేసుకోవడము పెళ్ళి అని మనమందరము అనుకుంటుంటాము. ఎవరేమనుకొనిన ప్రకృతి సంబంధమైన పెళ్ళిని ఆధారముచేసుకొని పరమాత్మ సంబంధమైన పెళ్ళి వివరము తెలియునట్లు పెళ్ళిలో ఆచారములను ఇరికించి పెట్టారు. పెళ్ళి అను వివరము తెలిసి పెళ్ళి చేసుకోవడము మంచిది. పెళ్ళి చేసుకోకుండ పోవడమువలన పెళ్ళి వివరమే తెలియకుండ పోవడమేకాక దైవము నిర్మించిన పద్ధతికే వ్యతిరేఖమగును. కావున పెళ్ళి చేసుకోవడము మంచిదే కాని వివరము తెలిసి చేసుకోవడము మరిమంచిది.

**371. పరమాత్మ కోడిగ్రుడ్డు ఆకారములోనున్నదని కొందరు ఎర్రని బొమ్మను చూపిస్తున్నారు అది నిజమా?**

జ. ఆకారము లేనివాడు పరమాత్మయని దేవుడే దిగివచ్చి చెప్పాడు. తనకు ఆకారములేదని గీతలో పరమాత్మయే స్వయముగ చెప్పి ఉండగ, ప్రత్యేకించి ఇంద్రియాతీతుడనని చెప్పి ఉండగ, మనుషులు పరమాత్మ ఇలా ఉన్నాడని ఒక ఆకారమును చూపడము విచిత్రము. ఏ ఆధారముతో వారు పరమాత్మకు రూపము కల్పించారో చెప్పలేము కాని శాస్త్రబద్ధముగ పరమాత్మకు ఆకారము లేదు.

**372. కామము, క్రోధము, లోభము, మోహము, అహము అను ఐదుగుణములు మానవున్ని నరకమునకు పంపుచున్నవంటున్నారు. గుణములు ఆరా లేక ఐదా?**

జ. శత్రు వర్గ గుణములు ఆరు, మిత్రవర్గ గుణములు ఆరు ఒక గుణ భాగములో గలవు. కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్య అను ఆరు గుణములు శత్రువర్గములోనివి. పై ప్రశ్నలో శత్రువర్గములోని నాల్గు గుణములను చెప్పి ఏ మాత్రము గుణముకానిది, శరీరములో ఒక ఇంద్రియ భాగమైన అహమును గుణములలో కల్పి చెప్పడము శుద్ధ తప్పు. శరీర అవయవములు వేరు, గుణములు వేరు. శరీర భాగములు 25 కాగ, గుణములు ఒక రకము ఆరు, మరొక రకము ఆరు ఒక భాగములో గలవు. శరీరములోని 25 భాగములలో గల అహమును గుణములలో చేర్చి, మదము మత్సరములను తీసివేయడమును చూస్తే, శరీరమును గూర్చి దానిలోపలి యంత్రాంగమును గూర్చి ఏమి తెలియనివారు చెప్పిన మాటయని తెలియుచున్నది. అహము గుణమేకాదని గుణములు ఆరు గలవని తెలియాలి.

**373. యుగములు నాలుగని ఒక్కొక్క యుగము 2500 సంవత్సరములని కొందరంటున్నారు మీరేమంటారు?**

జ. ఆధారము శాస్త్రబద్ధత లేకుండ 2500 సంవత్సరములు ఒక యుగమని

చెప్పుట సరికాదు. అలా చెప్పడానికి దానికొక పద్ధతి కలదని వివరించి చెప్పాలి. ఒక యుగము నిర్ణయింపబడుటకు దాని వెనకల ఎంతో వివరణతో కూడిన లెక్కాచారముండాలి. నా ఉద్దేశ్యములో నాల్గుయుగములు ఒకే కొలతలో లేవు. నాల్గు యుగములు 4,3,2,1 కలిపితే 10 అగునట్లు నిర్ణయించి పెట్టారు. మొదటి కృతయుగము చివరి కలియుగముకంటే నాలుగింతలు పెద్దదిగ నిర్ణయించి మూడింతలు త్రేతాయుగము, రెండింతలు ద్వాపరయుగము, ఒక్కింత కలియుగమును నిర్ణయించారు. చివరి కలియుగమును ఆధారము చేసుకొని రెండింతలు మూడింతలు నాలుగింతలని యుగములకు లెక్క కల్పించారు. కలియుగము 4,32,000 సంవత్సరములు అని నిర్ణయించారు. కలియుగము సంఖ్యయే ముఖ్య ఆధారమైనది. ప్రపంచములో జగతికి సంబంధించిన విధానమిది కావున జీవరాసికి ఉన్న గుణములు 12 అని, అవి ఒక్కొక్కటి 9 భాగములుగ చీలినవని, అన్నిటిని లెక్కించగ 12 X 9 = 108 అని, 108 కోట్ల సంవత్సరములు జగతి ఉండునని, ఆ 108 కోట్ల సంవత్సరములు వెయ్యి యుగముల కాలమని, యుగములు నాల్గు అయినందు వలన వెయ్యి యుగములలో ఒక్కొక్క యుగము 250 మార్లు వచ్చునని, 1000 % 4 = 250 అని లెక్క ఉన్నది. వెయ్యి యుగములు అయిపోయిన వెంటనే ప్రపంచ ఆయుస్సే అయిపోవునని సర్వము ప్రళయము చెందునని గీతయందు కూడ చెప్పబడి ఉన్నది. ఇంత వివరముండగ ఏ వివరము లేకుండ 2500 సంవత్సరములు ఒక యుగమనుట సరియైన పద్ధతి కాదంటాము.

**374. 1999 సంవత్సరమునకు కలియుగాంతమని కొందరు, 1994 సంవత్సరమునకు ప్రళయమేర్పడునని కొందరు చెప్పియున్నారు. వారు చెప్పినట్లు ఏది జరుగలేదు. వారెందుకలా చెప్పారు?**

జ. ఈ విషయము 1990 సంవత్సరములోనే మాకు తెలిసినది. చెప్పిన వారు పెద్ద ఆధ్యాత్మిక గురువులని పేరుగాంచిన వారు. కావున వారి మాటలను

కొందరు విశ్వసించారు. ఎవరు నమ్మిన అది జరుగలేదు. మాకు తెలిసినపుడే ఇది జరుగుటకు అవకాశమే లేదన్నాము. మేము అలా చెప్పుటకు ఎన్నో ఆధారములున్నవి. వేయి యుగములు అయిపోవునంతవరకు ప్రళయమురాదని గీతలో చెప్పబడినది. ఇది వెయ్యో యుగమైనప్పటికి కలియుగము పూర్తి కావలసి ఉన్నది. 4,32,000 సంవత్సరముల కలియుగ కాలములో కేవలము 5 వేల 150 సంవత్సరములే జరిగినది. అందువలన ఏ విధముగ చూచిన 1994 కాని, 1999 గాని జగతి అంత్యముకాదని తెలియుచున్నది. అంత్యమవుతుందని చెప్పినవారు ఎందుకు అలా చెప్పారో తెలియదు. బహుశ కొందరి దృష్టిని ఆకర్షించుటకు, మేము గురువులమని గుర్తింపు తెచ్చుకొనుటకు అలా చేసియుందు రనుకొంటాము. దూరదృష్టి శాస్త్ర ఆధారము లేకుండ మాట్లాడినవారు ఎప్పటికైన అవమానముల పాలగుదురని ఈ విషయముతో తేలిపోయినది.

**375. మీకు ఆహార నియమములున్నాయా?**

జ. ఆహారనియమములు ఏమాత్రము లేవు. ఇతరులకు నచ్చునట్లు నేను నడువాలనుకోలేదు. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము నడువాలనుకొన్నాము. బ్రహ్మ జ్ఞానియైన వానికి ఆహారనియమములంటూ ఏవీ లేవు. ఆహారము శరీరమునకు మాత్రమేనని, మనోబుద్ధులకు గుణవిషయములే ఆహారములని తెలియాలి. అపుడు బయటి ఆహారము మీద ధ్యాసమాని లోపలికి ధ్యాసనుంచును. విషయాల ఆహారము మీద నియమనియంత్రణలుంచుచు, జ్ఞానమను ఆరోగ్యమును కాపాడుకోవలసి ఉన్నదని తెలియాలి. బయటి ఆహారము శరీర ఆరోగ్య అనారోగ్యమునకే గాని లోపల మనో బుద్ధుల ఆరోగ్యములకు గాదు. కావున మాకు ఆహారనియమములు లేవు.

**376. మీరు యోగసాధన ఎంతసేపు చేస్తుంటారు.**

జ. నేను ఎపుడు యోగసాధన చేయలేదు. నేను యోగిని కూడ కాను. మీకు కొంత ఆశ్చర్యమై ఉండవచ్చును. యోగి కానపుడు యోగీశ్వరులని పేరెందుకు

పెట్టుకొన్నారని అడుగవచ్చును. యోగసాధన చేయకనే, యోగికాకనే యోగీశ్వరుడెలా అగుదురని కూడ కొందరడుగవచ్చును. దానికి సమాధానము ముందు జన్మలో యోగినయ్యానేమో, యోగసాధన చేశానేమో, కాని ఈ జన్మలో మాత్రము ఏమి చేయలేదు. నేనిపుడు యోగిని కాను యోగులకధిపతియైన యోగీశ్వరుడనని చెప్పుకొనుట మాత్రము సత్యమే. యోగీశ్వరుడని చెప్పుట వలన నీవు నమ్మకూడదు. నీ జ్ఞానమును ఉపయోగించి చూచి నేనెలా అర్థమైతే అలా అనుకోవడము మంచిది.

**377. జ్ఞానము తెలిసిన స్వాములు, కొందరు జ్యోతిష్యులు, కొందరు మూలికావైద్యులు గడ్డము, జుట్టు పెంచియుందురు ఎందుకు?**

జ. కొన్ని వేల సంవత్సరముల పూర్వము మూలికా వైద్యులు, తపస్వికులు కొందరు స్వాములు అడవులలో నివశించెడివారు. అడవులలో నివశించెడివారికి తల గడ్డము కొరుగు మంగళివారు దొరకకపోవడము వలన జుట్టు గడ్డము పెంచెడివారు. ఆ కాలములో ఇప్పటివలె రైజర్లు, బ్లేడులు కూడలేవు. ఎవరంతకు వారు గడ్డము తీసుకొనేదానికి కూడ అవకాశము లేదు. అందువలన పూర్వము అడవులలోని వారు జుట్టు గడ్డము పెంచెడివారు. ఇప్పటి కాలములో ఇంటి ప్రక్కలో మంగళి షాపు ఉండిన, ఎన్నో రకముల రైజర్లు బ్లేడులు ఉండిన, జుట్టు గడ్డము పెంచుకోవడములో అర్థము లేదు. పూర్వము అవకాశము లేక వాళ్ళు పెంచితే అవకాశముండి వీళ్ళు పెంచడము విచిత్రముగ ఉన్నది. ఆలోచిస్తే కేవలము వేషధారణ కొరకు, ఇతరులను ఆకర్షించుటకు ఆ విధముగ పెంచుచున్నారని తెలియుచున్నది. శుభ్రముగ షేవింగ్ చేసుకొన్న వానికంటే జుట్టు గడ్డమున్నవాడు గొప్పగ కనిపించడమే ఇక్కడి విశేషము. అందువలన తెలిసిన వారు, తెలియనివారు అందరు తమకేదో తెలిసినట్లు ఇతరులకు తెలియాలని ఆ విధముగ పెంచుకొనుచున్నారు.

**378. సంఖ్యలలో తొమ్మిది సంఖ్యకు ఎక్కువ ప్రాధాన్యత ఉన్నదంటారు ఎందుకు?**

జ. జీవుడు శరీరములో నివశిస్తున్నాడని అందరికి తెలుసు. శరీరములో ఉండి కర్మననుభవిస్తున్నాడని కూడ తెలుసు. మనము నివశించు శరీరమునకు తొమ్మిది రంధ్రములు గలవు. అలాగే మనము నివశించు శరీరములో కర్మను పాలించు గ్రహములు కూడ తొమ్మిదే గలవు. జీవుడు ప్రపంచములో నివశించుటకు ముఖ్యము శరీరము, కర్మ అని తెలియుచున్నది. జీవునికి ముఖ్యమైన శరీరము, కర్మ తొమ్మిదితో ముడిపడి ఉన్నవి. ఎటువంటి జీవుడైన తొమ్మిది రంధ్రముల శరీరములోనే ఉండాలి. అలాగే ఎటువంటి కర్మనైన తొమ్మిది గ్రహములచేతనే అనుభవించాలి. ఎన్ని కర్మలైన చిన్న కర్మయిన పెద్ద కర్మయిన ఎన్ని లక్షల కర్మలైన తొమ్మిది చేతనే అనుభవించాలి. కావున గణిత శాస్త్రములో కూడ 9 సంఖ్యను గుర్తింపుగ పెట్టారు.

1 నుండి 9 వరకు 9ని హెచ్చించిన వచ్చిన రెండు సంఖ్యలను కూడగ తిరిగి 9 వస్తున్నది.

9 X 1 = 9 - 9
9 X 2 = 18 - 9
9 X 3 = 27 - 9
9 X 4 = 36 - 9
9 X 5 = 45 - 9
9 X 6 = 54 - 9
9 X 7 = 63 - 9
9 X 8 = 72 - 9
9 X 9 = 81 - 9
9 X 10 = 90- 9

ఈ విధముగ గుణితములో చివర వచ్చిన మొత్తమును కలిపితే తొమ్మిదే అగుచున్నది. తొమ్మిది కర్మకు గుర్తు, జన్మించు శరీరమునకు గుర్తు.

**హరినారాయణ, జలదుర్గము**

**379. యోగములో రకములున్నట్లు జ్ఞానములో రకములున్నవా?**

జ. జ్ఞానములో ప్రపంచ జ్ఞానము, పరమాత్మ జ్ఞానమని రెండు రకముల జ్ఞానములు గలవు. ప్రపంచ జ్ఞానము దైవవిరుద్ధతను అధర్మములను తెల్పును. పరమాత్మ జ్ఞానము ప్రకృతి విరుద్ధతను ధర్మములను తెలియజేయును.

**380. చిన్న మొక్కలకు పెద్ద చెట్లకు ఒకే పచ్చదనమున్నప్పటికి వాటికి పూయు పూలు అనేకరంగులుగ అనేక రకములుగ ఉన్నవి. అన్ని చెట్ల ఆకులకు ఒకే పచ్చదనమున్నట్లు అన్ని చెట్ల పూలు ఒకే రంగు పూయక అనేక రంగులుగ ఎందుకు పూయుచున్నవి?**

జ. పూలవలె అనేకరకముల జీవరాసులున్నప్పటికి, ఆకుల పచ్చదనమువలె అందరిలో ఒకే దేవుడున్నాడని మనుషులు తెలియునట్లు ఒక గొప్ప సందేశాన్ని ఇచ్చుచున్నవని తెలియుచున్నది. అన్ని చెట్లకు ఒకే పచ్చదనమున్నట్లు అందరిలోను ఒకే దేవుడు గలడు. అనేక రంగులు అనేక రకముల పూలున్నట్లు రక రక శరీరములతో, రక రక కర్మలతో జీవులున్నారు.

**381. మత్తుపదార్థములు ఆహారపదార్థములు అవునా కాదా?**

జ. ఆహార పదార్థములలోనికి మత్తుపదార్థములు చేరవు. ఆహార పదార్థములు వేరు, మత్తు పదార్థములు వేరు. విషమునకు, మత్తుకు సంబంధము గలదు. పాము విషము విపరీతమైన మత్తు కల్గించి మనిషిని చంపును. కావున మత్తు పదార్థములు విషముతో సమానము. మత్తు ఆత్మ చైతన్యమును మభ్యపరచి ఆత్మనే పని చేయకుండ చేయగలదు. ఆత్మకు హాని చేయునది మత్తు. ఆహారము ఆత్మకు కావలసిన శక్తికొరకు వినియోగపడుచున్నది. మత్తు ఆత్మకున్న శక్తినే హరించి వేయుచున్నది. ఆత్మకు చెడుపు చేయునది మత్తు కావున, మత్తు పదార్థములు సేవించువారికి పెద్ద పాపము కూడ సంభవించును.

**382. ఇందూమతము క్షీణించుటకు ఇతరమతములు అభివృద్ధి అగుటకు కారణమేమిటి?**

జ. ఇందూమతము హిందూమతము అను పేరుతో సహా మార్పు చెందడము, ఇందూమతము యొక్క ఆచారములు వాటికి అర్థములు తెలియకుండపోవడము, ఇందూమతములో ప్రభుత్వము గురువులకు విలువనివ్వకపోవడము, ఇందూ మతము శాస్త్రబద్ధత లేకుండ మారిపోవడము, జ్ఞానము తెలుసుకోవలెనను శ్రద్ధ లేకుండ పోవడము మొదలగు అనేక కారణములతో ఇందూమతము క్షీణించు చున్నది. ఇతర మతముల వాటి ధర్మములు బాగా ప్రచారము కావడము, ఇతర మతముల గురువులు వారి దేశములకే రాజులుగ వర్తించడము, మతము ఎడల శ్రద్ధ మరియు ఎన్నో పద్ధతుల వలన ఇతరమతములు అభివృద్ధి అగుచున్నవి.

**383. అచలమనగా నేమి?**

జ. ఈ ప్రశ్నకు కొందరు చలనము లేనిదని చెప్పుచున్నారు. అటువంటపుడు అచలనము అని చెప్పవచ్చును కదా! అచలనమనక అచలమని మధ్యలో "న" ను ఎందుకు లేకుండ చేశారని అడుగగ దానికి సరియైన జవాబు చెప్పక మా పెద్దలిలానే చెప్పారని దాటవేయుచున్నారు. వాస్తవముగ పూర్వము ఈ పదమును అచేలమనెడివారు. చేలము అనగ గుడ్డ అనియు, అచేలము అనగా గుడ్డ లేనిదనియు అర్థము. బట్ట బయలు అని, గుడ్డతీసితే బయలు కలదని, బయలును పరమాత్మయని, గుడ్డను మాయయని పోల్చి చెప్పారు. పరమాత్మను అచేలమని అన్నారు. అచలము అనగా అర్థమే లేదు. చిదంబర రహస్యము నుండి పుట్టినది బట్ట బయలు. బట్ట బయలుకు సంబంధమున్నది అచేలము అనుపదము. నిరాకార పరమాత్మ విద్యను నేర్చువారు పూర్వము మేము అచేల మార్గములోనున్నామనెడి వారు. కాల క్రమమున ఆ పదము మార్పుచెంది మేము అచల మార్గములోనున్నామంటున్నారు. అచలమనగా అర్థము లేదు. సరియైన పదము అచేలమని తెలియాలి.

## 384. అమనస్కమనగా నేమి?

జ. మనస్సులేని యోగమును అమనస్కమనుచున్నారు. గీతలో చెప్పిన బ్రహ్మ, కర్మయోగములలో కర్మయోగము అహములేనిదికాగా, బ్రహ్మయోగము మనస్సులేనిది. బ్రహ్మయోగమును మనస్సులేని యోగమని అర్థమొచ్చునట్లు అమనస్కయోగమని (అమనస్కమని) అంటున్నారు.

## 385. దేవాలయమునకు 'గుడి' అని ఎందుకు పేరొచ్చినది?

జ. పరమాత్మ ఇలా ఉన్నాడని తెలియజేయు చిహ్నములు గల దానిని దేవాలయమంటాము. పరమాత్మ ఆది అంత్యము లేనివాడు. ప్రతి దానికి మొదలు చివరలుండును. మొదలు చివరలు లేని పరమాత్మను సూచించుటకు మొదలు చివరలు లేని గుండ్రమును చూపారు. ఒక గుండ్రని బిందువుకు మొదలు చివరలు ఏమాత్రముండవు. పరమాత్మ చిహ్నమైన గుండ్రము నుండి గురువు అనే పదము కూడ పుట్టినదని ఒక వ్యాసములో కూడ చెప్పాము. గుండ్రమునే గుడి అని కూడ అందుము. తెలుగు భాషలో కూడ క కు గుడిస్తే కి అని అంటున్నాము. అనగా క పైన గుండ్రమునుంచడము వలన అది కి అగుచున్నది. అక్షరముల తలల మీద గుండ్రమును గుడి అంటున్నాము. నాశనము లేని పరమాత్మను, ఆది అంత్యములు లేని పరమాత్మను సూచించు దేవాలయమునకు అర్థముండునట్లు, మొదలు చివరలేనివాడు ఇక్కడున్నాడని తెలియునట్లు దేవాలయమును గుడి అని పూర్వమనెడి వారు. ఈ కాలములో గుడి అంటే వాస్తవముగ అర్థము తెలియదు.

## 386. విద్యాలయమునకు 'బడి' అని ఎందుకు పేరొచ్చినది?

జ. పరమాత్మకు వ్యతిరేఖమైనది ప్రకృతి. పరమాత్మ విద్యను తెల్పునది గుడి కాగ ప్రపంచ విద్యను తెల్పునది బడి. దేవునికి వ్యతిరేఖమైనది మాయ. అలాగే గుడికి బడికి ఎంతో తేడాగలదు. గుడిలోనున్నది పరమాత్మ చిహ్నములు కాగ, బడిలోనున్నదంత ప్రకృతి చిహ్నములేనని తెలియాలి. గుడి అనగా గుండ్రము, బడి అనగా వంకరలేనిది. గుండ్రముకు మొదలు చివరలుండవు. బడికి మొదలు

చివరలుండును. వంకరలేని కట్టెను బడె అనడము కొన్ని చోట్ల కలదు. మొదట చక్కని కట్టెను బడి అనెడివారు అది చివరకు బడె అయినది. ప్రస్తుత కాలములో ఆ పదము కూడ మరుగైపోయినది. గుడికి విరుద్దమైనది బడి అని గుర్తుంచు కోవలెను.

**387. జీతమనగా నేమి?**

జ. జీవితము సాగించుటకు ఉపయోగపడునదని వివరము. జీవితము సాగించుటకు ఆహార పదార్థములు కావలసి ఉండును ఆహార పదార్థములను సమకూర్చి జీవితము సాగించుటకు పనికి వచ్చు ఫలితమును జీతము అంటున్నాము. జీతమును పూర్వము జీవితము అని కూడ అనెడివారు. ఇపుడు కేవలము జీతము అని మాత్రము అంటున్నాము.

**388. ఉద్యోగమనగా ఏమిటి?**

జ. ఉత్తయోగము అనగా యోగము లేనిది లేక యోగము కానిదని అర్థము. జీవితము కొరకు అనగా బ్రతుకుదెరువు కొరకు చేయు పనిని ఉద్యోగము అంటున్నాము. ఉద్యోగము ఉత్త యోగము నుండి పుట్టినదని తెలియవలెను. జీవితము కొరకు చేయునది యోగము కాని ఉద్యోగము. మోక్షము కొరకు చేయునది ఉద్యోగము కాని యోగము. యోగము ఉద్యోగముల మధ్య తారతమ్యము తెలిస్తే మోక్షము జీవితముల మధ్య తారతమ్యములు కూడ తెలియును. జీవితమునకు ఉపయోగపడునది ఉద్యోగము. మోక్షమునకు ఉపయోగపడునది యోగము. ఉద్యోగము ప్రపంచ సంబంధమైనది, యోగము పరమాత్మ సంబంధమైనది.

## మొదటి భాగము సమాప్తము



# ఆధ్యాత్మిక ప్రశ్నలు - జవాబులు

## రెండవ - భాగము

ప్రశ్నలు జవాబులలో రెండవ భాగము ఇక్కడనుండి ప్రారంభమగుచున్నది. మొదటి భాగమంతయు పాఠకుల ప్రశ్నలకు మా జవాబులుండగా రెండవ భాగములో మేము జ్ఞాన పరీక్ష నిమిత్తము అడిగిన ప్రశ్నలు గలవు. **"ప్రబోధ సేవాసమితి"** అను సంఘములు అక్కడక్కడ ఆంధ్రదేశములో గలవు. ఆ సంఘములలోని సభ్యులకు మేము అపుడపుడు జ్ఞానపరీక్షలు నిర్వహిస్తుంటాము. అలా నిర్వహించిన ప్రశ్నలను ఆ నెలతో సహా ఎక్కడ నిర్వహించినది కూడా తెలుపుచూ, ఇపుడు రెండవ భాగములో ఇస్తున్నాము. ఈ రెండవ భాగములో ప్రశ్నలు మావే, జవాబులు మావే ఉంటాయని తెలియాలి. మేమడుగు ప్రశ్నలు ఎంత పొడవు పొట్టి ఉండినప్పటికీ, జవాబు మాత్రము ఒక పదము లేక ఒక వాక్యములో ఉండాలనునది నియమము. ఆ విధముగనే ప్రశ్న క్రింద జవాబు చిన్న పదము లేక వాక్యముగ ఇచ్చి తర్వాత పూర్తి వివరము క్రింద ఇచ్చాము.

### జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-28-01-1986**

**389. (1) గురుద్రోహము చేసిన శిష్యునికి కంటికి కనిపించని ఫలితము ఏమి ఉండును?**

జ. క్షమింపబడని పాపము.

**వివరము :** ఒక పని చేయగ అందులో కంటికి కనిపించని ఫలితమైన పాపమో లేక పుణ్యమో ఉండును. భూమి మీద పుట్టిన ప్రతి ఒక్కరికి ప్రతి నిత్యము కర్మలు అంటుకోవడము సహజము. పాప పుణ్యమనబడు కర్మలకు చిన్న పెద్ద అనిగాని, బీదవాడు రాజు అనిగాని తారతమ్యములుండవు. ప్రపంచ పరముగ చిన్న తప్పుకైన దానికి తగినంత పాపముండును. అలాంటపుడు సాక్షాత్తు గురువుకే ద్రోహము చేసిన వానికి ఎంత పాపముండునో చెప్పనలవి కాదు. పాపమొచ్చుటకు కారణమైన తప్పులలో కూడ రెండు రకములు క్షమించబడునవి, క్షమించబడనివి

గలవు. ఒకటి ప్రపంచ సంబంధమైన తప్పులు రెండు ఆధ్యాత్మిక సంబంధమైనవి లేక దైవ సంబంధమైన తప్పులు, అని చెప్పవచ్చును. ప్రపంచ సంబంధమైన ఎంత పెద్ద పాపమునైన పరమాత్మ క్షమించగలడు. పరమాత్మను శరణుజొచ్చిన వాని పాపమును క్షమించగలడు. దైవ సంబంధమైన ఎంత చిన్న తప్పునైన దైవము చేత క్షమించబడవు. గురుద్రోహము దైవ సంబంధమైనది కావున దైవముచేత క్షమించబడని పాపము చేకూరును. ఆ పాపము అనుభవమునకు వచ్చినపుడు భరించలేక భగవంతుని శరణుజొచ్చిన, భగవంతుని సంకల్పమునకు కూడ క్షమించబడక తప్పక అనుభవించ వలసివచ్చును. క్షమించబడని పాపముల పట్ల చాలా జాగ్రత్తగ ఉండవలెను.

**390. (2) ఉపదేశము పొందిన శిష్యునికి జ్ఞానశక్తి ఎక్కడి నుండి లభించును?**

జ. గురువు నుండి.

**వివరము :** గురువు సంపూర్ణ జ్ఞానకేంద్రము. గురువు జీవుడే కాక ఆత్మయు పరమాత్మయు అగును. శిష్యుడు జ్ఞానశక్తిని లేక జ్ఞానాగ్నిని పొందుచున్నాడంటే అది పరమాత్మ స్థాయివరకు ఉన్న గురువునుండియే లభించుచుండును. ఎన్నో బియ్యపు గింజలలో వడ్లగింజ ఒకటున్నట్లు భూమి మీదున్న ఎంతో మంది గురువులను వారిలో ఒకడే గురువుండును. ఆ గురువు చేత పొందినదే ఉపదేశము, ఆ గురువు నుండి వచ్చునదే జ్ఞానశక్తి అని తెలియవలెను. మిగత వారంత గురువులు కాదా? అను ప్రశ్నకు రెండు ఒకేజాతి అయినప్పటికీ, బియ్యము గింజ వడ్లగింజ వేరు వేరైనట్లు ఇద్దరు జ్ఞానము చెప్పువారే అయినప్పటికీ, గురువు వేరు బోధకుడు వేరు. కంటితో చూచిన, చెవితో వినిన విషయమును చెప్పువాడు బోధకుడు, కంటితో చూడని, చెవితో వినని విషయమును చెప్పువాడు గురువు.

**391. (3) శిష్యునికి దొంగతనము హత్యలు చేయమని చెప్పిన గురువు గురు పదమునకు అర్హుడా?**

జ. అర్హుడే.

**వివరము :** పనులు చేయునపుడు కర్మ అంటని విధానమును బోధించువాడే గురువు. చెడు పనులైన మంచి పనులైన కర్మరీత్య నిర్ణయించబడి ఉండునని తెలిసి, భవిష్యత్తులో అవి చేయకుండ ఉండవలెనంటే, మొదటనే కర్మను అంటించుకో కూడదని పద్ధతి ప్రకారము జరుగు పని ఏదైన చేయమని, అందులో వచ్చు కర్మ నుండి తప్పించుకోమని చెప్పువాడు గురువు. శ్రీకృష్ణుడు గీతను బోధించునపుడు అర్జునునికి యుద్ధములో హత్యలే చేయమన్నాడని మరచిపోకూడదు. ఒక శ్లోకములో ఎవని భావములో అహంకారము లేదో, వాడు ఇతరులను చంపినప్పటికి వాడు హంతకుడు కాడు అని చెప్పాడని కూడ మరువకూడదు. గురువు దొంగతనము హత్యలు చేయమని చెప్పిన, ఆ కర్మల నుండి బయటపడు విధానమును బోధించి ఉండును. కావున గురుపదమునకు అర్హుడే అగునని చెప్పవచ్చును.

**392. (4) ఒక సాధారణ మనిషి గురువును ఎట్లు గుర్తించును?**

జ. బోధించు ధర్మములను బట్టి.

**వివరము :** భూమి మీద ఎందరో స్వామీజీలు గురువులవలెనున్నారు. అలా అని అందరిని గురువులనుకోవడము పొరపాటు. గురువును గుర్తించుటకు ఒకే ఆధారమున్నది. ఎవడైతే గురువో అతను కేవలము ఆత్మ ధర్మములనే బోధించు చుండును. పురాణముల నుండి, కల్పిత కథల నుండి ఏ విషయమును తీసుకోక, వాటికి వ్యతిరేఖ ధోరణియైన శాస్త్రబద్ద ధర్మములనే బోధించువాడు గురువు. ఆ విధముగ కాక ఉదయము ఒక గంట భగవద్గీత, సాయంకాలమొక గంట పురాణ కాల క్షేపము చెప్పువాడు ఎంత పెద్ద స్వామీజీయైనప్పటికి గురువు కాదు. ఉదయము గాయిత్రి, సాయంకాలము సంధ్యావందనము చేయువాడు గురువు కాదు. గురువు ఆరాధనలు చేయువాడు కాడు. ముఖ్యముగ ఎచట అడుగంటిపోయిన అనగ ఎవరికి తెలియకుండ పోయిన ధర్మముల తెలియబడు చున్నవో, అచటనే గురువు గలడని గ్రహించవలెను. పెళ్లికానివాడని, కాషాయ వస్త్రములు ధరించువాడని, విభూతి నామములతో ఉండువాడని గురువునను

కోకూడదు. గురువు ఎటులైన కనిపించవచ్చును. ఆయన అన్నిటికి అతీతుడని తెలియాలి.

**393. (5) కామము తర్వాత మానవుని ఏ గుణము ఎక్కువ పీడించుచున్నది?**

జ. మోహ గుణము.

**వివరము :** కామము అనగ చాలా మంది పొరపాటుగ అర్థము చేసుకోవడము జరుగుచున్నది. కామమనగ కేవలము ఆశ అను గుణమని అర్థము చేసుకోవాలి. ప్రపంచములో మానవుడు ఎక్కువగ రెండు గుణములచేత బాధపడుచున్నాడని చెప్పవచ్చును. అలాగే మానవుని ఎక్కువగ తగులుకొను గుణములు మూడున్నాయి. అందులో కామము కూడ గలదు. తగుల్కొను గుణములు వేరు, బాధించు గుణములు వేరని తెలియాలి. కామ, క్రోధ అసూయ గుణములు ఎక్కువగ తగులుకొనగ, కామ మోహ గుణముల వలన ఎక్కువ బాధ ఉన్నది. పీడించు గుణములు అనగ బాధించు గుణములు కామము, మోహము అని చెప్పవచ్చును. నాది, నా, అను భావమును కల్పించునది మోహగుణము. అలాగే ప్రతి దానిమీద ఆశను కల్పించునది కామము. భూమి మీద మానవునికి ఎటు చూచిన ఆశ వలన, నాది అను దాని వలన, ఎక్కువ బాధ కల్గుచున్నది. నాది నావారనుకున్నది దూరమై పోయినపుడు, ఆశ నెరవేరనపుడు చెప్పరాని బాధ కల్గుచున్నది. అందువలన ఆశ తర్వాత మోహము, మోహము తర్వాత ఆశ మానవుని ఎక్కువగ బాధించుచున్నవని తెలియుచున్నది.

**394. (6) మాయ అనగా నేమి?**

జ. గుణముల సమ్మేళనము.

**వివరము : "గుణమయీ మమ మాయా"** అని భగవద్గీతలో భగవంతుడు తెలియజేసాడు. దీనిని బట్టి శరీరములో గల ఆరు చెడు, ఆరు మంచి గుణముల కూడికనే మాయ అంటున్నాము. మాయ అనగ మన శరీరములలోనే ఉన్నదని,

మనము మాయలోనే ఉన్నామని తెలిసి, మన శరీరములోని గుణములను బుద్ధితో తెలియవలెను. ఎవరు ఏది చెప్పిన గుణముల రూపముగ ఉన్న మాయను తెలియడము దుస్సాధ్యమని గీతలో కూడ చెప్పబడి ఉన్నది. ఎవరు తెలియనట్లు మనయందు పని చేయడమే మాయ యొక్క పని. దేవుని చేత తయారు చేయబడిన మాయ, దేవుని తర్వాత గలది మాయయే. మాయను తెలిసిన తర్వాతనే దేవుని తెలియనగును. దేవుని విశ్వసించిన తర్వాతే మాయను జయించవచ్చును. అందువలన మాయ దేవునంత ప్రాముఖ్యము కల్గి ఉన్నది.

**395. (7) మనస్ఫూర్తిగ నమ్మిన శిష్యుని గురువు ఏ విధముగ జూడవలెను?**

జ. శిష్యుని యోగ క్షేమములను గురువే చూడవలెను.

**వివరము :** మనస్ఫూర్తిగ నమ్మిన వానిని గురువు **"యోగ క్షేమం వహామ్యహం"** అని భగవద్గీతలో చెప్పినట్లు గురువు శిష్యుని యోగ క్షేమము వహించవలెను. యోగ మనగ యోగమని, క్షేమమనగ కూడు, గుడ్డ, ఆరోగ్యమని అనుకోకూడదు. యోగము యొక్క క్షేమము అని అర్థము చేసుకోవాలి. శిష్యుడు యోగములో అనారోగ్యమై యోగభ్రష్ఠుడు కాకుండ గురువు చూచుకోవాలని అర్థము. వాస్తవ ధర్మములను బోధించి, శిష్యుని యోగిగ చేసి, ఆ యోగము మంచి బలముగ ఉండునట్లు, బలహీనము కానట్లు చూడడము గురువు యొక్క బాధ్యత. అందువలననే గీతలో **"నన్ను నమ్మిన వాని యొక్క యోగక్షేమమును నేనే వహిస్తానని"** అక్కడి అర్జునునికి తెల్పాడు.

**396. (8) నీలో ప్రపంచ సంబంధమైనది, పరమాత్మ సంబంధమైనది ఏది గలదు?**

జ. ప్రపంచ సంబంధ మాయ, పరమాత్మ సంబంధ జ్ఞానము రెండు గలవు.

**వివరము :** అందరిలో ప్రపంచ సంబంధ మాయ తప్పనిసరిగ ఉండును. కొందరిలో మాత్రము పరమాత్మ సంబంధ జ్ఞానముండును. మాయ పుట్టినప్పటి నుండి ఉండును. జ్ఞానము మధ్యలోరావచ్చును, రాక పోవచ్చును. అందువలన అందరిలో

జ్ఞానముంటుందను నమ్మకము లేదు. కొందరిలో ఏమాత్రము జ్ఞానముండదు. బహుకొద్ది మందిలో జ్ఞానము కూడ ఉండును. అందరిలోను మాయ మాత్రము తప్పనిసరిగ ఉండును. కొందరిలో జ్ఞానముండిన మధ్యలో వచ్చిన జ్ఞానముకంటే ముందు వచ్చిన మాయ బలమైనదిగ ఉండును.

**397. (9) నీవు గురువును ఆశ్రయించినది ఎందుకు?**

జ. ఆత్మ జ్ఞానము తెలియుటకు.

**వివరము :** భూమి మీద ఎందరో గురువులుగ చలామణి అగుచుండగ, కొందరు కాలజ్ఞానమును అనగ భవిష్యత్తును చెప్పువారుగ, కొందరు పురాణములు చెప్పువారుగ కొందరు మౌనవ్రతము పూనిన వారుగ, కొందరు ఉడికిన అన్నము తినకుండ పండ్లు పాలు పెసరపప్పు తినువారుగ, కొందరు మత భక్తిని, మరి కొందరు రెట మత భక్తి (తామస భక్తి) ని బోధించువారుగ, కొందరు అచలమని, కొందరు దిగంబరులని ఇలా ఎందరో గురువులుగ చలామణి అగుచున్నారు. చివరకు గవ్వలు వేసి నీకిలా జరుగునని చెప్పువాడు కూడ గురువుగ ఉన్న ఈ కాలములో, గురువును ఎందుకు ఆశ్రయించవలయునో ఆశ్రయించు శిష్యులకే తెలియకుండ పోయినది. ఎందరో గురువులనాశ్రయించిన వారందరు వారి గురువువలె జ్యోతిష్య మల్లయ్యగానో, పురాణాల పూర్ణయ్యగానో, పెళ్లి లేని బ్రహ్మచారిగానో, అపక్వాహారము తిను స్వామిగనో తయారగుచున్నారు. ఎవరెటుల పోయిన మనము ఆత్మజ్ఞానము తెలియుకొరకే గురువును ఆశ్రయించవలెనని ఆత్మ జ్ఞానమునకు సంబంధించిన గురువువద్దే చేరవలెనని తప్పక తెలియాలి.

**398. (10) గురు సేవలు ఎన్ని అవి ఏవి?**

జ. నాలుగు, 1. స్థాన, 2. అంగ, 3. భావ, 4. ఆత్మ సేవలు.

**వివరము :** వీటిని మేము ఏమి ప్రత్యేకముగ చెప్పక అందరు చెప్పుకొన్నట్లు చెప్పితే గురువు నివశించు ప్రదేశమును, పరిసరములను శుభ్రముగనుంచడమును "స్థాన సేవ" అంటారు. గురు శరీరమునకు కావలసిన ఆహార పాణీయములు

సమకూర్చడము "అంగసేవ" అంటారు. మనస్సులో ఎంతో గొప్ప భావమును ఉంచుకొని ఆ విధముగనే నడచుకోవడమును "భావసేవ" అంటారు. గురువుగారు చెప్పినట్లు ఆచరించడము, ఆయన వాక్కు ఆత్మ నుంచి వచ్చినదని విలువివ్వడమును "ఆత్మసేవ" అంటారు. మేము ప్రత్యేకముగ చెప్పునదేమంటే పై నాలుగు సేవలు కొంత పరిమిత సేవలే అగునని, గురువు శరీరము ధరించి ఉన్నపుడు మాత్రమే చేయదగునవని, గురువుకు నాల్గుసేవలు చేసినను ఋణపడియే ఉంటామని, గురుఋణము పూర్తిగ తీరుటకు **"ఐదవసేవ"** అవసరమని అంటున్నాము.

**399. (11) గురుసేవలు చేయనివారు ఏమగుదురు?**

జ. గురువుకు ఋణపడి ఉందురు.

**వివరము :** గురుసేవలు చేయనివారు గురువుకు ఋణపడి జన్మలు పొందు చుందురు. గురు ఋణము కూడ కర్మతో సమానమే అగును. కొందరు గురువువద్ద కూడ తమ తెలివినుపయోగించి, తమకు శ్రమ ఖర్చు లేకుండ జ్ఞానమును లాగాలను కుంటారు. గురువు జ్ఞానము చెప్పిన అది వారివద్ద నిలువదని, పైగా గురువును మోసగించిన వారమగుదుమని వారికి తెలియదు. ఒక వేల జ్ఞానము వారి తలలో నిలిచిన అది ఋణమగునని, ఆ ఋణము సేవ రూపములో తీర్చుకోవలెనని తెలిసి, సేవ చేయనివారు అందరివలె కాక కొన్ని జన్మలయిన ఎత్తి జ్ఞానసేవ చేయవలసి ఉండును. అందువలననే భగవంతుడు భగవద్గీత భక్తియోగమను అధ్యాయములో **"మత్కర్మ పరమో భవ మదర్థ మపి కర్మాణి కుర్వాన్ సిద్ధి మవాప్స్యసి"** నా కొరకు కార్యములు చేయుము. నా కొరకు పని చేసిన తప్పక మోక్షము కల్గునన్నాడు.

**400. (12) ధర్మమనగా నేమి?**

జ. ఆత్మను తెలియజేయు శాసనము.

**వివరము :** ఆత్మ మరియు దాని విభాగములను తెలియజేయుటకు పరమాత్మ చేత ఏర్పరచబడిన శాసనములను ధర్మములు అంటాము. ప్రపంచమునకు

సంబంధించిన ధర్మములు వేరు, పరమాత్మకు సంబంధించిన ధర్మములు వేరుగలవు. ఏవైన శాసనములతో కూడుకొన్నవిగానే ఉండును. ధర్మమనగా నిర్ధిష్టమైన విషయమును తెలుపునది. అపుడప్పుడు మారునది ధర్మము కాదు. ఎప్పటికి ఒకే విధానముగ ఉండునది ధర్మము. ధర్మమును మనిషి ఆచరించితే ఆత్మలంటే ఏమిటో తెలియును.

**401. (13) నీ గురువుకు ఏ గుణములున్నవో తెలుపుము.**

జ. నా గురువుకు అన్ని గుణములున్నవి.

**వివరము :** మనము అంగీకరించిన అంగీకరించకున్న గురువు గురువేయగును. నీ గురువు నా గురువు అను భేదము లేకుండ గురువు అందరికి గురువే అగును. గురువును గుర్తించినవాడు నా గురువు అంటున్నాడు, గుర్తించలేనివాడు నీ గురువు అంటున్నాడు. నేను గుర్తించిన నా గురువుకు మొత్తము అన్ని గుణములున్నాయి. గురువుకు గుణములుండకూడదని అందరనుకుంటారు. అట్లు గుణములుంటే గురువుకు సాధారణ మనిషికి ఏమి తేడా అని కూడ కొందరు అడగవచ్చును. గురువుకు సాధారణ మనిషికి ఏమి తేడా లేదని మేము కూడ ఒప్పుకుంటున్నాము. భగవద్గీతలో కూడ జ్ఞానియు అజ్ఞానివలె వుండవలెనని భగవంతుడు చెప్పాడు. గురువుకు, సాధారణ మనిషికి కంటికి కనిపించని తేడా ఉండును. కాని కంటికి కనిపించు తేడా ఏమి ఉండదు. అందువలన నా గురువుకు అన్ని గుణములున్నాయని చెప్పుచున్నాను. అట్లే నా గురువుకు అందరివలె కర్మలు తగుల్కొనవని కూడ చెప్పుచున్నాను.

**402. (14) యుద్ధసమయములో అర్జుననకు ముందు వచ్చిన గుణమేది?**

జ. మోహ గుణము.

**వివరము :** నాది నావారనునది మోహ గుణమంటాము. యుద్ధసమయములో అర్జుననకొచ్చిన గుణమదియే. చాలామంది అర్జుననకొచ్చిన గుణము దయ అని ప్రేమ అని అనుకొనుట జరుగుచున్నది. ప్రేమ దయ పర్యవసానము వేరు,

మోహగుణము యొక్క పర్యవసానము వేరు. నాది నావారను ఉద్దేశ్యము మోహగుణము వలన వచ్చునది కావున అర్జుననకదియే కల్గి నా వారిని చంపనని కూర్చున్నాడు.

## 403. (15) నీవు ఎవరు?

జ. నేను క్షర పురుషుడనైన జీవాత్మను.

**వివరము :** నేను ఎవరు అన్నది చాలా ముఖ్యమైన ప్రశ్న. ఎవరంతకు వారు నేనెవరు అను ప్రశ్న వేసుకొంటే వారికి వారే జవాబు చెప్పుకోలేరు. వాస్తవముగ ఆత్మజ్ఞానము తెలిసిన వారికే ఈ చిక్కుముడి ప్రశ్నకు జవాబు దొరకగలదు. శరీరములో క్షరాక్షర పురుషోత్తములను ముగ్గురు పురుషులున్నారని భగవద్గీత చెప్పుచున్నది. క్షర పురుషుడు జీవాత్మకాగ అక్షర పురుషుడు ఆత్మగ ఉన్నాడు. ఇద్దరికంటే ఉత్తముడైన పురుషోత్తముడు పరమాత్మ అని చెప్పబడుచున్నది. వీరిలో మొదటివాడైన జీవుడే శరీరములో నేను అను వానిగ ఉన్నాడు. అందువలన నేను ఎవరు అను దానికి జవాబు నాశనమగు జీవాత్మనని చెప్పవలసి ఉన్నది. క్షరము అనగ నాశనము, అక్షరము అనగా నాశనము లేనిదని తెలియాలి.

## 404. (16) జ్ఞానమనగా నేమి?

జ. ఆత్మ ధర్మములను తెలుపునది.

**వివరము :** జ్ఞానమనగా తెలియబడునదని అర్థము. ఏది తెలియబడునదనగా ధర్మములనే చెప్పుకోవలసి ఉన్నది. ధర్మములు రెండు రకములని ప్రపంచ సంబంధ, ఆత్మ సంబంధ ధర్మములని ముందే చెప్పుకొన్నాము. ప్రపంచ సంబంధ ధర్మములు అందరికి కనిపించునవి మరియు నీవు తెలుసుకోవలెననుకోకున్న నిత్యము తెలియబడునవి. కావున వాటికంత ప్రాముఖ్యత లేదు. ఆత్మ ధర్మములు తెలియవలెననుకొన్నా సరిగ తెలియనివి. అందువలన ఆత్మ ధర్మములకు ప్రత్యేకత గలదు. ప్రపంచ ధర్మములు ప్రత్యక్షముగనున్నవి, ఉదాహరణకు రెండు వాయువుల సమ్మేళనము నీరు అనునది ప్రపంచ ధర్మము. రెండు వాయువులను కలిపిన

ప్రత్యక్షముగ నీరుగ మారును. అలాగే నీటిని విడదీసిన ప్రత్యక్షముగ రెండు వాయువులుగ మారును. పరమాత్మ ధర్మము ప్రత్యక్షముగా లేదు. ఉదాహరణకు జీవాత్మ ఆత్మ శరీరములో జంటగ ఉన్నారనునది ధర్మము. అలాగే జీవాత్మతో పాటు ఆత్మ శరీరమును వదలి పోవుననునది కూడ ధర్మమే. అయితే శరీరములో నున్న ఇద్దరు ఆత్మలుగాని, వారు పోవు విధానము కాని కనిపించదు. అందువలన ఆత్మధర్మములు మర్మమైనవని తెలియుచున్నది. మర్మముగనున్న ధర్మములను తెలుపునది జ్ఞానమని, జ్ఞానమనగా ఆత్మ ధర్మములను తెల్పునదని పెద్దలన్నారు.

**405. (17) పంచభూతములలో అగ్ని ఆత్మ కలసిన ఏ శరీర భాగము తయారగును?**

జ. కన్ను.

**వివరము :** పంచభూతములు ఒక్కొక్కటి ఐదు భాగములుగ చీలి పోయి మొత్తము ఇరువదైదు భాగములైనవి. అవి ఒక దానితో ఒకటి కలియుట వలన ప్రత్యేక రూపములు ఏర్పడినవి. అవియే శరీర అవయవములు. అగ్ని మొదటి భాగము ఆత్మతో కలసి కన్నుగ తయారైనది. ఆత్మ కూడ అయిదు భాగములుగ కలిసి ఇంద్రియములు కదలుటకు ఉపయోగపడుచున్నది.

**406. (18) గీతాశాస్త్రములో ఏ జ్ఞానము ముఖ్యమైనదని చెప్పాడు?**

జ. క్షేత్ర క్షేత్రజ్ఞ జ్ఞానము.

**వివరము :** శరీరము దానియందు నివశించు ఆత్మను గురించి తెలుసుకోవడము ముఖ్యమైన జ్ఞానమని భగవంతుడు తెల్పాడు. గీతాశాస్త్రమంతయు శరీరమును ఆత్మను గురించి చెప్పిన విషయములే ఎక్కువగ ఉండుటవలన క్షేత్ర మనగ శరీరమని, క్షేత్రజ్ఞుడనగ శరీరమును తెలిసిన ఆత్మని, వారి జ్ఞానమే ముఖ్యమైనదిగ **"క్షేత్ర క్షేత్రజ్ఞ యోరాజ్ఞానం యత్తద్ జ్ఞానం మతంమమ"** అని భగవంతుడన్నాడు.

**407. (19) యజ్ఞమనగా నేమి?**

జ. ఉన్నదానిని లేకుండ చేయడము.

**వివరము :** యజ్ఞమను విషయములో చాలామంది పొరపడి అర్థములేని, భగవంతుడు చెప్పని యజ్ఞములు చేయుచున్నారు. ధర్మరీత్యా శాస్త్రపద్ధతిగ ఉన్నవి రెండే యజ్ఞములు. వాటినే భగవద్గీతలో **ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞమని** కూడ చెప్పారు. ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞమే శ్రేష్టమైనదని చెప్పుచు **"శ్రేయోహి ద్రవ్యమయా యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరి సమాప్యతే"** అని కూడ అన్నాడు. ఈ రెండు యజ్ఞములు శరీరములోనే జరుగు చుండగ, తెలియని మానవుడు ధర్మములను అనుసరింపక, బాహ్యయజ్ఞములు చేసి అదే ఆరాధన అంటున్నాడు. వాస్తవానికి యజ్ఞములు ఆరాధన కార్యములు కావు. కర్మను లేకుండ చేసుకోవడము జ్ఞానయజ్ఞమని భగవంతుని భావమై ఉండగ, దానిని ఆరాధన అనడము చాలా అజ్ఞానము. యజ్ఞమనగా అగ్ని చేత ఆహుతి చేయునదని అర్థము. ద్రవ్యయజ్ఞములో జఠరాగ్ని చేత నాల్గు రకముల ద్రవ్యములను కాల్చడము కార్యముకాగ, జ్ఞానయజ్ఞములో జ్ఞానాగ్ని చేత 108 రకముల కర్మలను కాల్చడము కార్యమై ఉన్నది.

**408. (20) తత్త్వమనగా నేమి?**

జ. ఆత్మని అర్థము.

**వివరము :** తత్త్వమనగా ఆధ్యాత్మిక పాటలని కొందరనుకొనుచుందురు. ఆధ్యాత్మిక భావములతో వ్రాసిన పాటలను తత్త్వమని, ఇది బ్రహ్మముగారి తత్త్వమని చెప్పుచుండుటయు, అటువంటి పాటల పుస్తకమును తత్త్వాల పుస్తకమనియు అనుట కూడ జరుగుచున్నది. అలా చెప్పుటలో తప్పు లేదు. కాని నిజార్థములోకెళ్లి తత్త్వమనగ నీకంటే వేరుగనున్న నీలాంటిదేనని అర్థము. నీవు ఒక ఆత్మవు, నీకంటే వేరుగ నీలాంటి ఆత్మ వేరొకటి ఉన్నది. నీవు జీవాత్మవు కాగ నీలాంటి వేరొకటి ఆత్మ ఉన్నదని తెలియవలెను. దానినే తత్త్వమనుచున్నాము.

**409. (21) ప్రకృతి అనగా నేమి?**

జ. కంటికి కనిపించునది (ఇంద్రియగోచరమైనది).

**వివరము :** ప, ర, క, రు, తి అను ఐదు అక్షరముల సమ్మేళనమే ప్రకృతి అను పదముగ ఉన్నది. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు వస్తువులకు ఆకాశమునకు ప, గాలికి ర, అగ్నికి క, నీరుకు రు, భూమికి తి అను బీజాక్షరములు గలవు. అలాగే ఆకాశమునకు న, గాలి మః, అగ్నికి శి, నీరుకు వా, భూమికి య అను బీజాక్షరములు కూడ కలవు. పంచ భూతములకు ఒక రకముగ పరకరుతి అని, అదియే ప్రకృతి అని, మరొకరకముగ నమః శివాయ అని బీజాక్షరములు ఇమిడి ఉన్నవి. ప్రకృతిగాని, నమః శివాయగాని కంటికి కనిపించునదిగ ఉన్నది. కంటికి కనిపించు ప్రకృతికి అతీతమైనది, కనిపించనిది, అణువణువున నిండి ఉన్న పరమాత్మ కూడ గలదు. దానినే ప్రకృతికంటే వేరైనదని పర ప్రకృతియని, పంచ భూతములకు నాశనముగానిదని, ఓం నమః శివాయ, పంచాక్షరి అని పిలుచు చున్నాము. పర ప్రకృతి అను పదములో పర అనగ వేరైనదని అర్థము. అలాగే ఓం నమః శివాయలో ఓం అనగ పంచాక్షరి అని అర్థము, అనగా ఐదుకు నాశనముకానిదని వివరము. దీనిని బట్టి చూచిన ప్రకృతి అను పదము పంచ భౌతికమని, కంటికి కనిపించునదని తెలియుచున్నది.

**410. (22) శరీరమునందు జీవాత్మకు ఆకారమున్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** పైకి కనిపించు శరీరములు అనేక రకములుగ ఆకారములు కల్గి ఉన్నను శరీరముల లోపల జీవాత్మలు అన్ని ఒకే రూపము కల్గివున్నవి. జీవునకు ఆకారమున్నదా అని ఆశ్చర్యపోనవసరము లేదు. ఇంత వరకు జీవుని ఆకారమును ఎవరు చెప్పలేదు కదా! ఇపుడిది అసత్యము అని కూడ అనుకోనవసరము లేదు. మా వ్రాతలు మాటలు శాస్త్రబద్ధమని మొదటి నుండి చెప్పుచున్నాము. అందువలన జీవుని ఆకారము కూడ శాస్త్రబద్దమే. బుద్ధి, చిత్తము, అహము అను మూడు

పొరల మధ్య గుండ్రముగ ఏర్పడిన ఖాళీ స్థలమే జీవాత్మ అని తెలియాలి. మూడు అంతరంగములు గుండ్రని ఆవరణము కల్గి ఒక దాని తర్వాత ఒకటి ఉండుటవలన మధ్యలోని జీవాత్మకు కూడ ఆకారమేర్పడినది. శరీరములోపల బిందువువలె రవ్వంత ఉన్న జీవాత్మ బయటి శరీరమును బట్టి నేను గొప్పవాడిననుకోవడము అజ్ఞానము.

## 411. (23) ఆత్మ ఎన్ని రకములుగ విభజింపబడినది. అవి ఏవి?

జ. మూడు రకములుగ, ఒకటి జీవాత్మ, రెండు ఆత్మ, మూడు పరమాత్మ.

**వివరము :** ఆత్మ మూడు రకములుగ ఉన్నదను మాట భగవద్గీతలో చెప్పినప్పటికి అది బయటికి ప్రచారము కాలేదు. ఇంతవరకు ఒకే ఆత్మ అని అద్వైతము, రెండు ఆత్మలని ద్వైతము ప్రచారమైనవి, మూడు ఆత్మలను త్రైతము ఇపుడు తిరిగి మాతో ప్రారంభమైనది. మా సిద్ధాంతము ప్రకారము జీవాత్మ, ఆత్మ, పరమాత్మలనునవి మూడు రకములుగ గలవు. ఒకటి జీవాత్మ శరీరములోపల ఒక్క స్థానములో మాత్రముండునది. రెండవ ఆత్మ శరీరములోపల శరీరమంత వ్యాపించి ఉన్నది. మూడవ పరమాత్మ శరీరములోపల, శరీరము బయట మొత్తము అణువణువున వ్యాపించి ఉన్నది. మొదటి శరీరములో ఒక్క చోట ఉన్న జీవాత్మకు రెండవది అయిన, శరీరమంత వ్యాపించిన ఆత్మకు ఆకారములున్నవి. మూడవదైన పరమాత్మ లోపల బయట వ్యాపించినదై ఆకారములేనిదై ఉన్నది.

## 412. (24) కుండలీశక్తి శరీరములో ఎక్కడ వ్యాపించి ఉన్నది?

జ. బ్రహ్మనాడియందు.

**వివరము :** ఆత్మశక్తిని చైతన్యశక్తి అని, కుండలీశక్తి అని పిలుస్తున్నాము. ఆత్మ శిరస్సులో మెదడు మొదలుకొని క్రింద గుదస్థానము వరకు వ్యాపించి ఉన్న వెన్నెముకలోని వెన్నుపాము (బ్రహ్మనాడి) అనెడి నాడిలో వ్యాపించి ఉన్నది. అక్కడ నుండి వెన్నుపాముకు అనుబంధముగ ఉన్న అనేక నరముల ద్వార శరీరము చివరి అంచు వరకు వ్యాపించి ఉన్నది. మొత్తము మీద శరీరమంత శక్తి వ్యాపించి

ఉన్నప్పటికి దాని స్థానము బ్రహ్మనాడి అని, బ్రహ్మనాడిలో సహస్రారమని చెప్పబడు మెదడు అని తెలియాలి. భగవద్గీతలో సూర్యుడొక్కడు ఈ లోకమును తన కిరణముల చేత ప్రకాశింపజేసినట్లు, ఆత్మ శిరస్సునందు కేంద్రీకృతమైనప్పటికి, తన శక్తిచేత శరీరమంత ప్రకాశింపజేయుచున్నది అన్నారు. కావున ఆత్మశక్తి బ్రహ్మనాడియందు ఉన్నదని చెప్పవచ్చును.

**413. (25) మనస్సు యొక్క పని ఏమి?**

జ. విషయ జ్ఞప్తి, విషయములనందించుట.

**వివరము :** శరీరములో కాలేయమను అవయవము ఎంత ముఖ్యమైనదో, శరీరములో మనస్సు అంత ముఖ్యమైనదని తెలియవలెను. శరీరములో కాలేయము (లివర్) జీర్ణప్రక్రియలో ఉపయోగపడు పైత్యరసమును తయారు చేయడమే కాక రక్తమును పరీక్షచేసి, చిన్న చిన్న విషములను విరచివేసి, సుగర్ హెచ్చుతగ్గులు కాకుండ ఒకే పరిమానములో ఉన్నట్లు చూస్తు రెండు విధముల పని చేసినట్లు మనస్సు కూడ రెండు విధముల పని చేయుచున్నది. ఒకటి జ్ఞానేంద్రియములు అందించిన విషయములను బుద్ధి ద్వార జీవునికి చేర్చడము. రెండు ఇంద్రియ విషయములను జ్ఞాపకము చేసి బుద్ధికి అందివ్వడము. శరీరములో ఐదు జ్ఞానేంద్రియముల విషయములను అందిస్తు, ప్రస్తుత బయటి ఇంద్రియ విషయములు ఏమి లేనపుడు గడచిన కాలములో ఐదు జ్ఞానేంద్రియములకు సంబంధించిన విషయములను జ్ఞాపకము చేయుచుండుట మనస్సు యొక్క పని.

**414. (26) జీవుడు మరణించిన వెంటనే తల్లిగర్భములో ప్రవేశించునా?**

జ. ప్రవేశించడు.

**వివరము :** జీవుడు తల్లిగర్భములో ప్రవేశించే ప్రసక్తే లేదు. ఈ మాట లోక విరుద్ధమైనప్పటికి నూటికి నూరుపాల్లు సత్యము, శాస్త్రబద్ధము. మరణించిన జీవుడు క్రొత్త శరీరములో ప్రవేశించుట సత్యము. క్రొత్త శరీరము తల్లిగర్భములో లేదు. తల్లిగర్భములోనున్నది అసంపూర్ణ శిశువు. సగము తయారై సగము తయారు

గాని యంత్రమును డ్రైవర్ ఎలా నడుపలేడో, ఆ విధముగనే సగము తయారై పూర్తి తయారుగాని శరీరమును జీవుడు అదిష్టించలేడు. మాసాలు నిండి బయటకి వచ్చిన శిశుశరీరము పూర్తి తయారైనదిగ ఉండును. ఆ స్థితిలో జీవుడు ఆ శరీరమును చేరును. అదియు ప్రసవింపబడిన శరీరములోనికి వెంటనే గాని, కొద్ది ఆలస్యముగ గాని జీవుడు చేరడము నిత్యము జరుగుచున్న పనియే. ఆ విషయమును విస్మరించి తల్లిగర్భములో జీవుడు చేరుచున్నాడనడము పొరపాటు. ఈ విషయము పూర్తి వివరముగ తెలుసుకోవాలంటే మా రచనలలోని **"జననమరణ సిద్ధాంతము"** అను గ్రంథము చదవండి.

## 415. (27) శరీరములో ఆకలిమంట దేనివలన కల్గుచున్నది?

జ. జఠరాగ్ని వలన.

**వివరము :** శరీరములో మానవునికి రెండు రకముల అగ్నులున్నవి. ఒకటి జఠరాగ్ని రెండవది జ్ఞానాగ్ని. మొదటి జఠరాగ్ని ప్రతి ఒక్కరికి గలదు. రెండవ జ్ఞానాగ్ని కొందరికున్నది, చాలామందికి లేకున్నది. శరీరములోని జీర్ణాశయములో రసముల కలయిక వలన జఠరాగ్ని పుట్టుచున్నది. జీర్ణాశయము యజ్ఞగుండముగ ఉండగ అందులో అగ్నిగ జఠరాగ్ని గలదు. యజ్ఞగుండములో అగ్ని వివిధ సమిదలను కాల్చినట్లు, జీర్ణాశయములో జఠరాగ్ని వివిధ ఆహార ద్రవ్యములను కాల్చుచున్నది. అందువలననే ఈ క్రియను ద్రవ్యయజ్ఞము అని భగవద్గీతలో అన్నారు. కడుపులో కాల్చబడే ఆహారములేనపుడు, అగ్ని జీర్ణాశయ గోడలకంటుకొని కడుపులో మంట పుట్టుచున్నది. దానినే ఆకలి అంటున్నాము.

## 416. (28) కుక్క శరీరములో ఎన్ని భాగములున్నవి?

జ. 25 భాగములు.

**వివరము :** కుక్క శరీరము గాని, మనిషి శరీరము గాని, పంచభూత నిర్మితమైనదే. కావున 25 భాగములచే మనిషి శరీరము తయారైనట్లు కుక్క శరీరము కూడ తయారైనది. కుక్కకు తోక ఎక్కువగ ఉన్నది కదా అది ఇరువై ఆరవది

అనుకోకూడదు. మనిషి వెన్నెముక కురచగ ఉన్నది. కుక్క వెన్నెముక కొద్దిగ పొడవుగ ఉన్నదని తలచవలెను. శరీర నిర్మాణము అందరికి ఒకే లాగున్నదని అర్థము చేసుకోవాలి.

**417. (29) శరీరములో జీవుని పని ఏమి?**

జ. కర్మననుభవించుట.

**వివరము :** జీవుడు కర్మ బద్ధుడై కర్మ అనుభవించుటకు పుట్టుచున్నాడు. శరీరములో ప్రారబ్ధకర్మ ప్రకారము సుఖ దుఃఖములను అనుభవించుటయే జీవుని యొక్క కర్తవ్యము. జీవునికి కర్మలననుభవించు పనికంటే వేరు పని లేదు.

**418. (30) ఆత్మ దర్శనమైన వాడు పరమాత్మను పొందునా?**

జ. పొందవచ్చును. పొందక పోవచ్చును.

**వివరము :** ఆత్మ దర్శనమైనవాడు పూర్తి కర్మ అయిపోయి ఉంటే ఆ జన్మలోనే మోక్షము పొందును. అట్లుకాక కర్మ అయిపోని వాడు, ఆ కర్మను అనుభవించుటకు తిరిగి పుట్టవలసి ఉన్నది. ఆత్మ దర్శనమైనప్పటికి మోక్షము పొందుటకు కర్మ శేషముండ కూడదన్నది నిబంధన. ఆత్మ దర్శనముతోనే కర్మంత అయిపోతుందని నమ్మకము లేదు. ఆ జన్మలోనే మోక్షము పొందుదురను నమ్మకము లేదు. కర్మ శేషత లేకుంటేనే మోక్షము సాధ్యమగును.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-28-01-1987**

**419. (1) కార్యము దేనిననుసరించి ఉండును?**

జ. కర్మననుసరించి ఉండును.

**వివరము :** కర్మ మూడు రకములుగ ఉన్నది. ఒకటి సంచితము, రెండు ఆగామికము, మూడు ప్రారబ్ధము. ఈ మూడింటిలో ప్రారబ్ధముననుసరించి ప్రతి కార్యముండును.

చిన్న పనిగాని, పెద్ద పనిగాని, కఠినమైన పనిగాని, సులభమైన పనిగాని అన్నియు ప్రారబ్ధకర్మననుసరించియే ఉండును. కర్మలేని కార్యముండదు. శరీరములో నిక్షిప్తమై ఉన్న కర్మప్రకారము పనులు జరుగుచుండును.

**420. (2) శరీరములో ఉదానవాయువు యొక్క స్థానమెక్కడ?**

జ. జీర్ణాశయమునుండి కంఠస్థానము వరకు.

**వివరము :** శరీరములో వ్యాన, ఉదాన, సమాన, ప్రాణ, అపాణ వాయువులు ఐదు గలవు. అవి ఒక్కొక్కటి శరీరములో పరిమిత స్థానములను ఆక్రమించుకొని ఉన్నవి. ఉదానవాయువు శరీరములో జీర్ణాశయము యొక్క క్రింది కొన నుండి కంఠము పై వరకు వ్యాపించి ఉన్నది. జీర్ణాశయమును ఇరువది నాలుగు గంటలు కదలించుటకు ఆహారమును క్రిందిది పైకి, పైది క్రిందికి మారునట్లు చేయుచున్నది. తేపులు ఆవులింపులుగ వచ్చునది కూడ ఉదానవాయువే.

**421. (3) నాలుక ఏ ప్రకృతి భాగములనుండి తయారైనది?**

జ. అగ్ని మూడవ భాగము, నీరు మూడవ భాగము కలిసి తయారైనది.

**వివరము :** శరీరము మొత్తము 25 భాగములుగ తయారైనదని తెలుసుకొన్నాము. ప్రకృతిలోని ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఒక్కొక్కటి ఐదు భాగములుగ విభజింపబడి అవి ఒకదానితో ఒకటి కలియుటవలన శరీరములోని అవయవము లన్ని తయారైనవి. బిడ్డ ఆకృతిలో తల్లి తండ్రుల పోలికలున్నట్లు, ప్రకృతి భాగములు కలియుటవలన ఏర్పడిన అవయవములకు ఆ ప్రకృతి లక్షణములు కొన్ని వచ్చినవి. నాలుక జ్ఞానేంద్రియమై చురుకుగ పని చేయుట వలన అగ్నికి తయారైనదని, అది ఎల్లపుడు తేమగ ఉండుట వలన నీటితో కూడ తయారైనదని తెలియుచున్నది. వివరించి చూచితే అగ్ని మూడవ భాగము, నీరు మూడవ భాగముచే తయారైనదని తెలియుచున్నది.

**422. (4) కర్మయోగము ఆచరించుటకు శరీర భాగములలోని దేనిని అణచి వేయవలెను?**

జ. అహంకారమును.

**వివరము :** యోగములు రెండు విధములుగ చెప్పబడి ఉన్నవి. అందులో కర్మ యోగము, బ్రహ్మయోగమనునవి గలవు. కర్మయోగము సాధారణముగ పనులు చేయుచు ఆచరించవచ్చును. కర్మయోగులు జీవితములో పనులను నిరోదించక వాటి వలన వచ్చు కర్మను నిరోధించువారై ఉందురు. ఎవరైన పనులలో అస్వతంత్రులే, కాని కర్మ సంపాదించుకోవడములో స్వంతంత్రులుగ ఉన్నారని "కర్మణ్యేవాది కారస్తే" అని గీతలో కూడ చెప్పబడినది. కర్మ ప్రకారము పనులు చేయవలసి వచ్చిన యోగులు, శరీరములోని అహమును అణచివేసి, రాబోవు కర్మను లేకుండ చేసుకోగల్గుచున్నారు. అహము లేకుండుట వలన ఆగామి కర్మ రాదు. ప్రారబ్ధకర్మ ఉండుటవలన పనులు తప్పక చేసి అనుభవించవలసి వస్తున్నది.

**423. (5) మృత్యువు ఏ కర్మననుసరించి ఉండును?**

జ. ప్రారబ్ధముననుసరించి ఉండును.

**వివరము :** కర్మ మూడు రకములు 1. ప్రారబ్ధము, 2. ఆగామికము, 3. సంచితము. మూడు కర్మలలో ప్రారబ్ధముననుసరించి జీవితముండును. పుట్టుక నుండి చావు వరకు జరుగునదంతయు ప్రారబ్ధమునుబట్టి ఉండును.

**424. (6) గురుద్రోహులకు ఏ పాపము సంభవించును?**

జ. క్షమించరాని పాపము.

**వివరము :** పాపములలో రెండు రకముల పాపములు గలవు. ఒకటి తప్పని సరిగ అనుభవించవలసినది, రెండవది శరణుజొచ్చితే దైవత్వము చేత క్షమించ బడునది. గురువుకే ద్రోహము చేసిన వారికి భగవంతుడు గాని, గురువుగాని స్వయముగ క్షమించిన ఆ పాపము క్షమించబడదు. అది తప్పనిసరిగ అనుభవించ వలసి ఉన్నది. దీనినే క్షమించబడని పాపమంటాము.

**425. (7) భగవంతుడు సాకారుడా, నిరాకారుడా?**

జ. సాకారుడు.

**వివరము :** అణువణువున వ్యాపించిన పరమాత్మ శరీరము ధరించి వచ్చినపుడు ఆ రూపమును భగవంతుడందుము. పరమాత్మ నిరాకారుడే అయినప్పటికి, శరీరము ధరించి భగవంతుడైనపుడు కంటికి కనిపిస్తున్నాడు. కనుక భగవంతుడు సాకారుడని చెప్పవచ్చును.

**426. (8) దానము అంటే ఏమిటి?**

జ. ఇచ్చునది దానము.

**వివరము :** శరీరములో ఆరు చెడు గుణములు, ఆరు మంచి గుణములు గలవు. వాటిలో చెడుగుణములైన కామ, క్రోద, లోభ, మోహ, మద, మాత్సర్యము అను ఆరు గుణములకు, ఆరు వ్యతిరేఖ గుణములు గలవు. కామమునకు వ్యతిరేఖ గుణము దానము. కావాలనుకోవడము ఆశగుణముకాగ, ఇవ్వాలనుకోవడము దానము.

**427. (9) "ధనమూల మిదమ్ జగత్" అంటారు నిజమేనా?**

జ. అసత్యము

**వివరము :** ప్రపంచములో ధనముతోనే ప్రతి పని జరుగునట్లు కనిపిస్తున్నది, కావున ధన మూల మిదమ్ జగత్ అన్నారు. ఇది అందరికి పైకి కనిపించు సత్యము. దీనికంటే మరొకటి కంటికి కనిపించని సత్యము గలదు. దాని ముందర ధన మూల మిదమ్ జగత్ అనుమాట పూర్తి అసత్యమగుచున్నది. మనిషికి ధనము రావాలన్న, పని నెరవేరాలన్న, అన్నిటికి కారణము కర్మయై ఉన్నది. కర్మ చేతనే ధనము చేకూరుచున్నది. కర్మ చేతనే పనులు జరుగుచున్నవి. కర్మ చేతనే బీదవారు ధనికులగుచున్నారు. చావు పుట్టుకలు కూడ కర్మ చేతనే జరుగుచున్నవి. అన్నియు కర్మ చేతనే జరుగుచున్నపుడు **"కర్మ మూల మిదమ్ జగత్"** అనుమాట సత్యమైనదని ధనమూల మిదమ్ జగత్ అనుమాట అసత్యమైనదని చెప్పవచ్చును.

**428. (10) కాలమంటే ఏమిటి?**

జ. జరిగిపోవునది, భయంకరమైనది, అర్థముకానిది, అనుభవానికిరానిది.

**వివరము :** కాలమునకు సరియైన నిర్వచనము చెప్పలేము. ఎందుకనగా కాలము పరమాత్మ యొక్క ప్రతి రూపము. భగవద్గీతలో అర్జుననకు అర్థము కాక పరమాత్మను నీవెవడవు? అన్నపుడు, దానికి జవాబుగ "క్షయము కల్గించు కాలమునేనే" అన్నాడు. నిత్యము క్షణక్షణము జరుగుచున్న కాలము పరమాత్మ స్వరూపము. కాలము ఎవరికీ అర్థము కాదు. దానిని ఎవరూ అనుభవించలేరు. మోక్షము పొందిన వానిని కాలమై పోయాడని పూర్వమనెడివారు. కాలమై పోయినవానికే కాలము అంటే ఏమిటో తెలియును. మిగతా ఎవ్వరికీ తెలియదు.

**429. (11) నీవు ద్వైతివా? అద్వైతివా?**

జ. నేను త్రైతిని.

**వివరము :** క్షరాక్షర పురుషోత్తములలో నేను క్షర పురుషుడను జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనువారిలో జీవాత్మను. జీవుడు, దేవుడు, దేవదేవుడు అనువారిలో జీవుడను. అద్వైతి అనగా రెండు కానిది ఒక్కటే అయినది పరమాత్మ. నేను కాలమై పోయిన రోజు అనగా మోక్షము పొందిన రోజు పరమాత్మగా మారిపోవుదును కనుక అపుడు అద్వైతినగుదును. ద్వైతి అనగ ఆత్మయోగము ఆచరించి నేను ఆత్మలో ఐక్యమై పోయినపుడు, పరమాత్మ ఒకటికాగ ఆత్మ రెండవది అగుటవలన అపుడు నేను ద్వైతినగుదును. అద్వైతి, ద్వైతి కానపుడు ఎల్లపుడు మూడవ ఆత్మయిన జీవాత్మగ ఉన్నాను, కాబట్టి త్రైతిగా ఉన్నాను. అనగా ఇపుడు నేను త్రైతిని. త్రైతము నుండి అద్వైతమునకు చేరవలెనని ప్రయత్నించుచున్నాను.

**430. (12) జ్ఞానయోగము లభించుటకు శరీరములో ఏ భాగము ముఖ్య పాత్ర వహించుచున్నది?**

జ. మనస్సు.

**వివరము :** జ్ఞానయోగము, రాజయోగము అను రెండు యోగములలో జ్ఞాన యోగము లభ్యమగుటకు శరీరములోని అంతఃకరణములలో మనస్సు ముఖ్య కారణమై ఉన్నది. మనస్సు ఏ విషయ జ్ఞాపకమును తెచ్చి పెట్టకపోతే జ్ఞానయోగము లభ్యమగును. మనస్సు చిన్న సంకల్పమును తెచ్చి పెట్టిన జ్ఞానయోగము లభ్యము కాదు. కావున జ్ఞానయోగము లేక బ్రహ్మయోగము లభ్యము కావాలంటే మనస్సును జయించవలెనని పెద్దలు చెప్పారు. మనో చంచలమున్నంత వరకు జ్ఞానయోగము లభ్యము కాదు.

**431. (13) మహర్షి, రాజర్షి, దేవర్షి బ్రహ్మర్షి అను యోగులలో ఎవరు పరమాత్మను తెలియుదురు?**

జ. ఎవరూ తెలియరు.

**వివరము :** శరీరము ధరించి ఉన్న ఏ యోగికాని, ప్రపంచములో బ్రతికి ఉన్న ఎవరుగాని పరమాత్మను తెలియలేరు. ఎవరైనగాని ఆత్మను జీవాత్మను తెలియ వచ్చును, పరమాత్మను మాత్రము తెలియలేరు. కర్మశేషము లేకుండ పోయి, జన్మలు కలుగకుండపోయి, మోక్షము పొందినపుడు, పరమాత్మను చెందినపుడు, వాడే పరమాత్మగా మారిపోయి పరమాత్మేమిటో తెలియును. అంతవరకు పరమాత్మ ఏ మహర్షికి తెలియదు. వేల సంవత్సరములకొకమారు పరమాత్మే భూమి మీద అవతరించిన భగవంతుని మినహా ఎవరికి పరమాత్మ విషయము తెలియదు. భగవంతుడు కూడ వేల సంవత్సరములకో, లక్షల సంవత్సరములకో జన్మించును. ఆయన జన్మ కూడ తెలియుట మానవులకు చాలా కష్టము.

**432. (14) పాపములలో ఎన్ని రకములున్నవి?**

జ. రెండు రకములు.

**వివరము :** పాపములు ప్రపంచసంబంధమైనవి, పరమాత్మ సంబంధమైనవి అను రెండు రకములు గలవు. ప్రపంచ సంబంధ పాపములకంటే పరమాత్మ సంబంధమైనవి చాలా కఠినముగ ఉండును. శిక్షలు, కఠినశిక్షలు అని రెండు

రకములున్నట్లు, మానవులకు చేసిన ద్రోహములు శిక్షలుగ పరిణమించగ, పరమాత్మ ఎడల అనగ భగవంతునికి చేసిన ద్రోహములు కఠిన శిక్షలుగ పరిణమించును. ప్రాపంచిక పాపములను అనుభవించలేక భగవంతుని శరణుజొచ్చిన వారు భగవంతుని చేత క్షమించబడవచ్చును. కాని భగవంతుని పట్ల చేసిన పాపములను భగవంతుని చేత కూడ క్షమించబడవు. అందువలన పాపములు రెండు రకములని ఒకటి క్షమించబడు పాపములు, రెండు క్షమించబడని పాపములని చెప్పవచ్చును.

**433. (15) జగద్గురువనగా ఎవరు?**

జ. జగతికంతటికీ వర్తించు ధర్మములను బోధించువాడు జగద్గురువు.

**వివరము :** "జ" అనగ పుట్టుట, "గతి" అనగ గతించుట, జగతి అనగ జనన మరణములు కలదని అర్థము. జననము మరణము కల్గినవి జీవులు. సర్వ జీవరాసులు జగతిలోనివే, కావున సర్వ జీవరాసులకు వర్తించు ధర్మములను తెలియజేయువాడు జగద్గురువు. ఎక్కువమంది శిష్యులు గలవారిని జగద్గురువని ఈ కాలములో అనుట జరుగుచున్నది. శిష్యుల సంఖ్యను బట్టి జగద్గురువు అనుట సరియైన పద్ధతికాదు. బోధించు ధర్మములను బట్టి జగద్గురువనుట సమంజసము.

**434. (16) ఆహారమును బట్టి గుణమా? గుణమును బట్టి ఆహారమా?**

జ. గుణమును బట్టి ఆహారము.

**వివరము :** చాలామంది ఆహారము వలన గుణములున్నవని చెప్పుచున్నారు, గ్రంథములలో వ్రాయుచున్నారు. కాని అది శాస్త్రబద్ధమైన మాట అవునా కాదా అని చూడడము లేదు. గీతాశాస్త్రములో భగవంతుడు చెప్పిన మాటకు వక్ర భాష్యము చెప్పిన వారు కూడ ఎందరో గలరు. ఎందరో ఏమిటి భగవద్గీత వ్రాసిన వారందరు అదియే చెప్పారని చెప్పవచ్చును. భగవంతుని గీతను అపశృతి చేసితే గొప్ప తప్పని తెలియదు. భగవంతుడు గీతలో గుణములను బట్టి ఆహారము మీద ఇచ్ఛ కల్గునని చెప్పాడు, ఆహారమును బట్టి గుణములు కల్గునని చెప్పలేదు. కర్మను బట్టి ఆహారము లభించుట, లభించక పోవుట జరుగుచుండును. కర్మను

బట్టి ఏ ఆహారము తింటున్నప్పటికి వానిలోని గుణమును బట్టి ఆహారము మీద ఇచ్ఛ కల్గి ఉందురు. ఇచ్ఛ కల్గిన ఆహారము లభించవచ్చును, లభించక పోవచ్చును. గుణమును బట్టి ఆహారమను మాట మాత్రము మరచిపోకూడదు.

## 435. (17) శిష్యుడు తెలుసుకొనునది స్మృతియా లేక శృతియా?

జ. శృతిని.

**వివరము :** గురువు తప్ప ఏ శిష్యుడైన శృతి ద్వార తెలుసుకోవలసిందే. స్మృతులు గురువుకు, శృతులు శిష్యులకు అను సూత్రము ప్రకారము ఇంద్రియములలో ఒకటయిన చెవి నుండి లభించు శృతితో అనగా శబ్దముతో శిష్యుడు తెలియవలసి ఉన్నది. స్మృతి అనగ హృదయము నుండి పుట్టునది అనగా ఆత్మ నుండి లభ్యమగునది. శృతి అనగ శబ్దము చెవి నుండి పుట్టునది అనగా ఇతరుల ద్వార చెప్పబడునది. గురువు ద్వార చెప్పబడిన విషయమును శిష్యుడు చెవి ద్వార వినగల్గుచున్నాడు. గురువు ఆత్మ ద్వార జ్ఞాపకమునకు వచ్చిన విషయములను శిష్యునికి తెలియజేయు చున్నాడు. అందువలన ఇతరుల వలన చెప్పబడిన వాటిని తెలుసుకొనువాడు శిష్యుడు. వాటినే తిరిగి చెప్పితే బోధకుడు. ఎవరివలన చెప్పబడక ఆత్మ ద్వార పుట్టుకొచ్చిన విషయములను చెప్పువాడు గురువు. శిష్యుడు బోధకుడు కావచ్చును. బోధకుడు గురువు కాలేడు.

## 436. (18) శంఖు చక్రములలో చక్రము దేని గుర్తు?

జ. కర్మ నాశనమునకు గుర్తు.

**వివరము :** తిరుపతి మొదలగు దేవాలయములలో శంఖు చక్రములు వాటి మధ్యలో నామము ఉండుట చూచియే ఉందుము. వాటిలో శంఖు జ్ఞానమునకు, జ్ఞాన బోధకు గుర్తుకాగ, చక్రము జ్ఞాన ఖడ్గమై కర్మ నాశనమునకు గుర్తుగ ఉన్నది. దేవాలయములలోని ప్రతి కోణము ఆధ్యాత్మిక అర్థములతో కూడుకొని ఉండును. కావున దేవాలయములలోని ప్రతి చిహ్నమును ఆధ్యాత్మిక దృష్థితోనే చూడవలెను. ఆ భావముతో చూచినపుడు, చక్రము కర్మ నాశనమును చూపుచున్నదని తెలియుచున్నది.

**437. (19) ఆత్మ దేవుడైతే పరమాత్మ ఏమి కావాలి?**

జ. ఏమియు కాడు.

**వివరము :** చెప్పడములో ఒక్కొక్కపుడు ఆత్మను పరమాత్మను ఉద్దేశించి దేవుడని చెప్పినప్పటికి, శరీరములోని ఆత్మను ఆలయములోని దేవునిగ వర్ణించవచ్చును. స్థానము ఆకారము పేరు లేని పరమాత్మను దేవునిగ కూడ చెప్పక గీతలో చెప్పినట్లు ఆత్మకంటే వేరుగ ఉన్న పర ఆత్మ (పరమాత్మ) గనో లేక ఉత్తమ పురుషుని (పురుషోత్తముని) గనో చెప్పుట మంచిది. పరమాత్మను మించినది లేదు ఆయనను శాశించునది లేదు. ఆయనే ఖుద్‌గా నిర్ణయముతో భగవంతునిగ వచ్చి పోవుచున్నాడు. అందువలన ఆయనను ఖుదా అని కూడ అనవచ్చును. ఒక విధముగ ఆత్మను దేవుడని వర్ణించుచున్నాము. కనుక పరమాత్మ దేవుడు కూడ కాడు, దేవునికి దేవుడైన దేవదేవుడని చెప్పవచ్చును.

**438. (20) ప్రేమలు ఎన్ని విధములైనా, అవి ఆత్మను చేర్చ గలవా?**

జ. చేర్చలేవు.

**వివరము :** గుణరహితమైనపుడు, ఏ సంకల్పములేనపుడు, లోపలనున్న ఆత్మ తెలియునని గీతాశాస్త్రము చెప్పుచున్నది. మంచి గుణములు గాని, చెడు గుణములు గాని ఆత్మదర్శనమునకు ఆటంకములే. అటువంటపుడు ప్రేమ అనునది ఒక గుణము అగుటవలన, ఎటువంటి ప్రేమతోనైన ఆత్మను తెలియలేము. ఏ చిన్న గుణసంకల్పము కూడ ఆత్మను దూరముగ ఉంచును. అటువంటపుడు ప్రేమే దైవమని, దైవము ప్రేమ స్వరూపుడని చెప్పుచున్నారు కదా అని మీరు అడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! శాస్త్రబద్ధముగ సత్యమునే చెప్పాలంటే ప్రేమ దైవము కాదు, దైవము ప్రేమ స్వరూపము కాదు. దైవము గుణాతీతుడు. ఏ గుణము ఆయనను లోబరుచుకోలేదు. అందువలన ఆయనను ప్రేమ మయుడని, కరుణామయుడని, దయామయుడని అనకూడదు. ప్రేమ దయ అన్ని గుణములే అగును. గుణాతీతమైన దానిని గుణాతీతముగనే చేరవలెననునది శాసనము.

దేవుడు చెప్పిన శాసనము ప్రకారము ప్రేమ దేవున్ని చేర్చలేదు. సంస్కృతములోని భగవద్గీతను తెలుగు మొదలగు భాషలలోనికి మార్చడములోను, ఇశ్రాయేలు భాషలోని బైబిలును మిగత భాషలలో అనువదించడములోను, శ్రద్ధ అను పదమునకు అర్థము చెప్పడములో ప్రేమ అని చెప్పుటవలన, భావము తలక్రిందులై దేవున్ని కూడ దయామయుడు ప్రేమమయుడు అంటున్నారు. వాస్తవముగ దేవునికి పన్నెండు గుణములలో ఏ ఒక్కటి లేదని తెలియవలెను.

**439. (21) నెమలి పింఛములో మధ్య నుండి రెండవ భాగము దేని గుర్తు?**

జ. సాత్త్వికము.

**వివరము :** నెమలి పింఛములో మొత్తము నాలుగు రంగులు గలవు. రంగులను బట్టి పింఛమును నాలుగు భాగములుగ గుర్తించవచ్చును. "చాతుర్వర్ణం మయా సృష్టం" అను గీత వాక్యము ప్రకారము నెమలి పింఛములో నాల్గు వర్ణములుండుట విశేషము. అంతేకాక చెప్పిన భగవంతుడే ఆ పింఛమును ధరించి చూపుటలో మరీ విశేషము గలదు. దాని విశేషతేమని చూచినట్లయితే, భూమి మీద గల నాల్గు రకముల మనుషులను ఆ పింఛము మీద చూపినట్లయినది. తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులు అను నాల్గు జాతుల మనుషులలో నెమలి పింఛము యొక్క మధ్య భాగము యోగుల గుర్తుకాగ, రెండవ భాగము సాత్త్వికుల గుర్తని తెలియవలెను. మూడవది రాజసులగుర్తని, నాల్గవది తామసమునకు గుర్తని తెలియవలెను. నెమలి పింఛము మీద లోపల నుండి యోగ, సాత్త్విక, రాజస, తామస గుర్తులుగ నిర్మింపబడి ఉన్నవి.

**440. (22) జీవునకు కర్మను శరీరములో ఏ భాగము అంటించు చున్నది?**

జ. అహంకారము.

**వివరము :** మన శరీరములో నిర్ణీత కార్యములు చేయు నిర్దిష్ట భాగములు ఆత్మ మినహా 25 గలవు. అందులో అంతఃకరణములని పేరుగాంచిన మనస్సు, బుద్ధి,

చిత్తము, అహము గలవు. జీవుడు కూడ అంతరంగములో ఒక భాగమై ఉన్నప్పటికి ఆ జీవుని కొరకే అన్ని భాగములను ఆత్మ వినియోగించుచున్నది. ఆ కార్యములో ప్రారబ్ధ కర్మరీత్య పనులు చేసి జీవునికి సుఖదుఃఖములనందించుటకు 23 భాగములు పాలుపంచుకోగ, అహమొక్కటి కార్యములో ఏ పని చేయక ఊరకుంటున్నది. అట్లని పూర్తి ఊరకుండక జరిగిన పనిని గాని, జరుగుచున్న పనిని గాని ఏమి చేయక అనుభవించు జీవునికి ఉద్భోధ చేయుచున్నది. ఆ బోధ ఏమనగా! ఈ పని కంతటికి నీవే కారణము, నీవు చేయుట వలననే ఈ కార్యమంత జరిగినదని జీవునికి చెప్పుటవలన, ఏమి చేయని జీవుడు అహము మాట వినుటకు బాల్యమునుండి అలవాటై పోయాడు. తాను చేయని పనికి తానే కారణమను కొనుచు, వెనుక చేయవలసిన విధానమను కర్మమొకటి గలదని, దానిని చేయించు వాడు ఆత్మని, చేయువారు 23 ఇంద్రియములని తెలియని అజ్ఞాని అగుట వలన, పనిలోని క్రొత్త కర్మయిన ఆగామికర్మ జీవునికి అంటుచున్నది. అందువలన శరీరములో జీవునికి కర్మ అంటించునది శరీరములోని అహంకారమేనని చెప్పవచ్చును.

**441. (23) ఆహారము శరీర ఆరోగ్యమునకా లేక గుణముల వృద్ధికా?**

జ. శరీర ఆరోగ్యమునకే.

**వివరము :** శరీరము స్థూలమైనది, గుణములు సూక్ష్మమైనవి. స్థూలశరీరము యొక్క ఆరోగ్య అనారోగ్యములు మనము తినే ఆహారములోని పోషక పదార్థములను బట్టి ఉండును. ఆహారములోని నాల్గు రకముల పోషకములు శరీర ఆరోగ్యమును కాపాడుచుండును. అవి స్థూలశరీరమును వదలి సూక్ష్మశరీరము వరకు వ్యాపించవు. ఆహారము గుణముల వృద్ధికుపయోగపడదు. ఆహారము వలన గుణములు వృద్ధి అగునని ఏ శాస్త్రములోను లేదు. అది ఆచరణ సత్యము కాదు. నిర్దిష్ట ఆహారముతో నిర్దిష్ట గుణమును వృద్ధి చేయలేము. అందువలన ఆహారము శరీరమునకే గాని గుణములకు కాదని తెలియాలి.

**442. (24) విషము సూక్ష్మశరీరమును చంపునా లేదా?**

జ. చంపలేదు.

**వివరము :** శరీరము స్థూలము, సూక్ష్మమని రెండు రకములుగ గలదు. అందులో సూక్ష్మమును విషము ఏమి చేయలేదు. విషము స్థూలము మీద మాత్రము పని చేయును. విషము స్థూలమైనది, స్థూలమైన విషము స్థూలశరీరము మీద పని చేయును. విషమిచ్చి చంపినప్పటికి కనిపించు వ్యక్తి మరణించును. ఆ వ్యక్తిలోని కనిపించని సూక్ష్మశరీరము మరణించక బ్రతికి ఉన్న సంఘటనలెన్నో భూమి మీద గలవు. అందువలన విషము సూక్ష్మమును ఏమి చేయలేదని చెప్పవచ్చును.

**443. (25) ధర్మము జ్ఞానము వలన తెలిసినట్లు, న్యాయము దేని వలన తెలియుచున్నది?**

జ. నీతి వలన.

**వివరము :** ప్రపంచ సంబంధమైన మరియు పరమాత్మ సంబంధమైన రెండు నియమములు గలవు. జ్ఞాన ధర్మములు పరమాత్మ సంబంధమైనవి, నీతి న్యాయములు ప్రపంచ సంబంధమైనవి. తల్లి తండ్రి, గురువు దైవము అన్నట్లు నీతి న్యాయము, జ్ఞానము ధర్మములు గలవు. తల్లి వలన తండ్రిని తెలిసినట్లు, గురువు వలన దైవము తెలియునని తెలుపుటకు పూర్వపు పెద్దలు వరుస క్రమముగ తల్లి తండ్రి, గురువు దైవమన్నారు. ఆ విధముగనే నీతి వలన న్యాయము తెలియునట్లు, జ్ఞానము వలన ధర్మములు తెలియునని తెలుపుటకు వరుస క్రమముగ నీతి న్యాయము, జ్ఞానము ధర్మము అన్నారు. అందువలన న్యాయము నీతి వలన తెలియుచున్నదని చెప్పకనే తెలియబడుచున్నది.

**444. (26) మాయ ఎక్కడ ఉన్నది?**

జ. మన తల లోపల.

**వివరము :** మాయ అనగ గుణముల సమ్మేళనమని నిర్వచనము భగవద్గీతలో

చెప్పబడి ఉన్నది. ఎన్ని గుణములు కలిసితే మాయ అగునని కొందరికి ప్రశ్న రావచ్చును. మనకు ఎన్ని గుణములున్నవో మొదట తెలిసితే జవాబు సులభమై పోవును. కొందరేమో అరిషట్ వర్గమని ఆరుగుణముల పేర్లు కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యములని చెప్పుచున్నారు. దానితో చాలా మంది మనకున్న గుణములు ఆరేనని, ఆ ఆరు గుణములే మాయ అని అనుకుంటున్నారు. వాస్తవముగ అరి షట్ వర్గమునే చెప్పుకొన్నారు కాని వాటికి వ్యతిరేఖమైన షట్ వర్గమును చెప్పుకోలేదు. అరిషట్ వర్గమనగా అర్థము, అరి అనగా శత్రువు, షట్ అనగా ఆరు, వర్గమనగా గుంపు అని అర్థము. పూర్తిగ అయితే శత్రువులైన ఆరు గుణముల గుంపని అర్థము. శత్రుగుణములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సరములున్నట్లు మిత్ర గుణములైన ఆరు గుణములు గలవు. అరిషట్ వర్గమునకు మిత్ర షట్ వర్గము వ్యతిరిక్తముగ ఉండుట సహజమే కదా! అందువలన దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమలు తయారైనవి. 1. దానమునకు x ఆశ (కామము), 2. దయకు x కోపము, 3. ఔదార్యమునకు x లోభము, 4. వైరాగ్యమునకు x మోహము, 5. వినయమునకు x గర్వము (మదము), 6. ప్రేమకు x అసూయ (మత్సరము) శత్రువులుగ గలవు. మొత్తము 12 గుణములను కలిపి మాయ అంటున్నాము. దీని ప్రకారము ఏ ఒక్క గుణములో తగులుకొని ఉండినా మాయలో తగుల్కొనినట్లేనని తెలియవలెను. గుణములు తలలోనే ఉన్నవి, కావున మాయ తలలోనే ఉన్నదని చెప్పవచ్చును.

### 445. (27) నీ శరీరములో కదలిక దేనివలన కల్గుచున్నది?

జ. ఆత్మ శక్తి వలన.

**వివరము :** శరీరములోని ప్రతి అవయవమునకు స్వయముగ కదలు శక్తి లేదు. శరీరములోని ప్రతి భాగమును ఒక ప్రత్యేకమైన శక్తి కదలించుచున్నది. అదియే ఆత్మశక్తి. ఆత్మశక్తి శరీరమును కదలించుచున్నదని తెలియక ప్రతి జీవుడు తానే కదలుచున్నట్లు భ్రమించుచున్నాడు. కాలులోనో, చేతిలోనో ఆత్మశక్తి లేకుండ

పోయి కాలుగాని, చేయికాని కదలనపుడు కూడ శరీరములోనిది తన శక్తికాదని జీవుడు తెలియకున్నాడు. ఆత్మశక్తి లేనిది కనురెప్ప కూడ కదల లేదు.

**446. (28) శరీరము లోపల గల మాయకు దగ్గర సంబంధమున్న బాహ్య అవయవమేది?**

జ. కన్ను.

**వివరము :** శరీరము లోపల మాయ గుణముల రూపములో ఉన్నది. ఆ గుణములు బుద్ధికి తగుల్కొని జీవుని మాయలో పడవేయాలంటే, మనస్సు గుణములను బుద్ధికి అంటించవలసి ఉండును. మనస్సు ఐదు జ్ఞానేంద్రియముల మీద ఆధారపడి పని చేయుచుండును. ఐదు జ్ఞానేంద్రియములలో ఎక్కువగ మనస్సు సంబంధము పెట్టుకొన్నది కన్నుతో. కన్ను తర్వాత చెవి గలదు. కన్ను చూపిన విషయమును మనస్సు గుణముల రూపముతో బుద్ధికందించును. మనస్సు తెచ్చిన విషయమును బుద్ధి గుణములతో యోచించను మొదలు పెట్టును. అనగా ఆ విషయమునకు సంబంధించిన గుణముతో బుద్ధి మిలితమై పోవును. బుద్ధి అందించినదే జీవునికి చేరుచున్నది. కావున బుద్ధి మిలితమైన గుణమునే జీవుడు పొందాడని, దాని భావములోనే బాధో, సుఖమో, జీవుడనుభవిస్తున్నాడని తెలియవలెను. అందువలన ప్రపంచములో అతి ప్రాధాన్యమైన కన్ను బాహ్యముగ ఉండినప్పటికి లోపలనున్న మాయకు దగ్గర సంబంధమున్నదని చెప్పవచ్చును.

**447. (29) హృదయము ఎక్కడున్నది? అందులో ఏమున్నది?**

జ. బ్రహ్మనాడియందున్నది. అందులో ఆత్మ ఉన్నది.

**వివరము :** హృదయమంటే గుండె అని చాలా మంది నమ్మకము. మేము గుండె వేరు, హృదయమువేరని చెప్పుచున్నాము. గుండె హృదయముచేత కదలుచున్నది. హృదయము శిరస్సు మొదలుకొని క్రింది వరకు వ్యాపించి ఉన్నది. మెదడు మొదలుకొని ఏడు నాడీ కేంద్రములుగ వ్యాపించి ఉన్న బ్రహ్మనాడినే హృదయము అంటున్నాము. హృదయములో ఆత్మ నివాసమై ఉన్నది. సర్వ జీవరాసుల హృదయ

స్థానములో ఆత్మగా నేనున్నానని భగవద్గీతయందు కూడ చెప్పబడి ఉన్నది. ఆత్మ నివాసము హృదయమని చెప్పబడుట వలన, హృదయము నుండి స్మృతి జ్ఞానము ఊహ కల్గునని చెప్పుట వలన, బ్రహ్మనాడినే హృదయముగ నిర్ణయించుకోవలసి వస్తున్నది. గుండె నుండి స్మృతి గాని, ఊహలుగాని కలుగవు. కావున గుండెను హృదయమన కూడదు. బ్రహ్మనాడియందే ఆత్మ ఉండుట వలన హృదయములో ఆత్మ నివాసమై ఉన్నదని చెప్పవచ్చును.

**448. (30) ఎరుక, మరుపులు దేనివలన కల్గుచున్నవి?**

జ. మనస్సు వలన.

**వివరము :** ఎరుక అనగ జ్ఞప్తి, మరుపు అనగ జ్ఞప్తి లేకుండ పోవడము అనగా నిద్ర. నిద్రగాని, మెలుకువగాని శరీరములోని ఒకే ఒక మనస్సు ద్వార కల్గుచున్నవి. మనస్సు సూర్య చంద్రనాడుల ద్వార శరీరమంత వ్యాపించినపుడు మెలుకువ కల్గుచున్నది. అలాగే మనస్సు బ్రహ్మనాడిలో చేరి స్తబ్దతగ నిలచి పోయినపుడు నిద్రయగుచున్నది. ఈ విధముగ మనస్సు యొక్క స్థాన మార్పును బట్టి నిద్ర మెలుకువలు కల్గుచున్నవి.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-28-01-1988**

**449. (1) యోచనకు అందనిదేది?**

జ. పరమాత్మ.

**వివరము :** శరీరములో యోచనలొచ్చునది బుద్ధికి. బుద్ధి గుణముల ద్వార ప్రపంచ విషయములను తెలుసుకోవడమేకాక జ్ఞానము ద్వార ఆత్మను కూడ తెలియగలదు. గుణముల యోచనల ద్వార ప్రపంచ విషయములను, జ్ఞానముల యోచనల ద్వారా ఆత్మ జీవాత్మలను తెలియగల బుద్ధి దేనిద్వార పరమాత్మను తెలియలేదు. బుద్ధి జ్ఞాననేత్రము ద్వార ఆత్మనైన తెలియగలదు గాని పరమాత్మను ఏమాత్రము

తెలియలేదు. శరీరము ధరించి ఉన్న ఏ జీవరాసి తన బుద్ధి చేత పరమాత్మను తెలియలేదు.

**450. (2) ఆశకు వ్యతిరేఖమైన గుణమేది?**

జ. దానము.

**వివరము :** అరిషట్ అని మిత్రషట్ అని రెండు విధములైన గుణములు గలవు. జీవునికి చెడు చేయునవి పాపము సంపాదించునని, అలాగే మంచి చేయునవి పుణ్యము సంపాదించి పెట్టునవి అని రెండు విధములైన గుణములుండును. శత్రువర్గములో మొదటి గుణము ఆశ, దానినే కామము అని కూడ అంటారు. ఆశ కోరుకొనే స్వభావముగలది. తనకు కావాలనుకోవడమే ఆశ. దానికి పూర్తి వ్యతిరేఖమైనది దానము. తన నుంచి దూరము చేసుకొనునది, తనకు వద్దనుకొని ఇతరులకు కావాలనుకొనునది దానము. ఇచ్చుకొను స్వభావము గలది దానము. ఆశ గుణమునకు పూర్తి వ్యతిరిక్తముగనున్నది దాన గుణము. రెండు గుణములు మానవునిలో ఉన్నప్పటికి ఆశ గుణము ఎక్కువ, దాన గుణము తక్కువ గలవారు ఎక్కువగ గలరు.

**451. (3) శరీరములో యోచించునది మనస్సా, బుద్ధియా ఏది?**

జ. బుద్ధి.

**వివరము :** మనస్సే శరీరములో ఆలోచిస్తుందని చాలా మంది అనుకొంటుంటారు. కాని అది వాస్తవము కాదు. శరీరములో ఆలోచించేది ఒక్క బుద్ధి మాత్రమే. శరీరములోని ప్రతి భాగమునకు ప్రత్యేకమైన పనులున్నాయని అనుకొన్నాము. మనస్సుకు బాహ్య ఇంద్రియ విషయములను లోపలికి, లోపలి ఇంద్రియ విషయములను బయటకి చేరవేయడము ఒక పనికాగ, ఆ పని లేనపుడు ఇంద్రియ విషయములను జ్ఞప్తి చేయుచుండును. మనస్సు లోపలికి అందించిన విషయములను గాని, లేక జ్ఞాపకము చేసి అందించిన విషయములను గాని, బుద్ధి గుణముల చేత యోచించను మొదలు పెట్టును. శరీరములో బుద్ధి యొక్క పని మనస్సు

ద్వార వచ్చిన విషయమును సంబంధిత గుణము ద్వార యోచించడమేనని తెలియాలి.

**452. (4) దైవపూజలో తాంబూలమునందు ఏమి ఉంచెదరు? ఎన్ని ఉంచెదరు?**

జ. మూడు ఆకులు, రెండు వక్కలు, ఒక సున్నము ఉంట.

**వివరము :** దైవ పూజలో ప్రతిది ఒక అర్థముతో కూడుకొని ఉన్నది. ఆరాధనలో తాంబూలము కూడ ఒకటై ఉండి విశేష అర్థముతో నిండివున్నది. మనలోని మూడు గుణములను సూచించునట్లు మూడు వస్తువుల తాంబూలమునుంచారు. తామస గుణ భాగము మూడవది పెద్దది మరియు ఎక్కువ మంది గలదియగుట వలన, తామసమును పెద్దగనున్న పచ్చని మూడు ఆకులుగ పోల్చి చూపించారు. అలాగే రెండవదైన రాజసమును రెండు వక్కలుగ చూపించారు. మొదటిదైన సాత్త్వికము ఒకటవది కనుక ఒక సున్నపు ఉంటగ, కొంత స్వచ్ఛమైన గుణము కనుక తెల్లని సున్నముగ చూపించారు. తాంబూల విషయము పూర్తిగ తెలియాలంటే మాచే రచింపబడిన **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథము చదవండి.

**453. (5) అర్జునునకు శ్రీకృష్ణుడు బోధించినది హింసనా అహింసనా?**

జ. హింస.

**వివరము :** యుద్ధము చేయమని శత్రువులను చంపమని చెప్పడము హింసయే అగును. శ్రీకృష్ణుని బోధలో ముఖ్య సారాంశము **"యజ్ఞార్థా కర్మ"** అనునది. చేసెడి పని యజ్ఞమను అర్థము నిచ్చునదై ఉండవలెనన్నాడు. అనగా! పనిలోని కర్మ కాలిపోవునట్లుండాలి అన్నాడు. పని చేస్తేనే కర్మ కాలిందా లేదా అని చూడవలసి ఉంది. పని చేయకపోతే కర్మ రావడము లేదు, మనము చూడవలసిన పనిలేదు. సందర్భానుసారము వచ్చినది యుద్ధము, కాబట్టి అపుడు హింస చేయవలసి వచ్చును. అట్లు చేసినప్పటికి పాపము అంటకుండ పోవునట్లు బోధించి, ఆ విషయమును ప్రయోగాత్మకముగ చేయమని చెప్పాడు. చేయమనినది హింసయిన చెప్పినది యజ్ఞ కర్మని తెలియాలి.

**454. (6) జన్మ జన్మలకు తల్లి ఎవరు?**

జ. ప్రకృతి.

**వివరము :** ఏ జీవరాసికైన, ఏ జన్మకైన శాశ్వితముగ తల్లి తండ్రి కలరు. శరీరమును తయారు చేయునది తల్లి. తల్లి ఇచ్చిన ఆకారమునకు కదలిక శక్తి నిచ్చి దానిలో జీవము నింపునది తండ్రి. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి చేత శరీరము తయారగుచున్నది. కావున తల్లి ప్రకృతియని భగవద్గీతలో చెప్పబడి ఉన్నది. అంతేకాక సర్వ జీవరాసులకు బీజదాతయైన పరమాత్మ తండ్రియని కూడ చెప్పబడి ఉన్నది. ఇది ఒక జన్మకు కాక శాశ్వితముగ ఉన్న పద్ధతి. అందువలన జన్మ జన్మలకు తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మని తెలుసుకోవాలి.

**455. (7) లింగము మీది మూడు రేఖలలో బొట్టు దేని మీద పెట్టవలెను?**

జ. మధ్యరేఖ మీద.

**వివరము :** లింగము అనగ పురుషత్వమును తెలియజేయునది. పరమాత్మ ఆకారములేనివాడని, స్త్రీతత్త్వము మీద అధిపతియని తెలియజేయు నిమిత్తము ఆకారములేని లింగమునుంచారు. పరమాత్మ పురుషుడని తెలుపు నిమిత్తము లింగము అను పేరు పెట్టారు. పరమాత్మ మూడు భాగములుగ విభజింపబడి ఆత్మ, జీవాత్మగ కూడ ఉండుటవలన లింగము మీద మూడు ఆత్మలను తెలియజేయు మూడు తెల్లని రేఖలనుంచారు. అందులో జీవాత్మకు ఆత్మయే పూజింపదగినవాడని తెలియజేయు నిమిత్తము క్రింది జీవాత్మను వదలి, పైన పరమాత్మ గుర్తును వదలి, మధ్యనున్న ఆత్మ గుర్తుగనున్న రేఖకు కుంకుమ బొట్టునుంచారు. జీవాత్మ ఆత్మను తెలియగలడు, కాని పరమాత్మను తెలియలేడు, కావున మధ్య దానికే గుర్తునుంచారు.

**456. (8) గురువు లేకనే మోక్షము పొందవచ్చునా?**

జ. పొందలేము.

**వివరము :** గురువు లేకున్నా జ్ఞానమును పొందవచ్చును. బోధకులవలనైనా జ్ఞానమును పొందవచ్చును. కాని గురువు లేకుండా మోక్షమును పొందలేము. జ్ఞానమును ఏ బోధకులైన తమకు తెలిసినది చెప్పవచ్చును. కర్మను కాల్చుటకు ముఖ్యమైన **జ్ఞానాగ్నిని** గురువు ఇవ్వవలసి ఉంటుంది. కావున అగ్నినొసగు గురువు లేనిది శిష్యులు మోక్షమను వంట చేయలేరు. అన్వేషించకున్నా బోధకులు దొరుకుదురు. కాని అన్వేషించినప్పటికీ గురువు దొరుకుట దుర్లభము. అందువలననే జ్ఞానము తెలిసినప్పటికీ, ఒకే జన్మలో మోక్షము పొందుదురను నమ్మకము లేదు.

**457. (9) గురువు లేకనే జ్ఞానమును పొందవచ్చునా?**

జ. పొందవచ్చును.

**వివరము :** గురువు, బోధకుడు అను రెండు రకముల గురువులు గలరు. జ్ఞానమును చెప్పు బోధకులు గురువులవలె చలామణి అయినప్పటికి వారు గురువులు కారు, కేవలము బోధకులే. ఆత్మ జ్ఞానమును బోధకుడు కూడ గురువువలె చెప్పవచ్చును. దానిని అర్థము చేసుకొన్నవారు జ్ఞానమును పొందవచ్చును. కాని గురువు యొక్క జ్ఞానమునకు, బోధకుని యొక్క జ్ఞానమునకు ఎంతో తేడా ఉండును. ఇద్దరిది జ్ఞానమే అయినప్పటికి గురువు నుండి జ్ఞానము శక్తి యుక్తమై పుట్టుకొచ్చుచుండును. అదే జ్ఞానమును బోధకుడు చెప్పినప్పటికి శక్తి యుక్తమై ఉండదు. గురువు చెప్పు జ్ఞానము అధికార పూర్వకముగ ఉండును, స్వయముగ తానే నిర్ణయించి చెప్పును. బోధకుడు చెప్పు జ్ఞానము అనధికార పూర్వకముగ ఉండును, ఇతరులవలన తెలిసినది చెప్పును, కాని స్వయముగ తానే చెప్పునది కాదు. ఏది ఏమైన గురువులేకనే బోధకుని ద్వారనైన జ్ఞానమును పొందవచ్చును.

**458. (10) జ్ఞాని అయ్యే కర్మ ఉంటే జ్ఞాని అగును. అటువంటి కర్మ లేకపోతే జ్ఞాని కాలేదు. అనుమాట వాస్తవమేనా?**

జ. వాస్తవము కాదు.

**వివరము :** ప్రపంచములో దేనికయిన కర్మ ఉంటుంది కాని జ్ఞానమును గూర్చిన, జ్ఞానమును నిర్ణయించు కర్మ ఉండదు. దేనినైన కర్మ శాశించును గాని జ్ఞానమును శాశించలేదు. అందువలన జ్ఞానమును కర్మ నిర్ణయించలేదు. కర్మను బట్టి జ్ఞానము వచ్చేది లేదు. శ్రద్ధను బట్టి జ్ఞానము లభ్యమయేది లేనిది ఉండును. కర్మను బట్టి ఉండదు. అందువలననే "శ్రద్ధవాన్ లభతే జ్ఞానమ్" అని గీతలో భగవంతుడు కూడ అన్నాడు. "కర్మవాన్ లభతే జ్ఞానమ్" అనలేదని గుర్తించుకోవాలి.

## 459. (11) నీకు నిజమైన సోదరులెవరు?

జ. ఆత్మ, పరమాత్మ.

**వివరము :** నీకు అనగ నీవు జీవుడవు. జీవునికి ముందు పుట్టిన వారుగలరు ముందు పుట్టినవారగుట వలన ఇక్కడ సందర్భానుసారము ఆత్మ పరమాత్మలు జీవునికి సోదరులని చెప్పవచ్చును. ప్రపంచ పరముగ సోదరులు ఉండవచ్చును, ఉండక పోవచ్చును. కాని ఆధ్యాత్మిక పరముగ ఆత్మ పరమాత్మలు శాశ్విత సోదరులని చెప్పవచ్చును. ఆధ్యాత్మికరీత్య పరమాత్మకు వరుసలేదు. ఆయన జీవులకు బీజ దాత కావున తండ్రి అగుచున్నాడు. ముందు పుట్టాడు కనుక సోదరుడగుచున్నాడు. ముందు జన్మల తండ్రి కావున వెనుక జన్మలలో తాతయునగుచున్నాడు. ఎప్పటికి నిన్నంటి ఉన్నాడు కనుక స్నేహితుడు అగుచున్నాడు. సందర్భమును బట్టి అర్థము చేసుకోవాలి.

## 460. (12) యజ్ఞములకధిపతి ఎవరు? అవి ఎక్కడ జరుగుచున్నవి?

జ. ఆత్మ. శరీరములో.

**వివరము :** యజ్ఞములకధిపతి ఆత్మ అని గీతలో చెప్పబడి ఉన్నది. అట్లే యజ్ఞములు దేహములోనే జరుగుచున్నవని కూడ చెప్పబడి ఉన్నది. యజ్ఞములు రెండు విధములని అవియే ద్రవ్యయజ్ఞము, జ్ఞానయజ్ఞమని కూడ గీతలోనే చెప్పారు. ద్రవ్య యజ్ఞము శరీరములోని జీర్ణాశయములో జరుగుచున్నది. ద్రవ్య యజ్ఞమునకు కావలసిన అగ్నిని జఠరాగ్ని అంటున్నాము. జఠరాగ్నిని ఆత్మ తన శక్తితో రసముల

రూపమునుండి పుట్టించుచున్నది, ఆత్మే నడిపించుచున్నది. కావున ద్రవ్య యజ్ఞమునకు ఆత్మను అధిపతి అని చెప్పవచ్చును. అట్లే జ్ఞానయజ్ఞము శిరస్సులో జరుగుచున్నది. జ్ఞానయజ్ఞమునకు కావలసిన అగ్ని జ్ఞానాగ్ని. ఆత్మ స్వయముగ తానే జ్ఞానాగ్ని రూపమున మారి జ్ఞానయజ్ఞము జరుగునట్లు చేయుచున్నది. కావున జ్ఞాన యజ్ఞమునకు కూడ ఆత్మ అధిపతి అని చెప్పవచ్చును.

**461. (13) మనస్సును వేమన యోగి ఏ పదార్థముతో పోల్చి చెప్పాడు?**

జ. పాదరసముతో.

**వివరము :** మనస్సు చంచలమైనది, బలమైనది, ఎవరికి దొరుకునది, కాదు బంధింపబడునది కాదు. మనస్సుతో సమాన పోలికలున్నది ఒకే ఒక పాదరసము. పాదరసము కూడ మనస్సువలె దొరుకునది కాదు. బంధించవలెనని ప్రయత్నించిన చిన్న సందుదొరికిన దూరిపోగలదు. మనస్సు నిద్రలో చిన్నగ ఉండి మెలుకువలో శరీరమంత పెద్దదిగ మారినట్లు పాదరసము కూడ చల్ల దనములో ఒక సైజులో ఉండి వేడిమిలో సైజును పెంచుకొని పెద్దదిగ మారగలదు. మనస్సు సున్నితమైనది కాదు, అట్లని కఠినమైనది కాదు. పాదరసము కూడ పూర్తి ద్రవము కాదు, లోహము కాదు. ఒకప్పుడు ద్రవముగ, ఒకప్పుడు లోహముగ మారగలదు. ఇట్లు అనేకముగ మనస్సుకు పాదరసమునకు దగ్గరి పోలికలున్నాయి. కనుక మనస్సును వేమన యోగి పాదరసముతో పోల్చి చెప్పాడు.

**462. (14) అశ్వర్థ వృక్షము రావి చెట్టా? మర్రి చెట్టా?**

జ. ఏదీ కాదు.

**వివరము :** అశ్వర్థము రావి చెట్టు గాని, మర్రి చెట్టు గాని కాదు. భగవద్గీతలో శరీరమునే అశ్వర్థముగ పోల్చి చెప్పాడు. అశ్వర్థమును అసంగశస్త్రముతో నరికి వేయమన్నాడు. ఎల్లవేళల విషయ సంగమము కల్గినది మనస్సు. దానిని యోగము అను ఆయుధముతోనే లేకుండ చేయవలెను. విషయమును ముఖ్యముగ మనస్సుకు లేకుండ చేయడము ఒక యోగమైతే, కర్మను చేరకుండ చేయడము మరియొక

యోగమగును. విషయ సంగము, కర్మ సంగము లేకుండ చేయడము వలన అశ్వర్థ వృక్షము నశించిపోవును. అశ్వము అనగ గుఱ్ఱము. అర్థము అనగ దానిలోని వేగము పరుగు అని అర్థము. అశ్వర్థము అనగ గుఱ్ఱమువలె పరిగెత్తు మనస్సు నివశించు శరీరమని కూడ వివరము గలదు. అన్ని శరీరములలో మనస్సు ఉన్నందువలన అన్ని శరీరములను అశ్వర్థ వృక్షములు అన్నాము. అందువలన అశ్వర్థ వృక్షము బాహ్యములో రావి చెట్టుగ, మఱ్ఱి చెట్టుగ పోల్చుకోకూడదు.

**463. (15) అశ్వర్థ వృక్షము యొక్క కాయల పేర్లేమి?**

జ. కర్మలు.

**వివరము :** శరీరమంత విస్తరించుకొన్న మనస్సు యొక్క ఆకులు విషయములు, గుణములనుకొన్నాము. గుణముల వలన వచ్చు ఫలితము చివరకు కర్మని కూడ అందరికి తెలుసు. అందువలన అశ్వర్థ వృక్షము యొక్క కాయలు కర్మ ఫలములని చెప్పుకొన్నాము. కర్మలు అనగ పాపములు పుణ్యములు. పాప పుణ్యములైన కర్మలే వృక్షము యొక్క ఫలములని తెలియాలి.

**464. (16) శరీరములోని ఆకలి ఏ గుణము?**

జ. ఏ గుణము కాదు.

**వివరము :** ఆకలి గుణముల వలన కల్గు బాధ కాదు. ఆత్మ ప్రేరణ వలన జరుగు శరీర కార్యములలో, గ్రంథుల వలన పుట్టి వచ్చిన రసముల ప్రభావము వలన ఆకలి కల్గుచున్నది. ఆత్మ ప్రేరేపిత రసములలో నుండి పుట్టిన అగ్ని వలన కల్గిన బాధను ఆకలి అంటున్నాము. జఠరాగ్ని ఆహారమును కాల్చినట్లు, ఖాళీ కడుపున్నపుడు జీర్ణాశయ గోడలకు తగులుట వలన ఆకలి మంట పుట్టుచున్నది.

**465. (17) కర్మననుసరించి కాలముండునా? కాలముననుసరించి కర్మయుండునా?**

జ. కాలముననుసరించి కర్మముండును.

**వివరము :** కంటికి కనిపించని నాల్గు చక్రముల అమరికలో పైన బ్రహ్మాచక్రము, దాని క్రింద కాలచక్రము, దానికంటే క్రింద కర్మచక్రము, అన్నిటికంటే క్రింద గుణచక్రము అమరి ఉన్నవి. ఈ నాల్గుచక్రముల అమరిక అన్ని జీవరాసుల కుండును. ఇది అందరికి మూలమైనది. ఈ నాల్గుచక్రములు ఒక దానితో ఒకటి అనుసంధానమై ఉన్నవి. బ్రహ్మాచక్రమును బట్టి కాలచక్రము, కాలచక్రమును బట్టి కర్మచక్రము, కర్మచక్రమును బట్టి గుణచక్రము తిరుగుచుండును. ఎవరికి ఏ గుణము రావాలన్న పైన వాని కర్మను బట్టి ఉండును. అలాగే ఎపుడు ఎవరికి ఏ కర్మ రావాలన్న పైననున్న కాలచక్రమును బట్టి ఉండును. కావున గుణములు కర్మానుసారము, కర్మ కాలానుసారము జరుగుచున్నది.

**466. (18) పుణ్యము చేసిన జీవుడు మరణించిన తర్వాత ఎక్కడికి పోవును?**

జ. మంచి జన్మకు పోవును.

**వివరము :** పుణ్యము చేసిన వాడు స్వర్గమునకు, పాపము చేసినవాడు నరకమునకు పోవునని, ఆ రెండు పైన గలవని, నరకమునకు యమధర్మరాజు, స్వర్గమునకు ఇంద్రుడు అధిపతులని చాలా మంది అనుకొనుట సహజము. కాని ప్రత్యేకముగ స్వర్గ నరకములని ఏమి లేవు. జీవుడు మరణించిన వెంటనే మరుజన్మకు పోవును. తర్వాత వచ్చిన జన్మలో పుణ్యమును బట్టి మంచి సుఖము, పాపమును బట్టి కష్టములు వచ్చుచుండును. దీనిని బట్టి పుణ్యము చేసిన వాడుగాని, పాపము చేసిన వాడుగాని జన్మలకే పోవునని, జన్మలలోనే స్వర్గ నరకములున్నవని, స్వర్గ నరకములు ప్రత్యేక దేశములోలేవని తెలియుచున్నది.

**467. (19) మోక్షము పొందినవాడు తిరిగి ఎప్పుడైన జన్మించునా?**

జ. జన్మించును.

**వివరము :** జన్మలనుండి విడుదల పొందడమే మోక్షమని, మోక్షము పొందిన

వానికి జన్మలుండవని చెప్పుట విన్నాము. మీరు మోక్షము పొందిన వాడు తిరిగి జన్మించునని చెప్పుచున్నారే! అని కొందరికి పెద్ద ప్రశ్న వచ్చుట సహజము. మీ ప్రశ్న సమంజసమైనదే ఎన్నో మార్లు మోక్షము పొందిన వాడు జన్మలు పొందడని జన్మ రాహిత్యమునకు పాటుపడవలెనని చెప్పుతూవచ్చాము. ఇక్కడ ప్రశ్నకు జవాబుగ జన్మించుననియే చెప్పవలసి వచ్చినది. మోక్షము పొందినవాడు తిరిగి వెంటనే జన్మించడు. వాడు పరమాత్మలోనికి ఐక్యమై పోవును. ఆ జీవునికి జన్మ రాహిత్యమైనట్లే. ఆ జీవుడు మోక్షము పొందనపుడు మరణిస్తూనే వెంటనే జన్మ పొందవలసి ఉన్నది. కాని మోక్షము పొందిన తర్వాత ఇక అట్లు పుట్టవలసిన పని లేదు. మోక్షము పొందిన వానికి కర్మ లేదు. కర్మ వానిని పుట్టించదు. కాని ఈ ప్రశ్నలో విశేషమేమిటంటే తిరిగి ఎప్పుడైన అన్న దానిని బట్టి జన్మించునని చెప్పవలసి వచ్చినది. మోక్షముతో జీవుడు పరమాత్మగ మారి అణువణువున వ్యాపించి పోవుచున్నాడు. అపుడు వాడు జీవుడు కాడు స్వయముగ పరమాత్మయే. అలా పరమాత్మగ మారిన జీవుడు ధర్మములు అధర్మములుగ మారినపుడు, ధర్మములను తిరిగి ఉద్ధరించడము కొరకు జన్మ తీసుకోవలసి వస్తున్నది. ఒకసారి మరణించి మోక్షము పొందినవాడు పరమాత్మగ మారి ఉన్నాడు. కనుక పరమాత్మ పుట్టినదంటే మోక్షము పొందినవాడు పుట్టినట్లే కదా! ఎప్పుడైన పుట్టునా అన్న మాటకు ధర్మములు అధర్మములుగ మారినపుడు పుట్టుననియే చెప్పవలెను.

**468. (20) కోప తాపములున్నవాడు గురువా?**

జ. గురువే.

**వివరము :** గురువుకు కోపమున్న అలాగే మిగత గుణములుండిన గురువు కాదనుటకు అవకాశము లేదు. ఎందుకనగా సాధారణ మనుషులవలె గురువుకు గుణముల ఫలితములంటవు. గురువు మొదట కర్మబద్ధుడు కాడు తర్వాత కర్మ బంధములు ఉండవు. గురువు స్వయముగ తానే కర్మను నిర్మించుకొని వచ్చి ఉండును. కాని కర్మ గురువుని నియమించదు. సాధారణ మనిషివలె అన్ని గుణములను వాడుకొని తనలో ప్రత్యేకతలేనట్లు బయటకు కనిపించడమే గురువు

యొక్క పని. మంచి చెడు రెండు రకముల గుణములుండుట వలన గురువును గుర్తించుట చాలా కష్టము.

**469. (21) నిజమైన గురువు ఊరిలో ఉండునా అడవిలో ఉండునా?**

జ. ఊరిలోనే ఉండును.

**వివరము :** గురువు అజ్ఞానులకు జ్ఞానము కల్గించుటకు, కాలగర్భములో కలసిపోయిన ధర్మములను పునరుద్ధరించుటకు వచ్చివుండును. అటువంటపుడు గురువు ప్రజల మధ్యలో ఉండి వారికి జ్ఞానము కల్గించడము ఆయన కర్తవ్యము. ప్రజల మధ్యలో ఉన్నపుడే సందర్భానుసారము జ్ఞానము బోధించుటకు అవకాశము ఉండును. అలాకాక అడవిలో ఉంటే ఏమి ప్రయోజనము. తెలుసుకోవలసినవారు ఎచటుందురో తెలియజెప్పువాడు అచటే ఉండవలెను. కావున గురువు ఊరిలోనే ఉండునని చెప్పవచ్చును.

**470. (22) జీవుడు ప్రకృతి ఆధీనములో ఉన్నాడా? పరమాత్మ ఆధీనములో ఉన్నాడా?**

జ. ప్రకృతి ఆధీనములో ఉన్నాడు.

**వివరము :** సర్వప్రపంచము, అందులోని జీవులు, ప్రతి వస్తువు, అణువణువు పరమాత్మ ఆధీనములో ఉన్నప్పటికి అన్నిటిని ప్రకృతి ఆధీనములో ఉంచి ప్రకృతి చేత పరమాత్మ ఆడించుచున్నాడు. పరమాత్మ నిర్ణయము ప్రకారము సర్వులు ప్రకృతిచేతిలో ఉండి, దాని చేతనే పోషింపబడుచు ఆడింపబడుచున్నారు. పరమాత్మ ప్రకృతికంతటికి అధ్యక్షత వహించి ఉన్నాడు. అందరిని తన ఆధీనములో ఉంచుకొన్న ప్రకృతి కూడ పరమాత్మ ఆధీనములో ఉన్నదని మరువకూడదు.

**471. (23) శరీరములో గుణముల సంఖ్య ఎంత?**

జ. 36.

**వివరము :** శరీరములో మూడు గుణ భాగములు గలవు. వాటి పేర్లే తామసము, రాజసము, సాత్త్వికము. ఒక్క భాగములో మిత్ర శత్రు వర్గములైన రెండు రకముల గుణములు గలవు. మిత్ర వర్గములో ఆరు, శత్రు వర్గములో ఆరు మొత్తము పన్నెండు గుణములు గలవు. ఒక భాగములో పన్నెండు చొప్పున మూడు భాగములలో ముప్పై ఆరు గుణములు గలవు. ఇవి కాక చాయ గుణములనునవి కూడ గలవు. అవి కూడ మిత్రవర్గములో ఒకటి శత్రువర్గములో ఒకటి చేరి ఉన్నవి. వాటితో కూడ కలిపి చూచితే ప్రతి వర్గములోను ఏడు గుణములు గలవు. మూడు భాగములలో లెక్కించితే 42 మొత్తము కాగలవు, కాని ముఖ్యముగ చెప్పుకోవలసినవి 36 మాత్రమే.

**472. (24) ప్రతి విషయమును బుద్ధి యోచన తర్వాతనే చిత్తము నిర్ణయించునా లేక స్వయముగ నిర్ణయించునా?**

జ. కొన్ని విషయములందు బుద్ధి ప్రమేయము లేకుండ స్వయముగ చిత్తము నిర్ణయించును.

**వివరము :** మనస్సు ద్వార వచ్చిన ప్రతి విషయమును బుద్ధి యోచించగ, బుద్ధి యోచించిన రెండు మార్గములలో ఏదో ఒక మార్గమును చిత్తము నిర్ణయించును. సాధారణముగ బుద్ధి యోచించిన తర్వాతే చిత్తము ఒక నిర్ణయానికొచ్చుచుండును. కొన్ని అత్యవసర సమయములలో మనస్సు పంపిన విషయమును బుద్ధి యోచించకనే చిత్తము తానే స్వయముగ నిర్ణయించి పంపును. ప్రత్యేకించి బుద్ధి యోచించుటకు వ్యవధి లేని విషయములలోనే చిత్తము అలా చేయునని తెలియాలి.

**473. (25) మాంసాహారము వలన ఏ గుణము వృద్ధి అగును?**

జ. ఏ గుణము వృద్ధి కాదు.

**వివరము :** మాంసాహారము వలన శరీరము వృద్ధియగును కాని గుణములు వృద్ధికావు. నోటి ద్వార తీసుకొను ఆహారము శరీరమును అభివృద్ధి చేయును.

అలాగే మనస్సుకు ఆహారమైన విషయములు గుణములను అభివృద్ధి చేయును. కావున ఆహారమునకు గుణములకు ఏమాత్రము సంబంధము లేదు. ఈ విషయమునే గీతలో భగవంతుడు కూడ చెప్పాడు.

**474. (26) ముక్కు నుండి వాసన ఏ భాగముచేత మనస్సుకు చేరుచున్నది?**

జ. ఘ్రాణము అను తన్మాత్ర భాగము చేత.

**వివరము :** ముక్కు శరీరములోని ఒక భాగము కాగ దానికి ఘ్రాణము అను సూక్ష్మ భాగము అనుసంధానమై ఉండి, తాను గ్రహించిన దానిని మనస్సుకు అందించుచున్నది. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క రకముగ ఘ్రాణశక్తి ఉండును. ముక్కు నుండి ఘ్రాణము ఇచ్చిన దానిని మనస్సు లోపలి బుద్ధికి అందించుచున్నది.

**475. (27) అహంకారము ఒక గుణమా?**

జ. కాదు.

**వివరము :** శరీరములోని మొత్తము 25 భాగములలో అహంకారము కూడ ఒకటి. గుణములు శరీరములో ఉండినప్పటికి శరీరములోని భాగములలోనికి లెక్కించ బడలేదు. గుణములు కర్మ అన్నియు ప్రత్యేక చక్రములో అమరి ఉండుటవలన వాటిని శరీర భాగములుగ లెక్కించలేదని తెలియుచున్నది.

**476. (28) కర్మ చేయు పని ఏమి?**

జ. జీవునికి కష్ట సుఖములందించుట.

**వివరము :** శరీరములో పనిచేయునది ప్రారబ్ధ కర్మ. ప్రారబ్ధకర్మ తన కర్మాను సారము శరీరముతో పని చేయించి అందులోని కష్ట సుఖములను జీవునికందించి అనుభవింపజేయుచున్నది. ప్రతి పనికి శరీరములోని ప్రారబ్ధకర్మే కారణమై ఉన్నది. ప్రతి పనికి వెనుకల వచ్చు సుఖ దుఃఖములను జీవుని చేత అనుభవింప జేయుచున్నది.

**477. (29) గీతయందు చెప్పినట్లు యజ్ఞ కర్మ ఆచరించుచు అన్ని పనులు చేయువానికి అంటునది పాపమా పుణ్యమా?**

జ. ఏది అంటదు.

**వివరము :** ఏ పని చేసిన అది యజ్ఞకర్మ అయినపుడు అనగా కర్మ కాలి పోయినపుడు ఏ కర్మ లేదు. కావున యజ్ఞకర్మ ఆచరించువానికి పాపముగాని, పుణ్యముగాని అంటుటకు వీలే లేదు. యజ్ఞ కర్మ కానపుడు చేయుచున్న పనిని బట్టి పాప పుణ్యములంటును. యజ్ఞ కర్మనికి ఏ కార్యమునందు ఎటువంటి కర్మ అంటదు.

**478. (30) యోగమంటే ఏమిటి?**

జ. కలసి ఉండడము.

**వివరము :** పొంది ఉండడము లేక కలసి ఉండడమును యోగము అంటాము. వియోగము అంటే విడిపోవడమని అర్థము. ఆధ్యాత్మికముగ ఆత్మతో కలిసి ఉండడమును అనగా జీవుడు ఆత్మ అనుభూతిని పొందడమును యోగము అంటారు. జ్యోతిష్య శాస్త్రరీత్య ప్రపంచ సుఖములను పొందడమును యోగ మంటారు. బ్రహ్మవిద్యలో ఆత్మను తెలిసి మోక్షము పొందు మార్గములను కూడ యోగమని చెప్పుచుందురు. గీతలో పరమాత్మను చేరు రెండు మార్గములను బ్రహ్మయోగము కర్మయోగమని చెప్పారు. యోగము అనుమాట దైవ సంబంధమైన లాభమును పొందునదని, ఉపయోగము అనుమాట ప్రపంచ సంబంధమైన లాభమును పొందునదని తెలియబడుచున్నది.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-28-01-1989**

**479. (1) ఏ శాస్త్రమనుసరిస్తే మోక్షము పొందవచ్చును?**

జ. యోగ శాస్త్రము.

**వివరము :** మనకున్నవి ఆరు శాస్త్రములు. వాటిలో మొదటి ఐదు శాస్త్రములు ప్రపంచ సంబంధమైనవి. ఆ ఐదు శాస్త్రముల ప్రకారము ప్రపంచ ఫలితములే లభించును. చివరిదియైన యోగశాస్త్రము ప్రపంచ సంబంధము కానిది. ఆ ఒక్క యోగశాస్త్రము యోగమును సూచించి పరమాత్మయందైక్యమగు విధానమును తెలియజేయును. కావున పై ప్రశ్నకు జవాబు ఒక్క పదములో "యోగ శాస్త్రము" అని ఐదక్షరములు వ్రాస్తే సరిపోవును.

**480. (2) నిదురలో పొర్లు వానికి ఏ శక్తి పని చేయుచున్నది?**

జ. ఆత్మశక్తి.

**వివరము :** సర్వ జీవుల శరీరాలలోను ఒకే విధానమైన ఆత్మ నివాసముంటూ, ఆ ఆత్మశక్తియే సర్వ శరీరములకు కదలిక నిచ్చుచున్నది. ఆత్మశక్తి మన శరీర శిరో భాగములో కేంద్రీకృతమై ఉండి, అక్కడి నుండి బ్రహ్మనాడి అను నరము ద్వార ప్రసారమవుచు, ఆ నాడియందే గల ఏడు కేంద్రముల ద్వార శరీర అవయవము లన్నిటికి ప్రాకి చైతన్యము నిచ్చుచున్నది. ఆ శక్తి మెలుకువయందు నిద్రయందు అన్ని వేళల ఒకే స్థితిగ మనయందు ఉన్నది. ఆ శక్తి ద్వారానే జాగ్రత్త, స్వప్న నిద్రావస్థలలో శ్వాస కదలింపబడుచున్నది. మెలుకువలో జరుగు పనులన్నియు మనకు తెలియుచున్నవి. కావున నేనే చేశానని జీవాత్మ అనుకొనుచున్నాడు. నిదురలో జరిగిన పనులను ప్రశ్నించినపుడు నేను చేసానని చెప్పలేక పోవుదురు. అందువలన ఏదో అతీతమైనశక్తి మనయందు పనిచేయుచున్నదని సులభముగ తెలుసుకోవచ్చును. నిదురలో ఒకే వైపు పడుకొనిన వాని శరీరము కొద్దిసేపటికి నొప్పి వచ్చి ఉండును. ఆ శరీర భాగము నొప్పి వార్త బ్రహ్మనాడిని చేరిన వెంటనే దానికి జవాబుగ ఏడు నాడి కేంద్రములలో ఏదో ఒక నాడి కేంద్రము, దానికి తగిన విషయమును పంపి, ఆ శక్తియే కదలించి శరీరమును త్రిప్పి పడుకోబెట్టు చున్నది. అందువలన పై ప్రశ్నకు కేవలము నాలుగు అక్షరముల జవాబు **"ఆత్మ శక్తి"** అని వ్రాయవలయును.

**481. (3) 2.1/4 ఆత్మ ఏది?**

జ. పరమాత్మ.

**వివరము :** ఇది కూడ నాలుగక్షరముల జవాబు మాత్రమే. ఇది చాలా మందికి విచిత్రమైన ప్రశ్నగ కనిపించింది. ఒకటేమో జీవాత్మ. ఇది ఒక్క శరీరమందు మాత్రమే ఉండును. కనుక అనేక శరీరములందు అనేక జీవాత్మలుండును. రెండవది ఆత్మ. ఇది శరీరములో పూర్తి వ్యాపించి ఉన్నది. ఇక మూడవది పరమాత్మ సర్వ శరీరములందు గల ఆత్మకంటే వేరైనది, కావున ఆత్మకంటే పరమైనదని పరమాత్మ అంటున్నాము. రెండవ ఆత్మ తర్వాత అణువణువున వ్యాపించి ఉండేదంతా పరమాత్మే కావున $2\frac{1}{4}$ ఆత్మ అనిన, $2\frac{1}{2}$ అనిన, $2\frac{3}{4}$ అనిన మూడవది అనిన అన్నియు పరమాత్మకే వర్తించును. మీకు అర్థమగునట్లు ఒక ఉపమానము కూడ చెప్పుచున్నాము. మన ఇంటిలో మూడు గదులున్నాయను కొనుము. 1వ గది, 2వ గది, 3వ గది అని వాటికి పేర్లు పెట్టుకొన్నాము. రెండు గదులు దాటి మూడవ గదిలో ప్రవేశించి వాకిలికి దగ్గరగ గది మొదటి భాగములో నిలిచిన, గది మధ్యలో నిలిచిన, గది చివరి భాగములో నిలిచిన మూడవ గదిలో నిలిచినట్లే అగును. గదిలో మొదటి భాగములో నిలిచిన వ్యక్తి ఎక్కడ నిలిచినట్లని అడిగితే మూడవ గదిలోనే అని చెప్పబడును. అట్లే గది మధ్యలో నిలిచిన వ్యక్తిని ఎక్కడ నిలిచాడని అడిగితే గణితము ప్రకారము రెండున్నర గదిలో అనలేము మూడవ గదిలోనే అని చెప్ప గలము. అదే విధముగ $2\frac{1}{4}$ ఆత్మనిన $2\frac{1}{2}$ ఆత్మనిన మూడవ ఆత్మయిన పరమాత్మ క్రిందికి లెక్కింపబడును. కావున పరమాత్మ అను నాలుగక్షరముల సమాధానము సరియైనది.

**482. (4) మానవుల మొదటి కులమేది?**

జ. బ్రాహ్మణ కులము.

**వివరము :** ప్రపంచము పుట్టిన తర్వాత కొంత కాలము వరకు అందరు బ్రహ్మ జ్ఞానము తెలిసినవారై ఉండిరి. తర్వాత బ్రహ్మ జ్ఞానము తెలియని వారు ఏర్పడగా

తెలిసిన వారిని బ్రాహ్మణులు అని అనడము జరిగినది. తెలియని వారిని రెండవ కులముగ లెక్కించి, తెలిసిన వారిని మొదటి కులముగ లెక్కించారని ఆదిలోని రహస్యమను శీర్షిక క్రింద ముందొక మారు కూడ మేము చెప్పాము. కొందరు ప్రపంచ మొదటి కాలములో కులమే లేదని వ్రాశారు. మొదట కాలమని అడగక ఎప్పుడు ఏర్పడిందో అప్పటి కులమడిగాము కావున మొదటి కులము "బ్రాహ్మణ" అని మూడక్షరముల జవాబు సరియగును.

**483. (5) కాలమనునది ముగ్గురి పురుషులలో ఎవరికి వర్తించును?**

జ. పరమాత్మకు.

**వివరము :** భగవద్గీతలో కూడ విశ్వరూప సందర్శన యోగమను అధ్యాయములో అర్జునునికి విశ్వరూపము అర్థము కాక, నీవు ఎవరని అడిగినపుడు నేను కాలమును అని ఒకటే జవాబు చెప్పబడినది. విశ్వమంత వ్యాపించిన వానికే కాలమను పేరు వర్తిస్తుంది. కావున మూడవ పురుషుడైన "పరమాత్మకు" అని ఐదక్షరముల జవాబు వ్రాస్తే సరిపోవును.

**484. (6) గీతలో బోధించిన సారాంశములు ఎన్ని యోగములు?**

జ. రెండు మరియు ఒకటి.

**వివరము :** భగవద్గీతలో 17 అధ్యాయములు ఉన్నప్పటికి అందులోని సారాంశము రెండే రెండు భాగములుగ ఉన్నది. ఒకటి పనులు చేయుచు కర్మరాహిత్యము చేసుకోవడము, రెండవది పనులు చేయక మనస్సు నిలిపి కర్మను లేకుండ చేసుకోవడము. అనగా ఒకటి అహంకారమును అనచి వేయడము, రెండవది మనసును కదలకుండ చేయడము. కావున రెండని రెండక్షరముల జవాబు సరియగును. ఈ రెండుకాక మరియొకటి భక్తియోగము కలదు. దీనికి ధర్మములు లేవు. ధర్మములు గల యోగములు రెండుకాగ ధర్మములు లేని యోగము మరియొకటి. దానితో కూడ లెక్కించిన మొత్తము మూడగును.

**485. (7) హరిజనులు పూర్వము ఏ విధముగ పిలువబడెడివారు?**

జ. మా దిగువవారని పిలువబడెడివారు.

**వివరము :** పూర్వము మొదటి కులము బ్రాహ్మణులైనప్పుడు, బ్రహ్మ జ్ఞానము తెలియని వారినందరిని మాకంటే తక్కువ వారను ఉద్యేశముతో మా దిగువవారని పిలిచెడివారు.

**486. (8) సాకార పూజంటే ఎవరిని పూజించుట?**

జ. భగవంతుని.

**వివరము :** నిరాకారమంటే రూపము లేనివాడని, సాకారమంటే రూపమున్న వాడని అర్థము. నిరాకారుడైన రూపము లేని వాడే రూపమున్న భగవంతునిగ ఉండడమును సాకారమంటారు. ఆ భగవంతుని పూజించుటయే సాకారమును పూజించినట్లగును. ప్రతిమలను పూజించుట సాకార పూజ కాదు.

**487. (9) నా బుద్ధి గొప్పదనుట అహంకారమా కాదా?**

జ. కాదు.

**వివరము :** తన మీద చెప్పుకొనక, తన అంతఃకరణమైన బుద్ధి గొప్పదనుట అహంకారము కాదు. తన బుద్ధిని కూడా తానుగా లెక్కించుకొన్నపుడు అహంకార మగును. **నేను** తెలివైన వాడినన్నపుడు అహంకారమగును.

**488. (10) గీతలో చెప్పిన జీవులలోని నాల్గువర్ణములేవి?**

జ. తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులు.

**వివరము :** ఈ ప్రశ్నకు చాలామంది బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర అని వ్రాసి పొరపడ్డారు. గీత 3వ అధ్యాయములో 13వ శ్లోకమున భగవంతుడు గుణ కర్మలను బట్టి నాల్గు వర్ణములుగ నేను తయారు చేశాను అన్నాడు. బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులని చెప్ప లేదు. గుణములను బట్టి వర్ణములన్నాడు. అదే భగవద్గీతలోనే గుణములు కర్మలు ఉన్నవారు మూడు రకములవారని, గుణకర్మలు

లేని వారొక రకము వారని తెలియబరచబడినది. గుణముల వలన కర్మలు సంభవించు వారు మూడు విధములు గలరు. వారు తామసులు, రాజసులు, సాత్త్వికులు వీరు త్రిగుణులు. గుణముల వలన కర్మలు అంటని వారు గుణ రహితులు వీరే యోగులు. "గుణకర్మ విభాగశః" అని శ్లోకములో ఉన్నపుడు గుణ కర్మలను బట్టియని ఎందుకు యోచించకూడదు. గుణకర్మల బట్టి యోచిస్తే గుణ కర్మలు కలవారు మూడు రకములు, గుణ కర్మలు లేనివారు ఒక రకము వారు, మొత్తము నాల్గువర్ణములని సులభముగ తెలియుచున్నది.

**489. (11) సూక్ష్మములో మోక్షమంటే ఏమిటి?**

జ. భగవంతుని గుర్తించుట.

**వివరము :** ఏ సాధన చేయకుండనే మోక్షము పొందే సులభ పద్ధతి ఒకటుంది అదే సూక్ష్మములో మోక్షమంటారు. భగవద్గీత మూడవ అధ్యాయమున 9వ శ్లోకములో చెప్పినట్లు పరమాత్మ శరీరధారియై భగవంతునిగ వచ్చినపుడు, ఈయన పరమాత్మయేనని గుర్తించినవాడు తిరిగి జన్మించడు. ఈ విధముగనే పరమాత్మ శ్రీకృష్ణునిగ అవతరించినపుడు సాకారమును గుర్తించిన భీష్ముడు ఏ సాధన చేయకుండానే మోక్షము పొందాడు.

**490. (12) భగవంతుడు అంతటా చూస్తున్నాడా?**

జ. చూడలేదు.

**వివరము :** దేవుడు అంతటా చూస్తున్నాడనుట సరియగును, కాని భగవంతుడు అంతటా చూస్తున్నాడనుట సరికాదు. ఇది చాలా మందికి తెలియని రహస్యముగ నిలచిపోయినది. దేవుడే శరీరధారియైనపుడు ఆ శరీరమునకున్న కన్నును బట్టియే చూపు ఉండును. సాకారమున కన్ను చూచు పరిధివరకే చూడగల్గును, కాని అంతకంటే ఎక్కువ చూడలేడు. సాకార నిరాకార తారతమ్యము తెలియని వారంతా సాకారమైన భగవంతుని కూడా నిరాకారముగా లెక్కించి చూస్తున్నాడనుకొన్నారు. భగవంతుడనగా సాకారుడని తెలిసినపుడు చూడలేదని తెలియగలరు.

**491. (13) యజ్ఞములు ఎన్ని? చేయువారు ఎవరు?**

జ. రెండు. చేయువారు జీవులు.

**వివరము :** శాస్త్రబద్ధమైనవి గీతలో చెప్పబడినవి రెండు రకముల యజ్ఞములు కలవు. అవి **1. ద్రవ్య యజ్ఞము, 2. జ్ఞాన యజ్ఞము.** ఈ యజ్ఞములు సర్వ జీవరాసులకు సంబంధించినవి. ద్రవ్యయజ్ఞము ప్రతి జీవరాసి చేయగల్గుచున్నది. జ్ఞానయజ్ఞమును అందరు చేయకున్నను ఏ కొద్ది మంది మాత్రమో చేయగల్గు చున్నారు. కావున చేయువారు జీవులనుట సరియైనది. యజ్ఞములనగానే అశాస్త్రీయమైన, కల్పితమైన, గుంతలు త్రవ్వి పుల్లలు వేసి కాల్చు యజ్ఞములనుకొని చేయువారు బ్రాహ్మణులని వ్రాశారు. ఇది యోగ శాస్త్రమైన జవాబు కాదు.

**492. (14) గుణములున్న మరియు గుణములు లేని యోగములేవి?**

జ. రాజయోగము, బ్రహ్మయోగము..

**వివరము :** గీతలో చెప్పబడిన సారాంశము రెండు యోగములని ముందే తెలుసు కొన్నాము. వాటిలో అహంకారము లేకుండ గుణములతో పని చేయబడుచు సాగించు పద్ధతిని రాజయోగము (కర్మ యోగము) అని అందుము. గుణములు ఏ మాత్రము లేకుండ, పంచ జ్ఞానేంద్రియ జ్ఞాపకాలు మనస్సుకు ఏ మాత్రము పోకుండ, మనస్సును ప్రపంచ విషయములలో పూర్తి అణచి ఉంచడము బ్రహ్మయోగము (జ్ఞాన యోగము) అందుము.

**493. (15) ఆత్మకు అవధి ఉన్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** సర్వ జీవశరీరములందు మాత్రముండునది ఆత్మ. ఆత్మ జీవ శరీరముల బయట లేదు. కావున ఆత్మకు అవధి ఉన్నదని చెప్పవచ్చును. పరమాత్మ అణువణువున వ్యాపించిన వాడు కనుక పరమాత్మకు అవధి లేదు. శరీరమునందు ఒక్కచోట గల జీవాత్మకు, శరీరమంత వ్యాపించిన ఆత్మకు అవధి ఉన్నది.

**494. (16) మరణించిన జీవునితో పాటు క్రొత్త శరీరమునకు పోవునవి ఏవి?**

జ. గుణ, కర్మలు, ఆత్మ.

**వివరము :** గీత 14వ అధ్యాయములో 8వ శ్లోకమున చెప్పబడినట్లు గుణములు, కర్మ మరియు వానితో సహ ఆత్మ క్రొత్త శరీరమును చేరుచున్నవి. మరణించినపుడు ప్రతి జీవరాసి శరీరములోను తలయందు గల నాల్గుచక్రములు సూక్ష్మముగ మరియొక శరీరమును చేరుచున్నవి. బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రములని వ్రాసిన జవాబు సరియగును.

**495. (17) శాస్త్రమంటే ఏమిటి? అవి ఎన్ని?**

జ. శాసనములతో కూడుకొన్నది శాస్త్రము. శాస్త్రములు ఆరు.

**వివరము :** చెప్పబడిన మాట నిరూపింపబడు స్థోమత గల శాసనములతో కూడు కొన్నదే శాస్త్రము. ఆ విధమైన శాస్త్రములు ఆరు గలవు. 1. గణిత శాస్త్రము, 2. ఖగోళ శాస్త్రము, 3. రసాయనిక శాస్త్రము, 4. భౌతిక శాస్త్రము, 5. జ్యోతిష్య శాస్త్రము, 6. యోగ శాస్త్రము (బ్రహ్మ విద్యాశాస్త్రము)

**496. (18) రుద్రాక్షను పూర్వము ధరించెడివారు జ్ఞానులా? అజ్ఞానులా?**

జ. అజ్ఞానులు.

**వివరము :** పూర్వము గ్రహ బాధలు, వాటి భయములున్న వారు మాత్రము రుద్రాక్షలు ధరించెడివారు. జ్ఞానులు గ్రహములకు భయపడరు, కావున వారు ధరించెడి వారు కాదు.

**497. (19) ధర్మానికి, దానానికి తేడా ఏమిటి?**

జ. ఇచ్చునది దానము, తెలుపునది ధర్మము.

**వివరము :** దానము ఒకరిచేత ఇవ్వబడునది. ధర్మము ఒకరిచేత చెప్పబడునది.

చేసిన దానము కొంత కాలమునకు తరిగిపోవును. చెప్పబడిన ధర్మము శాశ్వితముగ మనస్సున నిలిచి పోవును. దానము వలన పుణ్యము, ధర్మము వలన మోక్షము లభించును. ఇట్లు ఎన్నో విధములుగ దాన ధర్మములకు తేడాలున్నవి.

**498. (20) భగవద్గీతలో విశ్వరూపమునకున్న చేతులు ఎన్ని?**

జ. అనేకము.

**వివరము :** విశ్వమంత వ్యాపించినది విశ్వరూపము కనుక విశ్వములో గల అందరి చేతులు విశ్వరూపమునకున్నట్లే. విశ్వములో గల చేతులు లెక్కింప నలవికానిపని కావున "అనన్త బాహుం" అని 10వ అధ్యాయమున 19వ శ్లోకమున తెల్పబడినది. కొందరు వేయి చేతులన్నారు. వేయి చేతులైతే 500 ల మంది మానవుల కొలతకే వచ్చును కాని విశ్వరూపము కాదు. అందువలన 1000 చేతులనుట తప్పు.

**499. (21) నాలుగుయుగముల కాలము ఎన్ని సంవత్సరములు?**

జ. 43,20,000.

**వివరము :**

| | |
|---|---|
| కలియుగము | 4,32,000 |
| ద్వాపర యుగము | 8,64,000 |
| త్రేతా యుగము | 12,96,000 |
| కృత యుగము | 17,28,000 |

నాల్గుయుగముల మొత్తము కాలము **43,20,000.**

**500. (22) భగవద్గీతలో కృష్ణుడు వేదములెక్కడున్నాయన్నాడు?**

జ. తలలో.

**వివరము : "త్రై గుణ్య విషయా వేదా"** అను గీత సాంఖ్యయోగమను అధ్యాయములో 45వ శ్లోకమున గల వాక్యము ప్రకారము వేదములనగ మూడు గుణముల

విషయములే. ఆ మూడు గుణములు మన తలలో ఉన్నవి. పై భాగమున ఉన్న వీటిని తెలుసుకొంటే వేదములు తెలుసుకొన్నట్లేనని పురుషోత్తమ ప్రాప్తి యోగములో చెప్పబడినది. వేదములకు మారు పేరు గుణములు. ఆ గుణములు తలయందు గలవు. అందువలన వేదములు తలయందున్నాయనుట జవాబు సరియగును.

**501. (23) దేవాలయ ధ్వజస్థంభము పైన గల గంటలు దేనికి గుర్తు?**

జ. గుణములకు.

**వివరము :** ధ్వజస్థంభము పైన గల గంటలు గుణములకు గుర్తుగ ఉంచారు. గుణములు మూడు రకములు కావున మూడు వరుసల గంటలుంచారు. ఒక్కొక్క రకమున ఆరు గుణములున్నవి. కావున ఒక్కొక్క వరుసలో ఆరు గంటల ప్రకారము మొత్తము 18 గంటలు మూడు వరుసలలో గుణముల వివరము తెలియజేస్తున్నట్లు ఉంచారు.

**502. (24) ఏకాగ్రత అంటే ఏమిటి?**

జ. మనస్సుకు ఏ ధ్యాస లేకుండా పోవడము.

**వివరము :** ఒక దాని మీద మనస్సు లగ్నము చేయుటని చాలా మంది వ్రాశారు. ఒక దాని మీద లగ్నము చేయుట ఏకమవును గాని ఏకాగ్రత కాదు కదా! ఏకమనగ ఒకటని, ఏకాగ్రత అనగ ఒకటి తర్వాత ఉండు సున్న అని అర్థము. ఏ ఒక్క ధ్యాస లేకుండ మనస్సు ఖాళీ చేయడమునే ఏకాగ్రత అంటాము. అట్లుకాక ఒక మంత్ర జపమందు లగ్నమైనవాడు అనేక విషయముల నుండి మనస్సును ఒక్కటైన మంత్రము వైపు మల్లించుకొని, అనేకము నుండి ఏకమునకు వచ్చాడు కాని ఏకాగ్రతకు రాలేదు. శబ్దరూపమైన చెవులతో వినిన ఆ మంత్ర ధ్యాస కూడ లేకుండ పోయినపుడే ఏకాగ్రత అగును.

**503. (25) తల్లిగర్భము నుండి సజీవముగా వచ్చు శిశువును ఏమంటారు?**

జ. భగవంతుడు.

**వివరము :** తల్లిగర్భము నుండి సజీవముగ వచ్చువాడు పరమాత్మయే, కావున సజీవముగ వచ్చిన శరీరమును భగవంతుడు అంటారు. భగము నుండి పుట్టిన వాడు కనుక భగవంతుడనగలము. మిగత జీవరాసులు అలా భగము నుండి పుట్టలేదు. భగము నుండి పట్టిన శరీరమును చేరునవి జీవులు. అలా మరియొక చోటి నుండి రాక, అణువణువున ఉన్న పరమాత్మ తల్లి గర్భములోను, ఆ గర్భ శిశువులోను ఉన్నాడు. కనుక ఆయనొక్కడే లోపలి నుండి సజీవముగ బయటపడ గలడు. కావున ఆ శిశువును భగవంతుడనుట జవాబు.

**504. (26) విశ్వవ్యాపి ఆత్మనా కాదా? ఎవరు?**

జ. ఆత్మ కాదు. పరమాత్మ.

**వివరము :** ఆత్మ శరీరములందు మాత్రమే ఉన్నది. పరమాత్మ శరీరముల లోపల బయట అంతట అణువణువున వ్యాపించి ఉన్నది. కావున విశ్వమంతా వ్యాపించి విశ్వవ్యాపి అను పేరు కల్గినది పరమాత్మయేనని చెప్పనగును.

**505. (27) మానవుడు భయపడవలసినది కర్మకా? కాలానికా?**

జ. కర్మకు.

**వివరము :** కర్మ గుణములను ప్రేరేపించి, వాటి చేత పనులు చేయించి, కష్ట సుఖములను జీవులు అనుభవించునట్లు చేయుచున్నది. కాలము అందరి ఎడల సమానముగ జరిగి పోవుచున్నది. కాని కర్మ అందరి ఎడల సమానముగ లేక రకరకములుగ ఉండి రకరకములుగ బాధించుచున్నది. కావున భయపడవలసినది కర్మకేగాని కాలానికి కాదు.

**506. (28) దేవాలయములోని శివలింగము ఎవరి గుర్తు?**

జ. పరమాత్మ గుర్తు.

**వివరము :** రూప నామములు లేని వాడైన పరమాత్మను తెల్పు సూచనగ ముక్కు ముఖములేని రాయిని పెట్టారు. పేరు లేదు కావున ఏ పేరు కాని ఈశ్వరుడన్నారు.

ఈశ్వరుడనగ అధిపతి అని అర్థము. పరమాత్మ గుర్తుగ ఉంచిన లింగమును ఈనాడు అజ్ఞాన వశమున శంకరునిగ పోల్చుకొనుట జరుగుచున్నది. నిజముగ దేవాలయములోని లింగము పరమాత్మ గుర్తు కాని శంకరుడు కాదు.

**507. (29) భగవద్గీతను అర్థము చేసుకొనుటకు ముఖ్యముగ తెలియ వలసిన సూత్రములెన్ని?**

జ. నాలుగు.

**వివరము :** ముఖ్యముగ నాల్గు సూత్రముల ప్రకారము భగవద్గీతను చదివితే దానిలోని సారాంశమర్థమగును. కాని నాల్గు సూత్రముల అమలు లేకుండ చదివితే ఎప్పటికి గీతలోని భావము అర్థము కాదు. ఆ నాల్గు సూత్రములు *1. చదవబడు శ్లోకము శాస్త్రబద్ధమైనదా కాదా? 2. చదవబడు శ్లోకము చెప్పబడినది జీవాత్మకా, ఆత్మకా, పరమాత్మకా? 3. చదవబడు శ్లోకము రాజయోగ సంబంధమా లేక బ్రహ్మయోగ సంబంధమా? 4. చదవబడు శ్లోకము సాకారమునకు చెప్పినదా నిరాకారమునకు చెప్పినదా?* ఈ నాల్గు సూత్రములు తెలియకుండ చెప్పెడి వారికిగాని, వినెడు వారికి గాని, భగవద్గీత సంశయములతో కూడుకొనియే ఉండును.

**508. (30) చిదంబర రహస్యమని మీరు "దేవాలయ రహస్యములు" అను గ్రంథములో వ్రాశారు. ఒక వ్యక్తి చిత్ అంబరమనాలి చిదంబరమన కూడదు అంటున్నాడు. చిద అంబరమునకు చిత్ అంబరమునకు తేడా ఉన్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** చిదంబరము అనగా మా గ్రంథములో పూర్తి వివరము చెప్పాము. ఈ పదములో 'చిద' అని మేము చెప్పగా, 'చిత్' అని మరియొక వ్యక్తి చెప్పాడన్నారు. సత్ చిత్ అనునవి రెండు గలవు. ఆ సత్, చిత్, ఆనంద అను వాటిని కలిపి "సచ్చిదానంద" అనుట కూడ జరిగినది. సత్ అనగా సారాంశము కల్గినది ఆత్మ

అనియు, చిత్ అనగా! సారాంశము లేనిది దేహమనియు తెలియుచున్నది. ఆత్మను సత్తు అనియు శరీరమును చిత్తు అనియు అనుట కూడ జరుగుచున్నది. సత్తయిన ఆత్మను చిత్తయిన శరీరములో అనుభవించడమును సచ్చిదానందము అంటున్నారు. ఆత్మానుభూతిని ఆనందమని వర్ణిస్తూ, శరీరములో ఆత్మనుభూతిని పొందువానిని సచ్చిదానంద అని పూర్వము పెద్దలు పిలిచెడివారు. సచ్చిదానంద అనెడి పదము పేరుకాదు. మనిషి ఆత్మను పొందిన అర్థమును తెలుపుపదము అనియు లేక మనిషి బ్రహ్మయోగమును సాధించిన అర్థమును తెలుపు పదము సచ్చిదానంద అనునది. ఈ కాలములో సచ్చిదానంద అని కొందరు పేరు కూడ పెట్టుకొన్నారు. సచ్చిదానంద అనుపదమును పేరుగ వాడకూడదు. ఆ పదము మనిషి యొక్క ఔన్నత్యమును తెలుపు గుర్తు. అది మనిషికి శాశ్విత పేరుగ ఉండకూడదు. చిత్‌కు చిదకు కొంత తేడాగలదు. చిద అనగా గుడ్డ అనియు చిత్ అనగా సారము లేనిదనియు అర్థము. బట్ట + బయలు = బట్టబయలు అను పదమును, చిద + అంబరము = చిదంబరము అని ఒక దేవాలయములో గుడ్డను తెరగవాడిన సందర్భములో వాడారు. సందర్భమును బట్టి అక్కడున్న పరిస్థితిని బట్టి చిదంబరము అనుట తగును. చిత్ అంబరము అనుట ఆ తెరకు సరిపడదు.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-28-01-1991**

**509. (1) అత్తపత్రి కలబంద కథలో కలబందను ఏ గుర్తుగ పోల్చారు?**

జ. అహంకారముగ.

**వివరము :** అత్తపత్రి చెట్టును తాకితే ఆకులన్ని ముడుచుకుంటుందని అందరికి తెలుసును. దానికి పూర్తి వ్యతిరేకముగ ఉన్నది కలబంద. దీనిని తాకినప్పటికి ముడుచుకోదు, వంగదు. మిగత చెట్ల మొక్కల ఆకుల మాదిరికాక పూర్తి నీలుక్కొని ఉంటుంది. ఆకులలో అత్తపత్రికి, కలబందకు ఉన్నంత తేడా మనుషులలో అహంకారము లేనివారికి, అహంకారము ఉన్నవారికి ఉంటుంది. అహంకారము

లేనివారు ఎదుటివారి ఎడల అత్తపత్రివలె తనను తాను తగ్గించుకుంటారు. అహంకారము ఉన్నవారు కలబందవలె కొద్దిగ కూడ తగ్గరు. అందువలన కథలో అహంకారమును కలబందతో సమానముగ పోల్చడమైనది.

**510. (2) కాళ్ళు ప్రకృతి భాగములలో వేటివలన తయారయినవి?**

జ. భూమి 5వ భాగము + అగ్ని 5వ భాగము.

**వివరము :** మన శరీరములు ప్రకృతిలోని ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను 5 భాగముల చేత కలిసి తయారైనది. పంచ భూతములు ఒక్కొక్కటి 5 భాగములుగ వీడిపోయి 5X5 = 25 మొత్తము భాగములుగ తయారయినవి. అందులోని ఒక దానితో ఒకటి కలిసి మన శరీర భాగములు తయారయినవి. వాటిలో భూమి 5వ భాగము అగ్ని 5వ భాగము, కలిసి కాళ్లు తయారయినవి. అందువలన అవి ఎపుడు భూమి మీద ఆనియే ఉంటాయి. మరియు మనిషిలోని వేడి తగ్గుటకు ఎక్కుటకు ముఖ్య పరికరములుగ పాదములున్నాయి. కాల్లు కాలితే వేడవుతుంది. పాదములకు ఆముదము తిక్కితే మనిషికి చలవ చేకూరుతుంది.

**511. (3) సర్వులకు సాక్షి ఎవరు?**

జ. పరమాత్మ.

**వివరము :** ఒక పనిని చేయువాడు వేరు, చూచువాడు వేరు. చేసేవాడు చేసేపనిని బట్టి రకరకములుగ పిలువబడుచుండును. బండిని నడుపువానిని డ్రైవర్ అని, తల కొరుగు వానిని మంగళి అని, వారి పని సంబంధముగ పేరు పెట్టుదుము. చూచేవానిని మాత్రము సాక్షి అంటున్నాము. శరీరములో చేసేవాడు, చూచేవాడు ఇద్దరు కలరు. చేసే పనిని బట్టి చేసేవానికి పేరు వచ్చినట్లు, శరీరములో చైతన్య రూపమై తనకు తానుగ చేయుచున్నవానిని ఆత్మ అంటున్నాము. చేయుచున్న ఆత్మను చూచేవాడు పరమాత్మ అంటున్నాము. ప్రతి శరీరములోను పరమాత్మ సాక్షిగ ఉంటు ఏమి చేయకున్నాడు. ఆత్మ సాక్షి అని చాలామంది అంటుంటారు. ఆత్మ సాక్షి కాదు, ఆత్మ పనిచేయుచుండగ పరమాత్మ చూస్తు ఉన్నది. ఈ విషయము

తెలియక జీవాత్మ చేస్తు ఉంటే, ఆత్మ చూస్తు సాక్షిగ ఉన్నదని చాలామంది అనుకొంటుంటారు. వాస్తవానికి జీవాత్మ ఏ పని చేయడము లేదు. ఆత్మ ప్రతి పని చేయుచుండగ జీవాత్మ లోపల ఒక చోట ఉండి ఫలితములను అనుభవిస్తున్నది. ఆత్మ మాత్రము శరీరములో పని చేయుచున్నది. పరమాత్మ చూస్తున్నది కావున పరమాత్మను సాక్షి అంటున్నాము.

**512. (4) అన్నిటిలో ఉన్నది ఎవరు?**

జ. పరమాత్మ.

**వివరము :** ఆత్మ జీవముగల శరీరములలో మాత్రమే ఉన్నది. జీవము లేని శవము, నీరు, అగ్ని, చెక్క, ఇనుములో లేదు. కాని పరమాత్మ ప్రాణములేని శవములోను, రాయి, రప్పలోను అణువణువున వ్యాపించి ఉన్నది. అనగా పరమాత్మ జీవమున్న మరియు జీవము లేని అన్నిటియందు ఉన్నది.

**513. (5) అందరిలో ఉన్నదేది?**

జ. చైతన్య శక్తి.

**వివరము :** జీవముగల ప్రతి వారిలో ఆత్మ చైతన్య శక్తి ఉన్నదాని వలన జీవమున్న ప్రతి శరీరము కదలుచున్నది. కావున జీవమున్న అందరిలో ఉన్నది కదలికశక్తి లేక ఆత్మ అనవచ్చును.

**514. (6) యోగములో పరిపక్వముకాని వానిని, పరిపక్వముకాని కాయతో పోల్చుదురు. అది ఏ కాయ?**

జ. టెంకాయ (కొబ్బరి కాయ).

**వివరము :** కాయ పండుగ మారి పండు అనిపించుకొనును. కాని పండు అనిపించుకోక ఎప్పటికి కాయగానే పిలువబడునది ఒకే ఒక కాయ, అదే టెంకాయ. అందువలన పరిపక్వముకాని వారిని పరిపక్వముకాని కాయగా టెంకాయగ పోల్చడమైనది. జ్ఞానములో పరిపక్వముకాని వారు గుడిలో ప్రతిమల ఎదుట

నేను ఇంకా కాయనేనని టెంకాయను దేవునికి సమర్పించుచుందురు. పూర్తి జ్ఞానములో పరిపక్వమైనవారు టెంకాయలు కొట్టేది మానుకొనుట హిందూ సాంప్రదాయములో ఒకటి. అందువలన సంపూర్ణ జ్ఞానులు గుడికిపోయి కాయ కొట్టరు.

**515. (7) గుడ్డు తెలియదు, కాకరకాయ తెలియదు, తాళకము తెలియదు తగరము తెలియదు అను సమతలో గుడ్డు, తాళకము దేనికి సమత?**

జ. గుడ్డు, తాళకము అజ్ఞానమునకు సమత.

**వివరము :** అజ్ఞానము జ్ఞానమను వాటిలో మానవునికి మొదట తెలిసినది అజ్ఞానమే. రెండవది తెలుసుకోతగ్గది జ్ఞానము. సమీపమున ఉన్నది అజ్ఞానము, కొద్దిగ దూరముగ ఉన్నది జ్ఞానము. కావున అజ్ఞానము మొదటిది, జ్ఞానము రెండవది. వేమన యోగి తన పద్యములలో మానవులకు ఏది అజ్ఞానము, ఏది జ్ఞానము అని తెలియదను భావముతో తాళకంబెరుగరు, తగరంబెరుగరని అజ్ఞానమును తాళకమని జ్ఞానమును తగరమని వర్ణించాడు. అట్లే పెద్దలు అజ్ఞానమును గుడ్డుగ, జ్ఞానమును కాకరకాయగా వర్ణించారు.

**516. (8) మానవుని శరీరముకంటే ఏనుగు శరీరములో 25 భాగముల కంటే మించి ఏమి కలవు?**

జ. ఏమీ లేవు.

**వివరము :** సర్వ జీవరాసుల శరీరములు ప్రకృతి నిర్మితమైనవి పంచభూతముల 25 భాగములతోనే తయారైనవి. కావున ఏనుగు శరీరములో మనిషి శరీరమునకంటే మించి ఏ భాగములు లేవు. ఏనుగుకు తోక తొండము ఎంచి ఎక్కువ ఉన్నవను అనుమానము కొందరికుండవచ్చును. తొండము ఎంత ఉన్నను, అది ముక్కు అను ఒక భాగమేనని, అట్లే తోక ఎంత ఉండినను, అది వెన్నెముకేనని తెలియవలయును.

**517. (9) నన్ను తెలుసుకోలేరను ధీమాతో ఉన్నదెవరు?**

జ. మాయ.

**వివరము :** సర్వ జీవరాసులు నా గుణముల ప్రభావములోనే ఉన్నారని, నా గుణములనే తెలియలేనివారు, గుణ రూపములో ఉన్న నన్ను తెలియలేరను ధీమాతో మాయ ఉన్నది.

**518. (10) ఎప్పటికైనా నన్ను తెలుసుకుంటారను ఓపికతో ఉన్నదెవరు?**

జ. భగవంతుడు.

**వివరము :** భగవంతుడు మానవ రూపమున ఉండి, మాయ ప్రభావము నుండి ఎప్పటికైన మానవులు బయటపడి తనను తెలుసుకుంటారని, మానవులు ఎంత అవమానము చేయుచున్నను భరించి ఓపికతో ఉండును.

**519. (11) కర్మానుసారము శరీరములో ఏ భాగము పనిచేయును?**

జ. చిత్తము.

**వివరము :** బుద్ధి కర్మానుసారిణి అనుట చాలా మార్లు విన్నాము. కాని వాస్తవముగ పరిశీలిస్తే బుద్ధి గుణానుసారిణిగ పని చేయును. చిత్తము కర్మానుసారిణిగ పనిచేయును.

**520. (12) గుణానుసారము పని చేయునది ఏది?**

జ. బుద్ధి.

**వివరము :** ఒక పనిలోని మంచి చెడు రెండిటిని బుద్ధి గుణానుసారము వివరించి తెలుపగలదు. బుద్ధి వివరించిన వాటిలో చిత్తము కర్మానుసారము నిర్ణయింపగలదు.

**521. (13) యోగులలో ఎన్ని తరగతులు కలవు? వాటిలో మూడవదేది?**

జ. నాల్గు తరగతులు. మూడవది దేవర్షి.

**వివరము :** యోగులకు గల యోగశక్తిని బట్టి వారిని నాల్గు రకములుగ విభజించడము జరిగినది. అందులో 1. మహర్షి, 2. రాజర్షి, 3. దేవర్షి, 4. బ్రహ్మర్షి అని తెలియవలయును. యోగులలో పెద్దవాడు బ్రహ్మర్షి కాగా, మూడవవాడు దేవర్షి అని తెలియవలయును.

**522. (14) పంచాక్షరిలో గాలికి ఏ బీజాక్షరము గలదు?**

జ. "మః" అను బీజాక్షరము గలదు.

**వివరము :** "ఓం నమః శివాయ" అను బీజాక్షరములలో "ఓం" పరమాత్మ బీజాక్షరముకాగ "న" ఆకాశము, "మః" గాలి, "శి" అగ్ని, "వా" నీరు, "య" భూమికి బీజాక్షరములైనవి.

**523. (15) పూర్వము గురువును శిష్యుని ఏమనెడి వారు?**

జ. గుర్తు, శిశువు.

**వివరము :** పూర్వము గుర్తు అను పదము గురువుకుండెడిది. జీవుని చివరి గమ్యము గుర్తు అని, దానినే మోక్షమని, పరమాత్మయని పిలిచెడివారు. గుర్తును తెలియజేయు వానిని గుర్తు అనెడి పేరుతోనే పిలిచెడివారు. అలా పిలువడములో పరమాత్మను పరమాత్మే అన్నట్లు, గుర్తు అయిన మోక్షమును తెలుపువాడు కూడ మోక్షములోనివాడేనని తెలియునట్లు గుర్తు అనెడివారు. కాలక్రమమున "రు" క్రింద "త" వత్తు పోయి గురు అను పదముగ మిగిలి పోయినది. గురు అను పదము ఇప్పటికి పిలువబడుచున్నప్పటికి అదియు కొంత మారి గురువు అను పదముగ రూపాంతరము చెందినది. మొదట గుర్తుగ ఉన్న పదము గురు అను పదముగను, చివరకు గురువు అను పదముగను మారి, నేడు ఎక్కువగ గురువు అను పదము వాడబడుచున్నది.

నేడు శిష్యుడు అను పదము శిశువు అను పదముగ ఉండెడిది. గురువు దగ్గర బ్రహ్మవిద్య నేర్చు వారిని నాదపుత్రులని, గురువును తండ్రియని పిలిచెడివారు.

ఆ భావములోనే శిశ్యుడను శిశువు అనెడివారు. కాలక్రమమున "శు"కు "య" వత్తు కలసి శిశ్యువుగ మారి, చివరికి శిశ్యుడు అయినది. ఇప్పటికి కొన్నిచోట్ల శిశ్య అనెడి పదమున్నది.

**524. (16) మగడనువాడున్నాడని గుర్తుగ స్త్రీ ధరించదగినదేది? పూర్వము దానిని ఏమనెడివారు?**

జ. తాళిబొట్టు. పూర్వము ఆళిబొట్టు అనెడివారు.

**వివరము :** స్త్రీ మనుగడ సాగించువాడు గనుక మగడని పురుషుననెడివారు. పూర్వము ఒక మగనికి ఆలినను గుర్తుగ ఒక బొట్టును కట్టెడివారు. దానిని పూర్వము ఆలి బొట్టు అనెడివారు. నేడు అది పేరుమారి తాలి బొట్టయినది.

**525. (17) ఆధ్యాత్మికమంటే ఏమిటి?**

జ. తన్ను తాను తెలియడము.

**వివరము :** భగవద్గీతలో ఆధ్యాత్మికమంటే ఏమిటని అర్జునుడు అడుగగ భగవంతుడు "స్వభావో ఆధ్యాత్మ ముచ్యతే" అన్నాడు. స్వంత భావమును తెలుసుకోవడమే ఆధ్యాత్మికమని భావము.

**526. (18) మాయ అంటే ఏమిటి?**

జ. గుణముల సమ్మేళనము.

**వివరము :** "గుణమయీ మమ మాయా" అని భగవద్గీతయందు భగవంతుడన్నాడు. అందువలన మన తలలోని గుణముల మొత్తమును మాయ అని, మాయ తలలోనే ఉన్నదని తెలియాలి.

**527. (19) ఒక సువాసన దేని ద్వారా? దేని చేత పీల్చగలుగుచున్నాము?**

జ. ముక్కు ద్వారా, వాసనను తన్మాత్ర చేత.

**వివరము :** సువాసనను ముక్కు అను పరికరము ద్వారా పీల్చగలుగుచున్నాము.

కాని ముక్కుకు స్వయముగా వాసన గ్రహించు శక్తి లేదు. వాసన గ్రహించు ఘ్రాణమను తన్మాత్రయను శక్తి మరియొకటి ప్రత్యేకముగ ఉన్నది. అది లేకపోతే ముక్కు వాసనను పీల్చినను, అది ఏ వాసనైనది తెలియకుండ పోవును. అందువలన సువాసన ముక్కు ద్వార పీల్చినను దానిని గ్రహించుశక్తి మరియొకటున్న దని తెలియవలయును.

**528. (20) బ్రహ్మర్షి హోదాలో ఉన్నవాడు ప్రారబ్ధకర్మను మార్చగలడా?**

జ. మార్చగలడు.

**వివరము :** కర్మలు రెండు రకములని, ఒకటి క్షమించబడునది, రెండవది క్షమించబడనిదని ముందే చెప్పుకొన్నాము. క్షమించబడునది జ్ఞానాగ్నికి కాలిపోవును. క్షమించబడనిది జ్ఞానాగ్నికి కాలదు. బ్రహ్మర్షి హోదాలో ఉన్నవానికి జ్ఞానాగ్ని పూర్తి స్థాయిలో ఉండును. కనుక ప్రారబ్ధమును కాల్చివేయు సామర్థ్యము కల్గి ఉండును. క్షమించబడని ప్రారబ్ధకర్మను బ్రహ్మర్షి గాని, స్వయముగ భగవంతుడుగాని క్షమించలేడు.

**529. (21) గుడి గోపురము మీద మరియు ప్రతిమ చుట్టు పైన ఉన్న రాక్షసాకారముగ ఉన్న బొమ్మ దేని గుర్తు?**

జ. మాయ గుర్తు.

**వివరము :** గుడి గోపురము మీద గాని, దేవుని ప్రతిమ చుట్టు పైన కోరలుగల వికృతాకారము మాయకు గుర్తు. మొదట మాయ దేవుని చుట్టు ఉన్నదని, ఆ మాయను జయించక మునుపు దేవుని చేరలేరను గుర్తుగ పెద్దలలాగ ఉంచారు. నన్ను జయించిన తర్వాతనే దేవుని దగ్గరకు చేరగలరని వికృతముగ చూస్తున్నట్లు ఆ బొమ్మ కనిపించును.

**530. (22) మనము తిన్న ఆహారము జీర్ణమగు కార్యమునకు పెట్టిన పేరేమిటి?**

జ. ద్రవ్యయజ్ఞము.

**వివరము :** భగవద్గీతలో జ్ఞానయజ్ఞము, ద్రవ్యయజ్ఞమని రెండు విధముల యజ్ఞములను భగవంతుడు తెల్పాడు. అందులో జీర్ణాశయములో జఠరాగ్ని చేత ద్రవ్యములు కాల్చబడడమును ద్రవ్యయజ్ఞమని పేరు పెట్టారు.

**531. (23) ఆలోచనలు దేని వివరముతో వచ్చుచున్నవి?**

జ. బుద్ధి, గుణవివరముతో.

**వివరము :** మనస్సు అందించిన విషయమును బుద్ధి గ్రహించి, దానిని గుణముల ప్రకారము వివరిస్తు పోతూ ఉన్నది. బుద్ధి మంచి చెడు, లాభ నష్టములను రెండు మార్గములను దృష్టిలో పెట్టుకొని అనేక కోణములలో వివరించును. ఒక్కొక్క మారు ఒకే కోణములో, ఒక్కొక్క మారు రెండు లేక రెండుకంటె ఎక్కువ రకములుగ ఆలోచిస్తు పోవుచుండును. చివరకు చిత్తము దేనిని చేయవలెనో దానినే నిర్ణయించును.

**532. (24) రుద్రము లేక కాలము అంటే ఏమి?**

జ. నాశనము అని అర్థము.

**వివరము :** రుద్రము అనిన కాలము అనిన నాశనము అని అర్థము. రుద్ర భూమి అనగ శరీరములు నాశనమగు స్మశానమని అర్థము. క్షయము కల్గించు కాలము నేనే అని గీతలో పరమాత్మ కూడ అన్నాడు. అక్కడ కూడ నాశనము చేయు కాలము అన్నాడు. రుద్రుడు అనగ నాశనము చేయువాడని అర్థము గలదు. కావున రుద్రము అనిన కాలము అనిన నాశనమని అర్థము చేసుకోవాలి.

**533. (25) గీత అంటే ఏమి? భగవద్గీత అంటే ఏమి?**

జ. హద్దు. భగవంతుడు తెల్పిన హద్దు.

**వివరము :** గీత అంటే హద్దు అని అర్థము. గీతను పలక మీద బలపముతో గీయవచ్చును. భూమి మీద కర్రతో గీయవచ్చును. మనిషి యొక్క మనస్సు మీద మాటలతో గీయ వచ్చును. భగవంతుడు మనిషికి మాటలతో గీత గీచి చూపించాడు. భగవంతుడు గీచిన గీత కావున దానిని భగవద్గీత అంటున్నాము. అలాకాక గీతకు గీతగానే అర్థము చెప్పుకోక పోతే భగవంతుడు మానవాళి ఎడల గీచిన గీతయే అర్థము కాదు.

**534. (26) భగవద్గీతలో చెప్పిన "గతాసు నగతాసూంశ్చ" అనగానేమి?**

జ. గతించునవి, గతించనివి.

**వివరము :** గతా నగతా అనగా గతించునవి, గతించనివి అని అర్థము. గతించునవి సమస్త జీవరాసులుగ గలవు. పుట్టిన ప్రతి జీవరాసి తప్పక చనిపోవలసిందే. అలాంటిచావు వస్తుజాలమునకు పంచభూతములకు లేదు. మనిషి గతించినా, మనిషి చేత తయారు చేయబడిన శిల్పము గతించక ఉండుట మనము చూస్తూనే ఉన్నాము. అందువలన భగవద్గీతలో చెప్పబడిన ఈ వాక్యములో గతులు కల్గిన జీవరాసులు, గతులు లేని సమస్త వస్తువాహనములు 'ప్రకృతి' అని అర్థము.

**535. (27) మానవునకు భయము లేకుండా ఎపుడు పోవును?**

జ. సంపూర్ణ జ్ఞానము కల్గినపుడు.

**వివరము :** సంపూర్ణముగ ఆత్మ జ్ఞానము తెలిసి, శరీర యంత్రాంగమంత తెలిసినపుడు గుణములు వాటి ప్రభావము తెలిసిపోవును. అంతేకాక భయము అజ్ఞాన సంబంధమని, ధైర్యము జ్ఞానసంబంధమని కూడ తెలియును. భయము పర ధర్మములతో కూడుకొన్నదని, ధైర్యము స్వధర్మములతో కూడుకొన్నదని తెలిసినపుడు జ్ఞానయుక్తమైన స్వధర్మములను ఆచరించువానికి భయముండదు. సంపూర్ణ జ్ఞానము లేనివానికి భయము నీడలా వెంటాడుచుండును.

**536. (28) మానవునికి అజ్ఞానమును గూర్చి ఎపుడు తెలియును?**

జ. జ్ఞానము తెలిసినపుడు.

**వివరము :** మానవుడు నడచుకొనేది, మానవుడు ఉండేది అజ్ఞానమేయైనప్పటికి అజ్ఞానమంటే ఏమిటి, అదేలా ఉంటుంది, మనము అజ్ఞానములో ఎంత వరకు కూరుక పోయి ఉన్నాము అను విషయము మానవునికి తెలియకుండ పోవుచున్నది. మనిషి జ్ఞానమును గురించి తెలియుచు పోవుకొలది అజ్ఞానమంటే ఏమిటో తెలియుచు పోవును. మొదట జ్ఞానము తెలిసిన తర్వాతనే అజ్ఞానము తెలియును. జ్ఞానము లేనిది అజ్ఞానము తెలియదు. జ్ఞానము తెలిసిన తర్వాతనే అజ్ఞానము యొక్క స్వరూపమేమిటో తెలియునంటే ఒకలెక్కలో జ్ఞానముకంటే అజ్ఞాన అవగాహనే పెద్దదన్న మాట.

**537. (29) శ్రీకృష్ణుని జన్మ లగ్నమేది?**

జ. వృషభము.

**వివరము :** శ్రీకృష్ణుని జన్మ సూర్యుడు వృషభ లగ్నములో ఉండగ జరిగినది. ఆయనది వృషభ లగ్నమైన జ్యోతిష్యమునకు అందుబాటులో ఉండదు. ఎందుకనగా కర్మ చేత నియమింపబడి పుట్టినవాడు కృష్ణుడు కాదు. ఆయనే కర్మను నియమించుకొని పుట్టాడు. ఆయనకు వెనుక జన్మ లేదు కావున గత జన్మభుక్తిగాని, గర్భభుక్తి గాని లేవు. పద్ధతి ప్రకారము వృషభ లగ్నములో ఏ గ్రహములుండిన వాటి చూపు భగవంతుడయిన కృష్ణుని మీద ఉండదు.

**538. (30) ప్రబోధానంద యోగీశ్వరులు ప్రతిపాదించిన త్రైత సిద్ధాంతము యొక్క పతాకమేది?**

జ. బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములే పతాకము.

**వివరము :** త్రైత సిద్ధాంత పతాకము నాల్గుచక్రముల చిత్రము. నాల్గుచక్రముల చిత్రము ప్రతి జీవరాసి తలలోను అమరి ఉన్నది. బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రములను నాల్గుచక్రముల చట్రము లేని జీవరాసి భూమి మీద గాని, మరెచట గాని లేదు. అందరి జీవితముల యొక్క సారాంశము ఇమిడి ఉన్న అతి ముఖ్యమైన నాల్గుచక్రముల చిత్రము త్రైతము యొక్క పతాకముగ లెక్కించబడడము చాలా

గొప్పతనము. త్రైత సిద్ధాంతము గొప్పదే, నాల్గుచక్రముల పతాకము గొప్పదే, నాల్గు చక్రములను అర్థము చేసుకొన్నవారు కూడ గొప్పవారే అగుదురు.

## జ్ఞాన పరీక్ష

**ధర్మవరము** **తేది-28-01-1992**

**539. (1) నిర్గుణ పూజ అంటే ఏమిటి?**

జ. గుణములేని ప్రతిమ పూజ.

**వివరము :** గుణమున్న దానిని పూజించడము సగుణ పూజ అంటాము. అది ఒక మనిషిని పూజించడముకావచ్చు లేక ప్రాణముండి గుణము గల ఏ జంతువు యొక్క పూజయైనకావచ్చును. అట్లే గుణములేని దానిని పూజించడము నిర్గుణపూజ అంటాము. అది ప్రాణములేని దానిని, గుణములేని దానిని దేనిని పూజించిన నిర్గుణపూజ అగును. నిర్గుణ సగుణ పూజల గురించి పూర్వము పెద్దలు చెప్పిన దానికి మేము చెప్పుదానికి చాలా వ్యత్యాసము గలదు. పూర్వము పూజ చేయు వాని విధానమును బట్టి మంత్రయుక్తమైన పూజా విధానములను సగుణ పూజయని, ఏ మంత్ర విధానములేని యోగమును నిర్గుణమనెడివారు. అట్లనుట సరికాదని, దేనిని పూజిస్తున్నామో దానిని బట్టి పూజింపబడునది గుణములేనిదైతే నిర్గుణోపాస యని, గుణములున్నదైతే సగుణోపాసనయని అనుట సమంజసమని అంటున్నాము. ఎట్లయితే ఆంజనేయ స్వామిని పూజించునపుడు ఆంజనేయ ఉపాసన అంటున్నామో, అట్లే పూజింపబడు దానిని బట్టి ఆ పూజకు పేరు ఏర్పడుచున్నదని తెలియ వలయును.

**540. (2) భగవంతుని పూజించడమును ఏమనాలి?**

జ. సాకార లేక సగుణ పూజ అనాలి.

**వివరము :** నిరాకారమైన పరమాత్మ మానవ శరీరము ధరించి భూమి మీద పుట్టడమును భగవంతుడు అవతరించుటని అందురు. అట్టి భగవంతునికొక

ఆకారమున్నది. కావున ఆ భగవంతుని పూజించడమును సాకార పూజ అందురు. అట్లే ఆ భగవంతుని శరీరములో ప్రకృతి సిద్ధముగ గుణములు కూడ ఉన్నవి. కావున అతనిని పూజించడమును సగుణోపాసన అని కూడ అందురు.

**541. (3) భగవద్గీతయందు ఏమి తెలుపబడి ఉన్నది?**

జ. బ్రహ్మ, కర్మ యోగముల ధర్మము తెలుపబడి ఉన్నది.

**వివరము :** భగవద్గీతయందు మొత్తము బ్రహ్మయోగము, కర్మయోగమునకు సంబంధించిన ధర్మములు తెలుపబడినవి. దేవునియందైక్యమగుటకు రెండే రెండు మార్గములు గలవు. వాటినే బ్రహ్మయోగము, కర్మయోగమని అందుము. గీత యందు పరమాత్మయందైక్యమగు బ్రహ్మ, కర్మ యోగముల సిద్ధాంతములనే తెలియ జేసారు. సిద్ధించు మార్గములను సిద్ధాంతములని అందురు. సిద్ధాంతములనే ధర్మములని కూడ అందురు. దేవుడు సిద్ధించు రెండు మార్గములు గీత యందున్నాయి. కావున గీతయందు బ్రహ్మ, కర్మ యోగ ధర్మములు తెలియజేశారని చెప్పవచ్చును.

**542. (4) మానవునిచే జరుగబడు ప్రతి పనికి మూల కారణమేది?**

జ. కర్మ (ప్రారబ్ధ కర్మ).

**వివరము :** మానవునిచే జరుగబడు ప్రతి కార్యమునకు కారణము గుణములైతే మూల కారణము కర్మ. కర్మ ప్రారబ్ధ, అగామి, సంచితమని మూడు విధములుగ ఉన్నది. అందులో జీవితమందు కార్యరూపముగ అనుభవమునకు వచ్చునది ప్రారబ్ధ కర్మ మాత్రమే. ప్రారబ్ధకర్మ గుణములను ప్రేరేపించి, గుణముల ద్వారా శరీర యంత్రాంగమును కదలించి పని చేయించును. కావున పనికి మూల కారణము కర్మయనుట సత్యము.

**543. (5) మనో గతములు ఏవి?**

జ. ఐదు జ్ఞానేంద్రియముల యొక్క విషయములు.

**వివరము :** మననము (జ్ఞాపకము) చేయునది మనస్సు. బయటి విషయములు జ్ఞానేంద్రియముల ద్వారా మనస్సుకు చేరును. కన్ను నుండి చూచినది, చెవి నుండి విన్నది, ముక్కు ద్వారా వాసన చూచినది, నాలుక ద్వారా రుచి చూచినది, చర్మము ద్వారా స్పర్శించినది మనస్సు తనయందు నిక్షిప్తము చేసుకొని తర్వాత నిక్షిప్తమైన విషయములనే జ్ఞప్తి చేయును. జ్ఞానేంద్రియ విషయములు మనస్సుయందు దాగి ఉన్నవి. ఆ విధముగ దాగినవి ఎపుడో ఒకపుడు తిరిగి జ్ఞాపకమునకు వచ్చును. ఒక జీవుడు గతించి సూక్ష్మశరీరముతో కనిపించక ఉండి, తిరిగి ఎపుడో ఒకపుడు పుట్టి వచ్చినట్లు, జ్ఞానేంద్రియ విషయములు మనస్సుయందు అణిగి సూక్ష్మముగ ఉండి, తిరిగి ఎపుడో ఒకపుడు బయటికి వచ్చును. కావున ఐదు జ్ఞానేంద్రియముల విషయములను మనోగతములని అందుము.

**544. (6) బ్రహ్మయోగికి శత్రువులెవరు?**

జ. విషయ జ్ఞాపకాలు.

**వివరము :** ఏ ఒక్క ఇంద్రియవిషయ జ్ఞాపకాలు మనస్సునకు రానంతవరకు బ్రహ్మయోగము సాగుతుంది. ఒక్క విషయము జ్ఞప్తికి వచ్చిన బ్రహ్మయోగము భంగమగును. కావున ఇంద్రియ విషయ జ్ఞాపకాలే బ్రహ్మయోగికి శత్రువులు. బ్రహ్మయోగ సాధకునికి బద్ధ శత్రువులుగ ఇంద్రియవిషయ జ్ఞాపకాలున్నవని తెలియాలి.

**545. (7) కళశము మీద పెట్టబడిన టెంకాయ దేనికి గుర్తు?**

జ. శరీరము ధరించి ఉన్న జీవుని గుర్తు.

**వివరము :** పరమాత్మ ప్రకృతికి ఆధారము. ప్రకృతి సకల జీవులకు ఆధారము. ఆ విషయము తెలియజేయు గుర్తే కళశము మీద ఉన్న టెంకాయ. కళశము పరమాత్మ గుర్తుకాగ, కళశము మీద ఉన్న ఐదు ఆకులు పంచ భూతములైన ప్రకృతికి గుర్తు. కళశములోని ఆకులకు పచ్చదనముల నిచ్చు నీరు ప్రకృతికి

చైతన్యము నిచ్చు ఆత్మకు గుర్తు. కళశము పరమాత్మ, అందులోని నీరు ఆత్మ, ఐదు ఆకులు పంచ భూతముల గుర్తుకాగ, పంచ భూత నిర్మితమైన జీవ శరీరముగ టెంకాయను ఐదు ఆకులమీద కళశము పైన ఉంచారు. ప్రపంచ రూపముననున్న ప్రకృతికి పరమాత్మ, పంచభూత నిర్మితమైన శరీరములకు ప్రకృతి ఆధారమని, తెలియజేస్తు కళశము, దాని మీద ఐదు ఆకులు, ఆకుల మీద టెంకాయ ఉంచడమైనది.

**546. (8) కర్మరీత్యా ముఖ వర్చస్సుకు సంబంధించిన జాతక లగ్నమేది?**

జ. రెండవ లగ్నము.

**వివరము :** కర్మరీత్యా జీవునకు అన్ని లభ్యమగుననుట సత్యము. కావున కర్మరీత్య శరీరము, ఆ కర్మరీత్యానే అందులోని అవయవ సౌష్టవము ఏర్పడును. శరీర లావు పొడవునకు సంబంధించినది మొదటి లగ్నమైతే, ముఖవర్చస్సుకు సంబంధించి నది రెండవ లగ్నమని జ్యోతిష్య శాస్త్రము ప్రకారము తెలియుచున్నది.

**547. (9) జ్ఞాన యోగమంటే ఏమిటి?**

జ. మనస్సు ఆత్మ మీద లగ్నము కావడము.

**వివరము :** బాహ్య జ్ఞానేంద్రియముల సంబంధముగాని, లోపలి మనోగతములుగాని మనోదృష్టికి రాకుండ పోయినపడు మనస్సునకు తెలియునది ఆత్మ. మనస్సు బాహ్య విషయములను విడచి ఆత్మానుభూతిని పొందడమే జ్ఞానయోగము.

**548. (10) దేహి అను పదము దేనికి వర్తించును?**

జ. జీవాత్మకు, ఆత్మకు.

**వివరము :** దేహి అనగా దేహమును ధరించునదని అర్థము. జీవాత్మ ఆత్మలు దేహమును ధరించి ఉన్నవి. కావున జీవాత్మ ఆత్మలకు దేహి అను పదము వర్తించును. "భిక్షాం దేహి" అన్నపుడు జీవాత్మయని, "అధియజ్ఞో హమే వాత్ర దేహే దేహ బృతాంవర" అన్నపుడు ఆత్మకని సందర్భాను సారముగ తెలియాలి.

**549. (11) రాజయోగమునకు మారు పేరేమి?**

జ. కర్మయోగము.

**వివరము :** ఉన్న యోగములు రెండు. ఆ రెండిటిలో గొప్పది కర్మయోగము. అందరికంటే రాజును గొప్పవానిగ లెక్కింతుము. కనుక కర్మయోగము గొప్పదని తెలియు నిమిత్తము రాజయోగమని మారు పేరు పెట్టారు. రాజయోగమనిన కర్మయోగమనిన ఒక్కటేనని తెలియాలి.

**550. (12) జీవితములో జీవునికి మిత్రులెవరు?**

జ. మంచివైన ఆరు గుణములు.

**వివరము :** జీవితములో జీవునకు పాపము సంపాదించి పెట్టు చెడు గుణములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యమను గుణములు శత్రువులు. అట్లే పుణ్యమును సంపాదించి పెట్టు దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమ గుణములు మిత్రులు. మంచి చేయువారు మిత్రులు. చెడు చేయువారు శత్రువులను మాట ప్రకారము జీవిత కాలములో జీవునకు పాపమును తెచ్చి పెట్టి కష్టమును అనుభవింపజేయు చెడు గుణములనే శత్రువులని తెలియాలి. అట్లే పుణ్యమును తెచ్చి పెట్టి సుఖమనుభవించునట్లు జేయు మంచి గుణములు ఆరు మిత్రులని తెలియాలి.

**551. (13) బ్రహ్మ పగలు ఎంత కాలముగ లెక్కించబడినది?**

జ. వెయ్యి యుగములు. (108 కోట్ల సంవత్సరములు).

**వివరము :** కృత యుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అను నాలుగు యుగములు రెండు వందల యాభైమార్లు జరిగితే పరమాత్మకొక పగలని లెక్కించబడినది. వెయ్యి యుగములు 108 కోట్ల సంవత్సరములుగ తెలుపబడినవి.

**552. (14) కర్మను సృష్టించినది ఎవరు?**

జ. పరమాత్మ.

**వివరము :** కర్మను, కర్మను పాలించు ప్రకృతిని పరమాత్మయే తయారు చేశాడు. ఏమి లేనపుడు ప్రపంచమును సృష్టించాలని తలచిన పరమాత్మ తన ప్రమేయము లేకుండ ప్రపంచము, దానిలోని జీవ రాసుల పుట్టుక, బ్రతుకు చావులు, దానంతటవే జరుగునట్లు ఒక యంత్రాంగమును తయారు చేశాడు. ఆ యంత్రాంగమునంతటిని ప్రకృతి చేతికి అప్పగించి తాను మాత్రము ఏమి చేయక చూస్తూ ఉన్నాడు. ప్రపంచములోని మార్పులు, జీవరాసుల బ్రతుకులు, చావు పుట్టుకలు, అన్నిటిని ప్రకృతే నిర్వర్తించుచున్నది. పరమాత్మ ప్రకృతిని తన చేతిలో పెట్టుకొని, జీవరాసులను ప్రకృతిచేత ఆడించుచు అన్నిటికి సాక్షియై ఉన్నాడు. ఏవి ఎట్లు నడచుకోవాలనుటకు కర్మ అను విసర్గమును తయారు చేసి, అదియు ప్రకృతి చేతిలో ఉన్నట్లు చేసి, కర్మ సిద్ధాంతమను ఒకే సూత్రమునుంచాడు. జన్మించిన ప్రతి ఒక్కరు చివరకు భగవంతుడు కూడ ఆ సిద్ధాంతము ప్రకారముండునట్లు చేశాడు.

**553. (15) సంశయములకు పరిష్కారము ఏది?**

జ. ఆత్మ జ్ఞానము.

**వివరము :** శరీరమునకు బయటి విషయములలో గాని, శరీరము లోపలి విషయములలో గాని, వచ్చిన అనుమానములకు గాని, ప్రశ్నలకు గాని, సంపూర్ణమైన జవాబు ఆత్మ జ్ఞానము తెలిసినవారికే లభ్యమగును. ఆత్మ జ్ఞానము లేని వారికి ఒక జవాబు దొరికిన అది అసంపూర్ణమై ఉండి, మరియొక సంశయమేర్పడుటకు అవకాశముండును. సంశయరహిత జవాబు కావాలంటే తప్పనిసరిగ జ్ఞానము తెలిసివుండాలి.

**554. (16) రాజయోగము వలన నశించు కర్మయేది?**

జ. ఆగామి కర్మ.

**వివరము :** రాజయోగమనిన కర్మయోగమనిన రెండు ఒకటే. కర్మ అనునది ఒకటే అయినప్పటికి జరుగుచున్న కర్మ, నిలువ ఉన్న కర్మ, రాబోవుచున్న కర్మ అని మూడు విధములుగ ఉన్నది. జరుగుచున్న కర్మను ప్రారబ్ధమని, నిలువ ఉన్న కర్మను సంచితకర్మ అని, రాబోవు కర్మను ఆగామికర్మ అని అంటారు. సాధారణముగ మనిషికి ప్రారబ్ధకర్మ జరుగుచు ఖర్చవుచుండగ ఆగామికకర్మ వచ్చి చేరుచుండును. రాజయోగము ఆచరించు యోగి సాధారణ మానవునివలె పనులు చేస్తునప్పటికి ప్రారబ్ధకర్మ అయిపోవుచుండును, కాని క్రొత్తగ రాబోవు ఆగామికర్మ రాకుండ పోవును. అందరికి వచ్చునది రాజయోగికి ఎందుకు రాలేదనగా! రాజయోగి తన శరీరములోని అహమును అణచివేయుట వలన క్రొత్త ఆగామికర్మ యోగిని అంటుకోలేదు. యోగి యొక్క జ్ఞానాగ్నిలో ఆగామి కర్మ కాలి పోవుచున్నది. అట్లు కాలిపోవుటనే జ్ఞానయజ్ఞము అంటున్నాము. రెండు యజ్ఞములలో ద్రవ్యయజ్ఞముకంటే జ్ఞానయజ్ఞమే శ్రేష్టమైనదని గీతలో భగవంతుడు కూడ చెప్పాడు. రాజయోగి పనులు చేయుచున్నపుడు ఆగామికర్మ బూడిదగుచున్నది.

**555. (17) అగ్ని తత్త్వములు ఎన్ని? అవి ఏవి?**

జ. అగ్ని తత్త్వములు ఐదు. కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మమనునవి.

**వివరము :** పంచభూతముల చేత శరీరములో ఐదు వ్యవస్థలు ఏర్పడినవి. ఆకాశము చేత ఏర్పడిన వాటిని ఆకాశ తత్త్వములు అంటారు. అవి అంతరంగములు 1. జీవుడు, 2. మనస్సు, 3. బుద్ధి, 4. చిత్తము, 5. అహము. అలాగే గాలి చేత ఏర్పడిన వాటిని పంచ వాయువులు అంటారు అవి 1. ఉదానవాయువు, 2. వ్యానవాయువు, 3. సమానవాయువు, 4. ప్రాణవాయువు, 5. అపాణవాయువు. అగ్ని చేత ఏర్పడినవి జ్ఞానేంద్రియములు అవి 1. కన్ను, 2. ముక్కు 3. నాలుక, 4. చెవి, 5. చర్మము. నీటి చేత ఏర్పడినవి జ్ఞానేంద్రియములకున్న శక్తులు 1. చూపు, 2. వాసన, 3. రుచి, 4. శబ్దము, 5. స్పర్శ. భూమి చేత తయారైనవి

కర్మేంద్రియములు 1. కాళ్ళు, 2. చేతులు, 3. నోరు, 4. గుదము, 5. గుహ్యము. వీటిలో అగ్ని తత్త్వములు ఐదు అగ్నివలె చురుకుగ పనిచేయు జ్ఞానేంద్రియములు.

**556. (18) ద్వైతము అంటే అర్థమేమిటి?**

జ. రెండు అని అర్థము.

**వివరము :** ఇందూ మతములో ఆధ్యాత్మికమను దానిని కొందరు గురువులు వారి వారి పంథాలో బోధిస్తూ దాదాపు ఇప్పటికి 2 వేల సంవత్సరముల పూర్వము ఆదిశంకరాచార్య అను గురువు అద్వైతము అను సిద్ధాంతమును బోధించాడు. అతని బోధలో జీవుడనువాడు లేడు, అందరు దైవ స్వరూపులే, అంతయు పరబ్రహ్మ స్వరూపమే, పరబ్రహ్మ యొక్కటే ఉన్నది వేరు లేదనునది ముఖ్య సూత్రము. తర్వాత కొన్ని సంవత్సరములకు మధ్వానుచార్యులు అను గురువు జీవుడు దేవుడు ఇద్దరు ఉన్నారని, రెండుగ ఉన్న అదియే ద్వైతమని బోధించాడు. అద్వైతమనగ రెండు కాని ఒక్కటని, ద్వైతమనగ రెండని అర్థము. ఆదిశంకరుని అద్వైతము, మధ్వానుచార్యుని ద్వైతము అను సిద్ధాంతములు రెండు సరికావు అని, ఆదియందే పరమాత్మ చేత త్రైతము బోధించబడినదని, ప్రస్తుత కాలములో అనగ క్రీ.శ. 2000 సంవత్సరములలో మేము "త్రైత సిద్ధాంతము"ను ప్రతిపాదిస్తున్నాము. ఆదిశంకరుడు జీవాత్మను ఆత్మను వదలి పరమాత్మనొకనిని తెలుపగ, మధ్వానుచార్యుడు జీవాత్మను పరమాత్మను ఇద్దరిని తెలిపి ద్వైతమన్నాడు. ఇపుడు మేము ఇద్దరి మధ్యలో వదలిన ఆత్మను కూడ తెలుపుచు, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను ముగ్గురున్నారని **"త్రైత సిద్ధాంతము"**ను బహిర్పరచడమే కాక భగవద్గీతను శాస్త్రాధారముగ చూపుచున్నాము. అద్వైతమునకు, ద్వైతమునకు శాస్త్రాధారము లేదు. అవి అశాస్త్రీయములు.

**557. (19) మానవుడు దైవశక్తిని ఎపుడు పొందును?**

జ. మొదట గురువు వద్ద తర్వాత యోగసమయములో.

**వివరము :** ఒక మనిషి మొట్ట మొదట గురువు యొక్క ఉపదేశముతో కొంత

శక్తిని అనగ జ్ఞానాగ్నిని పొందును. తర్వాత యోగము చేయువేలలో దైవశక్తిని పొందుచుండును. దైవశక్తి అనిన, జ్ఞానశక్తి అనిన, జ్ఞానాగ్ని అనిన అన్ని ఒక్కటిగ తెలియవలెను. గురువు గలవారు గురూపదేశముతో శక్తిని పొందునన్నారు కదా! గురువు లభించని ఎడల ఎట్లు పొందునని, బోధకులు తప్ప గురువు అరుదుగ ఉన్న ఈ కాలములో వారికి మొదట శక్తి ఎలా లభించునని కొందరడుగ వచ్చును. దానికి సమాధానమేమనగా! గురువు లభించవలెనని, జ్ఞానశక్తి తనయందు ప్రవేశించవలెనని, బోధకులు ఎందరుండిన తనకు గురువు అవసరమని, గురువు చేత ఉపదేశము పొందవలెనని, ఎవనికి తీవ్రమైన శ్రద్ధయుండునో వానికి నిజముగ గురువు లభించును. ఉపదేశమును గురువు చేసి జ్ఞాన శక్తిని వానికి ధారపోయును. కాని శ్రద్ధ గలవానికి గురువు లభించిన, శక్తి లభించినప్పటికి పలానావాడు గురువు అని, పలానా సమయములో ఉపదేశము కల్గినదని, తెలియవచ్చును తెలియక పోవచ్చును. ఎందుకనగ గురువు అందరిలాగ గుర్తింపు పొంది ఉండడు. ఆయన భూమి మీదకు దొంగవలె వచ్చి దొంగవలె పోవువాడు.

**558. (20) ఆధ్యాత్మికము అనగా నేమి?**

జ. తనను తాను తెలుసుకోవడము.

**వివరము :** పరమాత్మ అనంతమైన విశ్వమంత వ్యాపించి ఉన్నదని, ఆత్మ జీవరాసుల శరీరములన్నిటి యందున్నదని, తానైన జీవుడు ఒక శరీరము మాత్రము ధరించి ఉన్నానని అనుభవ పూర్వకముగ తెలియడమే ఆధ్యాత్మికము.

**559. (21) తత్త్వాలు అంటే ఏమిటి?**

జ. ఆత్మశక్తి చేత కదలు భాగములు.

**వివరము :** తత్త్వము అనగా ఆత్మ అని తెలుసు. తత్త్వాలు అనగా ఒక శరీరములో ఆత్మ చైతన్యము చేత కదలు శరీర భాగములని తెలియాలి. ఒక మానవ శరీరములో ఆత్మ చైతన్యమునుపయోగించుకొను భాగములు 25 గలవు. కావున మానవ శరీరము 25 తత్త్వాలతో తయారైనదని వేదాంతులనుచుందురు. ఈ 25 తత్త్వాలను

తెలిసితే జ్ఞానము తెలిసినవాడై అసలైన తత్త్వమును తెలియగలడని వినికిడి. 5x5=25 ను అనగా ఆకాశము గాలి అగ్ని నీరు భూమి అను ఐదు ప్రకృతి భాగములు ఒక్కొక్కటి ఐదుగ తయారై మొత్తము 25 శరీర భాగములైనవి. వాటి వివరము తెలియకపోతే జ్ఞానమే తెలియదని పెద్దలు చెప్పుచు ఒక పద్యమును వర్ణించారు.

పంచ తత్త్వములను పంచీకరించక
మంచి యతుల మన్న మాటలన్న
కుంచమందు గజము గుడ్డుపెట్టిన చందంబు
అఖిల జీవసంగ ఆత్మ లింగ.

**560. (22) 'ఓం నమః శివాయ' అను మంత్రము ఎపుడు సృష్ఠించబడినది?**

జ. సృష్ఠి ఆదిలో.

**వివరము :** ఎపుడైతే మొట్టమొదటిసారిగ ప్రకృతి పుట్టినదో అపుడు పరమాత్మకు ప్రకృతికి బీజాక్షరములు సృష్టించబడినవి. పరమాత్మ యొక్క ఒక్క బీజాక్షరము "ఓం" అట్లే ప్రకృతి యొక్క పంచభూతముల బీజాక్షరములు ఐదు "నమః శివాయ" అనునవి సృష్టించబడినవి. అట్లు సృష్టించబడుటకు కారణము పరమాత్మ ప్రకృతికి నాశనము కానివాడని తెలుపు నిమిత్తమని తెలియవలయును. పంచభూతములకు నాశనము కానివాడు పరమాత్మ కావున పంచ అక్షరి అని పేరు బీజాక్షరములకు పెట్టబడినది. 'పంచ' అనగా ఆకాశము గాలి అగ్ని నీరు భూమి అనబడు ప్రకృతి యని, 'అక్షరి' అనగా నాశనముకానిదని, మొత్తము కలిపితే పంచభూతములకు నాశనము కానిదని పంచాక్షరిలో అర్థము ఇమిడి ఉన్నది.

**561. (23) అల్లాను ఆరాధించేవారు గుడ్డలేనిది ప్రార్థనచేయరు. దీనికేమి అర్థము?**

జ. తలలోని ధ్యాస దేవుని మీదనే ఉండాలని, బయటి ధ్యాసలు రాకూడదని.

**వివరము :** ఇస్లామ్ మతానుసారము ప్రత్యేకమైన అర్థమేమి ఉన్నదో నాకు తెలియదు గాని నాకున్న జ్ఞానము ప్రకారము ఒక అర్థము గలదు. దేవున్ని ప్రార్థించు సమయములో నా తలలోని ధ్యాస దేవుని మీదనే ఉండాలని, బయట నుండి ఏ దుష్టశక్తుల ప్రభావము నా తల మీద ఉండకూడదని తల మీద గుడ్డను కప్పుకొను చున్నారు. ప్రార్థన సమయములో పక్షులు రెట్ట వేసిన వెంట్రుకలలోనికి చొచ్చుకొని పోయి దాని స్పర్శవలన కూడ భంగము కల్గునని తల మీద గుడ్డనుంచారను కొంటాను. ఏది ఏమైన అది మంచి పద్ధతియేనని చెప్పవచ్చును.

**562. (24) శ్వాసలోని సూక్ష్మ శబ్దమేది?**

జ. "ఓం".

**వివరము :** శ్వాస ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాస రూపముగ ఉన్నది. ఊపిరి లోపలికి పీలుస్తు బయటికి వదలడమునే ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాస అంటున్నాము. ఈ కార్యములో ఒక విధమైన శబ్దము ఏర్పడుచున్నది. దానినే "సోహం" అంటున్నాము. శ్వాస లోపలికి పోవునపుడు "సో" అను శబ్దము, బయటికి వచ్చునపుడు "హం" అను శబ్దము ఏర్పడుచున్నది. ఈ సోహం శబ్దములో సూక్ష్మముగ "ఓం" ఇమిడి ఉన్నది. అదెలాగనగా "సో" ఉచ్చాటనలో చివరి శబ్దము ఓ అని, అట్లే హం ఉచ్చాటనలో చివరి శబ్దము "మ్" అని కలదు. రెండు కలుపగ "ఓమ్" అని తెలియుచున్నది.

**563. (25) పరమాత్మశక్తికి అవధి ఉన్నదా?**

జ. లేదు.

**వివరము :** పరమాత్మ శక్తి పరమాణువు మొదలుకొని బ్రహ్మాండమంతయు నిండి ఉన్నది. అనంతమైనది ఆకాశమైతే దానికంటే అతీతమైన పరమాత్మకు అవదంటూ లేదు. అనంత విశ్వమంత వ్యాపించి జీవమున్న మరియు జీవము లేని వాటియందు కూడ పరమాత్మ నిండి ఉన్నది. కావున పరమాత్మకు అవధి లేదు ఆకారము లేదు.

**564. (26) కోర్కె మొదలైన గుణములను ఎట్లు స్థంభింప జేయవలయును?**

జ. మనస్సును స్థంభింప చేయుటవలన గుణములు స్థంభింపబడును.

**వివరము :** శరీరములోని కామాది గుణములకు శరీరము బయట నేత్రాది అవయవములకు మధ్య అనుసంధానమైనది మనస్సు. మనస్సు పని చేయడము వలన లోపలి గుణములు బయటి అవయవములు పని చేయుచుండును. మనస్సును అణచివేచితే లోపలి గుణముల బయటి అవయవముల పని నిలిచి పోవునని తెలియవలయును.

**565. (27) కర్త, కర్మ, క్రియ, సాక్షిలో జీవుడు దేనికి సంబంధించిన వాడు?**

జ. క్రియకు సంబంధించిన వాడు.

**వివరము :** కర్త, కర్మ, క్రియ, సాక్షి అను పదములలో కర్త పరమాత్మ కాగ, కర్మ పాప పుణ్యములు కాగ, చేసిన పనిని అనుభవించు జీవుడు క్రియ కాగ, ఆత్మ సాక్షి భూతమై ఉన్నదని తెలియాలి.

**566. (28) ఉపనిషత్ అను మాటకు అర్థమేమి?**

జ. ప్రక్కన ఉన్న దానిని చక్కగ తెలియుట.

**వివరము :** ఉపనిషత్ ను విడదీసితే ఉప+ని+సద్ అని మూడు భాగములుగ ఉన్నది. ఉప అనగ నీకంటే వేరుగ ప్రక్కన ఉన్న, ని అనగ బాగుగ, సద్ అనగ పొందబడినది లేక తెలియబడినదని అర్థము. నీకంటే పరముగ లేక నీకంటే వేరుగ మరియు నీవు కాక నీ ప్రక్కన సమీపమున ఉన్న ఆత్మను చక్కగ తెలియబడడమును ఉపనిషత్ అని అంటాము. నీకంటే వేరుగ నీ సమీపమునున్న ఆత్మను తెలియబడు నిమిత్తము వ్రాయబడిన విషయములను కూడ ఉపనిషత్ అనుట సహజము. భగవద్గీత ఆత్మ విషయములు తెలియజేసినది, కావున ఆ గ్రంథమును ఉపనిషత్ అంటున్నాము.

**567. (29) పుట్టుకతో శరీరములో అహము ఉన్నదా? అహంకారము ఉన్నదా?**

జ. అహము ఉన్నది.

**వివరము :** పుట్టిన శరీరములో ఆకాశ తత్త్వముతో తయారైన అంతరేంద్రియము లలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహము ఉండగా జీవునికి మిక్కిలి సమీపమున ఉన్నవి బుద్ధి, చిత్తము, అహము. పుట్టుకతో వచ్చిన అహము జ్ఞానము పొందిన జీవునికి బ్రహ్మాస్మి అయితా ఉన్నది. అజ్ఞానము పొందిన జీవునికి అహంకారమైతా ఉన్నది. జ్ఞానము వలన లోపలి ఆత్మతో కలిసిన అహము "అహం బ్రహ్మ" కాగ, అజ్ఞానము వలన బయటి ఆకారముతో కలిసిన అహము "అహంకారము" అవుచున్నది. పుట్టినపుడు జీవునికి జ్ఞానము అజ్ఞానము తెలియవు కనుక అహము అటు బ్రహ్మ మీదకు ఇటు బయటి ఆకారము మీదకు ధ్యాస మల్లించ లేని స్థితిలో ఉన్న కారణమున అటు బ్రహ్మ కాలేదు ఇటు ఆకారము కాలేదు. కావున పుట్టినపుడు అహము అహముగానే ఉన్నది. పెద్దగయిన తర్వాత అహం బ్రహ్మయినా కావచ్చు లేక అహంకారమైనా కావచ్చును.

**568. (30) శరీరములో ఆత్మ స్థానమేది?**

జ. బ్రహ్మనాడి.

**వివరము :** ప్రతి శరీరములో జీవాత్మతో పాటు ఆత్మ నివాసముంటున్నది. ఆత్మ బ్రహ్మనాడి పై భాగము మొదలుకొని చివరి భాగము వరకు వ్యాపించి ఉన్నది.

**569. (31) మరణించిన జీవునితో పాటు వేరొక శరీరమునకు పోవు ఆత్మకు చలనమున్నట్లేనా?**

జ. ఆత్మకు చలనము లేదు.

**వివరము :** మరణించిన జీవునితో పాటు వేరొక శరీరమువరకు ఆత్మ పోయినప్పటికి ఆత్మకు చలనము లేదని చెప్పవచ్చును. శరీరములో ఉన్నపుడు కాని, శరీరమును

వదలి పోవునపుడు కాని, ఆత్మ కాల, కర్మచక్రముల మధ్య చిక్కుకొనే ఉన్నది. ఆత్మకు సంకోచ వ్యాకోచములు గలవు కాని చలనము లేదు. ఆత్మ నాల్గుచక్రముల మధ్య ఇరుసుగ బంధింపబడి ఉన్నది. నాల్గుచక్రములకు చలనముంది కాని ఆత్మకు చలనము లేదు.

**570. (32) జీవరాసులు ఎవరి ఆధీనములో ఉన్నవి?**

జ. ప్రకృతి ఆధీనములో ఉన్నవి.

**వివరము :** పరమాత్మ ఆధీనములో ప్రకృతి ఉండగ, ప్రకృతి ఆధీనములో సర్వ జీవరాసులు గలవు. ప్రకృతి భాగములైన పంచ భూతముల చేత తయారైన శరీరము ఆత్మ చైతన్యమునకు లోబడి కదలుచుండగ, జీవాత్మ కర్మకు లోబడి మంచి చెడు అనుభూతులను తనకిష్టము లేకున్న అనుభవిస్తున్నాడు.

**571. (33) ఆత్మ సేవంటే ఏమిటి?**

జ. గురువు చెప్పిన దానిని వినడము.

**వివరము :** గురుసేవలయందు నాల్గు విధ సేవలున్నాయి. 1. స్థాన, 2. అంగ, 3. భావ, 4. ఆత్మ సేవలు. మండపము నిలబడుటకు నాల్గు స్థంభములు ఎట్లు అవసరమో అట్లే గురువు అను మండపము నిలబడుటకు నాల్గు సేవలను స్థంభములు అవసరము. ఒక స్థంభము లేకున్న మండపము యొక్క పై కప్పు ఎలా నిలబడదో అట్లే నాల్గు సేవలందు ఏ ఒక్క సేవ లేకుండిన ప్రయోజనము లేదు. స్థానసేవకంటే అంగసేవ ఎక్కువ కష్టమైనది. అట్లే అంగసేవకంటే భావసేవ మరీ కష్టమైనది. అదే విధముగ భావసేవకంటే ఆత్మసేవ మరీ కఠినమైనది. అందువలన ఒక నూరు మంది శిష్యులు స్థానసేవ చేయువారుంటే వారిలో అంగసేవ చేయువారు 70 మంది మాత్రమే ఉండ గలరు. అంగసేవ చేయు 70 మందిలో భావసేవ చేయువారు 20 మంది మాత్రమే మిగుల గలరు. చివరికి భావసేవ చేయు 20 మందిలో ఆత్మసేవ చేయువారు ఒక్కరు మిగులుట కూడ అరుదు. చాలా కష్టమైనది శిష్యులందు అరుదైనది ఆత్మసేవ.

**572. (34) జీవాత్మకు ఎపుడు విశ్రాంతి కలుగును?**

జ. నిద్రించినపుడు. యోగము చేయునపుడు.

**వివరము :** జీవాత్మకు శరీరములోని 24 భాగములతో సంబంధము లేకుండ పోయినపుడు విశ్రాంతి కలుగును. 24 భాగములలో మనస్సు కూడ ఒకటై ఉన్న దాని వలన జీవునకు ఏ విషయము తెలియక పోవును. ఆ విధముగ నిద్రావస్థయందు కల్గును, కావున నిద్ర సమయములో ఏమి తెలియక జీవుడు విశ్రాంతి పొందును. అదే విధముగ జ్ఞానయోగములో కూడ జీవునికి విశ్రాంతి కల్గి ఆత్మను తెలుసుకొనును. బ్రహ్మయోగములో మనస్సు పని చేసినప్పటికి శరీరముల మీద పని చేయక ఆత్మ విషయము మీద పని చేయును. కావున ఆ సమయములో జీవునికి ఆత్మ సుఖము అనుభవమునకు వచ్చుచుండును. నిద్రలో ఏమి తెలియని విశ్రాంతియైతే బ్రహ్మయోగములో ఆత్మ యందు మిలితమైన విశ్రాంతి దొరకును. నిద్రలోని ఏమీ తెలియని విశ్రాంతికంటే ఆత్మయందు మిళితమైన విశ్రాంతియే గొప్పది. ఈ విధముగ జీవునికి నిద్ర, యోగమందు మాత్రమే విశ్రాంతి కలుగును.

**573. (35) శరీరములోని నవరంధ్రములలో ఏవి ముఖ్యమైనవి?**

జ. కన్ను చెవి యొక్క నాల్గు రంధ్రములు ముఖ్యమైనవి.

**వివరము :** శరీరములో బయటి ప్రపంచ సంబంధము కల్గినవి జ్ఞానేంద్రియములు. అందులో కన్ను చెవి ముక్కు మూడు మాత్రము రంధ్రములుగ ఉన్నవి. అందులో కన్ను చెవి ముఖ్యమైనవని చెప్పవచ్చును. కన్నులు లేకపోతే ప్రపంచ దృష్టియే తెలియదు. అట్లే చెవులు లేకపోతే వినికిడియే తెలియదు. చూపు వినికిడి తెలియక పోతే నూటికి తొంబైపాళ్ళు ప్రపంచ సంబంధము తెగిపోవును. అందువలన కన్ను, చెవి రంధ్రములు నవరంధ్రములలో ముఖ్యమైనవని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**హంపాపురము** **తేది-14-8-1998**

**574. (1) నీ అబ్బ, నీ అబ్బ అబ్బ ఎవరు?**

జ. పరమాత్మ.

**వివరము :** అబ్బ అనగ తండ్రి అని అర్థము. నీ అబ్బ అబ్బ అనగ నీ తండ్రి యొక్క తండ్రి అని అర్థము. ప్రపంచపరముగ అబ్బ తండ్రికాగ, అబ్బ అబ్బను తాత అంటారు. ఇంకా తాత అబ్బను కూడ ముత్తాత అంటారు. తండ్రి తాత ముత్తాత వేరు వేరుగ ఉంటూ వేరు వేరు పేర్లు కల్గియున్నారు. ఆధ్యాత్మిక పరముగ తండ్రి, తాత, ముత్తాత ముగ్గురు ఒకటేనని తెలియుచున్నది. అలాగే అమ్మ, అవ్వ, అవ్వకు అవ్వ అందరు ఒక్కరేనని కూడ తెలియుచున్నది. దీనికి సూత్రము భగవద్గీత గుణత్రయ విభాగయోగములో మూడు నాలుగు శ్లోకములలో ప్రకృతి యోని స్వరూపముకాగ, పరమాత్మ బీజదాతకాగ, సర్వ జీవరాసులు పుట్టుచున్నవని, ప్రపంచములో ఏ రూపములో, ఏ జాతిగ పుట్టిన జీవరాసికైన తల్లి ప్రకృతికాగ తండ్రి పరమాత్మయని తెలియజెప్పబడినది. దీనిని బట్టి ప్రపంచపరముగ మనమెలా అనుకున్నా ఉన్న సత్యము ప్రకారము సర్వులకు తండ్రి పరమాత్మ. అలాగే సర్వులకు తల్లి ప్రకృతి. ఈ సూత్రము ప్రకారము నీ తండ్రికి, నీ తాతకు, నీ ముత్తాతకు అందరికి ఒకడే తండ్రియని తెలియుచున్నది. ఆధ్యాత్మిక పరముగ తండ్రి తప్ప తాత అనువాడు లేడు. అలాగే తల్లి తప్ప అవ్వ అనునది లేదు. ఎవరికైన తండ్రి పరమాత్మ, తల్లి ప్రకృతి.

**575. (2) ఆయువు యొక్క నిజమైన పేరేమి?**

జ. వాయువు.

**వివరము :** మానవుని శరీరములో ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములు ఇమిడియున్నవి. ఇవి శరీరములో ఉండి ఒక్కొక్కటి ఒక్కొక్క

ప్రత్యేకత కల్గి, వాటి విధులు అవి నిర్వర్తించుచు, శరీర ఆరోగ్య అనారోగ్యములకు కారణముగ ఉంటూ, మానవుని జీవితమును సాగించునటుల చేయుచున్నవి. శరీరములో కనిపించని ఖాళీ ప్రదేశముగ జీవుడుండగ, ఆ జీవుని జీవితకాలమును కొలుచు కొలబద్దగ వాయువున్నది. నూనెను కొలుచుటకు లీటరు, గుడ్డను కొలుచుటకు మీటరు ఉన్నట్లు ఒక శరీరములోని జీవుని జీవితకాలమును కొలుచుటకు వాయువు శ్వాస అను కొలత కల్గి ఉన్నది.

చీరైతే ఇంత పొడవు, టవలైతే ఇంతే పొడవు, పంచైతే ఇంతే పొడవు ఉండవలెనన్నట్లు మనిషైతే ఇంత కాలము, కుక్క ఇంత కాలము, దోమ ఇంత కాలమని వాటి జీవిత కాలములు తేడాయున్నవి. అట్లే ఒక్కొక్క జాతికి ఒక్కొక్క రకముగ జీవిత కాలములున్నట్లు తెలియుచున్నది. మనిషికి నూరేల్లు, ఎద్దుకు ఇరవై ఎల్లు, దోమకు ఏడు రోజులని కొంతమేరకు వాటి ఆయువు నిర్ణయింపబడి ఉన్నప్పటికి వాటివాటి కర్మానుసారము మనిషి నూరేల్లు బ్రతుకుతాడను నమ్మకము లేదు. అట్లే దోమ ఏడు దినములు బ్రతుకుతుందను నమ్మకము లేదు. కర్మరీత్య ప్రమాదవశాత్తు మనిషి ఆరు రోజులకు చనిపోవచ్చును. దోమ మూడు రోజులకు మరణించవచ్చును.

సూక్ష్మముగ చూచిన ప్రతిది ముందే నిర్ణయించబడి ఉండును. ఎవరెంత కాలము బ్రతకాలన్నది కూడ నిర్ణయించబడి ఉన్నది. ఆ నిర్ణయము శ్వాస అను కొలతతో ఉన్నది. శ్వాసకు ఆధార రూపమైనది వాయువు (గాలి). కావున ప్రతి ఒక్కరికి జీవితకాలము యొక్క పొడవు వాయువు చేత శ్వాస రూపమున నిర్ణయించబడి ఉండును. ఎన్ని శ్వాసల వాయువు ఉండవలయునో కర్మ చేత నియమించబడి ఉండును. మానవుని జీవిత కాలము వాయువు చేతనే నిర్ణయింపబడి ఉన్నది. కావున పలానా వాని యొక్క వాయువు ఎంత అని జ్యోతిష్యమున ప్రశ్నించెడివారు. జ్యోతిష్య శాస్త్రము ప్రకారము జన్మ లగ్నమునకు ఎనిమిదవ లగ్నములో గ్రహముల స్థితి గతులను బట్టి వీని వాయువు ఇంతే ఉన్నదని తేల్చి చెప్పెడివారు. ఈ విధముగ మానవుని జీవితకాలమును నిర్ణయించు

కొలతయిన వాయువు నేడు అందరి నోట ఆయువు అని చెప్పబడుచున్నది. జ్యోతిష్యుని వద్ద కూడ 'వాయువు' అని చెప్పబడక 'ఆయువు' అను పదముగ మార్పుచెందినదని, ఆయువు యొక్క నిజమైన పేరు వాయువని తెలియాలి.

**576. (3) భగవద్గీత మొత్తము ఎన్ని అధ్యాయములుగ ఉన్నది?**

జ. పదిహేడు.

**వివరము :** భగవంతుడు చెప్పిన దానిని భగవద్గీత అంటాము. భగవద్గీతలో అర్జునుడు చెప్పిన విషాద యోగమను అధ్యాయమును తీసివేస్తే భగవంతుడు చెప్పిన అధ్యాయములు మొత్తము పదిహేడే అగును. దీని ప్రకారము భగవంతుడు చెప్పిన గీత పదిహేడు అధ్యాయములే ఉన్నదని చెప్పవచ్చును. అర్జునుడు చెప్పినది గీత కాదని తెలియాలి.

**577. (4) శివపూజ అని దేనినందురు?**

జ. శవ పూజను.

**వివరము :** పూర్వము శవమును శివము అనెడివారు. అలా ఎందుకు అనెడివారనగా! మానవుని శరీరములో పరమాత్మ, ఆత్మ, జీవాత్మలున్నారు. జీవాత్మ, ఆత్మ జంట ఆత్మలుకాగ పరమాత్మ ప్రత్యేకమైనది. జీవ శరీరములో మూడు ఆత్మలున్నప్పటికి మరణములో ఆత్మ, జీవాత్మలు మాత్రము శరీరమును వదలి పోవుచున్నవి. అలా పోయినవి మరొక చోట వేరొక శరీరమును ఆశ్రయించు చున్నవి. పరమాత్మ మాత్రము మరణించిన శరీరములో కూడ మొదటి లాగే ఉన్నది. జీవాత్మ ఆత్మల వెంట పరమాత్మ పోలేదు. ఎందుకనగా పరమాత్మ ఒక చోట ఉండి మరొక చోట లేదనుటకు అవకాశము లేదు. అది అంత ఆవహించి ఉన్నది. శరీరములోపల శరీరము బయట అణువణువున వ్యాపించినది పరమాత్మ, కావున అది మరొక చోట లేకపోతే కదా పోవుటకు వీలయ్యేది. శరీరములోని జీవుడు ఆత్మ పోయినప్పటికి పరమాత్మ మిగిలియున్నది. మరణించిన శరీరములో జీవాత్మ ఆత్మ లేరు. కేవలము స్వచ్ఛమైన పరమాత్మ ఒక్కటే మిగిలి ఉన్నది.

కావున దానిని 'శివము' అనెడివారు. శివము అనగ అధిపతియని పరమాత్మ అని తెలియవలెను. క్షరాక్షరులైన జీవాత్మ ఆత్మలు లేని శరీరమును పెద్దలు శివమని పిలుస్తు ఆ శివమును పూజించెడివారు. అంత్య క్రియలకు ముందు శవమును, చందన పుష్పములతో అలంకరించి అందరు నమస్కరించెడి వారు. ఆ ప్రక్రియ ఇప్పటికి జరుగుచున్నది. దానినే శివపూజ అనవలెను. కాలక్రమమున పదమార్పిడి చెంది శివపూజను శవపూజ అంటున్నాము.

**578. (5) అగ్నికి కాలునది ఆత్మనా, జీవాత్మనా ఏది?**

జ. ఆత్మ.

**వివరము :** శరీరములో ఆత్మ, జీవాత్మ రెండు ఉన్నప్పటికి అందులో జీవాత్మ మాత్రము శిరస్సు పై భాగమున, కపాలభాగములోపల గల కాల, కర్మ, గుణచక్రములలో గుణచక్రమందు నివశిస్తున్నది. శత్రుదుర్భేద్యమైన కోటలో రాజున్నట్లు జీవాత్మ ఎవరికి తెలియని చోట, బయటనున్న పంచభూతములకు దొరకని చోట నివాసమై ఉన్నది. ఇక ఆత్మ అంటే శరీరమంతా వ్యాపించి, చర్మము యొక్క పై అంచు వరకు ఉన్నది. శరీర భాగములలో ప్రతి చోట ఉన్నది ఆత్మకాగ, శరీరములో మారుమూల లోపల ఉన్నది జీవాత్మ. అందువలన అగ్ని కాల్చగలిగేది బయట వరకు వ్యాపించి ఉన్న ఆత్మనే గాని జీవాత్మనుకాదని తెలియుచున్నది. ఈ మా మాట కొందరికి అసత్యముగ తోచి భగవద్గీతలో ఆత్మ అగ్నికి కాలదు, కత్తికి తెగదు, నీటికి తడువదు అను వాక్యము జ్ఞాపకము రావచ్చును. భగవద్గీతలోని మాట నిజమే కాని శరీరములో మూడు ఆత్మలు గలవు. అగ్నికి కాలనిది, కత్తికి తెగనిది ఏ ఆత్మని చెప్పాడో వివరము తెలియునా అని మేము అడుగుచున్నాము. శరీరములోని మూడు ఆత్మలలో రెండు అగ్నికి కాలనివి ఒకటి కాలునది గలదు. జీవాత్మ పరమాత్మలు అగ్నికి కాలవు, ఆత్మ మాత్రము అగ్నికి కాలునదిగ తెలియుచున్నది. ఈ విషయమై భగవద్గీతలోని సాంఖ్యయోగమందు గల 23వ శ్లోకము చూడండి. అదియు మాచే రచింపబడిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** ను చదవండి.

**579. (6) 3000 సంవత్సరముల ముందు నీకు తెలిసిన భగవంతుడు ఎవరు?**

జ. శ్రీకృష్ణుడు.

**వివరము :** పరమాత్మ అంశ మానవునిగ పుట్టడమును భగవంతుడు పుట్టాడు అంటాము. పరమాత్మ అంశ ఎక్కడ పుట్టినది ఎవరికి తెలియని విషయము కావున భగవంతుడెవరన్నది అగమ్యగోచరమైన విషయమే. అయినప్పటికి భగవంతుని తెలుసుకొనే దానికి ఒక సూత్రము గలదు. అది ఏమనగా! ఎచటయితే ఎవరి ద్వార ధర్మములు తిరిగి తెలియబరచబడుచున్నవో అతనినే భగవంతునిగ లెక్కించనగును. అట్లని ఐదు వేల సంవత్సరములపుడు చెప్పిన ధర్మములు మనకు తెలియలేదనుకో, అపుడు వ్రాయబడిన ధర్మములను ఒక గురువుగ ఉన్న వ్యక్తి విపులముగ అర్థమగునట్లు ఎన్నో ఉపమానములు చెప్పి తెలియజేశాడనుకో, అపుడు ఆ వ్యక్తి భగవంతుడగునా అని ప్రశ్న కొందరికి రాగలదు. దానికి సమాధానము నిర్మితమైయున్నవాటిని, ప్రతిష్ఠించి ఉన్న వాటిని చదివి చెప్పువాడు, ముందే తాను తెలుసుకొని దారాళముగ చెప్పువాడు, గురువుగాని భగవంతుడు గాని కాజాలడు. ధర్మములు జీర్ణించి పోవడము అంటే ఒక చోట ఉండి ఒక చోట లేకుండడమని కాదు మరియు కొందరికి తెలిసి చాలా మందికి తెలియకుండ పోవడము గాదు. ఒక పుస్తక రూపములో ఉండి ఉండడము కాదు. భూమి మీద ఎచ్చట ధర్మములు తెలియకుండ పోయినపుడు వాటికి గ్లాని ఏర్పడినట్లని తెలియుచున్నది. ఎవరికి తెలియక ఏ గ్రంథరూపములో గాని లేకుండ పోయినపుడు వాటిని స్వయముగ తెలియజేయువాడు భగవంతుడు. ఎవరికి తెలియకుండ పోయినపుడు అవి పరమాత్మకు మాత్రము తెలిసి ఉండును. పరమాత్మకు సంబంధించిన ధర్మములు కావున అవి ఆయనకే తెలియును. అందువలన ఆయనే భూమి మీద మానవునిగ పుట్టవలసి వస్తున్నది. అట్లు పుట్టినవాడు శ్రీకృష్ణుడు. అందువలన ఆయనను భగవంతుడని తెలిసి ఉన్నాము. ధర్మములను ఆధారము చేసుకొని భగవంతుని తెలియగలము.

**580. (7) శ్రీకృష్ణాష్టమికి ముందు వెనుకనున్న దినములు దేని గుర్తు?**

జ. అజ్ఞానము, జ్ఞానము.

**వివరము :** అమావాస్య నుండి పౌర్ణమి వరకు 15 రోజులు, అట్లే పౌర్ణమి రోజు నుండి అమావాస్య వరకు 15 రోజులుండుట అందరికి తెలిసిన విషయమే. శ్రీకృష్ణుడు పుట్టినది పౌర్ణమి నుండి అమావాస్య వరకున్న 15 దినములైన బహుళ పక్షములో, బహుళ పక్షములోని 15 దినములలోని మధ్య దినమైన అష్టమి దినమున ఆయన జన్మ జరిగినది. పక్షములో మొదటి దినమైన పాడ్యమి నుండి ఏడు దినములు పోగ మధ్యన అష్టమి గలదు. అట్లే అష్టమి తర్వాత ఏడు దినములు గలవు. 7+1+7=15 పదిహేనును రెండు సమభాగములు చేయవలయునంటే మధ్యలో ఒక దినము వదలి ముందు 7 రోజులు వెనుక 7 రోజులు విభజించు కోవలసియున్నది. మధ్యలో వదలివేసిన ఒక్క దినమును అష్టమిగ గుర్తించు కోవలయును. కృష్ణుడు మధ్య దినమైన అష్టమియందే పుట్టడములో గొప్ప విశేషము గలదు. అదేమనగా!

భగవంతుడైన శ్రీకృష్ణుడు ఇటు జ్ఞానమునకు అటు అజ్ఞానమునకు సంధి లాంటివాడు. అజ్ఞానమునుండి జ్ఞానమునకు, అట్లే జ్ఞానము నుండి అజ్ఞానమునకు పోవుటకు ఆయన రెండిటికి మధ్యన కేంద్రములాంటివాడు. ఎందరో జ్ఞానులు సహితము ఆయనను చూచి అజ్ఞానము వైపు, అలాగే అజ్ఞానులు జ్ఞానము వైపు పోయారు. ఎందరో జ్ఞానులమనుకొన్నవారు, ఆయన జీవితములో నడచుకొన్న పద్ధతులు ఆచరణలు చూచి ఆయన చెప్పిన గీత బాగనే ఉన్నది కాని, ఆయన ఆచరణ మాకు నచ్చలేదు. నడవడిక ముఖ్యము కదా! లోపలి గుణముల బట్టియే కదా ఎవరైన ఆచరించేది. ఆయన ఎన్ని చెప్పినప్పటికి చేసిన పనులను బట్టి చూస్తే బోధలు చెప్పినంతటి గొప్పవాడు కాదని తెలియుచున్నది అంటున్నారంటే వారికున్న జ్ఞానము నిష్ప్రయోజనమన్నమాట. శ్రీకృష్ణుడేమి చెప్పాడో అర్థము చేసుకోలేదన్నమాట. అటువంటపుడు శ్రీకృష్ణుడు చెప్పిన అసలైన జ్ఞానము వేరు

విధముగ అర్థమై నడవడికకు భిన్నముగ తోచినపుడు వారు కృష్ణునికి భిన్నముగ పోగలరు. శ్రీకృష్ణుడు జ్ఞానకేంద్రమైనపుడు ఆయనకు భిన్నముగ పోవువారు అజ్ఞానము వైపు పోవుచున్నారనే తెలియాలి.

అట్లే శ్రీకృష్ణుని చూచి ఆయన చెప్పినది చేసినది చేయుచున్నది అంతా ఒకటేనని తెలిసిన వారు జ్ఞానమువైపు సాగిపోగలరు. ఆయనను చూచి ఉన్న చోటినుండి కొందరు జ్ఞానము వైపుకు, కొందరు అజ్ఞానము వైపుకు పోవుచున్నారు. కావున శ్రీకృష్ణుడు జ్ఞానమునకు అజ్ఞానమునకు మధ్యగలవాడని తెలియునట్లు అష్టమి రోజునే ఎంచుకొని పుట్టాడు. అందువలన శ్రీకృష్ణాష్టమికి ముందు వెనుక నున్న రోజులు అజ్ఞానమునకు జ్ఞానమునకు చిహ్నములని తెలియాలి.

**581. (8) దక్షిణాయణములో చనిపోయిన భగవంతునికి మోక్షము వచ్చునా రాదా?**

జ. వచ్చును.

**వివరము :** ఈ ప్రశ్న ఎలా ఉందంటే తేనెటీగకు తేనె రుచి తెలుసునా తెలియదా అన్నట్లున్నది. దాని పేరే తేనెటీగ దానికి తేనె రుచి ఎందుకు తెలియదు. అలాగే భగవంతుడు పరమాత్మ అంశ అని ముందే చెప్పుకొన్నాము. పరమాత్మ అనిన మోక్షమనిన ఒక్కటే. మోక్షములోని భాగమే భగవంతుడైనపుడు ఆయనకు తిరిగి మోక్షమొచ్చేదేమిటి. ఆయనే మోక్షమై ఉన్నాడు కనుక భగవంతుడెపుడు మరణించిన ఆయన మోక్షమునే చెందును. సాధారణ వ్యక్తులలో యోగులై ఉన్నవారు మోక్షమును పొందుటకు మరణ కాలము నిర్ణయించబడి ఉన్నది. యోగులకు తప్ప ఆ కాలము ఎవరికి వర్తించదు. సాధారణ మానవుడు ఎపుడు చనిపోయిన జన్మకే పోతాడు. అలాగే భగవంతుడు ఎపుడు చనిపోయిన మోక్షమునకే పోతాడు. ఇక మిగిలినది యోగులు మాత్రమే వారికే ఉత్తరాయణము, శుక్ల పక్షము, పగలు, ఎండ సమయము అను కాలము వర్తిస్తుందని తెలియాలి. ఈ లెక్క ప్రకారము భగవంతుడు దక్షణాయణములో మరణించినప్పటికి మోక్షమునే చేరును.

**582. (9) అంధకార రాత్రి మాయనా? పరమాత్మనా దేని గుర్తు?**

జ. పరమాత్మ.

**వివరము :** రాత్రి అనగ త్రిగుణరహితమైనదని అర్థము. రాత్రి అను పదము సంస్కృతము, హిందీ మొదలైన భాషలలో గలదు. తెలుగు భాషలో కూడ రాత్రి అను పదముండడము గర్వింపతగిన విషయము. "రా" అనగ రహితమని, "త్రి" అనగ మూడు గుణములని అర్థము గలదు. దాని ప్రకారము మూడు గుణములు లేనిది రాత్రి అని తెలియవలెను. అందువలననే రాత్రి సమయములో చాలామంది మూడు గుణములను వదలి నిద్రలోనికి జారుకొనుచున్నారు. రాత్రి సమయమనగ నిద్ర సమయమని "త్రి" గుణములు లేని సమయమని అర్థము చేసుకోవాలి. ఇది ఒక విధానము కాగ, రెండవ విధానము ప్రకారము పరమాత్మకు పగలు రాత్రి కూడ గలవు. మనుషులకు 12 గంటల కాలము పగలు, 12 గంటల కాలము రాత్రికాగ, పరమాత్మకు 1000 యుగములు పగలు, అలాగే 1000 యుగములు రాత్రిగ ఉన్నాయి. పరమాత్మ పగలులో ప్రపంచమున్నది. పరమాత్మ రాత్రిలో ప్రపంచములేని తెలియని స్థితి ఉండును. మనుషుల పగలులో కూడ ప్రపంచము కనిపిస్తున్నది. రాత్రి నిద్రలోకి పోయినపుడు ప్రపంచము కనిపించలేదు. మనుషుల పగలులో గుణములు పని చేయుచున్నవి. అట్లే పరమాత్మ పగలులో కూడ ప్రపంచమున్నది. మనషుల రాత్రిలో మూడు గుణములులేవు. అలాగే పరమాత్మ రాత్రిలో ప్రపంచమే లేక భవిష్యత్, వర్తమాన, భూత అను మూడు కాలములు లేవు. మూడు గుణములు లేని, మూడు కాలములు లేని రాత్రి పరమాత్మ స్వరూపమైనదని, మూడు గుణములు, మూడు కాలములు గల పగలును మాయ స్వరూపమైనదని తెలియాలి. దీనిని బట్టి అంధకార రాత్రి పరమాత్మ చిహ్నమని జవాబు చెప్పాలి.

**583. (10) శ్రీకృష్ణుని తల మీద పింఛములో మధ్య అక్షరమేది?**

జ. ఆత్మ.

**వివరము :** శ్రీకృష్ణుడు ఇస్లామ్ మతము ప్రకారము పైగంబర్, క్రైస్తవ మతము ప్రకారము సువార్త దూత, ఇందూ మతము ప్రకారము అవధూత. మూడు మతములలోని పదములలో దేవుని విషయములు తెచ్చి చెప్పువాడని అర్థము గలదు. అటువంటి వాడు తానెట్లున్నది తనను చూచి ఇతరులెట్లు నడుచుకోవలసినది తన సందేశములలో తెలియజెప్పుచుండును. అటువంటి సందేశములలో తాను ధరించిన నెమలి పింఛము కూడ గలదు. నెమలి పింఛములో ఏమి సందేశము గలదని అనుకోకూడదు, అందులో చాలా గొప్ప అర్థముతో ఇమిడిన సందేశము గలదు. నెమలి పింఛమును బాగ పరికించి చూచిన అందు నాలుగు భాగములుగ ఉన్న రంగులు కనిపించును. రంగుల భేదమును బట్టి మధ్యలో ఉన్న రంగు మాత్రము గాడముగ మూడిటికంటే బాగ కనిపించునట్లుండును. నాలుగు రంగులలో బయటి నుండి మొదటిది తామస గుణమని, రెండవది రాజస గుణమని, మూడవది సాత్త్విక గుణమని, చివరిలో మధ్యన కనిపిస్తున్న నలుపువర్ణ గుర్తు ఆత్మని తెలియవలెను. భగవద్గీతలో **'చాతుర్వర్ణం'** అను పదమునకు ఈ నాలుగు వర్ణములు సరిపోవును. ఈ నాలుగు వర్ణములను బట్టియే మనుషులను తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులు అని నాలుగు భాగములుగ దేవుడు విభజించాడు. పింఛములోని మధ్య రంగు మనుషులలో యోగులను, క్షరాక్షర ఆత్మలలో అక్షరమైన ఆత్మను తెలియజేయుచున్నది. మూడు ఆత్మలలో నాశరహితమైన ఆత్మను తెలియజేయు గుర్తే మధ్యనగల రంగు అని గుర్తించుకోవాలి.

**584. (11) జీవాత్మ, ఆత్మ, పరమాత్మలలో మొదటి అక్షరమేది?**

జ. ఆత్మ.

**వివరము :** మూడు ఆత్మలలో అక్షరము ఒకే ఒక ఆత్మకు వర్తించును. క్షరము అనగ నాశనమగునది. అక్షరము అనగా నాశనము కానిది. రెండిటికి అతీతమైనది క్షరాక్షరములకు సంబంధము లేనిది పరమాత్మ. జీవాత్మ మరణములో నాశనముకాక కేవలము శరీరములు మారుచుండును. కాని మోక్షములో మాత్రము జీవాత్మ పూర్తి నాశనముచెందును. ఆత్మనునది జీవాత్మతో పాటు ఎల్లవేళల ఉన్నప్పటికి

నాశనము చెందునది కాదు. జీవాత్మకు కర్మ సంధానమై ఉండి జీవించునట్లు చేయుచు, అది అయిపోయిన వెంటనే జీవుడు నాశనమై పోవుటకు దారి కల్పిస్తున్నది. ఆత్మకు కర్మ సంధానము లేదు. నాశనమనునది లేదు. అందువలన మూడు ఆత్మలను వరుసగ క్షర, అక్షర, పురుషోత్తములన్నారు. మూడు ఆత్మలలో మొదట అక్షరముగాని, చివర అక్షరముగాని, ఆత్మయే అగుచున్నది. పురుషోత్తముడు అన్నిటికి అతీతుడు. జీవాత్మ నాశనమగు క్షరుడు. ఎటువంటి లెక్క చూచిన ఆత్మయే అక్షరుడు.

**585. (12) జ్ఞానపరముగ నీకు ఒకడు మామ అయితే, నీ భార్యకు ఏమగును?**

జ. మామ అగును.

**వివరము :** ప్రపంచ పరముగ ఒకనికి మరొకడు వరుసకు మామ అయినపుడు వాని భార్యకు నాన్నకాని, చిన్నాన్న గాని, పెద్దనాన్న గాని అగును. ప్రపంచ పరముగ ఒక కేంద్రమునకు మరొక కేంద్రము ఇంత దూరమున్నదని చెప్పవచ్చును. అట్లే ఒకనికి బంధుత్వ దూరములను లెక్కించి తండ్రి వరుస, మామ వరుస అని రెండు వరుసలు నిర్ణయించుచున్నాము. కాని జ్ఞానపరముగ ఒకే దాని నుంచి అన్ని పుట్టాయి, కనుక ఒక దానికి అందరు ఒకే వరుస క్రిందికి వస్తున్నారు. పరమాత్మ అందరికి తండ్రికాగ, ప్రకృతి అందరికి తల్లియై ఉన్నది. ప్రపంచములో భార్య భర్తలిద్దరికి ఒకరే తండ్రి పరమాత్మ అని గీతలో కూడ చెప్పబడినది. అలాగే జ్ఞాన పరముగ చంద్రుడు నీకు మామ అయితే, నీ భార్యకు కూడ మామయే అగును. అందువలన అందరికి తండ్రి పరమాత్మ, అందరికి మామ చందమామ అని చెప్పవచ్చును. ఈ సాంప్రదాయము ప్రకారము భార్య భర్తలను సోదర భావముతో పెళ్లికూతురు, పెళ్లికొడుకు అనుచున్నారు. కూతురు, కొడుకు అనడములో అర్థము తెలుసుకదా! ఈ విధముగనే నీ తల్లి, నీ మామ, నీ తండ్రిని గుర్తించండి.

**586. (13) చంపబడువాడు, చచ్చువాడు ఎవరు?**

జ. జీవుడు, ఆత్మ.

**వివరము :** మన శరీరములో మూడు ఆత్మలున్నవని తెలుసుకొన్నాము. అందులో మరణము ఆత్మ, జీవాత్మలకు గలదు. పరమాత్మకు ఏమి లేదు. శరీరములో గల ఆత్మ శరీరమంతట వ్యాపించి ఉండును. జీవాత్మ శిరస్సులో ఒక చోట మాత్రముండును. ఏమి జరిగిన బయట నుండి ఆత్మ ద్వార జరుగు దానిని మాత్రము అనుభవించుట జీవుని వంతు, అన్ని చేయుట ఆత్మ వంతు. ఏ ప్రమాదము జరిగిన మొదట శరీరములోని ఆత్మకు చెందును. తర్వాత లోపల జీవుని వరకు పోవును. అందువలన మొదట చచ్చువాడు ఆత్మని, తర్వాత ఆత్మ చేత చంపబడువాడు జీవాత్మని తెలియాలి. ఇద్దరు చచ్చువారే అయినప్పటికి చచ్చువాడు, చంపబడువాడని వారి స్థితిగతులను బట్టి చెప్పవలసి వచ్చినది.

**587. (14) నాలుకలో రుచి గ్రాహితముగ ఉన్నది జీవాత్మనా, ఆత్మనా, పరమాత్మనా?**

జ. ఆత్మ.

**వివరము :** శరీరములో తలయందు ఒక్క చోట ఉండి, వచ్చిన అనుభవములను అనుభవించువాడు జీవాత్మ. కావున జీవునకు నాలుకలోని రుచికి ఏ మాత్రము సంబంధము లేదు. పరమాత్మ ఏది కానివాడు, కావున పరమాత్మకు సంబంధము లేదు. ఇక శరీరమంతట వ్యాపించి అన్నిటికి శక్తి నిచ్చి ఆడించుచున్నది ఆత్మ. నాలుకలో రుచిని గ్రహించు శక్తిగా ఉన్నది కూడ ఆత్మనేనని చెప్పవచ్చును.

**588. (15) ఆత్మను, జీవాత్మను కలుపునది ఏది?**

జ. పరమాత్మ.

**వివరము :** శరీరములో మూడు ఆత్మలున్నవని చెప్పుకొన్నాము. అందులో ఆత్మకు, జీవాత్మకు వేరు వేరు పనులున్నాయి. వారి పనులను బట్టి, ఉన్నటువంటి

ఆకారమును బట్టి, జీవాత్మ ఆత్మలు వేరుగనున్నవని చెప్పవచ్చును. ఆకారము లేనిది, పనులు లేనిది, నిర్దిష్టముగ చెప్పలేనిదియైన పరమాత్మ అణువణువున వ్యాపించి ఉన్నది. అది ఆత్మలోను, జీవాత్మలోను కూడ వ్యాపించి ఉన్నది. జీవాత్మ, ఆత్మలు వేరు వేరుగ ఉంటు ఒక దానిలో ఒకటి వ్యాపించిలేవు. పరమాత్మ మాత్రము రెండిటియందు వ్యాపించి ఉండుట వలన, ఆత్మను జీవాత్మను కలుపునదిగ ఉన్నదని చెప్పవచ్చును.

**589. (16) గురువుగారి పని స్వామి కార్యమా, స్వకార్యమా?**

జ. స్వకార్యము.

**వివరము :** ఆత్మ జ్ఞానమును బోధించు వారినందరిని గురువులుగ భావించుకొనుట పరిపాటయినది. కాని అందరు గురువులు కాదను వాదనమాది. గురువులలో బోధకులు, గురువులు అను రెండు తెగలుగనున్నారని చెప్పవచ్చును. లక్ష మంది బోధకులలో ఒక్కడు గురువుగ ఉండడము కూడ అరుదనియే చెప్పవచ్చును. ఒకరు చెప్పిన దానిని గాని, ఒకరు వ్రాసిన దానిని గాని తిరిగి చెప్పువాడు బోధకుడను సూత్రము ప్రకారము, చాలామంది బోధకులే అగుదురు. దాని ప్రకారము పరమాత్మయే భగవంతునిగ వచ్చి చెప్పినపుడు, ఆయనే మనకు గురువగును. అందరికి గురువైన భగవంతున్ని జగద్గురువు అనుట కూడ జరుగుచున్నది. గురువు ఆత్మస్వరూపుడు కావున గురువు యొక్క పని స్వామి కార్యము కాదు. మనలో కూడ ఆత్మ ఉన్నది, దాని పనినే చేయుచున్నామను భావముతో చేయుట వలన ఆత్మ కార్యమే అగుచున్నది. కావున స్వంత కార్యమే అగును. అదే బోధకుని పనియైతే స్వామి కార్యమగును.

**590. (17) భగవంతుని శరీరములో ఆత్మ ఉన్నదా?**

జ. లేదు.

**వివరము :** సాధారణ మనిషి శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుండడము సహజము. కాని భగవంతునిగ పుట్టిన వాని శరీరములో జీవాత్మ ఆత్మలుండవు.

ఎందుకనగ పరమాత్మ విశ్వమంత వ్యాపించి ఉండగ, అందులోని కొంత భాగము మానవ ఆకారములో జన్మించినపుడు, ఆ జన్మను భగవంతుడని అంటున్నాము. భగవంతుడు పరమాత్మ అంశయై కర్మలు లేనివాడై ఉండుట వలన జీవుడు కాదు. జీవుడున్నపుడే జోడుగ ఆత్మ ఉండును. జీవుడు లేనపుడు ఆత్మ కూడ ఉండదు. భగవంతుని శరీరములో జీవునిగ, ఆత్మగ, పరమాత్మే నటించుచుండును. కొన్ని సమయములలో పరమాత్మగ, కొద్ది కాలము ఆత్మగ, ఎక్కువ కాలము జీవాత్మగ పరమాత్మ భగవంతుని శరీరములో ఉండును. కావున భగవంతుని శరీరములో ప్రత్యేకించి ఆత్మ, జీవాత్మలు లేవు.

**591. (18) ఒకరికి తల్లిగ, ఒకరికి సోదరిగ, ఒకరికి భార్యగనున్నది ఎవరు? ఎవరికి?**

జ. తల్లిగ జీవునకు, సోదరిగ ఆత్మకు, భార్యగ పరమాత్మకు ఉన్నది ప్రకృతి.

**వివరము :** కాల పరిమితి లేకుండ అన్నిటికి అతీతమై, అన్నిటికి అధిపతియై ఉన్నది పరమాత్మ. దాని తర్వాత దానిచేత పుట్టించబడినవే సమస్తము. వాటిలో మొట్టమొదట సృష్ఠించబడినది ప్రకృతి. ప్రకృతి నాకు పత్నిగ ఉన్నదని, నేను బీజదాతగ ఉన్నానని, సర్వ జీవులకు తల్లి ప్రకృతికాగ నేను తండ్రినని, భగవద్గీత యందు పరమాత్మే స్వయముగ తెల్పుట వలన పరమాత్మకు భార్యగ, జీవునకు తల్లిగ ప్రకృతి గలదని తెలియుచున్నది. పరమాత్మ తన నుండి ఆత్మను కూడ విడుదల చేసి జీవాత్మలకు తోడుగ జోడుగ పెట్టుట వలన, ప్రకృతితో సహ పుట్టుటవలన, ఆత్మకు ప్రకృతి సోదరియైనది. ప్రకృతి ఆత్మతో సహ పుట్టుటవలన ఆత్మకు సోదరి, జీవునకు తల్లి, పరమాత్మ బీజమును భరించునది కావున పరమాత్మకు భార్యగ ప్రకృతి గలదని చెప్పవచ్చును.

**592. (19) మోక్షము పొందడానికి ఉన్న విధానములెన్ని? ఒకటా, రెండా, మూడా?**

జ. రెండు మరియు ఒకటి, మొత్తము మూడు గలవు..

**వివరము :** జీవ శరీర బంధము నుండి విడుదల పొందుటకు విధానములు రెండు ఎల్లపుడు, ఒకటి అరుదుగ మొత్తము మూడు గలవు. ఒకటి శరీరములోని ఆత్మను తెలుసుకొని, జ్ఞానాగ్ని సముపార్జన ద్వార ఉన్న కర్మను నాశనము చేయుట వలన లభించునది. దానినే **"బ్రహ్మయోగ"** విధానము అంటారు. రెండవది శరీరములోని యంత్రాంగమంత తెలిసి, అందులోని అహంకారము యొక్క పనిని నిలిపి, పని చేయుచున్న రాబోవు కర్మ రాకుండ కాలిపోవును. దానినే "యజ్ఞకర్మ" విధానము లేక "కర్మయోగ" విధానమంటారు. ఈ రెండు అందరికి అందుబాటులో ఉన్నవి. ఎవరైన ఆచరించుటకు గీతయందు తెల్పియున్నారు. ఇక మూడవ విధానము అరుదైనదన్నాము. దానినే సూక్ష్మములో మోక్షమని కూడ అన్నారు. దానినే "భక్తియోగమని" కూడ అన్నారు. పరమాత్మ భూమి మీద భగవంతునిగ ఉన్నపుడు, ఆయనను పలానావాడని గుర్తించడమే మూడవ విధానము. అలా గుర్తించుట వలన, మిగత రెండు యోగములతో సంబంధము లేకుండనే మోక్షము పొందవచ్చును. ఉదాహరణకు శ్రీకృష్ణున్ని భగవంతునిగ భీష్ముడు గుర్తించుటవలన, భీష్ముడు కర్మ బ్రహ్మయోగములాచరించకున్నను, ఆ జన్మలోనే మోక్షము పొందగలిగాడు. దీనినే భక్తియోగమని, మోక్షము పొందుటకు మానవునికి ఈ విధముగ మూడు మార్గములు గలవని చెప్పుకోవచ్చును.

**593. (20) జ్ఞానము కావాలనుకొన్నవారికి ఉండవలసినదేది?**

జ. శ్రద్ధ.

**వివరము :** దేవుని జ్ఞానము కావాలనుకొను వారికి ముఖ్యముగ ఉండవలసినది శ్రద్ధ. **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** అని భగవద్గీతలో కూడ దేవుడే చెప్పాడు. శ్రద్ధ కూడ ఎంత ఉంటే అంత జ్ఞానమే లభించును. శ్రద్ధ కొంత ఉంటే ప్రయోజనము లేదు. శ్రద్ధను బట్టి జ్ఞానము అను సూత్రము ప్రకారము, ఎంత శ్రద్ధ ఉంటే అంత జ్ఞానము లభించును.

## జ్ఞాన పరీక్ష

**మాల్యవంతము** **తేది-13-09-1998**

### 594. (1) విద్యలలో ముఖ్యమైన విద్య ఏది?

జ. బ్రహ్మవిద్య.

**వివరము :** ప్రపంచములో చతుష్షష్టి (64) విద్యలు గలవని నానుడి గలదు. ప్రపంచములో ఎన్ని విద్యలున్నా అన్నిటికంటే పెద్దది, ఉత్తమమైనది, విలువ కట్టలేనిది ఒకటి గలదు. అదియే బ్రహ్మవిద్య. అన్ని విద్యలను రెండు భాగములుగ విభజించవచ్చును. అన్ని విద్యలు కూటి కొరకే కాగ, బ్రహ్మవిద్య మాత్రము ముక్తి కొరకున్నది. ఆత్మజ్ఞానము లేని జీవితము పుట్టలోని చెదలుతో సమానమని వేమన యోగి చెప్పగ, వాసనలేని పూవుతో సమానమని మరికొందరు చెప్పారు. ఇప్పటి మనుజులు బ్రహ్మవిద్య అంటే ఏమిటో తెలియని స్థితిలో ఉంటు, కూటి కొరకు ఉపయోగపడు విద్యల సముపార్జనలో యుక్తవయస్సంత గడిపేస్తు, తర్వాత ఆ విద్యలతో కొందరు బ్రతుకగల్గుచున్నారు, కొందరు బ్రతుకలేకపోవుచున్నారు. కూటి కొరకు విద్యలవసరమే అయిన, ఆత్మజ్ఞానము కొరకు బ్రహ్మవిద్య మరీ ముఖ్య అవసరము. అన్ని విద్యలలోలేని తృప్తి, శాంతి ఒకే ఒక బ్రహ్మవిద్యలో గలదు. అందువలన అది అందరికి ముఖ్య అవసరము.

### 595. (2) మనస్సు యొక్క స్వస్థానమేది?

జ. బ్రహ్మనాడి.

**వివరము :** శరీరములోని 25 భాగములలో ఒక్కొక్క దానికి నిర్దిష్టమైన పని, ఆకారము, నివశించు స్థలము ఉన్నవని శాస్త్రబద్ధ సూత్రము గలదు. దాని ప్రకారము మనసుకు ఆకారము, పని, నివశించు స్థలము గలవు. ఈ ప్రశ్నలో స్థానము యొక్క ప్రస్తావన వచ్చినది, కావున మనస్సు ఎక్కడ నివశిస్తున్నది? ఎంత సేపు ఎక్కడెక్కడున్నది? మనము తెలుసుకోవలసి ఉన్నది. మనస్సు యొక్క స్వస్థానము

శరీరములో పెద్దనాడియైన బ్రహ్మనాడియని తెలియవలెను. బ్రహ్మనాడి మనస్సుకు స్వంత ఊరులాంటిది. అట్లని మనస్సు ఎల్లపుడు బ్రహ్మనాడిలో ఉండదు. మనస్సు అపుడపుడు బ్రహ్మనాడి వదలి శరీరమంత వ్యాపించి పోవుచుండును. బ్రహ్మనాడి ప్రక్కన గల సూర్య చంద్రనాడుల మీద కూడ నివశిస్తుండును. బ్రహ్మనాడిలో ఉన్నపుడు ఏ పని చేయక నిలచిపోవును. ఆ స్థితినే నిద్ర స్థితి అంటాము. బ్రహ్మనాడిని వదలి సూర్య చంద్రనాడుల మీదుగ శరీరమంత వ్యాపించినపుడు గల స్థితిని జాగ్రత్త స్థితి లేక మెలుకువ అంటాము. మెలుకువలో శరీరమంత వ్యాపించిన మనస్సు శరీర ఆకృతిని పోలి ఉండును. బ్రహ్మనాడిలోనికి పోయినపుడు ముడుచుక పోయి ఒక బిందువుగ మారి ఉండును. మెలుకవలో ఎంత సేపున్న నిద్రలోనికి పోవలెనని, మనస్సు తహ తహ పడుచుండును. అందువలననే ఎక్కువ కాలము ఎవరు మేల్కొనలేరు. స్వంత ఊరు వదలి పరాయి ఊరికి వచ్చిన వాడు, తిరిగి తన ఊరు చేరునంత వరకు తృప్తిలేనట్లు, మనస్సు కూడ తిరిగి తన స్వస్థానమైన బ్రహ్మనాడి చేరువరకు తృప్తి చెందదు.

**596. (3) నీకు గురువా, బోధకుడా ఎవరు కావలెను?**

జ. గురువు కావలెను.

**వివరము :** జన్మల నుండి, కర్మల నుండి విడుదల పొందాలంటే గురువు అవసరము. గురువని బోధకుడిని, బోధకుడని గురువును అనుకొనుచు గురువును గుర్తించలేక పోవుట మనుషులలోని పెద్ద లోపము. మార్గమును వేయువాడు గురువు. వేసిన మార్గమును చెప్పువాడు బోధకుడు. ఇలా గురువుకు బోధకునికి ఎంతో తేడా గలదు. పద్ధతి ప్రకారము మోక్షము కావాలంటే తప్పనిసరిగ గురువే అవసరము. గురువును తెలుసుకోవాలంటే తప్పనిసరిగ శ్రద్ధ అవసరము. శ్రద్ధగల్గి గురువును సంపాదించుకొన్న వాడు తప్పనిసరిగ మోక్షము పొందును.

**597. (4) నిద్రలో జీవుడు ఎక్కడుండును?**

జ. గుణ చక్రములో.

**వివరము :** శరీరములో మొత్తము 25 భాగములున్నాయని, వాటికి స్థానములు, ఆకారము, పనులు ఉన్నవని చాలామార్లు చెప్పుకొన్నాము. వాటిలో జీవుడు కూడ ఒకడు. జీవునికి కూడ ఆకారము, పని, స్థానము గలదు. జీవుడు అపుడపుడు కాక ఎల్లపుడు గుణచక్రములోని మూడు భాగములలో ఏదో ఒక భాగములో నివాసముండును. తామస, రాజస, సాత్త్విక, యోగమను నాల్గు భాగములుగ ఉన్న చక్రములో సాధారణ జీవుడు మూడు భాగములలో ఏదో ఒక దానియందు నివాసముండును. ముక్తిని పొందకోరువాడు అరుదుగ మూడు గుణములను వదలి అపుడపుడు కొద్దిసేపు నాల్గవ భాగమైన యోగములో ఉండును. యోగము ప్రత్యేకమైనది, కావున దానిని వదలి ముఖ్యముగ మూడు భాగములనే చెప్పుకోవాలి. మూడు గుణ భాగములలో ఒక దానియందు జీవుడుండుట వలన ఎల్లపుడు గుణచక్రములో జీవుడు నివశిస్తున్నాడు. నిద్రలోగాని, మెలుకువలో గాని జీవుడు గుణచక్రములోనే ఉండును.

**598. (5) మానవుని జీవితము దేని ప్రకారము గడచుచున్నది?**

జ. కర్మ.

**వివరము :** మానవుని మనుగడ అంతయు కర్మ మీద ఆధారపడి ఉన్నది. ఎవరి కర్మ ప్రకారము వారి జీవితము గడచుచుండును. ఒక్కొక్కని జీవితము ఒక్కొక్క రకముగ ఉండుట వలన, వారి వారి కర్మ అలా ఉన్నదని చెప్పవచ్చును. శరీరమును కదలించునది ఆత్మ అయినప్పటికి ఆ కదలికలు కర్మననుసరించి ఉండును. కావున మానవుని జీవితము కర్మ ఆధారముతో నడుచుచున్నది. శరీరములో పనులను నిర్ణయించు చిత్తము కర్మానుసారిణి, ఆత్మ చిత్తానుసారిని, బుద్ధి గుణానుసారిని అనునానుడి కూడ గలదు.

**599. (6) జీవుని కడపటి గమ్యమేది?**

జ. మోక్షము.

**వివరము :** జీవునికి మజిలీలు ఎన్నయిన ఉండవచ్చును కాని గమ్యమొక్కటే గలదు.

జీవుడు కొంత కాలము ఒక శరీరము ధరించి, మరణముతో ఆ శరీరమును వదలి మరియొక శరీరము పొంది, క్రొత్త మజిలి ప్రారంభించుచుండును. ఇలా ఎన్నో జన్మలను మజిలీలు మారిన చివరి గమ్యము మోక్షము. మోక్షములో జీవుడుండడు, జన్మలుండవు. అన్నిటికి అంత్యమేర్పడు మోక్షమే జీవుని యొక్క చివరి గమ్యము.

**600. (7) స్థూల, సూక్ష్మశరీరములను స్థంబింపచేయు అవస్థ ఏది?**

జ. నిద్రావస్థ.

**వివరము :** మెలుకువలో స్థూలశరీరము, స్వప్నములో సూక్ష్మశరీరము జ్ఞాపకము కల్గి ఉండుటకు ముఖ్య కారణము మనస్సు. మనస్సు ప్రపంచ జ్ఞప్తికల్గి విషయములను లోపలి బుద్ధికి తెలియజేయుచున్నది. విషయముల ఎరుక మనస్సు వలన మెలకువ, స్వప్నములో ఉంటున్నది. నిద్రలో మనస్సు ఏమాత్రము పని చేయదు. కావున జాగ్రతావస్థలో స్థూలశరీరము, స్వప్నావస్థలో సూక్ష్మశరీరము పని చేయును. స్థూల సూక్ష్మ, శరీరములు రెండు నిద్రలో స్థంభించిపోవును.

**601. (8) సర్వజీవులకు చైతన్యశక్తి ఏది?**

జ. ఆత్మ.

**వివరము :** ఒక్క మానవునికేగాక 84 లక్షల జీవ జాతులకు శరీరములలో కదలిక శక్తి నిచ్చునది ఆత్మయే. ఆత్మ చైతన్య శక్తి అన్ని అవయవములలో పని చేయుట వలన శరీరమంత కదలుచున్నది. ఉదాహరణగ చెప్పాలంటే అనేక విద్యుత్ పరికరములను ఒకే విద్యుత్ శక్తి పని చేయించినట్లు, అన్ని జీవరాసుల శరీర అవయవములను కదలించు శక్తి ఒకే ఒక ఆత్మ శక్తి. అందువలన అందరి చైతన్య శక్తి ఆత్మని చెప్పవచ్చును.

**602. (9) సర్వజీవులకు సాక్షిభూతుడెవరు?**

జ. పరమాత్మ.

**వివరము :** సర్వ జీవరాసులకు సాక్షి ఆత్మని చాలా మంది అనుచుందురు. శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ఉండగ అందులో జీవాత్మ ఏ పని చేయక అనుభవించునది మాత్రమే. జీవుని అనుభవమునకు కావలసిన పని అంతయు అవయవముల చేత చేసి పెట్టవలసినది ఆత్మ. ఆత్మ పనిచేసి సంపాదించిన దానిని తిని కూర్చొనేది జీవాత్మ. పని చేయు ఆత్మను, పనిలోని ఫలితమును అనుభవించు జీవాత్మను, ఎల్లవేళల చూచువాడు పరమాత్మ. అందువలన ఆత్మకు, జీవాత్మకు ఇద్దరికి సాక్షి భూతుడు పరమాత్మయేనని చెప్పవచ్చును. నిద్రలో మనసు పని చేయని దానివలన జీవునికి ఆ సమయములో ఆత్మ సాక్షి కాదు. పరమాత్మ ఆత్మలోను, జీవాత్మలోను ఉండుటవలన ఎల్లవేళల ఇద్దరికి సాక్షిగ ఉన్నాడని చెప్పవచ్చును.

**603. (10) జీవుని చుట్టూ ఉన్న మూడవ పొర ఏది?**

జ. అహము.

**వివరము :** శరీరములోని అన్ని భాగములకు స్థితి గతులు, ఆకార నామములు గలవని తెలుసుకొన్నాము. శరీరములోని జీవునికి కూడ ఆకారము, జీవుడను పేరు గలదు. మూడు పొరలు జీవుని చుట్టు ఆవహించి ఉండడము వలన జీవునికి ఆకారమేర్పడినది. మూడు పొరల మధ్యన గల ఖాళీ భాగమును జీవుడందుము. జీవునికి చుట్టబడి ఆకారమునేర్పరచిన మూడు పొరలలో జీవునికి ఆనుకొని ఉన్న మొదటి పొర బుద్ధి కాగ, రెండవ పొర చిత్తము కాగ, మూడవ పొర అహంకారమై ఉన్నది.

**604. (11) మాయ అంటే ఏది?**

జ. గుణములు.

**వివరము : "గుణమయీ మమ మాయా"** అని భగవద్గీతలో చెప్పబడినట్లు మన తలలోని గుణములే మాయ రూపముగనున్నవి. మాయ శరీరము బయట లేదు

శరీరము లోపలే గుణముల రూపములో ఉన్నది. మాయలో పడ్డావంటే శరీరము బయట కాదు, శరీరము లోపలేపడినట్లని తెలియవలెను. ఇందూమతములో మాయ అని చెప్పబడునది ఇస్లామ్‌మతములో సైతానుగ, క్రైస్తవమతములో సాతానుగ చెప్పబడుచున్నది. సాతాను లేక సైతాను లేక మాయ అని ఒకే దానిని పిలువ వచ్చును.

**605. (12) పంచాక్షరీ నాదమంటే ఏది?**

జ. ఓంకారనాదము.

**వివరము :** పంచ అనగ ఐదు అయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను భూతములు. అక్షరి అనగా నాశనము కానిది. పంచాక్షరి అనగా పంచ భూతములకు నాశనము కాని దానిని పంచాక్షరి అంటారు. పంచ భూతములకు నాశనము కాని దానిని దేవుడని చెప్పవచ్చును. దేవునికి ప్రత్యమ్నాయముగ "ఓం" ను గుర్తించారు. పంచ భూతములకు ఒక్కొక్క దానికి ఒక్కొక్క బీజాక్షరమునుంచారు. అవియే "నమః శివాయ". ప్రకృతి బీజాక్షరములు ఐదు కాగ, వాటికి నాశనము కానిది ఓం బీజాక్షరము. మొత్తము అన్ని కలిపి పంచభూతములకు నాశనము కానిదని తెలియునట్లు "ఓం నమః శివాయ" అను అరు అక్షరముల సమ్మేళనము నుంచి "పంచాక్షరి" అన్నారు.

**606. (13) జీవునికి ప్రబల శత్రువేది?**

జ. ఆశ.

**వివరము :** జీవునికి శరీరములోని వ్యతిరేఖ గుణములనే శత్రువులుగ లెక్కించవలెను. శరీరములోని ఆరు శత్రు గుణములు గలవు. అందులో అతి ప్రాబల్యమైన గుణము, నిత్య శత్రుత్వము కల్గినది కామము. కామము అనగ ఆశ. ఆశ అను గుణము మానవునికి మిగుల శత్రువుగ ఉండి అనేక అనర్థములకు కారణమగుచున్నది. భగవద్గీతలో కూడ మానవునికి నిత్యశత్రువు కామగుణమని చెప్పబడినది.

**607. (14) "దీపముండగానే ఇల్లు చక్కపెట్టుకో" అనుమాటలో దీపమనగా ఏది?**

జ. ఆత్మ.

**వివరము :** ఇల్లు అనగ శరీరము. శరీరమనే ఇంటిలో దీపములాగ ఉన్నది ఆత్మ. ఆత్మ ఉన్నంత వరకు శరీరము కదలుచుండును. అందువలన శరీరమునకు ఆత్మ దీపములాంటిది.

**608. (15) ఆత్మ ఎక్కడ ఉన్నది?**

జ. శరీరమంత ఉన్నది.

**వివరము :** శరీరములో ఆత్మ, జీవాత్మలు జోడు ఆత్మలుగ నున్నవి. వాటిలో జీవాత్మ తలయందు ఒక్క చోట ఉండగ, మిగత రెండవ ఆత్మ శరీరమంత వ్యాపించి అన్ని అవయవములను పని చేయిస్తున్నది. ఒక వేళ శరీరములో ఏ భాగములోనైన ఆత్మ వ్యాపించక పోతే ఆ అవయవము పని చేయదు. ప్రతి ఒక్కరియందు ఆత్మ శరీరమంత వ్యాపించి ఉండుట వలన శరీరమంత కదలి పనిచేయుచున్నది.

## జ్ఞాన పరీక్ష

**అనంతసాగరము** **తేది-10-10-1998**

**609. (1) కలియుగము మొత్తము ఎన్ని సంవత్సరములు?**

జ. 4,32,000 సంవత్సరములు.

**వివరము :** మానవుని శరీరములో మంచి గుణములు ఆరు, చెడు గుణములు ఆరు గలవు. మంచి, చెడు లేక మిత్ర, శత్రు గుణములు మొత్తము 12 గలవు. ఒక్కొక్క గుణము నవగ్రహముల ప్రకారము తొమ్మిది భాగములుగ విభజింపబడి ఉన్నది. అట్లు విభజింపబడుట వలన 12 X 9 = 108 భాగములుగ నున్నవి. 108 భాగములలో జీవుడు నివశిస్తున్నాడని తెలుసుకోవలెను. శరీరములో జీవుడు

మూడు గుణ భాగములలో ఏదో ఒక భాగములో ఉండుట వలన, ఒక గంటకు గుణచక్రము ఒక చుట్టు తిరుగుట వలన, మూడు భాగములలోని మొత్తము ముఖ్య గుణములు 12 X 3 = 36 ఒక గంటకు తిరిగినట్లగును. అందువలననే గంటకు 36 గుణములు మారుతుంటాయని అంటుంటారు. ఒక గంటకు మూడు గుణ భాగములలోని 36 గుణములు తిరుగుటవలన, ఒక దినమునకు 36 X 12 = 432 గుణములు మారినట్లగును. మానవుని పగలు కాలములో 432 గుణములు తిరుగుచున్నవి. పరమాత్మ పగలు కాలము వేయి యుగములు కావున మానవుని పగలును వేయి మార్లు హెచ్చించ వలసి ఉన్నది. అలా హెచ్చించుట వలన 432 X 1000 = 4,32,000 గుణముల సంఖ్య వచ్చినది. గుణముల వలననే ప్రపంచము పెరుగుట తరుగుట జరుగుచుండుట వలన 4,32,000 గుణముల సంఖ్యనే ఆధారము చేసుకొని యుగకాలమును నిర్ణయించ వలసి వచ్చినది. దాని ప్రకారము కలియుగము 4,32,000. రెండవదైన ద్వాపరయుగము కలియుగముతో రెండింతలు ఎక్కువగ 8,64,000. మూడవదైన త్రేతాయుగము కలియుగమునకు మూడింతలు 12,96,000. నాల్గవదైన కృతయుగము కలియుగముతో నాలుగింతలు 17,28,000 సంవత్సరములు. అన్ని యుగములను నిర్ణయించుటకు మొదట చిన్నదైన కలియుగమును గుణముల ప్రకారము లెక్కించి 4,32,000 సంవత్సరములుగ నిర్ణయించారు.

**610. (2) భీష్ముడు సంపూర్ణ జ్ఞానియా, సంపూర్ణ యోగియా?**

జ. సంపూర్ణ భక్తుడు.

**వివరము :** భీష్ముడు ఏనాడు జ్ఞానము తెలుసుకోలేదు, అలాగే ఏనాడు యోగము చేయలేదు. అందువలన ఆయనను చివరి వరకు ఎవరు ఏ విధముగ గుర్తించలేక పోయారు. ఆయనవద్ద ఏ ధర్మములు ఆచరణలో లేవు, అంతేకాక ఆయనకు తెలియవనే చెప్పవచ్చును. కాని ధర్మములకు అతీతమైన భక్తి ఆయనలో ఉండెడిదని తెలియుచున్నది. శ్రీకృష్ణుడు సాధారణ మానవ మాత్రుడుకాడని, అన్నిటికి

అతీతమైన పరమాత్మయే శ్రీకృష్ణునిగ పుట్టాడని, భీష్ముడు గ్రహించి మొదటి నుండి ఆయనపట్ల గౌరవ భక్తి భావములు ప్రదర్శించాడు. దానివలననే ఆయనది భక్తి యోగమైనది. దానితోనే ఆయన చివరిలో పరమాత్మయందైక్యమయ్యాడు.

**611. (3) కాలము అంటే ఏమిటి?**

జ. పరమాత్మ.

**వివరము :** మూడు ఆత్మలలో పరమాత్మ అన్నిటికి అతీతమైనది. దానిని ఏమని చెప్పుటకు వీలు లేదు. దేనితోను పోల్చలేము. అట్లే పంచ భూతములకు సంబంధము లేనిది కాలము. కాలమును పలానా అని చెప్పలేము, ఆపలేము, తాకలేము. కాలము పరమాత్మ స్వరూపమని భగవద్గీతలో చెప్పబడినది. ప్రపంచమంత నాశనమైనప్పటికి కాలము మిగిలి ఉండును. కాలము పరమాత్మవలె అన్నిటికి అతీతమైనది. కాలములో ఉండినప్పటికి దానిని ఎవరు అనుభవించ లేరు. కావున కాలమంటే పరమాత్మ అని తెలియాలి.

**612. (4) కర్మానుసారము శరీరములో ఏ భాగము పనిచేయుచున్నది?**

జ. అన్ని భాగములు పనిచేయుచున్నవి.

**వివరము :** శరీరములోని అన్ని భాగములు కర్మననుసరించి కదలుచున్నవి. అవి స్వయముగ కదల లేవు, కాని కర్మ ప్రకారము ఆత్మ అన్ని భాగములను కదలించు చుండును. ప్రతి కదలిక ఆత్మదే అయినప్పటికి ఆ కదలిక కర్మననుసరించి ఉండును. ఆత్మ శరీరమంత వ్యాపించి ఉండుట వలన శరీరములోని అన్ని భాగములు కదలి పని చేయుచున్నవని చెప్పవచ్చును.

**613. (5) నిద్ర సమయములో బాహ్యేంద్రియమైన చెవి పని చేయుచున్నదా?**

జ. పని చేయుచున్నది.

**వివరము :** నిద్ర సమయములో కూడ అన్ని ఇంద్రియములు తమ తమ పనిని

చేస్తూనే ఉన్నవి. ఆత్మ శరీరమంత వ్యాపించి ఉన్నంతవరకు అన్ని ఇంద్రియములను పని చేయిస్తూనే ఉండును. అందువలన నిద్రలో కూడ చెవి వినగలుగు సామర్థ్యము కల్గి ఉన్నది. నిద్రలో ఒకే ఒక మనస్సు బ్రహ్మనాడిని చేరి ఉండుట వలన చెవి వినిన విషయమును బుద్ధి వరకు చేరడము లేదు. కావున నిద్రలో ఏమి విన్నది బుద్ధికి తెలియదు. లోపలి విషయములను బయటికి, బయటి విషయములను లోపలికి చేర్చు మనస్సు లేని దానివలన విషయము తెలియలేదు. కాని అన్ని వేళల అన్ని అవయవములు పనిచేయుచునే ఉన్నవి. అలాగే చెవి కూడ నిద్రలో పని చేయుచున్నది.

**614. (6) కోరికలను ఎట్లు చంపవలెను?**

జ సాధన ద్వార.

**వివరము :** శరీరములోని 12 గుణములలో కోర్కె లేక ఆశ లేక కామము అను గుణము ఉండడము సహజమే. కాని ఆశ అను గుణము చాలా బలమైనది, దృఢమైనది. అది మనిషికి నిత్య శత్రువు లాంటిదని భగవద్గీతలో కూడ చెప్పబడి ఉన్నది. అటువంటి గుణమును జయించుట ఒక్క రోజుతో గాని, ఒక్క నెలతో గాని జరుగుపని కాదు. ఎంతో అభ్యాసముతో కొద్ది కొద్దిగ క్రమేపి ఆశ గుణము యొక్క బలము తగ్గుతావచ్చును. అట్లు చాలా కాలము అభ్యాసము చేయుట వలన కోర్కెలను అదుపుచేసుకోవచ్చును. భగవద్గీతలో కూడ అభ్యాసవైరాగ్యముల చేత మనస్సును గుణముల వైపు పోకుండ చేసుకోవచ్చునన్నారు. మనస్సుకు గుణములకు సంబంధమును లేకుండ చేయడమను అభ్యాసము చేత గుణముల నుండి బయటపడవచ్చును.

**615. (7) తత్త్వమనగా నేమి?**

జ. ఆత్మ.

**వివరము :** శరీరము 25 తత్త్వములతో కూడుకొన్నదని అనుట వినియే ఉందుము. శరీరములోని ఏ భాగమునకు స్వయం శక్తి లేదు. ఆత్మశక్తి ఆయా భాగములతో

కలిసినపుడే అవి పని చేయును. శరీరములోని 25 భాగములతో ఆత్మ కలిసినపుడు ఆత్మశక్తితో కలిసి 25 తత్త్వములు అంటున్నాము. ఉన్నది ఒకే ఆత్మయినప్పటికి 25 భాగములతో కలియుట వలన 25 భాగములుగ చెప్పబడుచున్నది. దీనిని బట్టి ఆత్మను తత్త్వమని కూడ అనుచుందురని తెలియుచున్నది.

**616. (8) శరీరములో ఒక భాగమైన చేతులు ప్రకృతిలోని ఏయే భాగములతో తయారైనవి?**

జ. భూమి ఐదు, గాలి ఐదు.

**వివరము :** శరీరములోని మొత్తము 25 భాగములు తయారగుటకు పంచ భూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి కారణమై ఉన్నవి. పంచ భూతములు ఒక్కొక్కటి ఐదు భాగములుగ చీలిపోయి, మొత్తము 25 భాగములుగ తయారై, అవి ఒక దానితో ఒకటి కలియుట వలన 25 శరీర భాగములు తయారయినవి. ఆకాశము యొక్క ఐదు భాగముల చేత జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము తయారుకాగ, గాలి యొక్క ఐదు భాగములు మిగత ప్రకృతి భాగముల చేత కలియుట వలన వ్యాన, ఉదాన, సమాన, ప్రాణ, అపాణ వాయువులు తయారయినవి. అట్లే అగ్ని ఐదు భాగముల వలన జ్ఞానేంద్రియములైన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము తయారు కాగ, నీటి వలన చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శ తయారైనవి. చివరి భూమి ఐదు భాగముల వలన కర్మేంద్రియములైన కాళ్ళు, చేతులు, నోరు, గుదము, గుహ్యమనునవి తయారైనవి. ప్రత్యేకించి చేతులను గూర్చి వివరించుకొన్నట్లయితే భూమి యొక్క ఐదవ భాగముతో గాలి యొక్క ఐదవ భాగము కలియుట చేత చేతులు తయారైనవి.

**617. (9) ఓం కారము ఏ శక్తి వల్ల పుట్టుచున్నది?**

జ. ఆత్మశక్తి చేత.

**వివరము :** శరీరములో ఆత్మ శక్తి అన్ని ప్రదేశములలో వ్యాపించి శరీరమంతటిని పని చేయిస్తున్నదని తెలుసుకొన్నాము. ఆత్మశక్తి వలననే ఊపిరితిత్తులు కదలుచున్నవి.

ఊపిరితిత్తులు కదలుట వలననే ముక్కురంధ్రములలో శ్వాస ఆడుచున్నది. శ్వాస ముక్కు రంధ్రములలో ఆడుట వలననే "సోహం" శబ్దము ఏర్పడుచున్నది. సోహం శబ్దము ఏర్పడుట వలననే "ఓమ్" పుట్టుచున్నది. వివరముగ చెప్పాలంటే ముక్కు రంధ్రములలో ఆడు శ్వాసలలో లోపలికి పోవునపుడు "సో" అను శబ్దము పుట్టుచున్నది. ఈ శబ్దములో చివరిగనున్నది "ఓ" అను శబ్దము. అలాగే బయటికి వచ్చు శ్వాసలో "హం" అను శబ్దము పుట్టుచున్నది. ఈ శబ్దములో చివరిగ "మ్" ఉన్నది. ఒక్కమారు శ్వాస లోపలికి పోయి బయటికి వచ్చునప్పటికి సోహం శబ్దములో ఓమ్ పలుకబడుచున్నది. ఈ ఓమ్‌కారమును పలికించునది, ఊపిరి తిత్తులను కదలించు ఆత్మశక్తియేనని చెప్పవచ్చును.

**618. (10) ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కునా! అరువు చెప్పువానికి ఆరుదుడ్లు, ఆకులు పెరుకు వానికి మూడుదుడ్లు అను సామెతలలో ఏది జ్ఞాన పరమైనది?**

జ. రెండు జ్ఞానపరమైనవే.

**వివరము :** పూర్వము జ్ఞానులు ఎన్నో విధముల ప్రజలకు ఆత్మ జ్ఞానమును బోధించెడివారు. కొందరు ప్రజల అవగాహన కొరకు కథల రూపముగ జ్ఞానమును బోధించగ, కొందరు సామెతల రూపముగ, మరికొందరు పాటల రూపముగ, తిట్ల రూపముగ, పద్యముల రూపముగ బోధించెడి వారు. వాటిలో సామెతల రూపములో చెప్పు చిన్న మాటలలో ఎక్కువ జ్ఞానముండునట్లు తీర్చిదిద్దారు. అలాంటివే పై రెండు సామెతలు. ఆత్మ పరమాత్మలను తెలియబరుచునది మొదటి సామెతకాగ, గురువు శిష్యుని విషయము తెలియజేయునది రెండవ సామెత. కావున రెండు జ్ఞాన పరమైన సామెతలేనని జవాబు చెప్పడమైనది. నూటికి తొంబై శాతము సామెతలు జ్ఞాన పరమైనవిగ ఉండును. అందువలన మా రచనలలో **"సామెతల జ్ఞానము"** అను గ్రంథము గలదు.

## జ్ఞాన పరీక్ష

**తిరుపతి** **తేది-08-11-1998**

**619. (1) సజీవ శరీరములో మొత్తము భూతములెన్ని గలవు?**

జ. ఏడు.

**వివరము :** శరీరము పంచ భూతములతో నిర్మాణమై ఉన్నది. అటువంటి శరీరములో జీవాత్మ, ఆత్మ అను రెండు భూతములు గలవు. శరీర నిర్మితములో ఐదు, శరీరమును కదలించుటకు ఒకటి, శరీరములో అనుభవించుటకు ఒకటి మొత్తము ఏడు సజీవ శరీరములోని భూతములని చెప్పవచ్చును. వివరముగ చెప్పాలంటే ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి, ఆత్మ, జీవాత్మ సజీవ శరీరములో గల భూతములని చెప్పవచ్చును.

**620. (2) ప్రపంచములో ఎన్నోమార్లు మాయ చేతిలో ఓడిపోవు దైవము గొప్పదా?**

జ. గొప్పది కాదు.

**వివరము :** ప్రపంచములో దేవుడు, మాయ రెండు ఉన్నవి. ప్రపంచమంత మాయ సామ్రాజ్యముగనుండగ, మోక్షము లేక పరమపదము దేవుని రాజ్యముగ ఉన్నది. మాయ ప్రభావము ప్రపంచమంత ఆవహించి, తన సామ్రాజ్యములో ఎవరిని దేవుని వైపు పోకుండునట్లు చేయుటయే దాని ముఖ్యమైన పని. ఆ కార్యములో దేవునికంటే ఎక్కువ మహత్యములు చూపుచు, తానే దేవుడని అందరిని నమ్మించి, అసలైన దేవుని వైపు నుండి తన వైపు మళ్లించుకోవడమే దాని విధానము. ఇప్పటికి 90 శాతము మనుషులు దేవుని విశ్వశిస్తున్నామనుకొని పొరపాటుగ మాయనే నమ్మి ఉన్నారు. పరమాత్మే భగవంతునిగ భూమి మీదకు వచ్చినపుడు, ఆయనను కూడ ధర్మ ప్రచారము చేయకుండ ఎన్నో ఆటంకములు కలుగజేయును. ప్రపంచములో పరమాత్మ అంశ అయిన భగవంతుడు కూడ మాయ చేతిలో ఎన్నో కష్టాలు పడవలసి వస్తున్నది. మాయ చేతిలో ఎన్నోమార్లు ఓడిపోవలసి వస్తున్నది. మాయ సామ్రాజ్యములో మాయే గొప్పది, దైవము గొప్పది కాదు. దేవుని సామ్రాజ్యములో

దేవుడే గొప్పవాడు, మాయ గొప్పది కాదు. ఉదాహరణకు కుస్తిపట్టు రింగ్‌లో కుస్తీ యోధుడు బలాఢ్యుడుగ ఉండును. రింగ్‌లోనికివచ్చు ఎవనినైన కొట్టగలడు. యోధునికి రింగ్ వాని రాజ్యము అక్కడ జయించగలడు. అదే యోధుడు రింగ్ దాటి బయటికి వస్తే బయట నిబంధనలుండవు, కావున ఆయుధముల చేత ఎవడైన వానిని జయించగలడు. బలహీనుడైన బలమైన యోధుని జయించ గలడు. రింగ్‌లో నిబంధనల ప్రకారము ఆయుధములు ఉపయోగించ కూడదు. కావున కండ బలమున్న యోధుడు బలములేని వానిని సులభముగ జయించగలడు. అదే బయటయితే నిబంధనలు లేవు, కావున అది బలహీనుని రాజ్యము. ఏదో ఒక తెలివినుపయోగించి బలహీనుడు జయించగలడు. రింగ్‌లో అయితే కండబలమే అవసరము, కావున అచటున్నది యోధుని రాజ్యము. అలాగే ప్రపంచమనే రింగ్‌లో మాయ బలమైన యోధునితో సమానము. దైవము బలహీనుడు. అదే పరలోక రాజ్యములో దైవము గొప్పవాడు, మాయ బలహీనము. ఈ లెక్క ప్రకారము ప్రపంచములో దైవము మాయ కంటే గొప్పది కాదు. ప్రపంచములో దైవమునకు నిబంధనలు గలవు. మాయకు ఇష్టారాజ్యము అందువలననే దైవముకంటే మాయ ప్రపంచములో గొప్పది.

**621. (3) పొడవు పొట్టి ఉన్న ఇద్దరిలో ఆత్మలున్నవా? ఉంటే ఏ ఆకారములో ఉన్నవి?**

జ. ఇద్దరిలో ఆత్మలున్నవి. వారి పోలికల రూపములోనే ఆత్మలున్నవి.

**వివరము :** భూమి మీద ప్రతి జీవరాసిలోను ఆత్మలున్నవి. ఒక్క శరీరములో ఒక్క జీవాత్మ, ఒక్క ఆత్మ గలదు అనుట సూత్రము. కావున సూత్రము ప్రకారము పొడవు, పొట్టివానిలో ఇద్దరిలో జీవాత్మలతో పాటు ఆత్మలు గలవు. ఒక శరీరములో నివశించు ఆత్మ, ఆ శరీరమంత వ్యాపించి ఉండుననునది కూడ సూత్రమే. ఆ సూత్రము ప్రకారము ఏ శరీరములోని ఆత్మ ఆ శరీరమంత వ్యాపించి ఆ శరీర ఆకృతిని పోలి ఉండును. పొడవు వానిలోని ఆత్మ పొడవుగ, పొట్టి వానినిలోని ఆత్మ పొట్టిగ ఉండును. పాత్రలో పోసిన నీరు పాత్ర ఆకారమును పోలినట్లు,

ఉపాధియైన శరీరములోని ఆత్మ ఆ శరీరమంత వ్యాపించి, అదే ఆకృతిని పోలి ఉండుట సహజము. పాము శరీరములోని ఆత్మ పాము ఆకృతిని, కుక్క శరీరములోని ఆత్మ కుక్క రూపమును, సింహములోని ఆత్మ సింహమువలెను ఆకృతి సంతరించుకొని ఉండును. స్థూల శరీరమును బట్టి ఆత్మ సూక్ష్మాకారమును పొంది ఉన్నది. ఆత్మకు ఆకారమున్నదను మాట ఎక్కడ విని ఉండరు. ఏ గ్రంథములో వ్రాయబడి ఉండదు. ఇక్కడ మొదట వ్రాయబడుచున్నది, చెప్పబడు చున్నది. కావున అసత్యమనుకోవద్దండి. ఆత్మకు, జీవాత్మకు ఆకారమున్నదను మా మాట నూటికి నూరుపాళ్ళు సత్యము, శాస్త్రబద్ధము.

**622. (4) గ్రద్ద పామును, పాము కప్పను, కప్ప పురుగులను, పురుగులను పక్షులు, పక్షులను మనిషి తింటున్నాడు ఇందులో ఎవరికి ఎక్కువ కర్మ రాగలదు?**

జ. మనిషికి.

**వివరము :** గ్రద్ద పామును, పాము కప్పను తింటున్నవి. మనిషి తప్ప ఏది దేనిని తినిన వాటికి మనిషికంటే కర్మ అంటడము తక్కువ. మనిషి పక్షులను తినిన, జంతువులను తినిన, మిగత జంతువులకు సంభవించు కర్మకంటే ఎక్కువ కర్మ వచ్చుచున్నది. మిగత జంతువులు దేనిని చంపి తినిన, వాటిలో అహము తక్కువ. మనిషిలో అహము యొక్క పని ఎక్కువగ ఉండుటవలన, కర్మ ఎక్కువగ సంభవించుచున్నది. శరీరములో ఒక పని చేసినపుడు, అది గత కర్మ ప్రకారము జరిగినపుడు, ఆ పనికి జీవునికి ఎటువంటి సంబంధము లేకున్నను, గత కర్మనునది జీవునికి తెలియక పోవడము వలనను, అహము నీవే చేశావని జీవునికి బోధించడము వలనను, అహంభావమును జీవుడు పొంది, నా వలననే ఈ పని జరిగిందని శరీరము మొత్తము తానుగ భావించడము వలన, జరిగిన పనిలోని క్రొత్త కర్మ జీవునికి చేరుచున్నది. మిగత జీవరాసులు అహంభావమును పొందడము చాలా తక్కువ, కొన్ని పనులలో అహంభావమే ఉండదు. కావున వాటికి మానవునికంటే చాలా తక్కువ కర్మ అంటుచున్నదని చెప్పవచ్చును.

**623. (5) 90 శాతము జ్ఞానము, 10 శాతము అజ్ఞానము కలవాడు, అలాగే 10 శాతము జ్ఞానము, 90 శాతము అజ్ఞానము కలవాడు ఇరువురు మాయలోపడ్డారు. వీరిలో దేవునికి దూరము ఎక్కువ గలవారెవరు?**

జ. మొదటివాడు.

**వివరము :** ఎక్కువ జ్ఞానము కల్గి తక్కువ అజ్ఞానము గలవాడు, తక్కువ జ్ఞానము కల్గి ఎక్కువ అజ్ఞానము కలవానికంటే ఉత్తముడు. నిజముగవాడే దేవునికి దగ్గరగ ఉండువాడు. ఎక్కువ జ్ఞానము కల్గిన వానిని జ్ఞాని అని, ఎక్కువ అజ్ఞానము గలవానిని అజ్ఞాని అంటాము. అజ్ఞాని మాయలో పడుట సహజమే ఎందుకనగ వానికి జ్ఞానము తక్కువ. కావున మాయలో పడిన అది అంత పెద్దగ కనిపించదు. కాని జ్ఞాని మాయలో పడకూడదు. జ్ఞాని మాయలో పడితే అది పెద్దగ లెక్కించుకోవలసిందే. దేవునికి ఎవరు దవ్వు, ఎవరు దాపు అని చూస్తే జ్ఞాని అయి మాయలోపడిన వాడే అజ్ఞానికంటే ఎక్కువ దూరమవుచున్నాడని తెలియుచున్నది. తెలియక తప్పు చేసిన అది ఎక్కువగ లెక్కించబడదు. తెలిసి తప్పుచేసిన అది ఎక్కువగ లెక్కించబడును. అందువలన జ్ఞానము తెలిసినవాడే ఎక్కువ దూరమున్నట్లు గుర్తించబడుచున్నది.

**624. (6) అందమైన ఆకారము, ఇంపైన స్వరముగల గాయని పాడుచుండగ ఒక గ్రుడ్డివాడు, ఒక కుంటివాడు వినుచున్నారు. ఇద్దరిలో ఎవరికెక్కువ కర్మ వచ్చు అవకాశము గలదు?**

జ. కుంటివానికి.

**వివరము :** ఇక్కడ ఇద్దరి వ్యక్తులలో ఒకడయిన కుంటివాడు వినగలడు మరియు చూడగలడు. రెండవ వాడైన గ్రుడ్డివాడు వినగలడు గాని చూడలేడు. కుంటి వానికి కన్ను చెవి రెండు అవయవములు పనిచేయుచున్నవి. గ్రుడ్డివానికి చెవి ఒక్కటి మాత్రము పని చేయుచున్నది. కుంటివాడు పాటను వినడమేకాక ఆమె

అందమును చూచి ఆమె అందముగనున్నదనుకొనుచు, పాట కూడ బాగ పాడగలదనుకొనుచున్నాడు. గ్రుడ్డివానికి ఆమె అందము తెలియదు. పాట మాత్రము వినగలుగుచున్నాడు. పాపము గాని, పుణ్యముగాని ఒక ఇంద్రియము నుండి వచ్చు దానికంటే రెండు ఇంద్రియముల ద్వార వచ్చునది రెండింతలుండును. ఇద్దరు ఒకే సంఘటన వద్ద ఉన్నప్పటికి నేను చూస్తున్నాను వింటున్నానని కుంటివాడు, నేను వింటున్నానని గ్రుడ్డివాడు అనుకొనుటవలన, కుంటివానిలో అహము రెండింతలు, గ్రుడ్డివానిలోని అహము ఒకింత పని చేయుటవలన, కుంటివానికి ఎక్కువ, గ్రుడ్డివానికి తక్కువ కర్మ వచ్చుచున్నది.

## 625. (7) మనస్సుకు ఆకారమున్నదా? ఎట్లున్నది?

జ. ఆకారమున్నది. మెలుకువలో నీ శరీరమువలె, నిద్రలో బిందువువలె ఉన్నది.

**వివరము :** శరీరములోని 25 భాగములకే కాక ఆత్మకు కూడ ఆకారమున్నదని ముందే చెప్పుకొన్నాము. అందువలన ఇచట కూడ మనస్సుకు ఆకారమున్నదని చెప్పుచున్నాము. మనస్సుకు ఆకారము అన్నిటివలె ఒకే విధముగ ఉండక నిద్రలో ఒక విధముగ, మెలుకువలో ఒక విధముగ ఉండడము విశేషము. మెలుకువలో మనస్సు ఆత్మతో పాటు శరీరము యొక్క చర్మ అంచువరకు వ్యాపించి ఉన్నది. ఇంద్రియముల వరకు వ్యాపించి వాటి సమాచారమును తీసుకపోవడము మనస్సు యొక్క పని, కావున చర్మము వరకు మనస్సు విస్తరించి ఉన్నది. ఏ శరీరములోని మనస్సు ఆ శరీర బయటి అంచువరకు ఉన్నందువలన ఆ శరీరము యొక్క ఆకృతిని పోలి ఉండును. కుక్క శరీరములోని మనస్సు కుక్క ఆకృతి, మనిషి శరీరములోని మనస్సు మనిషి ఆకృతి పోలి ఉన్నదని చెప్పవచ్చును. ఒక శరీరములోని ఆత్మ ఆ శరీరము యొక్క ఆకారమును పోలి ఉండునట్లు, మనస్సు కూడ ఆత్మ వలె ఆ శరీరము ఆకారమునే పోలి ఉన్నది. ఆత్మ నిద్రలోను మెలుకువలోను ఎల్లపుడు ఒకే ఆకారము కల్గి ఉండగ, మనస్సు మాత్రము మెలుకువలో శరీర ఆకృతిని పోలి ఉండి, నిద్రలో అవయవముల వరకు వ్యాపించకుండ బ్రహ్మనాడిలోనికి ముకులించుక పోవుట వలన, మెలుకువలో

ఉన్న శరీర ఆకారమును నిద్రలో కోల్పోవుచున్నది. నిద్రలో బ్రహ్మనాడియందు ఒకే కేంద్రముగ మారిపోవుట వలన నిద్రలో మనస్సు బిందువాకృతిని పొందుచున్నది. నిద్రలో బిందువుగనున్న మనస్సు, మెలుకువలో శరీరమంత విస్తరించి శరీరాకృతిని పొందుట వలన, నిద్రలో ఒక ఆకారము, జాగ్రత్తలో ఒక ఆకారముకల్గి ఉన్నదని చెప్పవచ్చును. ఇచట గమనించవలసిన విషయ మేమనగా! ఇంతవరకు మనస్సుకు ఆకారమున్నదని ఎచట ఎవరు చెప్పలేదు. అందువలన విశ్వసింపదగిన విషయముకాదని కొట్టివేయక అర్థము చేసుకోగలరని నమ్ముచున్నాము. మనస్సుకు ఆకారముండడమేకాక, నిద్రలో ఒక రకము, మెలుకువలో ఒక రకమున్నదని తెలియాలి.

**626. (8) గొప్ప ఆలోచనలు హృదయము నుండి వచ్చును అనుమాట నిజమా?**

జ. నిజమే.

**వివరము :** భగవద్గీతలో **"నేను సర్వజీవుల హృదయములోనున్నానని, నావలనే స్మృతి, ఊహ, జ్ఞానము కల్గునని"** పురుషోత్తమ ప్రాప్తి యోగము పదిహేనవ శ్లోకములో చెప్పినట్లు, మనకు తెలియని గొప్ప యోచనలను హృదయములో గల దేవుడే అందిస్తున్నాడు. ఒక విజ్ఞాన వేత్త (శాస్త్ర వేత్త) ఒక క్రొత్త విషయమును కనుగొన్నపుడు వాని హృదయములో ఉన్న దేవుడే ఆ క్రొత్త విషయమునకు సంబంధించిన యోచన ఇచ్చి పరిశోధన చేయించును. పైకి పలానావాడు, పలానా విషయమును క్రొత్తగ కనుగొన్నాడనినా, నిజముగ లోపల అందించిన వాడు హృదయములోనున్నవాడే. పాత విషయమైతే మనస్సు ద్వార జ్ఞాపక మొచ్చుచుండును. ఎక్కడాలేని క్రొత్తదయితే హృదయము నుండి వచ్చినదని తెలుసుకోవలెను. క్రొత్తగ కంప్యూటర్‌ను కనుకొన్నపుడు అది కనుకొన్న వాని పనితనముకాదని, వానిలోపల గలవాడు అందించిన యోచన ఫలితమని తెలియాలి. అందువలన కొన్ని గొప్ప యోచనలు హృదయము నుండి వచ్చునని చెప్పవచ్చును.

**627. (9) చేతి గోరువరకు ఆత్మ ఉన్నది. గోరును కత్తిరించినపుడు ఆత్మ తెగుచున్నది. అందువలన పాపమొచ్చునా రాదా?**

జ. రాదు.

**వివరము :** ఆత్మ శరీరమంత వ్యాపించి ఉండుట వలన గోరును కత్తిరించినపుడు గోరుతో పాటు ఆత్మ కూడ తెగుట వాస్తవమే. కాని ఇక్కడ జరుగుచున్న పనిలో సుఖము గాని దుఃఖము గాని లేదు. కత్తిరింపబడే గోరులో నొప్పి లేదు. అలాగే హాయి లేదు. జరిగెడి పనిలో మంచి చెడును బట్టి పుణ్యపాపములు వచ్చును. గోరును కత్తిరించడములో మంచికి ఫలితమైన పుణ్యము గాని, చెడుకు ఫలితమైన పాపముగాని రావడములేదు. సుఖదుఃఖములు లేని పనిలో పుణ్యపాప ఫలితము లుండవు. కావున గోరును కత్తిరించినపుడు ఆత్మ తెగిన, అందువలన పాపముగాని, పుణ్యముగాని వచ్చుటకు వీలు లేదు. కొన్ని పనులలో కర్మలుండిన అహము లేక పోవుట వలన కర్మ అంటదు. కొన్ని పనులలో అహముండిన, అగామి కర్మ లేకుండుట వలన కర్మేరాదు. పనిలో కర్మ ఉండి, భావములో అహముంటే ఆగామి కర్మ తప్పక అంటుకొనును. పనిలో కర్మ లేకుండి, భావములో కూడ అహము లేకుంటే కర్మ సమస్యే ఉండదు. ఒక వేళ పనిలో ఆగామి కర్మ ఉండి, భావములో అహము లేకుండిన కర్మ రాదు.

**628. (10) భగవంతుని శరీరములో పరమాత్మ నిత్యము మాట్లాడు చున్నాడా?**

జ. లేదు.

**వివరము :** పరమాత్మ యొక్క అంశ భూమి మీద పుట్టినపుడు ఆ పుట్టుకను భగవంతుడని అంటాము. భగవంతుని శరీరములో కర్మబద్ధుడైన జీవాత్మ, దానికి తోడు ఆత్మ ఉండదు. భగవంతుని శరీరములో పరమాత్మయే కొద్దిసేపు జీవాత్మగ, కొద్దిసేపు ఆత్మగ, ఎపుడైన కొద్దిసేపు పరమాత్మగ ఉండును. సాధారణ జీవుడు ఉన్నపుడు, సాధారణ వ్యక్తిగనే ఉంటూ, ప్రపంచములో కష్ట సుఖములకు లోనగుచుండును. అపుడు వాటి బాధ అనుభవించవలసివచ్చును. ఆత్మగ ఉన్నపుడు

ఎవరికీ తెలియని జ్ఞాన బోధలను తెలియజెప్పును. పరమాత్మగ ఉన్నపుడు ప్రపంచమునే శాసించును. భగవంతుని శరీరములో పరమాత్మ అరుదుగా ఉండును. అపుడు పంచ భూతములనే శాసించు అధికారముతో ఉండును. అలా ఎపుడయినా శాసించినపుడు ఆ శరీరములో పరమాత్మ పాత్ర స్వయముగ ఆ క్షణములో ఉన్నదని తెలియవచ్చును. భూమి మీదకు ఎన్నో వేల సంవత్సరములకొకమారు భగవంతుడు వచ్చును. వచ్చినా ఎవరికీ తెలియదు. భగవంతున్ని తెలియుటే దుర్లభమైనపుడు, భగవంతున్ని అందులో పరమాత్మను తెలియుట చాలా అసంభవము. అసంభవమైన సంఘటన ఒక వేళ జరిగితే, ఒకవేళ భగవంతున్ని గుర్తించగలిగితే, ఒక వేళ భగవంతుని శరీరములో ప్రకృతినే శాసించు పరమాత్మ ఉన్న సమయమునే చూడగలిగితే, అంతకంటే ధన్య జీవులు లేరని చెప్పవచ్చును. ఇదంతటినీ గమనించి చూచిన ఎడల పరమాత్మ భగవంతుని శరీరములో నిత్యము మాట్లాడదని తెలియుచున్నది.

## జ్ఞాన పరీక్ష

**మాల్యవంతము** **తేది-05-12-1998**

**629. (1) సర్వజీవరాసుల ఎడల ఆత్మ సమానముగ ఉన్నదా?**

జ. లేదు.

**వివరము :** మనిషి పుట్టిన వెంటనే సంవత్సరము వరకు నడువలేడు. మనిషిలోని ఆత్మ సంవత్సర కాలము వరకు మనిషిని నడుపదు. అట్లే మనిషిలోని ఆత్మ మనిషికి నీటిలో ఈదునట్లు చేయదు. జింకలోని ఆత్మ జింక పుట్టిన వెంటనే నడుప గలదు. అట్లే జింక పుట్టిన వెంటనే నీటిలో ఈదునట్లు కూడ చేయగలదు. దీనిని బట్టి సర్వ జీవరాసులలోని ఆత్మలు జీవరాసుల ఎడల సమానముగ లేవు.

**630. (2) ఏసును కనుగొనుటయే నిత్య జీవనమన్నారు. నిత్య జీవితమనగా నేమి?**

జ. మోక్షము.

**వివరము :** పరమాత్మ మానవ శరీరము ధరించి భగవంతునిగ వచ్చినపుడు, అతనిని జ్ఞానము చేత గుర్తించుట వలన సూక్ష్మములో మోక్షము దొరుకును. అట్లే పరమాత్మ అయిన ఏసును కనుగొన్నవారికి మోక్షము లభించును. మోక్షమనగా నాశనము లేనిది నిత్యము గలది. కావున దానిని నిత్య జీవనమన్నారు. నిత్య జీవనము అనగా పరమపదము లేక మోక్షమని చెప్పవచ్చును. ఏసు సజీవముగ వచ్చినపుడు అతనిని కనుగొనుటయే నిత్య జీవనము.

**631. (3) శరీరములో రోగాలున్నవి. శరీరములో ఔషధములున్నవి. ఇందులో ఏది నిజము?**

జ. రెండు నిజమే.

**వివరము :** ప్రతి జీవరాసి శరీరములోను గ్రంథుల వలన రోగాలు పుట్టుచున్నవి. అవే గ్రంథుల వలన ఔషధములు పుట్టుచున్నవి. శరీరములోని ఆరోగ్యమునకు అనారోగ్యమునకు శరీరములోని సప్త గ్రంథులే కారణము. గ్రంథుల యొక్క విడుదల ద్రవముల బట్టి ఆరోగ్యము అనారోగ్యముండును. ఉదాహరణకు క్లోమరసగ్రంథిలో ద్రవము ఊట ఎండిపోతే షుగర్ వ్యాధివచ్చును. గ్రంథి నుండి రసము ఊరితే షుగర్ రోగము పోవును. ఆరోగ్యమునకు కావలసిన ఔషధము ఆ గ్రంథి రసములో ఉండును.

**632. (4) మరణమును, బ్రతికి ఉన్న వాని యొక్క ఒకే ఒక స్థితితో పోల్చవచ్చును. ఆ స్థితి ఏది?**

జ. నిద్ర.

**వివరము :** మరణము నిద్రలాంటిది. మరణము మరపుతోనే వచ్చును. అట్లే నిద్ర కూడ మరపుతోనే వచ్చును. మరణము పొందునపుడు నిద్ర పొందునపుడు మనస్సు యొక్క చివరి మరపుతోనే జరుగును. మరణించినవాడు నిద్రించినట్లే ఉండును. అదే విధముగ నిద్రించినవాడు మరణించినట్లే ఉండును.

**633. (5) మాయను గూర్చి సంపూర్ణముగ ఎవరికి తెలుసు?**

జ. భగవంతునికి.

**వివరము :** పరమాత్మ అయిన భగవంతునికే మాయ యొక్క వివరమంత తెలుసును. పరమాత్మయే మాయను తయారుచేసి దానికి శక్తి నిచ్చి పంపాడు. అందువలన దాని విషయమంత భగవంతునికి తెలుసును. భగవంతుడు తప్ప మాయను గూర్చి వివరముగ చెప్పువాడు మరొకడుండడు.

**634. (6) పరమాత్మను గూర్చి సంపూర్ణముగ ఎవరికి తెలుసు?**

జ. భగవంతునికి.

**వివరము :** పరమాత్మయే భగవంతుడు, భగవంతుడే పరమాత్మ. కావున పరమాత్మను గూర్చి భూమి మీద భగవంతునికి తప్ప ఏ ఇతర యోగులకు గాని, జ్ఞానులకు గాని, తపస్వికులకు గాని తెలియదు.

**635. (7) నిద్రలో స్వప్నమొచ్చినపుడు జీవుడు మేల్కొన్నాడా? నిద్ర పోయాడా?**

జ. మేల్కొన్నాడు.

**వివరము :** జీవుడు నిద్రపోవువాడు కాడు. మనస్సును బట్టి నిద్ర మెలుకువలు గలవు. స్వప్నములో జీవుడు మేల్కొనియే ఉన్నాడు. ఎందుకనగా! స్వప్నములో సుఖ దుఃఖముల యొక్క అనుభవములను జీవుడు పొందుచున్నాడు. స్వప్నములో భయము పొందిన జీవుడు మేల్కొన్న తర్వాత కూడ కొంతసేపు ఆ భయము నుండి కోలుకోలేదు. దీనిని బట్టి నిద్రలోను, మెలుకవలోను, స్వప్నములోను జీవుడు మేల్కొనియే ఉన్నాడు. మెలుకువలో, స్వప్నములో ఉన్న మనస్సు నిద్రలో లేదు. కావున అపుడు జీవునకేమి తెలియలేదు.

**636. (8) పెళ్లి చేసుకొని సంవత్సరము కాపురము చేసిన తర్వాత బ్రహ్మచర్యము తీసుకొని కాషాయము ధరించిన వాడొకడు, పెళ్లి కూడ చేసుకోకుండ చిన్నప్పటి నుండి బ్రహ్మచర్యము తీసుకొని కాషాయము ధరించిన వాడొకడు గలరు. వారిద్దరు బ్రహ్మచారులే వారిద్దరిలో ఒకరు ఆంజనేయ స్వామి పూజారి, మరొకరు రాముని పూజారి. వారిలో ఎవరు పెద్ద బ్రహ్మచారి.**

జ. ఎవరు కాదు.

**వివరము :** బ్రహ్మ యొక్క ఆచరణ ఆచరించువాడు బ్రహ్మచారి అను సూత్రము ప్రకారము వీరిద్దరు బ్రహ్మచారులు కారు. పరమాత్మ ఆచరణ అయిన ధర్మ ప్రచారము చేయువాడు మాత్రమే బ్రహ్మచారి. వారు ధర్మ ప్రచారులు కారు. వారు కేవలము ఆంజనేయస్వామి, రాముని పూజారులు. కావున వీరిని పూజారులనవచ్చును. బ్రహ్మచారులనకూడదు.

**637. (9) చావు పుట్టుకల మధ్య కాలాన్ని ఏమంటారు?**

జ. ఏమి అనరు.

**వివరము :** చావు పుట్టుకల మధ్య కాలమనేది ఉండదు. మరణించిన వెంటనే అదే క్షణమే పుట్టుక కలదు. పుట్టుక చావుల మధ్య కాలముండును. దానిని జీవితము అంటాము. పుట్టుక నుండి చావు వరకు గల జీవిత కాలముండును గాని, చావు నుండి పుట్టుక వరకు అసలు కాలము లేదు.

**638. (10) ఇపుడు నీవు పుట్టక ముందు ఎవరుగా ఉంటివి?**

జ. జీవాత్మగా.

**వివరము :** ఇపుడు ఈ జన్మరాకముందు వెనుకటి జన్మలో ఏ శరీరములోనైన జీవాత్మగానే ఉందురు. మొట్టమొదట పుట్టక ముందయితే పరమాత్మగ ఉండే వారము. ఇపుడైతే వెనక జన్మలో జీవాత్మగ ఉండేవారము.

## జ్ఞాన పరీక్ష

**మల్లికార్జున కోన** **తేది-16-01-1999**

**639. (1) అయమాత్మ బ్రహ్మ. అహం బ్రహ్మోస్మి అను ఈ రెండిటిలో ఏది వేదవాక్కు?**

జ. అహం బ్రహ్మోస్మి.

**వివరము :** ఇందులో ఒకటి వేదవాక్కు మరియొకటి వేదాంత వాక్కు గలదు. "అయమాత్మ బ్రహ్మ" అనుమాటను తీసుకొందాము. అయమాత్మ అనగ నా యొక్క ఆత్మ అని అర్థము. బ్రహ్మ అనగ దేవుడు అని అర్థము. ప్రతి శరీరములోను జీవునితో పాటు ఆత్మ కూడ నివాసమున్నది. శరీరములోని ఆత్మయే శరీరమునకు శక్తి నిచ్చి కదలించుచున్నది. శరీరములో చైతన్య రూపమైన ఆత్మయే ఆ జీవునికి దేవుడు. ఎందరో జ్ఞానులు ఆత్మనే దైవముగ ఆరాధిస్తు శరీరములోని నుదుటి భాగములో ఆత్మను పూజిస్తున్నట్లు చందనము లేక కుంకుమ బొట్టు పెట్టెడివారు. మరి కొందరు నామములో మధ్య దానికి ఎరుపు రంగు దిద్ది ఆత్మ యొక్క ఉనికిని దాని ఆధిక్యతను పవిత్రతను చూచించారు. బ్రహ్మ యోగమాచరించి శరీరములోని దైవమైన ఆత్మను కనుగొని, దాని ద్వార ముక్తిని పొందిన వారెందరో గలరు. జీవాత్మ పరమాత్మను చేరాలంటే మార్గము ఆత్మ జ్ఞానమే. ఆత్మను గురించి తెలియని వాడు పరమాత్మను పొందలేడు. ప్రతి నిత్యము కర్మ ప్రకారము పనులు చేయిస్తు, శరీరములో శ్వాసను నడుపుచు, జీవునికి జ్ఞానరీత్య పూజ్యముగ ఉండి, దైవస్థానమును పొందియున్న ఆత్మను పెద్దగ (బ్రహ్మగ) గుర్తించాలంటే, అందుకు తగిన జ్ఞానము అవసరమన్నాము కదా! ఎందరో కష్టపడి జ్ఞానసముపార్జన చేసి, మూడు గుణముల నుండి బయటపడి, ఆత్మ స్థానము పొందినపుడు ఆత్మయే బ్రహ్మమని, దానివలననే పరబ్రహ్మను చేరవచ్చునని తెలియును. అలా తెలిసినవాడు నా యొక్క ఆత్మయే దేవుడని తెలుపుచు "అయమాత్మ బ్రహ్మ" అన్నాడు. మూడు గుణముల విషయములే వేదములను గీతావాక్యము ప్రకారము మూడు గుణములను

వదలిన బ్రహ్మయోగి, మూడు గుణములకు అతీతుడై, నాల్గవ స్థానమైన ఆత్మ స్థానములో ఉన్నాడు. గనుక అతనిని వేదాంతుడు అనవచ్చును. అయమాత్మ బ్రహ్మ అను మాటను వేదాంత వాక్కని అనవచ్చును. ఇక "అహం బ్రాహ్మోస్మి" అను వాక్కు వేదవాక్కని చెప్పవచ్చును. అదెలాననగా! జీవాత్మ ఆత్మలు ఎప్పటికి వేరు వేరుగ ఉండునవే. ఒకవేళ బ్రహ్మయోగము పొందినపుడు, ఆత్మ యొక్క అనుభూతిని మాత్రము జీవుడు పొందును. అపుడు ఆత్మంటే ఏమిటో వానికి తెలియును. అంత తప్ప జీవాత్మ ఆత్మలు రెండు ఒక దానిలో ఒకటి కలిసిపోవు. వాస్తవ జ్ఞానము తెలియనివాడు, గుణములలో చిక్కుకొన్నవాడు, వేదములందుండిన వాడై జీవాత్మ ఆత్మగ మారిపోవుచున్నదని తలచుచున్నాడు. నేను బ్రహ్మ నైతినను మాటను "అహం బ్రహ్మోస్మి" అని అంటున్నాడు. సూత్రము ప్రకారము ఈ మాట వేదవాక్కని తెలియుచున్నది. గుణములతో కూడుకొన్నపుడు చెప్పు మాటను వేదవాక్కని, గుణములకతీతుడై చెప్పు మాటను వేదాంత వాక్కని చెప్పవచ్చును.

**640. (2) నీతో పాటు ఎల్లపుడు హితముగ ఉన్నవాడెవడు? అలాగే ఎల్లపుడు వీలైతే చెడుపు చేయవలెనని చూచు శత్రువెవరు?**

జ. ఆత్మ.

**వివరము :** జీవాత్మతో పాటు శరీరములో ఎల్లపుడు హితముగ మరియు శత్రువుగ నున్నవాడు ఆత్మ. నిద్రపోవునపుడు కూడ శ్వాస ఆడించుచు, ఎన్నో శరీర కార్యములు చేయుచున్న ఆత్మ, పుణ్యము ప్రకారము స్నేహితునివలె హితము చేయుచున్నది. అలాగే మన పాపము ప్రకారము శత్రువువలె చెడు చేయుచున్నది. అందువలన మనతో పాటు స్నేహితునివలె మరియు శత్రువువలె ఎల్లకాలమున్నది ఆత్మయేనని చెప్పవచ్చును.

**641. (3) ఆత్మకు అంగలోపమున్నదా?**

జ. శరీరమును బట్టి ఉండవచ్చును.

**వివరము :** శరీరములోని ఏదో ఒక భాగమునకు ఆత్మ చైతన్యము ప్రాకనపుడు, ఆ భాగము ఆత్మ యొక్క ఆధీనములో లేదని చెప్పవచ్చును. శరీరములోని ఏ భాగమునకు ఆత్మ శక్తి ప్రవహించలేదో, ఆ భాగము యొక్క ఆకారమును ఆత్మ కోల్పోయినట్లగుచున్నది. మిగత శరీరమంత వ్యాపించివున్న ఆత్మ ఆ శరీర ఆకృతినంతయు పొంది, వ్యాపించని భాగము యొక్క ఆకృతిని పొందకున్నది. కావున శక్తిలేక కుంటుబడిన శరీరములలోని ఆత్మ అవిటిదనియే చెప్పవచ్చును.

**642. (4) శరీరము బయటి ఇంద్రియములతో జరుగు పనులలో ఎల్లపుడు బుద్ధి, చిత్తము పని చేయునా?**

జ. చేయదు.

**వివరము :** శరీరము బయటి ఇంద్రియముల పనిలో బుద్ధి, చిత్తము యొక్క జోక్యము మామూలుగ ఉన్నప్పటికి, ప్రత్యేకించి ఏదో ఒక సమయములో బుద్ధి, చిత్తము యొక్క ఆదేశము లేకుండనే బయటి ఇంద్రియములు పని చేయును. అపుడు స్వయముగ ఆత్మయే ఆ పనిని చేయించును. ఉదాహరణకు నిద్రలో లేచి నడచుట కొందరి ఎడల జరుగుచుండును. ఆ పని బుద్ధికి తెలియకనే, చిత్తము యొక్క ఆదేశము లేకనే జరుగును. మరియు కొన్ని సందర్భములలో బుద్ధికి తెలియకనే, మనకు అర్థము కాకుండనే, చేతులు తానంతటవి విదిలించుకోవడము, అలాగే కాళ్లు విధిలించుకోవడము, పడుకొని మేల్కొని ఉన్నపుడు కాళ్లు గాని, చేతులు గాని ఎగిరి పడడము జరుగుచుండును. ఇటువంటి పనులన్ని ఆత్మయే స్వయముగ చేయిస్తున్నది. కావున అన్ని సమయములలోను బుద్ధి చిత్తము యొక్క అనుమతితో బయటి ఇంద్రియములు పని చేయడము లేదని చెప్పవచ్చును.

**643. (5) ఒక కార్యము చేయునపుడు శరీరములోని అహము నీవలననే కార్యము జరుగుచున్నదని, జీవునికి తెలుపునది కార్యము మొదటిలోన లేక చివరిలోన?**

జ. మొదటి నుండి చివరి వరకు.

**వివరము :** కార్యము జరుగునపుడు కార్యము మొదటి నుండి అహము జీవుని నీవే చేయుచున్నావను భావము కల్గించుచుండును. అందువలన కార్యము మధ్యలో ఆగిపోయినను, మొదటిలోనే ఆగి పోయిననూ, ఆ కార్యమునకు కర్త తానే అని జీవుడనుకొనుచుండును. శరీరములోని జీవుడు దేనిని స్వయముగ గ్రహించలేడు. కన్ను చూపిన దానిని చూస్తున్నాడు. చెవి విన్న దానిని వింటున్నాడు. అట్లే అహము కల్గించిన భావమును పొందుచున్నాడు. అహంభావ మగ్నుడైన జీవుడు అహము చెప్పినట్లు అన్ని తానే చేయుచున్నానని అనుకొనుచున్నాడు.

**644. (6) అన్ని భూతములకు చైతన్యముగనున్న వేవి?**

జ. ఆత్మ, పరమాత్మ.

**వివరము :** అన్ని భూతములనగ పంచ భూతములైదు, మహా భూతములు రెండు మొత్తము ఏడగును. రెండు విధములుగ విభజింపబడి ఉన్న భూతములకు, మహా భూతములకు చైతన్యము ఆత్మ, పరమాత్మ అని చెప్పవచ్చును. భూతములకు మహా భూతములలోని ఆత్మ చైతన్యముగ ఉండి నడిపిస్తున్నది. అలాగే మహా భూతములైన జీవాత్మకు, ఆత్మకు స్వయముగ పరమాత్మయే చైతన్యమై ఉన్నది. భూతములకు పరమాత్మ ఆధారముకాదు. భూతములకు మహాభూతమైన ఆత్మ, మహా భూతములకు పరమాత్మ ఆధారమై ఉన్నవి. దీనిని బట్టి చూచిన సర్వ భూతములకు ఆత్మ ఒక్కటే చైతన్యము కాదు. అట్లే పరమాత్మ ఒక్కటే కూడ చైతన్యము కాదు. కొన్నిటికి ఒకటి, మరికొన్నిటికి మరొకటి ఆధారమై ఉన్నవని తెలియాలి.

**645. (7) "యోగ క్షేమం వహామ్యహం" అన్న గీతా వాక్యము ప్రకారము, ఒక యోగి ప్రయాణించునపుడు ప్రమాదము జరిగిన ఎడల, వాడు గాయపడకుండ వాని క్షేమమును పరమాత్మ వహించునా? లేదా?**

జ. లేదు.

**వివరము :** పరమాత్మ యోగము యొక్క క్షేమమును వహిస్తానన్నాడు, గాని భోగము యొక్క క్షేమమును వహిస్తానని చెప్పలేదు. ప్రపంచ విషయములను భోగించునపుడు, యోగి అని పేరుగాంచిన వాని యొక్క క్షేమమును కూడ పరమాత్మ వహించదు. యోగి యొక్క యోగమునకు సంబంధించిన విషయములలోనే పరమాత్మ బాధ్యత వహిస్తు, యోగమునకు ప్రకృతి ద్వార లేక ప్రపంచము ద్వార ఆటంకము కలుగకుండ యోగము యొక్క క్షేమమును చూచును. అంతే గాని యోగి అయినంత మాత్రమున ప్రపంచ క్షేమమును చూడడు. వాని బ్రతుకు తెరువులో ఎటువంటి సహాయముగాని, క్షేమముగాని చూడడు.

**646. (8) కర్మ ఎన్ని భాగములుగ నున్నది? ఒకటా, రెండా, మూడా, నాలుగా?**

జ. మూడు భాగములు.

**వివరము :** కర్మ మూడు భాగములుగ విభజింపబడి ఉన్నది. 1. ప్రారబ్ధము, 2. ఆగామికము, 3. సంచితము.

**647. (9) శూన్యములో గాలి కదలుటకు ఆధారమైన శక్తి ఆత్మనా? పరమాత్మనా?**

జ. ఆత్మ.

**వివరము :** పంచభూతములలో గాలి ఒక భూతము. పంచ భూతములకు ఆధారమైన శక్తి ఆత్మ. కనుక శూన్యములో గాలి కదలుటకు ఆత్మశక్తియే ఉపయోగపడుచున్నది. శూన్యములో కొంత వరకే వ్యాపించి ఉన్న గాలికి ఆధారము ఆత్మయేనని తెలియాలి. ఐదు భూతములకు అవదులున్నాయి. అన్నిటికంటే పెద్దది మొదటిదైన ఆకాశమునకు కూడ హద్దు ఆకారము గలదు. ఆకాశములేని శూణ్యము జీవునియందు కూడ గలదు. ఆకాశములేని శూణ్యము విశ్వాంతరాళమైన బ్లాక్‌హోల్ అనబడు సువిశాలమైన ప్రాంతము కూడ గలదు. జీవునిలో గల శూణ్యములోను, విశ్వాంతరాళములోను పంచ భూతములు లేవు.

**648. (10) గురువువద్ద రాజు కూడ సేవకుడే అన్నారు. అలా ఉండవలసినది ఎల్లప్పుడా? అప్పుడప్పుడా?**

జ. ఎల్లపుడు.

**వివరము :** గురువువద్ద ఎంతటివాడైన సేవకునివలెనే ఉండుట ధర్మము. నిజమైన గురుభక్తి గలవాడు ఎల్లపుడు గురువును సేవించుట ధర్మము. సుఖములలో సేవించి కష్టములలో వదలడము. రాజుగనున్నపుడు సేవించి, బీదవానిగనున్నపుడు సేవించక పోవడము పద్ధతి కాదు.

## జ్ఞాన పరీక్ష

**గుత్తి (అనంతపురము జిల్లా)** **తేది-05-04-1999**

**649. (1) ఆంజనేయునికి రాముడు గురువా దైవమా?**

జ. ఏదీకాదు.

**వివరము :** ఆంజనేయునికి శ్రీరాముడు దైవజ్ఞానమును గురించి ఎప్పుడు బోధించలేదు. కావున రాముడు ఆంజనేయునికి గురువుకాదని చెప్పవచ్చును. ఆంజనేయునికి రాముడు దైవమా అనుమాటకొస్తే, రాముడు వాస్తవముగ పరమాత్మ అంశకాదు. రామునిది సాధారణ జన్మయే. రామున్ని ఆంజనేయుడు తన భావములో దైవముగ భావించుకొని రామజపమే చేసి ఉండవచ్చును, అతనినే దైవముగ కొలిచి ఉండవచ్చును. పరమాత్మ అంశయైనవాడే భగవంతుడను సూత్రము ప్రకారము రామునిది పరమాత్మ అంశకాదు. రాముడు విష్ణువాంశ అని చాలామంది అంటున్నారు. ఒక వేళ విష్ణువయి ఉండవచ్చునుగాని పరమాత్మ అంశమైన దైవము కాదు. భగవంతుడైన వాడే గురువగుటకు అవకాశము గలదు. ఆంజనేయునికి ఏ జ్ఞాన బోధ చేయని రాముడు గురువు కూడ కాదని చెప్పవచ్చును.

**650. (2) ఆకాశానికి భూమికి మధ్యనున్న ఆత్మ లేవి?**

జ. జీవాత్మ, ఆత్మ పరమాత్మ.

**వివరము :** ఆకాశము అంతులేనిది దానిలో భూమివలె ఎన్నో గ్రహములు తేలియాడుచున్నవి. వాటి విషయము మనకంతగ తెలియకుండినప్పటికి భూమి మీద ప్రాణులను, ఆకాశములో సంచరించు పక్షులను చూడగల్గుచున్నాము. కంటికి కనిపించెడివైన, కనిపించనివైన ఆకాశములోనున్న జీవరాసులలో జీవాత్మ ఆత్మ తప్పనిసరిగ ఉంటు వాటితో పాటు పరమాత్మ కూడ ఉంటున్నది. భూమి మీద ప్రాణులలో ఆత్మలు మూడు ఉండవచ్చును. భూమి నుండి ఉన్న ఆకాశములో ఏమి ఉన్నదని సంశయమేర్పడినపుడు శరీరములలోను శరీరముల బయటి శూన్యములోను అణువణువున ఒకే ఒకటి వ్యాపించి ఉన్నది అదియే పరమాత్మని జవాబు చెప్పవచ్చును. శరీరములలో మాత్రము ఆత్మ జీవాత్మలుండగ శరీరము బయట శూన్యములో కూడ పరమాత్మ వ్యాపించి ఉన్నది. భూమికి ఆకాశమునకు మధ్య అన్నపుడు భూమి మీద గల జీవులతో పాటు కలిపి చెప్పిన మూడు ఆత్మలు గలవని చెప్పవలెను.

**651. (3) మన శరీరములో నాడులందు ప్రవహించునది ఏది?**

జ. ఆత్మశక్తి.

**వివరము :** శరీరములో ప్రవహించునది రక్తమని చాలా మందికి తెలుసు. కాని నాడులలో ఆత్మశక్తి ప్రవహిస్తుందని కొందరికి తెలియదు. శరీరములోని దమనులు శిరలు అనుగొట్టములలో రక్తము ప్రవహిస్తున్నది. కాని తెల్లగ ఉన్న నరములలో రక్తము ప్రవహించదు. నరములలో ఆత్మ శక్తి మాత్రము ప్రవహిస్తుండును. శిరస్సును కేంద్రముగ చేసుకొని, ఆత్మశక్తి శరీరమంతా నాడుల ద్వార ప్రాకుచు, శరీరమును తేజము చేయుచున్నది. నాడులలో సమాన వాయువనునది కూడ వ్యాపించి ఉన్నది, కాని ప్రవహించునది కాదు. ప్రవహించునది ఒకే ఒక ఆత్మ శక్తి అని తెలియవలెను.

**652. (4) నీ శరీరములో ఆకలి వలన బాధ ఎవరికి కల్గును?**

జ. జీవాత్మకు.

**వివరము :** శరీరములో ఏ అనుభవమునైన అనుభవించువాడు జీవాత్మ. జీవాత్మ యొక్క పని కష్టసుఖములను అనుభవించడమే. ఆకలి వలన ఆత్మ శక్తి ప్రవహించుటలో తేడాలొచ్చును. కాని ఆకలి వలన వచ్చు బాధ జీవుడే అనుభవించాలి.

**653. (5) దినమునకు మూడుమార్లు తినే మనుషులకు, వారమునకొక మారు తినే పాములకు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలలో దేనియందు భేదమున్నది.**

జ. ఆత్మలో.

**వివరము :** ప్రతి జీవరాసిలోను అణువణువున వ్యాపించి ఉండడములో పరమాత్మకు ఏ తేడాలేదు. అన్ని శరీరములలో జీవుడు అనుభవములను అనుభవించడములోను ఏమి తేడా లేదు. ఇక పోతే ఆత్మ మాత్రము అన్ని జీవరాసులలోను తేడా కల్గి ఉన్నది. జీవరాసులకు శక్తి నిచ్చునది ఆత్మయే కావున, ఒక్కొక్క జీవరాసి ఒక్కొక్క బలము కల్గియుండుట వలన, ఆత్మ ఒక్కొక్క దానిలో ఒక్కొక్క రకముగ ఉన్నదని తెలియుచున్నది. అంతేకాక శరీరాకృతిని ఆత్మ పోలి ఉండుట వలన, ఒక్కొక్క శరీరము ఒక్కొక్క ఆకారములో ఉండుట వలన, ఆత్మ కూడ శరీరాకారములను బట్టి వివిధ ఆకారములలో చాలా భేదము కల్గి ఉన్నదని తెలియుచున్నది. మనిషిలోని ఆత్మ మనిషి శిశువుగ పుట్టగానే నడచునట్లు చేయక సంవత్సరమునకు నడిపించును. అదే జింక శరీర శిశువును పుట్టగానే నడచునట్లు చేయును. ఈ విధముగ ఆత్మ అన్ని జీవరాసుల పట్ల సమానముగ లేక వాటి కర్మను బట్టి భేదముగ వర్తిస్తున్నది.

**654. (6) మోసము గుణమా! అయితే ఏది?**

జ. గుణమే. కామ గుణము.

**వివరము :** ఆశ అను గుణము ఎన్నో పనులు చేయిస్తుండును. ఉదాహరణకు ఒక దారిలో పోవువాని దగ్గర డబ్బున్నదనుకొందాము. వానితో పాటు డబ్బు లేనివాడు కూడ పోవుచున్నాడు. కొంత దూరము పోయిన తర్వాత నిర్మానుష్యమైన

చోట డబ్బులేని వానికి ఆశ అనుగుణము చెలరేగి డబ్బున్న వానిని తన్ని వాని వద్దయున్న డబ్బును లాగుకొని పోయెను. ఈ పనిని దొంగతనము అంటాము. ఆశ అనుగుణము చేత దొంగతనము చేయవచ్చును. మోసము చేయవచ్చును. అలాగే స్త్రీల మీద ఆశ చేత వ్యభిచారము చేయవచ్చును. దొంగతనము, మోసము, వ్యభిచారము ప్రత్యేకమైన గుణములు కాదు. ఆశ వలన జరుగు క్రియల పేర్లే కాని అవి గుణములు కావు. దీనిని బట్టి మోసము, ఆశ అను గుణమునకు సంబంధించినదని, అది గుణము కాకున్నను ఆశ అను గుణము క్రిందికి చేర్చి చెప్పవలసి ఉన్నది. అలా చెప్పుట వలన అది పలానా గుణము యొక్క సంబంధమైనదని అర్థమగును.

**655. (7) మాయ మనిషిని ఎప్పటి వరకు మోసము చేయగలదు.**

జ. మోక్షము పొందువరకు.

**వివరము :** మనిషి ఎన్ని జన్మలు మారిన, మారిన జన్మలో కూడ గుణములుండుట వలన, మాయ మనిషిని అంటుకొనియే ఉండును. మనిషి జన్మించకుండ మోక్షము పొందినపుడు వానితో మాయకు సంబంధము తెగిపోవును. జీవుడు శరీరమును ధరించునంత వరకు మాయ వీడదు.

**656. (8) బుద్ధి తక్కువ గలవానికి జ్ఞాపకాలు బాగుంటాయా?**

జ. ఉండవచ్చు, ఉండకపోవచ్చు.

**వివరము :** శరీరములో బుద్ధి విషయమును వివరించే దానికే ఉన్నది. బుద్ధికి జ్ఞాపకాలకు సంబంధము ఎంత మాత్రము లేదు. మనస్సుకు జ్ఞాపకాల పని గలదు. ఏ జ్ఞాపకమైన మనస్సు ద్వారానే రావాలి. మనస్సు జ్ఞాపకము ద్వార వచ్చిన విషయము బుద్ధి వివరిస్తు చేయవచ్చునని, చేయకూడదని, లాభమింతయని, నష్టమింతయని, సుఖమింతయని, దుఃఖమింత ఉండునని తెలియజేస్తు పోవును. బుద్ధిని బట్టి వివరము, మనస్సును బట్టి జ్ఞాపకముండవచ్చును. బుద్ధి తక్కువ వాడు విషయమును బాగా యోచించ లేకపోవచ్చును. వానికి మనస్సు బలముగ

ఉంటే జ్ఞాపకశక్తి ఎక్కువ ఉండును. మనో బలహీనత ఉంటే జ్ఞాపకశక్తి తక్కువ ఉండవచ్చును. అందువలన బుద్ధి తక్కువను బట్టి జ్ఞాపకాలను నిర్ణయించలేము.

**657. (9) మన శరీరము పెరగడము క్రిందికా పైకా?**

జ. క్రిందికి.

**వివరము :** మన శరీరము పైకి పెరుగుచున్నదని అందరు అనుకుంటా ఉంటారు. వాస్తవముగ మానవ శరీరము పైకి పెరగడము లేదు. క్రిందికి పెరుగుచున్నది. ఈ మాట చాలా ఆశ్చర్యముగ ఉండినప్పటికి వాస్తవము క్రిందికి పెరగడమే. అంతే కాదు జంతువులు అడ్డముగ, వృక్షములు పైకి పెరగడము సహజము. చెట్టుకు మూలము క్రింద వేర్లలో ఉన్నట్లు, మనిషికి మూలము పైన తలయందు గలదు. మనిషి తల నుండి క్రిందికి సాగుతు వచ్చుట వలన పైకి పెరిగినట్లు కనిపిస్తున్నది. క్రిందికి పెరుగుచున్నాడనుటకు ఉదాహరణగ ఒక విషయము చూస్తాము. ఒకనికి చిన్న తనములో అనగ ఐదు సంవత్సరముల వయస్సులో చేతి మనికట్టు దగ్గర చిన్న గాయమై అది మానిపోయి దాని మచ్చ అట్లే ఉండి పోయినది. అతనికి 25 సంవత్సరములు వయస్సు వచ్చేటప్పటికి మనికట్టు దగ్గరగ ఉన్న మచ్చ అక్కడనే ఉండక రెండు ఇంచులు పైకి జరిగింది. దీనిని బట్టి చేయి పొడవు క్రిందికి పెరిగిందని తెలియుచున్నది. అలాగే అలాంటి గుర్తులు చిన్న వయస్సులో ఉన్న చోట ఉండక పైకి పోవుట వలన శరీరము క్రిందికి పెరిగినదని చెప్పవచ్చును.

**658. (10) అంతరంగాలైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అనువాటిలో ఏది అత్యున్నతమైనది?**

జ. బుద్ధి

**వివరము :** అంతరంగాలైన బుద్ధి, చిత్తము, మనస్సు, అహము ఏ దానికవి గొప్పవే. నిజానికి అహము మానవునికి కర్మలంట గట్టడములోను, శరీరములో తన పాత్ర ఎవరు గ్రహించనట్లు ఉండడములోను దానికదే సాటియని చెప్పవచ్చును. అలాగే

మనస్సు ఎల్లపుడు మానవునికి బయటి విషయములను తగిలించడములో దానికదే సాటి. కీలక నిర్ణయాలను కర్మకు అణుగుణముగ తీసుకోవడములో ఏ మాత్రము పొరపాటు పడనిది చిత్తము. చిత్తము యొక్క పాత్ర కూడ ఎవరికి తెలియదు. అందరిలో గుర్తింపు పొంది ఉన్నవి మనస్సు, బుద్ధి మాత్రమే. బుద్ధి ప్రతి విషయమును వివరించుతూ పోతుంటుంది. ప్రతి విషయమును వివరించినట్లే విశేష జ్ఞానమును సంపాదించుకొను శక్తి కూడ బుద్ధికి గలదు. ఏ రంగములోనైన జ్ఞానమున్నదంటే అది బుద్ధి యొక్క పనితనమే. అంతేకాక ఆత్మ యొక్క జ్ఞానమును కూడ తెలిసి, శరీరములోని ఆత్మ వివరము తెలియజేయు స్థోమత బుద్ధికి గలదు. మిగత అంతరంగములకు ఆత్మ విషయము తెలియక పోవడము వలన, బుద్ధికి ఆత్మ అవగాహన ఉండడము వలన, అన్నిటికంటే బుద్ధి గొప్పదని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**ముష్టికోవెల** **తేది-04-07-1999**

**659. (1) ప్రపంచములో దేవునికంటే అధికముగ తలపింపజేయు వస్తువేది?**

జ. ధనము.

**వివరము :** ప్రపంచమున కంతటికి అధిపతి దేవుడైనప్పటికి, కనిపించని దైవము కంటే కనిపించే ధనము అధికముగ కన్పిస్తున్నది. దేవునికి మ్రొక్కిన జరగని పని ధనముంటే జరుగునని అందరికి తెలియును. దేవుడు పనులు నెరవేర్చువాడు కాదని తెలియక, డబ్బు వలన జరుగు పనులు దేవునివలనైన జరగవని మానవుని నమ్మకము. ప్రపంచములో పనులు నెరవేరాలన్న, కూడు గుడ్డ ఇల్లు సమకూరాలనిన, డబ్బు అవసరమని అందరికి తెలుసు. చివరకు దేవాలయములో దర్శనము కూడ డబ్బున్నవానికి దొరికినట్లు డబ్బులేనివానికి దొరకలేదు. పేదవానివద్ద నుండి ధనికుని వరకు అందరికి డబ్బు అవసరమే. డబ్బంటే ఆశ లేనివాడు ఎవడు లేడు. డబ్బు ప్రభావము అర్థమైనట్లు దేవుని ప్రభావము అర్థము

కాలేదు. డబ్బు పని వేరు దేవుని పని వేరని తెలియదు. దేవుని విధానమేమి అని తెలియనివారు భూమి మీద నిండి పోవడము వలన, భూమి మీద గలవారందరికి డబ్బు ప్రభావము తెలియుటవలన, దేవునికంటే డబ్బే శక్తివంతమైనదిగా అందరికి అర్థమైనది. సంపూర్ణముగ దేవుని జ్ఞానము తెలియని దానివలన అందరు డబ్బుకు దాసోహ మంటున్నాము. కొంత జ్ఞానము తెలిసినవారు కూడ దేవునికంటే డబ్బుకే ఎక్కువ విలువిస్తున్నారు.

**660. (2) రాగము మన శరీరములో కంఠమునందా, ముఖమునందా, కడుపునందా లేక మరెక్కడయిన కలదా?**

జ. తలయందు.

**వివరము :** రాగము అనగ సంగీత రాగములోనికి పోకూడదు. రాగము అనగ ప్రేమ అని అర్థము. రాగ ద్వేషములు అనగ ప్రేమ, అసూయలని అర్థము చేసుకోవాలి. రాగము ఒక గుణము, కావున ఆ గుణము తలయందు గుణ చక్రములో కలదని చెప్పవచ్చును.

**661. (3) ఒక స్త్రీని చూచినపుడు పురుషునిలో చెలరేగునది మోహగుణమా లేక ఆశ గుణమా?**

జ. ఆశ గుణము.

**వివరము :** మోహమునకు సరియైన అర్థము తెలియక చాలా మంది ఇటువంటి సందర్భములలో వీడు ఆమెను చూచి మోహములో పడ్డాడని అనుచుందురు. ఆశ గుణము, మోహ గుణము, రెండు వేరు వేరుగ ఉంటు వేరు వేరుగ స్పందించుచున్నవి. స్త్రీని చూచినపుడు మగవానిలో మోహ గుణము రావడము లేదు. కామ గుణము అనగ ఆశ గుణము వస్తున్నది. మోహము “నా” అను సంబంధము పెట్టుచున్నది. ఇక్కడ నా వారు అనిపించక, స్పర్శ సుఖమును ఆశించుచున్నాడు, కనుక కాంక్షించునది ఆశ అని తెలియవలెను.

**662. (4) నిద్రించునపుడు మెలుకువగ నున్న అవస్థనేమందురు?**

జ. స్వప్నావస్థ.

**వివరము :** మనిషికి సహజముగ మూడు అవస్థలు గలవు. నిద్ర, మెలుకువ, స్వప్నము. నిద్రలో మనస్సు బ్రహ్మనాడిలో అనగి పోయి, బయటి జ్ఞానేంద్రియ విషయములను గాని, లోపలి జ్ఞాపకములుగాని, బుద్ధికి అందించకుండును. ఆ సమయములో బుద్ధికి జీవునికి ఏమి తెలియదు. ఏమి తెలియని స్థితినే నిద్ర అంటున్నాము. మనస్సు సూర్య చంద్రనాడుల ద్వార శరీరమంత వ్యాపించి ఇంద్రియ విషయములను లోపలి బుద్ధికి అందివ్వడమును మెలుకువ అంటాము. నిద్ర మెలుకవకాక, బయటి విషయములనందివ్వక, శరీరము నుండి ముకులించుకొని బ్రహ్మనాడిలో చేరి, అక్కడ కూడ కర్మానుసారము వచ్చు విషయములను సూక్ష్మశరీరము ద్వార బుద్ధికి అందివ్వడమును, జీవుడు అనుభవించడమును, జరుగు అవస్థను స్వప్నము అంటాము. స్వప్నము మెలుకవలాగ లోపల, నిద్రలాగ బయట ఉండును. స్వప్నావస్థలో బుద్ధి ద్వార జీవుడు మెలుకువలోవలె అనుభూతులు పొందుచున్నాడు. అందువలన నిద్రలో మెలుకువగనున్న ఒక అవస్థ అని స్వప్నమునందురు.

**663. (5) భగవంతుని శరీరములో చిన్న చిన్న నొప్పులుంటాయా?**

జ. ఉండవచ్చును.

**వివరము :** పుట్టినవాడు భగవంతుడైన ధరించినది పంచభూతనిర్మితమైన శరీరమే. పంచభూత శరీరములో ఉన్న వాడెవడైన అందులో కల్గు అనుభూతులను పొందవలసి ఉన్నది. శరీరమన్న తర్వాత అందరికున్నట్లే ఆరోగ్య అనారోగ్యములు ఉండును. దేవుడైనప్పటికి తాను నిర్మించి పెట్టిన పద్ధతిని తాను అతిక్రమించక పద్ధతి ప్రకారమే నడచుకొనును. కావున భగవంతునికైన శరీరములోని బాధలు తప్పవు. చిన్న నొప్పినైన అనుభవించవలసివచ్చును.

**664. (6) జరుగుచున్న కాలములో గురువులుగ చలామణి అగుచున్న స్వామీజీలందరు బోధించని ఆధ్యాత్మిక సిద్ధాంతమేది?**

జ. త్రైత సిద్ధాంతము.

**వివరము :** ఎంతమంది స్వామీజీలున్న, ఎందరో గురువులుగ ఉండిన, వారు బోధించునది అద్వైతము మరియు ద్వైతము. అద్వైత, ద్వైతములు ఇందూ మతములో పరస్పర విరుద్ధ సిద్ధాంతములతో ఆధ్యాత్మికమును బోధిస్తున్నప్పటికి అవి శాస్త్రబద్ధము కావని చెప్పవచ్చును. గీతలో భగవంతుడు చెప్పిన దానికి భిన్నముగ ఉండునదేదైన శాస్త్రబద్ధము కాదు. గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున గల క్షరాక్షర పురుషోత్తములను **"త్రైతమును"** ఎవరు బోధించడములేదు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను ముగ్గురి మాట వదలి కొందరు పరమాత్మ ఒక్కని బోధిస్తు అద్వైతమని, కొందరు జీవాత్మ పరమాత్మను బోధిస్తు ద్వైతమని అంటున్నారు. మధ్యలో ఆత్మను వదలివేశారు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను త్రైతమును ఎవరు బోధించడము లేదు.

**665. (7) భయము, భక్తి అను మాటలలో భక్తికి వ్యతిరేఖ పదము భయమా లేక మరేదైన ఉన్నదా?**

జ. అవిశ్వాసము.

**వివరము :** సర్వ సాధారణముగ భయము, భక్తి అను మాట వింటుంటాము. ఒక వ్యక్తి ఎడల సక్రమముగ ప్రవర్తించుటకు ఆ వ్యక్తి యొక్క భయము గాని, లేక ఆ వ్యక్తి మీద భక్తి గాని ఉండవలెను. అలా ఏదో ఒకటి ఉండుటవలన ఆ వ్యక్తికి మర్యాద ఇవ్వడము జరుగుతుంది. ఉదాహరణకు ఒక టీచర్ చెప్పిన పాఠము నేర్చుకోవాలంటే, టీచర్ భయమైన ఉండాలి, లేక టీచర్ మీద భక్తి అయిన ఉండాలి. అలాంటపుడే భయముతో గాని, లేక భక్తితో గాని ఆ పాఠము నేర్చుకోగలము. భయము, భక్తి రెండు లేకపోతే టీచర్‌ను గాని, టీచర్ మాటనుగాని లెక్క చేయము.

భయము అనునది ఒక గుణము, దానికి వ్యతిరేఖ గుణము ధైర్యము. భక్తికి వ్యతిరేఖము భయముకాదని తెలియుచున్నది. భక్తికి నిర్వచనముగ శ్రద్ధ, విశ్వాసము అని చెప్పవచ్చును. అశ్రద్ధ అవిశ్వాసము అనునవి భక్తికి వ్యతిరేఖ పదములు.

**666. (8) కర్త, కర్మ, క్రియ, సాక్షి ఎచట గలవు?**

జ. సజీవ శరీరములో గలవు.

**వివరము :** ఒక జీవుడు శరీరమును ధరించి దానిలో జీవయాత్ర సాగించుటకు కావలసినవన్ని పరమాత్మ సమకూర్చి పెట్టాడు. ఒక సజీవ శరీరములో కర్త, కర్మ, క్రియ, సాక్షి నలుగురు కలరు. కర్త, కర్మ, క్రియ, సాక్షి ఉన్నపుడే శరీరయంత్రాంగము తనంతకు తాను సాగిపోగలదు. నలుగురులో ఏ ఒక్కరు లేక పోయిన శరీర యంత్రాంగము అసంపూర్ణమగును. శరీరములో నలుగురు ఎవరి కర్తవ్యమును వారు నెరవేర్చుట వలన జీవయాత్ర సాగుచున్నది.

**667. (9) ఒకే జ్ఞానేంద్రియము ద్వార రెండు తన్మాత్రలు పని చేయుచున్న విధానము ఏ ప్రాణులకు గలదు?**

జ. పాములకు గలదు.

**వివరము :** కొన్ని పాములకు రెండు జ్ఞానేంద్రియములు ఒక దానియందు ఒకటి ఇమిడి ఉన్నవి. ప్రత్యేకించి నాగుపాములకు వినికిడి, చూపు రెండు తన్మాత్రలు ఒకే స్థలములో ఇమిడి ఉండడము ఆశ్చర్యము. పాముకు కన్నులున్నాయి, కన్నులలోనే చెవులు కూడ గలవు. కన్నులలో చూపు పని చేయునపుడు పాములకు వినికిడి ఉండదు. అట్లే వినికిడి ఉన్నపుడు చూపు ఉండదు. నాగుపాముల దగ్గర శబ్దము చేస్తే, శబ్దము వైపు తలత్రిప్ప గలవు గాని ఆ దృశ్యమును చూడలేవు. అందువలననే పాములను పట్టువారు బుర్రతో శబ్దము నూదుచు, వాటికి కల్లు కనిపించకుండునట్లు చేసి, శబ్దమును వినుచున్నపుడు సులభముగ పట్టుకో గల్గుచున్నారు.

**668. (10) జీవుల శరీరాలకు ఒకటిన్నర దశ ఏది?**

జ. యవ్వనము.

**వివరము :** జీవ శరీరానికి నాలుగు దశలు కలవు. అవి 1. బాల్యము, 2. యవ్వనము, 3. కౌమారము, 4. వృద్ధాప్యము. ఇక్కడ ఒక దశ బాల్యము దాటిన తర్వాత రెండు పూర్తగువరకు యవ్వనమని తెలియుచున్నది. కావున 1.1/2 దశ అంటే యవ్వనములో నున్నదని తెలియుచున్నది. ఇంకను వివరము తెలియాలంటే నవగ్రహముల దశలను బట్టి మానవుని ఆయుస్సు 120 సంవత్సరములుగ లెక్కించబడుచున్నది. దీనినిబట్టి పూర్వము మానవుని బాల్యము 30 సంవత్సరములని, తర్వాత 60 సంవత్సరముల వరకు యవ్వనమని, తర్వాత 90 సంవత్సరముల వరకు కౌమారమని, 90 నుండి 120 వరకు వృద్ధాప్యమని లెక్కించెడివారు. పూర్వము అలానే బ్రతికెడివారు. ఈ కాలములో ఆయుస్సు దశలు అన్ని తగ్గిపోయినట్లు కన్పిస్తున్నవి. 15 సంవత్సరములకు బాల్యము, 30 సంవత్సరములకు యవ్వనము, 45 సంవత్సరములకు కౌమారము, 60 సంవత్సరములకు వృద్ధాప్యము అయిపోవు కాలమాసన్నమైనది. పూర్వకాలము ప్రకారమైతే ఒకటిన్నర దశ అంటే 45 సంవత్సరములని, ఈ కాలములో అయితే 22 సంవత్సరములని అర్థము చేసుకోవాలి.

## జ్ఞాన పరీక్ష

**మాల్యవంతము** **తేది-08-08-1999**

**669. (1) నీకు రుచి తెలియుచున్నది అరచేతిలోన, కంటిలోన, కడుపులోన మరి ఎక్కడ తెల్పుము?**

జ. తలలో.

**వివరము :** రుచి తెలియుట నాలుక వద్దనే కదా అని చాలా మంది భ్రమించుటకు అవకాశము గలదు. నోటిలోని నాలుకకు రుచి తెలియుట వాస్తవమే, కాని ప్రశ్న

నీకు తెలియునదెక్కడ అని అడగడము జరిగినది. నాలుకకు రుచి తెలిసినప్పటికి అది నీకు తెలియుటకు మధ్యలో మనస్సు బుద్ధి రెండు పని చేయుచున్నవి. నీవు ఎక్కడున్నావో అక్కడికి రుచి యొక్క విషయమును మనస్సు తీసుకొని వచ్చి తెలియజేయుచున్నది. మనస్సు నాలుకవద్ద తెలిసిన దానిని తలలోని నీవద్దకు తెచ్చినపుడే నీకు తెలియుచున్నది. కావున నీకు ఎక్కడ రుచి తెలియుచున్నదంటే తలలోనే అని చెప్పుట జవాబై ఉన్నది.

**670. (2) మర్లుమందు పెట్టుట అంటారు. తిరిగి మందును కక్కించువారు కూడ కలరు. మర్లుమందు జీర్ణాశయములో జీర్ణము కాకుండ ఉండునా?**

జ. జీర్ణమగును.

**వివరము :** మర్లుమందును గురించి చాలామంది చెప్పుచుండుట మేము వినియే ఉన్నాము. ఎంతో మంది దానిని కక్కించు వారున్నారని కూడ విన్నాము. మర్లు మందు శరీరములోని జీర్ణాశయములో నిలచి ఉండి దాని ప్రభావము చూపుతుండునని, దానిని బయటికి కక్కించుట వలన దాని ప్రభావము లేకుండ పోవునని కూడ విన్నాము. దీని విషయమై నిజము చెప్పాలంటే అనారోగ్యుల బట్టి కొందరు వైద్యులు సృష్టించినదే మర్లుమందు, దానిని కక్కించడము. వాస్తవానికి మర్లుమందు లేనేలేదు. కొందరున్నదని వాదించిన అది జీర్ణాశయములో నిలువ ఉండుటకు అవకాశమే లేదు. తిన్నది ఏదైన మూడు గంటలకు మించి జీర్ణాశయములో ఉండుటకు వీలులేదు. జీర్ణాశయములోని రసముల ప్రభావమునకు ప్రతిది జీర్ణము కావాలి. జీర్ణము కాకపోతే వాంతి ద్వార బయటికి రావాలి. అట్లు కాకుండ దినములు, నెలలు పాటు మందు కడుపులో ఉంటుందనడము శుద్ధ అసత్యము. కక్కించు వైద్యులు వాంతి అగుటకు మందు ఇచ్చి, వాంతి అగునట్లు చేసి, అందులోనికి ఏదో ఒకటి తెలియకుండ వేసి, ఇదే కక్కినావని ఇంతటితో ఈ మందు పోయిందని మభ్యపెట్టి డబ్బు లాగుచున్నారు. అలా చేయడముతో నాకు మందు పెట్టారను మనోరోగము పోవుచున్నది తప్ప, మందు లేదు కక్కడము లేదు. జీర్ణాశయములలోనికి ఏది పోయిన జీర్ణమగును.

**671. (3) ప్రపంచములో మనుగడ సాగిస్తున్న వైశ్యుల స్వధర్మ మేది?**

జ. తన్ను తాను తెలుసుకోవడము.

**వివరము :** వైశ్యుల స్వధర్మము వ్యాపారము చేయుట అని కొందరు స్వామీజీలు చెప్పడము, భగవద్గీతలో కూడ కల్పించి వ్రాయడము, భూమి మీద బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్రులను నాల్గువర్ణములు గలవని చెప్పుట, అందులో వారి వారి స్వధర్మములను వివరిస్తు వ్యాపారము చేయుట వైశ్యుల స్వధర్మమని చెప్పడము జరిగినది. దానినిబట్టి అందరు అలాగే అనుకొనుచున్నారు. వాస్తవముగ భగవద్గీతలో కులముల ప్రసక్తే లేదు. నాల్గువర్ణములని చెప్పిన మాట నిజమే అయినప్పటికి, వాటిని కులములుగ అర్థము చేసుకోవడము మన పొరపాటు. ప్రపంచములోని ప్రజలందరు భగవద్గీత ప్రకారము నాల్గువర్ణములలోనే గలరు. కాని నాల్గు కులములుగ లేరు. దేవుని భావము ప్రకారము సాత్త్వికులు, రాజసులు, తామసులు, యోగులు అని నాల్గురకములుగ ప్రపంచ జనాభా గలదు. అట్లు కాక కులములను లెక్కించుకొంటే ఈ నాల్గు కులములు భారత దేశములో తప్ప మరి ఏ దేశములోను లేవు. అప్పుడు మనుషులందరికి అను దేవుని మాటే తప్పగును. కావున కులముల విషయము వదలి గుణముల విషయము తీసుకొందాము.

భూమి మీద మనము ఏర్పరుచుకొనిన కులముల ప్రకారము వైశ్యులకు గాని, బ్రాహ్మణులకు గాని, శూద్రులకు గాని, ఎవరికైన గాని దైవత్వమును గూర్చి తెలియడమే స్వధర్మమగును. ఆత్మలలో జీవాత్మలుగ ఉన్న జీవులందరు "స్వ" ఆత్మను గురించి, పరమాత్మను గురించి, తెలుసుకోవడము దాని ప్రకారము నడచుకోవడము స్వధర్మమగును. నీవు ఏ కులస్థుడవైన గాని, నీవు ఎవరని, నిన్ను నడుపు వాడెవడని, నిన్ను చూస్తున్న వాడెవడని తెలియడమే నీ స్వధర్మము.

**672. (4) జగతి అను పదములో రెండే భాగములున్నవి. ఆ రెండిటిలో ఒకటి నీకు అయిపోయినది. రెండవది మిగిలి ఉన్నది. ఆ మిగిలినదేది?**

జ. మరణించడము.

**వివరము :** జగతిలో రెండు భాగములు గలవు. జగతి పదమును విడదీసి చూచిన "జ" అనగ జనించడము లేక పుట్టడము అని అర్థము. అలాగే "గతి" అనగా గతించడము లేక మరణించడము అని అర్థము. జగతి అనగ పుట్టుట చావుట అని పూర్తి అర్థము గలదు. జగతిలో కనిపించునట్లు జనించుట గతించుట కనిపిస్తునే ఉన్నది. జగతి పదములో మనము పుట్టాము, కావున జ అనుట అయిపోయినది. ఇక మిగిలి ఉన్నది గతి అనగ గతించడమని తెలియాలి.

**673. (5) చనిపోయిన వానికి ప్రాణమున్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** చనిపోయినవాడు బ్రతికి ఉన్నాడంటే ఆశ్చర్యమే కదా! కాని నిజము తెలుసుకొంటే ఆశ్చర్యపడవలసినదేమిలేదు. మరణించిన వాడు తిరిగి పుట్టుట, పుట్టినవాడు మరణించుట జరుగుచున్న పనియేనని గీతలో కూడ చెప్పారు. చనిపోయినవాడు వెంటనే ఆక్షణమే మరుజన్మ చేరి ప్రాణము కల్గి బ్రతికే ఉన్నాడు. వాడు ఎక్కడ పుట్టినది మనకు తెలియదు, కావున చచ్చినవాడు ఇక లేడనుకొను చున్నాము. నిజానికి మరొక చోట ఊపిరి పీలుస్తు బ్రతికి ఉండుట సత్యము. కావున చచ్చినవాడు ప్రాణముతో ఉన్నాడని చెప్పుట సరియైన సమాధానము.

**674. (6) శరీరములోని 25 భాగములలో మానవుడు అన్ని జీవరాసుల కంటే దేనిలో గొప్పవాడు ?**

జ. బుద్ధిలో.

**వివరము :** అన్ని జీవరాసులకు 25 భాగములుండినప్పటికి మానవునికి మిగత జీవరాసులకు కొంత తేడా గలదు. మానవుని శరీరములోని బుద్ధికి మిగత సమస్త జీవరాసుల బుద్ధికి ఎంతో తేడా గలదు. మానవుని బుద్ధి అన్ని జీవరాసుల బుద్ధికంటే గొప్పది చురుకైనది. కావున మానవుడు తన బుద్ధి బలముతో అన్ని జీవరాసులను తన ఆధీనములోనికి తెచ్చుకొని తనమాట వినునట్లు చేసుకొను

చున్నాడు. సింహము బలమైనదైన మానవుని బుద్ధికంటే తక్కువ గలది. దేహ బలముకంటే బుద్ధి బలములో మానవులకు మిగత జీవరాసులకు చాలా తేడా ఉన్నదని చెప్పవచ్చును.

**675. (7) అరచేతిలో వైకుంఠముందని కొందరు, అరచేతిలో అంతా ఉన్నదని కొందరు, అరచేతిలో అసలు రహస్యముందని కొందరు అంటుంటారు. ఆ రహస్యమేమి కలదు?**

జ. ముక్తి రహస్యము.

**వివరము :** హస్తములో ఆధ్యాత్మికమంత ఇమిడి ఉన్నది. ఆధ్యాత్మికము, గుణములు, ఆత్మ, పరమాత్మలు, యోగము, మోక్షము అన్ని హస్తములో ఇమిడి ఉన్నవి. కావున దేవాలయములలో ముఖ్యముగ ప్రతిమ హస్తము చూపబడి ఉండును. హస్తములో ముఖ్యముగ మూడు రేఖలుండును. అవియే ఆత్మ, జీవాత్మ, పరమాత్మ సూచనగ ఉన్నవి. ప్రపంచమంత జీవరాసుల రూపములో ఉండి సృష్టికి అర్థము నిచ్చు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుండుట, వలన అంత అరచేతిలోనున్నదన్నారు. వ్రేల్లు మూడు గెనుపులుగ విభజింపబడి, మూడు గుణములను సూచిస్తున్నవి. అలాగే తెల్లని గోరు యోగమును, తెల్లని గోరులో చంద్రవంక జ్ఞానమును సూచించగ, చివరి నీలవర్ణ గోరు ఏకముగ మోక్షమును గుర్తు చేయుచున్నది. ఈ విధముగ గుణములు, జ్ఞానము, యోగము, మోక్షమును వ్రేళ్లయందున్నాయి. అరచేయిలో ప్రపంచమునకే మూలమైన జీవాత్మ ఆత్మలు కలసిన రేఖలుగ, పరమాత్మ ప్రత్యేకమైన రేఖగ ఉండడము వలన, సర్వము హస్తములోనే ఉన్నాయన్నారు. హస్తమును గూర్చి పూర్తి వివరము విపులముగ తెలియాలంటే మా రచనలలోని **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథము చదవండి.

**676. (8) సర్వ జీవరాసులలో ఏ జాతికి ముఖ్యముగ పరమాత్మ జ్ఞానము అవసరము?**

జ. మానవ జాతికి.

**వివరము :** సర్వ జీవరాసులను మూడు రకములుగ విభజించవచ్చును. 84 లక్షల రకములైన జాతులలో పైకి పెరుగునవి, ప్రక్కకు పెరుగునవి, క్రిందికి పెరుగునవి అని విభజించవచ్చును. 83,99,999 ల జాతులు పైకి ప్రక్కకు పెరుగువాటిలో గలవు. ఒకే ఒక్క మానవ జాతి మాత్రము క్రిందికి పెరుగునదై ఉన్నది. అన్ని జాతులకంటే మానవ జాతి దేవుని జ్ఞానమునకు చాలా దూరముగ నున్నదనుటకు అది క్రిందికి పెరుగుటయే తార్కాణము. జంతువులలో కంటే మానవునిలో గుణ ప్రభావములు ఎక్కువగ ఉండుట వలన మానవునికే ఎక్కువ జ్ఞానమవసరము. 83,99,999 ల రకములలో ఒకే ఒక్క మానవజాతికి బుద్ధి ఎక్కువై, దైవజ్ఞానము తక్కువై ఉండుట గమనార్హము.

**677. (9) గుణములకు శరీరమునకు ఆహారముగనున్న వేవి?**

జ. విషయములు, పోషక పదార్థములు.

**వివరము :** గుణములకు విషయములే ఆహారము. మనస్సు వలన కల్గు విషయముల వలననే గుణములకు బలము చేకూరుచున్నది. అలాగే శరీరమునకు నాల్గు రకముల పోషక పదార్థములు ఆహారముగ ఉండి, శరీరమును ఆరోగ్యముగ ఉంచడములోను, బలము చేకూర్చడములోను తోడ్పడుచున్నవి. శరీరమునకు పోషక పదార్థములు, శరీరములోని గుణములకు మనో విషయములు ఆహారమని తెలియాలి.

**678. (10) పరమాత్మను ఆరాధించడములో ఏ విధానములు పనికి రావు?**

జ. వేదాధ్యయణము, దానములొసగుట, యజ్ఞములు చేయుట, తపస్సు చేయుట.

**వివరము :** పరమాత్మను ఆరాధించడము, ప్రకృతిని ఆరాధించడము అని రెండు రకముల ఆరాధనలు గలవు. వేదాధ్యయణము చేయుట, యజ్ఞములు చేయుట

ఉగ్రతపస్సులు చేయుట మొదలగునవి ప్రకృతి ఆరాధనలలోనికి వచ్చును. బ్రహ్మ యోగము, కర్మ యోగము, భక్తియోగము మూడు పరమాత్మ యొక్క ఆరాధనలగును. మాయ ప్రభావము వలన యజ్ఞములు, తపస్సులు, వేదములు చదువుట అన్ని పరమాత్మను ఆరాధించడమని ప్రజలు స్వాములు అందరు పొరపడి వాటినే ఆచరిస్తున్నారు. మూడు యోగముల మినహా ఏ ఆరాధనైన అది మాయ యొక్క ఆరాధనని తెలియాలి. భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమున భగవంతుడు స్వయముగ తపస్సులు, యజ్ఞములు, వేదాధ్యయణములు నాదరికి చేర్చలేవు అన్నాడు. కావున పరమాత్మను ఆరాధించుటకు ఏవి పనికి వచ్చు ఆరాధనలో, ఏవి పనికి రాని ఆరాధనలో తెలిసి చేయవలసి ఉన్నది. లేకపోతే వృథా ప్రయాసయగును.

## జ్ఞాన పరీక్ష

**ధర్మవరము** **తేది-02-09-1999**

**679. (1) గుడ్డితనము, కుంటితనము జీవాత్మకా ఆత్మకా పరమాత్మకా?**

జ. ఆత్మకు.

**వివరము :** శరీరములో జీవాత్మ ఒక్క చోట కదలకుండ ఉన్నది. దానికి బుద్ధి మనస్సు ద్వార అన్ని విషయములు చేరుచుండును. కావున దానికి కన్ను, చెవి ఉండును, ఉండవను సమస్యలేనే లేదు. ఇక పరమాత్మ అణువణువున వ్యాపించి ఉండును. శరీరము లోపల, శరీరము బయట ఉన్న పరమాత్మకు చూడవలసినది వినవలసినది లేదు. తర్వాత మిగిలిన ఆత్మను చూస్తే, ఆత్మ శరీరమంత వ్యాపించి శరీరాకృతిని పోలివున్నది. అన్ని అవయవముల సామర్థ్యముకల్గి అన్ని అవయవము లకు శక్తి నిచ్చుచున్నది. శరీరములోని కంటికి చూపు లేకున్నా, చెవికి వినికిడి లేకున్న అక్కడివరకు ఆత్మ శక్తి లేదని అర్థము. ఎక్కడి వరకు వ్యాపించితే అక్కడివరకే ఆత్మ ఆకారము. కావున కన్ను చెవి వరకు వ్యాపించని ఆత్మకు తన ఆకారములో

రెండు అవయవములు లేవని తెలియుచున్నది. దీనిని బట్టి అంగలోపము మూడు ఆత్మలలో జీవాత్మకు, పరమాత్మకుకాక ఒక ఆత్మకు మాత్రమున్నదని తెలియుచున్నది.

**680. (2) జీవాత్మ ఆత్మలలో స్వయంశక్తి గలది ఉన్నదా?**

జ. లేదు.

**వివరము :** శరీరములో జీవాత్మ, ఆత్మలు రెండు జోడు ఆత్మలు. ఆత్మ శరీరమునంతటిని కదలించి పని చేయిస్తున్నప్పటికి ఆ శక్తి స్వయముగ తనది కాదు. జీవాత్మకు గాని, ఆత్మకు గాని స్వయంశక్తి లేదు. వాటికి శక్తి ఇచ్చినది పరమాత్మయే. శరీరములోను, శరీరము బయట అంతట, పరమాత్మ ఉండి శరీరములోపల జీవాత్మకు ఆత్మకు శక్తి ఇచ్చుచున్నాడు. అట్లే శరీరమునకు ప్రకృతికి బలము నిచ్చుచున్నాడు. అంతట ఉన్న పరమాత్మ మీదనే శరీరములోని ఆత్మలు, శరీరము, బయట ప్రకృతి ఆధారపడివున్నవి.

**681. (3) పరమాత్మ ఒక శరీరము ధరించినపుడు మరొక చోట ఉంటుందా?**

జ. ఉంటుంది.

**వివరము :** విశ్వమంత వ్యాపించి ఉన్నది పరమాత్మ. పరమాత్మ ఇంత వరకున్నదని దానికి హద్దును ఏర్పరచి ఎవరు చెప్పలేరు. అనంతమైన పరమాత్మ నుండి దానిలోని కొంత భాగము అవసరమైనపుడు భూమి మీద జన్మ తీసుకొనును. ఆ జన్మను భగవంతుడు అనుచున్నాము. పరమాత్మ అంశ భూమి మీద రూపముతో ఉన్నపుడు గాని, లేనపుడుగాని, పరమాత్మ ఎప్పటికి ఒకే లాగుండును. అంతట వ్యాపించినది భగవంతునిగ జన్మ తీసుకొన్నప్పటికి అంతట వ్యాపించియే ఉన్నది. కొంత భాగము భగవంతుడైనపుడు ఆ కొంత వెలితి పడుతుందని అనుమానము పెట్టుకోవలసినది లేదు. కొంత చీల్చివేస్తే ఆ కొంత ఖాళీ అయే దానికి పరమాత్మ ఒక పదార్థము కాదు. పరమాత్మ అనంత విశ్వశక్తి, దానిని ఇంత అంత అని చెప్పలేము. భగవంతునిగ ఇంత పుట్టినదని గాని, ఇంత మిగిలి ఉన్నదని చెప్పుటకు వీలు

లేదు. అంతట ఉండి ఒక చోట భగవంతునిగ ఉండగలదు. భూమి మీద రూపము తీసుకొనిన తీసుకోకపోయిన ఎప్పటికి ఒకేలాగ పరమాత్మ ఉండునని తెలియవలెను.

**682. (4) పరమాత్మకు ఇష్టులు, అయిష్టులున్నారని భగవద్గీతలో చెప్పారు. పరమాత్మకు ఇష్టులు జ్ఞానము మీద ఆసక్తి కలవారా లేక జ్ఞానమును ఆచరించువారా?**

జ. జ్ఞానమును ఆచరించువారు.

**వివరము :** జ్ఞానము మీద ఆసక్తి గలవారికంటే జ్ఞానమును తెలిసి ఆచరించువారు ముఖ్యులు. ఆసక్తిగలవానికంటే జ్ఞానమును తెలియువాడు ముఖ్యుడు, తెలిసిన వానికంటే ఆచరించువాడు ముఖ్యుడు.

**683. (5) పరమాత్మ జన్మను ఎలా గుర్తించవచ్చును?**

జ. బోధించు ధర్మములను బట్టి.

**వివరము :** పరమాత్మ రూపము ధరించి భగవంతునిగ భూమి మీదికి వచ్చినపుడు ఆయనను గుర్తించుటకు ఏ ఆధారములు కనిపించవు. పరమాత్మకు ఏ నియమములు లేవు, కావున ఆయన ఏ నియమములతో కనిపించడు. సాధారణ వ్యక్తిగ ఉన్న ఆయనను గుర్తించాలంటే మనకు జ్ఞానమవసరము. జ్ఞానమున్నపుడు ఆయన చెప్పే మాటలలోని ధర్మములను గుర్తించవచ్చును. ఎచట ఏ శరీరము ద్వారా ఆత్మ ధర్మములు స్పష్టముగ బోధింపబడుచున్నవో, అచట భగవంతుడు కలడని చెప్పవచ్చును. అందరు చెప్పునవి ధర్మములే అనిపించినపుడు, ధర్మములకు మాయకు తేడా తెలియనపుడు, భగవంతుని గుర్తించుట కష్టము.

**684. (6) పరమాత్మ విలువ గొప్పదని తెలిసినప్పటికి ప్రకృతిలోని మనషులకు, సంఘటనలకు, మనిషి ఎందుకు ప్రాధాన్యతనిచ్చుచున్నాడు?**

జ. భయము చేత.

**వివరము :** శరీరములో గుణములలోకెల్ల సూక్ష్మమైన గుణములు రెండు గలవు. ఒకటి ధైర్యము, రెండవది భయము. ధైర్యము జ్ఞానపరమైనది, భయము అజ్ఞాన పరమైనది. పరమాత్మ జ్ఞానము ఎంత తెలిసిన ఒక మనిషికి గాని, ఒక సంఘటనకు గాని మానవుడు భయపడుచున్నాడు. తన భయముచేత దేవునికంటే ఎక్కువ మనిషికే విలువిస్తున్నాడు. దేవునికి దగ్గరగనున్న వానిని సహితము భయము దూరము చేయగలదు. అందువలననే భయము పరధర్మమైనదని గీతలో చెప్పారు. భయము దేవుని వదలిపెట్టి అజ్ఞానుల చెంత చేరునట్లు చేయగలదు. భయముకంటే స్వధర్మమును ఆశ్రయించి చావడమే మేలు అన్నారు. అందువలన అజ్ఞాన పరమైన భయమును వదలి జ్ఞానపరమైన ధైర్యము పొందాలి.

**685. (7) గుర్తింపు కల్గిన గుణములలో జ్ఞానమునకు వ్యతిరేఖమైనది ఆశ అని గీతలో చెప్పబడినది. అలాగే గుర్తింపులేని ప్రచారము కాని గుణములలో ఆశకంటే ఎక్కువ వ్యతిరేఖము కల్గిన గుణమేది?**

జ. భయము.

**వివరము :** గుర్తింపు కల్గిన కామ క్రోదాది గుణములలో కామము జ్ఞానమునకు నిత్య శత్రుత్వము కల్గినదని చెప్పుట విన్నాము. గుర్తింపులేని గుణములలో కామము కంటే ఎక్కువ శత్రుత్వము కల్గినది మరొకటున్నది, అదియే భయము. కామము నిత్య శత్రువు కాగ, భయము నెలకొక రోజు చెలరేగిన చాలు. నెలరోజులు సంపాదించుకొన్న జ్ఞానమంతా ఒకే రోజు పోవును. అందువలన కామముకంటే భయము ప్రమాదకరమైన శత్రువని తెలియాలి. నీవు ఎచట భయపడిన ఫరవాలేదు జ్ఞాన విషయములలో భయపడకూడదని ఎరుక కల్గి ఉండాలి.

**686. (8) పశ్చాత్తాపముతో పరిహారమగునని కొందరంటున్నారు అది నిజమా?**

జ. నిజము కాదు.

**వివరము :** ఈ మాట పైకి అనవలసిందే కాని లోపల పాపము పరిహారము కాదు. కర్మసిద్ధాంతము ప్రకారము పశ్చాత్తాపముతో కర్మ పోదు. కర్మ చేసినవాడు ఆ కర్మను తప్పక అనుభవించవలసిందే. ముఖ్యముగ పరికించి చూచిన కర్మ పోవుటకు రెండే రెండు విధానములు గలవు. ఒకటి అనుభవించాలి, రెండు జ్ఞానాగ్నితో కాల్చి వేయాలి. జ్ఞానాగ్ని లేనివాడు కర్మను తప్పక అనుభవించవలసిందే.

**687. (9) కర్మ కార్యాచరణకు, పాప పుణ్య సముపార్జనకు కామాది గుణములు కారణము కాగ, జ్ఞానాచరణకు మోక్షార్జనకు కూడ గుణములే కారణమా?**

జ. గుణములే కారణము.

**వివరము :** కార్యాచరణకు పాప పుణ్యములు సంపాదించుటకు గుణములే కారణము. గుణములు పని చేయుచుండుటవలన పనులు జరుగడము, కర్మలు రావడము జరుగుచున్నది. అట్లే జ్ఞానాచరణకు మోక్షము రావడానికి కూడ గుణములే కారణమని చెప్పవచ్చును. ఎందుకనగా! గుణములు పని చేయ కుండినపుడే జ్ఞానము, మోక్షము లభించడము జరుగుతుంది. కావున మోక్షము రావడానికి గాని, రాకుండ పోవడానికి గాని, ముఖ్యముగ గుణములే కారణము. గుణములే మాయ అని గుర్తించుకోవాలి.

**688. (10) అరచేతిలో జీవరేఖ క్రింది నుండి బయలు దేరడానికి అర్థమేమిటి?**

జ. గుణచక్రములో ఉన్నాడు కదా!

**వివరము :** అరచేతి క్రింద మూడు గుణములను సూచించు భాగములు గలవు. మూడు గుణ భాగములలో జీవుడున్నాడు, కనుక గుణ భాగములున్న క్రింది నుండి జీవరేఖ ప్రారంభమై పైకి పోయినది. ఈ విషయము పూర్తి అర్థము కావాలంటే మా రచనలోని **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథములో హస్తమును గురించి వ్రాసిన విషయమును అందులోని హస్తము బొమ్మను చూడండి.

## జ్ఞాన పరీక్ష

**కొత్తకోట** **తేది-03-11-1999**

### 689. (1) శరీరములోని ఆత్మను కనుగొను మార్గములు ఎన్ని?

జ. ఒక్కటే.

**వివరము :** శరీరములోని ఆత్మను కనుగొనుటకు బ్రహ్మయోగము అను ఒకే ఒక మార్గము గలదు. బ్రహ్మయోగములో మనస్సు బయటి విషయములనందించక బ్రహ్మనాడిలో అణిగిపోయి, అక్కడున్న ఆత్మను గురించి తెలుపగలదు. దానిని బుద్ధి వివరించి జీవునికి తెలుపగలదు.

### 690. (2) గతములో మొదట భగవద్గీత ఎవరిచేత ఎవరికి చెప్పబడినది?

జ. పరమాత్మ చేత సూర్యునికి చెప్పబడినది.

**వివరము :** ఆదిలో పరమాత్మ సూర్యునికి తెలియజేసినట్లు గీతలోనే చెప్పబడినది. గీత 5,150 సంవత్సరముల పూర్వము శ్రీకృష్ణుడు అర్జునునికి చెప్పక ముందే పుట్టినది. ఆదిలో మొదట విన్న దానిని సూర్యుడు మనువుకు తెలియజేసినట్లు, మనువు ఇక్ష్వాకుడను రాజుకు తెలియజేసినట్లు కలదు.

### 691. (3) గత కాలము భగవద్గీత చివరిగ ఎవరు ఎవరికి చెప్పారు?

జ. ఏసు ప్రభువు యూదులకు చెప్పాడు.

**వివరము :** ఈ మాట చాలా విచిత్రముగ ఉంటుంది. భగవద్గీత అంటే ద్వాపర యుగములోది అని కృష్ణుడు అర్జునునికి చెప్పినదని అందరికి తెలిసి ఉండగ, ఏసు ప్రభువు 2000 సంవత్సరముల పూర్వము తన శిష్యులకు చెప్పాడనడము చాలామందికి ఆశ్చర్యముగ అసత్యముగ తోచవచ్చును. ఇటు ఇందువులు అటు క్రైస్తవులు ఇద్దరు కాదని కూడ అనవచ్చును. అయినప్పటికి ఇది సత్యమైన మాట. ఎలా అనగా! భగవద్గీత అనగా భగవంతుడు చెప్పినదని అర్థము. భగవంతుడు

ఎక్కడైన ఏ కాలములోనైన, మానవాళికి హద్దును ఏర్పరచి చెప్పినది భగవద్గీతయే అగును. ఐదు వేల సంవత్సరముల పూర్వము కృష్ణుడు భగవంతుడు, కావున ఆనాడు ఆయన చెప్పినది భగవద్గీత. ఆనాడే కృష్ణుడు చెప్పాడు నాకెప్పుడు అవసరమొస్తే అనగా ధర్మములు అధర్మములుగ మారితే అపుడు వస్తానని. అలాగే ఏసు ప్రభువుగ రెండు వేల సంవత్సరముల పూర్వము వచ్చాడని అనుకుంటున్నాము. పరమాత్మ ఎప్పుడు ఏ అవతారముతో వచ్చిన దానిని భగవంతుడనే అనాలి. పరలోకము నుండి పరమాత్మవద్ద నుండి వచ్చిన వాడు భగవంతుడైనపుడు దాని ప్రకారము ఏసు ప్రభువు భగవంతుడే అగును. భగవంతుడు మానవాళికి చెప్పినది భగవద్గీతయే అగును. కృష్ణుడు చెప్పిన భాష, ఏసు చెప్పిన భాష వేరు వేరైనప్పటికి, పేర్లు వేషములు ఆకారములు వేరైనప్పటికి, వారు భగవంతులే, వారు చెప్పినది భగవద్గీత లేనని తెలియాలి.

**692. (4) గీతలో ఆరవ అధ్యాయమేది?**

జ. విజ్ఞాన యోగము.

**వివరము :** ప్రతి భగవద్గీతలోను ఆత్మ సంయమ యోగము ఆరవ అధ్యాయముగ నున్నది. ఏడవ అధ్యాయముగనున్న విజ్ఞాన యోగమును ఇక్కడ మనము ఆరవ అధ్యాయము క్రిందికి లెక్కించుచున్నాము. ఎందుకనగా మిగత గీత పుస్తకములలో అర్జున విషాదయోగమును ఒకటవ అధ్యాయముగ లెక్కించుకొనుట వలన ఆరవదిగ ఆత్మ సంయమ యోగము కలదు. వాస్తవానికి భగవంతుడు చెప్పినదే భగవద్గీత అను సూత్రము ప్రకారము, అర్జునుడు చెప్పిన విషాదయోగము తీసివేసి, భగవంతుడు చెప్పిన సాంఖ్యయోగము మొదటి అధ్యాయముగ లెక్కించుటవలన, మేము చెప్పు భగవద్గీతలో ఆరవ అధ్యాయముగ విజ్ఞానయోగము చెప్పబడుచున్నది. మా రచనలోని **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** లో ఆరవ అధ్యాయము విజ్ఞాన యోగమే.

**693. (5) జిహ్వను జయించడమంటే ఏ గుణమును జయించినట్లు?**

జ. ఆశ (కామము) అను గుణమును జయించినట్లు.

**వివరము :** జిహ్వా అనగ నాలుక. నాలుకను జయించడమంటే నోటి రుచిని జయించడమేనని అర్థము. సూత్రము ప్రకారము ఐదు జ్ఞాన అవయవములకు అన్ని గుణములు సంబంధమున్నది. చర్మముకు స్పర్శ ఆశ ఎట్లుండునో అట్లే నాలుకకు రుచి చూడవలెనని ఆశ ముఖ్యముగ ఉండును. రుచి చూడవలెనను ఆశను కట్టడి చేయగల్గితే జిహ్వను జయించినట్లే అగును. ఆశ అరి (శత్రు) షట్ వర్గములో మొదటిది. శత్రు వర్గములోని మొదటి గుణము ఆశ కావున దానిని ఇష్టమొచ్చినట్లు పోనీయక కొంతయిన అదుపుచేసుకోవాలి. చేతనయితే పూర్తి జయించాలి.

**694. (6) ప్రపంచములో అన్ని మతముల వారిని ఒకే విశ్వాసమను త్రాటిపై నడిపించగల ఏకైక సిద్ధాంతమేది?**

జ. త్రైత సిద్ధాంతము.

**వివరము :** ప్రపంచములోని ముఖ్యమైన మూడు మతములుగ ఇస్లామ్, క్రైస్తవము, ఇందూ మతములు గలవు. ఈ మూడు ఒక దానితో ఒకటి విభిన్నముగనున్నవి. మూడు మతముల ప్రకారము చేరవలసినది దేవున్ని, చెప్పబడిన విషయము దేవునిది. అయినప్పటికి మూడు మతముల వారు వారివారి దేవుడువేరని, వారికి వారి దేవుడే గొప్పని, మిగత మతముల దేవుడు దేవుడేకాదని అనుకోవడము పరిపాటిగనున్నది. ఇపుడు మాచే బయల్పడిన **"త్రైత సిద్ధాంతము"** మూడు మతముల సారాంశమును చెప్పుచు, మూడు మతములలో చెప్పిన వాడు ఒక్కడే, చెప్పబడినది ఒకటే అని తెలుపుచున్నది. మూడు మతములలోని సారాంశము దేవుని వద్ద నుండి దేవునిచేత పంపబడిన వారి చేత దేవుని విషయములే చెప్పబడినవనునది ముఖ్యము. త్రైత సిద్ధాంతమును అర్థము చేసుకొంటే ఎక్కడ మత భేదములు గాని, మత ఘర్షణలు గాని ఉండవు. ఒక మతము వారికి మిగత మతములంటే ఏమిటని అర్థము కావాలంటే త్రైతమును అర్థము చేసుకోవాలి. ఏ మతస్థుడైన గాని దేవుడు చెప్పినట్లు నడుచుకోకపోతే, నీ మతములో నీవు

సక్రమముగ నడచుకోలేదని అర్థమగునట్లు చెప్పునది త్రైత సిద్ధాంతము. అందువలన అన్ని మతస్తులను దేవుని మీద విశ్వాసమును ఒకే తాటి మీదకు త్రైత సిద్ధాంతమే తేగలదు.

**695. (7) తొమ్మిది సంవత్సరముల బాలునికి, తొంబై సంవత్సరముల ముసలి వానికి మోహగుణములో ఎంత శాతము తేడా గలదు?**

జ. ఏమి తేడా లేదు.

**వివరము :** మోహ గుణము నాది, నా అనిపించునది. నిజానికి ఏది తనది కాకున్నను మోహగుణము తన ప్రభావము చేత జీవున్ని భ్రమింపజేయుచున్నది. తొమ్మిది సంవత్సరముల వయస్సుకు గుణములు పరిపక్వత చెంది ఉండును. తర్వాత ఎంత వయస్సు వచ్చిన అవి మాత్రము వయస్సును బట్టి తగ్గుననునది లేదు. కావున 9 సంవత్సరముల బాలునికి 90 సంవత్సరముల ముసలివానికి గుణములలో ఏమి తేడా ఉండదు.

**696. (8) ఏసు ప్రభువును చాటుగ ముట్టిన స్త్రీకి 'రక్తస్రావము' అను రోగము నయమైనది. అది ఏసు కృపవలన అయినదా లేదా?**

జ. కృపవలన కాదు.

**వివరము :** ఈ విషయములో ఆనాడే ఏసు ఆమెను చూచి 'నీ నమ్మకమే నిన్ను కాపాడింది' అని చెప్పాడు. నా కరుణతో నీకు నయమైందని చెప్పలేదు. దీనిని బట్టి ప్రభువు మీద గల విశ్వాసమే ఆమెకు పని చేసిందని తెలియుచున్నది. ప్రభువుకు ఏ గుణములు లేవు. ఆయన గుణాతీతుడు. అక్కడ ప్రభువు యొక్క ప్రమేయము లేదు. భక్తుల విశ్వాసమును బట్టి ప్రభువు నుండి ఫలిత మొచ్చినదని తెలియాలి.

**697. (9) ఏసు ప్రభువును కరుణామయుడు, దయామయుడు అంటారు. అది నిజమా?**

జ. నిజము కాదు.

**వివరము :** పై జవాబు ఏసు మీద విశ్వాసము గలవారందరికి కొంత బాధను కల్గించునదై ఉన్నది. అయినప్పటికి సత్యమును తెలుపడము మా కర్తవ్యము. ప్రభువు చాలా పవిత్రుడు ఆయనకు చెడు గుణములు గాని, మంచి గుణములు గాని లేవు. అనగా గుణాతీతుడు. దయ, కరుణ కాని, కోపము, ద్వేషముగాని ఆయనకు లేవు. మన విశ్వాసమును బట్టి ఆయన నుండి ఏది లభించిన అది ఆయన యొక్క గుణమనుకోకూడదు. ప్రభువు ఆకారముతో ఉండినప్పటికి ఆయన పరలోక రాజ్యాధిపతి అని చెప్పబడుచున్న దేవదేవుడు. ఆయనను ఒక మనిషిగ పోల్చుకొని, మనిషికున్న గుణములను ఆయనకు అంటించకూడదు. ఆయన పూర్తి స్వభావమును అర్థము చేసుకొంటే ఆయన కోపమయుడు కాదు, కరుణామయుడు కాదు.

**698. (10) నేను అనుకొంటే నీవు అంతటా ఉంటావు. నేను అనుకొంటే నీవు నీవుగానే ఉంటావు. అను వాక్యము ప్రకారము దేవుని చేరాలంటే జ్ఞానము యోగము అవసరమా?**

జ. అవసరము లేదు.

**వివరము :** ఇచట రెండు వాక్యములలోను నేను అనుకొంటే అని ఉండగ, మొదటి వాక్యములో నీవు అంతటా ఉంటావని, రెండవ వాక్యములో నీవు నీవుగానే ఉంటావని వ్యత్యాసముగ చెప్పడము జరిగినది. ఇచట అనుకొనువాడు పరమాత్మ ఒక్కడే కావున రెండు వాక్యములలోను నేను అనుకొంటే అని చెప్పబడినది. పరమాత్మ అనుకొంటే జీవుడుగ ఒక శరీరములోనున్నవాడు ముక్తిపొంది అణువణువున అంతట వ్యాపించి పరమాత్మలోకి ఐక్యమైపోవును. కావున మొదటి వాక్యములో నేను అనుకొంటే నీవు అంతటా ఉంటావన్నాడు. అలాగే పరమాత్మ అనుకొంటే ముక్తి పొందాలని ఎవడు ఏ ప్రయత్నము చేసిన ముక్తి పొందలేడు. ఒక శరీరములో దేవుడు అనుకొను జీవుడు శరీరములో వాడు వాడుగానే ఉండును.

కావున నేను అనుకుంటే నీవు నీవుగానే ఉంటావన్నాడు. రెండు వాక్యములు వాస్తవమైనవే. పరమాత్మ అనుకుంటే యోగము, జ్ఞానము అవసరము లేకుండానే మానవుడు ముక్తి పొందగలడు. అలాగే పరమాత్మ అనుకుంటే యోగము జ్ఞానము వానిని ముక్తికి చేర్చలేవు. పరమాత్మ జోక్యములో యోగము జ్ఞానములు పనికిరావని తెలియుచున్నది. గీతలో కూడ జ్ఞానమునకు, బ్రహ్మ, కర్మ యోగమునకు విశ్వాసము అతీతమైనదిగా చెప్పబడినది. దానినే భక్తి యోగమన్నారు.

## జ్ఞాన పరీక్ష

**కళ్యాణ దుర్గము** **తేది-13-05-2000**

**699. (1) అసూయకు వ్యతిరేఖ గుణమేది?**

జ. ప్రేమ.

**వివరము :** అరిషట్ వర్గములో చివరిది అసూయ గుణము. మిత్ర వర్గములో అసూయకు వ్యతిరేఖ గుణము ప్రేమ. వీటిని రాగ ద్వేషములని కూడ అంటారు. రాగము అనగ ప్రేమ, ద్వేషము అనగ అసూయ. అరిషట్ వర్గములలో చాలా ప్రభావమైనవి మొదటి గుణమైన ఆశ చివరి గుణమైన అసూయ, అలాగే మిత్ర వర్గములోనున్న దానము ఆశకు వ్యతిరేఖ గుణముగ ఉండగ, ద్వేషమునకు ప్రేమ వ్యతిరేఖ గుణముగ ఉన్నది. అసూయలో ఏమున్నదో దానికి వ్యతిరిక్తముగ ప్రేమలో ఉన్నది. కొందరు ప్రేమే దైవమంటుంటారు. అసూయగాని, ప్రేమగాని గుణములే కావున దైవము కావు.

**700. (2) భగవద్గీతలో చెప్పిన క్షరాక్షర పురుషోత్తములలో ఎవరు పురుషుడు?**

జ. ముగ్గురు పురుషులే.

**వివరము :** ప్రపంచములో ఉన్నవి స్త్రీ, పురుష అను రెండు జాతులు గలవు. ఆదిలో ప్రకృతి పురుషుడను రెండే గలవు. ప్రకృతికి వ్యతిరేఖము పురుషుడు,

కావున మర్మావయవములు వ్యతిరేఖముగ పుట్టి రెండు జాతులుగ పైకి కనిపిస్తున్నవి. ప్రకృతియంతయు స్త్రీ తత్త్వము కాగ ప్రకృతి ఐదు భాగములుగ విభజింపబడినది. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అన్నియు ప్రకృతిలోని భాగములే, స్త్రీ తత్వములే. అలాగే పరమాత్మ పురుషుడు కాగ ఆయన మూడు భాగములుగ విభజింపబడి యున్నాడు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనునవి ఇందులో ముగ్గురుని పురుషులనియే చెప్పవచ్చును. కాని ప్రకృతితో కూడి, మాయతో నిండి ఉన్న జీవాత్మ పురుషుడైనప్పటికి, వానిలో స్త్రీ లక్షణములు అనగ ప్రకృతి లక్షణములు నిండి ఉన్నవి. పై ఆకారములో పురుషావయవము కల్గిన దేహముండినప్పటికి, స్త్రీ లక్షణములు కలవానిని నపుంసకుడు అన్నట్లు, జీవాత్మను పురుషుడని చెప్పినప్పటికి కొంత నపుంసకుడని చెప్పవలెను.

**701. (3) సర్వులలో ఉన్న పరమాత్మ ఒక్కటే, సర్వులలో ఉన్న ఆత్మ ఒక్కటే, సర్వులలో ఉన్న జీవాత్మ ఒక్కటే అనుట వాస్తవమా?**

జ. వాస్తవము కాదు.

**వివరము :** సర్వులలో పరమాత్మ ఒకటేననుమాట వాస్తవమే. అన్ని శరీరములలోను ఒకే పరమాత్మ భిన్నము కాకుండ ఉన్నది. ఆత్మ అన్ని శరీరములలోను ఒకే పద్ధతి కల్గి ఉన్నను, అది భిన్నములుగ ఉంటున్నది. కావున ఆత్మలు అనేకములని చెప్పవచ్చును. జీవాత్మ ఒక్కొక్క శరీరములో ఒక్కొక్కటిగ ఉంటు, అనేక శరీరములలో అనేక జీవాత్మలు గలవు. జీవాత్మ ఎచట గలదో ఆత్మ కూడ అచట జీవునితో జోడుగ ఉండును. శరీరములెన్ని గలవో, వాటిలో జీవాత్మలెన్ని గలవో, ఆత్మలు కూడ అన్ని గలవని చెప్పవచ్చును. వేరు వేరు శరీరములలో, వేరు వేరు జీవులు, వేరు వేరు ఆత్మలు గలవని చెప్పవచ్చును.

**702. (4) మరణములో నీ వెంట వచ్చునది ఏది? నీ వెంట వచ్చు వాడెవడు? నీ వెంట వచ్చునవేవి?**

జ. కర్మ, ఆత్మ, గుణములు.

**వివరము :** మరణములో జీవునివెంట బాహ్యాముగ ఉన్న ధన, కనక, వస్తు, వాహనాదులు రావు. కనుక శరీరము లోపల చూడవలసి ఉన్నది. శరీరము లోపల జీవుని వెంట వచ్చునది జీవితాంతము జోడుగ తనతో పాటు శరీరములో ఉన్న ఆత్మ మరియు జీవితాంతము సంపాదించుకొన్న కర్మ అను పాప పుణ్యములు. ఇంకనూ పాప పుణ్యములకు కారణమైన చెడు మంచి గుణములు. తలలో పాల భాగమున నాల్గుచక్రముల నిర్మాణమున్నది. దానినే బ్రహ్మ, కాల, కర్మ, గుణ చక్రములు అంటున్నాము. మరణములో నాల్గుచక్రముల అమరిక మొత్తము శరీరమును వదలి మరొక శరీరమును చేరుచున్నవి. ఆ నాల్గుచక్రముల మధ్యన ఇరుసులో గల ఆత్మయు, గుణ చక్రములోని గుణములు, అందులోని జీవాత్మ, కర్మ చక్రములోని కర్మ, మొత్తము మరొక శరీరమును చేరుచున్నవి.

**703. (5) హస్తములో మూడు ఆత్మల చుట్టు ఉన్నవి ఏవి?**

జ. మూడు గుణములు.

**వివరము :** అర చేతిలో మూడు రేఖలు మూడు ఆత్మలకు గుర్తు కాగ, వాటి చుట్టు వ్రేల్ల మీద మూడు గెనుపులు మూడు గుణములకు గుర్తుగ ఉన్నవి. పైన వ్రేల్ల మీద గెనుపులుగ క్రింద మనికట్టు మీద మూడు మడతలుగ గుణములు గుర్తింపబడి ఉన్నవి. హస్తములో మూడు ఆత్మలు మూడు గుణములేకాక జ్ఞానము యోగము మోక్షముల గుర్తులు కూడ గలవు.

**704. (6) నీ జీవనములో మార్పును, అంత్యము నేమంటాము?**

జ. మరణము, మోక్షము అంటాము.

**వివరము :** జీవుని యొక్క జీవనములో మార్పు ఒకటి, రెండవది అంత్యము గలదు. జీవితము మారి క్రొత్త జీవితమును ప్రారంభించడము గలదు. ఆ మార్పును మరణము అంటున్నాము. ఒక జీవికి ఎన్ని మార్పులైన జరుగుతూ పోవచ్చును. ఎప్పటికైన అంత్యమంటు ఒకటిగలదు. ఆ అంత్యమునే మోక్షము లేక విడుదల అంటున్నాము. జీవుడు కర్మబద్ధుడై ఉన్నంతవరకు మార్పులుండును

గాని అంత్యముండదు. కర్మబంధము నుండి బయటపడుటనే విడుదల లేక మోక్షము అంటున్నాము.

**705. (7) నీ శరీరములో ఎల్లపుడు మెలుకువగనున్న వాడు ఆత్మనా? జీవాత్మనా?**

జ. ఆత్మ, జీవాత్మ రెండు గలవు.

**వివరము :** శరీరములో నిద్ర మనస్సుకు మాత్రము గలదు. జీవాత్మకు ఆత్మకు లేదు. ఆత్మ అహర్నిశలు శరీరములో పని చేయుచున్నది. గుండెను ఆడించుట ఊపిరితిత్తులనుండి శ్వాసను కదలించుట మొదలైన పనులను ఆత్మ ఎల్లపుడు చేయుట వలన అది నిద్రించుటకు అవకాశము లేదు. జీవాత్మకు మెలుకువలోను, స్వప్నములోను నిద్రలేదని అచట అది అనుభవించు పని చేయుచున్నదని తెలియుచున్నది. నిద్రలో జీవాత్మ నిద్రించుచున్నదా లేక మెలుకవ కల్గియున్నదా అను అనుమానము ఉంటుంది. నిద్రలో జీవాత్మకు ఏ అనుభవములు లేని దానివలన దానిని కూడ నిద్రించినట్లు కొందరు చెప్పుకొనుచున్నారు. వాస్తవముగ జీవుడు ఎప్పటికి నిద్రపోలేదనియే చెప్పవచ్చును. ఎప్పుడు ఏ విషయమొచ్చిన అనుభవించుటకు అనుకూలముగ నిద్రలేని స్థితిలో జీవుడున్నాడు. నిద్రలో కేవలము మనస్సు పని చేయడము లేదు. కావున జీవుని స్థితి తెలియకున్నది. జీవుడు ఆత్మ ఇద్దరు జోడు ఆత్మలయిన దానివలన ఆత్మ మేల్కొని ఉన్నది, జీవాత్మ కూడ మేల్కొనియే ఉన్నది. ఏ సమయములో బుద్ధి తెల్పిన, దానిని స్వీకరించునట్లు జాగ్రత్తగ జీవుడు గలడు.

**706. (8) చంద్రగ్రహములో ఏ ఆత్మలున్నవి?**

జ. జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు.

**వివరము :** గ్రహము అనగ గ్రహించునది. చంద్రగ్రహము అనగ గ్రహించు స్థితిలో ఉన్న చంద్రుడు. మనుషులు కూడ గ్రహించు స్థితిలో గలరు. అందువలన మనషులు కూడ గ్రహములే. గ్రహములు, విగ్రహములు అను ఘట్టములో

మనుషులు గ్రహాములు అని ఇరువది సంవత్సరముల పూర్వమే మేము చెప్పాము, వ్రాశాము. శరీరములో సూక్ష్మ శరీరము 15 భాగములుగ ఇమిడి అన్నిటిని గ్రహించునదిగ ఉన్నది. ఆ సూక్ష్మ శరీరమునే గ్రహము అంటున్నాము. చంద్రుడు కూడ స్థూలము, సూక్ష్మము అను రెండు శరీరములతో ఉండి గ్రహించునదై ఉన్నది. కావున చంద్రున్ని గ్రహము అంటున్నాము. మానవ గ్రహములో ముఖ్యముగ గ్రహించు భాగములు మనస్సు, బుద్ధి, అనుభవించువాడు జీవుడు. చంద్రగ్రహములో కూడ అవియే గలవు. జీవుడున్నాడు కావున ఆత్మయు గలదు. అంతట ఉన్న పరమాత్మ చంద్రగ్రహములో కూడ గలడు. దీనిని బట్టి జీవుడు, ఆత్మ, పరమాత్మ ముగ్గురు చంద్రునిలో కలరని చెప్పవచ్చును.

**707. (9) ఒక వేళ పరమాత్మ జంతువుగ పుట్టాడనుకొందాము. అపుడు ఆ జంతువునేమనాలి?**

జ. భగవంతుడనాలి.

**వివరము :** పరమాత్మకు జంతువుగ పుట్టే అవసరముందో లేదో మనకు తెలియదు. పుట్టాడని ఊహించుకొంటున్నాము. ఎక్కడ పరమాత్మ పుట్టిన పురుష ప్రమేయము లేకుండ అనగ పురుష సంపర్కముతో సంబంధము లేకుండ పుట్టగలడు. అంతేకాక అందరివలె క్రొత్త శరీరములోనికి చేరుట అనునది ఏమిలేక, తల్లి గర్భములోని శిశువులోనే వ్యాపించి ఉండి, సజీవముగ గర్భమునుండే పుట్టుచున్నాడు. మిగత జీవరాసులు తల్లిగర్భము నుండి పుట్టరనునది మా వాదన. భగము నుండి పుట్టినవాడు భగవంతుడు అను సూత్రము ప్రకారము, పరమాత్మ ఏ జన్మను తీసుకొనిన దానిని భగవంతుడని అనాలి.

**708. (10) శరీరములో నిద్ర ఎవరికి కలదు?**

జ. మనస్సుకు.

**వివరము :** మననము చేయునది మనస్సు. మననము అనగ జ్ఞప్తి. జ్ఞప్తి చేయునది మనస్సు. మనస్సు శరీరమంత వ్యాపించినపుడు ఎరుక కల్గి విషయములను

తెలియజేయుచుండును. అది బ్రహ్మనాడిని చేరినపుడు ఏ విషయమును తెలుపక పోవును, దానినే నిద్ర అంటున్నాము. ప్రపంచమును చూపునది, చూపకుండ మూసి పెట్టునది ఒకే ఒక మనస్సు. అన్ని అవయవములు వాటి వాటి పనిని చేయు స్థోమత కల్గి ఉన్నను, మనస్సు ఒకటి పని చేయక పోవడమువలన ఏమి తెలియకపోవుచున్నది. కావున నిద్ర మనసుకు గలదని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**మాల్యవంతము** **తేది-10-09-2000**

**709. (1) 33 కోట్ల దేవతలంటారు వాస్తవమేనా?**

జ. వాస్తవమే.

**వివరము :** జీవరాసులను జీవకోటి అనడము జరిగినది. జీవరాసులు అండజ, పిండజ, ఉద్భిజములని మూడు రకములుగ ఉన్నవి. ఒక్కొరకములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు మూడు గలవు. అందువలన మూడు రకముల జీవరాసులను 3 అని, వాటిలో మూడు ఆత్మలు గలవు కావున మరియొక 3 అని, రెండిటిని కలిపి 33 అని, జీవకోటిని గురించి చెప్పుట వలన వాటిని 33 కోట్ల జీవరాసులని చెప్పారు. ఆత్మ గల జీవరాసులన్నిటిని దేవుళ్లగ పోల్చి 33 కోట్ల దేవతలన్నారు. మూడు రకముల జీవరాసులలో మూడు ఆత్మలు గలవని దాని అర్థము. కాని 33 కోట్ల దేవతలు లేరు.

**710. (2) బే, మ, రా, దే, బ్ర అను విడి అక్షరములకు మరియొక రెండ క్షరములను కలిపిన, జ్ఞానపరమైన అర్థమిచ్చు పదములుగ మారిపోతాయి. ఆ రెండక్షరములు ఏవి?**

జ. హర్షి.

**వివరము :** 'హర్షి' అనగా సంతోషించువాడు, హర్షించువాడు అని అర్థము. పూర్వము జ్ఞానము కల్గినవారు ఆత్మానందమును పొందుచుందురు. లేకపోతే

జ్ఞానానందమును కల్గి ఉందురు. ఆనందమును కల్గిన వారిని హర్షి అనుట సహజము. జ్ఞానశక్తి కల్గిన వారికి పూర్వము స్థాయిలు కల్గించి వారి వారి జ్ఞాన శక్తిని బట్టి నాలుగు రకములుగ విభజించారు. పావు, అర్థశేరు, ముప్పావు, శేరు అని నాల్గు విధములున్నట్లు పూర్తి జ్ఞానమున్న వారిని బ్రహ్మర్షి అని, వానికంటే తక్కువ వానిని దేవర్షి అని, వానికంటే తక్కువ వానిని రాజర్షి అని చివరి వానిని మహర్షి అన్నారు. ఏ శక్తి లేని వానిని బేవర్షి అన్నారు. బేవర్షి, మహర్షి, రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి అను వారిని గుర్తుండునట్లు మొదటక్షరములను కలిపి **"బేమరాదేబ్ర"** అని మన మన్నాము.

**711. (3) చెట్టుకు పూవుల రంగులు ఆ చెట్టు వేర్ల నుండి ఏర్పడుచున్నవా, కొమ్మల నుండినా, ఆకుల నుండినా, వేరే దేని వలనయినా ఏర్పడుచున్నవా?**

జ. చెట్టులోని ఆత్మ వలన ఏర్పడుచున్నవి.

**వివరము :** చెట్లకు పూల రంగులు ఆ చెట్టులో ఇమిడి ఉన్న ఆత్మ శక్తి వలన ఏర్పడుచున్నవి. చెట్లకు ఆకుల రంగులు గాని, పూవుల రంగులు కాని, ఆ చెట్లు పెరుగుదలకాని అన్నియు ఆత్మ వలననే జరుగుచున్నవి. మానవుని శరీరములో మానవునికి రంగు రూపు ఆత్మ కలుగజేసినట్లు, వృక్షములకు తీగలకు రంగు రూపును ఆత్మే కలుగజేయుచున్నది. మానవుడు పిండజము కాగ, చెట్లు ఉద్భిజములుగ వున్నవి. పిండజములలో గాని, ఉద్భిజములలో గాని, అండజములలో గాని మూడు ఆత్మలు గలవని, వాటిలో మధ్య ఆత్మ వలన అన్ని జరుగుచున్నవని తెలియాలి.

**712. (4) పెళ్లి కూతురు, పెళ్లి కొడుకు భార్య భర్తలుగ ఎప్పుడౌతారు?**

జ. ఒకరికొకరు జ్ఞానము తెలుసుకొన్నపుడు.

**వివరము :** పెళ్లి అను పదము ఇద్దరి ఎడల ఒక్కటే అయిన కూతురు కొడుకు అనుట గలదు. కూతురు కొడుకు అనగా అక్క తమ్ముడు గాని, అన్న చెల్లెలుగాని

అన్నట్లు సోదర భావము చూపుచున్నది. సోదర భావ పదము పోయి, భార్య భర్త అను పదము వారికి వర్తించాలంటే పెళ్లి జరిగిన తంతు ప్రకారము ఒకరి కొకరు జ్ఞానమును తెలుపుకొవాలి. పెళ్లిలో తలంబ్రాలు పోయుట ఈ పద్ధతిని తెలుపు పనియేనని తెలియాలి. అట్లు జ్ఞానము తెలుపుకోక పోతే వారు భార్య భర్తలు కారనే పూర్వము పెద్దల భావము. పెళ్లి తంతు ప్రకారము జ్ఞానము తెలియబరచుకోలేని వారు, కాపురము చేసి పిల్లలను కనిన అది అక్రమ సంబంధ మగునని పెద్దల భావము. అక్రమ సంబంధములో కూడ అక్క తమ్ముడుగాని, అన్న చెల్లెలుగాని, అక్రమ సంబంధముగ ఉన్నట్లు భావము. ఇది చాలా తప్పు కావున పూర్వము భర్త భార్యకు, భార్య భర్తకు జ్ఞానమును తెల్పెడివారు. అలా చేసిననాడే వారిది సక్రమ సంబంధమగును. పెళ్లినాటి తంతులలో తలంబరాలు తల మీద పోయు అర్థమును పూర్వము తెలిసి నడచుకొనెడివారు. ఈ కాలములో అర్థము తెలియని ఆచారాలు మిగిలి ఉన్నవి. కావున అందరు భార్య భర్తలను మాటకు అర్థము లేకుండ, అక్రమ సంబంధము కల్గి ఉన్నారని, అటువంటి వారికి పుట్టిన సంతతి కూడ అక్రమ పనులు చేయునదై, దైవమనునదేదో తెలియకుండ పోవుచున్నారు.

**713. (5) తల్లి తండ్రి అను పదములు మొదట "త" తో మొదలగుచున్నవి, ఎందుకు?**

జ. ఇద్దరిలోను ఒకే శక్తి ఉన్నదాని వలన.

**వివరము :** ప్రపంచము పుట్టక పూర్వము పరమాత్మ ఒక్కడే గలడు. ప్రపంచమును పుట్టించవలెననుకొన్న తర్వాత పరమాత్మ ప్రకృతిని సృష్టించాడు. పరమాత్మ తన శక్తితోనే ప్రకృతిని భిన్నముగ సృష్టించి అందులో తన శక్తినే నింపి పెట్టాడు. పరమాత్మ శక్తితోనే ప్రకృతి నడచుచున్నది. పరమాత్మ పురుషుడు కాగ, ప్రకృతి స్త్రీగ తయారు చేయబడినది. ప్రపంచములోని జీవకోట్లన్నియు ప్రకృతి పురుషులకు పుట్టినవే. కదలెడు కదలని జీవరాసులన్నిటికి పరమాత్మ తండ్రిగ ప్రకృతి తల్లిగ

ఉన్నది. పైకి కనిపించు తల్లితండ్రులలో కూడ ఒకే పరమాత్మశక్తి ఉండి, వారిని తల్లితండ్రులను చేయుచున్నది. ఇద్దరి యందు ఒకే శక్తి ఇమిడి ఉన్నదని తెల్పుటకు ఇద్దరిని "త" తో మొదలగు పదములుగ తల్లితండ్రి అన్నారు. తల్లితండ్రి రెండుయైనవాడు ఒకే పరమాత్మని తెలియాలి.

**714. (6) ఆకులలో ఔషధ గుణము మరియు రోగము కల్గించే గుణము రెండు ఉన్నాయి. అది దేనికి సూచన?**

జ. మనుషులలో జ్ఞానము, అజ్ఞానము రెండు ఉన్నాయను సూచన.

**వివరము :** మనుషులందరు పుట్టినప్పటి నుండి రెండే రెండు విధానములలో మునిగి ఉన్నారు. ఒకటి రోగము, రెండు యోగము అను పద్ధతులు భూమి మీద గలవు. రోగము లేనివాడు యోగములో ఉండును. యోగములో లేనివాడు రోగములో ఉండును. రోగమునకు, యోగమునకు ముఖ్యకారణము మనిషిలోని జ్ఞాన అజ్ఞానములేనని తెలియుచున్నది. జ్ఞానము వలన యోగము, అజ్ఞానము వలన రోగము మనిషికి లభ్యమగుచున్నవి. జ్ఞాన పరమైన యోగములో లేని ప్రతి ఒక్కడు అజ్ఞాన పరమైన అసంతృప్తి అను రోగములోనే ఉన్నాడు. భూమి మీద యోగము లేని రోగము కల్గినవారు చాలామంది కలరు. రోగులందరికి అసంతృప్తి అను బాధపీడించుచున్నది. మనుషులలో రోగులు, యోగులున్నారని తెలుపు నిమిత్తము, చెట్ల ఆకులలో ఔషధగుణము రోగగుణము రెండు నింపి పరమాత్మ సృష్టించాడు.

**715. (7) 7+7=14 లోకాలు అంటారు. అవి మన శరీరములో ఉన్నాయా?**

జ. ఉన్నాయి.

**వివరము :** భువర్లోక, సువర్లోక, అని మొదలిడి చివరకు అతల, వితల, సుతల, పాతాళ అని ఒక రకము ఏడు, మరొక రకము ఏడు లోకములు ఉన్నట్లు పెద్దలు

చెప్పడము జరిగినది. పదునాలుగు లోకములున్నాయా అను మాటకొస్తే ఉన్నాయని ఓప్పుకోవలసి ఉన్నది. లోకములేమిటి శరీరములో ఉన్నదేమిటి అని కొందరికి సంశయమురావచ్చును. దానికి సమాధానమేమనగా! శరీరములో ఏడు గ్రంథులు, ఏడు నాడీకేంద్రములు గలవు. గ్రంథులు నాడీకేంద్రములు శరీరమును నడుపుటలో ఉపయోగపడుచున్నవి. ఆత్మ తన శక్తిని గ్రంథుల ద్వార, నాడీ కేంద్రముల ద్వార, విభజించి శరీరమును నడుపుచున్నది. ఆత్మశక్తి రెండు విధములుగ ఉన్నది, కనుక రెండు రకముల లోకములన్నారు. గ్రంథులు ఏడు, నాడీ కేంద్రములు ఏడు కనుక ఏడు ఏడు పదునాలుగు లోకములు ఉన్నాయన్నారు. పదునాలుగు లోకములంటే భూమికి పైన క్రింద లేవని, అవి మన శరీరములోనే కలవని, వాటియందు ఆత్మశక్తి కలదని, ఏడు కేంద్రముల ద్వార ఆత్మ శక్తి రూపముతో బహిర్గతము కాగ, ఏడు గ్రంథులలో రసముల రూపముగ బయల్పడుచు శరీర ఆరోగ్యమును శాసించుచున్నదని తెలియవలెను.

**716. (8) కాషాయాంబరములకు ఆ పేరు ఎందుకు వచ్చినది?**

జ. కషాయం రంగు ఉండుట వలన.

**వివరము :** ఒక చెట్టు యొక్క సారము కావాలంటే ఆ చెట్టు ఆకులను కాండములను, పూవులను, వేర్లను అన్నిటిని నీటిలో వేసి ఉడికించుటవలన కషాయము ఏర్పడును. చెట్టులోని సారమంతయు నీటిలో చేరి కొద్దిగ ఎరుపు రంగు కల్గి కషాయము తయారగును. కషాయమనగ చెట్టు సారము కల్గినదని అర్థము. అలాగే జీవితము లోని సారాంశమును తెలిసినవారు, అనగ శరీరములోని సత్తును తెలిసినవారు, మేము శరీరములోని సారమును తెలిసినామను గుర్తుగ, సారమునకు మారు పేరైన కాషాయరంగు కల గుడ్డను ధరించెడివారు. అందువలన ఆధ్యాత్మికమును, ఆత్మను తెలిసిన జ్ఞానులు పూర్వము కాషాయాంబరములు ధరించెడివారు. అలా ధరించుట వలన కషాయరంగుకు దానిని ధరించెడివారికి కొంత ప్రత్యేకత ఉండెడిది. నేటి కాలములో కాషాయము యొక్క విలువ తెలియక బిక్షగాల్లు, జ్ఞానము తెలియని

వారు ధరిస్తున్నారు. కొందరు జ్ఞానులు స్వాములు ధరించిన అవి ఎందుకు ధరించాలో వారికే తెలియడము లేదు. పూర్వము కషాయము అని పిలిచెడివారు. నేడు కాషాయము అని 'క' కు దీర్ఘమేర్పడినది. కషాయము నుండి కాషాయమను మాట కాలక్రమమున మారినదని, అటువంటి వారే దానిని ధరించుట వలన అర్థము, విలువ ఉండునని తెలిస్తే మంచిది.

**717. (9) బయట ఐదు జ్ఞానేంద్రియములు గలవు, లోపల 12 గుణములు గలవు. కొన్ని గుణములు ఏ జ్ఞానేంద్రియములో గోచరించును?**

జ. కన్నులలో.

**వివరము :** శరీరములోపల గల కొన్ని గుణములు మనిషి ముఖవర్ఛస్సులో కనపడునని కొందరంటుంటారు. ఆ మాట వాస్తవమే. కోపముతో ఉన్న ముఖమును దయతో ఉన్న ముఖమును సులభముగ గుర్తించవచ్చును. అలాగే కొన్ని గుణములు ముఖములో గోచరించును. ముఖములో గుణమార్పులు కనపడటకు ముఖ్యమైనవి కన్నులు. కన్నులను బట్టి ముఖమును కనుగొనవచ్చును. ప్రేమ అయిన, దయ అయిన, కోపమైన, అసూయయైన కల్లయందు సులభముగ కనిపించును. దానినే కోపచూపు, దయా వీక్షణము, ఆశగ చూస్తున్నాడు అను మొదలగు మాటలు అక్కడక్కడ వినియే ఉందుము. దీనిని బట్టి కన్నులలో కొన్ని గుణములు కనిపించునని చెప్పవచ్చును.

**718. (10) ప్రపంచములో డబ్బును ఎన్నో రకాలు ఖర్చు పెట్టవచ్చును. ఏ విధానములో ఖర్చు పెట్టిన అన్నిటికంటే ఎక్కువ సార్థకమగును?**

జ. జ్ఞాన కార్యములకు.

**వివరము :** ప్రపంచములో డబ్బును మంచి కార్యములకు మరియు చెడు కార్యములకు ఖర్చు చేయవచ్చును. చెడు కార్యములు ఎన్నో ఉన్నా కొందరు మంచి కార్యములకు కూడ ఖర్చు పెట్టుచున్నారు. చెడు కార్యములకు ఖర్చు

పెట్టిన దానివలన పాపము మూట కట్టుకోవడము జరుగుచున్నది. మంచి కార్యములకు పెట్టినట్లయితే దాని వలన పుణ్యము వస్తున్నది. పాప పుణ్యములు రెండు కర్మయే అగును. వాటి వలన జన్మలే వచ్చుచుండును. పాపపుణ్యముల వలన ముక్తి కలగదని అందరికి తెలియును. మంచి చేసిన, చెడు చేసిన కర్మే వచ్చునని తెలిసిన కొందరు, వారి పనులకు వినియోగించుకోక దానములు చేయడము, పూజలు చేయించడము, ముడుపులు వేయడము చేస్తున్నారు. అట్లు చేసినప్పటికి పూజలు, ముడుపులు, దానముల వలన పుణ్యమే వస్తున్నది. కర్మ అంటని మార్గము పాపపుణ్యములు రాని వినియోగము ఒకటే ఒకటి గలదు. మన డబ్బును జ్ఞానమార్గములో వినియోగిస్తే జ్ఞానము కర్మాతీతమైనది కనుక పాపము పుణ్యములు రావు. జ్ఞానమున్న వానికి తెలుసు పూజలు, ముడుపులు, దానము జ్ఞానమార్గములో లేవని. అందువలన జ్ఞాని జాగ్రత్తగ దానములు ముడుపులకంటే మించిన జ్ఞానమునకే తన డబ్బును వినియోగించును. అట్లు వినియోగించిన డబ్బే సార్థకమగును. ధనవంతుడై డబ్బిచ్చి పూజలు చేయించిన, దానములు చేయించిన, ఏ దేవునికి ముడుపులువేసిన అవి పుణ్యము వరుసలో చేరిపోవును.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-08-12-2000**

**719. (1) చర్మమునకు స్పర్శలెన్ని?**

జ. ఆరు.

**వివరము :** శీతలము, ఉష్ణము, కరుకు, నునుపు, గట్టి, మెత్తని ఆరు స్పర్శలు గలవు. ఒకదానికొకటి వ్యతిరేఖముగ ఉంటూ వాటి వాటి ప్రత్యేకతలను తెలియజేసుకొనుచున్నవి. చర్మము మొత్తము ఆరు రకముల స్పర్శలను మనస్సు తన ద్వార లోపలి జీవునికి తెలియజేయుచున్నది. స్పర్శలు మూడు జతలుగ గలవు. ఈ మూడు జతలను జీవుడు నిత్యము అనుభవించుచున్నాడు.

**720. (2) నాలుకకు తెలియు రుచులు ఎన్ని?**

జ. ఆరు.

**వివరము :** నాలుకకు కూడ ఆరు రుచులు గలవు. అవి కూడ మూడు జతలుగ ఉంటూ మూడు జతలలో ఒక దానికొకటి వ్యతిరిక్తముగ ఉన్నవి. అవి చేదు తీపు, ఉప్పు పులుపు, కారము వగరు, అనునవి నాలుకకు రుచులుగ గలవు. ఈ రుచులనే జీవుడు నాలుక నుండి అనుభవిస్తున్నాడు.

**721. (3) చెవికి వినిపించు శబ్దములెన్ని?**

జ. ఏడు.

**వివరము :** చెవికి సప్త స్వరములను ఏడు శబ్దములు వినిపించుచున్నవి. ఎన్నో రాగములున్నను అన్నియు ఏడు శబ్దముల వలన పుట్టినవే. ఆ ఏడు స, రి, గ, మ, ప, ద, ని అనునవిగ ఉన్నవి. ఇవి స్పర్శలు రుచులున్నట్లు జతలుగ లేవు.

**722. (4) కన్నుకు కనిపించు రంగులెన్ని?**

జ. ఏడు.

**వివరము :** కంటికి కనుపించునది వెలుతురు. వెలుతురు సూర్య కిరణముల వలన ఏర్పడుచున్నది. ఒక సూర్య కిరణమును విడదీసిన ఏడురంగులుగ విభజింపబడును. వర్షాకాలము ఇంద్రధనస్సు అను ఏడురంగుల అర్ధ వలయ మేర్పడుట చూచియే ఉందుము. చర్మమునకు నాలుకకు తెలియబడునవి ఆరు స్పర్శలు, ఆరు రుచులు కాగ, చెవికి కన్నుకు తెలియునవి ఏడు శబ్దములు, ఏడు రంగులు. ఇక మిగిలిన ఒకే ఒక జ్ఞానేంద్రియమైన ముక్కుకు తెలియు వాసనలు రెండే రెండు ఒకటి సువాసన రెండవది దుర్వాసన. ఈ విధముగ జ్ఞానేంద్రియములు ఐదు వేరు వేరు శక్తులు కల్గి ఉన్నవి.

**723. (5) మోక్షములో సుఖమున్నదా?**

జ. లేదు.

**వివరము :** ప్రపంచములో సుఖము దుఃఖములుండును, కాని మోక్షములో సుఖ దుఃఖములుండవు. సుఖదుఃఖములులేని స్థితినే మోక్షమంటారు. ఇప్పుడున్న స్థితినుండి విడుదల పొందడమే మోక్షము. ఇప్పుడున్న స్థితివలె ఉండదు. అది ఇట్లుంటుందని చెప్పుటకు వీలు లేదు. మోక్షమనగా పరమాత్మలోనికి ఐక్యము కావడమే. బ్రతికివున్న వారికి ఎవరికి పరమాత్మ తెలియడు. మోక్షమన్నా ఎవరికి తెలియదు.

**724. (6) మనస్సుకు నాశనమున్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** శరీరములో మనస్సు ఒక భాగమై ఉన్నది. మరణసమయములో శరీరములోని అన్ని భాగములు నశిస్తు పోగ చివరిగ మనస్సు కూడ నశించి పోవును. జీవుడు శరీరమును వదలి పోవునపుడు మనస్సును, బుద్ధిని, చిత్తమును, అహమును అన్నిటిని కోల్పోయి చివరకు కాల, కర్మ, గుణ చక్రములతో సహా వేరు శరీరమును చేరుచున్నాడు. కావున మనస్సుకు మరణములో నాశనమున్నదని చెప్పవచ్చును.

**725. (7) జీవాత్మకు ఆకారమున్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** శరీరములోని అన్ని భాగములకు ఆకారముండడమేకాక జోడు ఆత్మలైన జీవాత్మకు ఆత్మకు కూడ ఆకారము గలదు. ఇంత వరకు ఎక్కడ ఎవరు జీవాత్మకు ఆత్మకు ఆకారమున్నట్లు చెప్పలేదు, వ్రాయలేదు. కావున ఈ మా మాట కొందరికి ఆశ్చర్యముగ కనిపించిన వాస్తవముగ జీవాత్మకు ఆకారమున్నది. జీవుడు స్థూలము కాదు కదా! సూక్ష్మము కదా దాని ఆకారమెట్లు కనిపించునని కొందరికి అనుమానము రావచ్చును. దానికి సమాధానము శరీరములో జీవుడేకాక సూక్ష్మమైనవి మనస్సు బుద్ధి చిత్తము అహము అను ముఖ్యమైనవి కూడ కలవు. వాటికి కూడ ఆకారములు గలవు. శరీరము దేవాలయము, ఆత్మ దేవుడు అని చెప్పబడు ఆత్మకు కూడ ఆకారము గలదు. చూచుటకు జ్ఞాననేత్రము కావాలి.

**726. (8) ఆత్మకు ఆయువున్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** శరీరములో జీవాత్మకు ఆయువు గలదు. అది కొంత కాలము ఒక శరీరములో ఉండి, అచట మరణము చెంది, వెంటనే వేరొక శరీరమును పొందుచున్నది. జీవుడు ఎచట ఉండునో అచట ఒక ఆత్మ తప్పనిసరిగ ఉండును. జీవాత్మ ఆత్మ రెండు జోడుగ ఉండునవి. ఏ శరీరములోను ఒకే ఆత్మ గాని, ఒకే జీవాత్మగాని ఉండవు. జీవాత్మ శరీరమును వదలినపుడు ఆత్మ కూడ వదలిపోవు చున్నది. జీవాత్మ ఏ శరీరములో ప్రవేశించునో ఆత్మ కూడ ఆ శరీరములోనే ప్రవేశిస్తున్నది. జీవునికి మరణమున్నది, కావున ఆత్మకు కూడ మరణమున్నట్లే. జీవాత్మకు ఆయుస్సు ఉన్నది, కావున ఆత్మకు కూడ ఆయుస్సు ఉన్నట్లేనని చెప్పవచ్చును.

**727. (9) బుద్ధికి హద్దు ఉన్నదా?**

జ. లేదు.

**వివరము :** ఇచట ప్రశ్న బుద్ధి పనికి మాత్రమే, కాని బుద్ధి ఆకారమునకు కాదు. బుద్ధి ఆకారమునకు హద్దు ఉన్నది కాని బుద్ధి పనికి హద్దు లేదు. బుద్ధి ఒక విషయమును ఎంతవరకైన యోచించగలదు. బుద్ధి యొక్క యోచనాశక్తి భూమి మీద విషయములనే కాక చంద్రమండలము, సూర్యమండలము, నక్షత్రమండలము వరకు తన యోచనలను ప్రాకించును. అందువలననే శాస్త్రజ్ఞులు ఎన్నో విషయములను కనుగొనుచున్నారు. బుద్ధి యోచనకు శక్తి నిచ్చువాడు ఆత్మేనని మరువకూడదు.

**728. (10) పరమాత్మకు శత్రువులున్నారా?**

జ. ఉన్నారు.

**వివరము :** పరమాత్మకు శత్రువులేమిటని ఆశ్చర్యముగ ఉండవచ్చును.

ప్రపంచమునకు ఆదికర్తయిన వానికి శత్రువులుంటారా అని అనుమానము రావచ్చును. పరమాత్మకు శత్రువులను పరమాత్మే తయారుచేసుకొన్నాడు. పరమాత్మ ఆజ్ఞతోనే శత్రువులున్నారు కాని ఎవరు స్వయముగ శత్రువులు లేరు. పరమాత్మకు మొదటి శత్రువు మాయ. మాయను పుట్టించినవాడు నియమించిన వాడు పరమాత్మయే. పరమాత్మ ఆజ్ఞతోనే మాయ శత్రుపాత్రను పోషిస్తున్నది. ఈ విధముగ రెండు పక్షములు ఏర్పడ్డాయి. పరమాత్మ పక్షము, మాయ పక్షము రెండు పక్షములు భూమి మీద గలవు. మాయ గుణములలో మునిగి ఉన్నవారంత మాయ పక్షము. పరమాత్మ జ్ఞానములో మునిగి ఉన్నవారంత పరమాత్మ పక్షము. ఇక్కడ విశేషమేమంటే పరమాత్మ పక్షము ఒక్క శాతము కాగ, మాయ శాతము 99 శాతమని చెప్పవచ్చును. పరమాత్మ పక్షములో ఒక్క శాతమున్నవారు కూడ బలహీనముగనుండగ, మాయ ప్రక్క ఉన్నవారు చాలా బలముగ ఉన్నారు. మాయ ప్రక్క ఉన్నవారంత పరమాత్మకు శత్రువులుగనే లెక్కించవలసి ఉన్నది.

## జ్ఞాన పరీక్ష

**కొత్తకోట** **తేది-01-01-2001**

**729. (1) జ్ఞానములు ఎన్ని రకములు?**

జ. రెండు రకములు.

**వివరము :** జ్ఞానములు రెండు రకములుగనున్నవి. ఒకటి ప్రకృతి జ్ఞానము రెండవది పరమాత్మ జ్ఞానము. ప్రకృతి జ్ఞానము అందరికి తెలిసినదే, పరమాత్మ జ్ఞానము ఎవరికి తెలియక తికమకపడుచున్నారు. భూమి మీద ఉన్న విద్యలన్ని ప్రకృతికి సంబంధించినవే. పరమాత్మ జ్ఞానము చాలా అరుదుగా ఉన్నది. పరమాత్మను తెలుసుకోవాలనుకొనువారు చాలా అరుదు. తెలుసుకోవాలనుకున్నా తెలియ చెప్పువారు లేక కొందరు, చెప్పిన అర్థము చేసుకోలేక కొందరు పూర్తి జ్ఞానమును అందుకోలేకపోవుచున్నారు.

**730. (2) యోగములు ఎన్ని రకములు, అవి ఏవి?**

జ. మూడు రకములు 1. బ్రహ్మ యోగము, 2. కర్మ యోగము, 3. భక్తి యోగము.

**వివరము :** యోగములు ముఖ్యముగ రెండేనని చెప్పవలెను. భగవద్గీతలో బ్రహ్మ యోగము, కర్మయోగమును గురించి ఎక్కువగ చెప్పి చివరిలో ప్రత్యేకమైన యోగముగ భక్తియోగమును చెప్పాడు. దానితో కూడ కలిపి చెప్పితే మొత్తము మూడు యోగములగును. పరమాత్మలోనికి ఐక్యమగుటకు జీవునికి మొత్తము మూడు మార్గములని వాటినే యోగములని తెలిపారు.

**731. (3) తపస్సు ఎన్ని విధములు?**

జ. ఒకే విధము.

**వివరము :** తపించడమును తపస్సు అంటారు. దేనిని గూర్చి తపించితే దానిని తపస్సని అంటారు. పూర్వము విష్ణువును గురించి, బ్రహ్మను గురించి, వివిధ దేవతలను గురించి లాభమును మనస్సులో పెట్టుకొని తపించడము జరిగినది. వారి తపస్సుకు ఆ దేవతలు ప్రత్యక్షమై వారికోర్కెలు నెరవేర్చిన సందర్భములు కూడ కలవు. తపస్సులు నియమములతో కూడు కొన్నవై ఉండును. ప్రపంచ కోర్కెల నిమిత్తము చేయబడునవి తపస్సులు. దేవుని నిమిత్తము చేయబడునవి యోగములు. యోగములకు తపస్సులకు ఎంతో తేడా గలదు. ప్రకృతికి సంబంధించినది తపస్సని తెలియవలెను.

**732. (4) ఇస్లామ్ మతములో త్రైత సిద్ధాంతమునకు సరిపడు గుర్తు ఏది?**

జ. హస్తము.

**వివరము :** ఇస్లామ్ మతములోని చంద్రవంక, నక్షత్రము, హస్తము, రెక్కల గుఱ్ఱము ఎంతో విశిష్టమైన దేవుని జ్ఞానముతో నిండుకొని ఉన్నవి. అందులో త్రైత సిద్ధాంతమును బోధించునట్లు త్రైత సిద్ధాంతమునకు సరిపడు హస్తము గలదు.

హస్తములోని మూడు రేఖలు త్రైత సిద్ధాంతమును బోధిస్తున్నవి. సంపూర్ణ జ్ఞాన చిహ్నమైన హస్తము ఇస్లామ్ మతములో కూడ ఉండడము సంతోషింపతగ్గ విషయము.

**733. (5) శ్వాసకు ఊపిరి అను పేరు ఎందుకొచ్చినది?**

జ. ఆత్మ చేత ఊదబడుటచేత.

**వివరము :** శరీరములోని శ్వాస తనంతటకదిలి ఆడుట లేదు. కొలిమి తిత్తిని ఊదునట్లు శరీరములోని ఆత్మశక్తి తనశక్తి చేత ఊపిరితిత్తులను లాగుచు శ్వాసను ఊదుచున్నది. శ్వాస ఊదబడుచున్నది కావున దానికి ఊపిరి అని పేరు వచ్చినది. శరీరములో ఆత్మ ఉన్నంత వరకు శ్వాసను ఊదుచుండును. ఆత్మ పోయిన వెంటనే శ్వాస నిలచి పోవును.

**734. (6) అహం ఎన్ని విధములు?**

జ. రెండు విధములు.

**వివరము :** శరీరములో అహము ఒక్కటే ఉన్నను అది రెండు రకముల పని చేయుట వలన దానిని రెండు విధములుగ చెప్పుచున్నారు. నేను శరీరమును అనుకొనుట ఒక రకమైన అహము కాగ, నేను జీవాత్మను అనుకొనుట రెండవ రకమైన అహమగును. శరీరము మొత్తము నేను అనుకొనుట అజ్ఞాన సంబంధమైన అహము. శరీరమును నేను కాను, శరీరములోని రవ్వంతైన జీవాత్మను నేను అనుకొనుట జ్ఞానపరమైన అహముగ తెలియవలెను. ఎంతో జ్ఞానము తెలిసినవారు తప్ప అందరు శరీరము నేనను అహమునే పొంది ఉన్నారు.

**735. (7) జ్ఞానము ప్రకారము శరీరములో సర్పముగా దేనిని పోల్చి చెప్పారు?**

జ. శ్వాసను.

**వివరము :** శరీరములోని శ్వాస పాము బుసకొట్టినట్లు శబ్దము చేయుచు ఆడుటవలన శ్వాసను సర్పముగ పోల్చి చెప్పారు. ప్రాణాయామ పద్ధతిలో శ్వాసను బంధించుటను కొందరు పాట రూపముగ "పాము బట్ట వస్తరేమన్నా" అని పాడారు. శ్వాసను పాముగ పోల్చి చెప్పిన తత్త్వములు కూడ ఎన్నో గలవు.

**736. (8) మన శరీరములో గుణము కాని గుణమేది?**

జ. సిగ్గు.

**వివరము :** సిగ్గు శరీరములో ఒక గుణము కాని గుణముగ ఉన్నది. వాస్తవానికి అది గుణము కాదు. మనకున్న 12 గుణములు పనిచేయుటను అప్పుడప్పుడు సిగ్గు నిరోధించుచుండును. ఏ గుణమునైన సరిగ పని చేయనట్లు చేయడమే సిగ్గు యొక్క పని. మనము మాటల సందర్భములో ఒక పనిని సరిగ చేయనపుడు ఏమి సిగ్గుపడుతున్నావే అనుట జరుగుచున్నది. మనిషి చురుకుగ లేనపుడు, అన్నము తినునపుడు బహుశ ఈ పదము వాడుతుంటాము. సిగ్గు అన్ని గుణముల మధ్య ఉండి వాటి పని సామర్థ్యము తగ్గించునదిగ ఉన్నది. కావున సిగ్గు గుణము కాని గుణమని పేరు గాంచినది.

**737. (9) మరణించిన చెట్టు శరీరములో శక్తి పనిచేయుచున్నదా?**

జ. పని చేయుచున్నది.

**వివరము :** బతికిన చెట్టులో మూడు ఆత్మలు గలవు. మరణించిన చెట్టులో ఒకే ఆత్మ గలదు. జీవాత్మ ఆత్మ పరమాత్మలు బ్రతికిన చెట్టులో ఉండగ, మరణించిన చెట్టులో జీవాత్మ ఆత్మ రెండు పోగ మూడవదైన పరమాత్మ మిగిలి ఉన్నది. పరమాత్మ బ్రతికిన మరియు చచ్చిన రెండిటిలోను గలదు. అన్నిటికి మూలమైనది పరమాత్మ. అండజ, పిండజములలోకంటే ఉద్భిజములైన చెట్లయందు పరమాత్మ శక్తి ఎక్కువగ ఇమిడి ఉన్నది. మూలశక్తియైన పరమాత్మశక్తి చెట్లయందెక్కువగ ఉండుట వలన వాటిని మూలిక అంటున్నాము. మూలిక అనగ మూలమైనశక్తి కలదని అర్థము. మరణించిన యోగుల శరీరములలో కొంత పరమాత్మ శక్తి ఉండి వారి సమాధుల

నుండి కూడ వారి శక్తి బయటికి వచ్చుచుండునని చెప్పినట్లు, మరణించిన చెట్లయందు కూడ మూల శక్తి ఇమిడి ఉండుటవలన వాటి వేర్లు కొమ్మలు కూడ మూలికలను పేరు కల్గినవి. మూలశక్తి ఉండు మూలికలు గొప్ప రోగమునైన బాగు చేయగలవు. చెట్టులో ఉన్న మూలశక్తే రోగమును లేకుండ చేయుచున్నదని తెలియనగును. ఒక్కొక్క చెట్టులో మూలశక్తి ఒక్కొక్క విధముగ ఉండుటవలన అనేక చెట్లు అనేక మూలికలుగ ఉంటూ చెట్టు చనిపోయిన వాటి కొమ్మలు, వేర్లు మూలికలుగ పనిచేయుచునే ఉన్నవి. పరమాత్మ భగవద్గీతలో నాశక్తి చంద్రుని ద్వార ఔషధములలో ప్రవేశిస్తు వాటికి ఔషధ గుణముల నిస్తున్నదని కూడ చెప్పాడు. కావున మరణించిన చెట్టులో కూడ గల పరమాత్మ ఔషధశక్తి ఇచ్చుచు, చెట్టును మూల పురుషుడున్న మూలికగ చేశాడు.

## 738. (10) దేవునికి దగ్గరగనున్న జీవరాసి ఏది?

జ. ఉద్భిజ జాతి.

**వివరము :** భూమి మీద పుట్టుకను బట్టి మూడు జాతులు కలవు. అవియే అండజ, పిండజ, ఉద్భిజములు. అండమనగా అండము (గ్రుడ్డు) నుండి పుట్టినవి. పిండజమనగ పిండము నుండి పుట్టినవి. ఉద్భిజమనగ భూమి నుండి పుట్టినవి. ఈ విధముగనున్న మూడు జాతులను మరియొక విధముగ ఎవరు ఇంతవరకు చెప్పని విధముగ విభజించడము జరిగినది. ఒకటి పైకి పెరుగునవి వృక్ష జాతులు, రెండు అడ్డముగ పెరుగునవి జంతు జాలము, మూడు క్రిందికి పెరుగునది ఒకే ఒక మనిషి జాతి. ఈ మూడు జాతులలో పైకి పెరుగు ఉద్భిజములు దేవునికి దగ్గరగనున్నవి. అడ్డము పెరుగు అండజములు మరియు పిండజములైన జంతు క్రిమికీటకాదులన్నియు దేవునికి మధ్య దూరములోనున్నవి. పిండజమైన ఒకే ఒక మానవజాతి మాత్రము దేవునికి చాలా దూరముగనున్నది. కర్మలు అనుభవించడములోను, సంపాదించడములోను అన్నిటికంటే మానవునిదే పై చేయిగ ఉంటు దేవునికి దూరముగనున్నాడు.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-03-02-2001**

**739. (1) ఆది నుండి పరమాత్మ మొత్తము ఎన్ని భాగములుగ ఉన్నది?**

జ. నాలుగు భాగములుగ.

**వివరము :** పరమాత్మ మూడు భాగములుగ శరీరములోనున్నదని దానినే త్రైతమంటున్నామని చెప్పి, ఇపుడు నాలుగు భాగములంటారేమిటి? అని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి జవాబు ఏమనగా! ఇపుడు శరీరములో ఉండేది జీవాత్మ ఆత్మ పరమాత్మలను మూడు భాగములుగ ఉండినప్పటికి మొదట ఆదిలో పరమాత్మ ఎన్ని భాగములుగ విభజన జరిగినదో చూడవలసి ఉన్నది. ప్రపంచమేలేనపుడు, పరమాత్మ ఒక్కటే ఉన్నపుడు, ఆదిలో పరమాత్మ మొదట ప్రకృతిని తన నుండి ఒక భాగము చేసినది. తర్వాత జీవాత్మను ఆత్మను కూడ భాగములు చేసినది. ఆదిలో 1. ప్రకృతి, 2. జీవాత్మ, 3. ఆత్మ, 4. పరమాత్మ అను భాగములుగ విడువడుట వలన పరమాత్మ మొదట నాలుగు భాగములుగ తయారైనదని చెప్పవచ్చును. ప్రకృతి చేత శరీరము, పరమాత్మ చేత శరీరములో జీవాత్మ ఆత్మలు మెలగుచున్నవి. ఈ విధానమును బట్టి పరమాత్మ ఆదిలో నాలుగు భాగములైనాడని చెప్పవచ్చును.

**740. (2) మాయ మొత్తము ఎన్ని రకములుగనున్నది?**

జ. 108 రకములుగ.

**వివరము :** మాయ అనగ గుణముల సమ్మేళనమని, మాయ గుణముల రూపముతో తలలో ఉన్నదని చాలా మార్లు చెప్పుకొన్నాము. మాయ అనేక రూపములతో అనేక రకములుగ మానవుని పీడించుచున్నప్పటికి మాయ అనునదొకటున్నదని కూడ మనిషికి తెలియదు. అనేక విధానములుగ పీడించు మాయను ఒక పద్ధతిగ

లెక్కపెట్టి ఇన్ని భాగములుగ ఉన్నదని చెప్పవచ్చును. గుణములు 12 అని తెలుసుకొన్నాము. ఒక్కొక్క గుణము 9 భాగములుగ మారిపోయినదని కూడ చెప్పుకొన్నాము. ఒక్క భాగములోని 12 గుణములు 9 భాగములయితే మొత్తము 108 గుణములగును. 54 శత్రు వర్గము 54 మిత్ర వర్గము మొత్తము 108. పూసల దండ, జపమాలలో 54 పూసలు కాని 108 పూసలు కాని ఉండుట గమనించి ఉందురు. 54 పూసలదండలు గుణముల వర్గములను తెలియ జేయునట్లుంచారు. 108 పూసలు మాయకు చిహ్నాము చేసి మాయ ప్రపంచముండు నని, ప్రపంచము 108 కోట్ల సంవత్సరములుండునని, అంతవరకు 108 గుణములు ప్రభావముండునని తెలియునట్లు పూసలను మాలలలో అమర్చారు. మాయ ప్రపంచములో ఎన్ని సంఘటనల రూపములలోనున్న, ఎన్ని క్రియలుగ ఉండిన దానికి మూలము 108 రకములుగనున్నదని లెక్క చెప్పవచ్చును.

**741. (3) అబద్ధమాడి పెళ్లి చేయవచ్చునన్నారు. ఎన్ని అబద్ధములు?**

జ. ఒకటి.

**వివరము :** బంధము కట్టబడునది, బంధనము కట్టివేయునది తాడు అని అర్థము గలదు. బద్ధము కట్టివేయబడినది లేక కట్టి వేయబడినవాడు అని కూడ అర్థము గలదు. భూమి మీద మనుషులందరు తాడుతో కట్టి వేయబడకుండిన, కర్మ అను తాటితో బంధింపబడి కర్మబద్ధులని పేరుగాంచి ఉన్నారు. జన్మించిన సర్వ జీవరాసులను కర్మబద్ధులనియే చెప్పవచ్చును. జీవునితోపాటు ఆత్మ జోడుగ ఉంటూ జీవుడు కర్మను అనుభవిస్తుండగ, ఆత్మ కర్మ ప్రకారము పనులు చేయుచున్నది. దీని ప్రకారము చూస్తే ఆత్మ కూడ కర్మాచరణ చేయుచున్న కారణమున మరియు జీవునితోపాటు జోడుగ ఉండుట వలన, జీవుడు విడుదలైతే తాను విడుదల పొందుటవలన ఆత్మ కూడ కర్మబంధువై ఉన్నది. జీవాత్మ ఆత్మలు రెండు కర్మబద్ధములై ఉండగ, పరమాత్మ ఒక్కడు కర్మ చేతగాని మరి ఏ ఇతరముల చేత గాని బంధింపబడక అనగా బద్ధుడుకాక అబద్ధుడై ఉన్నాడు. దీనినిబట్టి బద్ధముగ ఉండువారు జీవాత్మ ఆత్మలు కాగ, అబద్ధముగ ఉండువాడు పరమాత్మ.

జీవాత్మ జ్ఞానమును తెలిసి, కర్మను నశింపజేసుకొని, పరమాత్మలోనికి ఐక్యము కావడమును మోక్షము అంటాము. మోక్షమును ముక్తి అని, విడుదల అని, పరమ పదమని ఎన్నో విధముల పిలిచిన అది పరమాత్మలోనికి ప్రవేశించడమే అగును. పరమాత్మలోనికి ప్రవేశించిన తర్వాత పరమాత్మే అగును. దానినే పూర్వము పెళ్లి అని కూడ జ్ఞానులు అనెడివారు. పెళ్లి అను పదమునకు సరియగు అర్థము పరమాత్మలోనికి జీవుడు ఐక్యమవడము, పరమాత్మగ మారిపోవడము. పరమాత్మకు గుర్తింపుగ పలుకబడునది పెళ్లి. సర్వ జీవరాసులకు పరమాత్మ తండ్రియగును. అందువలననే వివాహ సమయములో యువతీ యువకుని పెళ్లి కూతురు, పెళ్లి కొడుకు అంటున్నాము. వివాహము చేసుకొను యువతీ యువకుడు ఒకే తండ్రి బిడ్డలన్న మాట. వివాహ సమయములో జీవుడు మోక్షము పొందుటకు కావలసిన జ్ఞానమునంతయు పెళ్లి కొడుకు, కూతురుకు వివాహతంతు కార్యములతో చేయించి, దాని ద్వార వారు మోక్షము పొందునట్లు పద్ధతిని పూర్వము తెలిపెడివారు. పెళ్లి అనగ మోక్షమని, పెళ్లి సాంప్రదాయ పనులన్ని పరమాత్మను పొందు మార్గముల యొక్క సూచనలని, వాటి ద్వార చివరకు నక్షత్ర దర్శన కార్యముతో పెళ్లి పూర్తి అయినట్లు, పరమాత్మను పొందినట్లు భావించి చెప్పెడివారు. చివరకు మోక్షము పొందడమును పెళ్లి అయిపోయిందనెడివారు. వివాహ సమయములో కూడ నక్షత్ర దర్శనముతో పెళ్లి అయిపోయిందనెడివారు. దీనిని బట్టి ఆధ్యాత్మిక అర్థము ద్వార పెళ్లి అనగా మోక్షమును పొందడమని అర్థము. ఇక్కడ ప్రశ్న పెళ్లి చేయుటకు ఎన్ని అబద్ధములాడవలెనని అడుగుచున్నారు.

వివాహ సమయములో చేయించు పనులన్ని జ్ఞానసంబంధమై ఉండి చివరకు మోక్షమును చేర్చునవై ఉన్నవి. ఒక్క మారు మోక్షమును పొందినవాడు ఇక రెండవమారు పొందడమనేది లేదు. ఒక్కమారు పరమాత్మను పొందిన జీవుడు తాను కూడ పరమాత్మగానే మారిపోవును. కనుక మోక్షము ఒకమారేనని తెలియాలి. పరమాత్మ బద్ధుడుకాదని, అబద్ధుడని ముందే చెప్పుకొన్నాము. బద్ధుడైన జీవున్ని అబద్ధుడైన పరమాత్మలోకి కలుపడము గురువు యొక్క పని. గురువు శ్రమపడి

ఒక్క మారు జీవున్ని మోక్షము పొందిస్తే జీవుడు పరమాత్మగ మారిపోగలడు. ఆ విషయమునే గురువు ఒక్క అబద్ధముతో శిష్యునికి పెళ్లి చేయునన్నారు. పెళ్లి అగుటకు ఎన్నియో అబద్ధములు అవసరము లేదు. ఒక్క అబద్ధముతోనే పెళ్లి చేయవచ్చును. ఇది జ్ఞాన సంబంధమైన మాట. ఈ జ్ఞానము అర్థము కాని వారు ప్రపంచపరముగనున్న వివాహమును పెళ్లియనుకొని, అసత్యములను అబద్ధములను కొని, ఇష్టమొచ్చినన్ని చెప్పవచ్చునని, కొందరు నూరని, మరి కొందరు వేయి అని చెప్పుకొన్నారు. ఈ విషయమును జ్ఞానపరముగ చూచినట్లయితే పెళ్లికి ప్రత్యేక అర్థముందని, ఆ సమయములో జరుగు కార్యములన్ని పవిత్రమైన జ్ఞానయుక్తము లని, జీవితములో అలా నడచితే మోక్షము పొందవచ్చునని తెలియుచున్నది. పూర్వము జ్ఞానము తెలిసిన బ్రహ్మజ్ఞానులు వివాహము జరిపిస్తు ఈ పని చేయవలెనని, ఈ అర్థముతోనే ఈ పని చేయుచున్నామని, ఇట్లు చేయుదానినే పెళ్లి అని చెప్పి చేయించెడివారు. ప్రస్తుత కాలములో పెళ్లికి అర్థము తెలియదు. చేయించేవారు జ్ఞానులు కాదు, చేసేవారు ఇష్టము లేకున్నా చేయుచున్నారు. సాంప్రదాయములు పేరుకు మాత్రమున్నవి కాని అర్థరహితమై పోయినవి.

**742. (4) మొదట పరమాత్మ స్త్రీయా? పురుషుడా?**

జ. ఏదీ కాదు.

**వివరము :** ప్రపంచము పుట్టక పూర్వము మొట్టమొదట పరమాత్మ స్త్రీ కాదు, పురుషుడు కాదు. ఏదికాని పరమాత్మ ప్రపంచమును పుట్టించుటకు సంకల్పించి నపుడు మూలమైన తనకు ఒక ఆధారముగ ప్రకృతిని తయారు చేశాడు. ప్రకృతిని స్త్రీ తత్త్వముగ తయారు చేసి తను పురుష తత్త్వముగ నిలచిపోయాడు. స్త్రీ పురుషులవలననే సంతాన అభివృద్ధి జరుగునట్లు యంత్రాంగమును అమర్చి అందరికి తల్లిగ ప్రకృతిని, అందరికి తండ్రిగ పరమాత్మ ఉండి సకల జీవరాసులను ప్రపంచములో వృద్ధి చేశారు. వంశ లక్షణములన్నట్లు పురుషత్త్వము, స్త్రీ తత్త్వము ఉండునట్లు రెండు జాతుల శరీరములను భూమి మీద ఉండునట్లు చేశారు. తల్లి

తండ్రి వరుసలు భూమి మీద ఉండునట్లు చేశాడు. దీనినంతటిని బట్టి చూచినట్లయితే మొదట ప్రపంచము పుట్టక పూర్వము పరమాత్మ ఏది కాదు. ప్రపంచము పుట్టిన తర్వాత పరమాత్మ పురుషుడుగ లెక్కించబడుచున్నాడు. మొదట ఏది కాని పరమాత్మను మనము మాటల సందర్భములో అది అని, అతను అని, పరమాత్మ ఉంది అని, పరమాత్మ ఉన్నాడు అని, రెండు రకములుగ ఆడదిగ మగదిగ చెప్పుచున్నాము. నిజముగ పరమాత్మను ఆడ మగ అని నిర్ణయించలేము. చెప్పుకొనుటకు పద్ధతిగ భగవద్గీతలో భగవంతుడే తనను పురుషుడని ప్రకటించు కొన్నాడు.

### 743. (5) జీవాత్మ ఆడదా మగదా?

జ. ఆడ లక్షణములున్న మగది.

**వివరము :** పురుషుడైన పరమాత్మ నుండి మరి రెండు ఆత్మలు విభజింపబడినవి. అవియే ఆత్మ, జీవాత్మ. పరమాత్మ, ఆత్మ, జీవాత్మ ముగ్గురు పురుషులే అని, అందులో పరమాత్మ ఇద్దరి పురుషులకంటే ఉత్తముడైన పురుషోత్తముడని కూడ చెప్పబడినది. భగవద్గీత ప్రకారము ప్రకృతి స్త్రీ కాగ, ముగ్గురు పురుషులలో జీవాత్మ కూడ పురుషుడే. ప్రపంచములో పురుషుడు స్త్రీని గుర్తించుటకు వారి మర్మావయములే కారణము. లింగమును బట్టి పురుషుడని, యోనిని బట్టి స్త్రీ అని గుర్తించుచున్నాము. భూమి మీద పురుషాకారముతో పుట్టిన పురుషులలో స్త్రీ లక్షణములు కల్గి స్త్రీలవలె ప్రవర్తించు స్వభావముగల్గిన పురుషులెందరో పుంసత్వము లేనివారిగ నపుంసకులుగ ఉండుట మనము చూస్తూనే ఉన్నాము. అలాగే ముగ్గురు పురుషులలో ఒక్కడైన జీవాత్మ పేరుకు పురుషుడైనప్పటికి ప్రకృతితో కూడుకొన్నవాడై, ప్రకృతి లక్షణములు తనయందు ఇమిడి ఉండుట వలన, పరమాత్మ ఆత్మలవలె స్వచ్ఛమైన పురుషుడు కాదని తెలియుచున్నది. పరమాత్మ ఆత్మ స్వచ్ఛమైన పురుషులు కాగ, అంతటివాడు జీవాత్మ గాక ఆత్మ పరమాత్మలవలె పురుషత్వము లేనివాడై నపుంసకుడై ఉన్నాడు. భూమి మీద ఆకారములో పురుషునిగ కనిపిస్తు,

లక్షణములలో స్త్రీగ తెలియు నపుంసకులవలె జీవాత్మ పేరుకు పురుషునిగ ఉంటు ప్రకృతి వాసనలతో కూడుకొన్నవాడై, పూర్తి పురుషుడు కాక, ముందర ఆడ వెనక మగ అన్నట్లు సగము పురుషునిగ సగము స్త్రీగ ఉన్నాడు. జీవాత్మ పరమాత్మ అంశయై పురుషుడైనప్పటికి పరమాత్మవలె పురుషుడు కాక ప్రకృతితో కూడుకొని ప్రకృతి లక్షణముతో ఇమిడి ఉన్నవానిగ గలడు. ఎప్పుడైతే జ్ఞానమును తెలిసి తనయందున్న ప్రకృతి లక్షణముల నుండి బయటకు వచ్చినపుడు పూర్తి పురుషునిగ మారి పరమాత్మయందైక్యమగును.

**744. (6) భార్యలేని వానిని వెదవ, భర్త లేనివారిని విధవ అంటాము. నీవు ఎవరివి?**

జ. విధవ.

**వివరము :** పరమాత్మ అన్ని తానై మూలపురుషుడై ఉండుట వలన ఆయనను అనేక రకములుగ పిలుస్తున్నాము. ఏ విధముగ పిలిచిన ఆయన ఆయనే. గీత యందు అందరిని పుట్టించుటలో బీజదాతగ ఉండుటవలన, ఆయన తండ్రి అని చెప్పబడినది. అంతేకాక జగత్తును భరించు మూలశక్తి, కనుక జగద్భర్త అని కూడ చెప్పబడినది. ఒక మనిషికి పరమాత్మ అన్ని వరుసలు ప్రకారమున్నాడని చెప్పవచ్చును. సందర్భానుసారము అర్థము చేసుకోవాలి. ఇచట భార్య భర్త విషయమైవచ్చినపుడు ఆధ్యాత్మికరీత్యా జీవునికి భర్త పరమాత్మయే. ప్రపంచ పద్ధతిలో ప్రతి స్త్రీకి ఒక భర్త ఉండనే ఉండును. భర్తలేని భార్యను విధవ అనడము జరుగును. ఓ కుంటుంబములో భర్త చనిపోయి భార్య మిగిలితే ఆమెను విధవ అని సమాజములో కొంత చిన్న చూపు చూడడము జరిగెడిది. ఆమె భర్త చనిపోయిన తర్వాత భూమి మీదనే ఆమె భర్త మరి ఒకచోట పుట్టి రూపము మారి ఉండుట వలన భర్తను చూచినప్పటికి భార్య గుర్తించలేదు. విధవలైన తర్వాత తమ భర్తలను పూర్తి మరచిపోయిన వారు సంవత్సరమునకొకమారు జ్ఞాపకము చేసుకొనువారు గలరు. పూర్తి భర్త జ్ఞాపకము కల్గిన వారు చాలా అరుదుగా ఉందురు.

ఆధ్యాత్మికరీత్యా జీవునికి భర్త పరమాత్మయేనని చెప్పుకొన్నాము. మరణము అను మార్పుతో భార్య భర్తను గుర్తించలేనట్లు, కర్మ అను మార్పుతో జీవుడు పరమాత్మను గుర్తించలేక పోయాడు. అంతేకాక విధవ స్త్రీ తన భర్త జ్ఞాపకమునే మరచిపోయినట్లు, జీవుడు ప్రకృతిలో చిక్కుకొని పరమాత్మ జ్ఞాపకమే లేకుండ పోయాడు. పరమాత్మ అణువణువున వ్యాపించి ఉన్నప్పటికి భర్తలేని వానిగ జీవాత్మ ఉండుటవలన జీవున్ని విధవ అంటున్నాము. అట్లు మనము ఇపుడు విధవలుగ చాలామంది ఉన్నప్పటికి, కొందరు మాత్రము తమ భర్త పరమాత్మయని, అదే దీక్షతో జ్ఞానమును తెలుసుకొంటూ పతియే తమ వ్రతముగా కల్గి ఉండుటవలన వారిని పతివ్రత జీవులని అనవచ్చును. అటువంటివారు తొందరలోనే తమ భర్తయైన పరమాత్మను కలుసుకోగలరు. భూమి మీద పరమాత్మ జ్ఞాపకము, జ్ఞానములేని జీవులందరు విధవలే అగుదురు.

### 745. (7) ఆత్మ శరీరమంతటా వ్యాపించి ఉన్నదా?

జ. రవ్వంత మాత్రము వ్యాపించి లేదు.

**వివరము :** ఇంతవరకు ఆత్మ శరీరమంతట వ్యాపించి ఉన్నదని చాలా మార్లు చెప్పుకొన్నాము. ఇక్కడ ఈ ప్రశ్నకు సమాధానములో లేదు అని చెప్పగ చాలా మందికి ఇది సరియైన జవాబేనా అని అనుమానము వచ్చి ఉంటుంది. దీనికి వివరమేమనగా ఆత్మ శరీరములో వ్యాపించి ఉండుట నిజమే, అయినప్పటికి శరీరములో ఒక్క చోట కొంత భాగము మాత్రమే వ్యాపించి లేదు. కావున అంతటా అనుమాటకు అంతటాలేదని చెప్పవలసి వచ్చినది. శరీరములో ఆత్మ జీవాత్మ రెండు ఉండుట నిజమే. శరీరములో అన్ని అవయవములను చర్మము వరకు, వెంట్రుకల వరకు ఆత్మ వ్యాపించి ఉండుట నిజమే. జీవునిలో మాత్రము ఆత్మ లేదు. శరీరములో జీవాత్మ ఉన్న చోట ఆత్మ లేకుండుట వలన, జీవుని ఆకారమును ఆత్మ ఆక్రమించి లేకుండుట వలన, శరీరములో జీవాత్మ ఉన్నంత వెలితి కల్గి మిగత భాగమంత వ్యాపించి ఉన్నదని చెప్పవచ్చును. జీవాత్మ శరీరములో రవ్వంత,

చీమంత పరిణామములో ఉన్నాడని అతనికి ఆకారమున్నదని చెప్పుచున్న మనము ఆ రవ్వంత మాత్రము ఆత్మ లేకుండ మిగత శరీరములో అంతటా ఉన్నదని, ఆ కొద్ది మాత్రము లేనందువలన శరీరమంతట ఆత్మ లేక జీవాత్మను వదలి మిగత భాగమంత వ్యాపించి ఉన్నదని చెప్పవచ్చును.

**746. (8) భూమిలో భూకంపమొచ్చుటకు మూడు ఆత్మలలో ఏ ఆత్మ పని చేయుచున్నది?**

జ. రెండవ ఆత్మ.

**వివరము :** భూమి స్థూలశరీరము కాగ అందులో జీవుడు, ఆత్మ రెండు గలవు. అన్ని ప్రాణులకు గ్రహింపుశక్తి ఉన్నట్లు భూమికి కూడ బుద్ధి గ్రాహితము, కర్మ అనుభవము గలవు. ఈ మా మాటలు కొందరికి విచిత్రముగ తోచినప్పటికి ఇది వాస్తవమే. గ్రహించునది కావున భూమిని గ్రహము అంటున్నాము. శరీరములో మనకు అనేక రోగాలు ఆత్మ వలననే కర్మరీత్యా చెలరేగుచున్నవి. అలాగే ఆత్మ భూగ్రహముకు కూడ రోగములను రుగ్మతలను తెప్పించి అనుభవింపజేయు చుండును. భూమికి వచ్చు రోగములలో అన్ని తెలియకుండిన కొన్ని మాత్రము తెలియుచున్నవి. అవియే భూమి మీద జరుగు ఉపద్రవములు, భూకంపములు, అగ్నిపర్వతములు ప్రేలుట, సముద్రములో బడబాగ్ని లేపు భీబత్సము మొదలగునవి మనకు తెలియుచునే ఉన్నవి. అంతే కాక మనకు చీమలు దోమల బాధ ఉన్నట్లు అప్పుడప్పుడు బాంబులు మొదలగు బాధలు భూమికి ఉన్నవి. ఇట్లు ఆలోచించిన భూకంపము ఆత్మ వలననే భూమికి గల కర్మరీత్యా జరుగుచున్నదని తెలియుచున్నది.

**747. (9) శరీరములో అప్పుడప్పుడు నిద్ర పోవు ఆత్మ ఏది?**

జ. ఏ ఆత్మ నిద్రపోదు.

**వివరము :** ఆత్మలు మూడు నిద్రపోవునవి కావు. ఆత్మలకు నిద్రలేదు. ఆత్మలకు రాత్రి పగలు కలవు, గాని నిద్ర మెలుకువలు లేవని గ్రహించాలి. నిద్ర శరీరములోని

ఒకే ఒక మనస్సుకు కలదు. మనస్సు నిదురించునపుడు జీవునికి విషయములు తెలియక పోవుచున్నవి. కాని ఆత్మ జీవాత్మ నిద్రించలేదని ముందు కూడ తెలుసుకొన్నాము.

**748. (10) ఎన్నో మహత్యములు చేయు బాబాలు మొదలగువారి యందు దైవశక్తి కలదా?**

జ. లేదు.

**వివరము :** ప్రపంచములో దైవముకంటే ఎక్కువ శక్తియైనది మాయ. అది దైవమువలె తననే నమ్మునట్లు చేయగలదు. ఆ పనిలో భూమి మీద ఎన్నో మహత్యములను ఒక మనిషి ద్వార చూపించి అందరు అతనిని నమ్మునట్లు చేసి, అతడు చూపు మార్గమే సరియైనదని అతను చెప్పునదే నిజమైన జ్ఞానము అనునట్లు చేయుచున్నది. అందువలన చాలామంది మహత్యములను చేయు బాబాలనే దైవములని నమ్మి అసలు దేవుని విషయమును తెలియలేక పోవుచున్నారు. దేవుడు భగవంతునిగ పుట్టితే జ్ఞానాగ్నికి ఈ శక్తి గలదను నిరూపించు నిమిత్తము మానవుని కర్మను కాల్చి లేకుండ చేయగలడు. అదే దేవుని మహత్యము. మాయ మహత్యము ఏదైన చేయగలదిగ ఉండి తననే నిజదైవమని నమ్మి తనవైపు వచ్చునట్లు చేయు సత్తాగలది. కనుక మహత్యములు చేయు బాబాలందు దైవశక్తి లేదని మాయశక్తి కలదని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**చెన్నేకొత్తపల్లి** **తేది-03-03-2001**

**749. (1) దేవుడు ధర్మయుక్తుడా, అధర్మ యుక్తుడా?**

జ. ధర్మ, అధర్మ యుక్తుడు కాదు.

**వివరము :** ఇచట పరమాత్మను దేవుడని చెప్పడము జరిగినది. పరమాత్మ ధర్మాలకు అధర్మాలకు అతీతమైన వాడు. ధర్మములు అధర్మములనునవి దేవున్ని తెలియు

మార్గములు. అవి మానవునికి అవసరము, మానవుడు ధర్మయుక్తునిగ ఉంటే దేవుని తెలియగలడు. అధర్మయుక్తునిగ ఉంటే దేవుని తెలియలేడు. ధర్మములు మానవుని ఎడల తప్ప దేవుని ఎడల ఉండునవికావు. ధర్మములు జ్ఞానము ద్వార తెలియబడునవి. ధర్మాచరణే యోగమగును. ధర్మములను పరిత్యజించి కూడ దేవుని తెలియవచ్చును. భగవద్గీతలో తనను తెలియుటకు ధర్మములను బోధించి చివరలో ధర్మములను వదలి కూడ తనను పొందుటకు మార్గమున్నదని చెప్పాడు. కావున దేవుడు ధర్మ, అధర్మయుక్తుడు కాడు. ఏ ధర్మములు నియమములు దేవుని శాశించలేవు.

**750. (2) దేవుడు నిజముగా ఉన్నాడా?**

జ. నిజముగా లేడు.

**వివరము :** దేవుడు అబద్ధముగా ఉన్నాడు, నిజముగ లేడు. దేవుడు అబద్ధుడని ముందే తెలుసుకొన్నాము. నిజము అనగా పుట్టియున్నది, ప్రత్యక్షముగ ఉన్నది అని అర్థము. నిజ అను పదము పుట్టియుండు జీవునికి సరిపోతుంది. కర్మ బంధముతో పుట్టని దేవునికి సరిపోదు. “జ” అనగ పుట్టడము “నిజ” అనగా పుట్టి ఉండడము. కర్మబంధముతో పుట్టి ఉండువానిని నిజముగా ఉన్నవాడు లేక ప్రత్యక్షముగ ఉన్నవాడు అనుట సరిపోవును. దేవుడు కర్మబద్ధుడు కాడు, ఆయన పుట్టి ఉండలేదు, ప్రత్యక్షముగ లేడు. కనుక దేవుడు నిజముగ లేడు, అబద్ధముగ ఉన్నాడని చెప్పవచ్చును.

**751. (3) జీవునికి అహముకు మధ్యలో ఎవరున్నారు?**

జ. పరమాత్మ.

**వివరము :** శరీరములో గాని, శరీరము బయట గాని అణువణువున వ్యాపించి ఉన్నవాడు పరమాత్మ. శరీరములో జీవుడు అహము, చిత్తము, బుద్ధి పొరల మధ్యలో ఉండి గుండ్రని ఆకారముతో నున్నాడు. జీవునికి అహమునకు మధ్యలో రెండు అంతరంగములు కాక ఉన్నది పరమాత్మ. జీవునిలోను, అహములోను, జీవునికి అహమునకు మధ్యలోను వ్యాపించి ఉన్నది పరమాత్మ.

**752. (4) యోగము అను పదములో ఎన్ని అక్షరములు గలవు?**

జ. ఒకటే.

**వివరము :** యోగము అనగ కలయిక. జీవాత్మ ఆత్మతో కలియడమును యోగము అంటాము. జీవాత్మ ఆత్మతో కలసినపుడు జీవాత్మ అనువాడు లేకుండ ఆత్మ ఒక్కటే ఉన్నట్లు లెక్కించబడుచున్నది. ఆత్మయందు జీవాత్మ మిలితమైనదన్నమాట. యోగము పొందనంతవరకు జీవాత్మ ఆత్మ పరమాత్మలుగ నున్న మూడు ఆత్మలలో పరమాత్మ మినహా ఒకడు క్షరుడు రెండవవాడు అక్షరుడున్నారు. జీవుడు నాశనమగువాడు గనుక క్షరుడని ఆత్మ నాశనముగాదు కనుక అక్షరుడని చెప్పారు. యోగము పొందినపుడు జీవాత్మ లేకుండ ఆత్మమాత్రము మిగులుచున్నది. గనుక యోగములో అక్షరమొకటి ఉన్నదని చెప్పవచ్చును. అక్షరము ఒకటి అనగా నాశనము గాని ఆత్మ ఒకటి గలదని అర్థము. అంతవరకు త్రైతముగనున్న శరీర వ్యవస్థ ద్వైతముగా మారిపోయినదని అర్థము చేసుకోవలెను. యోగములో అక్షరుడొక్కడు గలడు పరమాత్మయు గలడు. ఆత్మ పరమాత్మలు రెండే ఉండుట వలన ఆ సమయమును ద్వైతము అంటున్నాము. జీవుడు ఆత్మ రెండు పరమాత్మలో కలిసినపుడు అద్వైతము అనగలము. మోక్షము పొందినపుడు అద్వైతము, యోగము పొంది జీవుడు లేక ఆత్మ పరమాత్మలు ఇద్దరున్నపుడు ద్వైతము, సాధారణ స్థితిలో జీవాత్మ ఆత్మ పరమాత్మలున్నపుడు త్రైతము అని అనగలము.

**753. (5) గీతలో ధర్మయుక్తములైన యోగములు ఎన్ని గలవు?**

జ. రెండు.

**వివరము :** భగవద్గీతలో ధర్మ యుక్తములైన యోగములు కలవు. ఒకటి ధర్మాతీతమైన యోగము కలదు. గీతలో 95 పాళ్ళు ధర్మయుక్తములైన మార్గములను బోధించి, 5 పాళ్ళు ధర్మాతీతమైన జ్ఞానము బోధించాడు. కర్మయోగము, బ్రహ్మయోగము రెండు ధర్మములతో కూడుకొన్న యోగములు కాగ, భక్తియోగ మనునది ధర్మాతీతమైనది.

**754. (6) బుద్ధికి వయస్సు ఉన్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** శరీరములోని ప్రతి భాగమునకు వయస్సు ఉన్నది. మరణములో అన్నియు నశించి పోవుచున్నవి. కొన్ని మరణము కంటే ముందు కూడ పోవుచున్నవి. జీవుడు శరీరము వదలి పోవునది మరణము. మరణములో జీవుడు నాశనము కాడు. జీవుడు తన సహచర బృందమైన అవయవ కూడలి నందరిని వదలి ఆత్మతో పాటు మరొక శరీరమును చేరుచున్నాడు. జీవుడు శరీరము వదలు సమయానికి మనస్సుతో పాటు బుద్ధి చిత్తము మొదలగు అవయవములన్ని నశించిపోవుచున్నవి. కావున బుద్ధికి కూడ ఆయుస్సు కలదని చెప్పుచున్నాము. మరణముకంటే ముందు కూడ కొన్ని అవయవములకు ఆయువు తీరిపోవుట వలన అవి పనిచేయుట మానుకొనును. కావున అన్నిటికి ఆయువు మరియు వయస్సు గలదు.

**755. (7) జీవునికి ఆకలి ఉన్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** ఆకలికి ఆహారము తృప్తినివ్వ గలదు. జీర్ణాశయములో కలుగు ఆకలి జీవున్ని బాధకు గురిచేయును. ఆహారముతో ఆ బాధ పోవును. జీవునికి ఆహారము వేరు, జీర్ణాశయానికి ఆహారము వేరు. శరీరమువేరు, జీవుడు వేరు, శరీర పోషణకు ఆహారము ఉపయోగపడును. ఆహారము ద్వార జీవునికి అనుభూతులు కల్గును. ఆహారము ద్వారానేకాక విషయములన్ని జీవునికి అనుభూతులే కావున అనుభూతులన్ని జీవునికి అనుభవములే, ఎన్ని అనుభవములున్న జీవునికి తృప్తిలేదు. నిజమైన ఆహారము తినువరకు జీవుని ఆకలి తీరదు. జీవునికి ఆహారము శరీరమునకు ఆహారము రెండు విధములు గలవు. ఆహారములలో జీవునికి తృప్తి నిచ్చు ఆహారము జ్ఞాన అనుభవము. జ్ఞాన ఆహారము లేని వానికి ఎన్ని జన్మ లెత్తినా తృప్తిలేదు.

**756. (8) గీతలలో ఏ గీత పెద్దది?**

జ. భగవద్గీత.

**వివరము :** 'గీత' అనగా ఒక హద్దును చూపునదని అర్థము. భూమి యొక్క హద్దును పుల్లతో గీచి చూపవచ్చును. పదార్థము యొక్క హద్దును కత్తితో కోసి చూప వచ్చును. అలాగే మనిషికి హద్దును మాటలతో చూపవచ్చును. భగవంతుడు మానవులకు హద్దును మాటలతో చెప్పాడు. మానవుల హద్దు చాలా గొప్పది. అర్థము చేసుకొంటే అన్ని గీతలకంటే మానవులకు మాటలతో గీచిన భగవద్గీతయే గొప్పది.

**757. (9) అన్నము పరమాన్నములో జీవుడు దేనిని తిని తృప్తి పొందును.**

జ. పరమాన్నము.

**వివరము :** ఇక్కడ పరమాన్నమంటే తియ్యని వంటకమనుకోవద్దండి. ఆహారములో ఏ పదార్థముగాని ఆహారమే పరమాన్నము అగును. అందువలన అన్ని రుచుల వంటకములను అన్నమని తలచవలెను. అన్నముకంటే వేరైనది, అనగా అన్నము గాని ఆహారము ఆత్మ జ్ఞానము. ఆహారమును అన్నమని, దైవ జ్ఞానమును పరమాన్నమని పూర్వము పెద్దలనెడివారు. జీవునికి ప్రతి దినము ఎన్ని ఆహారములు తినిన, ఎన్ని అనుభూతులు ఉండిన తృప్తి లేదు. జీవుడు పరమాన్నమును అనగ జ్ఞానమును తిన్నపుడే తృప్తి పొందును. జీవుడు ఎల్లప్పుడు అన్నము తినిన అప్పుడప్పుడు పరమాన్నము తింటేనే తృప్తి పొందును. పరమాన్నము దొరకని జీవితము జీవితమే కాదు. పరమాన్నము లేని ఆహారము జీవునికి ఆహారమే కాదు.

**758. (10) మూతికి మీసము, కాలికి గోర్లున్నట్లు నీకేమైనా ఉన్నాయా?**

జ. కర్మ ఉన్నది.

**వివరము :** జీవునకు కర్మ పెరుగుచున్నది. మూతికి మీసము పెరిగినట్లు జీవునకు

కర్మ పెరుగుచు పోవుచున్నది. మీసములను కత్తిరించిన తిరిగి పెరిగినట్లు కర్మను జీవుడు అనుభవించిన తిరిగి పెరుగుచునే ఉన్నది. జీవునకు అనుభవరీత్య తరుగుచున్నను పెరుగుచున్నది కర్మయేనని తెలియాలి.

## జ్ఞాన పరీక్ష

**చెన్నేకొత్తపల్లి** **తేది-05-04-2001**

**759. (1) నీకున్న పేరేది?**

జ. జీవాత్మ.

**వివరము :** సామాన్యముగ పేరంటూనే వ్యవహారిక పేరనుకొని రంగయ్య అనియో, రామయ్య అనియో, తల్లి తండ్రులు పెట్టిన పేరు చెప్పకూడదు. అటువంటి పేర్లు జన్మకొకటి ఉండును. జన్మ జన్మకు మారు పేరు నీది కాదు, నీ శరీరముదనుకో. ఎందుకనగా శరీరము మారినపుడల్లా పేరు మారిపోతున్నది. కావున జన్మ జన్మకు మారు పేరు నీది కాదు. శాశ్వితముగ ఏ జన్మకు మారని పేరొకటి గలది. అదియే నీకు శాశ్వితముగనున్న పేరు. ఆ పేరు జీవాత్మ అని పిలువబడుచున్నది. నీ శాశ్విత పేరు జీవాత్మ అని తెలుసుకో.

**760. (2) నీకు ఉన్న ఆయుస్సు ఎంత?**

జ. 108 కోట్ల సంవత్సరములు.

**వివరము :** శరీరమునకు ఆయుస్సు అయితే దాదాపు వంద సంవత్సరములనో 80 లేక 70 అనో చెప్పవచ్చును. ఇక్కడ అడిగినది నీకు అనగా జీవాత్మకు. జీవాత్మకు ఆయుస్సు ప్రపంచమున్నంత వరకు ఉండును. కావున ప్రపంచము యొక్క ఆయుస్సే జీవాత్మకు వర్తించును. భగవద్గీత ప్రకారము ప్రపంచ ఆయుస్సు వెయ్యి యుగములు అనగా 108 కోట్ల సంవత్సరములు. జీవుని ఆయుస్సు కూడ 108 కోట్ల సంవత్సరములని చెప్పవచ్చును.

**761. (3) నీకు స్వంత ఊరు ఏది?**

జ. మోక్షము.

**వివరము :** సృష్టి ఆదిలో నీవు నేను అందరము ఒకే ఊరినుండి బయలుదేరి వచ్చాము. ఆదిలో పరమాత్మ, పరమ పదము, మోక్షము అను దైవ స్థానము నుండి దేవుని సంకల్పము ద్వార ఎంతోమంది జీవులుగా పుట్టుకొచ్చాము. మొదటి స్థానము మోక్ష సామ్రాజ్యము. దీనిని బట్టి నీకు, మరి అందరికి స్వంత ఊరు మోక్షమనియే చెప్పవలెను.

**762. (4) నీకు తండ్రి ఉన్నాడా ఎవడు?**

జ. ఉన్నాడు. పరమాత్మ.

**వివరము :** సర్వ జీవరాసులకు పరమాత్మ తండ్రి, ప్రకృతి తల్లియని భగవద్గీతయందు చెప్పబడినది. సర్వ జీవరాసులలో మనుషులైన మనము కూడ ప్రకృతి పరమాత్మల బిడ్డలమే. ఒక జన్మకు తల్లి తండ్రులు భూమి మీద మనుషులు కాగ, అన్ని జన్మలకు తల్లి తండ్రులు పరమాత్మ ప్రకృతి. నాకు తండ్రి పరమాత్మయే, నీకు కూడ తండ్రి పరమాత్మయే.

**763. (5) నీకు ఆస్తి ఉన్నదా, ఏది ఎంత?**

జ. ఉన్నది. జ్ఞానము. ఎంతైనది తెలియదు.

**వివరము :** ప్రతి జీవరాసికి ఆస్తి జ్ఞానమే. నేను కొంత జ్ఞానమును సంపాదించుకొన్నాను, కావున నాకు కొంత ఆస్తి ఉన్నది. కాని ఎంత ఉన్నది చెప్పుటకు వీలుకాదు. ఆస్తి అనగా భౌతిక తల్లిదండ్రులు సంపాదించి ఇచ్చిన ఆస్తి అనుకోకూడదు. ఆధ్యాత్మికరీత్య చూస్తే ప్రపంచ ఆస్తి ఒకే జన్మలో ఉండి మరణముతో పోవుచున్నది. జ్ఞానమను ఆస్తి మరణముతో పోక నీ వెంట వచ్చునది. ప్రపంచ ఆస్తిని ఎవరైన తీసుకోవచ్చును. జ్ఞానధనమను ఆస్తిని ఎవరు తీసుకోలేరు. బయటి ఆస్తి శరీరమునకే జీవాత్మకు కాదు. లోపలి జ్ఞానము అను ఆస్తి జీవాత్మకే చెందును. కావున నీ ఆస్తి నా ఆస్తి అందరి ఆస్తి జ్ఞానము.

**764. (6) నీకు కొడుకులున్నారా?**

జ. లేరు.

**వివరము :** కొడుకులనగా ప్రపంచపరముగ వీర్యమునకు పుట్టినవారు బిందు పుత్రులని, జ్ఞాన వివరముగ నాదపుత్రులని రెండు రకములు గలరు. ప్రపంచపరముగ ఎవరికైన ఎందరైన కొడుకులుండవచ్చును. వారిని శరీర పుత్రులని అంటాము. జ్ఞానము ద్వార పుట్టిన వారిని అనగా జ్ఞానము విని తయారైన శిష్యులను నాద పుత్రులంటాము. నాకు బిందుపుత్రులున్నారు కాని, నాదపుత్రులు లేరని చెప్పుచున్నాము.

**765. (7) నీకు స్నేహితులున్నారా ఎవరు?**

జ. ఉన్నారు. ఆత్మ, పరమాత్మలు.

**వివరము :** తనతో పాటు శరీరములో ఉన్నవారు ఇద్దరే. ఆత్మ పరమాత్మ అనువారు. జీవుడెక్కడుంటే అక్కడే ఉంటూ, తన మాదిరి వారు కూడ ఆత్మలే అగుటవలన, ఇద్దరిని స్నేహితులంటున్నాము. హితమును కోరేవారు స్నేహితులు, ప్రకృతి జీవునికి చెడుపు చేస్తున్నది. కావున ప్రకృతి శత్రువుకాగ, జీవునికి హితము కోరువారు ఆత్మ పరమాత్మలు, వారి జ్ఞానము చేత జీవునికి ముక్తికల్గునట్లు చేయువారు కనుక వారిని స్నేహితులనవచ్చును.

**766. (8) నీకు బంధువులున్నారా? ఎవరు?**

జ. ఉన్నారు. గుణములు.

**వివరము :** బంధించువారు బంధువులు అని అర్థము. శరీర బంధువులు వేరు, ఆత్మ బంధువులు వేరు. శరీరమునకు బంధువులు అందరికి కలరు. అట్లే ఆత్మ

బంధువులు అందరికి గలరు. శరీర బంధువులు బయటివారు, ఆత్మ బంధువులు లోపలివారు. బయటి బంధువులు అమ్మ, అత్త, అవ్వ, నాన్న, మామ, తాత అను ఆరు విధములుగ నున్నారు. అలాగే లోపలి బంధువులు శత్రువర్గములు ఆరు మిత్రవర్గములు ఆరు గలవు. ఇక్కడ శరీరమును కాక నీకు అని అడిగారు కావున లోపలి గుణములే జీవునికి బంధువులని చెప్పాలి.

**767. (9) నీకు వాహనమున్నదా? ఏది? డ్రైవరు ఎవరు?**

జ. ఉన్నది. శరీరము. ఆత్మ.

**వివరము :** ప్రతి జీవునికి శరీరము వాహనముగ ఉన్నది. బయటి శరీరమునకు వాహనముండవచ్చును ఉండక పోవచ్చును. శరీరము మాత్రము జీవునికి వాహనముగ ఉన్నది. శరీరవాహనమును నడుపువాడు లోపల గల ఆత్మ. శరీర రథములో జీవుడు కూర్చొని ఉండగ, ఆత్మ జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములను పది గుఱ్ఱములను తోలుచు, రథమును నడుపుచున్నది.

**768. (10) నీకు ఇంటి దేవుడున్నాడా ఎవరు?**

జ. ఉన్నాడు. ఆత్మ.

**వివరము :** ప్రతి జీవరాసికి శరీరము నివాసమై ఉన్నది. కావున జీవునికి శరీరము ఇల్లులాంటిది. ప్రతి శరీరములోను శరీరమునకు శక్తి నిచ్చి శరీరమును నడిపించునది ఆత్మ. ఆత్మ శరీరములోపలి దేవుడు కాగ, శరీరములోపలి దేవునికి కూడ దేవుడు పరమాత్మ. ఇంటి దేవుడెవరు అన్నపుడు ఆత్మయే ఇంటి దేవుడని చెప్పవలెను. ఇంటి దేవుడనగా బయట గల నరసింహస్వామి, రంగనాయకుల స్వామి, అంజనేయస్వామి అనకూడదు. బయట ఇల్లు పూరి గుడిసె కావచ్చు, గట్టి ఇల్లు కావచ్చు, మేడ కావచ్చును. కాని లోపలి ఇల్లు శరీరము మాత్రమే. దానిలో దేవుడు ఆత్మ మాత్రమే.

# జ్ఞాన పరీక్ష

**చిన్నపాలమడ** **తేది-07-05-2001**

**769. (1) దేవునివద్దయిన, మరెక్కడైన గోవింద అనేటపుడు రెండుమార్లు అంటారెందుకు?**

జ. నాకు ఈ జగతిలో కావలసినవి ఏమి లేవు అను అర్థముతో గోవిందా.... అనియు, అట్లే శరీరములోపల నన్ను అంటుకొను కర్మయు ఏమి లేదు అని అర్థమొచ్చునట్లు గో....వింద అనెడివారు.

**వివరము :** ఎక్కడయిన గోవింద అను పదము రెండు మార్లు ఉచ్చరించడమే జరుగుచున్నది. ఈ పదము రెండు మార్లు ఉచ్చరించడములో కూడ పదము పదముకు కొంత వ్యత్యాసమున్నది. మొదట ఉచ్చరించు పదములో గోవిందా..... అను దీర్గముండును. రెండవ మారు ఉచ్చరించు పదములో గో....వింద అను దీర్గముండును. వాస్తవానికి గోవిందా అను పదములో ఒకే అర్థమున్నప్పటికి రెండు మార్లు ఉచ్చరించడమేమిటి? అన్నది ప్రశ్న. అంతేకాక మొదటి గోవిందా.......లో 'దా' ను ఎక్కువ దీర్గించడము, రెండవ మారు అను గో...విందాలో 'గో' ను దీర్గించడములో కూడ విశేషమేదో ఉంటుంది, అది ఏమిటనేది కూడ ప్రశ్నయే. వీటి జవాబు కోసము వెదకితే కృతయుగములో ఈ పదమున్నట్లు ఆ కాలములోనే మహర్షులు సహితము గోవిందా పదమును ఉచ్చరించినట్లు చరిత్రలో తెలియుచున్నది. ఆనాడే తెలిసి పెద్దలు గోవింద అను పదమునకు అర్థమును చేకూర్చి, ఆ అర్థము ప్రకారమే రెండుమార్లు గోవింద పదమును ఉచ్చరించునట్లు అదియు ఒక దానికొకటి కొద్దిగ వ్యత్యాసముండునట్లు కనబరచి పెట్టారు. ఆనాడు వారు ఏది చేసిన భవిష్యత్తులో మానవాళికి జ్ఞానము కల్గునట్లు యోచించి చేసెడివారు. శాశ్వితముగ జ్ఞానమును ప్రబోధితము చేయు ఆనాటి వారి ఉద్ద్యేశమేమిటో అక్కడికే వెళ్లి వారినే అడిగి తెలుసుకొందాము.

"గోవింద" అను పదములో ఇక లేదు అనియు, లేక అంతా అయిపోయిన దనియు అర్థమును అమర్చారు. తెలిసినవారు గాని, తెలియని వారుగాని శవాన్ని తీసుకెళ్లేటపుడు అదే అర్థముతోనే అంటున్నారు. తెలియని వారు అనాలను పద్ధతిగ అన్నప్పటికి సందర్భము అదియేనని యోచన చేయువారికందరికి తెలియగలదు. అలాగే జూదములో ఉన్నదంత కోల్పోయినపుడు కూడ గోవింద పదమునే వాడుచున్నారు. అక్కడ కూడ అయిపోయిందను సందర్భమే ఉన్నది. ఇపుడు ఎవరు ఎన్ని సందర్భములలో వాడినప్పటికి, పూర్వము దేవుని దగ్గర మాత్రము గోవింద అనెడివారు. ఆనాడు దేవుని సన్నిధిలో అనగ దేవాలయములో ప్రతిమ ముందర నాకు ఈ జగతిలో కావలసినవి ఏమి లేవు అను అర్థముతో గోవిందా.... అనియు, అట్లే శరీరములోపల నన్ను అంటుకొను కర్మయు ఏమి లేదు అని అర్థమొచ్చునట్లు గో....విందా అనెడివారు. అనగ బాహ్యముగనున్న వాటి మీద ఆశ మొదలగు ఏ గుణములు పని లేదనియు, అట్లే శరీరాంతర్గతమున అంటుచున్న కర్మ ఏది లేదనియు రెండు గోవిందలు కొంత తేడాతో పెట్టెడివారు. ఇంకా అర్థము కావాలంటే బయటి సంబంధము లేకుండ బ్రహ్మయోగము, లోపలి సంబంధము లేకుండ కర్మయోగము కల్గి ఉన్నానను అర్థముతో బాహ్యముగ ఒక గోవింద, అంతరముగ ఒక గోవింద అనెడివారు.

రెండు యోగములే అయిన వాటియందు కొంత తేడా ఉండుటవలన గోవింద అనుమాటలో కూడ కొంత తేడా చూపవలెనని ఆనాటి పెద్దలే చెప్పారు. రెండు పద్ధతులు కర్మ ఇక లేదని తెలియజేయునవియే అయినప్పటికి, అవి వేరువేరని తెలియునట్లు ఒక దానికి చివరిలో దీర్ఘము, మరియొక దానికి మొదటిలో దీర్ఘము పెట్టినారు. రెండు మార్లు ఉచ్చరించడములో అదియు కొంత తేడాతో అనడము అందరికి తెలిసిన విషయముగ ఆనాడు ఉండెడిది. నేటి కాలానికది అర్థహీనమై పోయినది. అనే వారికి దాని విషయము పూర్తి తెలియక పోవడముతో దానిలోని జ్ఞానసందేశము ప్రబోధితము కాకపోయినది. ఆనాడు ఇందూ ధర్మములలో ముఖ్యమైన ధర్మముగ ఉన్న గోవిందా నేడు దాని విలువను

కోల్పోయినది. అర్థము లేకున్నప్పటికి, ఆచరణ రూపములో గోవింద మిగిలి ఉన్నప్పటికి, గురువు వద్ద సర్వము తెలుసుకొన్నామనుకొను వారికి, మా గురువు గొప్పవాడని చెప్పుకొను వారికి, చాలా సంవత్సరములు గురువు తెల్పిన విషయము లన్నియు జీర్ణించుకొన్నామను వారికి, చివరికి మా శిష్యులకు కూడ గోవింద పదము రెండు మార్లు అనడముగాని, పలకడములో వాటి వ్యత్యాసము తెలియక పోవడముగాని, చూస్తే మీరింకా సంపూర్ణ జ్ఞానులే కాలేదను చురక వేసినట్లున్నది. పూర్తి జ్ఞానము యొక్క ఆచరణ లేకపోయినప్పటికి, కనీసము పూర్తిగ జ్ఞానమైన తెలుసుకోవాలని కోరుచున్నాము.

**770. (2) తాడు పేడు లేనివాడు ఎవడైనా ఉన్నాడా?**

జ. ఉన్నాడు, పరమాత్మ.

**వివరము :** పేడు అనగ కట్టె అని అర్థము. కట్టెలు ఉన్నపుడు వాటిని కట్టుకొనేదానికి తాడు అవసరము. కట్టె అనగ కట్టబడునది. తాడు అనగ బంధించునది బంధము. తాడు పేడు లేనివాడు అంటే బంధించునది గాని, బంధింపబడునది గాని లేనివాడు అని అర్థము. ఇంకను వివరముగ తెలుసుకుంటే బంధింపబడు శరీరమను కట్టెగాని, బంధించు కర్మ అనెడి బంధముగాని లేనివాడు. కర్మ అను తాడు లేనివాడు మరియు శరీరమనెడి పేడు లేనివాడు పరమాత్మ ఒక్కడే గలడు. దేవున్ని మాత్రము తాడు పేడు లేనివాడని పూర్వమనెడి వారు. ఈ కాలములో ఆ మాట ఎక్కడయిన ఉన్నప్పటికి మనుషుల ఎడల ఉపయోగిస్తున్నారు. ఇది దేవునికి తప్ప ఎవరికి అర్థమివ్వదు.

**771. (3) బిక్షాందేహి అని అడుక్కొనే పరిస్థితి నీకెపుడైనా వచ్చినదా?**

జ. వచ్చినది. గురువు కనిపించినప్పుడు.

**వివరము :** ఇదేమి ప్రశ్నయని కొందరనుకోవచ్చును. కూటి కొరకు కోటి విద్యలన్నట్లు ప్రపంచములో ఎన్ని పనులు చేసిన చివరకు అన్నియు శరీర

పోషణకేనని చెప్ప వచ్చును. మనము పనిచేసి సంపాదించుట వలన అడుక్కొని తిను పరిస్థితి రాకపోయి ఉండవచ్చును. కొందరు ఏమి సంపాదించలేక చివరకు బిక్షాటన చేయవలసి వస్తున్నది. అటువంటి వారు అడుక్కొనేటపుడు "బిక్షాం దేహి" అనుట కూడ వినియే ఉందుము. వారు ఆకలి కోసము బిక్ష అడిగేటపుడు, ఆహారము లేనిది శరీరయాత్ర సాగదు కనుక బిక్ష శరీరము కొరకు అనునట్లు "బిక్షాం దేహ" అనవలెను.

పూర్వ కాలములో కూడ రెండు రకములుగ అడుక్కొనే వారుండిరి. కొందరేమో **"బిక్షాం దేహ"** అని మరి కొందరేమో **"బిక్షాం దేహి"** అని అడిగే వారు. కడుపు కొరకైతే బిక్షాం దేహ అనెడివారు. అదే జీవాత్మ కొరకైతే బిక్షాం దేహి అనెడివారు. బీదవారు, ఆహారము లేనివారు, పని చేయలేని వారు దేహము కొరకు బిక్ష అడిగేవారు. రాజులు ధనికులు తిండి కొరత లేనివారు కూడ బిక్షాం దేహి అని అడుక్కొనెవారు. తిండి లేని వారు వీధులలో ఇల్లముందర అడుక్కొంటే, తిండి ఉన్నవారు గురువుల వద్దకు పోయి బిక్షాం దేహి అని జీవాత్మకు కావలసిన జ్ఞానమను బిక్ష పెట్టండని దానివలన కర్మమనెడి ఆకలిని పోగొట్టుకొందుమని అడిగెడివారు. ఈ విధముగ "బిక్షాం దేహి" అని మరియు "బిక్షాం దేహి" అని అడిగెడు రెండు రకముల బిక్షగాల్లుండెడివారు. ఒక వేళ నీవు గురువు దగ్గరకు పోయి జ్ఞానమును అడిగి ఉంటే రెండవ రకము బిక్షగానివి అవుతావు. దీనిని బట్టి ఈ కాలములో కూడ రెండు రకముల బిక్షగాల్లు ఉన్నారని తెలియుచున్నది.

**772. (4) నీవు మఠములో ఉన్నావా, ఘటములో ఉన్నావా?**

జ. మఠము అను ఊరు ఘటములో ఉన్నాను.

**వివరము :** యోగి నివాసము చేయునది మఠము అందురు. అందువలననే కొన్ని ఆశ్రమాలకు మఠములని పేరున్నది. ఇపుడు ఎట్లున్న పూర్వకాలములో మఠము అంటే మోక్షము అని అర్థము. చనిపోయిన వ్యక్తిని గూర్చి అతను మఠమునకు పోయాడా? లేక ఘటమునకు పోయాడా? అనెడివారు. మఠము అనగా నిజమైన

అర్థము మోక్షము. అలాగే ఘటము అనగా కుండ లేక శరీరము. కుండ ఎపుడయిన పగిలిపోవునదే కనుక ఎపుడైన ఊడిపోవు శరీరమును కుండగ పోల్చారు. కుండలో నీరు ఎంత కాలమున్న పగిలిపోయిన దినమున కుండ నుండి బయటికి పోక తప్పదు. అలాగే శరీరములో జీవుడు ఎంత కాలమున్న శరీరము చిద్రమైన రోజు లేక శరీరము ముసలిదై చనిపోయిన దినమున జీవుడు బయటికి పోక తప్పదు. అందువలననే శరీరమును ఘటము అన్నారు. ఘటమునకు వ్యతిరేఖమయినది మఠము. ఒక్కమారు దీనిలోనికి పోయిన వాడు తిరిగి అందరివలె పుట్టడు. ఒక్కమారు దీనిలోనికి పోయిన ఎడల తిరిగి వాడు బయటికి రాడు. అందువలననే ఘటమునకు మఠమునకు ఎంతో తేడా ఉన్నది. దీనిని బట్టి మనమందరము ఘటములోనే ఉన్నాము.

**773. (5) ఒకనికి ఇద్దరు భార్యలున్నారు. మొదటి భార్య అందగత్తె, రెండవ భార్య అందముగా లేదు. భర్త మొదటి భార్యను చూసి నీకు అందముంది చందము లేదు, రెండవ భార్యను నీకు చందముంది అందము లేదన్నాడట ఎందుకు?**

జ. అందము : బాహ్యముగ కనిపించునది అందము, చందము : పైకి కనిపించక అంతరంగమున ఉన్నది జ్ఞానము.

**వివరము :** ఈడు జోడు, అందము చందము అను పదములు భార్య భర్తల ఎడల వాడుతునే ఉంటాము. ఈడు లేకున్నా జోడుండాలి అనియు, అదే విధముగ అందము లేకున్నా చందముండాలని పూర్వమనెడివారు. ఈ కాలములో చేతికిచ్చే డబ్బును, పైకి కనిపించే అందమునే చూస్తున్నారు. చందము పోయి అందమొక్కటే మిగిలి ఉంది. అదే విధముగ జోడు పోయి ఈడు మాత్రము మిగిలి ఉన్నది. అందము అందరికి తెలిసిన విషయమే అయినప్పటికి చందము మాత్రము తెలియకుండ పోయినది.

ఒకనికి ఉన్న ఇద్దరు భార్యలలో ఒకరు అందగత్తె అన్నాము కాని ఆమెకు చందము లేదట. చందమంటే ఏమిటో మనకు తెలియదు కనుక అతనినే అడిగితే ఇలా చెప్పాడు. "చందమంటే దైవ జ్ఞానము. అందమున్న భార్యకు జ్ఞానము లేదు. అట్లే జ్ఞానమున్న రెండవ భార్యకు అందము లేదు. పైకి కనిపించు అందముకంటే కనిపించక లోపల ఉండు జ్ఞానమే చాలా అందమైనది. అందువలన పై అందమున్న మొదటి భార్యకంటే లోపలి అందమైన జ్ఞానము గల రెండవ భార్య మీదనే నాకు ఎక్కువ ప్రేమ" అన్నాడు. అందువలన అందము చందము రెండు ఉన్న భార్య గలవాడే అదృష్టవంతుడు. అందము లేకుండ చందము మాత్రము ఉంటే వానిని కొంత అదృష్టవంతుడని చెప్పవచ్చును. అందము చందము రెండు లేని భార్య గల వానిని దురదృష్టవంతుడని చెప్పవచ్చును.

## 774. (6) నీ శరీరములో వార్తాహరుడెవడు?

జ. మనస్సు.

**వివరము :** వార్తలు చేరవేయు వానిని వార్తాహరుడు అంటారు. శరీరములో జీవాత్మ అనువాడు ఏ విషయమును స్వయముగ తెలుసుకొను స్థితిలో లేడు. పలానా వాడు మాట్లాడుచున్నాడని, పలానా విషయమే చెప్పుచున్నాడని, తినే తిండి పలానా రుచి ఉందని, ఇది పలానా స్పర్శ అని, ఇది పలానా వాసన అని ఐదు విషయములను తెలియజేయువాడొకడు గలడు. శరీరములోని జీవాత్మ ఆ వార్తాహరుని ద్వారానే అన్ని విషయములు తెలుసుకోగలుగుచున్నాడు. శరీరములో బయటి విషయములన్నిటిని లోపలి జీవాత్మకు తెలియజేయునది మనస్సు. అందువలన శరీరములోని మనస్సు వార్తాహరుడని పేరుగాంచి ఉన్నది. ప్రపంచములో ఎక్కువ వార్తలు చేరవేయునది మనస్సే. దీనిని మించిన వార్తాహరుడు ఎక్కడ లేడు.

## 775. (7) దేశముగాని దేశము భూమి మీద ఉన్నదా?

జ. ఉన్నది.

**వివరము :** దేశముగాని దేశము అన్నారు కావున ఇది కనిపించెడి దేశమువలె ఉండదని తెలియుచున్నది. కంటికి కనిపించనిది జ్ఞాననేత్రమునకు మాత్రము కనిపించునదియైన దేశము ఒకే ఒకటి కలదు. అది భూమి మీద కల అన్ని దేశములకంటే మించినది మరియు అదియు భూమి మీదనే గలదు. దానినే ఉపదేశము అంటాము. ఆ ఉపదేశమును జ్ఞాననేత్రము కల్గిన ప్రతి ఒక్కరు చూడవచ్చును. జ్ఞాననేత్రమిచ్చి ఆ దేశమును చూపించువారు గురువులు. చూపించెడి గురువులు ముందు ఆ దేశమును చూచి ఉండవలెను. అలా చూచిన వారే వారి శిష్యులకు కూడ చూపగలరు. **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానం"** అన్న గీతాచార్యుని మాట ప్రకారము మనకున్న శ్రద్ధను బట్టియే గురువు, జ్ఞానము లభించును, అట్లే ఉపదేశము లభించును. ముఖ్యముగ తెలియవలసినది ఏమనగా! ఉపదేశము మంత్రముల వలనగాని ముద్రల వలన లభించునది గాదు. దేశము గాని దేశము ఎపుడైన పోయావా? పోకపోతే పోవలెనని ప్రయత్నము చేయుము.

**776. (8) మమకారమని దేనినంటారు?**

జ. మోహగుణము.

**వివరము :** మమకారమంటే చాలామంది పొరపాటుగ ప్రేమయని తలచుచుందురు. మమ అనగా నాది, నా అను అర్థమివ్వగలదు. ఈ అర్థమును బట్టి చూచిన నాది అను తలపింపజేయు మోహమే మమకారమని తెలియుచున్నది.

**777. (9) బేవర్షి అనగా పూర్తి అర్థమేమి?**

జ. సంతోషము లేనివాడని అర్థము.

**వివరము :** ఒకనికి బాకీ ఉన్నపుడు ఆ బాకీ అంత అతనికిచ్చిన తర్వాత బేబాకీ అయిందనుట వినియే ఉందుము. బే బాకీ అంటే బాకీ లేదని అర్థము. హర్షము అనగా సంతోషము. హర్షి అనగా సంతోషించువాడని అర్థము. జ్ఞానము కల్గుకొలది సంతోషము కల్గును. అందువలన జ్ఞానశక్తిని బట్టి వాడు సంతోషము గలవాడని తెలియజేసారు. ఆ తారతమ్యములను నాల్గు విధములుగ తెలియజేసారు. మహ

అనియు, రాజ అనియు, దేవ అనియు, బ్రహ్మ అనియు నాల్గు రకములుగ తెలియజేసారు. హర్షములో తేడాలు గలవారు గావున ఈ నాల్గు విభజనలకు చివర హర్షి అని పిలిచి ఉన్నారు. మహర్షి, రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి అని వారి పేర్లు గలవు. వాస్తవానికవి పేర్లు గావు యోగ్యతలని తెలియవలెను. మనుషులలో సామాన్యుడు, గొప్పవాడు, రాజు అని మూడు విధముల గలరు. మనుషులను వదలితే ఆత్మ (దేవుడు), పరమాత్మ అని రెండే భాగములు గలవు. జీవుడు మూడు విధములుగ దేవుడు ఒక విధముగ, పరమాత్మ ఒక విధముగ ఉండడము వలన జ్ఞానశక్తిని బట్టి మానవులను మొత్తము ఐదు భాగములుగ విభజించవలసి వచ్చినది. సామాన్యమైన వానికి ఏ మాత్రము జ్ఞానశక్తి లేదు. కావున వానిని బేవర్షి అనడము జరిగినది. బే బాకీ అనగ బాకీ లేదన్నట్లు బేవర్షి అనగా హర్షము లేనివాడని అర్థము. ఏమాత్రము సంతోషము లేనివానిని అనగా జ్ఞానము కొద్దిగ కూడ లేనివానిని బేవర్షి అనడము జరుగుచున్నది. ఇక్కడ బేవర్షి అనబడువానికి చాలా ధనమున్న ఎడల సంతోషముండును కదా! అని కొందరనుకోవచ్చును. దానికి జవాబు ఏమనగా! జ్ఞానము వలన కల్గు సుఖము సంతోషము ముందర ప్రపంచ సంతోషము చాలా స్వల్పమైనది. అంతేకాక యోగములో లేనివాడు నిత్యము రోగములో ఉన్నాడని పెద్దలు చెప్పారు. కావున ప్రపంచ సంతోషము దుః ఖముతో సమానమేనని అదియు ఒక రకమైన దుఃఖమేనని తెలియవలెను. అందువలననే తెలిసిన పెద్దలు యోగము మినహా అంతయు రోగమే అన్నారు. మీరు మాత్రము బేవర్షులు గాక మహర్షులైన కావలెనని కోరుచున్నాము.

## 778. (10) ఎవరికైన ఎప్పుడైన స్వాగతము చెప్పావా?

జ. లేదు.

**వివరము :** పూర్వకాలములో జ్ఞానులందరు కలసి అప్పుడప్పుడు సమావేశమయ్యే వారు. సంవత్సరమునకొక మారుగాని లేక నెలకొక మారుగాని ఒక నియమము ప్రకారము సభ జరుపుకొనేవారు. ఆ సమావేశములో ప్రతి ఒక్కరు వారి వారి

గతమును గురించి చెప్పెడివారు. నెలకొకమారు సమావేశమైన ఎడల ఆ నెలయంతయు జరిగిన గతమును గురించి చెప్పి ఆ గతములో తాను జ్ఞాన పరముగ ఎంత నడచినది, అట్లే ప్రపంచ పరముగ అజ్ఞానరీత్య ఎంత నడచినది విప్పి చెప్పెడివారు. అలా చెప్పడములో నాగతము అందరికంటే జ్ఞానపరముగ ఉండవలెనని పోటీపడెడివారు. అందువలన అలా నెలకొకమారు సమావేశమయ్యేడి వారందరు. వారి వారి గతములు సక్రమముగ జ్ఞానపరముగ ఉండునట్లు జాగ్రత్త పడెడివారు. అలా జరుగు సమావేశమునకు **"స్వగతము"** అని పేరు పెట్టి చేసేడివారు. అక్కడ జరుగు చర్చ స్వగతమును గురించి కావున స్వగతము అని పూవులతోగాని, ఆకులతోగాని అల్లి అమర్చెవారు. సమావేశమైనపుడంతా స్వగతము అని వ్రాసి ఉంచుట గమనించిన కొందరు అక్కడ జరుగు విషయమేదో దాని అర్థమేదో తెలియనప్పటికీ సభ జరిగితే స్వగతము అని వ్రాయుట పద్ధతి అనుకొన్నారు. కాలక్రమమున తెలియని తనము పెరిగి పోవడము వలన ఎక్కడ సమావేశము జరిగిన **"స్వగతము"** అని వ్రాసి పెట్టడము జరిగినది. అట్లే కాలము జరుగు కొలది, వందలు వేలు సంవత్సరములు గడచుకొలది చివరకు స్వగతము **"స్వాగతముగ"** మారిపోయినది. ఇపుడు ఎక్కడ సభలు జరిగిన **"స్వాగతము"** అని వ్రాయబడినవే కనిపిస్తున్నవి. ఆహ్వానము అని వ్రాయను పోయి స్వాగతము అని వ్రాయుచున్నారు. వారి ఉద్దేశములో ఆహ్వానించు భావమును కల్గి ఉండి తెలియకనే స్వాగతము అని వ్రాసి పెట్టుచున్నారు. పూర్వము సంపూర్ణ జ్ఞానము గలవారు సమావేశమైనపుడు వారి ప్రవర్తనంతయు జ్ఞానపరముగ నిండి ఉండును కనుక మాది మంచి గతము అని తెల్పుచు గతముకు మంచిది సూచించు "సు" అను అక్షరమును చేర్చి "సుస్వగతము" అని వ్రాసి పెట్టెడి వారు. అదియు చివరికి "సుస్వాగతము" అయినది.

వారి గతము ఎట్లున్నప్పటికి ముఖ్యముగ మన గతము ఏమిటో ఎట్లు గడచినదో కొంచెమైన యోచించారా? ప్రతి నెల సమావేశమగు మీరు మీ స్వగతమును గురించి ఎవరికైన చెప్పారా! మీ గతము సుగతమా లేక దుర్గతమా?

ఇక నుండి ప్రతినెల సమావేశమైనపుడు మీ స్వగతమును గూర్చి చెప్పి గతములోని పొరపాట్లను సరిదిద్దుకొని మంచి మార్గములో పయనించుటకు తెలిసిన వారి వద్ద సలహాలు తీసుకోండి.

## జ్ఞాన పరీక్ష

**కొత్తకోట** **తేది-04-07-2001**

**779. (1) జరుగుచున్న కార్యమును జరుగకుండ ఎవరైన ఆపగలరా?**

జ. బ్రహ్మయోగులు.

**వివరము :** ప్రారబ్ధకర్మ ప్రకారము కార్యములు జరుగుచుండును. ప్రారబ్ధకర్మ జీవితములోని కార్యములను మాత్రము నిర్ణయించుచుండును. దైవ సంబంధమైన జ్ఞానము యోగములను ప్రారబ్ధము నిర్ణయించలేదు. జ్ఞానము కర్మనే శాశించగలదు, కాల్చి బూడిద చేయగలదు. ప్రారబ్ధమును భూమి మీద విష్ణు ఈశ్వర బ్రహ్మ మొదలగు దేవతలు కూడ మార్చలేరు. కాని యోగము కర్మను మార్చగలదు. బ్రహ్మ యోగము చేయునపుడు వినియోగపడే కాలములో ప్రారబ్ధము ప్రకారము జరుగు పనులు నిలచిపోవును. బ్రహ్మయోగము చేయు సమయములో జరుగ వలసినది తర్వాత జరుగును. కావున జరుగుచున్న కార్యమును బ్రహ్మయోగులు జరుగకుండ ఆపగలరు. అనగా ఇతరుల కార్యములు అనుకోకూడదు. ఎవరి పనిని వారు బ్రహ్మయోగము ఆచరించడము ద్వార ఆపవచ్చును. కర్మను ఆపగల శక్తి ఒకే ఒక జ్ఞానశక్తి అని తెలియాలి.

**780. (2) చెట్లన్ని ఒకే రంగు కల్గి ఉన్నవి ఎందుకు?**

జ. ఒకే దైవమును నమ్ముట వలన.

**వివరము :** మనుషలలో జ్ఞానశక్తిని బట్టి మహర్షి, రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి అని నాలుగు భాగములుగ విభజించినట్లు, భూమి మీద పుట్టిన అన్ని జీవరాసులను దైవ సామీప్యమును బట్టి మూడు విధములుగ విభజించాము. ఆ మూడు జాతులు

వాటి పెరుగుదలలోనే ప్రత్యేకత కల్గి వున్నవి. ఈ విషయము ముందు కూడ కొంత చెప్పుకొన్నాము. పైకి పెరుగునవి వృక్షముల జాతులు, అడ్డము పెరుగునవి జంతు క్రిమి కీటకములు, క్రిందికి పెరుగునవి మనుష్య జాతి ఒక్కటి. దేవునికి అతి దగ్గరగ ఉంటూ కర్మను సంపాదించుకోవడములో అన్నిటికంటే తక్కువ స్థాయిలో ఉన్నవి వృక్షజాతులు. వృక్ష జాతులన్ని ఒకే దేవున్ని అనగా పరమాత్మను నమ్మి మేమంతా ఒకే మార్గములో ఉన్నామని, మా అందరికి ఒకే దేవుడుగలడని తెలుపునట్లు ఒకే రంగు కల్గి ఉన్నవి. మిగత రెండు రకములలో ఒకే రంగు లేక పోవడము, ఒక్కొక్క జీవరాసి ఒక్కొక్క రంగు కల్గి ఉండడము గమనార్హము. చెట్లన్ని భూమి నుండి పైకి పెరుగుచు మేము దేవుని వైపు పయనిస్తున్నామని తెలుపుచు, మరియు ఒకే పచ్చదనము కల్గి మేమంతా ఒకే దేవుడను నమ్మియున్నామని తెలియజేయుచున్నవి.

**781. (3) మూఢాత్ముడనగా ఏ ఆత్మ?**

జ. జీవాత్మ.

**వివరము :** మూఢము అనగా అజ్ఞానము. మౌఢ్యమి అను పదమునకు అనుసంధానముగ పుట్టిన పదము మూఢము. మౌఢ్యమి అనిన, చీకటి అనిన అజ్ఞానమని అర్థమొచ్చును. మూఢాత్ముడు అనగ అజ్ఞానముతో కూడుకొనిన ఆత్మ అని అర్థము. శరీరములోని మూడు ఆత్మలలో జీవాత్మ ఒక్కటియే మూఢాత్ముడుగా ఉండుటకు అవకాశము గలదు. పరమాత్మ ఆత్మ ఇద్దరు అజ్ఞానులు కాదు. జీవాత్మ ఒక్కడే అజ్ఞాని కావున మూఢాత్మ అని జీవాత్మనన్నారు.

**782. (4) ముక్కంటి అని ఎవరిని అనవచ్చును?**

జ. మనసున్న వారినందరిని అనవచ్చు.

**వివరము :** ముక్కంటి అనగా మూడు కన్నులు గలవాడని అర్థము. రెండు కన్నులు బయట కనిపిస్తుండుట అందరికి తెలిసిన విషయమే. మూడవ కన్ను కనిపించక తలలో ఉన్నది. తలలో గల మనస్సు మూడవ కన్నుగ నున్నది.

బయటి కన్నులతో చూచిన దృశ్యమును కొన్ని రోజుల తర్వాతైన మనోనేత్రము తిరిగి అదే దృశ్యమును చూపగలదు. సర్కస్‌లో ఒక పులిని చూచినవాడు రెండు రోజుల తర్వాత ఆ పులి దృశ్యమును మొదట చూచినట్లే చూడగలడు. ఆ దృశ్యము మనోఫలకము మీద మెదలుట వలన మనస్సుచే చూడగల్గుచున్నామని చెప్పవచ్చును. ఒక మారు చూచినవి చూచినట్లు మనస్సు చూపగల్గుటయేగాక, చూడని వాటిని కూడ తన ఊహ చేత చూపగలదు. కల్లు మూసుకొనిన కనిపించు దృశ్యములు కొన్ని మనో ఊహా జనితములుగ ఉండును. ఎప్పుడు చూడని విషయములను కూడ చూపించుటలో సామర్థ్యము కల్గినది మనస్సు. దీనిని బట్టి మనస్సున్న జీవులందరికి మనోనేత్రమున్నది.

**783. (5) జీవాత్మకు అతి దగ్గరగ ఉన్నదేది?**

జ. బుద్ధి, మాయ.

**వివరము :** జీవాత్మకు చాలా దగ్గరగనున్నది బుద్ధి పొర. బుద్ధి దగ్గరగనుండగ మాయ కూడ దగ్గరగనున్నదని చెప్పుటలో కారణమేమిటి అని కొందరడుగ వచ్చును. దానికి సమాధానము ఏమనగా! మాయ అనగా గుణములు. గుణములందే జీవుడు నివాసమున్నప్పటికి, జీవునికి ఆనుకొని దగ్గరగనున్నది బుద్ధి. బుద్ధి వేరు, జీవుడు వేరు, గుణములు వేరుగ ఉన్నాయి. బుద్ధి తర్వాత చిత్తము, చిత్తము తర్వాత అహము కలవు. బుద్ధి, చిత్తము, అహము మూడు పొరల మధ్యలో ఉన్నది జీవాత్మ. ఇక్కడ జీవాత్మకు బుద్ధి తర్వాత చిత్తము దగ్గరగానున్నట్లు తెలియునప్పటికి వీటిని చెప్పక గుణములే దగ్గరగనున్నవని చెప్పడములో ఒక విశేషత కలదు. మూడు పొరలకు బయటనున్నవి గుణములే అయినప్పటికి గుణములచేతనే బుద్ధి యోచించుచున్నది. బుద్ధి గుణమునే యోచించుట వలన, ఆ యోచనలకు జీవాత్మ దగ్గరగ నుండి చూస్తుండుట వలన, జీవాత్మ మాయకు దగ్గరగనున్నదని చెప్పవచ్చును. బుద్ధి, చిత్తము, అహము దగ్గరున్నప్పటికి బుద్ధి యోచనల రూపముతో, మాయ మరీ దగ్గరగనున్నది. యోచనలులేనపుడు బుద్ధి దగ్గరకాగ, యోచనలున్నపుడు మాయయే జీవునికి దగ్గరున్నదని చెప్పవచ్చును.

**784. (6) నీకు నాకు మధ్యన ఏమైనా ఉన్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** ఇక్కడ ఇద్దరు జీవాత్మలకు మధ్యనున్నది రెండు శరీరములు. రెండు శరీరములలో బయటి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, అంతరేంద్రియములు అన్నియు మధ్యనున్నవే. అంతే కాక గుణములు, ఆత్మలు కూడ మధ్యన గలవని తెలియవలెను.

**785. (7) భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున "అహం వైశ్వానరో" అను శ్లోకమునందు ఆహారము నాలుగు విధములన్నారు. ఆ ఆహారములు ఉన్నాయా?**

జ. ఉన్నాయి.

**వివరము :** నాలుగు రకముల ఆహారములుండుట వాస్తవమే. అవి 1. మాంసకృత్తులు, 2. పిండి పదార్థములు, 3. క్రొవ్వు పదార్థములు, 4.ఖనిజ లవణములు. ఈ నాలుగు రకముల పోషక పదార్థములు మనము నిత్యము తిను ఆహారమునందు గలవు. చాలామంది గీతావక్తలు ఈ నాలుగు రకల ఆహారము లను చెప్పుకోక భక్ష, భోజ్య, చోహ్య, లేహ్య అని చెప్పుకొన్నారు. తినే పదార్థములు మెత్తనివి, గట్టివి, చప్పరించునవి, చప్పరించకనే మింగునవని చెప్పుకోవడము తప్పు. గట్టివి గాని, మెత్తవిగాని ఆహారములు మరే విధముగ ఉండినప్పటికి వాటియందు శరీరమును పోషించు పదార్థములు నాలుగని భగవంతుడు తెలిపాడని గ్రహించవలెను.

**786. (8) గీతలో 'కాకికూటమి' గురించి 'కాకి' అను పదమును ఉపయోగించి ఒక శ్లోకము చెప్పారు. అది ఏ అధ్యాయము, ఎన్నో శ్లోకము?**

జ. 6 వ అధ్యాయము, 10 వ శ్లోకము. త్రైత సిద్ధాంత భగవద్గీతలో 5 వ అధ్యాయము, 10 వ శ్లోకము.

**వివరము :** ఆత్మ సంయమ యోగమను అధ్యాయములో పదవ శ్లోకమందు "ఏకాకీ యత చిత్తాత్మా" అని చెప్పబడి ఉన్నది.

**787. (9) మనిషై పుట్టిన తర్వాత కొంతయిన పౌరుషముండాలి అంటారు. పౌరుషమనగా గుణమా కాదా? అది నీకున్నదా?**

జ. గుణము కాదు. నాకు కొంత ఉన్నది.

**వివరము :** పౌరుషము గుణము కాదు. పురుషత్వము కల్గినది పౌరుషము. పౌరుషము అనగ పురుషునికి సంబంధించినది లేక దైవజ్ఞానము అని అర్థము. అపౌరుషము అనగ పురుషుడు కానిది ప్రకృతికి సంబంధించినదని అర్థము. వేదములు అపౌరుషములు అనగా వేదములు మాయకు సంబంధించినవని లేక ప్రకృతికి సంబంధించినవని తెలియుచున్నది. పౌరుషము అనగ దైవము, దైవము యొక్క జ్ఞానమని తెలియుచున్నది. దైవజ్ఞానము నాకు కొంత ఉన్నది కావున నాకు కొంత పౌరుషమున్నదని చెప్పుచున్నాను.

**788. (10) కంటితో చూచేది నిజము, చెవితో వినేది అబద్దము. ఉదాహరణకు నీవు చూచిన నిజము, నీవు వినిన అబద్దము వ్రాయుము?**

**వివరము :** కంటితో చూచేది నిజము. నిజము అనగా పుట్టినది ప్రత్యక్షముగ ఉన్నదని అర్థము. "జ" అనగ పుట్టుట అని అర్థము, నిజ అనగా పుట్టి ఉండినది. పుట్టియుండి ప్రత్యక్షముగ ఉన్నది ప్రకృతి లేక మాయ. కంటితో చూడబడునది ప్రకృతియే, కావున కనిపించునదంతయు మాయ లేక ప్రకృతి అని అంటున్నాము. అబద్దము అనగా బద్దము గానిది, బంధింపబడనిదని అర్థము. దేవుడు బంధింపబడని అబద్దుడు. చెవితో వినే దైవజ్ఞానము అబద్దమైనది. జ్ఞానము అబద్ధము అంటే ఆశ్చర్యపోనవసరము లేదు. అబద్దమనగ అసత్యమనుకోకూడదు. కర్మ బంధములో చిక్కనిదని అర్థము చేసుకోవాలి. జ్ఞానము కర్మను శాశించునది, కర్మను దహించునది. కర్మకు జ్ఞానము బంధింపబడునది కాదు. కావున చెవి ద్వార వినే జ్ఞానము అబద్దమైనది. కన్నుతో నిజమైన ప్రకృతిని చూస్తున్నాను.

అలాగే చెవితో అబద్ధమైన జ్ఞానమును వింటున్నాను. పూర్వము పెద్దలు కూడ అందరికి తెలియులాగున చూచేది నిజము, వినేది అబద్ధమన్నారు.

## జ్ఞాన పరీక్ష

**కొత్తకోట** **తేది-12-08-2001**

**789. (1) తనను తన్నువాడుండగ, వాని తలను తన్నువాడు గలడంటారు. తనను తన్ను వాడెవడు? తనను తన్ను వానిని తలను తన్ను వాడెవడు?**

జ. తన్ను వాడు కర్మ, వానిని తన్ను వాడు జ్ఞానము.

**వివరము :** ప్రతి జీవరాసిని కర్మ శాశించి నడిపిస్తున్నది. నేను నీవు అను తారతమ్యము లేకుండ అందరము కర్మ చేతిలో చిక్కి బాధింపబడుచున్నాము. అనగ పై ప్రశ్నలో చెప్పినట్లు తనను తన్నువాడు కర్మని చెప్పవచ్చును. అందరిని తన్ను వాడు కర్మ అయితే, వాని తల తన్నువాడు మరియొకడు కలడు. కర్మ అందరిని తన్ననదయితే కర్మను తన్ని తరిమి వేయునది జ్ఞానము. జ్ఞానమను అగ్ని, కర్మలను కట్టెలను కాల్చివేయునని గీతలో కూడ చెప్పారు. పుట్టిన ప్రతి ఒక్కరిని తన ఆధీనము ప్రకారము నడుపు కర్మ జ్ఞానము చేతిలో నశించుచున్నది. అందువలన తనను తన్ను వాడుండగ, వాని తలను తన్నువాడున్నాడని పెద్దలు సామెతగ చెప్పారు.

**790. (2) ఇంట గెలిచి రచ్చ గెలచమన్నారు. ఇల్లు రచ్చ అర్థమేమిటి?**

జ. ఇల్లు శరీరము. రచ్చ బయట బయలు.

**వివరము :** ఇల్లు శరీరము కాగ, అందులోనున్న ఆత్మను తెలియడము, కర్మను జయించడమును ఇంట గెలవడమన్నారు. శరీరములోని ఆత్మ జ్ఞానము తెలిసి, కర్మను నిరోధించు శక్తి ఉన్నవాడు ఇంట గెలిచినట్లు అన్నారు. అటువంటి వాడు శరీరము బయట అణువణువున వ్యాపించిన పరమాత్మలోనికి చేరగల్గును. మొదట శరీరములోని ఆత్మ యొక్క జ్ఞానమునుకాని, కర్మను కాల్చుశక్తిని కాని

సంపాదించలేనివాడు బయట బయలులోని పరమాత్మను కలువలేడు. శరీరములోని జ్ఞానమును తెలియడమును ఇంట గెలువడమని బయట పరమాత్మను తెలియడమును రచ్చ గెలువడమని, సామెతగ చెప్పారు.

**791. (3) కర్మాతీతమైనవి నీ శరీరములో ఉన్నాయా?**

జ. ఉన్నాయి.

**వివరము :** శరీరములో ప్రతి భాగము కర్మాధీనములో ఉండి, కర్మ ద్వార వచ్చు సుఖ దుఃఖమును మనస్సు ద్వార లోపల నున్న జీవునకందించుచున్నవి. శరీరములో దాదాపు అన్ని భాగములు కర్మాధీనములో ఉండగ, శరీర ఉపరితలములోనున్న గోర్లు వెంట్రుకలు కర్మాతీతమై ఉన్నవి. గోర్లు వెంట్రుకల ద్వార ఎటువంటి కర్మ అనుభవమునకు రాదు. గోర్లను కత్తిరించిన, వెంట్రుకలను కత్తిరించిన వాటి వలన బాధ లేదు. వాటి ద్వార కర్మను జీవుడు అనుభవించడు. అందువలన మన శరీరములోని గోర్లు వెంట్రుకలు కర్మకు అతీతముగ ఉన్నాయని చెప్పవచ్చును.

**792. (4) ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాపుతున్నది ఎవరు?**

జ. కర్మ.

**వివరము :** ప్రతి మనిషిని ముప్పు తిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాపుతున్నది వారి వారి కర్మ. ఇది సామెత రూపముగ చెప్పబడినది. ముప్పు అనగ ప్రమాదము, అపాయము అని అర్థము. ప్రమాదము అపాయములతో కూడు కొన్న తిప్పలు పెట్టునది కర్మ. తిప్పలు అనగ కష్టములు. ఎంతో భయంకరమైన కష్టాలకు గురి చేయునది ప్రారబ్ధకర్మ అని తెలియవలెను. మూడు చెరువుల నీళ్లు అనగా మూడు గుణముల విషయములు అని గుర్తించాలి. మూడు గుణములను మూడు చెరువులుగ వర్ణించి, మూడు గుణ విషయములు ప్రవాహమువలె ఒక దాని వెంట ఒకటి వచ్చుచున్నవి కావున విషయములను చెరువు నీటిగ వర్ణించారు. మూడు

గుణముల విషయములను మనిషి మీద చూపుచు తిప్పలు పెట్టునది కర్మని తెలియాలి.

**793. (5) జీవాత్మగా ఉన్న భగవంతుడు కూడ పరమాత్మను ఆరాధించ వలసిందేనా?**

జ. ఆరాధించవలసిందే.

**వివరము :** పరమాత్మ శరీరము ధరించి వచ్చినపుడు భగవంతుడగును. భగవంతుని శరీరములో ఒకే పరమాత్మ జీవునిగ, ఆత్మగ ఉంటున్నాడు. జీవునిగ ఉన్నపుడు భగవంతుడు కూడ పరమాత్మను ఆరాధించుచున్నాడు. ఆయనకు మోక్షము అవసరము లేకున్నను, ఇతరులకు మార్గదర్శత కొరకు జీవునిగ ఉన్నవాడు ఇలా చేయవలసిందేనని, తాను నడచి ఇతరుల నడకకు మార్గమును చూపించిన వాడగుచున్నాడు. కనుక భగవంతుడైనప్పటికి పరమాత్మను ఆరాధిస్తున్నాడు.

**794. (6) తలకు వెంట్రుకలు, చేతికి కాలికి గోర్లు ఉన్నాయి. వాటిలో తల వెంట్రుకలు నల్లగ, చేతి గోర్లు తెల్లగ ఉండుటకు కారణమున్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** తల వెంట్రుకలు చేతి గోర్లు శరీరములో మోక్ష చిహ్నాములుగ ఉండి మరియొక అర్థమును కూడ తెలియజేయుచున్నవి. తలలోపల అనేకముగ ఎన్నో లెక్క లేనన్ని ఆలోచనలున్నాయి. వాటికి గుర్తుగ లెక్కలేనన్ని వెంట్రుకలు తలమీద గలవు. తలలోపలున్న వాటికి నమూనాగా తల మీద వెంట్రుకలుండడమేకాక వెంట్రుకలు నల్లగ ఉండడానికి కూడ కారణము గలదు. అది ఏమనగా! తల లోపలనున్న గుణ విషయముల వలననే కర్మ ఏర్పడుచున్నది. కర్మ అజ్ఞాన సంబంధముగ జన్మించుచున్నది. కనుక లెక్కలేనన్ని తలలోని యోచనల చేత కర్మవచ్చుచున్నదని, విషయరూపములో కర్మ ఉన్నదని తెలియునట్లు, కర్మకు గుర్తుగ వెంట్రుకలు నల్లగ పుట్టుచున్నవి. కర్మేంద్రియములలో ముఖ్యమైనవి కాళ్లు

చేతులు. కర్మ వలన జరుగు పనులను ఎక్కువ చేతులు కాళ్లు చేయుచున్నవి. పనులు చేయుటలో అన్నిటికంటే ముందు చేతులున్నను వాటి వలన కర్మ అంటడము లేదు. మేము నిమిత్త మాత్రముగ చేయుచున్నాము. మా వలనగాని, మాకు గాని కర్మ అంటదని తెలుపు నిమిత్తము చివరన గోర్లు తెల్లగ ఉన్నవి.

**795. (7) వాచా జ్ఞానము, సాధన జ్ఞానము అంటారు. ఈ రెండిటిలో ఏది ముఖ్యమైనది.**

జ. రెండు ముఖ్యమే.

**వివరము :** భగవద్గీతలో భగవంతుడు మొదట రెండు యోగములను గూర్చి చెప్పాడు. అందులో ఒకటి కర్మయోగము, రెండవది బ్రహ్మయోగము అంటాము. ఈ రెండు యోగములను తెలుసుకోవాలంటే మొదట ఎవరి ద్వారనైన నోటి ద్వార పలుకబడు మాటల ద్వారానే తెలుసుకో తగును. వాచా జ్ఞానము ద్వారానే యోగ విషయములు తెలియును. కొందరు వాచాజ్ఞానము మాకు అవసరము లేదు. ఎంత విన్నను చివరకు సాధన చేయవలసిందే కదా! కావున మాకు సాధన అవసరము అంటారు. సాధన చేయుటకైన అది ఎట్లు చేయవలయునో వాచాజ్ఞానము ద్వార తెలుసుకోవలసి ఉన్నది. శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పినది కూడ వాచా జ్ఞానమేనని మరువ కూడదు. మొదట గురువు ద్వారా విన్న వాచా జ్ఞానమును అమలు పరచుకొని సాధన జ్ఞానముగ చేసుకోవచ్చును. మొదట వాచా జ్ఞానము అవసరము. వాచా జ్ఞానము పూర్తి తెలుసుకొన్న తర్వాత సాధన జ్ఞానము అవసరము. వాచా జ్ఞానము పూర్తిగ తెలుసుకొనుటకు కొన్ని సంవత్సరముల కాలముపట్టును. పూర్తిగ తెలుసుకొన్న తర్వాత సాధన జ్ఞానము కొన్ని నిమిషములు లేక కొన్ని సెకండ్లలో తెలియును. వాచా జ్ఞానము లేనిది సాధన జ్ఞానము తెలియుటకు కొన్ని జన్మలయిన సాధ్యము కాదు.

# జ్ఞాన పరీక్ష

**ధర్మవరము** **తేది-08-09-2001**

**796. (1) ధైర్యము ఎవరికుంటుంది ధైర్యవంతునికా, పరాక్రమవంతునికా ఇంకా ఎవరికైనా ఉంటుందా?**

జ. జ్ఞానికి.

**వివరము :** పరధర్మములో భయముంటుందను గీతావాక్యము ప్రకారము భయము అజ్ఞాన సంబంధమైనదని, ధైర్యము జ్ఞాన సంబంధమైనదని తెలియుచున్నది. భయము ధైర్యము గుణముల గుంపులలో లేకున్నను సప్తగ్రహములకు రెండు ఛాయా గ్రహములైన రాహువు కేతువులు కలసినట్లు 12 గుణములకు రెండు ఛాయా గుణములు కలసి ఉన్నవి. అవియే ధైర్యము, భయము. వీటిని ఛాయా గుణములని చెప్పి గుణములుగనే లెక్కించవలసి ఉన్నది. ధైర్యవంతులమని చెప్పుకొను వారియందును మరియు పరాక్రమవంతులమని చెప్పుకొను వారి యందును నిజమైన ధైర్యముండదు. పరిస్థితులను బట్టి వారియందు భయము చోటుచేసుకొని ధైర్యము లేకుండ పోవును. సంపూర్ణ జ్ఞానియందు భయము చోటు చేసుకోవలెనని చూచినప్పటికి ధైర్యము నిలచి ఉండును. ధైర్యము జ్ఞాన సంబంధమైనది కావున జ్ఞానులు ధైర్యము కోల్పోరు. స్వధర్మములో చచ్చుటకైన సిద్ధపడుదురు కాని పరధర్మములోని భయమును పొందరు.

**797. (2) మూర్ఖుడంటే ఎవడు తెలివి తక్కువవాడా! చూడకుండానే నమ్మువాడా?**

జ. జ్ఞానము లేనివాడు.

**వివరము :** మూఢము మౌఢ్యము అను పదములు చీకటి అజ్ఞానము అను విషయమును తెలియజేయుచున్నవి, మూర్ఖము అనగ అజ్ఞానమని అర్థము.

మూర్ఖుడు అనగ అజ్ఞాని లేక జ్ఞానములేనివాడని చెప్పవచ్చును. తెలివి తక్కువవాడు చూడకుండ నమ్మువారు మూర్ఖులు కారు. తెలివి తక్కువ వారిలోను, చూడకుండ నమ్మువారిలోను జ్ఞానముండవచ్చును.

**798. (3) ప్రసాదమనగా ఏది కొబ్బరి నీళ్లా! తీపి పదార్థమా! ఇంకా ఏదయిన ఉండవచ్చునా?**

జ. ఆత్మశక్తి లేక దైవశక్తి కూడుకొన్న ఏ పదార్థమైన ప్రసాదమే.

**వివరము :** దేవాలయములో గాని మరెక్కడైన కాని దైవపూజ చేసినపుడు ప్రసాదము తీసుకొనుట సహజమే. పూర్వము పెద్దలు చెప్పిన ప్రకారము ఆరాధన విధానము తెలిసి, అదే పద్ధతి అదే భావముతో పూజచేసినట్లయితే, ఆ పూజ యొక్క ఫలితముగ కంటికి కనిపించని దైవశక్తి మనము ప్రసాదముగ తీసుకొను పదార్థములందు చేరిపోవును. పదార్థము ప్రసాదముగ మారుటకు అందులో దైవశక్తి చేరడమేనని తెలియవలెను. మంచి భక్తి జ్ఞాన భావముతో చేసిన ఆరాధనయందే అటువంటిశక్తి ఉండును. జ్ఞానములేని పూజ చేసితే పెట్టిన నైవేద్యము ప్రసాదముగ మారదు, పదార్థముగనే ఉండును.

**799. (4) ఎప్పుడైన ఎక్కడైన మనస్సులేని జీవి ఉన్నదా?**

జ. ఉన్నది.

**వివరము :** ప్రతి జీవికి, ప్రతి మనిషికి శరీరము కొన్ని భాగములుగ ఉన్నదని, అందులో బాహ్యేంద్రియములు అంతరేంద్రియములు కలవని, అంతరేంద్రియము లలో మనస్సు గలదని, చెప్పిన మీరే మనస్సు లేని జీవి కలదనుటకు కారణమేమిటని కొందరడుగ వచ్చును. దానికి జవాబు ఏమనగా! శరీరములో మనస్సు లేని జీవి ఉన్నదని ఇక్కడ నేను చెప్పలేదని గ్రహించవలెను. ఎప్పుడైన ఎక్కడయిన అను ప్రశ్నకు జవాబుగ పడుకున్న సమయములో, నిద్రావస్థలో మనస్సు బ్రహ్మనాడిలోని ఆత్మలో కలసి పోయినది. కావున అపుడు మనస్సు యొక్క పని ఏమి లేనిదానివలన ఆ సమయములో మనస్సు లేదనియే చెప్పవచ్చును. నిద్రలో లేని మనస్సు

మెలుకువలో ఉన్నది. నిద్రావస్థలో మనస్సు బ్రహ్మనాడిలో అనగి కనిపించకుండ పోవుచున్నది. అందువలన ఆ సమయములో మాత్రము లేదని చెప్పుచున్నాము. శాశ్వితముగ లేదనుకోకూడదు. శాశ్వితముగ మనస్సులేని జీవరాసి ఎక్కడ ఉండదు.

**800. (5) పుట్టినిల్లు మెట్టినిల్లు ఉన్నాయి. నీ బిడ్డకా, నీ కోడలుకా, ఇంకా ఎవరికైనా ఉన్నాయా?**

జ. సర్వ జీవులకు ఉన్నాయి.

**వివరము :** ఆధ్యాత్మికరీత్యా బిడ్డకు కోడలుకే కాక మొత్తము అందరికి పుట్టినిల్లు మెట్టినిల్లు గలదు. ప్రపంచ రీత్యా అయితే కూతురుకు పుట్టినిల్లు అయినది కోడలుకు మెట్టినిల్లు కావడము సహజము. జ్ఞానరీత్యా చూచినట్లయితే కూతురు యొక్క పుట్టినిల్లే కోడలుకు కూడ పుట్టినిల్లగుచున్నది. అందరికి ఒకటే పుట్టినిల్లు అందరికి ఒకటే మెట్టినిల్లుగ గలదు. సర్వ జీవులు మానవులు సహితము మొదట పరమాత్మ నుండి వచ్చారు, కనుక ఆ పరమపదము అందరికి పుట్టినిల్లు. మొదట పరమాత్మ నుండి వచ్చిన వారంత తిరిగి చివరకు పరమాత్మయందే ఐక్యమై పోవాలి. కావున అందరికి మెట్టినిల్లు కూడ పరమపదమే. పుట్టి వచ్చినది, అంత్యమై పోవునది, ఒకే స్థలము కావున అదియే అందరికి పుట్టినిల్లు, మెట్టినిల్లుగ ఉన్నది.

**801. (6) బ్రహ్మయోగి, కర్మయోగి తప్ప ఎప్పుడైన ఎక్కడయిన ఎవడైన అహము లేనివాడున్నాడా?**

జ. ఉన్నాడు.

**వివరము :** యోగులు మినహా సాధారణ వ్యక్తి మెలుకువ కల్గిన సమయములో అహము కల్గియే ఉండును. రాత్రి నిద్ర సమయములో నిద్రించువాడు అహమును కోల్పోయి ఉండును. అహము నిద్ర సమయములో పని చేయదు. మెలుకువలో ఉన్నవాడు పనిచేసినపుడు మాత్రమే అహము పనిచేయును. మెలుకువలో స్వప్నములో మనస్సువలె అహము పని చేయుచున్నది. నిద్రలో మాత్రము మనస్సువలె పని చేయడము లేదు. కావున ఆ సమయములో అహము లేదని చెప్పుచున్నాము.

**802. (7) స్త్రీ, పురుష, నపుంసకులలో స్త్రీని ప్రకృతితో, పురుషుని పరమాత్మతో పోల్చుచున్నాము. నపుంసకుని ఎవరితో పోల్చవచ్చును?**

జ. జీవాత్మతో.

**వివరము :** ఇంతకు ముందు ప్రశ్నలలో కూడ ఈ విషయమునకు జవాబు వచ్చి ఉంది. ఇపుడు కూడ కొంత చెప్పుచున్నాము. పరమాత్మ అంశయై కర్మబద్ధుడైన వాడు జీవాత్మ. జీవాత్మ కూడ పురుషుడే అయినప్పటికి స్త్రీ తత్త్వమైన ప్రకృతితో అనగా మాయతో మిలితమై ఉన్నాడు కనుక ప్రకృతి లక్షణములు జీవునియందు జీర్ణించి ఉన్నాయి. పరమాత్మ అంశయై పురుషుడైన జీవాత్మ కర్మబద్ధుడై మాయ భావములోనున్నందున సగము పురుషుడు, సగము స్త్రీగ పోల్చి నపుంసకునిగ వర్ణించుచున్నాము.

**803. (8) భగవద్గీత ఎవరి చేత, ఎవరి చుట్టు, దేని చేత గీయబడినది?**

జ. భగవంతునిచేత, జీవుల చుట్టు, జ్ఞానము చేత గీయబడినది.

**వివరము :** భగవద్గీతను భగవంతుడైన శ్రీకృష్ణుడు తెలిపాడు. భగవంతుడు జ్ఞానమనే హద్దును మానవుని చుట్టు గీచి చూపాడు. రామాయణములో లక్ష్మణుడు సీతకు హద్దునేర్పరచి, ఈ గీత దాటవద్దు ఈ గీత దాటితే ప్రమాదముంటుందని చెప్పాడట. అలాగే భగవంతుడు జ్ఞానహద్దును మానవునకు ఏర్పరచి, ఈ గీత దాటితే మాయ వలన ప్రమాదముంటుందని, ఈ గీత భావములోపలే ఉండమని చెప్పాడు. దేవుడు గీతగీచిన, గీతలోపలుండమని చెప్పిన, మనిషికి అజ్ఞానమను గ్రుడ్డి తనము చేత గీత కనిపించక, ఇది మనకు హద్దు అని తెలియక, దాని ధ్యాసే లేకుండ గీతను దాటి మాయ చేతికి చిక్కి పోతున్నాడు. మాయ అను రాక్షసికి దొరికినప్పటికి దాని నుండి రక్షణ కావలయునంటే, దేవుడు గీచిన భగవద్గీత భావములోనికి పోతేనే రక్షణ సాధ్యమగును. గీతలోపలికి పోనంతవరకు మాయ నుండి కాపాడువాడే లేదు.

**804. (9) ఆకలికి అన్నము, అలసటకు నిద్ర ఉన్నట్లు కష్టమునకు ఏది అవసరము?**

జ. జ్ఞానము.

**వివరము : "సర్వదుఃఖములకు హానికరము చేయునది జ్ఞానము"** అని గీతయందు చెప్పారు. జ్ఞానము కల్గిన మనిషికి కర్మ సిద్ధాంతమంతయు తెలిసి ఉండును. అటువంటి వ్యక్తికి ఎంత దుఃఖము కల్గినను అతను బాధపడడు. దుఃఖములకే కాక సంతోషములకు కూడ పొంగిపోడు, కష్టములకు కృంగిపోడు. ఆత్మజ్ఞానము వలన దుఃఖములను అనుభవించని స్థితికి మనిషి చేరుకొనును. ఆకలికి ఆహారము నివారణయైనట్లు, దుఃఖములకు జ్ఞానము నివారణయై ఉన్నది.

**805. (10) భార్య భర్తలని, లక్ష్మీనారాయణులని, పార్వతీ పరమేశ్వరులని, సీతారాములని మొదట ఆడవారిని తర్వాత మగవారిని పిలువడములో కారణమేమిటి?**

జ. జగతిలో దేవునికంటే మాయ ముందున్నది కనుక.

**వివరము :** జగతిలో దేవునికంటే మాయకు ఎక్కువ బలమున్నది. అంతేకాక ప్రతి ఒక్కరికి దేవునికంటే ముందు మాయ అర్థమగుచున్నది. ప్రకృతి పురుషులలో ప్రకృతి పేరు పురుషుని పేరుకంటే ముందు చెప్పబడుచున్నది. విశ్వమంతట బలము కల్గినవాడు, జగతిలో జీవరాసులవద్ద మాత్రము బలము లేనివాడుగ ఉంటే, అతనిచేతనే సృష్ఠింపబడిన మాయ అతనికంటే ఎక్కువ బలము కల్గి ఉన్నది. దేవుడే మనిషిగ మనుషుల వద్దకు వచ్చిన ఆయనను కూడ బలహీనుని చేసి కష్టాలపాలు చేయు సామర్థ్యము కల్గి ఉన్నది. మాయ స్త్రీ పోలికకాగ, పరమాత్మ పురుషుడై ఉన్నాడని చెప్పాము కదా! స్త్రీ అంశ కల్గిన మాయ తనదైన గొప్ప తనమును అహర్నిశలు ప్రకటించుకొనుచున్నది. ప్రతి చోట జంటలలో స్త్రీ పేరు ముందు రావడమే కాక చివరకు కాయకూరలు అమ్మువాడు కూడ వంకాయలమ్మో

అంటున్నాడు వంకాయలయ్యో అనడము లేదు. జగతిలో మాయ తత్త్వము ఎక్కువ, దైవతత్త్వము తక్కువ ఉన్నదనుటకు ఇలాంటివి చాలా నిదర్శనములు కలవు.

## జ్ఞాన పరీక్ష

**కొత్తకోట** **తేది-06-10-2001**

**806. (1) అందరిలో ఉండి బయటంతటలేనిది, అంతట ఉండి అందరిలో ఉన్నది, అందరిలో అంతటలేనిది బయటలేనిది ఏది?**

జ. ఆత్మ, పరమాత్మ, జీవాత్మ.

**వివరము :** అందరిలో ఉండి అంతట లేనిది ఆత్మ. ప్రతి జీవరాసిలోను ఆత్మ శరీరమంత వ్యాపించి ఉన్నది. ఆత్మయే ప్రతి శరీరములోను కదలికలిచ్చుచున్నది. శ్వాసను ఆడించుచున్నది. శరీరములలో మాత్రము జీవాత్మతో పాటు నివాసము చేయునది ఆత్మ. శరీరముల లోపల తప్ప శరీరముల బయట ఏమాత్రము ఆత్మ లేదు. అందువలననే అందరిలో ఉన్నదని, బయట ఎక్కడ లేదని, ఆత్మను గూర్చి చెప్పాము. అంతట ఉన్నది, అందరిలో ఉన్నది పరమాత్మ. పరమాత్మ ప్రతి అణువులోను వ్యాపించి ఉన్నది. శరీరములోపల శరీరము బయట ప్రతి పదార్థము నందును, పదార్థములేని శూణ్యమునందును, అణువులోను పరమాణువు లోను వ్యాపించినది పరమాత్మ. ఇందు గలడందులేడనుటకు వీలులేకుండ మొత్తమంత వ్యాపించివాడు పరమాత్మ కావున ఆయనను అంతట ఉన్నాడని, అందరిలో ఉన్నాడని చెప్పవచ్చును. పరమాత్మ అన్ని తానై ఉండుటవలన ఉంది అని, ఉన్నాడు అని స్త్రీలింగ పురుషలింగములను రెండిటిని వాడుచున్నాము. ఇకపోతే అంతట అందరిలో లేనిది జీవాత్మ. జీవాత్మ శరీరములలో మాత్రము నివశిస్తున్నది. అదియు ఆత్మవలె శరీరములో అంతట వ్యాపించక తలలో ఒక్కచోట గుణచక్రములో మాత్రము ఉన్నది ఒకే విధమైన జీవాత్మ అందరిలో లేదు. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క జీవాత్మ నివశిస్తున్నది. ఒక శరీరములో ఉన్న జీవాత్మకు మరియొక శరీరములో ఉన్న జీవాత్మకు కర్మలో ఎన్నో తేడాలుండును. కావున ఆత్మవలె ఒక్క

దానిగ లెక్కించుటకు వీలు లేదు. శరీరములో మాత్రముంటు శరీరము బయట లేనిది జీవాత్మ. అన్ని శరీరములలో ఒక్కటే లేదు కావున అందరిలో లేనిదని, శరీరము బయట లేదు కావున అంతట లేనిదని జీవాత్మను గూర్చి చెప్పారు. ఈ ప్రశ్నలో మూడు ఆత్మల ఉనికిని ప్రత్యేకతను తెలిపారు. ఇంతవరకు ఎచట చెప్పబడని మూడు ఆత్మల విషయము అనగా త్రైత సిద్ధాంతమును బాగా అర్థము చేసుకోగలరని ఆశిస్తున్నాము. త్రైత సిద్ధాంతమును అర్థము చేసుకొంటే జ్ఞానము సులభముగ అర్థము కాగలదు.

**807. (2) హృదిలో, మదిలో ఉన్నదేది?**

జ. ఆత్మ, విషయములు.

**వివరము :** అందరి హృదయాలలో ఆత్మ నివాసమై ఉన్నది. హృదయమనగా గుండె అనుకోవద్దండి. మెదడు నుంచి వ్యాపించిన బ్రహ్మనాడినే హృదయముగా భావించవలెను. బ్రహ్మనాడిలో నివశిస్తు శరీరమంత ప్రాకినది ఆత్మ. కావున హృదిలో ఉన్నది ఆత్మేనని చెప్పవచ్చును. అలాగే మదిలో ఉన్నది విషయముల జ్ఞాపకములని చెప్పవచ్చును. మది అనగా మనస్సు, మననము చేయునది మనస్సు. సర్వ విషయములు మనస్సు నుండే వచ్చుచున్నవి కావున మనస్సులో ఉన్నవి విషయములన్నాము.

**808. (3) ఇలలో నీకు చివరి దినము ఏది?**

జ. ముక్తి దినము.

**వివరము :** ఇల అనగా ప్రపంచము అని అర్థము. ప్రపంచములో పుట్టిన ప్రతి ఒక్కరికి మొదటి దినము, చివరి దినము రెండు గలవు. పుట్టిన దినము మొదటి దినమని, చచ్చిన దినము చివరి దినమని చాలా మంది అనుకొంటుంటారు. ఎన్నోమార్లు పుట్టుచున్న మనకు ఎన్నో పుట్టిన మొదటి రోజులు, ఎన్నో మరణించిన చివరి రోజులు గలవని తలచువారు గలరు. ఇచట మేము అలా అనుకొనుట సరికాదని చెప్పుచున్నాము. చచ్చిన దినమును ఆ జన్మకు చివరి దినమగును

కాని వానికి కాదు. అలాగే పుట్టిన దినము కూడ ఆ జన్మకే మొదటి దినమగును కాని వానికి కాదని తెలియాలి. ఏ జీవునికైన మొదటి దినము, చివరి దినము ఒకటే ఉంటుంది, అనేకము ఉండవు. పరమాత్మ నుండి బయటికి వచ్చి జీవునిగ శరీరము ధరించిన ఆదిలోని పుట్టుక దినమే మొదటి దినము. అలాగే ఎప్పటికయిన జ్ఞానము ద్వార కర్మ శేషమును లేకుండ చేసుకొని, తిరిగి పరమాత్మలోనికి ఐక్యమైన రోజు అనగా ముక్తి పొందిన దినము చివరి దినమగును. ప్రపంచములో పుట్టుక, పరమాత్మలోనికి కలయిక జీవాత్మకు మొదటి దినము చివరి దినముగ గుర్తింపబడుచున్నవి.

**809. (4) ప్రపంచమునకు చివరి దినమేది, ఆ దినము పేరేమి?**

జ. ప్రళయము, శనివారము.

**వివరము :** ప్రపంచానికి చివరి దినము మొదటి దినము కలవు. ప్రభవము ప్రపంచము యొక్క మొదటి దినము. కల్పములో రెండు వేల యుగములుండగ వేయి యుగములు ప్రపంచముండుట, వేయి యుగములు ప్రపంచము లేకుండుట గలదు. ప్రపంచముండుటను ప్రభవమని, లేకుండపోవుటను ప్రళయమని అంటున్నాము. ప్రభవములో మొదటి దినము ప్రపంచము పుట్టిన దినముగ లెక్కించుచున్నాము. ప్రభవము వేయి యుగములు అయిపోయిన తర్వాత ప్రపంచము చివరి దినముతో ప్రళయము ప్రారంభమగుచున్నది. ప్రళయముకంటే ముందు దినము ప్రపంచమునకు చివరి దినమగును. ప్రపంచము నవగ్రహములను ఆధారము చేసుకొని నడుస్తున్నది. ప్రపంచము మొదటి నుండి చివరి వరకు సప్త గ్రహముల అధికారము చలామణి అగుచున్నది. మొదటి దినము సూర్యుని అధికారముతో మొదలగుచున్నది. చివరి దినము శనివారముతో ముగియుచున్నది. వారములలో మొదటి వారము అని తెలియునట్లు ఆదివారము అని పేరు పెట్టారు. ఆది అనగ మొదలు అని అర్థము. చివరి దినము అనగ శనివారము అని అందరికి తెలుసు. అదియే ప్రపంచమునకు కూడ చివరి దినము.

**810. (5) ఇలలో ప్రకృతి పురుషుల చిహ్నమేదైన ఉన్నదా?**

జ. పాణి మట్టము, శివ లింగము.

**వివరము :** ప్రపంచానికే మూలాధారమైన ప్రకృతి పురుషులను అందరు గుర్తించునట్లు, అందరికి ప్రకృతి తల్లి, తండ్రి పరమాత్మ అని తెలియునట్లు, దేవునికి ఆకారము లేదన్నట్లు, ఆకారము లేని పరమాత్మకు ప్రకృతి ఆధారభూతమైనదని తెలియునట్లు, ప్రకృతికి స్త్రీ స్వరూపమైన భగము యొక్క ఆకారము నుంచి, పరమాత్మకు పురుష స్వరూపమైన లింగము యొక్క ఆకృతిని కల్పించి, రెండిటిని కలిపి రెండు కనిపించునట్లు లింగ ప్రతిష్ఠ చేసిపెట్టారు. ఎక్కడయిన పాణిమట్టముతో కూడుకొన్న లింగమే ఉండును. దాని ఆధారముతో ప్రపంచములో పరమాత్మ ప్రకృతితో కూడుకొని ఉన్నదని తెలియుచున్నది. ప్రకృతికి ప్రతి రూపము పాణిమట్టమని, పరమాత్మకు ప్రతిరూపము లింగమని తెలియాలి.

**811. (6) ఇలలో రోగమును పుట్టించువాడు, రోగమునకు మందు సృష్టించువాడు ఎవడు?**

జ. రోగము పుట్టునది ఆత్మశక్తి వలన గ్రంధుల పని తనముతో. అట్లే మందును కూడ గ్రంధుల వలననే ఆత్మ పుట్టించుచున్నది.

**వివరము :** శరీరములో రోగము పుట్టునది శరీరములోని గ్రంధుల వలననే. శరీరములోని ఏడు గ్రంధులలోను ఆత్మ శక్తి పని చేయుచున్నది. ఆత్మ కర్మ చక్రములోని కర్మను బట్టి తన శక్తిలో మార్పులు చేయుచుండును. శక్తి మార్పులను బట్టి గ్రంధులు పని చేయుచు శరీర ఆరోగ్యమును అనారోగ్యమును సృష్టించు చున్నవి. శరీరములో ఒక రోగము వచ్చిందంటే అది గ్రంథుల వలననే వచ్చినదని తెలియాలి. రోగమునకు పైకి కనిపించు కారణములెన్ని ఉండిన, మూలము గ్రంథుల పని తనమేయని గ్రహించాలి. ఇప్పటివరకు రోగమునకు కారణములు కనుగొన్న భౌతిక శాస్త్రవేత్తలుండినప్పటికి పై కారణముల వరకే వారి దృష్టి పరిశోధన కలదు. అన్ని రోగములకు మూల కారణము గ్రంథులను విషయము తెలియదు.

అంతేకాక రోగమునకు కనుగొన్న ఔషధముకంటే గ్రంథులలో తయారగు రోగమునకు విరుగుడు చాలా శక్తివంతమైనదను విషయము కూడ తెలియదు. ఈ విషయములలో మా మాట మీద చాలామందికి నమ్మకము లేక పోయినను, ఇది సత్యమైన మాటయే. అందువలన రోగము ఔషధము రెండు గ్రంథులలోని ఆత్మ శక్తి వలననే తయారగుచున్నదంటున్నాము.

**812. (7) హృదికి మదికి ఎంత దూరమని పోల్చి చెప్పవచ్చును?**

జ. కాయకు తొక్కకు ఉన్నంత దూరము.

**వివరము :** హృది అనగా ఆత్మయని, మది అనగా మనస్సని అర్థము చేసుకోవలెను. ఆత్మ మనస్సు శరీరమంత వ్యాపించి ఉన్నాయి. మనస్సు మెలుకువలో మాత్రమే శరీరమంత ఆక్రమించి ఉండును. ఆత్మ శరీరమంత అహర్నిశలు వ్యాపించి ఉన్నది. ఎల్లపుడు వ్యాపించిన ఆత్మను, మెలుకవ వచ్చిన వెంటనే మనస్సు ఆక్రమించి కప్పివేయుచున్నది. మనస్సు అడ్డు ఉండుట వలన ఆత్మ జీవునికి తెలియడము లేదు. ఉదాహరణకు ఒక చీనీకాయను తీసుకొందాము. లోపల రసముసారముతో నిండిన చీలిక తొనలుండగ పైన తొక్క కాయనంత ఆక్రమించి తొక్కయే కనిపిస్తున్నది. తొక్క తీసిన లోపల రసము రుచిసారము నిండిన పండు కనిపించును. చీనికాయవలె (బత్తయివలె) ఆత్మ మనస్సులు గలవు. రససారముతో నిండిన లోపలి చీలికలు ఆత్మ అనుకొనుము. దానిని కప్పిన తొక్కను మనస్సనుకొనుము. తొక్క పైనుండుట వలన లోపలి ఆకారము కనిపించనట్లు మనస్సు ఆత్మను వ్యాపించి కప్పి ఉండుట వలన మనకు మనో విషయములే కనిపిస్తున్నవి. లోపలి ఆత్మ కనిపించడము లేదు. అందువలన హృదిని మదిని చీనికాయతో దాని తోలుతో సమానముగ మరియు అరటి పండుతో దాని తొక్కతో సమానముగ పోల్చి చెప్పవచ్చును. హృదికి మదికి దూరము కాయకు తొక్కకున్నంత దూరమని చెప్పవచ్చును.

**813. (8) బోధించినవాడొకడే అయినపుడు మతములు దేనివలన ఏర్పడ్డాయి?**

జ. మాయ వలన. (సాతాన్ లేక సైతాన్ వలన)

**వివరము :** బోధించిన వాడు ఒకడే, బోధింపబడిన విషయము ఒకటే అయినప్పటికి, మాయ బోధించినవానికి విన్న వారికి మధ్యలో ఉండి, బోధింపబడిన విషయము వేరు వేరు విధముల అర్థమగునట్లు చేసినది. కావున విషయమొక్కటే అయినప్పటికి వేరు వేరు మతములుగ తయారైనది. వినే వానికి భావములో భేదమొచ్చినది, కావున చెప్పిన వాడు కూడ వేరు వేరనునట్లు మాయ మంత్రించి పెట్టినది. బోధించిన వాడు వేరు వేరు స్థలములలో బోధించుట వలన, వేరు వేరు రూపములలో బోధించుట వలన, మాయ దానిని మంచి అవకాశముగ తీసుకొని విన్నవారికి బోధించినవాడు వేరు వేరన్నట్లు తలపింపజేసినది. మాయ ప్రభావము మనుషుల మదిలో ఇమిడి ఉన్నందున మతములు, దేవుడు వేరువేరైనారు. ఇపుడు దేవుడు దిగివచ్చి అక్కడ ఇక్కడ ఉన్నది నేనేనని, చెప్పినది నేనేననిన ప్రజలు వినే పరిస్థితులలో లేరు. మతాల మౌఢ్యము పోవాలంటే పరమాత్మ మరోమారు జన్మ ఎత్తి, తొందరగ అవతారము చాలించక, కనీసము వేయి సంవత్సరములుంటే గాని సాధ్యపడదేమో! కావున అందరము ఆయన రాక కొరకు ఎదురుచూస్తాము.

**814. (9) ఇలలో నీకు అనుకూలము, అనానుకూలము దేనివలన జరుగుచున్నది?**

జ. ప్రారబ్ధకర్మ వలన.

**వివరము :** ప్రతి మనిషికి ప్రారబ్ధకర్మ వలననే ప్రపంచములో అన్ని జరుగుచున్నవి. కష్ట సుఖములు గాని, అనుకూల అనానుకూలములు గాని ఏవైన కర్మననుసరించి జరుగ వలసిందే. కొందరు డబ్బుంటే జరుగుతుందని, కొందరు తెలివి ఉంటే

జరుగుతుందని, మరికొందరు బలముంటే జరుగుతుందని అంటుంటారు. వారనుకొన్నట్లు ధనము వలననో, బలము వలననో, తెలివి వలననో జరిగినప్పటికి ఆ ధనము, బలము, బుద్ధి అన్నియు కర్మ వలన ప్రాప్తించుచున్నవని తెలియాలి. వెనుక కర్మ కనిపించక ఉండి కనిపించు కారణములచేతనే జరిపించుచుండును. అంత మాత్రమున పైకి కనిపించు వాటివలననే అన్ని జరుగుచున్నవనుకోకూడదు. అన్నిటికి మూలకారణముగ ప్రారబ్ధకర్మ గలదని తెలియవలెను.

**815. (10) నీ శరీరము యొక్క ఆయుస్సు ముందు తెలిస్తే, నీ వేమి చేస్తావు?**

జ. నేనయితే జ్ఞానము మీద శ్రద్ధ పెంచుకుంటాను.

**వివరము :** భూమి మీద అజ్ఞానులు, జ్ఞానులను రెండు విధముల మనుషులు గలరు. ఆయుస్సు ముందే తెలియుట వలన జ్ఞానులు ఒక విధముగ అజ్ఞానులు మరొక విధముగ ప్రవర్తించుదురు. జ్ఞానులైతే తమకున్న ఆయుస్సు తక్కువ అని తలచి, అంతలోపే సంపూర్ణ జ్ఞానమును తెలిసి దైవసన్నిధి చేరవలెనని శ్రద్ధకల్గి, అహర్నిశలు జ్ఞానము కొరకు ప్రాకులాడుచుందురు. అదే అజ్ఞానులైతే తమ మరణమును తలచుకొని దుఃఖించుటకు మొదలిడుదురు. అటువంటివాడు మరణము రాకమునుపే కృంగి కృశించి పోవును. భూమి మీద ఉన్న వస్తువులను మనుషులను వదలి పోతానే అని పోకముందే దుఃఖములో మునిగిపోవును. అప్పటికయిన ప్రపంచ విషయముల మమకారము వదలి దైవవిషయముల వైపు మనస్సును మల్లించడు.

## జ్ఞాన పరీక్ష

**కె. నర్సాపురము** **తేది-24-12-2001**

**816. (1) బిక్షాందేహి అంటారు. బిక్ష ఎవరికి అవసరము? ఆత్మకా, జీవాత్మకా?**

జ. ఆత్మకు.

**వివరము :** శరీరమును కదలించి ఆడించునది ఆత్మ. శరీరమును కదలించు పని జీవాత్మకు లేదు. దానికి ఏ పని చేత కాదు. అన్ని అవయవములను కదలించుటకు ఆత్మకు కూడ కొంత శక్తి అవసరము. ఆశక్తి మనము భుజించు ఆహారములో గలదు. ఆహారములోని పోషక పదార్థముల వలన ఏర్పడు శక్తిని ఆత్మ అవయవముల ఎడల వినియోగిస్తు కార్యముల చేయిస్తూ ఉన్నది. ఒక్క రోజు ఆహారము తీసుకోకపోతే సాయంకాలానికి ఆత్మ సత్తు తక్కువై శరీరము పనిచేయలేని స్థితి ఏర్పడును. ఆహారము తింటూనే కొద్ది సేపటికి తిరిగి శక్తి ఏర్పడుచున్నది. దీని వలన ఆహారము వలన ఆత్మకు శక్తి వస్తున్నదని, ఆహారము లేని దానివలన ఆత్మ శక్తిహీనమగు చున్నదని తెలియుచున్నది. ఆహారము లేకపోతే జీవునికి ఆకలి బాధ ఏర్పడుచున్నది. కాని జీవుడు శక్తిహీనుడు కాడు. బాధ సుఖము అనుభవించడము జీవునికి పరిపాటియైన విషయము. కావున అందులో ఇది ఒక అనుభవమే కాని క్రొత్త కాదు. ఆత్మకు ఆహారము లేకపోతే శక్తిహీనుడైపోయి చివరికి ఆత్మ మరణమగును. అనగా ఆత్మ హత్య అగును. శరీరమంత వ్యాపించి పోషించి కదలించు ఆత్మ బలహీనమగుట వలన శరీరము కూడ బలహీనమై పోవును. లేవలేని బలహీన శరీరములో ఆత్మ కూడ బలహీన ఆత్మయే ఉండునని తెలియుము. దీనివలన ఆహారము ఆత్మకే వినియోగించబడుచున్నదని చెప్పవచ్చును. ఆహారము వలన ఆత్మ చైతన్యము, కర్మ వలన జీవాత్మ మనుగడ కలదని తెలియవలెను. ఒక మనిషికి గాని, జంతువుకు గాని ఆహారము పెట్టడము వలన అది ఆత్మకే చెందును. అందువలననే వస్తుదానములో అన్న దానమే గొప్ప అని పెద్దలన్నారు. జీవునికి జ్ఞాన దానము, ఆత్మకు అన్నదానము ముఖ్యము. మూడు పూటల భోజనము చేయువాడు మూఢభక్తితో రోజంతయు ఉపవాసముంటే అది ఆత్మద్రోహమే అగును. మూఢ అనగ అజ్ఞాన అని అర్థము. మూఢ భక్తి అనగ అజ్ఞాన భక్తి అని అర్థము. ఉపవాసముండుట అజ్ఞాన భక్తియే కాని ఆత్మ జ్ఞాన భక్తి కాదు. ఉపవాసము ఆత్మహింస అగును. అందువలన పాపమొచ్చుట నిజము. దీనిని బట్టి ఆహారము శరీరములో ఆత్మకు అవసరమని తెలిసి, ఎవరు ఉపవాసముండక, ఆత్మజ్ఞానము తెలియాలని కోరుచున్నాము.

**817. (2) మద్యము తాగినపుడు మత్తు ఎవరికి ఏర్పడును? ఆత్మకా జీవాత్మకా?**

జ. ఆత్మకు.

**వివరము :** మద్యము త్రాగుట వలన శరీరములోని జీవునికి ఒక విధమైన ఆనందమేర్పడుచున్నది. జీవుడు సుఖ దుఃఖములు అనుభవించేవాడేనని ముందే తెలుసుకొన్నాము. అందువలన మత్తులోని మజాను జీవాత్మ అనుభవిస్తుండగ శరీరమును నడిపించు ఆత్మ మత్తువలన బలహీనమై శరీరమును సరిగ కదలించ లేక నడిపించ లేకపోవుచున్నది. ఒక స్థాయి మత్తుకు సరిగ నడిపించ లేక పోవడము, ఎక్కువ స్థాయి మత్తుకు శరీరము తూలి క్రింద పడు బలహీనతకు చేరడము జరుగుతుంది. శరీరమునకు శక్తి నిచ్చు ఆత్మ తన శక్తిని మత్తులో కోల్పోవుచున్నది. మద్యము సేవించినపుడు జీవాత్మ ఆనంద మనుభవించగ, ఆత్మ మత్తును పొంది బలహీనపడుచున్నది. దీనివలన మత్తు ఆత్మకు, ఆనందము జీవాత్మకు చేరుచున్నదని చెప్పవచ్చును. మద్యములోని మత్తు ఆత్మ మీద పనిచేయుచున్నదని తెలియవలెను. ఆత్మను బలహీనపరచు మత్తువాడుట ఆత్మకు ద్రోహము చేసినట్లగును.

**818. (3) శరీరములో జ్ఞానము తెలుసుకొనునది ఎవరు? ఆత్మనా జీవాత్మనా ఎవరు?**

జ. ఏదికాదు బుద్ధి.

**వివరము :** శరీరములోని ఆత్మకు జ్ఞానమనునది తన విషయమే కావున తనకు అది అవసరము లేదు. ఆత్మ విషయము ఆత్మకు తెలుసు కాబట్టి ఆత్మ జ్ఞానమును తెలుసుకొనదు. జీవాత్మ కష్ట సుఖములననుభవించునదే కావున దానికి కూడ జ్ఞానముతో పని లేదు. జీవునికి అనుభవముల ననుభవించుట తప్ప వేరు ఏది తెలియదు. కావున శరీరములో ఆత్మగాని, జీవాత్మ గాని జ్ఞానమును తెలియవు. ఆత్మ జీవాత్మ కాక శరీరములోని బుద్ధి మాత్రము జ్ఞానమును తెలియుచున్నది. అందువలన జ్ఞానమును గ్రహించుకొన్న బుద్ధిగలవారై ఉండవలెనని తెలుపు

చున్నాము. అన్నిటిని గ్రహించుకొను బుద్ధి కొంతకు కొంతైన జ్ఞానమును తెలుసుకొనుట మంచిది. బుద్ధి జీవునిలో భాగమైవున్నందు వలన ప్రత్యేకించి జీవుడు జ్ఞానమును తెలుసుకోకున్నను, బుద్ధి తెలుసుకొంటే జీవుడు తెలుసుకొన్నట్లే అవుచున్నది.

**819. (4) బరువు మోయునపుడు భారము ఎవరికి ఏర్పడును? ఆత్మకా జీవాత్మకా?**

జ. ఆత్మకు.

**వివరము :** బరువును మోయునపుడు శరీరమంత ఆవహించిన ఆత్మకే బరువగును. మోయు జాగాలోని శరీర భాగములో గల ఆత్మ శక్తికి గ్లాని కూడ ఏర్పడును. గ్లాని అనగ బలహీనపడడమని అర్థము. శరీర భాగములలోని గ్లాని ఆత్మకే గాని ఎచటనో దూరముగ ఉన్న జీవాత్మకు గాదు. జీవాత్మ బరువు మోయుట వలన ఏర్పడిన కష్టమును, గ్లాని వలన కల్గిన బాధను అనుభవిస్తున్నది. శరీరమంత వ్యాపించిన ఆత్మయే వస్తువు యొక్క భారమును పొందుచున్నది. ఆ భారము వలన తన శక్తిని కూడ కోల్పోవుచున్నది. వస్తువు మరీ భారమైనదైతే శరీరము మోయ లేని స్థితికి వచ్చుచున్నది. అనగా ఆత్మ మోయలేని స్థితికి వచ్చినదన్నమాట. దీనిని బట్టి భారము మోయువాడు ఆత్మని తెలియుచున్నది. బాధను అనుభవించు వాడు జీవాత్మని తెలియుచున్నది.

**820. (5) మోక్షము పొందినపుడు పరమాత్మయందైక్యమగు వాడు ఆత్మనా? జీవాత్మనా?**

జ. ఆత్మ, జీవాత్మ ఇద్దరు.

**వివరము :** ఒక్కొక్క జీవునికి ఒక్కొక్క ఆత్మ జోడై ఉండును. ఆత్మను జీవాత్మ, జీవాత్మను ఆత్మ వీడరాని వారై ఉన్నారు. చావులోను పుట్టుకలోను ఒకరి వెంట ఒకరు ప్రయాణిస్తు, యుగాల పర్యంతము కాలము గడపిన వారు, కర్మ రాహిత్యము వలన జీవుడు మోక్షము పొందువేళ, జీవునితో పాటు అంత కాలమున్న ఆత్మ

కూడ పరమాత్మలోనికే ఐక్యమగును. ఒక్క శరీరములోని జీవాత్మ, ఆత్మ ద్వార పరమాత్మలోనికి ప్రవేశిస్తున్నది. దీనివలన ఆత్మ, జీవాత్మ రెండు మోక్షము పొందినట్లగును. జీవాత్మ మోక్షము పొందవచ్చును, గాని ఆత్మ మోక్షము పొందడమేమిటని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి జవాబు ఏమనిన పరమాత్మ అఖండమైనది. ఆత్మ ఖండమైనది, ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క ఆత్మ గలదు. వేరు వేరు శరీరములలో వేరు వేరు జీవాత్మలున్నట్లు, వేరు వేరు శరీరములలో వేరు వేరు ఆత్మలున్నవి. ఆత్మలు అనేకమైనప్పటికి వాటి అంశ ఒకటేయైనందు వలన, ఒక్క శరీరములోని ఆత్మ ఏ పనికై నియమింపబడి ఉన్నదో, అన్ని శరీరములలోని ఆత్మలు అదే పని కల్గియున్నవి. ఒక శరీరములోని ఆత్మ జీవునితో పాటు మోక్షము పొందిన, మిగత శరీరములలోని ఆత్మలు ఒకే అంశతో, ఒకే పని చేయుచుండును. ఎప్పటి వరకు జీవాత్మలుండునో, అప్పటి వరకు ఆత్మలుండును. దీనివలన జీవుడు మోక్షము పొందినపుడు ఆ శరీరములోని ఆత్మ కూడ మోక్షము పొందుచున్నది.

**821. (6) కన్ను బాగుండి చూడలేని గ్రుడ్డివాని కంటిలో లేనిది ఏది? ఆత్మనా జీవాత్మనా?**

జ. జీవాత్మ.

**వివరము :** కన్ను గ్రుడ్డిదైన మంచిదైన అందులో ఆత్మ వ్యాపించి ఉన్నది. జీవాత్మ మాత్రము మంచి కన్నులో గాని, గ్రుడ్డి కన్నులోగాని వ్యాపించి ఉండదు. కన్ను బాగుంది కాబట్టి ఆత్మ వ్యాపించి ఉన్నదని చెప్పవచ్చును. అది గ్రుడ్డిది కావున దానికి చూపులేదు. కాని అందులో ఆత్మ గలదు. జీవాత్మ ఏ కన్నులో ఉండదు. అది తలలోని గుణచక్రములో ఉండును.

**822. (7) శరీరము మీద ఆధారపడి బ్రతుకునది ఎవరు? ఆత్మనా జీవాత్మనా?**

జ. ఆత్మ.

**వివరము :** శరీరమంత వ్యాపించి శరీరము మీద ఆధారపడి ఉన్నది ఆత్మ. శరీరము ఖండించబడితే ఆత్మ అందులో నివాసముండ జాలదు. శరీరముతో పాటు ఆత్మ కూడ ఖండించబడును. అందువలన శరీరము మీద ఆధారపడినది ఆత్మనియే చెప్పవచ్చును. శరీరము నాశనమైతే మొదట ఆత్మ శరీరమును వదలవలసి ఉండును. దాని వెంట జీవాత్మ కూడ పోవును.

**823. (8) శరీరములో ఆయుస్సు ఉన్నది. అది ఆత్మకా? జీవాత్మకా?**

జ. ఆత్మకు, జీవాత్మకు ఇద్దరికి.

**వివరము :** శరీరములో ఆయుస్సు ఆత్మకు మరియు జీవాత్మకు ఇద్దరికి ఉన్నది. ఆత్మ ఆయుస్సు అయిపోతే అది అకాల మరణమగును. ఒక వేళ జీవాత్మకు ఆయుస్సు అయిపోతే అది కాలమరణమగును. శరీరములో ఆత్మకు ఆయుస్సు అయిపోతే ముందు ఆత్మ బయటికి పోవలసి ఉండును. అలాగే జీవాత్మకు ముందు ఆయుస్సు అయిపోతే జీవాత్మ ముందు బయటికి పోవలసి ఉండును. జీవాత్మ ముందు పోతే దాని వెంట ఆత్మ కూడ పోవును. ఒక వేళ ఆత్మ ముందు పోతే దాని వెంట జీవాత్మ కూడ పోవలసి ఉండును. అందువలన ఆత్మకు, జీవాత్మకు ఆయుస్సు కలదని చెప్పవచ్చును.

**824. (9) జన్మలో మొదట శరీరములో ప్రవేశించునది ఆత్మనా జీవాత్మనా?**

జ. ఆత్మ.

**వివరము :** జన్మలో శరీరములో ప్రవేశించునది ఆత్మయే. కాల కర్మ గుణ చక్రములలో ఆత్మ వ్యాపించి ఉన్నది. జీవాత్మ గుణ చక్రములో ఒక భాగములో మాత్రమే ఉండును. గుణ కర్మచక్రముల చివరి అంచువరకు ఆత్మ వ్యాపించి ఉన్నది. కనుక శరీరములో ఆత్మయే ప్రవేశిస్తున్నదని చెప్పవచ్చును.

**825. (10) శరీరములో ఎక్కువ బరువైనది ఆత్మనా జీవాత్మనా?**

జ. ఆత్మ.

**వివరము :** శరీరము మొత్తము వ్యాపించి ఉన్నది ఆత్మ. జీవాత్మ శరీరములో ఒక్క చోట మాత్రమున్నది. ఆత్మ ఆవరణ విస్తీర్ణము జీవాత్మ విస్తీర్ణముకంటే ఎన్నో రెట్లు ఎక్కువ, కావున జీవాత్మకంటే ఆత్మయే ఎక్కువ బరువైనదని చెప్పవచ్చును. ఆత్మలకు బరువుండునా అని కొందరనుకోవచ్చును. ఆత్మ జీవాత్మలకు ఆకారము పరిణామము మరణము ఉన్నపుడు బరువెందుకు ఉండదు. ఆకారమున్నది, పేరు ఉన్నది, చావున్నది, నాశనమున్నది అట్లే బరువు కలదని తెలియాలి.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-28-01-2002**

**826. (1) ఆత్మలో పరమాత్మ ఉన్నదా? పరమాత్మలో ఆత్మ ఉన్నదా?**

జ. ఆత్మలో పరమాత్మ ఉన్నది. పరమాత్మలో ఆత్మ ఉన్నది.

**వివరము :** ఆత్మలో పరమాత్మ ఉన్నది. పరమాత్మలో ఆత్మ ఉన్నది. పరమాత్మ సర్వవ్యాపి, అణువణువున వ్యాపించినవాడు, పరమాత్మ లేనిదేది లేదు. అంతట వ్యాపించిన పరమాత్మ ఆత్మలో కూడ కలదు. కావున పరమాత్మ ఆత్మలో ఉన్నాడనియే చెప్పవచ్చును. పరమాత్మ అన్నిటియందుండడమే కాక సర్వత్ర వ్యాపించిన పరమాత్మ యందు అన్ని ఉన్నవి. సమస్త ప్రపంచము పరమాత్మయందే ఉన్నది. కావున ఆత్మలు, జీవాత్మలు, పంచభూతములు, సమస్త వస్తుజాలము ఆయనయందే ఇమిడి ఉన్నవి. అందువలన పరమాత్మయందు ఆత్మ గలదని చెప్పవచ్చును. అన్నిటి యందు, అన్నిటి బయట ఉన్నది పరమాత్మ ఒక్కటే, కావున ఆత్మలో పరమాత్మ ఉన్నదని మరియు పరమాత్మలో ఆత్మ ఉన్నదనియు చెప్పవచ్చును. చైతన్యము కల్గిన ఆత్మయందేకాక, చైతన్యములేని ఏ వస్తువుయందైన పరమాత్మ ఉన్నదని చెప్పవచ్చును. అట్లే ఏ వస్తువైన పరమాత్మయందే గలదని కూడ చెప్పవచ్చును.

**827. (2) ప్రపంచము గతించిన తర్వాత కూడ పరమాత్మ ఉన్నది. అపుడు దానిని పరమాత్మ అనవచ్చునా? లేక పురుషోత్తమా అనవచ్చునా? ఏమనవచ్చును?**

జ. అవ్యక్తమైన అక్షరమనవచ్చును. పురుషోత్తమ, పరమాత్మ అనుటలో అర్థము లేదు.

**వివరము :** ప్రపంచము గతించిన తర్వాత కూడ ఇపుడున్న పరమాత్మ అపుడు కూడ ఉన్నది. కాని అపుడు దానిని పరమాత్మ అని కాని, పురుషోత్తమ అని గాని అనకూడదు. ఎందుకనగా! ప్రపంచమే లేనపుడు జీవాత్మలు గాని, ఆత్మలుగాని ఉండవు. ఆత్మే లేదు గావున అపుడు పరమాత్మ అనకూడదు. ఒక వస్తువున్నపుడు ఆ వస్తువుతో పోల్చి మరొక వస్తువును చిన్నదనో లేక పెద్దదనో చెప్పవచ్చును. ఒకే వస్తువుండి రెండవ వస్తువులేనపుడు దానిని చిన్నదని కాని, పెద్దదని కాని చెప్పే అవసరమే లేదు. పోల్చుటకు మరొకటి లేదు. కావున ఉన్న ఒక వస్తువును చిన్న పెద్దయని చెప్పలేము. అలాగే ప్రపంచమున్నపుడు ఆత్మ ఉన్నది, కావున ఆత్మకంటే వేరుగ ఉన్న దానిని పరమాత్మ అని చెప్పాము. అలాగే క్షర, అక్షర పురుషులైన జీవాత్మ, ఆత్మలకంటే ఉత్తమమైనది కావున పురుషోత్తమ అన్నాము. ప్రపంచము లేనపుడు ఉన్నది ఒకటే కావున ఏ విధముగ పోల్చలేము. కావున దానిని పురుషోత్తమ అని గాని, పరమాత్మ అని గాని చెప్పలేవు. ఆ సమయములో ఉన్న దానిని గీతలో అక్షర పరబ్రహ్మ యోగమను అధ్యాయమున 21 శ్లోకములో అవ్యక్తమైన అక్షరమన్నారు. అనగా తెలియని నాశనము లేనిదన్నారు.

**828. (3) భూమి మీద బలవంతమైన ఆత్మ ఏది? అట్లే బలహీనమైన ఆత్మ ఏది? జీవాత్మనా, ఆత్మనా, పరమాత్మ?**

జ. బలవంతమైనది, బలహీనమైనది రెండు ఆత్మే.

**వివరము :** భూమి మీద బలవంతునియందు గాని, బలహీనునియందు గాని చైతన్యమై ఉండునది ఆత్మయే. జీవాత్మకు బలా బలములతో ఎలాంటి సంబంధము లేదు. శరీరమునకు బలము నిచ్చునది ఆత్మయే. కర్మననుసరించి బలముకల్గి ఉండవలసినది ఆత్మయే, కావున బలవంతునియందుగాని, బలహీనునియందుగాని బలము కల్గినది, బలహీనమైనది ఆత్మయే. అందువలన ఉన్న మూడు ఆత్మలలో బల అబలముల తంతు ఆత్మదే గాని జీవాత్మ పరమాత్మలది కాదు.

**829. (4) గ్రుడ్డిది చెవిటిదియైన ఆత్మ ఏది?**

జ. జీవాత్మ.

**వివరము :** నిజముగ చూడలేనిది, వినలేనిది జీవాత్మ. అలాగే ప్రపంచమును ఏ విధముగ గ్రహించలేనిది జీవాత్మ. కన్ను చూపితే గాని, చెవు చెపితేగాని తెలియలేనిది జీవాత్మ. అందువలన జీవాత్మను స్వయముగ ఏది తెలియనిదని, ఇతరుల ద్వార తెలియునదని తెలుపు నిమిత్తము జీవున్ని అంధుడన్నారు. గ్రుడ్డివాని పనికి ముగ్గురు చేటు అని చెప్పు వాక్యములో జీవాత్మను గ్రుడ్డివానిగ చెప్పడము విశేషము. కనుట, వినుట, స్పర్శించుట, రుచి చూచుట, వాసన చూచుట లేనిది జీవాత్మ. కన్ను చూపితే గాని చూడలేని, చెవు వినపిస్తేగాని తెలియలేని, నాలుక రుచి చూపితే గాని తెలియని, ముక్కు తెలిపినగాని వాసన తెలియలేని, స్పర్శ తెలియచేస్తే గాని పలానా అని తెలియని వాడు జీవాత్మ. అందువలన గ్రుడ్డిది చెవిటిది అని జీవాత్మననవచ్చును.

**830. (5) శ్వాస ఉన్నది ఆత్మకా జీవాత్మకా?**

జ. ఆత్మకు.

**వివరము :** శ్వాస స్థూలముగ గాని, సూక్ష్మముగ గాని ఆత్మకే ఉన్నది. జీవాత్మ అనుభవములను అనుభవించడము తప్ప ఏమి చేయడను సూత్రము ప్రకారము జీవాత్మ శ్వాసించదు. శ్వాసలు ఆత్మ స్థూలముగ సూక్ష్మముగ శ్వాసించుచున్నది. ఆత్మ తన శక్తిని ఏడు భాగములుగ విభజించుకొని ఒక దినమునకు 21,600 శ్వాసలను లెక్క ప్రకారము శ్వాసించుచున్నది. ఆత్మయే తన నాడీ కేంద్రముల నుండి వరుసగ 600, 6000, 6000, 6000, 1000, 1000, 1000 శ్వాసలను నడుపుచున్నది. ఈ వరుస క్రమముగాని, శ్వాసను కదిలించడముగాని జీవునికి సంబంధము లేదు. దీనిని బట్టి శ్వాస ఆత్మకే గాని జీవాత్మకు కాదని తెలియుచున్నది.

**831. (6) ఒకడు పూలతోటలో పూలు పెరుకుచు సువాసనను ఆస్వాదించు**

**చుండెను. ఇక్కడ పూలు పెరుకుచు సుగంధమును అనుభవించువాడు ఎవరు?**

జ. పూలు పెరుకుచున్నది ఆత్మ. సుగంధమును అనుభవించుచున్నది జీవాత్మ.

**వివరము :** ఒక సజీవ శరీరము పని చేస్తున్నదంటే అందులో కర్మను ఆచరించువాడు ఒకడు, కర్మను అనుభవించువాడు ఒకడుండుననుట సూత్రము. ఒక సజీవ శరీరములో ఇద్దరుండుట అందరికి తెలిసిన విషయమే. ఆ ఇద్దరిలో కర్మను ఆచరించువాడు ఆత్మకాగ, అనుభవించువాడు జీవాత్మ అని తెలియాలి. జీవాత్మ గుణచక్రము వదలి ఎటు కదలలేని వాడు. కావున జీవుడు ఏ పని చేయలేడు. దీనిని బట్టి పూలను కోయువాడు ఆత్మ, పూలలోని వాసన సుఖమును అనుభవించు వాడు జీవాత్మని తెలియాలి.

**832. (7) నిద్రపోయేటపుడు సాక్షి భూతునిగనున్న ఆత్మేది?**

జ. పరమాత్మ.

**వివరము :** 'సాక్షి' అనగ చూచేది లేక చూచేవాడని అర్థము. కాలమార్పిడిలో ధర్మాలే అధర్మాలుగ మారుచున్నపుడు పదాలు కూడ ఎన్నో మారిపోయాయి. అలాగే సాక్షి అను పదము పూర్వము 'అక్షి' అను పదముగ ఉండెడిది. అక్షి అంటే కన్ను అను అర్థము గలదు. ఒక విషయమును చూచునది కన్ను, కావున పూర్వము ఏ విషయమునైన చూచిన వానిని అక్షి అనెడివారు. కాల క్రమమున అక్షి అను పదము సాక్షిగ మారినది. ఒక మనిషి మేల్కొన్నపుడు జీవాత్మ ఏమి అనుభవిస్తున్నది ఆత్మ చూస్తున్నది. ఒక మనిషి నిద్రపోయేటపుడు మనస్సు బ్రహ్మనాడిలో అనిగి పోవుచున్నది కావున జీవాత్మ ఏమి అనుభవించడము లేదు. కావున దానికి సాక్షి అవసరము లేదు. నిద్రపోయేటపుడు అడిగారు కావున ఆ సమయములో ఆత్మ ఒక్కటే పని చేయుచున్నది. అపుడు ఆత్మను చూచువాడు పరమాత్మ. అందువలన నిద్రపోవువానికి పరమాత్మయే సాక్షి అని తెలియవలెను. పూర్వము మెలుకవగ ఉండి తప్పు చేయలేదనుటకు ఆత్మసాక్షిగ అని పలికెడివారు. నిద్రలో కూడ తప్పు

చేయలేదనుటకు పరమాత్మ సాక్షిగ అని పలికెడివారు. ఆత్మ సాక్షిగ, పరమాత్మ సాక్షిగ అనుటలో మెలుకవలో గాని, నిద్రలో గాని అని చెప్పుటని తెలియవలెను. దీనిని బట్టి నిద్రలో సాక్షిగనున్నది పరమాత్మని చెప్పవచ్చును. జీవాత్మకు సాక్షి ఆత్మకాగ, ఆత్మకు సాక్ష్మి పరమాత్మ అవుతున్నది.

**833. (8) అందముగనున్న ఆత్మ ఏది? అందహీనముగనున్న ఆత్మ ఏది?**

జ. ఆత్మ.

**వివరము :** ఆత్మయే శరీరమును పెంచుతు శరీరచివరి అంచువరకు తన శక్తిని వ్యాపింప జేయుచున్నది. ప్రారబ్ధకర్మననుసరించి శరీర పెరుగుదలను క్రమబద్ధీ కరించుచున్నది. కర్మననుసరించి పెరిగిన క్రమములోనే శరీరము కొందరికి అందముగ కొందరికి అందహీనముగ తయారగుచున్నది. శరీరమంత ఆత్మ వ్యాపించి ఉన్నది, కావున శరీర ఆకారముతో ఆత్మ ఆకారమును పోల్చవచ్చును. శరీరమంత వ్యాపించి ఉన్న దానివలన శరీర ఆకారమునే ఆత్మ పోలియున్నదనుట సూత్రము. అందువలన భూమి మీద అందమైన శరీరములోని ఆత్మ అందముగ నున్నదని, అందహీన శరీరములోని ఆత్మ అందహీనముగనున్నదని చెప్పవచ్చును. జీవాత్మ, ఆత్మ, పరమాత్మలలో జీవాత్మ ఎవరికి కనిపించునది కాదు. అంతేకాక అందరిలోను జీవాత్మ ఒకే ఆకృతి పోలియున్నది, కావున దానికి అందము అందహీనము అను సమస్యే లేదు. ఇక పోతే పరమాత్మకు అంచు ఆకృతిలేదు. మిగిలిన ఆత్మకొక్కదానికే అందము ఆకారమున్నదని తెలియాలి.

**834. (9) అందరిలో ఒకే ఆకృతి పోలి ఉన్నదేది?**

జ. జీవాత్మ.

**వివరము :** రూపము కల్గి ఉన్నవి ఆత్మ జీవాత్మలు మాత్రమే. రూపమే లేనిది పరమాత్మ, అందరిలో ఉండి వేరు వేరు ఆకృతులు కల్గి ఉన్నది ఆత్మకాగ, అందరిలో ఒకే ఆకృతి కల్గినది జీవాత్మ. శరీరములెన్ని రూపములు కల్గియుంటే అన్ని విధముల ఆకృతి కల్గినది ఆత్మ. అలాగే శరీరములెన్ని రూపములుగ నున్నను బుద్ధి, చిత్తము,

అహము పొరల మధ్య చిక్కుకున్నది జీవాత్మ. అన్ని శరీరములలోను బుద్ధి, చిత్తము, అహముల ఆకారములు ఒకే విధముగ గుండ్రముగ ఉండుట వలన, జీవాత్మ వాటి మధ్య బంధింపబడి ఉన్న దానివలన, మధ్యలో గల గుండ్రని ఆకారమును జీవాత్మ సంతరించుకొని ఉన్నది. అందువలన ఏ జీవరాసి శరీరములోనైన ఆత్మ రూపములు అనేకములు అలాగే ఏ జీవరాసి శరీరములోనైన జీవాత్మ రూపములు ఒకే విధమని చెప్పవచ్చును.

**835. (10) ఆత్మకంటే పరమాత్మ చిన్నదా, పెద్దదా?**

జ. చిన్నది మరియు పెద్దది.

**వివరము :** ఆత్మలో పరమాత్మ ఉన్నది కావున ఆత్మకంటే పరమాత్మ చిన్నదని చెప్పవచ్చును. అలాగే పరమాత్మలో ఆత్మ ఉన్నది కావున ఆత్మకంటే పరమాత్మ పెద్దదని కూడ చెప్పవచ్చును. దీనిని బట్టి ఆత్మకంటే పరమాత్మ పెద్దది మరియు చిన్నది అని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**కె. నర్సాపురము** **తేది-01-03-2002**

**836. (1) పవిత్ర ఆత్మలు అపవిత్ర ఆత్మలున్నాయా?**

జ. లేవు.

**వివరము :** ఆత్మలలో పవిత్ర అపవిత్ర ఆత్మలుండవు. జీవాత్మగాని, ఆత్మగాని, పరమాత్మగాని ఏవి అపవిత్రమైనవి లేవు. జీవాత్మ పరమాత్మ అంశయే అయినప్పటికి కర్మ బంధము కల్గి ఉన్నది. అంతకుమించి అపవిత్రత ఏమి లేదు. ఆత్మ ఎల్లపుడు స్వచ్ఛమైనదై, ఏ సంబంధము లేనిదై, శరీరములో దేవుడై, జీవాత్మకున్న కర్మను ఆచరించుచు జీవాత్మను అనుభవింపజేయుచున్నది. పరమాత్మ అన్నిటికి అతీతుడై, లోపల బయట ఆవహించినవాడై ఉన్నాడు. అందువలన ఆత్మల ఎడల అపవిత్రత అను పదము వర్తించదు.

**837. (2) ఆడవారు అంటే అర్థమేమి?**

జ. అడ్డము వచ్చువారు.

**వివరము :** ఆడ అనగా అడ్డము ఆటంకము అని అర్థము. ప్రపంచము పుట్టక పూర్వము పరమాత్మ ఒక్కడే ఉండెడివాడు. సృష్ఠి ఆదిలో పరమాత్మ తనకు వ్యతిరేఖమైన మాయను తయారు చేసి పెట్టాడు. ఆయన సంకల్పముతోనే ప్రకృతి అను మాయ తయారైనది. పరమాత్మ మొదట ఆదేశించిన ప్రకారము ఎల్లపుడు దైవ జ్ఞానమునకు, మోక్షమునకు అడ్డముగ నిలబడినది. దైవమునకే అడ్డముగ నున్నది కావున మాయను ఆడది అన్నారు. ప్రకృతి పురుషుల లక్షణములతో పుట్టిన స్త్రీ పురుషులను ఆడ మగ అనడము జరుగుచున్నది. పురుషత్వముకల్గి పుట్టించు బీజముకల్గి ఉన్నారు కావున పురుషులను మగతనము కల్గిన మగవారని పిలుస్తున్నాము. అలాగే పురుష బీజమునకు గర్భము ధరించి శరీరమునకు రూపము నిచ్చు ప్రకృతి లక్షణములో నిండి ఉన్నందువలన, ప్రకృతి యొక్క ఆడ లక్షణములు వుండుట వలన స్త్రీలను ఆడ తనము కల్గిన ఆడవారని పిలుస్తున్నాము.

**838. (3) పవిత్ర ప్రేమ ఉన్నదా?**

జ. లేదు.

**వివరము :** ప్రేమ అనునది అరిషట్ వర్గములోని అసూయకు వ్యతిరేఖమైన గుణము. ప్రేమ తొమ్మిది భాగములుగ ఉన్నది. ప్రేమలో చిన్న ప్రేమ, పెద్ద ప్రేమ అని తొమ్మిది విధములున్నది కాని పవిత్ర అపవిత్ర అనునవి లేవు. ప్రేమ వలన వచ్చు ఫలితము పుణ్యముండవచ్చును కాని పవిత్రతనునది ఉండదు. ప్రేమ గుణ భాగములో వరుసలో చివరిదై ఉన్నది.

**839. (4) నిద్రలో పరమాత్మ పనిచేయుచున్నదా?**

జ. చేయలేదు.

**వివరము :** నిద్రలోగాని, మెలుకువలోగాని, స్వప్నములోగాని ఆత్మ పని

చేయుచుండును గాని పరమాత్మ పని చేయదు. ఎల్లపుడు ఏమి చేయక అన్నిటికి సాక్షిగ అంతట అందరిలో ఉండునది పరమాత్మ. అహర్నిశలు కదలక మెదలక ఒకే విధముగ ఉండువాడు పరమాత్మ.

**840. (5) మన దేశములోని ఒక పుణ్య క్షేత్రములోని పేరు వ్రాయుము?**

జ. పుణ్యక్షేత్రము లేదు.

**వివరము :** దేశములో పుణ్యక్షేత్రములుండవు. ఇక్కడ అడిగినది దేశములో కావున ఏదో ఒక ప్రదేశమును కొందరు పుణ్యక్షేత్రమని ఆ స్థానము యొక్క ప్రత్యేకతను బట్టి అనుచున్నారు. అది నిజమా అని యోచించిన పాపము పుణ్యములనునవి ఒక్క జీవాత్మకు తప్ప స్థలములకుండవు. పాపాత్ముడు పుణ్యాత్ముడు అను జీవాత్మలు గలరు గాని పాపక్షేత్రము పుణ్యక్షేత్రమనునవి ఉండవు.

**841. (6) భగవద్గీతలో ఎన్ని అక్షరములు గలవు?**

జ. ఒకటి గలదు.

**వివరము :** భగవద్గీతలో త్రైతమయిన మూడు ఆత్మలను గూర్చి చెప్పారు. అందులో ఒకటి జీవాత్మ క్షరమైనది అనగా నాశనమగునది. రెండవది ఆత్మ అక్షరమైనది అనగా నాశనము లేనిది. మూడవది పరమాత్మ, ఇది ఏది కానిది. దీనిని బట్టి చూచినట్లయితే భగవద్గీతలో ఆత్మ అను ఒకే అక్షరము గలదని చెప్పవచ్చును.

**842. (7) ముక్కుసూటిగ పోవాలంటే అర్థమేమిటి?**

జ. శరీరములోని ఆత్మను తెలియుట.

**వివరము :** ముక్కుసూటిగ పోవాలంటే బయటి అర్థము తీసుకోకూడదు. ముక్కు బయటే ఉండినప్పటికి శరీరము లోపలికి వర్తింపజేసుకోవాలి. ముక్కు క్రింది కొనను తీసుకోక పై కొనను తీసుకోవలెను. ముక్కు పై కొనను భృకుటి అని లేక భ్రూమధ్యము అని అంటారు. భృకుటికి సమానముగ తలలోపలి భాగములో మధ్యన గల ఎరుక మీద ధ్యాసనుంచడమును ముక్కు సూటిగ చూడడమందురు.

బయటి కన్నులతో చూచు చూపుకాక మనో ధ్యాసలో చూచుటయని తెలియాలి. ఈ విషయమునే వేమన యోగి ఉప జిహ్వాకు ప్రాక్ దిక్కున భృకుటికి మధ్యమున ఎరుక కల్గి చూడమన్నాడు. చిరునాలుక నుండి పైకి భ్రూమధ్యము నుండి లోపలికి రేఖలు గీచిన, రెండు రేఖలు ఎచట కలియునో అచట మనోధ్యాసను నిలిపిన, అక్కడగల ఆత్మ తెలియగలదు. అందువలన పూర్వము పెద్దలు శరీరములోని దేవుడైన ఆత్మను తెలియాలంటే ముక్కుకొన భాగమును చూచుకోమన్నారు.

## 843. (8) శరీర బలము ఎవరి ఆధీనములో గలదు?

జ. ఆత్మ ఆధీనములో గలదు.

**వివరము :** శరీరమునకు బలము అబలము నిర్ణయించునది శరీరములోని రెండవ ఆత్మయే. దేహములోని ఏడునాడీ కేంద్రముల ద్వార ఆత్మ తన శక్తిని శరీరమంత వ్యాపింపచేసి బలము నిచ్చుచున్నది. బలమునకు బలహీనమునకు ఆత్మయే కారణమై ఉన్నది. ఆత్మ ప్రారబ్ధకర్మను బట్టి శరీరమునకు బలమును చేకూర్చు చుండును.

## 844. (9) కర్మకు ఆధీనములో ఉన్నదేది, లేనిదేది?

జ. ప్రపంచమున్నది. జ్ఞానము లేదు.

**వివరము :** సర్వ ప్రపంచములోని అన్ని జీవరాసులు కర్మకు లోబడి ఉండి కర్మను అనుభవిస్తున్నవి. ప్రపంచములో కర్మ చేత బంధింపబడని జీవరాసి లేదు. సర్వ ప్రపంచము కర్మాధీనములోనే ఉన్నదని చెప్పవచ్చును. దైవజ్ఞానము మాత్రము కర్మాధీనములో లేదు. అన్నిటిని శాశించు కర్మ జ్ఞానమును శాశించలేదు. జ్ఞానమే కర్మను శాశించి స్థంభింపచేయగలదు. ప్రపంచములో ఏది ఎవరు కర్మను నశింపజేయలేరు. జ్ఞానము మాత్రము కర్మను సర్వ నాశనము చేయగలదు. ఈ విషయమై భగవద్గీతలో **"జ్ఞానాగ్ని సర్వ కర్మాణి భస్మసాత్"** అన్నారు. జ్ఞానమను అగ్ని సర్వ కర్మలను కాల్చి బూడిద చేయగలదని చెప్పారు. అందువలన ప్రశ్నకు

జవాబుగ కర్మాధీనములో సర్వ ప్రపంచమున్నదని, కర్మాధీనములో లేనిది జ్ఞానమని చెప్పారు.

**845. (10) పంచ ప్రాణములు ఎవరికి గలవు?**

జ. ఆత్మకు గలవు.

**వివరము :** శరీరములోని జీవాత్మ ఏ పని చేయడము లేదు. చేయుచున్నదంతయు ఆత్మనే. శరీరము బ్రతికి ఉన్నదంటే ఆత్మ వలననే బ్రతకాలి. ఆత్మ శ్వాసను ఆడించితే ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసలు జరుగుచున్నవి. ప్రాణము అనగ గాలి, పంచ ప్రాణములనగా ఐదు గాలులు. ఉదాన, వ్యాన, సమాన, ప్రాణ, అపాణ వాయువులను వాటిని పంచ ప్రాణములనుచున్నాము. నివశించు ప్రదేశము చేయు పనిని బట్టి వాయువులను ఐదు రకములుగ, ఐదు భాగములుగ గుర్తించగలిగాము. ఐదు వాయువులు శరీరమంత వ్యాపించి ఉన్న ఆత్మకే గలవు. ఒక్క చోట ఉన్న జీవాత్మకు ఐదు వాయువులకు సంబంధము లేదు. అందువలన పంచ ప్రాణములను ఐదు వాయువులు ఆత్మకు గలవని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపాలమడ** **తేది-28-03-2002**

**846. (1) శరీరములో మూల పురుషుడెవరు?**

జ. పరమాత్మ.

**వివరము :** ప్రపంచానికి మొత్తము మూలపురుషుడు పరమాత్మ. శరీరము బయట అన్నిటికి మూల పురుషుడైన పరమాత్మ శరీరము లోపల కూడ మూలమై ఉన్నాడు. శరీరములోపల కర్మ విధానమును, ఆత్మ చైతన్యమును, పెట్టి వాటి చేత జంత్రగాడు బొమ్మను ఆడించునట్లు సర్వ శరీరములను ఆడించుచున్నాడు. తాను స్వయముగ ఏది చేయక, తాను నిర్మించిన విధానముల ద్వార చేయిస్తూ, సాక్షిగ మూల పురుషునిగ తటస్థుడుగ ఉన్నాడు.

**847. (2) శరీరము బయట మూల పురుషుడెవ్వడు?**

జ. పరమాత్మ

**వివరము :** శరీరము బయట లోపల అన్నిటికి మూల పురుషుడు పరమాత్మ అని తెలుసుకొన్నాము. శరీరము బయట పంచ భూతములను వాటి చేత పని చేయిస్తూ తటస్థునిగ ఉంటు అన్నిటికి మూల పురుషుడై సాక్షి భూతుడై ఉన్నాడు. శరీరములో కర్మ, ఆత్మ, జీవాత్మ ముఖ్య విధానములు కాగ శరీరము బయట పంచభూతములే తన విధానములై ఉన్నవి.

**848. (3) తిరునాల అనే పదమును పూర్వమెలా అనెడివారు?**

జ. తిరునామ.

**వివరము :** సంవత్సరమున కొకమారు తిరునామ అనెడి పేరుతో ఒక పెద్ద ఉత్సవము చేసెడి వారు. ఆనాటి తిరునామ అను ఉత్సవము కాలక్రమములో ఈనాడు తిరునాల అనెడి పేరుగా మారిపోయినది. తిరునామ అనగా నామములో మధ్యన గలది. వెంకటేశ్వర నామము మూడు నామములుగ ఉన్నది కదా! అందులో రెండు నామములు ప్రక్కవి తెల్లవి ఉండగ, మధ్యలోది మాత్రము ఎర్రదిగ ప్రక్కరెండు నామములకంటే పొడవుగ ఉండును. రెండు తెల్ల నామములకంటే రంగులో ఎర్రగ, సైజులో పొడవుగ, మధ్యనగల నామము ప్రత్యేకత కల్గించుకొన్నది. ఈ నామము భౌతికముగ అభౌతికముగ, రెండు అర్థములు కల్గియున్నది. భౌతికముగ శరీరములో గల మూడున్నర లక్షల నాడులలో ముఖ్యమైన వాటిలో అతి ముఖ్యమైనవి మూడు మాత్రము గలవు. వాటినే ఇడా, పింగళ, సుషుమ్నా నాడులనియు లేక సూర్యచంద్ర బ్రహ్మనాడులనియు పిలువడము జరుగుచున్నది. వాటినే ముఖము మీద నామముగ గుర్తించడము జరుగుచున్నది. ఇడా పింగళ నాడులను రెండు తెల్లని నామములుగ గుర్తించి మధ్యన బ్రహ్మనాడియను దానిని ఎర్రని పొడవైన నామముగ గుర్తించాము. ఈ పొడవైన ఎర్రని నామము శరీరములో అన్నిటికంటే ముఖ్యమైన ఆత్మగ తెలియవలసి ఉన్నది. ప్రక్కన గల సూర్య

చంద్రనాడులు మనస్సుకు స్థానమై ఉండగ, మధ్యన గల బ్రహ్మనాడి ఆత్మకు నివాసస్థలమై ఉన్నది. బ్రహ్మనాడిని ఆత్మగ గుర్తించినవారు దానిని తెలియడమే జీవిత సారాంశమని గుర్తించారు. శరీరములో గల ఆత్మస్థానమైన బ్రహ్మనాడినే తిరునామము అనెడివారు. ఆ తిరునామమును అనగ ఆత్మను తెలుసుకొనుటకు సంవత్సరమునకొకమారు ప్రజలనందరిని దేవాలయమువద్ద కలిపి ఆత్మ బోధ చేసెడివారు. అలా ప్రజలనందరిని ఆత్మ పట్ల జాగృతపరిచెడివారు. ఆ విధముగ చేయు దానినే జాతరని, ఆత్మను తెలిపెడి కలయిక కావున దానిని తిరునామ అనెడివారు. ఆ తిరునామ ఈనాటికి ఉన్నను ఉద్దేశ్యము పూర్తి మారి పోయినది. తిరునామ లేక తిరునాల అనెడిది దేవుని ఎడల భక్తికేగాదు, అనేక విధముల అనేక ఉద్దేశ్యములతో పోతున్నారు. ఏది ఎట్లున్న శరీరాంతర్గత ఆత్మను తెలియు ఆధ్యాత్మిక రహస్యమే తిరునామ అని తెలియాలి. ఇది భౌతిక పరమైన అర్థము కాగ, అభౌతిక పరమైన అర్థము మరొకటి గలదు.

శరీరములో నివశించు ఆత్మలు మొత్తము మూడున్నాయి. అందులో శరీరమంతా వ్యాపించి ఉన్నది ఆత్మకాగ, శరీరములో అదియు శిరస్సులో రవ్వంతగ ఉన్నవాడు జీవాత్మ. మూడవదైన పరమాత్మ శరీరమంతా ఉంటూ, శరీరము బయట కూడ ప్రతి వస్తువులోపల బయట వ్యాపించి ఉన్నది. క్షరాక్షరులని పేరు గాంచిన జీవాత్మ ఆత్మలు రెండు ఎల్లపుడు జోడిగా ఉంటాయి. జీవాత్మ ఆత్మలకంటే అతీతుడు పరమాత్మ, కావున మధ్యనామమునకు ఎర్రరంగునుంచారు. రెంటికంటే పెద్దది కావున మధ్య నామమును పెద్దగ ఉంచారు. జీవునకు ఆత్మకు గమ్యస్థానము అదియే, కావున రెండిటికి మధ్యలో ఉంచారు. జీవాత్మ ఆత్మ ఒక దానితో ఒకటి కలసి పోయినపుడే పరమాత్మగ మారవచ్చునని, తెల్లనామములు రెండు కలియు చోటు నుంచి మధ్య నామమును పెట్టారు. ఈ విధముగ స్థూలములో నామమును సూర్య చంద్ర బ్రహ్మనాడులని, సూక్ష్మముగ జీవాత్మ ఆత్మ పరమాత్మ అని గుర్తించి చూపారు. ముఖ్యమైన విషయము కావున ముఖము మీద నుదిటి భాగములో

తీర్చిదిద్దారు. మూడు నామములలో తిరునామ అని పిలువబడునది శరీరమందు బ్రహ్మనాడిలోని ఆత్మను, శరీరము వదలిన తర్వాత పరమాత్మను సూచించుచున్నది.

**849. (4) ప్రతి మనిషికి ఒక హద్దు ఆచారముండాలంటారు. హద్దు ఆచారమేది?**

జ. హద్దు భగవద్గీత, ఆచారము యోగము.

**వివరము :** భగవంతుడు జ్ఞానము అను కట్టెతో, మానవుడు దైవత్వములో ఉండుటకు పరిమితి నిర్ణయిస్తు, మాటల రూపముగ గీచిన గీతయే భగవద్గీత. ఏ మనిషిగాని ఒక హద్దులో ఉండాలను పెద్దల వాక్యములో అంతరార్థము జ్ఞానము కల్గి దైవత్వము లోపే ఉండమని, ఇంతవరకు నీవు నడువాలని దీని తర్వాత నడిస్తే మాయలోనికి పోవుదువని తెల్పిన హద్దుయే భగవద్గీత. దాని ప్రకారముండడమే హద్దులో ఉన్నట్లు. హద్దులో ఉండిన వానికి ఆ హద్దులో ఉన్న ప్రకారము నడువడమే ఆచారమగును. కొన్ని నియమములను తెల్పునదే హద్దు. హద్దులో ఉంటూ ఆ నియమముల ప్రకారము ఆచరించవలసి ఉన్నది. జ్ఞానమను హద్దులో యోగమను రెండు నియమములు గలవు. వాటిని ఆచరించితే యోగమగును. జ్ఞానపు హద్దులో గల పద్ధతి ప్రకారము మనస్సును నియంత్రించితే బ్రహ్మయోగము, అహమును నియంత్రించితే కర్మ యోగమగును. దీనిని బట్టి ప్రతి మనిషికి జ్ఞానమను హద్దు యోగమను ఆచారముండవలెను.

**850. (5) మనో, బుద్ధి, చిత్తములలో బుద్ధిగుణానుసారిణి, చిత్తము కర్మానుసారిణి అయితే మనస్సు దేని ఆచారిణియగును?**

జ. చిత్తానుసారిణి అగును.

**వివరము :** బుద్ధి గుణానుసారము యోచించగ బుద్ధి యోచించిన విషయములను చిత్తము కర్మానుసారము నిర్ణయించును. బుద్ధి గుణాల ప్రకారము ఎంత గొప్పగ యోచించిన, చివరకు జరుగవలసిన కర్మ ప్రకారమే చిత్తము నిర్ణయము తీసుకొని,

తాను తీసుకొన్న నిర్ణయము ప్రకారము పనికి ఆదేశించును. చిత్తము తన ఆదేశమును మనస్సుకు తెలుపును. మనస్సు చిత్తము యొక్క నిర్ణయమును తీసుకొని పోయి అవయవములకు ఆదేశమిచ్చి నడిపించును. దీనిని బట్టి మనస్సు చిత్తానుసారమని తెలియుచున్నది. కార్యములు జరుపు బాహ్యేంద్రియములు పదియు మనస్సు తెచ్చిన ఆదేశానుసారము పని చేయుచున్నవి. కావున మనస్సానుసారిణి ఇంద్రియములని చెప్పవచ్చును.

**851. (6) ఎల్లవేళల ఇంద్రియములు మనస్సుతో అనుబంధమై ఉంటాయా ఉండవా?**

జ. ఉండవు.

**వివరము :** మనిషికి గల నిద్ర, స్వప్నము, మెలుకువ అను మూడు అవస్థలలో మెలుకువలో మాత్రము మనస్సుకు ఇంద్రియములు అనుబంధమై ఉండి, మనస్సు చెప్పినట్లు ఇంద్రియములు నడచుచుండును. నిద్ర స్వప్నములలో మనస్సుకు ఇంద్రియములకు సంబంధము లేకుండును. ఆ సమయములో మనస్సు బ్రహ్మనాడి చేరి ఉండును. అపుడు మనస్సు చిత్తానుసారిణి కాదు. అట్లే ఇంద్రియములు మనస్సానుసారిణి కావు.

**852. (7) చిత్ర విచిత్రములన్నట్లు చిత్ర పురుషుడు విచిత్ర పురుషుడు ఉన్నారు. చిత్ర పురుషుడెవడు? విచిత్ర పురుషుడెవడు?**

జ. చిత్ర పురుషుడు జీవాత్మ, విచిత్ర పురుషుడు ఆత్మ.

**వివరము :** చిత్రము అనగ కనిపించునదని అర్థము. జీవాత్మ శరీరములో ఒక ఆకారము కల్గి జ్ఞాననేత్రమునకు దృశ్యరూపమై ఉన్నాడు. దృశ్యమై కనిపించు దానిని చిత్రము అన్నారు కదా! శరీరములోని జీవాత్మ ఆకృతివలె అన్ని శరీరముల లోని జీవాత్మలన్ని ఒకే ఆకృతి కల్గి ఉండుటవలన సర్వ సాధారణముగ జీవున్ని చిత్రము అన్నాము. శరీరములోని దేవుడని పేరుగాంచిన మరియు చైతన్య

మూర్తియైన ఆత్మకు కూడ ఆకారము గలదు. ఆకారమును చిత్రమన్నాము కదా! ఇచట ఆత్మ మాత్రము చిత్రముగ లేక విచిత్రముగ ఉన్నది. ఎందుకనగా! ఆత్మ శరీర ఆకృతిని పోలి ఉన్నదని ముందే తెలుసుకొన్నాము. ఏ శరీరములోని ఆత్మ ఆ శరీరము యొక్క ఆకృతిని పోలి ఉండును. శరీరములన్ని ఒకే ఆకృతిలేక అనేకరకములుగ విచిత్ర పోలికలు ఆకారములు కల్గి ఉన్నవి. ఒకే ఆకారము కల్గిన చిత్రమని, అనేక ఆకారములు కల్గిన విచిత్రమని అనుట సహజము. విచిత్రములైన శరీరములో గల ఆత్మ అదే శరీరముల ఆకృతిని కల్గి, తాను కూడ శరీరములవలె విచిత్ర ఆకారము కల్గి ఉన్నది. ఒకే ఆకృతి కల్గి ఉన్న జీవాత్మ చిత్రము కాగ, అనేక రకముల ఆకారములు కల్గిన ఆత్మ విచిత్రముగ ఉన్నది.

**853. (8) పాము విషములో, ఆకు రసములోనున్న శక్తి ఆత్మ శక్తియా పరమాత్మ శక్తియా?**

జ. పరమాత్మ శక్తి.

**వివరము :** పాము విషము మనిషిని చంపు సామర్థ్యము కల్గి ఉండగ, ఆకు రసము విషమున్న మనిషికి ఔషదమై బ్రతికించు సామర్థ్యము కల్గి ఉన్నది. పాము శరీరములోనున్న విషములో ఆత్మ శక్తి పని చేయుచున్నది. ఆత్మకు శరీరము వరకు పరిమితి అని చెప్పుకొన్నాము కదా! అట్లే పాము కరిచినపుడు విషము పాము శరీరము నుండి బయటికి వచ్చి వేరు శరీములో ప్రత్యేక పదార్థముగ ప్రవేశించినది. ఇపుడది ఏ శరీరములోని ఆత్మకు సంబంధము లేదు. కావున ఆ విషములో పరమాత్మ శక్తి గలదు. ఆత్మశక్తి ఏ మాత్రము లేదు. పరమాత్మ శక్తియే విషములోని ప్రభావమై మనిషిని చంపు సామర్థ్యముతో ఉన్నది. ఆకు చెట్టుకున్నంత వరకు ఆత్మశక్తి అందులో పని చేయుచుండును. చెట్టు నుండి వేరై వచ్చిన ఆకులో గాని, ఆకు రసములో గాని పరమాత్మ శక్తియే పని చేయుచున్నది. ఆకు రసములోని ఔషద గుణము పరమాత్మ శక్తివలననే ఉన్నదని తెలియాలి. చంపు విషములో గాని, బ్రతికించు రసములో గాని ఉన్న శక్తి ఒక్కటే. విషములో

రసములో ప్రపంచానికే మూలమైన శక్తి ఉన్నది, కనుక వాటిని మూలికలు అంటాము.

**854. (9) బట్ట బయలంటారు బట్టేది, బయలేది?**

జ. శరీరము బట్ట, పరమాత్మ బయలు.

**వివరము :** చిదంబర రహస్యము బట్ట బయలను మాట వినియే ఉందుము. దాని వివరమేమనిన కలియుగములో తయారైన అనేక దేవాలయములలో శ్రీరంగపట్టణములోని శ్రీరంగని ఆలయమునందు చిదంబర రహస్యమనునది కలదట. అక్కడకు పోయినవారు శ్రీరంగని దేవాలయము దర్శించిన తరువాత చిదంబర రహస్యమును చూచుట పరిపాటి. కాని ఇది రహస్యమని, అది ఎవరికి చెప్పకూడదని, అక్కడి పెద్దలు చెప్పి మిగత వారికి చూపడము జరుగుచున్నది. రహస్యమనునది చెప్పకూడనిది చూపకూడనిది ఐనప్పటికి చెప్పకూడదని చూపడములో ఏమి రహస్యము గలదో. అక్కడ ఎవరికి తెలియని ఎదో ఒక విషయముండి తీరాలి, అందువలననే దానిని రహస్యమంటున్నాము. చిదంబర రహస్యము చెప్పిన బోధపడనిది, చూచిన అర్థము కాని విషయము, కావున దానిని చిదంబర రహస్యమన్నారు. చాలామందికి చిదంబరమను పేరు వివరము తెలియదు. చిద అనగ వస్త్రము, అంబరము అనగ ఆకాశము. ఈ విధముగ చిదంబరము అను పదములో వస్త్ర ఆకాశము లేక బట్ట బయలు అని అర్థము గలదు. చిదంబర రహస్యము బట్ట బయలు అను వాక్యము కూడ కలదు. శ్రీరంగ పట్టణములోని చిదంబరమేమిటో కొంత తెలుసుకొందాము.

భగవద్గీత సాంఖ్య యోగమను అధ్యాయములో 22 వ శ్లోకము నందు భగవంతుడు "వాసాంసి" అను పదమునుపయోగించి శ్లోకము చెప్పాడు. **"వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి తథా శరీరాణి విహాయ జీర్ణా నన్యాని సంయాతి నవాని దేహీ"** ఇందులో "పాత వస్త్రము వదలి కొత్త వస్త్రము ధరించినట్లు పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును జీవుడు ధరిస్తున్నాడని"

చెప్పాడు. ఇక్కడ శరీరమును గుడ్డతో పోల్చి చెప్పాడు. వస్త్రము అనిన, బట్ట అనిన, చేలము అనిన ఒకటే అర్థము. అలాగే అంబరము అనిన, ఆకాశము అనిన, బయలు అనిన ఒకే అర్థము. శ్రీరంగ దేవాలయములో ఉన్న చిదంబర రహస్యమనునది ఏమిటని పరికించి చూచిన, అక్కడ ఒక ద్వారమునకు అడ్డముగ వస్త్రమును వేలాడ దీసి ఉందురు. ద్వారములోపల ఏమున్నది కనిపించనట్లు ఆ వస్త్రము కట్టబడి ఉండును. లోపల ఏమున్నది తెలియదు, కావున అదియే రహస్యము. లోపల ఎమున్నదో చూడాలనుకొన్నవారు అక్కడున్న వారిని అడిగి అనుమతి తీసుకోవలసి ఉంటుంది. చూడాలనుకొనువారికి చూపించు వారుందురు. వారు చూచువారికి ఇక్కడ చూచినది రహస్యము, కావున ఎవరికి చెప్పకూడదని చెప్పి చూపించుచుందురు.

ఎందరో చిదంబర రహస్యమును చూచినప్పటికి చూడకమునుపు ఉన్న ఆత్రుత చూచిన తర్వాత లేదు. ఎందుకనగ చూడవలెననుకొనువారు చూడకముందు రహస్యమును అనగ చూడదగిన దానిని గురించి ఏదో ఊహించుకొని ఉందురు. ఎవరేమి ఊహించుకొన్నప్పటికి గుడ్డ తొలగించుతానే ఎవరికి ఏమి కనిపించక పోవడమే ఆశ్చర్యము. అక్కడ ఒక ద్వారము దానికి అడ్డముగ ఒక గుడ్డ ఉండుననుకొన్నాము కదా! చూడవలసిన వారికి ద్వారము ముందర నిలబెట్టి గుడ్డ తీసి చూపుదురు. గుడ్డతీసి చూడగనే అక్కడ ఏ వస్తువుగాని, ఆకారము గాని లేక పోవడము ఆశ్చర్యమే అగును. పై కప్పులేని ఆకాశము మాత్రము కనిపించును. గుడ్డ తీసి అక్కడ ఏమి లేదే అన్నట్లు చూపించువారినడగగ ఆకాశము వైపు చూపించి ఇక్కడ మీరు చూడవలసినది కనిపించునది ఇదేనని చెప్పుదురు. ఏమి లేనిదే చిదంబర రహస్యము. ఇక్కడ ఏమి లేనట్లు చెప్పితే ఎవరురారు కనుక మీరు దీనిని రహస్యముగ ఎవరికి చెప్ప కూడదని చెప్పుదురు. చెప్పితే ఏమగునో ఏ చెడు జరుగునోయని చూచి వచ్చినవారు కూడ చెప్పకుండుట జరుగుచున్నది. ఆచారమున్న అర్థము లేకుండ పోయినది. ఆధ్యాత్మిక పరమైన పరమార్థికమైన అర్థము చెప్పుకోక ఇక్కడ చూచినది ఎవరికి చెప్పవద్దనడము పొరపాటు. ఎవరు

ఎవరికి చెప్పిన చిదంబరము అనునది రహస్యమను అర్థముతోనే ఉండును. ఇటువంటి రహస్యముందని చూపు విధానమే చిద అంబరము.

జీవుడు శరీరములో నున్నంత వరకు మోక్షము చెందలేడు. కర్మలేకుండ చేసుకొని శరీరమును పొంద కుండ పోయినపుడు పరమాత్మలోనికి ఐక్యమైపోవును. ఇటు శరీరము అటు మోక్షము రెండే గమ్యములు జీవునికి గలవు అనునది సత్యము. శరీరమున్నంత వరకు దేవుడు తెలియడు. నీకు చావు పుట్టుకలనెడి శరీరము దేవునికి నీకు మధ్యలో అడ్డముగ ఉన్నది. పుట్టుకతో మొదలై చావులో అంత్యమై తిరిగి వెంటనే పుట్టుకతో శరీరము జీవునకు తగులుకొనుచున్నది. శరీరము గుడ్డలాంటిదని, పాత గుడ్డ పోతూనే క్రొత్త గుడ్డ తగులుకొనుచున్నదని, గీతలో దేవుడు చెప్పాడు. అందువలన ఆ గుడ్డ లేకపోతే నీవు దేవుని వద్దకు చేరవచ్చుని శరీరమును గుడ్డగ, పరమాత్మను బయలుగ చూపించారు. శరీరము బట్ట అని, పరమాత్మను బయలుయని, శరీరమును పరమాత్మను బట్ట బయలుగ పోల్చారు.

**855. (10) అచలమును పూర్వమేమనెడి వారు?**

జ. అచేలము అనెడివారు.

**వివరము :** చేలము అనగ శరీరము అనుకొన్నాము కదా! చావుతో పోవు శరీరము ఆ క్షణమే పుట్టుకతో జీవునికి తగులుకొనుచున్నది. కావున ఎల్లపుడు బయలుగ పోల్చబడిన పరమాత్మకు, చేలముగ పోల్చబడిన శరీరము అడ్డముగనున్నదని తెల్పుటకే శ్రీరంగపట్టణములోని చిదంబరమని తెలియాలి. గుడ్డ అడ్డముండగ అవతలనున్న బయలు ఎప్పటికి కనిపించదని తెలుపుచు, మీకు శరీర చేలము అడ్డమునున్నందున బయలను పరమాత్మ తెలియడని తెల్పు నిమిత్తము రహస్య మనడములో అర్థముగలదు.

బట్ట తీసితే బయలు, బట్టతీయకపోతే బయలు లేదు. అలాగే శరీరము పోతేనే మోక్షమని తెల్పుచు, బట్టలేని స్థితియైన దానిని అచేలము అన్నారు. చేలము అనగ గుడ్డ, అచేలము అనగ శరీరము లేని మోక్షమని చెప్పారు.

అజ్ఞానములో ఉండి శరీరముతో జన్మలెత్తుచున్న వారిని చేలురని, జ్ఞానము కల్గి జన్మలేని స్థితిని కోరుచున్నవారిని అచేలురని పూర్వము పెద్దలనెడివారు. శరీరమును చేలమని, మోక్షమును అచేలమని పూర్వము అనెడివారు. మోక్షమార్గమును అచేలమని, అజ్ఞానమును చేలమని కూడ పిలిచెడివారు. జ్ఞానమార్గమైన అచేలమను పదము కాలక్రమమున అచలముగ మారినది. జ్ఞానమార్గమను అనుసరించు వారు నేటికి ఉన్నారు. కాని వారు మాది అచలము అనడము అర్థములేని మాట. వారు మాది అచేలము అని చెప్పవచ్చును, కాని అచలమని చెప్పకూడదు. సరియైన అర్థము ప్రకారము చిద అంబరమును చేల అచేలమనవచ్చును. దేవాలయములో చూపినట్లు మీరు బట్ట పార్టీనో, బయలు పార్టీనో యోచించుకోండి. చేలముగాని అచేలమును పొందండి.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొలమడ** **తేది-27-04-2002**

**856. (1) దేవుని తర్వాత దేవునిగనున్నది ఎవరు?**

జ. మాయ.

**వివరము :** ప్రపంచములో అతి పెద్ద శక్తులు రెండే రెండున్నవి. ఆ రెండు కంటికి కనిపించక ఉన్నవి. అవియే ఒకటి పరమాత్మ రెండు మాయ. పరమాత్మ కనిపించదు మాయ కనిపించదు. పరమాత్మ ఎవరికి తెలియబడకుండ ప్రపంచమంత వ్యాపించి ఉండగ, మాయ కూడ అట్లే ఆవహించి ఉన్నది. రెండు కనిపించనివే కావున ఇది పలానాయని గుర్తించుటకు వీలులేదు. అందువలన దేవున్ని మాయ అని, మాయను దేవుడని కొందరు భ్రమించుటకు అవకాశమున్నది. చాలాచోట్ల మాయయే పరమాత్మగ లెక్కించబడుచు పూజింపబడుచున్నది. అనేక స్థలములలో అనేకులవద్ద మాయ దైవముగ పూజింపబడుచు, ఏమాత్రము ఇది మాయ అని తెలియుటకు అవకాశమే లేనట్లున్నది. మాయ దైవముకంటే ఎక్కువగ దైవరూపములో ఉండినప్పటికి, అది దైవము చేత తయారు చేయబడినది. దైవము

చేత శక్తి పొందబడియున్నది. కావున ప్రపంచములో మాయ ఎంత గొప్పదైన, అసలైన దైవముగ మానవులను భ్రమింపజేసి తనవైపు లాగుకొనిన, పరమాత్మకంటే మించినది కాదని, మాయ దైవము తర్వాత దైవముగ ఉన్నదని చెప్పవచ్చును. దీనిని సూత్ర బద్ధముగ తెలుసుకోవాలంటే ఎచటయితే పరమాత్మను మినహ అన్య ఆరాధన జరుగుచున్నదో, ఎచటయితే మహత్యముల ననుసరించి మనుజులు పోవుచున్నారో, ఎచటయితే కోర్కెల నిమిత్తము ఆరాధించడము అవి నెరవేరడము జరుగుచున్నదో, ఎచటయితే ఆత్మజ్ఞానమను పేరుతో యజ్ఞయాగాది వ్రత క్రతువులు జరుగుచున్నవో, అచట దైవముగ మాయ చలామణి అగుచున్నదని తెలియవచ్చును. వేయికి తొమ్మిది వందల తొంబై తొమ్మిది మంది మాయను ఆరాధిస్తుండగ, కేవలము ఒక్కడు పరమాత్మను ఆరాధిస్తున్నాడని చెప్పడము కూడ అరుదే. ఈ మాటను భగవద్గీతలో పరమాత్మే స్వయముగ "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే" అని తెలియజేసారు. దీనిని బట్టి ప్రతి ఒక్కనిలో అంతో ఇంతో భక్తి ఉండినప్పటికి, అది పరమాత్మ భక్తి కాదని మాయ భక్తియేనని తెలియుచున్నది. జగతి కంతటికి పరమాత్మ దైవముకాగ, మాయ రెండవ దైవముగ ఏర్పడినది. ఎంతో మందికి మాయ మొదటి దైవముగ ఉండినప్పటికి, దానికంటే మొదటివాడు దానిని తయారు చేసినవాడు పరమాత్మ. అందువలన పరమాత్మ మొదటి దైవముకాగ, దైవము తర్వాత దైవముగ మాయ చలామణి అగుచున్నదని చెప్పవచ్చును.

**857. (2) ఆకాశములో మేడ కట్టవచ్చునంటారు. దేనితో కట్టవచ్చును?**

జ. మనస్సుతో.

**వివరము :** మనలోని మనస్సు ఊహలతో ఆలోచనలతో నిండి ఉన్నది. గతములో అనుభవమున్న విషయములను జ్ఞాపకము తెచ్చుటలో గాని గతములో అనుభవము లేని విషయములు తెలియని విషయములను ఊహకందించడములో గాని దాని కదే సాటి. ఉన్నవి లేనివి అన్నిటిని మననము చేయునది మనస్సు. ఉన్న విషయములను జ్ఞాపకము చేయడములో గొప్పదనమేమి లేకున్న, లేని

విషయములను ఎన్నో విధములుగ జ్ఞాపకము కలుగజేయడములో గొప్ప విశేషత గలదు. ఉదాహరణకు గతములో ఒక ఇంటిని చూచి ఉంటే అపుడు ఎలా చూచి ఉంటే, అలాగే ఆ ఇంటిని మనోదృష్టితో చూపించగలదు. ఒక్కొక్కప్పుడు ఎపుడు చూడని ఇంటిని కూడ చూపగలదు. చూడని ఇంటిని చూపునపుడు ఆ ఇంటిని ఇష్టమొచ్చినట్లు తీర్చి చూపగలదు. ఎవరు నిర్మాణము చేయలేనంత ఊహతో ఉన్నట్లే, కంటికి కనిపించినట్లే మనోదృష్టికి తెప్పించగలదు. మనో ఊహలకు చేతగానిది అందనిది లేదు. ఆకాశములో ఆధారము లేకుండ మేడ కట్టి చూపగలదు. తన దృష్టికి ఉన్నవి లేనివి అన్ని గోచరించునట్లు చేయగలదు. కావున మనసుచేత గాలిలో గాని, ఆకాశములో గాని మేడలు కట్టవచ్చునంటారు.

**858. (3) మూగ వానికి మాట, కుంటివానికి నడక ఇవ్వగల స్థోమత ఎవరికి గలదు? ఎందరికి గలదు?**

జ. పరమాత్మకు మాయకు ఇద్దరికి గలదు.

**వివరము :** ప్రపంచములో అతి పెద్ద శక్తులు రెండే గలవని అందులో ఒకటి పరమాత్మ అని రెండవది మాయ అని తెలుసుకొన్నాము. అన్నిటికి అధిపతి పరమాత్మ. మానవుడు చేసుకొన్న కర్మలను అనుభవించడములో మూగ కుంటి మొదలగు అనేక అవయవ లోపము లేర్పడవచ్చును. అటువంటి కర్మలను అన్నిటికి అధిపతియైన పరమాత్మ తన శక్తి చేత భస్మీపటలము చేయగలడు, మూగ కుంటి వారిని బాగు చేయగలడు. తన శక్తి ఇటువంటిదని తెలుపు నిమిత్తము ఏదో ఒక చోట అలా చేయును. అలాగే మాయ తాను దేవుని వలె ఉండవలెనని, దేవుని కంటే మిన్నగ కనిపించవలెనని, తనను వదలి ఎవరు దేవుని వైపు పోకూడదని, దేవుని స్థానములో తానుంటు అనేక చోట్ల అనేక మహిమలు చూపుచుండును. కర్మను క్షమించి లేకుండ చేయు శక్తి పరమాత్మ కొక్కనికి ఉండగ, మాయకు ఆ శక్తి లేకున్నను మూగవానికి మాట కుంటివానికి నడక ఇవ్వగలదు. కర్మను క్షమించు స్థోమత లేని మాయ తాత్కాలికముగనున్న కర్మను తీసి తర్వాత జన్మలోనికి

మార్చగలదు. మాయకు కర్మను నాశనము చేయు శక్తి లేకున్నను కర్మను మార్చు శక్తి గలదు. ప్రస్తుత కర్మను తర్వాత జన్మలోనికి మార్చి అప్పటికి ఆ కర్మను లేకుండ చేయుచున్నది. దీనిని బట్టి ప్రపంచములో దేవునికి దీటుగ, దేవునికంటే గొప్పగ, కనిపించుట వలన మానవుడు మాయను గూర్చి తెలియక, దానినే దేవుడనుకొని నమ్ముచున్నాడు. నేడు భూమి మీద మాయ కొందరు వ్యక్తులలో ఆవహించి, వారియందు తన శక్తిని మహత్యముల రూపముగ తెలియజేస్తు ఆకర్షించుకొని, కొందరి కర్మలను లేకుండ చేయడము వలన మానవులు భ్రమపడి అలా చేసిన వ్యక్తే నిజదైవమని నమ్మి పరమాత్మ జ్ఞానమునకు దూరమగుచున్నారు. ఏది ఏమైన భూమి మీద కర్మను లేకుండ చేయుశక్తి మాయకు పరమాత్మకు ఇద్దరికి గలదని చెప్పవచ్చును.

**859. (4) నీటిలో నడువ గల వానిని, ఆకాశములో తేలగల వానిని తయారు చేయువారున్నారు. వారెవరు?**

జ. పరమాత్మ, మాయ.

**వివరము :** ప్రపంచములో అత్యధిక శక్తులు ఏమైన చేయగలవి పరమాత్మ, దానికి వ్యతిరేఖ దిశలో ఉన్న మాయ. పరమాత్మ ధర్మములను బోధిస్తే, మాయ పరమాత్మకు వ్యతిరేఖముగ అధర్మములను బోధిస్తుంది. పరమాత్మ పేరుతో పరమాత్మ బోధించినట్లే బోధిస్తు, పరమాత్మ ధర్మములకు వ్యతిరేఖముగ బోధించడమే మాయ యొక్క పని. అటువంటి మాయ పలుకులను గొప్ప జ్ఞానులు సహితము గుర్తించలేక అధర్మములనే ధర్మములనుకొనుచుందురు. జ్ఞాన విషయములలో కూడ తనదే జ్ఞానమనుకొనునట్లు మోసగించు మాయను, పేరుమోసిన స్వాములు కూడ గుర్తించలేక అధర్మములను ధర్మములనుకోవడము, ధర్మములను అధర్మములను కోవడము జరుగుచున్నది. ఎంతటి వారినైన భ్రమింపజేయు మాయ ప్రపంచములో ఎంతటి పనినైన చేసి దేవునిగ పూజ్యమగుచున్నది. అటువంటి కార్యములలో ఒక మనిషిని నీటిలో నడిపించగలదు. ఆకాశములో తేలునట్లు చేయగలదు.

మాయ తర్వాత ఆ శక్తి ఉన్నది పరమాత్మకే. కాని పరమాత్మ తన మహత్యములను బయట చూపడు. తనను మహత్యముల ద్వారకాక, ధర్మముల ద్వార తెలుపాలనుకొను వాడు పరమాత్మ. ధర్మముల ప్రతిష్ఠాపనలో అవసరమొస్తే తప్ప మహత్యమును చూపని వాడు పరమాత్మ. అవసరమైనపుడు పరమాత్మ, మిగత సమయములలో కూడ మాయ ఆకాశములో గాని, నీటిలో గాని నడిపించును.

**860. (5) శరీర భాగములు కాకుండ రెండక్షరముల పేరు గలవి శరీరములో రెండున్నవి. అవి ఏవి?**

జ. ఆత్మ, మాయ.

**వివరము :** జీవ శరీరము మొత్తము 25 భాగములుగ ఉన్నదని అంటుంటాము. ఆ ఇరువది ఐదు భాగములలో ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు వాయువులు, ఐదు ఇంద్రియ శక్తులు, కాగ జీవుడు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను ఐదు కలిసి ఇరువదైదుగ శరీర భాగములున్నవి. శరీర భాగములుగ పేరు గాంచిన 25 కాక ప్రతి శరీరములోను కంటికి కనిపించని ఆత్మ, మాయ అనునవి రెండు గలవు. ఇవి శరీర భాగములుగ లెక్కించబడవు. ఎందుకనగ ఈ రెండు కర్మకు అతీతమైనవి. కర్మకు లోనై పుట్టునవి శరీరములోని మొత్తము 25 భాగములు. జీవ శరీరమున్న చోటంత ఆత్మ మాయ తప్పనిసరిగ ఉండవలసి నప్పటికి అవి సంఖ్యాభాగములుకావు.

**861. (6) నిద్ర స్వప్నము మెలుకువలో పని చేయునది ఏది? స్వప్నము మెలుకువలో మాత్రము పని చేయునదేది?**

జ. ఆత్మ, మాయ.

**వివరము :** శరీరము మొత్తము ఇరువదైదు భాగములుగ ఉండగ ఆ శరీరమును కదలించుటకు ఆత్మ, ఏ విధముగ కదలించవలయుననుటకు మాయ బాధ్యతలు స్వీకరించి ఉన్నవి. శరీరములో జీవుడు కష్ట సుఖములననుభవించుటకు యంత్రము వలె శరీరము 24 భాగములుగ ఉండగ, ఆ యంత్రమును కదలించు శక్తిగ ఆత్మ,

ఎలా ఎట్లు కదలించవలెనను పద్ధతిని తెలియజేయునదిగ మాయ ఉన్నది. ఆత్మ చైతన్య శక్తి రూపముగ శరీరమంత వ్యాపించి ఉండగ, మాయ త్రిగుణ రూపముగ తలయందు గలదు. ఈ విషయము భగవద్గీతలో కూడ "గుణమయీ మమ మాయా" అని చెప్పబడి ఉన్నది. నిద్రలో మెలుకువలో స్వప్నములో మూడు అవస్థలలోను ఆత్మ ఎడతెరపి లేకుండ పనిచేయుచున్నది. మాయ మాత్రము ఆత్మతో పాటు మెలుకువలో స్వప్నములో పని చేయుచు నిద్రావస్థలో ఏమాత్రము పని చేయకున్నది. నిద్రావస్థలో మాయ ప్రభావముండదు. సాధారణ మనిషికి మాయ పని చేయని ఒకే ఒక స్థితి నిద్ర. శరీరములో మనస్సు పని చేసినపుడే మాయ పని చేయును. మనో నిలకడ కల్గినపుడు మాయ పని చేయదు. మనస్సుకు మాయకు ఇలా చాలా దగ్గర సంబంధము కలదు. అందువలన మనస్సును జయించినవారు మాయను జయించగలరని పెద్దలు చెప్పారు. గీతలో భగవంతుడు కూడ గాలి లేని చోట దీపము కదలక నిలబడినట్లు, మనస్సు నిలబడితే యోగమగునని తెల్పాడు. అందువలన బ్రహ్మయోగియైన వానికి యోగములోను, నిద్రలోను మాయ పని చేయదని చెప్పవచ్చును. సాధారణ మనిషికి ఆత్మ మూడు అవస్థలలోను, మాయ మెలకువ స్వప్నములను రెండు అవస్థలలోను పని చేయునని తెలియవలెను.

### 862. (7) ఆలోచనకందనిదేది? ఆలోచనలోనున్నదేది?

జ. ఆత్మ, మాయ.

**వివరము :** మనస్సుకు ఒక పని గలదు. ఏ విషయాన్నయిన ఆలోచనల ద్వార చూపించడమే దాని పని. ఆలోచనలు ప్రపంచ సంబంధమైనవే. ప్రపంచ సంబంధములో మిలితమై ఉన్నది మాయ. కనుక శరీరములోని మనస్సుకు ఆలోచనలన్ని మాయ సంబంధమైనవని, ఆలోచనలలో ఇమిడి ఉన్నది మాయ అని తెలియవలెను. ఆలోచనలుడిగినపుడు, మనస్సు పని చేయనపుడు తెలియబడునది ఆత్మ. మనస్సు పని చేయునపుడు ఎంత యోచించిన ఆత్మ తెలియబడదు. అందువలన "యథా దీపో నివాసస్థో నేంగతే సోప మాస్మృతా"

అని భగవద్గీతలో అన్నట్లు గాలి లేని చోట దీపము కదలక నిలిచినట్లు మనస్సు కదలక నిలచిన ఎడల ఆత్మ తెలియును. మనస్సు కదలినట్లయితే ఆత్మ మినహా ఉన్నదంతయు మాయ, కనుక మనో కదలికలైన ఆలోచనలలో ఉన్నది మాయ. ఆలోచనల కందనిది ఆత్మయని చెప్పవచ్చును.

**863. (8) శరీరము లోపల బయటనున్నవారు ఇద్దరు కలరు వారెవరు?**

జ. పరమాత్మ, మాయ.

**వివరము :** పరమాత్మ అణువణువున వ్యాపించి ఉన్నదని భగవద్గీతలోను మిగత పెద్దల వద్ద తెలుసుకొన్నాము. దీనిని బట్టి పరమాత్మ శరీరమంతట వ్యాపించి ఉన్నాడని తెలియుచున్నది. అంతట వ్యాపించిన పరమాత్మ ప్రపంచము పుట్టుదలలోనే తనతో పాటు ఉండునట్లు, తనకు సమానముగ కనిపించునట్లు, తనతోపాటు వ్యాపించి ఉండునట్లు, తనకు వ్యతిరిక్తముగ ఉండునట్లు, ఎన్నో విధముల అధికారముల నిచ్చి మాయ అనుదానిని తయారు చేసి పెట్టాడు. మాయ పరమాత్మకు పుట్టినది కావున బిడ్డలాంటిది, సమానముగ ఉన్నది కావున భార్యలాంటిది, వ్యతిరిక్తముగ ఉన్నదాని వలన శత్రువులాంటిది. పరమాత్మకు బిడ్డలాంటిది, భార్యలాంటిది, శత్రువు లాంటిదైన మాయ సర్వ వ్యాపియైనందువలన శరీరములోపల గుణముల రూపముగ, శరీరము బయట పంచభూతములుగ చలామణి అగుచున్నది. అందువలన శరీరము బయట శరీరములోపల వ్యాపించి ఉన్నవి రెండని, అవియే ఒకటి పరమాత్మయని, రెండు మాయ అని చెప్పవచ్చును.

**864. (9) శిష్యుడిచ్చిన పదివేల రూపాయలలో గురువుగారు 5 వేల రూపాయలు జ్ఞానము యొక్క పనులకు, రెండు వేలు స్వంత కార్యమునకు, మూడు వేలు ఇతర కార్యములకు వినియోగించాడు. ఆ గురువు మాయకెంత దేవునికెంత వినియోగించాడు?**

జ. అంతా దేవునికే.

**వివరము :** దేశములో ఎక్కడైన గురువు ఒక్కడే ఉండును. బోధించు వారందరు గురువులు కాదు సుమా! జ్ఞానమును బోధించువారు గురువులు కాక ఏమయితారను ప్రశ్నరాగలదు. ఆ ప్రశ్నకు జవాబుగ ఏమనుచున్నామంటే బోధించువారందరు బోధకులే గాని గురువు కాదని తెలియాలి. గురువు వేరు బోధకుడు వేరని తెలిసిన తర్వాతే గురువు యొక్క విశిష్టత ఏమిటో మనకు తెలియగలదు. కావున ముందు గురువును బోధకుడిని గురించి తెలుసుకొనుటకు ఈ క్రింది విషయము చూస్తాము.

## గురువు - బోధకుడు

చేసుకొన్న వారికి చేసుకొన్నంత అను నానుడి కలదు. మనము ఏది చేస్తే దానికి తగినంత ఫలితముండునని పెద్దలన్నారు. అది వాస్తవమే అయినప్పటికి చాలా మంది దానిని విస్మరించడము ఆశ్చర్యము. సాధారణ మనుషులు తాము చేస్తున్న దానికి ఫలితమును మరచి పోయిన పరవాలేదు. జ్ఞానులైన వారు కూడ అటువంటి స్థితికి దిగజారడము మంచిది కాదు. ఉదాహరణకు ఒక గురువు తన శిష్యులకు అపూర్వ జ్ఞానము తెల్పి దాని ప్రకారము నడుచుకొమ్మని చెప్పుచుండెను. ఆ విధముగ గురువు చెప్పుచు పోగ శిష్యులు వినుచు పోవుచుండిరి. ఒక దినము గురువుగారు శిష్యులను పిలచి ఈ దినము వంటకు కట్టెలు కావాలని వాటిని తెచ్చి పెట్టమని చెప్పారు. ఆ మాట విన్న శిష్యులు కొందరు కట్టెలు కోసము అడవికి బయలుదేరారు. మార్గ మధ్యములో ఒకరితో ఒకరు మాట్లాడు సందర్భములో ఇలా ప్రశ్న-జవాబుల రూపములో సంభాషణ జరిగినది.

**ప్రశ్న : జ్ఞానమైతే మనము వినవచ్చును గాని ఈ పనులు చెప్పడమేమిటి?**

జ. : గురువు చెప్పినది వినాలి కదా!

**ప్రశ్న : వినాలి, వినడము వరకు బాగానే ఉంది. పనులు చెప్పడము బాగుండదు కదా?**

జ. : వినడమంటే చెవులతో వినడమే కాదు. చెప్పింది చేయడము కూడ వినడమే అగును.

**ప్రశ్న : నాకు వినే ఓపిక ఉన్నది, కాని చేసే ఓపిక లేదే?**

జ. : చెప్పింది చేసినపుడే సేవ చేసినట్లగును కదా!

**ప్రశ్న : సేవంటే గురువు గారి కాల్లు ఒత్తడము, విసన కర్రలతో విసరడము అవుతుంది. కాని కష్టపడి కట్టెలు తేవడమేమిటి?**

జ. : గురువు గారి జ్ఞానమునకు మనము బాకీ పడి ఉంటాము. ఏది చెప్పితే అది చేయడము వలన గురువు గారి ఋణము తీరినట్లగును.

**ప్రశ్న : నోటితో చెప్పిన మాటలకు బాకీ పడినట్లగునా! ఆయన డబ్బిచ్చాడ బాకీ పడేదానికి?**

జ. : జ్ఞానము డబ్బుకంటే విలువైనది. దానిని డబ్బుతో పోల్చ కూడదు.

**ప్రశ్న : అపుడపుడు మన ఇంటి దగ్గర పని విడిచి పోయి వింటున్నాము కదా! దాని వలన మనకు వచ్చే ఆధాయము పోతుంది కాని ఆయనదేమి పోతుంది?**

జ. : జ్ఞానము మనకవసరము. దాని కోసము మనము వస్తున్నాము. ఎప్పుడో ఒకప్పుడొచ్చి కొద్దిసేపు విని పోవు మనకు పని పోయినది, లాభము పోయినది అంటే, ప్రతి దినము మనవలె వచ్చు వారెందరికో జ్ఞానబోధ చేయుటలో కాలము గడుపు ఆయనకు కూడ ప్రపంచ పనులు నిలచి పోయినట్లే కదా! ఆయన కూడ మనవలె నా పనులు పోతాయనుకొంటే మనకు జ్ఞానము తెలిసేదేనా!

**ప్రశ్న : జ్ఞానము చెప్పితే ఆయనకే పుణ్యము వస్తుంది కదా!**

జ. : వింటే మనకు ఏదో వస్తుందని ఎందుకనుకో కూడదు. మనకేమో డబ్బు పోతుందనేది, ఆయనకేమో పుణ్యమొస్తుందనేది. ఇదెక్కడి నీతి.

**ప్రశ్న : సరే ఆయన మనకు జ్ఞానము తెలియజేయడము వలన ఆయన కాలము వృథా అనుచున్నావు. మనము ఇలా పని చేసి పెట్టేదానికంటే**

**మనకు తోచిన డబ్బు ఇచ్చి సహాయపడవచ్చును కదా! దానివలన ఆయన అవసరాలు కూడ తీరును కదా?**

జ. : ఇది చాలా పొరపాటైన మాట. మనకు తోచింది ఇచ్చేదానికి ఆయనేమి బిక్షగాడు కాదు. మనకంటే ఉన్నత స్థానములో ఉన్న గురువు. గురు సాక్షాత్ పరబ్రహ్మ అన్న మనమే అలా అనకూడదు. పై స్థానములోఉన్న గురువుకు మనమే బాకీ పడుచున్నాము. ఆ బాకీ మనమేమిచ్చిన తీరునది కాదు. అందువలన ఇవ్వడమనేది కాక, చేతనైనంత చేయడము కూడ కర్తవ్యమే. గురు ఋణము అంత సులభముగ తీరునది కాదు. అందువలన పూర్వము పెద్దలు తమకున్న సర్వము గురువుదే అన్నారు.

**ప్రశ్న : ప్రపంచములో ఎందరో గురువులున్నారు, వారిలో నిజమైన గురువెవరో తెలిస్తే నీవన్నట్లు నడచుకోవచ్చును. ఇందరిలో నిజగురువుగ ఎవరిని తెలియ వచ్చును. ఎవరో వ్రాసిన గ్రంథము చదివి అందులోని విషయములు చెప్పువాడు గురువా? లేక స్వయముగ తెలిసినవాడు గురువా?**

జ. : ఎవరో వ్రాసినది, ఎవరో చెప్పినదైన విషయమును చెప్పువాడు కేవలము బోధకుడే అగును. గురువుకు బోధకునికి చాలా వ్యత్యాసమున్నది. గురువు ఎప్పటికి ఇతరులు చెప్పిన దానిని, వ్రాసిన దానిని చెప్పడు. ఎవరికి తెలియని విషయము చెప్పువాడు గురువు. గురువు చెప్పిన దానిని బోధించిన వారు బోధకులు. బోధకులు ఎందరైన తయారుకావచ్చును. కాని గురువులు కొందరే అగుదురు. ఒక ఊరి నుంచి మరొక ఊరికి దారిని ఏర్పరచి దానిని నిర్మించువాడు ఒకడైతే, ఆ దారిని చూపువారు, ఆ దారి వివరము తెలుపు వారు ఎందరైన ఉండవచ్చును. వారు చూపిన దారి వెంట మరెందరైన ప్రయాణించవచ్చును. నడచు వానికంటే దారిని చూపువాడు గొప్ప. దారిని చూపు వానికంటే మొదట దారిని కనుగొని నిర్మించినవాడు అందరికంటే గొప్ప. బయలుదేరు స్థలము ప్రపంచము లేక ప్రకృతి కాగ, గమ్యము మోక్షము లేక దేవుడు. ప్రపంచము నుండి దేవుని వరకు

చేరు మార్గమును మొదట కనుగొని దానిని శాస్త్రబద్ధముగ నిర్మించిన వాడు గురువు. అలా నిర్మించిన దానిని గూర్చి ఎందరైన చెప్పవచ్చును. అలా చెప్పువారు బోధకులు. శాస్త్రబద్ధమైన సూత్రమును కనుగొనువాడు ఒకడే. దానిని ఎందరైన చెప్పుకోవచ్చును. మరి ఎందరైన ఆచరించవచ్చును. ప్రపంచములో ఒక విషయమును కనుగొనువాడు వేరు, అదే విషయమును బోధించు వాడు వేరు. కనుకొన్న వానిని పరిశోధకుడు అంటారు. అదే విషయమును ఇతరులకు తెలియజేయు వానిని బోధకుడు అంటారు. అట్లే ఆధ్యాత్మిక విద్యలో విషయమును శోధించి మొట్టమొదటగ తెలుపువాడు గురువు. తర్వాత దానిని ఎందరు తెలుపుచూ పోయిన వారు కేవలము బోధకులు. బోధకులకు గురువులకు చాలా వ్యత్యాసము ఉన్నప్పటికి, గుర్తుపట్టలేని స్థితిలో ప్రజలుండుట వలన, ఆధ్యాత్మికతకు అసలైన గురువులకు సమాజములో విలువ లేకుండ పోయినది.

**ప్రశ్న : మీ మాట ప్రకారమైతే గురువులే చాలా అరుదు. బోధకులే కోకొల్లలు అన్నమాట. అటులైన ప్రస్తుత కాలములో అంతా బోధకులే అవుతారు. గురువు రాష్ట్రానికొక్కడు కూడ దొరికేది అరుదే.**

జ. : రాష్ట్రానికి కాదు దేశానికొక్కడు దొరకడము కూడ అరుదే.

**ప్రశ్న : అయితే ఇప్పుడు మన గురువు బోధకుడా లేక గురువా?**

జ. : ఆ విషయము స్వతహాగ ఎవరికి వారు తెలియదగినది. ఇంతకు ముందే చెప్పానుగ గురువుకు బోధకునికి చాలా వ్యత్యాసముంటుందని.

**ప్రశ్న : మా ఊరిలో ఒక వ్యక్తి వికరణ మహర్షి భక్తుడనని ఆయన బోధలే చెప్పుచు, కాషాయ గుడ్డ ధరించి, ఊరికి ఉత్తరాణ వంక గడ్డలో వికరణ మహర్షి పేరు మీద డబ్బు వసూలు చేసి, ఆశ్రమము కూడ కట్టించాడు. అతనిని నేను గురువే అనుకొని ఉంటిని, కేవలము బోధకుడేనన్న మాట.**

జ. : ఆయన వికరణ మహర్షి భక్తుడని నీ నోటితో నీవే చెప్పుచున్నావు కదా!

గురువు అనువాడు ఎప్పటికి ఏ స్వామికి భక్తుడుగ ఉండడు. ఆయన స్వయముగ పరమాత్మ మీదనే భక్తి శ్రద్ధ కల్గి ఉండును. కనపడని దేవతలకు, కనిపించే మనుషులకు భక్తుడుగ గురువు ఉండడు. ప్రపంచమున కంతటికి పెద్దయైన వాడు ఎవడు గలడో వానిని ఆరాధించువాడే గురువు. మిగతావారు బోధకులు కావచ్చును.

**ప్రశ్న : అట్లయితే మన గురువు గారు కూడ శ్రీకృష్ణున్ని, ఏసు ప్రభువును గౌరవించి ఎక్కువగ వారి బోధ చెప్పుచుంటారు కదా! ముందెపుడో పుట్టి పోయిన ఏసు ప్రభువు కృష్ణుడు ఇద్దరు మనుషులే కదా! మనుషులను గూర్చి చెప్పువాడు కావున బోధకుడే అనవచ్చును.**

జ. : అట్లని అనుకుంటే నీవు పప్పులో కాలేసినట్లే

**ప్రశ్న : నీవు చెప్పినట్లే కదా! నాదేమి పొరపాటున్నది.**

జ. : శ్రీకృష్ణుడు, ఏసు ప్రభువు సామాణ్యమానవులు కాదు. ప్రపంచమంత వ్యాపించి ఉన్న పరమాత్మ అంశయేనని తెలియుము. మానవ శరీరములోనికి వచ్చిన పరమాత్మ యొక్క ప్రతి రూపములనుకో. వారిని గౌరవించడములో గురువుకు ఏ లోటులేదు.

**ప్రశ్న : శ్రీ కృష్ణుని బోధలో, ప్రభువు బోధలో బోధిస్తాడన్నావు కదా! అటువంటపుడు బోధకుడే కదా! గురువు కాడు కదా?**

జ. : నీ తలకు అన్ని వ్యతిరేఖ ఆలోచనలే వస్తుంటాయి. మన గురువు గురువు కాక పోవడమేమిటి. ఆయన చెప్పిన బోధలు అన్ని క్రొత్త విషయములే. కృష్ణుని, ప్రభువు యొక్క బోధలు ఒక్కటేనని చెప్పుచున్నాడు, వాటి పోలిక చెప్పాడు. అంతేకాక ఒకటి కాదు, రెండు కాదు, వందల విషయములు ఎవరు చెప్పనివి చెప్పాడు. అంతెందుకు ఆయన ప్రతి వ్రాతలోను, ప్రతి బోధలోను క్రొత్త తనముంటుంది. ఇప్పుడు నీకు నేను చెప్పిన గురువు బోధకులు యొక్క తేడాను కూడ ఆయనే

చెప్పాడు. ఇది క్రొత్త విషయము కాదా! సర్వ జీవరాసులు అతి ముఖ్యముగ తెలియవలసిన కర్మ, కాల, గుణచక్రముల గమనములు, ఆకారములు చెప్పిన వాడు మన గురువు కాదా! ఇంత వరకు జీవునకు ఆకారమున్నదని, ఆత్మకు కూడ ఆకారమున్నదని, మనస్సుకు ఆకారమున్నదని చెప్పిన వారున్నారా? ఇలా ఎన్నో విషయములు తెల్పిన గురువును గ్రహించలేని నీ బుద్ధి చాలా మందమైనదని చెప్పవచ్చును. అంతటి వాని దగ్గర చేరి పనులు చేయాలా అనుకోవడము నీ గ్రుడ్డితనానికి నిదర్శనము. ఆయన చెప్పాలే కాని చేయలేక పోవడము మన దురదృష్టము.

**ప్రశ్న : అయితే నాది తప్పే. నేను పొరపడినట్లే కదా?**

జ. బయటికి చెప్పక పోయిన నీ అంతరంగమందు ఒప్పుకొన్నా పరవాలేదు.

**ప్రశ్న : నాది ఒక చిన్న ప్రశ్న. సజీవముగ ప్రస్తుతమున్న గురువులు కాక పూర్వము ఎందరో గురువులుండెడివారు కదా! అట్టి గురువులలో ఒక గురువు యొక్క పటము పెట్టుకొని అతనినే గురువుగ బావించుకొని కొందరు గురువులుగ చలామణి అగుచున్నారు. వీరు ఏ తెగకు చెందిన వారు?**

జ. : ఫోటో పెట్టుకొని గురువులవడము చాలా సులభము. పూర్వపు గురువులు ఎటువంటివారైన వారి ఫోటో పెట్టుకోవడము వలన వీరు గురువులు కాలేరు. పూర్వపువారైన ఇప్పటివారైన గురువులగుదురో కాదో ముందు చెప్పిన సూత్రము ననుసరించి చెప్పవచ్చును. భూమి మీద మేము గురువులమని ఎందరయిన అనవచ్చును. మనము మాత్రము చాలా జాగ్రత్తగ శిష్యులు కావాలి. నిజ గురువు దొరకుట కష్టము. దొరికిన శిష్యులుగ మెలగడము మరీ కష్టము. అందువలన నిజ గురువు వద్ద తక్కువ శిష్యులే ఉంటారు.

**ప్ర. : నేడు గురువులు ఊరూరు తిరిగి ఉపదేశమిస్తు పోతూ శిష్యుల సంఖ్యను పెంచుకొంటూ ఉంటే, నిజగురువు శిష్యులను తక్కువ చేసుకోవడమేమిటి?**

జ. : నిజ గురువు తన శిష్యులను ఒకసారి ఉపదేశమిచ్చి విడిచి పెట్టడు. వారిని జ్ఞానులుగ చేయుటకు అనేక విధముల ప్రయత్నము చేయుచుండును. ఆ ప్రయత్నములో మాటి మాటికి మీలో అజ్ఞానము ఇంత మిగిలి ఉన్నదనునట్లు, వారి తప్పులను బయట పడునట్లు చేయుచుండును. అందువలన ఆ శిక్షణకు కొందరు తట్టుకోలేక మధ్యలోనే జారుకొనుచుందురు. కావున శిష్యుల సంఖ్య తక్కువని చెప్పవచ్చును. వారికథ ఎటులైన ఉంటుంది కాని నీ పరిస్థితి ఏమిటి?

నీవు చెప్పిన దానిని బట్టి చూస్తే నేను గురువు దగ్గర చాలా తప్పులు చేశాను. ఇక మీద నుంచి ఎటువంటి తప్పులు చేయకుండ ప్రవర్తిస్తానని అనుకొంటున్నాను. మంచిగ సేవ చేసుకొంటాను.

ఈ విధముగ ఆ ఇద్దరి శిష్యుల మధ్య సంభాషణ జరిగినది. ఈ సంభాషణను బట్టి ముఖ్యముగ తెలిసినదేమనగా! గురువు బోధకుల మధ్య వ్యత్యాసము తెలిసినది. అంతేకాక నిజగురువు దొరికినపుడు మాయకులోను కాక, మన తలలోని గుణముల వెంటపోక, గురువునే అనుసరించవలెనని తెలియుచున్నది కదా!

పై విషయమును బట్టి చూస్తే పరమాత్మ యొక్క అంశ (భాగము)గ పుట్టిన వాడే గురువని తెలియుచున్నది. గురువును గొప్ప భావముతో తలచినపుడు ఆయన జ్ఞానము కొరకు ఖర్చు పెట్టిన, తన కొరకు ఖర్చు పెట్టిన, తాను మరియే ఇతర పనులకు ఖర్చు పెట్టిన, అదిఅంతయు ఆయనకే వినియోగ పడినట్లుగ తలచవలయును. మాయకు ఏమాత్రము వినియోగపడలేదని, గురువైన పరమాత్మయైన ఒక్కడే అను సూత్రము ప్రకారము, అంతా దేవునికే వినియోగింప బడినదని తలచవలెను. గురువు దొరకడము అరుదు. గురువు దొరికిన ఆయనకు ఖర్చు పెట్టడము మరీ అరుదు. ఇపుడు గుళ్లు గోపురములకు ఖర్చు పెట్టువారంత ఎవరికి పెట్టుచున్నారో ఆలోచించుకోవాలి.

**865. (10) భూమి మీద గురువు బోధకుడు అనువారు కలరు. వారిలో భూమి మీద ఎల్లపుడుండు వాడు గురువా, బోధకుడా?**

జ. బోధకుడు.

**వివరము :** గురువు అనువాడు భూమి మీదకు వందల సంవత్సరములకో వేల సంవత్సరములకోవచ్చును. ఎందుకనగ గురువు పరమాత్మ అంశతో పుట్టువాడు. పరమాత్మ అంశ తనకవసరమైనపుడు మానవరూపముగ భూమి మీద పుట్టుచుండును. వానినే జగద్గురువని, గురువని అనుచుందుము. అలాకాక మానవుడు సహజముగ పుట్టి కొంత విద్యనేర్చి దానిని ఇతరులకు చెప్పడమును బట్టి అతనిని బోధకుడు అంటాము. బోధకులు ఎల్లపుడు భూమి మీద ఉండవచ్చును. కాని గురువు ఎల్లపుడు భూమి మీద ఉండడు.

## జ్ఞాన పరీక్ష

**నరసాపురము** **తేది-26-05-2002**

**866. (1) అన్ని ఉన్నాయి ఐదో తనములేదంటారు ఐదో తనమేది?**

జ. మోక్షము.

**వివరము :** జీవునకు భూమి మీద నాలుగు రకముల తరగతులు గలవు. అవి ఒకటి తామసము, రెండు రాజసము, మూడు సాత్త్వికము, నాలుగు యోగము. ఈ నాలుగు తనములుకాక ఐదోతనము కూడ ఒకటి కలదు. ప్రపంచములో నాలుగు విధానములను పొందవచ్చును కాని ఐదో విధానమును పొందలేరు. వీటిని తరగతులుగ విభజించి చూచిన ముందు మూడు ప్రపంచ సంబంధ గుణములు కాగ, నాలుగవది దైవసంబంధ యోగముగ ఉన్నది. ప్రజలందరు ముందు గల మాయకు సంబంధించిన గుణములలోనే ఎక్కువగ ఉన్నారు. వేయింటికొకడు అదియు అరుదుగ నాలుగవ విధానమైన యోగములో ఉన్నారు. ప్రపంచ సంబంధ గుణములు, దైవసంబంధమైన యోగముకల్గి ఉన్నవానిని

అన్నియున్న వానిగ లెక్కించ వచ్చును. జగతిలో అన్ని ఉండినప్పటికి ఐదవదైన మోక్షము మాత్రముండదు. అది బ్రతికివుండిన ఎవరికి లేనిది. కర్మ అయిపోయిన వానికి చనిపోయిన తర్వాత లభించునది. బ్రతికినవాడు యోగి అయినప్పటికి ప్రస్తుతము వానికి మోక్షము లేదు కనుక అన్ని ఉండిన ఐదో తనము లేదన్నారు. ఐదో తనము అనగా మోక్షమని తెలియాలి. ప్రపంచానికి భర్తయైన పరమాత్మను పొందిన జీవుడు ఐదో తనము పొందినట్లగును. జీవుడు మాయలో ఉండిన స్త్రీయని తన భర్తను చేరినపుడు ఐదోతనము కల్గునని తెలియాలి. అలాకాక ప్రపంచ సంబంధమైన సౌభాగ్యమని తలచకూడదు.

**867. (2) ఆడదానికి ఐదోతనము ముఖ్యమంటారు ఎందుకు?**

జ. మోక్షమనే భర్త కావాలి కనుక.

**వివరము :** ఒక స్త్రీకి భర్త ఎంత ముఖ్యమో, జీవునకు మోక్షమనే భర్త కూడ అంత అవసరమే. సౌభాగ్యము అనగా అన్నిటిని మించిన భాగ్యము. అన్నిటిని మించిన భాగ్యము పరమాత్మ. భర్త దొరుకు వరకు స్త్రీ వెదకునట్లు జగద్భర్తయైన పరమాత్మ దొరుకువరకు జీవుడు వెదక వలసి ఉన్నది. భార్యకు భర్త ఆధారమైనట్లు జీవునకు పరమాత్మ ఆధారమై ఉన్నాడు. పేరుకు మాత్రము నాకు భర్త ఉన్నాడనక ఆయనను నిజముగ తెలియవలసి ఉన్నది. ప్రతి జీవాత్మ ఎప్పటికయిన ఎన్ని యుగాలకయిన పరమాత్మను చేరవలసిందే, అలా చేరనంత వరకు ఈ కర్మ జన్మలు తప్పవు. అందువలన ప్రకృతి లక్షణములు కల్గి ఆడవారమైన మనకు, ఐదో తనమైన మోక్షమను పరమాత్మ చాలా ముఖ్యము. దానికొరకు కొందరు స్వామీజీలు పీఠాధిపతులు భక్తులు యోగులు ప్రయత్నించుచున్నారు. అందరము భర్త విలువ తెలిసి ఆయన కొరకు ప్రయత్నించాలి.

**868. (3) ఒకమారు పోయిందేది, తిరిగి దొరికేది ఎప్పుడు?**

జ. పోయింది పరమాత్మ, దొరికేది మోక్షము పొందినపుడు

**వివరము :** పరమాత్మ నుండి విడువడి జీవాత్మగా మారినపుడు పరమాత్మను

పోగొట్టు కొన్నాము. ఒకే ఒకమారు పోగొట్టుకొన్నది పరమాత్మను. పోయిన పరమాత్మ తిరిగి మోక్షము పొందినపుడే లభించును. పరమాత్మ మాటిమాటికి పోవునది కాదు, మాటిమాటికి దొరుకునది కాదు. జీవితములో ఎన్నో పోగొట్టు కొంటున్నాము. అన్నిటికంటే విలువైనది, అన్నిటికంటే మించినదియైన దానిని మొట్టమొదట పోగొట్టుకున్నాము. మధ్యలో ఎన్ని దొరికిన చిట్టచివరిగ దొరుకునది మోక్షము. అది దొరికిన తర్వాత ఏ దానితో అవసరములేదు. పరమాత్మ జీవుడు నాశనమై దేవుడుగ మారునపుడు దొరక గలదు. అన్నిటికంటే మొదట పోయినది, అన్నిటికంటే చివర దొరుకునది ఒకే ఒక పరమాత్మ.

**869. (4) మీ ఇంటిలో 3, 7, 10 సంవత్సరములలో ఎవరైన కాలమై పోయారా? ఎవరు?**

జ. ఎవరు పోలేదు.

**వివరము :** కాలము అనగా పరమాత్మయని అర్థము. కాలమై పోవడము అనగా పరమాత్మలోనికి ఐక్యమై పోవడమని అర్థము. మా ఇంటిలో 3, 7, 10 సంవత్సరములే కాదు వంద సంవత్సరముల నుండి ఎందరో చనిపోయిన అందరు జన్మలకే పోయారు. ఎవరు మోక్షము పొంది దేవునిలోనికి ఐక్యము కాలేదు. కావున మా ఇంటిలో ఎంతోమంది చచ్చిపోయారు, కాని కాలమైపోలేదని చెప్పుచున్నాము.

**870. (5) చదివినోనికంటే చాకలి మేలంటారు. జ్ఞానరీత్యా చదివినోడు ఎవరు? చాకలివాడెవరు?**

జ. జ్ఞానము తెలిసినవాడు చదివినోడు. కర్మ అను మురికిని లేకుండ చేయువాడు చాకలివాడు.

**వివరము :** ఇతరుల ద్వారగాని, గురువు ద్వారా కాని, పుస్తకముల ద్వారా కాని ఆత్మ జ్ఞానము తెలిసినవాడు చదివినోనితో సమానము. విద్యను కష్టపడి చదువవలసి

ఉంటుంది, బ్రహ్మవిద్యను నేర్చుటకు మరీ కష్టపడవలసి ఉంటుంది. అన్ని విద్యలకంటే పెద్ద విద్య అయిన బ్రహ్మవిద్యను నేర్చుట బాగా చదివినట్లగును. అంతటితో ఆగక చదివిన చదువును అమలు పరచుకొని ఆచరించినవాడు మరీ గొప్పవాడు. బ్రహ్మవిద్యను నేర్చిన వానికంటే, దానిని ఆచరించి జ్ఞానాగ్నిని సాధించువాడు గొప్పవాడని చెప్పవచ్చును. గీతలో కూడ "యోగీ జ్ఞానిభ్యో మతోధిక" యోగి జ్ఞానులకంటే అధికుడని నా ఉద్దేశ్యము అని భగవంతుడన్నాడు. జ్ఞానాగ్ని చేత కర్మ అను కట్టెలను కాల్చువాడని, జ్ఞానమను నీటి చేత కర్మయను మురికిని ఉతికి తొలగించువాడని యోగిని అంటున్నారు. కర్మను లేకుండ చేయు యోగిని చాకలితో సమానముగ పోల్చి చెప్పారు. చాకలి గుడ్డల మురికిని తొలగించువాడు. యోగి శరీరకర్మను తొలగించువాడు, దీని ప్రకారము జ్ఞానమును నేర్చినవానిని చదివినవాడని, యోగము చేయువానిని చాకలివాడని పోల్చి చదివినోని కన్న చాకలివాడు మేలు అని అన్నారు. జ్ఞానికంటే యోగి గొప్పవాడని దీని భావము.

**871. (6) నక్షత్రము అను పదములో నిజమైన అర్థము ఏమి గలదు?**

జ. ప్రకృతి వలన లేక మూడు గుణముల వలన నాశనము కానిదని అర్థము.

**వివరము :** ప్ర + కృ + తి = ప్రకృతి. అలాగే తామస + రాజస + సాత్త్విక = మూడు గుణభాగములు. ప్రకృతి నుండి పుట్టినవే మూడు గుణములు, వాటినే మాయ అని కూడ అంటున్నాము. ప్రకృతికి వ్యతిరేఖమైనది పరమాత్మ. ప్రకృతి సర్వమును నశింపచేయగల్గుచున్నది. తనను పుట్టించిన పరమాత్మను మాత్రము ఏమి చేయలేకున్నది. ప్రకృతి వలన పరమాత్మ నాశనము కాదు. పరమాత్మ ప్రకృతికి వ్యతిరేఖముగ ఉండుటవలన పరమాత్మ నిర్ణయము చేత ప్రకృతి అంతయు అనగా పంచభూతములు నాశనమగుచున్నవి. పరమాత్మ జ్ఞానమును ఆధ్యాత్మిక రీత్యా చంద్రునిగ, పరమాత్మను నక్షత్రముగ పోల్చి చెప్పుకొన్నాము. ప్రకృతికి పరమాత్మ నాశనము కాదను సూత్రము ప్రకారము నక్షత్రము అను పేరు పెట్టడము జరిగినది. నక్షత్రములో చివరి "ము" పదమునకు ఆధారమైనది. ముందు

నక్షత్ర అను మూడక్షరములకు అర్థము గలదు. "న" అనగ కాదు అనియు, "క్ష" అనగ నాశనమనియు, "త్ర" అనగ మూడు అని భావము గలదు. నక్షత్ర అను మూడక్షరములకు అర్థము ప్రకృతికి నాశనము కానిదనియు, మూడు గుణములకు నాశనము కానిదనియు తెలియుచున్నది. ప్రకృతి త్రయమునకు నాశనము కాని వానిని పరమాత్మ అనుచున్నాము. పరమాత్మకు మారు గుర్తుగ న, క్ష, త్ర అను మూడు బీజాక్షరములనుంచారు. బీజాక్షరములనగా అర్థమును పుట్టించు బీజములని తెలియుచున్నది. బీజము అనగా పుట్టించునదని, బీజాక్షరములనగ వివరమును లేక భావమును లేక సారాంశమునుకల్గి ఉన్నవని అర్థము. నక్షత్ర అను అక్షరములలో భావమున్నది కనుక అవి బీజాక్షరములైనవి. పదమునకు భావముండక ప్రతి అక్షరమునకు భావమున్నపుడే బీజాక్షరములగును. నక్షత్రములో మూడు అక్షరములకు విడివిడిగ అర్థము గలదు కావున వాటిని పరమాత్మకు బీజాక్షరములంటున్నాము.

**872. (7) నెల నుండి నీకేదయిన రోగమొచ్చినదా?**

జ. నెల నుండి రోగమున్నది.

**వివరము :** ప్రతి మనిషి పుట్టింది మొదలు ఏదో ఒక బాధతో బాధపడుచునే ఉన్నాడు. కర్మ అనునదే జీవికి రోగమై ఉన్నది. జ్వరము వచ్చినపుడు శరీరానికి రోగమున్నదని తెలియుచున్నది. జ్వరము లేనపుడు శరీరానికి రోగము లేదు. శరీరములోపలి జీవుడు మాత్రము జ్వరము ఉన్నపుడు కాని, జ్వరము లేనపుడు కాని, కర్మను రోగమును అనుభవిస్తున్నాడు. శరీరమునకు జ్వరమే రోగమైతే జీవునకు కర్మే రోగమై ఉన్నది. కర్మయను రోగమును పుట్టినప్పటి నుండి అనుభవిస్తున్నాడు. శరీరమునకు జ్వరము లేనపుడు రోగములేనట్లు, జీవునకు కర్మ అనుభవము లేనపుడు రోగములేనట్లే. కర్మ అనుభవము బ్రహ్మయోగములో లేదు కనుక ఆ సమయములో మాత్రము రోగము లేదని చెప్పవచ్చును. నెల నుండి నేను యోగము చేయలేదు కనుక రోగములోనే ఉన్నానని చెప్పు చున్నాను.

శరీరమునకు రోగము రావచ్చు పోవచ్చును. జీవునికి మాత్రము రోగము ఎల్లవేళల ఉన్నది. జీవుడు యోగములో లేకున్నాడు కావున ఆ సమయములో రోగములో ఉన్నాడు. జీవుడు రోగములో కాని యోగములో కాని ఉండవచ్చును. జ్ఞానము తెలియని జీవుడు ఎల్లపుడు రోగములోనే ఉంటున్నాడు. జ్ఞానము తెలిసిన జీవుడు అప్పుడప్పుడు యోగములో, అప్పుడప్పుడు రోగములో ఉంటున్నాడు. నాకు యోగము తెలియదు కావున ఎప్పుడు రోగములోనే ఉన్నాను. నా శరీరము మాత్రము ఆరోగ్యముగ ఉన్నది.

**873. (8) నక్షత్రమునకు ఎన్ని కొనలు గలవు?**

జ. ఐదు కొనలు గలవు.

**వివరము :** ప్రపంచము పుట్టుక మునుపు పరమాత్మ ప్రకృతిని తయారు చేసి దానికి కొన్ని విధానములనిచ్చి జగతిని నడుపునట్లు చేశాడు. ఆ విధానములలో ప్రకృతి పరమాత్మకు వ్యతిరేఖముగ ఉండవలెననునది ముఖ్యమైన విధానము. విరుద్ధమే కాని శత్రుత్వము కాదు. ప్రకృతి పరమాత్మకు విరుద్దముగ ఉండినను పరమాత్మకు శత్రువై పరమాత్మను నాశనము చేయు శక్తి లేదు. పరమాత్మయే తనచే పుట్టింపబడిన ప్రకృతిని తగిన సమయములో తానే నాశమును చేయులాగ అమర్చుకొన్నాడు. ప్రకృతి అనగా పంచభూతములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. పంచభూతములకు ప్రకృతి బీజాక్షరములుగ ఉన్నది. ప్రకృతిని విడదీసి చూచినట్లయితే ఐదు అక్షరములు గలవు. ప + ర = ప్ర, క + రు = రు, ఇలాగ పరకరుతి అను ఐదు గలవు. భావ బీజము గలది బీజాక్షరమున్నట్లు ప = ఆకాశము, ర = గాలి, క = అగ్ని, రు = నీరు, తి = భూమి అను అర్థములు కలవు. ప్రకృతి అను పదములో పంచభూతములు ఇమిడి ఉన్నవి. పంచ భూతములను నాశనము చేయునది పరమాత్మ. పరమాత్మకు నక్షత్ర అను బీజాక్షరములు కూడ గలవు. నక్షత్రము ప్రకృతిని అనగా పంచభూతములను నాశనము చేయునది కావున నక్షత్రమునకు ఐదు కొనలు గలవు. నక్షత్రము కొన

మొదట పెద్దగ ఉండి చివరకు పోవు కొలది చిన్నగ తయారై ఆఖరుకు లేకుండ పోవుచున్నది. పంచభూతముల నాశనమును, పంచభూతములు లేకుండ పోవుటను, నక్షత్రము తన ఐదు కొనల ద్వార తెలియజేయుచున్నది. పంచ భూతములకు నాశనము కానిది, పంచభూతములనే నాశనము చేయునది పరమాత్మ అను అర్థమును నక్షత్రము తన కొనల ఆకారము ద్వార తెల్పుచున్నది.

**874. (9) వెండి, బంగారు, ఇనుము జ్ఞానరీత్యా దేని గుర్తులు?**

జ. వెండి జ్ఞానము, బంగారు మోక్షము, ఇనుము అజ్ఞానమునకు గుర్తు.

**వివరము :** జ్యోతిష్య శాస్త్రరీత్యా వెండికి అధిపతి చంద్రుడు, బంగారుకు అధిపతి గురువు. ఇనుముకు అధిపతి శని. వెండికి అధిపతియైన చంద్రుడు జ్యోతిష్యము ప్రకారము ఆత్మజ్ఞానమునకు అధిపతి. బంగారుకు అధిపతియైన గురువు మోక్షమునకు, ఇనుమునకు అధిపతియైన శని అజ్ఞానమునకు అధిపతులు. దీనిని బట్టి జ్ఞానమునకు గుర్తింపు లోహము చంద్రుని యొక్క వెండి, మోక్షమునకు గురువు యొక్క బంగారు, అజ్ఞానమునకు శని యొక్క ఇనుము గుర్తింపు లోహములుగ ఉన్నాయి. మోక్షము అన్నిటికంటే చాలా గొప్పది కావున భూమి మీద మోక్ష చిహ్నమైన బంగారు కూడ తన విలువను ఎక్కువగ చాటుకొనునట్లు మిగత లోహములకంటే బంగారు ధర కూడ ఎక్కువగ ఉన్నది. అజ్ఞానముకంటే ఎక్కువ మోక్షముకంటే తక్కువ అయిన జ్ఞానము యొక్క లోహము వెండి కావున అజ్ఞాన సంబంధిత లోహమైన ఇనుముకంటే ఎక్కువ, మోక్ష సంబంధిత బంగారుకంటే తక్కువ ధరతో ఉన్నది. భూమి మీద మనుషులు ఇనుముకంటే వెండి బంగారు మీద ఎక్కువ మోజుపడినట్లు, ఆధ్యాత్మికముగ జ్ఞానము మీద మోక్షము మీద ఆశపడవలెను.

**875. (10) గురువు ఎపుడు కాలమై పోతాడు?**

జ. గురువు అపుడపుడు కాలమౌతుంటాడు. ఎప్పుడైన కాలము కావచ్చును.

**వివరము :** గురువు పరమాత్మ అవతారమైన భగవంతుడని మా ఉద్దేశము.

ఉదాహరణకు శ్రీకృష్ణుడును, ఏసుప్రభువును గురువులుగా చెప్పుకోవచ్చును. పరమాత్మయే కాలమని కూడ చెప్పుకొన్నాము. గురువుగ వచ్చినవాడు తన జీవితములో ఒకప్పుడు ఆత్మగ, ఎల్లపుడు జీవాత్మగ, ఏదో ఒకటి రెండు సమయములలో అప్పుడప్పుడు పరమాత్మగ వ్యవహరించును. పరమాత్మగ వ్యవహరించినపుడు తానే కాలమైనాడని చెప్పవచ్చును. అందువలన గురువు అప్పుడప్పుడు కాలముగ మారుచుండునని చెప్పవచ్చును. శరీరముతో ఉన్నపుడు ఏదో ఒక సమయములో కాలముగ మారు గురువు శరీరమును వదలునపుడు తన నిర్ణయ ప్రకారము ఎప్పుడైన కాలముగ మారిపోవచ్చును. యోగులు మోక్షము పొందు కాలమును భగవంతుడు తెలియజేసినట్లు పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణములలో గురువు చనిపోవలసిన పని లేదు. మనుషులలో యోగులైన వారికి ఆ పద్ధతి వర్తించును. కాలమే తానగువానికి కాలములో కలసిపోవు కాలనిర్ణయముండదు. కావున భగవంతుడు ఏ సమయములో చనిపోయిన ఆయన స్వస్థానమైన మోక్షమునే చేరును. కాలమే తానైన భగవంతునికి కాలనిర్ణయము లేదు. ఆయన ఎప్పుడైన మోక్షము పొందవచ్చును, కాలము కావచ్చును. బ్రతికి ఉన్నపుడే కాలముగ మారు పరమాత్మకు ప్రత్యేకించి కాలముగ మారు సమయము లేదు. అన్నివేళల కాలమే ఆయనని తెలియాలి. ఈ విషయమును తెలియజేస్తు సామెతగ **"అయిపోయిన పెళ్ళికి మేళమెందుకు"** అన్నారు. పెళ్లి అనగ మోక్షము అని తెలుసుకొన్నాము. అయిపోయిన పెళ్లి అనగ ముందే దేవుడైన వానికి మేళమేల అనగ ఇంకొకమారు పెళ్లి చేయవలసిన పని లేదని అర్థము. దేవుడు రెండవమారు మోక్షము పొందడని అర్థము చేసుకోవాలి.

## జ్ఞాన పరీక్ష

**తాడిపత్రి** **తేది-26-06-2002**

**876. (1) గురువు ఆత్మ బంధువా శరీర బంధువా?**

జ. ఏ బంధువు కాదు.

**వివరము :** శిష్యుడు పూర్తి జ్ఞానము తెలియనంత వరకు గురువు ఆత్మ బంధువుగ ఉండును. జ్ఞానము సంపూర్ణముగ తెలిసిన తర్వాత అంత వరకున్న గురువు మరొక విధముగ కనిపించును. జ్ఞానము పూర్తి తెలియనంత వరకు గురువు శిష్యునికి కొంత మాత్రము అర్థమయి ఉండును. పూర్తి జ్ఞానము తెలిసిన తర్వాత గురువు యొక్క పూర్తి విలువ, గురువు యొక్క నిజస్వరూపము తెలియును. అపుడు గురువు పట్ల ఉన్న భక్తి ద్విగునీకృతమగును. పూర్తి తెలిసిన తర్వాత గురువు ఎడల ఉన్న భావమునకు ముందు ఉన్న భావమునకు చాలా తేడా ఉండును. అంతవరకు ఆత్మబంధువుగ ఉన్నట్లు కనిపించిన గురువు తర్వాత ఏ బంధువు కాదని తెలియును. పూర్తి జ్ఞానము తెలియనపుడు గురువు యోగమని జ్ఞానమని జీవునకు కొన్ని ఇబ్బందులు కలుగజేసినట్లుండును. అపుడు గురువు శిష్యునికి గుదిబండగ కనిపించి ఉండవచ్చును. జ్ఞానము కొరకు శిష్యుని చేత గురువు వంద రూపాయలు ఖర్చు పెట్టించినా శిష్యుడు గురువును నిందించు స్థితిలో ఉండును. వంద రూపాయలకు కేజీ మాంసము వచ్చెడిది అనవసరముగ పోయెనను కొనును. వేశ్యకు వెయ్యి రూపాయలనైన ఇత్తురు గురువుకు పుచ్చు కూరగాయలు కూడ ఇవ్వరను వేమన యోగి మాటను పోలి ఉందురు. అటువంటి సమయములో గురువు తనకొక బంధముగ కనిపించును. తన ఇష్ట ప్రకారము పోక గురువు ఇష్టము ప్రకారము నడువవలెననడమే శిష్యునికి పెద్ద బంధమగును. మొదట ప్రపంచములో ఇచ్చాను సారమున్న వాడు, గురువు యొక్క శిక్షణలో ఆ స్వేచ్ఛ లేకుండ పోవడమే తనకు బంధమగును. అందువలన పూర్తి జ్ఞానము తెలియని శిష్యునికి గురువు ఆత్మబంధువగును. జీవాత్మకు బంధనములు చేయువాడు కనుక ఆ పేరు వచ్చినది. తర్వాత కొంత కాలమునకు పూర్తి జ్ఞానము తెలిసినపుడు గురువు బంధనము చేయువాడు కాదు, కర్మ బంధములనుండి విడిపించువాడని తెలియును. అందువలన తెలియనపుడు బంధువువలె కనిపించిన వాడు తెలిసినపుడు ఏ బంధువుకాదని తెలియుచున్నది.

**877. (2) మనోనేత్రము ద్వార దేనిని చూడవచ్చును. దేనిని చూడలేము?**

జ. ప్రపంచ విషయములను చూడ వచ్చును. ఆత్మ పరమాత్మలను చూడలేము.

**వివరము :** మనో నేత్రమును మూడవ కన్ను అని పిలుస్తున్నాము. మూడవ కన్ను ద్వార రెండు కన్నులతో చూచిన విషయములను తిరిగి చూడవచ్చును. ఎప్పుడు చూడని వాటిని కూడ వాటికి రూపము కల్పించి చూపును. మొదటి కన్నులతో చూచినవి చూచినట్లే చూపు మనో నేత్రము చూడని విషయములను కూడ కల్పించి చూపును. కల్పించి చూపినవి నిజము కావచ్చు, నిజము కాకుండపోవచ్చును. మనో నేత్రము ఏమి చూపిన అవి ఇంద్రియాలకు సంబంధించిన విషయములే ఉండును. ఇంద్రియాతీతమైన ఆత్మ పరమాత్మ విషయములను చూపలేదు. మనస్సు వలననే ఆత్మను తెలియునట్లు ఎన్నో మార్లు చెప్పారు కదా! అని ప్రశ్నరావచ్చును. దానికి జవాబు ఏమనగా! మనస్సు వలన అనగా మనస్సు అణిగి పోవుటవలన అని అర్థము. మనస్సు బయటి విషయములను తెచ్చి పెట్టక పోతే మిగులునది ఆత్మ విషయమే. ఆత్మ ఇలాగున్నదని ఆత్మ యొక్క వివరమును జీవునకు బుద్ధి వివరించి తెలుపవలసిందే. గీతలో కూడ బుద్ధి చేతనే ఆత్మ తెలియబడుచున్నదని చెప్పారు. మనస్సును పని చేయకుండ చేసినపుడు మనోనిలకడ కల్గుటవలన ఆత్మ బుద్ధి ద్వార తెలియునన్నాము, కాని మనస్సే ఆత్మను జీవునకు ప్రత్యక్షముగ తెలియజేస్తుందని చెప్పలేదు. పరమాత్మ విషయము మనస్సుకు గాని ,బుద్ధికి గాని తెలియునది కాదు. కావున మనస్సుకు ప్రపంచ విషయములు తప్ప ఆత్మ పరమాత్మలు తెలియవని చెప్పవచ్చును.

**878. (3) పరమాత్మ అంశ జన్మ తీసుకొనునది స్త్రీ శరీరములోన లేక పురుషశరీరములోనా?**

జ. పురుష శరీరములో.

**వివరము :** జగతి లేకముందు పరమాత్మ స్త్రీ కాదు పురుషుడు కాడు. ఏదికాని పరమాత్మ జగతిని సృష్టించదలచుకొని స్త్రీ తత్త్వము కల్గిన ప్రకృతిని తయారు

చేశాడు. దానికుండవలసిన లక్షణములను ఉండవలసిన పద్ధతులను అన్నిటిని నిర్ణయించాడు. ప్రకృతి స్త్రీ స్వరూపమైనది కావున దానికంటే పూర్తి విలక్షణముగ నిలచాడు, ఆ విలక్షణమే పురుషుడు. తనకు ప్రకృతి ప్రకృతికి తాను పూర్తి వ్యతిరిక్త దిశలలో ఉండునట్లు తలచిన పరమాత్మ, ఇద్దరు సమవుద్దీగా ఉన్నపుడే తాను ఆడు ఆట రసవత్తుగ ఉండునని, తనకు సమానముగ ప్రకృతికి అధికారము లిచ్చాడు. ప్రకృతి పరమాత్మకు విరుద్ధమే కాని శత్రువుకాదు. ప్రకృతి చేతిలో విరుద్ధతను పరమాత్మ ఎదుర్కొనుట సహజమే అయిన ఒకరికొకరు శత్రువులుకారు. ఒకప్పుడు ప్రకృతిని పుట్టించిన పరమాత్మ తిరిగి ఒకప్పుడు తనయందే లీనము చేసుకొని ప్రకృతిని లేకుండ చేయును. ప్రకృతిని పుట్టించినవాడు, పోషించువాడు తిరిగి లేకుండ చేయువాడు పరమాత్మ. పుట్టించిన తండ్రిగ, భరించు భర్తగ, నశింపజేయు కాలుడుగ ప్రకృతికి అన్ని తానైయుండి ప్రకృతిలోని శక్తిగ కూడ తానై ఉన్నాడు. ఎంతో విశాలముగనున్న వాడు, కొంత విశాలమైన ప్రకృతిని తయారుచేసి, జగతి యొక్క అను ఆటను ఆడుచున్నాడు. ఈ ఆటలో ఏదికాని పరమాత్మ పురుషుని వేషదారియైపోయాడు. జగతి నాటకము ప్రకారము పరమాత్మ పురుషుడు. నాటకమునకతీతముగ చూస్తే స్త్రీ పురుషుడు ఏదికానివాడు. ప్రకృతిని పంచభూతములుగ చేసి ప్రపంచము అన్నాము. ప్రపంచమును సృష్టించిన పరమాత్మ చావు పుట్టుకలు గల జగతిని సృష్టించదలచు కొన్నాడు. పుట్టుక చావులు గల జీవరాసులను సృష్టించి ప్రపంచములో జగతిని నిర్మించాడు. "జ" అనగ పుట్టునది "గతి" అనగ చావునదని, "జగతి" అనగ పుట్టుక చావులు గలదని తెలియునట్లు జీవసముదాయమునకు జగతి అని పేరు పెట్టారు. ప్రకృతియను ప్రపంచమును తయారు చేసిన పరమాత్మ, దానిలో జగతి అను జీవరాసులను తయారు చేశాడు. ప్రకృతి పురుషులు సమానమైనవారు కాగ, అనగ ప్రపంచము పరమాత్మ సమానమైన వారు కాగ, తర్వాత ప్రత్యేకముగ పుట్టి వచ్చినది జగతి. ఇప్పటికి పరమాత్మ ప్రపంచమును జగతిని రెండిటిని సృష్టించాడు. తనతో కలుపుకుంటే మూడవుతాయి. మొదట ఏదికాని పరమాత్మ ప్రకృతిని తయారు చేసి, తాను

పురుషుడై ప్రకృతిని భార్య చేసుకొని, తాను భర్తగ ఉంటు జగతి అను ప్రత్యేకమైన సంతానమును తయారు చేశాడు. ఈ వావి వరుసలు లేకుండ చూస్తే ఏదికాని పరమాత్మ తన నుండి మూడు భాగములను సృష్టించాడు. ప్రకృతిని, పురుషుడను, జగతిని. ప్రకృతి స్త్రీ, పరమాత్మ పురుషుడు, జగతి నపుంసకుడని తలచవలెను. మధ్యలో ఉన్న నపుంసకుడను ఇటు ప్రకృతి తన వైపు లాగుకొనడము, అటు పరమాత్మ తన వైపు లాగుకొనడము ముఖ్యమైన ఆట. ఆటకంటు ఒక పద్ధతి ఉంటుంది, ఆట పద్ధతులను నిర్ణయించి ఆటను పెట్టిన పరమాత్మ, తాను అన్నిటికి సృష్టికర్త పెద్ద అయినప్పటికి తాను నిర్ణయించిన పద్ధతుల ప్రకారము ఆట ఆడుచున్నాడు. ఈ ఆటకు మిగత ఆటలవలె కొంత కాల నిర్ణయమున్నది. పుట్‌బాల్‌కు ఒకటిన్నర గంట, క్రికెట్‌కు యాబై ఓవర్లు అన్నట్లు జగతి అను ఆటకు వేయి యుగములు లేక 108 కోట్ల సంవత్సరములు పరిమితి ఉన్నది. తర్వాత కొంత విరామము, ఆ తర్వాత ఆట సాగడము జరుగుచున్నది. ఆట సమయము 108 కోట్ల సంవత్సరములు విరామము కూడ అంతే సమయము.

ఏది కాని వాడు, పలానా అని ఎవరి చేత చెప్పబడనివాడు, మొదట ప్రపంచమును తర్వాత జగతిని తయారు చేశాడు కదా! ప్రకృతిని తయారు చేసి తాను పురుషుడు అను గుర్తింపు తెచ్చుకొన్నాడు. తాను పురుషుడై తన బీజమును భరించబడి గర్భము దాల్చు ప్రకృతిని ఐదు భాగములు చేశాడు. అటువంటి ప్రకృతినే పంచభూతములని ప్రపంచమని అంటున్నాము. తన చేతనే తయారు కాబడిన జగతిని మూడు భాగములుగ విభజించాడు. జీవరూపమైన జగతి జీవాత్మయని, ఆత్మయని, పరమాత్మయని మూడు విధములుగ విభజించాడు. జీవాత్మలను, ఆత్మను తయారు చేసి తాను పరమాత్మనను గుర్తింపు తెచ్చుకొన్నాడు. ప్రకృతి ప్రక్కన పురుషుడుగ ఆత్మల ప్రక్కన పరమాత్మగ గుర్తింపు తెచ్చుకొన్నాడు. ప్రకృతి ఉన్నపుడు, ఆత్మలు ఉన్నపుడు మాత్రమే పురుషుడు పరమాత్మ అని పిలుచుటకు ఆధారమున్నది. అవి లేకుంటే ఆయనను ఏమని చెప్పుటకు వీలుకాదు.

ఏది కానివాడు ప్రపంచముతో పురుషుడని, ఆత్మలతో పరమాత్మని అర్థమయిందను కొంటాను. ప్రకృతి పురుషులకు పుట్టినది జీవసముదాయమైన జగతి. జగతిలో తల్లితండ్రులైన ప్రకృతి పురుషుల లక్షణములుండునట్లు పరమాత్మ చేత అమర్చబడినది.

ప్రకృతిలో పురుషునికంటే విరుద్ధ లక్షణములున్నట్లు అమరిక గలదు. జగతిలో మాత్రము ప్రకృతి పురుషుల రెండిటి లక్షణములు మిలితమై ఉన్నవి. జీవరూపమైన జగత్తులో పరమాత్మ సంబంధిత జీవాత్మ ఆత్మలు, ప్రకృతి సంబంధిత శరీరములు రెండు గలవు. అంతేకాక దేవుడున్నాడను నమ్మకము ఆత్మ పరముగ, లేడను దేవునికి వ్యతిరేఖత ప్రకృతి పరముగ రెండు గలవు. జగతిగ ఉన్న మానవులలో ప్రకృతి పురుషుల లక్షణములుండి, ప్రకృతి పురుషులిలా కలరని తెలుపు నిమిత్తము ప్రకృతికి ప్రతిరూపముగ స్త్రీ శరీరములు, పరమాత్మకు ప్రతి రూపముగ పురుషుని శరీరములు తయారైనవి. ప్రకృతి పరమాత్మలేకాక జగత్తు కూడ కలదని తెలియునట్లు జగత్తుకు ప్రతి రూపముగ నపుంసకులు కూడ తయారైనారు. స్త్రీ, పురుషులు, నపుంసకులు ముగ్గురు ప్రకృతి, పరమాత్మ, జగతికి ప్రతిరూపములై ఉన్నారు. ప్రకృతి = స్త్రీ, జగతి = నపుంసకుడు, పరమాత్మ = పురుషుడు (మగాడు). పుట్టిన ప్రపంచమునకు ఆడవారు, జగత్తుకు గొజ్జేవారు, పుట్టని పరమాత్మకు మగవానిని గుర్తింపుగ పెట్టి తన సృష్టి ఇలా ఉందని అందరికి తెలియునట్లు చేశాడు. అంతేకాక పరమాత్మ ప్రకృతి యొక్క రెండిటి చేతనే జగత్తు పుట్టినదని తెలియునట్లు ఆడ మగకు సంతానము పుట్టునట్లు చేశాడు. అందరికి కనిపించు తల్లి, తండ్రి, సంతానము ఆదియందు సృష్టి విధానము. అన్నిటియందు బుద్ధిని ఉపయోగించు మానవుడు స్త్రీకి భిన్నముగనున్న పురుషుడును గురించి, వారికి కల్గు సంతానమును గురించి, ఎందుకిలా ఉన్నదని ఏమాత్రము యోచించడము లేదు. **ఆధ్యాత్మిక విద్యలో అక్షరాభ్యాసమైన సృష్టిరహస్యమును తెలియక పోతే ఆధ్యాత్మికమే తెలియక పోవును.**

ఇది ఒక ఆటయని దేవునికి ప్రకృతికి మధ్యన జరిగే శస్త్రుత్వరహిత పోరాటమని తెలియాలి. ప్రకృతి పరమాత్మల ఆటలో జీవున్ని ఎవరివైపు వారు లాగుకొనుటకు చూస్తుందురు. పరమాత్మ తన జ్ఞానమును బోధించి తన వైపు వచ్చునట్లు చేసుకోవడము తన ఆటలో కర్తవ్యము కాగ, ప్రకృతి తన ఆయుధములైన గుణములతో మనిషికి తీరిక ఓపిక లేకుండ చేసి, దేవుని గురించి యోచించు అవకాశమే మానవునికి లేకుండ చేయుచున్నది. అందరిని వారి వారి పనులలో ఇరికించి, ధ్యాస ఆ పనుల మీదికి మళ్ళించి, ఆశ చేత దానికి అనుబంధ గుణముల చేత మనిషిని దేవునివైపు పోకుండ చేయుచున్నది. సృష్టిలో పరమాత్మ ప్రకృతి మధ్య జరిగే అతి పెద్ద ఈ ఆటకు పేరు లేదు. ప్రకృతి మాయ రూపములో తనను ఎవరు గుర్తించ లేనట్లు ఆడుచు అందరిని తన వైపు లాగుకొనుచున్నది. జగత్తులో ఎవడయిన దేవుని ధ్యాస కల్గిన, దేవుని గూర్చి తెలుసుకోవాలని ప్రయత్నించిన, మాయ (ప్రకృతి) ప్రత్యేకముగ వాని మీద దృష్టి సారించి వానిని కూడ తన బుట్టలో వేసుకొంటున్నది. దేవుడు మాయ యొక్క పోరాటమునందు ప్రస్తుత కాలములో మాయకే ఎక్కువ బలమున్నట్లు, దానివైపే 99 శాతము మనుషులున్నట్లు తెలియుచున్నది. ఇటువంటి సందర్భములలో, దేవుని ఓటమి తప్పదేమోననిపించు సమయములో, పరమాత్మ కూడ తాను బాగా ఆడి గెలిచే దానికి ప్రయత్నించాలి కదా! అందువలన ఆయన ప్రయత్నములో భాగముగ మనిషిగ మనుషుల మధ్యలోకి వచ్చి, తనను గూర్చి తానే చెప్పుకొని, తనవైపు మళ్లించుకోవడానికి ప్రయత్నించును. ఆట అనగా గెలుపు ఓటముల మధ్య సాగే పోరాటము కదా! ముందే చెప్పుకొన్నాము ఇది శస్త్రుత్వరహిత యుద్ధమని. ఈ పోరాటములో ఎవరి వ్యూహము వారిది. మనిషిలోనే మాయ దేవుడు ఇద్దరు ఉండినప్పటికి వారి విషయము మనిషికి తెలియకున్నది. అందువలన మనిషి దేవున్ని గాని, మాయను గాని గుర్తించలేకున్నాడు. తను ఎటువైపు ఉన్నానని కూడ తెలియదు. తమకు తెలియకుండా మాయ చేతిలో చిక్కిన మనషులను దానినుండి విడిపించాలని దేవుడు కూడ ప్రయత్నించుచుండును. ఆ ప్రయత్నము

లోనే పరమాత్మ భగవంతునిగ భూమి మీద పుట్టవలసి వస్తున్నది. కాని ఆట నియమముల ప్రకారము తాను పరమాత్మయని మనుషులకు తెలియకూడదు. ఎవరికి తెలియకుండా తాను మనిషిలాగే పరమాత్మను గూర్చి తానే చెప్పవలసి వస్తున్నది. తన విషయము తానే చెప్పుచున్నప్పటికి, తన ధర్మములను పునరుద్ధరించినప్పటికి, మాయ మనుషులలో ఉండి భగవంతున్ని మనుషులలో అధమునిగా అజ్ఞానిగా చూపుచున్నది. ఆయన మాటలు అధర్మములని, తమవే నిజమైన ధర్మములని బోధించునట్లు గురువులనే తయారు చేసి పెట్టింది. మాయయే స్వయముగ గురువులు, స్వాములరూపములో భగవంతునికి పోటీగా వస్తున్నది. తన తియ్యటి మాటలను దైవజ్ఞానముగ వర్ణించి, దేవుని జ్ఞానమును నమ్మనట్లు, తాను చెప్పు జ్ఞానమునే నమ్మునట్లు చేయుచున్నది. ఏవి దేవుని ధర్మములో తెలియనట్లు తాను కూడ పరమాత్మ, మోక్షము, జ్ఞానము, సాధన అను పదములుపయోగించి చెప్పుచునే తన ధర్మములను మానవులకు అంటించుచున్నది. మాయ యొక్క ధర్మముల ముందు దేవుని ధర్మములను గుర్తింపు లేనట్లు చేయుచున్నది. దేవుని వైపు పోవాలనుకొన్న వానికి ఏవి ధర్మములో, ఏవి అధర్మములో తెలియనట్లు చేసి ఎవరు ఏమి చెప్పిన నమ్మునట్లు చేయుచున్నది. మాయ దేవుడులో ఎవరు అవతరించిన వారి ఉనికిని చెప్పుకోకూడదు అన్నది ఆట నియమము. పరమాత్మ భూమి మీద భగవంతునిగ అవతరించి తాను పరమాత్మనని చెప్పుకోలేని నియమము ప్రకారము ప్రకృతి కూడ భూమి మీద జన్మించి తాను మాయనని చెప్పుకోదు. మాయ అవతరించిన నేను భగవంతుడనని చెప్పుకోవచ్చు ఆ సూత్రము ప్రకారము మానవునికి తానే భగవంతుడనని తెలియచేస్తు, ఎన్నో మహత్యములు చూపుచు, ఎందరో స్వాములుగ మాయ అవతరిస్తున్నది. పరమాత్మ భూమి మీద ఒక్కచోట భగవంతునిగ అవతరించితే, ప్రకృతి భూమి మీద ఎందరినో భగవంతుడను పేరుతో తయారు చేయుచున్నది. తన ధర్మములను తెలుపుటకు పరమాత్మ ఒకచోట పుట్టి తాను భగవంతుడనని గుర్తింపు లేకుండ ఉంటే, మాయ మాత్రము ఆయన జన్మకు ముందునుంచే

ఎందరినో భగవంతుడను పేరు కల్గిన వారిని తయారు చేసి, వారి మాటనే వినునట్లు, నిజమైన భగవంతుడు చెప్పిన మాటలను విననట్లు చేయుచున్నది. ఎవరి ప్రయత్నము వారిదన్నట్లు మాయ పని మాయ, దేవుని పని దేవుడు చేసుకొంటు పోవుచున్నారు. మాయ ఎల్లపుడు గుణముల రూపములో మనిషి శరీరములో ఉండగ, దేవుడు కూడ ఆత్మ రూపముగ గలడు. మాయ పరమాత్మలు భూమి మీద మనషుల రూపములో వస్తారనుకొన్నాము కదా! అట్లు వచ్చువారు ఏ శరీరములు ధరించి వస్తారని తెలియవలసి ఉన్నది. మాయ భూమి మీద పురుష శరీరము ధరించి భగవంతునిగ, అట్లే స్త్రీ శరీరము ధరించి భగవతిగ వచ్చుచున్నది. పరమాత్మ మాత్రము పురుష శరీరము ధరించి వచ్చుచున్నాడు. పరమాత్మ వాస్తవానికి పురుషుడే కావున పురుష శరీరము మాత్రము ధరించుచున్నాడు. ప్రకృతి స్త్రీయే కావున స్త్రీ శరీరము ధరించుచున్నది. అలాగే తాను కూడ పురుషుడనే అని మభ్యపెట్టుటకు పురుష శరీరము కూడ ధరించుచున్నది. భగవతి భగవంతులలో ఎవడు నిజమైన భగవంతుడో అర్థము కాకుండ పోవుచున్నది. మొత్తానికి భగవంతుడు పురుషునిగనే జన్మించునని తెలియాలి.

## 879. (4) మోక్షము పొందు కాలము ఎవరెవరికి వర్తించును?

జ. ఆత్మ జీవాత్మలకు

**వివరము :** మోక్షము పొందు కాలము యోగులకు మాత్రము వర్తించునని కూడ కొందరు చెప్పవచ్చును. యోగులు ముక్తి పొందు కాలమును గీతయందు కూడ తెలియజేసారు. ఇక్కడ ప్రశ్నలో ఎవరెవరికి అని వివరమడిగాము. కావున పలానా యోగులని ముందే చెప్పలేము. యోగులను మాట సరియైన జవాబు కాదు. కొందరు బ్రహ్మయోగులు కర్మయోగులని వివరము చెప్పినప్పటికి అదియును జవాబు కాదు. ఎందుకనగా! బ్రహ్మయోగులు కర్మయోగులను కలిపి యోగులను చున్నాము. నిజమైన జవాబు ఒక యోగి మోక్షము పొందితే, కాలము సరిపోవల సిందే, కాలము సరిపోయి మోక్షము పొందిన వానిలో జీవాత్మ ఒక్కడే మోక్షము

పొందడము లేదు. జీవాత్మతో పాటు తోడుగ ఉన్న ఆత్మ కూడ ముక్తి పొందుచున్నది. అందువలన మోక్షము పొందు కాలము యోగి శరీరములో ఆత్మ జీవాత్మలను ఇద్దరికి వర్తించుచున్నది.

**880. (5) గుణచక్రము ఎన్ని భాగములు గలదు?**

జ. నాల్గు భాగములు.

**వివరము :** ఈ ప్రశ్నకు చాలామంది సులభముగ మూడు భాగములున్నదని, అవియే సాత్త్విక, రాజస, తామసములని చెప్పుచున్నారు. అది సరియైన జవాబు కాదు. ఈ జవాబు గుణభాగములు ఎన్ని అని అడిగితే సరిపోవును. ఇక్కడ అడిగినది మొత్తము గుణచక్రము ఎన్ని భాగములని ప్రశ్న. గుణచక్రమును శ్రీకృష్ణుడు నెమలిపింఛము రూపములో చూపాడు. చూపడమే కాక **'చాతుర్వర్ణం'** అని గీతలో కూడ అన్నాడు. నెమలిపింఛములో గాని, ఆయన చెప్పిన మాటలలో గాని నాలుగు భాగములున్నవి. గుణచక్రము గుణములతో కూడిన భాగములు మూడు ఒకటి గుణము లేని భాగము కలిసి మొత్తము నాలుగైనవి. గుణములలో ఉన్నవారిని సాత్త్వికులు, రాజసులు, తామసులని అనుచున్నాము. గుణములు లేని భాగములో నున్న వానిని యోగి అంటున్నాము కావున గుణచక్రము నాల్గు భాగములని చెప్పవచ్చును.

**881. (6) ధర్మమునకు ఎన్ని పాదములు గలవు?**

జ. పాదములు లేవు.

**వివరము :** ధర్మము ఒక వస్తువు కాదు. ఒక వస్తువైతే లేక ఓ పదార్థమైతే దానిని నాల్గు భాగములు చేసి ఒక్కొక్క భాగమునకు ఒక్కొక్క పాదమని చెప్పవచ్చును. నాలుగనియే కాదు ఒక పూర్ణమైన దానిని ఎన్ని భాగములు చేస్తే అన్ని భాగములని చెప్పవచ్చును. ధర్మము ఒక్కటిగ ఎక్కడ లేదు. ధర్మములు అనేకముగ ఉన్నాయి. ఒక వేళ ధర్మము ఒక జంతువు కాదు, దానికి ఇన్ని పాదములున్నాయని చెప్పుటకు. చాలా మంది తమ మాటలలో ధర్మమునకు నాలుగు పాదములుండెడివని, కృత

యుగములో ధర్మము నాలుగు పాదములతో నడిచెడిదని, కలియుగములో ఒక్క పాదముతోకుంటుతూ నడుస్తున్నదని చెప్పుచుండగ విన్నాము. ధర్మమునకు పాదములను మాట శుద్ధ అబద్ధము. గీతలో ఎన్నో ధర్మములున్నట్లు చెప్పారు. 'సర్వ ధర్మాన్' అని కూడ అన్నారు. ధర్మములు బోధరూపములో, జ్ఞానరూపములో ఉన్నాయి గాని పాదములు చేతుల రూపములో లేవు.

**882. (7) తనకు దగ్గరగ ఉన్న స్త్రీకి భర్త గాని, పురుషునికి భార్యగాని దూరమగుదురేమోనని బాధపడుదురు. ఆ బాధ ప్రేమవలన, కామము వలన లేక మరి ఏగుణము వలనయిన వచ్చినదా లేక హృదయము నుండి వచ్చినదా?**

జ. మోహగుణము వలన వచ్చినది.

**వివరము :** నా వారు నాకు దూరమగుదురేమోనను బాధ ఒక్క మోహ గుణము వలననే కల్గుచున్నది. ఈ విషయము మిగత గుణములకు సంబంధము లేదు. ఇది గుణముల నుండి వచ్చినదే గాని హృదయము నుండి వచ్చినది కాదు. ఈ విషయముననే మోహ గుణమువలన అర్జునుడు కూడ యుద్ధసమయములో బాధపడి యుద్ధము చేయలేక కూర్చున్నాడు.

**883. (8) దేవతలు సాత్త్వికులా, రాజసులా, తామసులా?**

జ. మూడు గుణములలోనున్నారు.

**వివరము :** ఒక్క గుణమువారని చెప్పుటకు వీలు లేదు. గుణ భాగములైన సాత్త్వికములో దేవతలున్నారు. అలాగే రాజసములోను తామసములోను కూడ దేవతలున్నారు. మూడు భాగములలోను దేవతలకు సంబంధించిన గుణములున్నవి కావున తామస దేవతలున్నారు, రాజస దేవతలున్నారు, సాత్త్విక దేవతలున్నారు.

**884. (9) రాక్షసులు ఎక్కువగ ఏ గుణములో ఉంటారు?**

జ. అన్ని గుణములలోను ఉంటారు.

**వివరము :** మూడు గుణములలోను రాక్షసగుణములు, దేవత గుణములున్నాయి కావున మూడింటిలోను రాక్షసులున్నారు. తామసములోను, రాజసములోను, సాత్త్వికములోను కూడ రాక్షసులు గలరు. రాక్షసులు గాని, దేవతలు గాని ఒకే గుణభాగములో ఉంటారనుటకు వీలు లేదు.

**885. (10) చేపలు పట్టువాడొకడు పట్టిన చేపలను గట్టు మీదికి వేయగ గట్టు మీద కొంగ చేపలను తింటూ ఉన్నది. ఇంకొకడు ఈ విషయమంత చూస్తు కొంగను అదిలించలేదు. గట్టుకు వేయవద్దని పట్టేవానికి చెప్పలేదు. ఇంకొక కొంగ చేపలు పట్టేవానిని, తినే కొంగను చూచి వాడు కష్టపడి చేపలు పట్టి బయటికి వేస్తే కొంగ తింటూ ఉంది అనుకొని, వారి పని వారిదిలే నాకెందుకనుకుంది. ఇద్దరి మనుషులను, రెండు కొంగలను ఆధ్యాత్మికరీత్య ఎవరిగ పోల్చవచ్చును.**

జ. ఆత్మ, జీవాత్మ, పరమాత్మ, జ్ఞానము తెలిసిన జీవాత్మ.

**వివరము :** శరీరములో ఆత్మ పని చేయుచున్నది. కర్మననుసరించి ఏ సమయానికి ఏ పనిచేయవలెనో ఆ పనిని ఆత్మ చేస్తున్నది. కర్మ ఆత్మ ద్వార ఆచరణకు వచ్చి, ఆచరణలో కష్ట సుఖముల రూపముగ మారుచున్నది. ఆచరణలో కష్ట సుఖములను జీవుడు అనుభవించడముతో కర్మ అయిపోవును. ప్రారబ్ధకర్మ అయిపోవాలంటే, జీవుడు దానిని అనుభవించాలంటే, శరీరములో చైతన్యశక్తియైన ఆత్మ ఆ కర్మననుసరించి పనిచేసి ఫలితమును జీవుడను అనుభవింపజేయుచున్నది. జీవాత్మ అనుభవించడము, ఆత్మ పని చేయడమును, పరమాత్మ సాక్షిగ శరీరములో చూస్తూనే ఉన్నది. పరమాత్మ కేవలము సాక్షిభూతుడే కాని, ఆత్మను చేయమనిగాని, జీవాత్మను అనుభవించమని గాని, లేక అందుకు విరుద్దముగ చెప్పడము కాని చేయడము లేదు. ఇది శరీరములోనున్న తతంగము. ఆ తతంగమును వేరు విధముగ పోల్చుకోవచ్చును. శరీరములో పని చేయు ఆత్మను చేపలు పట్టువానిగ వర్ణించుకొందాము. కర్మానుసారము లభించు కష్టసుఖములు చేపలని

అనుకుందాము. లోపల అనుభవించు జీవాత్మను గట్టు మీదకు పట్టినవాడు వేసిన చేపలను తిను కొంగగ తలచుదాము. లోపలి విషయమంతయు చూస్తు సాక్షిగ మౌనముగ ఉన్న పరమాత్మను ఏమి చెప్పని మరియొక మనిషిగ లెక్కించు కొందాము. ఇంత వరకు ఒక శరీరములోనున్న విషయము. ఇదంతయు అనగ ఆత్మ పని, జీవాత్మ అనుభవము, పరమాత్మ సాక్షిత్వము అన్నియు జ్ఞానము తెలిసిన వానికి తెలియును. ఇదంతయు అజ్ఞాని శరీరములో జరుగుచున్నదని తెలిసిన జ్ఞాని వాని కర్మానుసారము వానికి జరునని, ఎవరు ఈ క్రియను ఆపలేరనుకొనును. వేరొకనిని చూచి వాని కర్మప్రకారము వాడు నడవక తప్పదనుకొనును. ఈ విషయము సర్వసాధారణముగ అందరిలోను జరుగునని తెలిసినవాడు వేరు శరీరములోని ఆత్మను పనిచేయవద్దని గాని, జీవాత్మకు వచ్చిన కష్ట సుఖములను అనుభవించవద్దని కాని చెప్పడు. ఎవరి కర్మ వారిదితే అనుకొనును. అట్లనుకొను జ్ఞాని పై ప్రశ్నలోని రెండవ కొంగగ తలచవలెను.

1. చేపలు పట్టువాడు = పని చేయుచున్న ఆత్మ
2. చేపలు = కష్ట సుఖములు
3. గట్టు మీద తిను కొంగ = తల లోపల అనుభవించు జీవుడు
4. కొంగను అదిలించని వాడు, పట్టేవానికి ఏమి చెప్పని వాడు = సాక్షిభూతుడైన పరమాత్మ
5. వారి పని వారిది అనుకొన్న కొంగ = జ్ఞానము తెలిసిన మరియొకడు.

## జ్ఞాన పరీక్ష

**ధర్మవరము** **తేది-24-07-2002**

**886. (1) ప్రపంచము జగతి అనునవి రెండు ఒకేమారు పుట్టినవా? లేక వేరు వేరుగా పుట్టినవా?**

జ. వేరు వేరుగ పుట్టినవి.

**వివరము :** ప్రపంచము జగతి రెండు ఒకటేనని చాలామంది అనుకోవచ్చును.

వివరించుకొని చూచితే రెండు వేరువేరని తెలియును. ప్రపంచము అనగా పంచభూతములనియే అర్థము. ప్రకృతిని ప్రపంచమని అంటున్నాము. ప్రకృతి, అనిన ప్రపంచమనిన, పంచభూతములనిన అన్నియు ఒక్కటే. జీవ సముదాయమును జగతి అంటున్నాము. పుట్టుక చావులు కలవి కావున జీవరాసులనన్నిటిని కలిపి జగతి అనడము జరిగినది. ప్రపంచము వేరు జగతి వేరు. ప్రపంచములో జగతి కలదు. మొదట ఏమిలేనపుడు, ఏమి కాని దేవుడు సృష్టిని తయారు చేశాడు. దేవుడు తన సృష్టిలో మొదట ప్రపంచమును సృష్టించాడు. ప్రపంచమనబడు ప్రకృతిని తయారు చేసిన తర్వాత జీవసముదాయమును ఒక్కొక్కటిగా తయారు చేశాడు. దేవుని చేత మొదట ప్రపంచము తర్వాత దానిలో జగతి తయారైనది. ఒక్కమారుగ రెండు పుట్టలేదు.

**887. (2) పరమాత్మను పురుషుడని, పురుషులలో ఉత్తమపురుషుడని, పురుషోత్తముడని అంటున్నాము. అటువంటపుడు పరమాత్మను స్త్రీకాదు పురుషుడు కాదు అనియు ఏదికానివాడనియు ఎందుకనాలి?**

జ. మొదట ఏదికానివాడు కనుక అలా అంటున్నాము.

**వివరము :** ఇపుడున్న ప్రపంచమే లేనపుడు ఏది కాని వాడుండుట సహజమే. ఎవరి ఊహకు కూడ అందని స్థితిలో పరమాత్మ అను పేరుగాని, పురుషోత్తముడను పేరుగాని దేవునికి లేవని చెప్పవచ్చును. ఉన్నవాడు ఏదికాక ఏమని చెప్పుటకు వీలు లేక పురుషుడుకాక స్త్రీయుకాక పరమాత్మ అని చెప్పుటకు వీలులేని విధముగ ఉన్నాడు. ఇప్పటి పరమాత్మ, పురుషోత్తమ అని పిలువబడువాడు అపుడున్నప్పటికి ఆ విధముగ పిలుచుటకు కూడ వీలు లేదు. మొదట ఒకటి ఉంటే రెండవ దానిని ఏదో ఒక విధముగ ఒక దానితో ఒకటి పోల్చి పిలువవచ్చును. రెండవది ఏది లేనపుడు మొదటి దానిని పోల్చుటకు ఆధారమే ఉండదు. ఆత్మ ఉన్నపుడు రెండవ దానిని పరమాత్మని పిలుచుటకు వీలున్నది. స్త్రీ ఉంటే దానిని బట్టి పురుషుడనుటకు వీలున్నది. ప్రపంచమే లేని సమయములో, ఏదీ లేని సమయములో, ఏదీ కాని

వాడిగనే పిలువాలి. అపుడు పురుషుడుగాడు, పురుషోత్తముడుగాడు. ఇపుడు ప్రకృతి ఉన్నది కావున పురుషుడని, జీవాత్మ ఆత్మలున్నవి కావున పరమాత్మ, పురుషోత్తమ అంటున్నాము.

**888. (3) ఆధ్యాత్మికముగ స్త్రీ పురుషుడు కానివాడెవడు?**

జ. జీవాత్మ.

**వివరము :** ప్రకృతిని స్త్రీయని పరమాత్మను పురుషుడని చెప్పుకొన్నాము. పరమాత్మ బీజదాత కాగ, ప్రకృతి యొక్క గర్భముచే జీవరాసి పుట్టుచున్నది. ప్రకృతి పురుషులకు పుట్టిన జీవాత్మలో ప్రకృతి లక్షణములు, పురుష లక్షణములు మూర్తీభవించి ఉన్నాయి. ఆత్మ అంశ అనగ పురుష అంశతో జీవాత్మ కాగ, ప్రకృతి అంశతో శరీరము గుణములున్నాయి. ఆడతనము, మగతనము రెండు ఉన్న జీవరాసులు అటు పూర్తి పరమాత్మవైపు పోక మాయలో మునిగి ఉండుట వలన, పరమాత్మ జ్ఞానము లేకుండుట వలన, పుంసత్వము లేనివానిగ జీవుడను వర్ణించుచున్నాము. ప్రకృతి స్త్రీ కాగ, పరమాత్మ పురుషుడు కాగ, శరీరము ధరించిన జీవులు నపుంసకులని చెప్పవచ్చును.

**889. (4) బంధువులు ఎన్ని రకములున్నారు?**

జ. రెండు రకములున్నారు.

**వివరము :** బంధువులు అనగా బంధించువారని, బంధనములు కలుగజేయువారని అర్థము గలదు. అమ్మ, చిన్నమ్మ, పెద్దమ్మ, నాన్న, చిన్నాన్న, పెద్దనాన్న, అత్త, మామ, తాత, అవ్వ అను వరుసలుగలవారు శరీరమునకు బంధువులగుదురు. శరీర బంధువులు పుట్టిన ప్రతివానికి గలరు. ఆత్మ బంధువులు కొందరికే గలరు. ఆత్మబంధువు జ్ఞానము చెప్పు గురువగును. శరీర బంధువు, ఆత్మబంధువను రెండు రకముల బంధువులలో శరీరబంధువులు శరీరమున్నంత వరకు ఉందురు. ఆత్మ బంధువైన గురువు శిష్యుడు జ్ఞానము పూర్తిగ తెలియునంత వరకే ఉండును. పూర్తి జ్ఞానము తెలిసిన శిష్యునికి గురువు ఆత్మ బంధువు కూడ కాదు. జ్ఞానము

తెలియు దశలోనున్న ఆత్మబంధువు జ్ఞానము తెలిసిన స్థితిలో ఉండదు. లెక్కకు మాత్రము రెండు రకములైన బంధువులున్నారని చెప్పాలి.

## 890. (5) పరమాత్మ ఆడు ఆటలో ప్రత్యర్థి ఆత్మనా జీవాత్మనా?

జ. ఆత్మ జీవాత్మ ఇద్దరు కారు.

**వివరము :** పరమాత్మ ఆడు ఆటకు ప్రత్యర్థి ప్రకృతి లేక మాయ అనవచ్చును. సృష్టి ఆదిలోనే పరమాత్మ తనకు ఎదురుగ నిలచునట్లు ప్రకృతిని తయారు చేసి పెట్టాడు. ప్రకృతి చేత తయారైనది మాయ. మాయ దేవునికి మధ్య జరుగు పోరాటమునే ఆట అనుచున్నాము. ప్రకృతికి పరమాత్మకు జరుగు ఆటలో పావులుగనున్నవారు జీవాత్మ ఆత్మలు. జీవాత్మ ఆత్మలు ప్రత్యర్థులు కారు. జీవాత్మను తన వైపు లాగుకొనవలెనని మాయ, పరమాత్మ ప్రయత్నించుటయే ఇద్దరి మధ్య ఆటగా ఉన్నది. జీవులను ప్రస్థుత కాలములో మాయయే ఎక్కువ తన వైపు లాగుకొనుచున్నది. ఈ ఆట పేరు లేని ఆటగ ఉన్నది.

## 891. (6) భూమి మీద పుట్టి తాను కాకున్నా నేను పలానా అని చెప్పునదేది, చెప్పనిదేది?

జ. మాయ, భగవంతుడు (పరమాత్మ).

**వివరము :** విశ్వమంత వ్యాపించి ఉన్న పరమాత్మ భూమి మీద భగవంతునిగ అప్పుడప్పుడు వేల సంవత్సరముల తేడాతో పుట్టుచున్నాడు. పరమాత్మ భగవంతునిగ పుట్టి తన ధర్మములను తాను తెలియజేసిపోవును. ఆ సమయములో నేను పలానావాడినని ఎవరికి తెలియ చెప్పనను నియమముతో భూమి మీదకు వచ్చాడు. కనుక తాను భగవంతుడనని ఎవరికి చెప్పడు, సాధ్యమున్నంతవరకు తెలియనివ్వడు. అదే నియమముతో మాయ కూడ భూమి మీద జన్మ తీసుకొని తాను మాయనని ఎవరికి చెప్పదు, సాధ్యమున్నంత వరకు ఎవరికి తెలియనివ్వదు. తాను పలానా అని నిజము చెప్పకూడదను నియమమే కాని తాను ఎవరిగనైన అబద్దము

చెప్పుకోవచ్చు, కావున మాయ జన్మించి నేనే భగవంతుడనని ప్రచారము చేసుకొనుచున్నది. దానితో చాలామంది మాయ మాటలు నమ్మి నిజదైవమును తెలుసుకోలేక పోవుచున్నారు. తాను కాకున్నా నేను భగవంతుడనని చెప్పునది మాయ. చెప్పనిది పరమాత్మ అయిన నేను పలాన వాడినని చెప్పని వాడు భగవంతుడు.

**892. (7) హస్తము మూడు భాగములుగ విభజింపబడినది ఆ మూడు భాగములేవి?**

జ. 1. ఆత్మలు, 2. గుణములు, 3. జ్ఞాన యోగ మోక్షములు.

**వివరము :** హస్తమును మూడు భాగములుగ గుర్తించుకోవచ్చును. ఒకటి అరచేయి, రెండు వ్రేళ్లు, మూడు గోర్లు. అరచేతినంతటిని ఒక భాగముగ ఎందుకు గుర్తించుకోవాలని కొందరికి ప్రశ్నరావచ్చును. దానికి జవాబు ఎమనగా! అరచేతిలో ఒక విధానము, వ్రేళ్లలో మరియొక విధానము, గోర్లలో మరియొక ప్రత్యేక విధానము గలదు. అందువలన హస్తమును మూడు భాగములుగ విభజించాము. అరచేయిలో మూడు ఆత్మలయిన జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను తెల్పు విధానము గలదు. మూడు ఆత్మలకు గుర్తింపుగ మూడు రేఖలు అరచేతిలో గలవు. ఆత్మ జీవాత్మ రేఖల రెండు కొనలు కలసి ఉండి, మేమెపుడు జోడు ఆత్మలుగ ఉన్నామన్నట్లు, ఒక దానితో ఒకటి సంబంధముకల్గి ఉన్నామని తెల్పునట్లు, క్రింది రెండు రేఖల కొనలు ఒక చోట కలసి ఉన్నవి. మూడవ రేఖ పరమాత్మగ లెక్కించబడుచున్నది. శరీరములో జీవాత్మ ఆత్మలకంటే పరమాత్మ వేరుగ ఉంటున్నాడు, కావున మూడవ రేఖ రెండు రేఖలకు సంబంధము లేకుండ పైన ప్రత్యేకముగ గలదు. ఈ మూడు ఆత్మలను చూపు అరచేయి అంతయు ఒక భాగమని తెలియాలి.

అరచేయి పైన వ్రేళ్లు గలవు. వ్రేల్లు మూడు గెనుపులుగ ఉండి మూడు భాగములుగ కనిపించుచున్నవి. వ్రేళ్ల మూడు గెనుపులు మూడు గుణభాగములను

తెల్పు విధానముగ ఉన్నది. కావున వ్రేళ్లను ప్రత్యేక భాగముగ గుర్తుంచుకోవాలి. సాత్త్విక, రాజస, తామస గుణభాగములుగ వ్రేళ్ల భాగములుంటూ త్రిగుణముల విషయము తెలియచేస్తున్నవి. ఇక పైగోరు యంతయు ఒక భాగముగనున్నది. గోరు క్రింది అంచులో తెల్లని చంద్రబింబమును పోలు గుర్తుండును. దాని తర్వాత చంద్ర బింబముకంటే కొంత తెలుపు తక్కువగ గోరుండును. గోరు చివర పై కొన మరికొంత కలరు తక్కువగ ప్రత్యేకమైన గోరుండును. ఒకే గోరు తెలుపులోనే మూడు రంగులు విడివిడిగ కనిపిస్తు, క్రింద చంద్రబింబమునుబోలు తెల్లని భాగము జ్ఞానమునకు గుర్తుగ, తర్వాత గోరు యోగమునకు గుర్తుగ, తర్వాత చివరి గోరు మోక్షమునకు గుర్తుగ నిలచి ఉన్నవి. ఈ విధముగ హస్తములో ఆత్మలు తరగతి ఒకటి, గుణముల తరగతి మరియొకటి, జ్ఞానముల తరగతి ఇంకొకటిగ ఉండినట్లు కన్పిస్తున్నది. దీనిని బట్టి హస్తము మూడు భాగములుగనున్నదని చెప్పవచ్చును. అలాగే మూడు తరగతుల జ్ఞానము కూడ తెలియజేస్తున్నదని చెప్పవచ్చును.

**893. (8) సొమ్ముంది సోకు లేదు ఎవరికి? సోకుంది సొమ్ము లేదు ఎవరికి?**

జ. భగవంతునికి, మాయకు.

**వివరము :** సొమ్ము అనగ జ్ఞానము అని, జ్ఞాన ధనము అని అర్థము చేసుకోవాలి. భగవంతునికి జ్ఞానధనము సంపూర్ణముగ ఉండును. అంతులేని జ్ఞాన ధనము ఉండినప్పటికి తాను ధనవంతుడనని భగవంతుడనని చెప్పుకొను అవకాశము లేదు. సంపూర్ణ జ్ఞానియైనప్పటికి తనకు బయట ప్రజలలో అంత గుర్తింపు లేదు. భగవంతునికి వ్యతిరేఖమైనది మాయ. మాయకు జ్ఞానధనము లేదు. జ్ఞానము లేకున్నను అందరిలో గుర్తింపు ఉన్నది. సొమ్మున్న వానికి అనగ భగవంతునికి సోకు లేదు అనగా గుర్తింపు ప్రచారము లేదు. సోకున్న వానికి అనగా మాయకు సొమ్ము లేదు అనగా జ్ఞానధనములేదని అర్థము. దీనిప్రకారము జ్ఞానముగల వారు ఎందరో ప్రజలలో గుర్తింపు పొందలేదు. జ్ఞానములేనివారెందరో ప్రజలలో

గుర్తింపు పొందివున్నారని తెలియుచున్నది. ఆత్మజ్ఞానము లేనివారు మాయ జ్ఞానముతో దేశమంతా ప్రచారమైనారు. ఆత్మ జ్ఞానమున్నవారు ఎవరికి బాగా కనిపించడము లేదు.

సొమ్ము = జ్ఞాన ధనము.

సొమ్మున్నవాడు = జ్ఞాన ధనము కలవాడు.

సోకు = విలువ గుర్తింపు.

సోకు లేదు = విలువ లేదు, గుర్తింపు లేదు.

భగవంతుడు సంపూర్ణ జ్ఞానియైనను ఎవరికి బాగా కనిపించలేదు

= సొమ్మున్నది సోకు లేదు.

మాయ అజ్ఞానియైనను అందరికి అందముగ బాగా కనిపిస్తున్నది

= సోకున్నది సొమ్ము లేదు.

**894. (9) త్రాగనపుడు దాహము లేదు. త్రాగేకొద్ది దప్పిక అవుతుంది. త్రాగేవాడెవడు? త్రాగబడేదేది?**

జ. జ్ఞాని, జ్ఞానము.

**వివరము :** ఏమాత్రము జ్ఞానము తెలియని సాధారణ వ్యక్తికి జ్ఞానమును తెలుసుకోవాలను కోర్కె ఏమి ఉండదు. అంటువంటి వానికి జ్ఞానము యొక్క అవసరము తనకు కావలెనను తపన ఏ మాత్రముండదు. కొద్దిగ జ్ఞానము తెలుసు కొనే దానికి మొదలు పెట్టిన తర్వాత తెలుసుకొనే కొలది ఇంకా తెలుసుకోవాలను తపన వానియందు ఏర్పడుచుండును. తెలియనపుడు దాని ధ్యాస సహితము లేనివాడు తెలుసుకొనే కొద్ది ఇంకా తెలుసుకోవాలనుకోవడము ఆశ్చర్యము కదా! జ్ఞానమును తెలుసుకొనేవాడిని పై ప్రశ్నకు జవాబుగ త్రాగేవాడని చెప్పవచ్చును. త్రాగబడేది జ్ఞానమని కూడ చెప్పవచ్చును. తెలుసుకొనే కొలది ఇంకా కావాలను కోవడమును త్రాగేకొద్ది దప్పిక అవుతుందని చెప్పడమైనది.

**895. (10) హస్తములో నాలుగు వ్రేళ్లు ఒక చోట, ప్రత్యేకించి ఒక వ్రేలు మరియొక చోట ఉండడము ఏ సూచన?**

జ. యోగము పొందిన వెంటనే మోక్షము రాదని సూచన.

**వివరము :** మూడు గుణములను దాటి యోగము పొందినట్లు మోక్షము పొందలేము. జ్ఞానము చేత మూడు గుణభాగములను దాటి యోగియై నాల్గవస్థానము చేరినవాడు కూడ ఐదవదయిన మోక్షము పొందుటకు కొంత కాలము పట్టునని, గుణములకు యోగమున్నంత దగ్గరగ యోగమునకు మోక్షము లేదని, తెలియజేయు సూచన అని తెలియవలెను. ఐదవ వ్రేలు మోక్షమని, నాలుగు వ్రేళ్లు మూడు గుణములు, ఒక యోగమని తెలియవలెను. యోగికి కర్మ అయిపోనిదే మోక్షము లభించదని, దానికి కొంతకాలము కొన్ని జన్మలు పట్టునని, తెలుపు నిమిత్తము నాలుగు వ్రేళ్లుకు ఐదవవ్రేలు దూరముగనున్నది. దేవుడు హస్తములో ఎంతో జ్ఞానమిమిడ్చి పంపాడని తెలియవలెను.

## జ్ఞాన పరీక్ష

**కొత్తకోట** **తేది-30-08-2002**

**896. (1) జీవునకు కదలికలున్నవా?**

జ. ఉన్నవి.

**వివరము :** శరీరమునకు కదలికలున్నవని అందరికి తెలిసిన విషయమే. శరీరము లోపల జీవునికి కదలికలున్నది లేనిది ఎవరికి తెలియని విషయము. దానిని గురించి మనము చెప్పుకొనునదేమనగా! జీవుడు శరీరములో కర్మను అనుభవిస్తు ఏ పని చేయనివాడైనప్పటికి, బుద్ధితో అంటుకొని ఉన్న దానివలన బుద్ధి ఎక్కడ ఉంటే తాను అక్కడుండవలసి వస్తున్నది. మనస్సు అందించు విషయమును బట్టి బుద్ధి యోచన సాగించవలసి ఉన్నది. ఆ యోచనలు గుణముల వలననే కల్గును. విషయమునుబట్టి బుద్ధి గుణములతో యోచించను మొదలుపెట్టును. మూడు

భాగములలోనున్న గుణములలో ఏ దానితోనైన యోచించు సామర్థ్యము బుద్ధికి గలదు. అందువలన బుద్ధి తన ఇష్టానుసారము మూడు గుణభాగములలో ప్రవేశించుచుండును. బుద్ధితో పాటు అంటుకొని ఉన్న జీవుడు కూడ ఆ గుణములలోనికి పోవలసి ఉన్నది. ఇట్లు శరీరములోని జీవుడు గుణముల భాగములను మారుచున్నాడు, కావున జీవుడు కదలుచున్నాడని చెప్పవచ్చును.

**897. (2) మన శరీరములో కర్మ గుణములతో సంబంధము పెట్టుకోకుండ జీవునికి చెడు చేయు అవయవమేది?**

జ. అహము.

**వివరము :** శరీరములో అన్ని భాగములు కర్మతో గుణములతో సంబంధపడి ఉండగ, ఏ దానితో సంబంధము లేకుండ తన వృత్తిని మాత్రము తాను చేయు అవయవము అహము. బుద్ధి గుణానుసారిణి, చిత్తము కర్మానుసారిణి, మనస్సు చిత్తానుసారిణి, విషయానుసారిణి అయినట్లు అహము ఏ దానిని అనుసరించక శరీరములో ఏ ఉద్దేశ్యముతో పుట్టించబడినదో ఆ ఉద్దేశ్యమునే నెరవేర్చుచున్నది. శరీరములో తన వృత్తి పని జీవునకు అన్ని నీవే చేయుచున్నావని బోధించడమే. ఆ పనిని ఎవరి సంబంధము లేకుండ చేయుచున్నది. అహము చేయుపని జీవునకు కర్మను అంటగట్టడమే. కావున అహము జీవునకు ముక్తిరాకుండ చెడు చేయుచున్నదని చెప్పవచ్చును.

**898. (3) యోగము చేయునపుడు లభించు జ్ఞానశక్తి (ఆత్మశక్తి) పరమాత్మ నుండి వస్తుందా లేక ఆత్మ నుండి వస్తుందా?**

జ. పరమాత్మ నుండి.

**వివరము :** యోగ సమయములో జ్ఞానశక్తి పరమాత్మ నుండి వస్తున్నది. అణువణువున జ్ఞానశక్తి వ్యాపించి ఉన్నది. పరమాత్మయే శక్తిగా మారి జ్ఞానశక్తి అగుచున్నది. పరమాత్మ ఎచట గలడో అచట జ్ఞానశక్తి ఉన్నదనియే తలచవలెను.

ధర్మముల పద్ధతి ప్రకారము బ్రహ్మయోగమాచరించువానికి వాని శరీరము బయట నుండి శక్తిలోనికి ప్రవేశించును. ధర్మముల ప్రకారముకాక భక్తియోగము ఆచరించువానికి శరీరములోనే శక్తి ఉత్పత్తి కాగలదు. జ్ఞానయోగములో శరీరము బయట నుండి శక్తి లభించగ కర్మయోగములోను, భక్తియోగములోను శరీరము లోపలే తయారగుచున్నది. బ్రహ్మయోగమున శరీరము బయట నుండి లభించు చున్నది. కావున జ్ఞానాగ్ని పరమాత్మ నుండి లభించుచున్నదని, ఆత్మ నుండి లభించడము లేదని తెలియుచున్నది. శరీరములోపల కూడ పరమాత్మ కలదు, కావున లోపల లభించు శక్తి కూడ పరమాత్మదేనని తెలియాలి.

**899. (4) యోగికి లభించిన జ్ఞానశక్తి కర్మను కాల్చగ కొంత మిగులునని చెప్పారు. అలా మిగులుతూ పోయి కొంత కూడలిగ తయారగునని చెప్పారు. అది తలలో ఉంటుందని దానిప్రకాశమే కొందరికి తల వెనుక వెలుగుగనున్నట్లు చిత్రించి ఉందురని కూడ చెప్పారు. తలలో జ్ఞానశక్తి ఎచట నిలువ ఉండునో తెలుపవలయును?**

జ. జీవుని వద్ద.

**వివరము :** జ్ఞానాగ్ని లేక జ్ఞానశక్తి అనుబడునది కర్మను కాల్చగ మిగులుతూ పోవుచుండుననుట వాస్తవమే. అలా మిగిలినశక్తి అహము, చిత్తము, బుద్ధి అను మూడు పొరల మధ్యన గల ఖాళీప్రదేశమైన జీవాత్మలో చేరిపోవును. అంతవరకు ప్రకాశములేని జీవాత్మకు ప్రకాశము చేకూరుతూవచ్చును. జ్ఞానశక్తి అధికమగు కొలది బంతి ఆకృతిలో చుట్టూ మూడు పొరల మధ్యన చిక్కియున్న జీవాత్మకు వెలుగు సాంద్రత ఎక్కువగుచువచ్చును. ఆ వెలుగు యొక్క చిక్కదనము ఏ యోగిలో ఎంత ఉన్నదో బయటికి స్థూలముగనున్న కన్నులకు కనిపించదు. భౌతిక కాయము లేని సూక్ష్మశరీరులకు అనగా గ్రహాలకు, విగ్రహాలకు ఆ వెలుగు కనిపించును. అందువలననే జ్ఞానాగ్ని ఉన్న యోగులకు గ్రహాలు, విగ్రహాలు భయపడును. తమలో ఎంత జ్ఞానశక్తి ఉన్నది యోగికి మాత్రము తెలియదు. ఒక యోగిలో ఎంత శక్తి

ఉన్నది ఇతరులకు తెలియవచ్చును, గాని స్వయముగ ఆ యోగి తెలుసుకొనుటకు వీలు లేదు. శక్తి ఉన్నవానిని ప్రకాశించెడి జీవాత్మ అనవచ్చును. అతనినే సామాన్యుడు కాడని మాన్యుడని చెప్పవచ్చును.

**900. (5) మన శరీరములో కర్మచక్రము గుణచక్రము తిరుగకుండ ఎపుడైన నిలుచునా?**

జ. బ్రహ్మయోగ సమయములో.

**వివరము :** మనస్సును కదలకుండ చేయడము వలన బ్రహ్మయోగము లభ్యమగును. బ్రహ్మయోగ సమయములో కర్మ, గుణములు అన్నియు నిలచిపోవును. ఆ సమయములో కర్మ ఆచరణ ఉండదు. గుణముల వివరము ఉండదు. దాని వలన కర్మచక్రము గుణచక్రము నిలచిపోవును. వీటికి అనుసంధానమై ఉన్న కాలచక్రము కూడ నిలచిపోవును. అందువలన ఆ యోగ సమయములో వాని ఆయుస్సు ఖర్చుకాదని పెద్దలు తెలిపారు. వాని శరీరములోని కాల, కర్మ, గుణ చక్రములు నిలచి పోవును గాని బ్రహ్మచక్రము మాత్రము నిలబడదు. బ్రహ్మ చక్రము అన్నిటికి అతీతమైనది, కావున యోగులకు కూడ ఆగునది కాదు. బ్రహ్మ చక్రమునననుసరించి కాలచక్రము కూడ తిరుగుచుండును. ఇక్కడ తెలియవలసినది ఏమనగా! గుణ, కర్మ, కాల, బ్రహ్మచక్రములలో రెండు వ్యక్తిగతమైనవి, రెండు అందరికి సంబంధించినవి. వ్యక్తిగతమైన కర్మ, గుణచక్రములు యోగులలో నిలచిపోయిన, అందరికి సంబంధించిన కాల, బ్రహ్మచక్రములు నిలబడవు. బ్రహ్మయోగులలో కాలచక్రము నిలబడినట్లే లెక్కించిన, అందరి దృష్టిలో అది తిరుగుచునే ఉండును. బ్రహ్మయోగిలో మాత్రము కాలచక్రము తిరిగిన కాలము లెక్కించబడదు. కావున దానిని కూడ నిలచినట్లే లెక్కించుకొనుచున్నాము. వాస్తవముగ నిలబడిపోవునవి రెండు, నిలబడనివి రెండు అని తెలియాలి. బ్రహ్మయోగిలో కాలచక్రము తిరిగిన తిరగనట్లే. అందువలన యోగసమయములో మూడు చక్రములు నిలబడినవని చెప్పవచ్చును.

# జ్ఞాన పరీక్ష

**కె. నరసాపురము** **తేది-28-09-2002**

**901. (1) ఇప్పుడున్న నీ దేహము నీకు అశాశ్వితమైనదైతే, శాశ్వితమైనదేది?**

జ. ఆత్మ.

**వివరము :** జీవులమైన మనకు శరీరము శాశ్వితముకానే కాదు. ప్రతి రోజు ప్రతి క్షణము శరీరము ఒకేలాగ ఉండక మార్పు చెందుచున్నది. కొన్ని సంవత్సరములకు జీవునికి నివాసయోగ్యము కాకుండపోయి చివరకు శిథిలమగుచున్నది. జీవునితో పాటున్న ఆత్మ మాత్రము ఎప్పటిలాగే ఉంటున్నది. ఎన్ని శరీరములు మారినా జీవునితోపాటు ప్రయాణిస్తు జీవుని అంటుకొని ఉండుట వలన ఆత్మ శాశ్వితము, శరీరము అశాశ్వితమని చెప్పవచ్చును. కొందరు జీవునికి కర్మ కూడ శాశ్వితమే కదాయని అడుగవచ్చును. కర్మ ఉన్నంతవరకు జీవుడుండుట వాస్తవమే అయినప్పటికి, కర్మ ఏది ఎల్లప్పుడు నిలచి ఉండక పాతదిపోతూ క్రొత్తది వస్తున్నది కావున పలానా కర్మ శాశ్వితమని చెప్పలేము. కర్మ అనేక విధములుగ ఉండి అనుభవింపబడి అయిపోవుచున్నది. కర్మ తరుగుట పెరుగుట రెండు ఉండుటవలన, కర్మ కూడ శాశ్వితముకాదని, కర్మకంటే ఆత్మే శాశ్వితమైనదని చెప్పవచ్చును.

**902. (2) యోగమునకు శ్వాస ముఖ్యమా, ధ్యాస ముఖ్యమా?**

జ. ధ్యాస ముఖ్యము.

**వివరము :** యోగములలో రెండు గలవు. కర్మయోగము, బ్రహ్మయోగమను వాటిలో బ్రహ్మయోగమందు మనోధ్యాస ముఖ్యము. ధ్యాసకు శ్వాసకు సంబంధముండిన, శ్వాస నిలచితే ధ్యాస నిలచిన, ధ్యాస నిలచితే శ్వాస నిలచిన బ్రహ్మయోగమునకు ముఖ్యము మనోధ్యాసలు లేకుండ పోవడము. శ్వాస ద్వార మనస్సు నిలపుటకంటే మనస్సు యొక్క ధ్యాసలనే లేకుండ చేయడము, దాని ద్వార శరీరములోని అన్ని పనులను స్థంభింప చేయడము మంచిది. శ్వాసను బంధింప చేయడము,

బలవంతముగ కుంభించడము, ఒక విధముగ ప్రమాదకరమైన పని. దాని ద్వార శరీరములో ఏ భాగములోనైన రక్తనాళములు చిట్లిపోవచ్చును, రోగములు ఉత్పన్నము కావచ్చును. శరీరములో ఎన్నో సమస్యలు రావచ్చును. అందువలన శ్వాసను బలవంతముగ బంధించక మనస్సునే సాధన ద్వార నిలుపడము మంచిది. మనో ధ్యాసను స్థంభించు యోగమే ముఖ్యమైనదిగ తలచవలెను.

**903. (3) దేవుని మార్గము, మాయ మార్గము ఎక్కడున్నవి?**

జ. దేహములోనే కలవు.

**వివరము :** దేవుని మార్గముగాని, మాయ మార్గముగాని జీవునికే అవసరము. జీవుడు శరీరములో ఉన్నాడు, కనుక శరీరములోనే రెండు మార్గములు కలవు. గుణముల రూపములో మాయ మార్గము, ఆత్మల రూపములో దేవుని మార్గము శరీరమందే గలవు. అందువలన దేవుని మార్గమును అనుసరించడముగాని, మాయ మార్గమును అనుసరించడముగాని శరీరములోనే జరుగుచున్నది. కొందరు తెలియక దేవుడు మాయ రెండు బయటే ఉన్నవని పొరపడుచుందురు. తల్లి తండ్రులైన మాయ దేవుడు నీవెక్కడుంటే అక్కడే కలవు.

**904. (4) పురము అని దేనినంటాము?**

జ. పురుషులుండునది పురము.

**వివరము :** పౌరులు నివసించునది పురము అని కూడ కలదు. పౌరులు అనుపదము పురుషులు అనుపదము నుండి మార్పుచెందినది. కావున పురుషులు నివసించునది పురము అని కూడ చెప్పవచ్చును. పురుషులు లేక పౌరులు నివసించు పురము ప్రత్యేకించి ఎక్కడలేదు. ప్రతి దేహము ఒక పురముకాగ, అందులో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను పురుషులు నివాసము చేస్తున్నారు. కావున శరీరమునే పురము అని పూర్వము అనెడివారు.

**905. (5) పౌరులు ఎవరు?**

జ. పౌరుషమున్నవారు.

**వివరము :** పురుషులన్నా పౌరులనిన, పౌరుషులనిన ఆధ్యాత్మిక భాషలో ఒకే అర్థమని తెలియవలెను. శరీరమను దేవాలయములో ముగ్గురు పురుషులు నివశిస్తున్నప్పటికి అందులో ఇద్దరు పౌరుషమున్నవారుకాగ, జీవాత్మ అనువాడు పురుషుడై ఉండి పురుషత్వములేనివాడై ఉన్నాడు. జీవాత్మ అను నపుంసకునికి జ్ఞానమను మందు ఇచ్చి వానిని పూర్తి పురుషునిగ చేయవలసి ఉన్నది. **పుంసత్వము లేని జీవాత్మకు జ్ఞానమను మందు ఇచ్చి తిరిగి పురుషునిగ మార్చు నిమిత్తము, పరమాత్మయే మనిషిగ వచ్చి భగవద్గీత, బైబిలు, ఖురాన్‌లను వైద్యశాలలు స్థాపించి, వాటియందు జ్ఞానమను మందును ఉంచి పోయాడు.** ఈ మూడు వైద్యశాలలలో ఏదో ఒక దానిని ఆశ్రయించి, అందులోని ఔషధమును తీసుకొని ఆరగిస్తే పూర్తి పురుషునిగ జీవాత్మ మారిపోగలడు. అనగా తాను దేవునిలోనికి చేరిపోగలడు.

**906. (6) రాజరికము అంటే ఏమిటి?**

జ. యోగ సామ్రాజ్యమును పాలించుట (పెద్దరికము)

**వివరము :** రాజు అంటే అందరికంటే పెద్దవాడని అర్థము. మనుషులలో అందరికంటే పెద్దరికము కలవాడు రాజు, అలాగే అన్ని విద్యలలోకెల్ల పెద్ద విద్య బ్రహ్మవిద్య. అన్నిటికంటే పెద్దవిద్య కావున బ్రహ్మవిద్యను భగవద్గీతలో రాజవిద్య అని అనడము కూడ జరిగినది. పూర్వకాలము బ్రహ్మవిద్య తెలిసిన వారే ప్రజలను పాలించవలెనను నియమముండెడిది. కావున ఆ కాలములో ప్రజలను పాలించువారు ముందే బ్రహ్మవిద్యను నేర్చెడివారు. చిన్న తనములోనే గురుకుల ఆశ్రమముల వద్దకు పోయి అన్ని విద్యలతోపాటు బ్రహ్మవిద్యను నేర్చెడివారు. అలా నేర్వక పరిపాలనకు వచ్చినవారు ఒకప్రక్క పరిపాలన చేయుచు, ఒక ప్రక్క అడవులలోనున్న గురువుల వద్దకు పోయి బ్రహ్మవిద్యను నేర్చెడివారు. బ్రహ్మవిద్యను పూర్వము రాజవిద్య అనెడివారు. బ్రహ్మవిద్యను నేర్వడము వలననే ప్రజా

పరిపాలకులకు రాజు అనెడి పేరు వచ్చినది. ఈనాడు బ్రహ్మవిద్యలేని పరిపాలకులు వచ్చారు కావున వీరికి రాజు అనెడి పేరు పోయి, ప్రజానాయకులను పేరు మాత్రము మిగిలిందను కొంటాను. పూర్వము బ్రహ్మవిద్యనే రాజవిద్యయని, అది నేర్చిన వానిని రాజని, అన్నిటికంటే పెద్దది బ్రహ్మవిద్య కావున దానిని తెలిసిన వానిని పెద్దరికము లేక రాజరికము తెలిసినవాడని చెప్పెడివారు. రాజరికము తెలిసిన వాడు యోగరాజ్యమును ఏలువాడని, యోగరాజ్యమునేలువాడే భూరాజ్యమును ఏలవచ్చని నియమముండుట వలన రాజ్యమేలువారిని రాజనెడివారు.

**907. (7) దాసరికము అంటే ఏమిటి?**

జ. మాయకు దాసుడుగ ఉండడము.

**వివరము :** ధనికునకు వ్యతిరిక్త పదము పేదవాడు, అలాగే రాజుకు వ్యతిరిక్త పదము దాసుడు. బ్రహ్మవిద్య నేర్చినవాడు రాజనుకొన్నాము కదా! అలాగే నేర్వనివాడు దాసుడు అనుట పూర్వము జరిగెడిది. పూర్వము ప్రజలను పాలించు వ్యవస్థ లేకుండెడిది. ఎవరికి ఎవరు అధికారులు కాని కాలములో రాజ్యమని రాజని పేరు కూడ లేదు. అటువంటి కాలములో బ్రహ్మవిద్య నేర్చినవారు ఇతరులకు జ్ఞానము తెల్పడమువలన తెలుసుకొనువారు కొందరు ఏర్పడుతావచ్చిరి. అట్లు ఒకరిని గురువుగ చేసుకొని అతనిని అనుసరించువారు వందలు వేలు సంఖ్యలో ఏర్పడి అతని మాటనే శిరసావహిస్తూ వచ్చిరి. అలా కొంత కాలమునకు గురువు రాజువలె, శిష్యులందరు రాజ్యమువలె ఏర్పడిరి. ఇట్లు ఒక్కొక్క గురువు కొంత ప్రాంతము వరకు శిష్యులను ఏర్పరచుకొనడమువలన, ఆ పరిసరములలోని వారందరు ఆ గురువునే పెద్దగ ఎంచుకొని ఆయనమాటనే ఆచరించడము వలన, ఆ ప్రాంతమునకు గురువే రాజుగ పరిగణించబడెను. ఈ విధముగ రాజు రాజ్యమను వ్యవస్థ ప్రారంభమైనది. కాలము జరుగుకొలది శిష్యులుగనున్నవారు కొన్ని తప్పులు చేయడము, గురువులుగనున్నవారు దండించడము జరిగెడిది. దండించు నిమిత్తము, తప్పు ఒప్పు తేల్చు నిమిత్తము, గురువు బాగ తెలిసిన జ్ఞానులను కొందరిని

నియమించెను. అలాగ న్యాయవ్యవస్థ ఏర్పడినది. ఈ విధముగ మొదట రాజవ్యవస్థలో కొందరు భాగస్వాములైరి. ఇంకా కొంత కాలము జరుగగ గురువుగనున్నవాడు తన గొప్పతనమును ఇంకా కొంత మందికి తెలియజేసి తాను ఇంకా గొప్పరాజుగ కాదలచెను. ఎలా చేస్తే తాను గొప్పగ కనిపిస్తానని యోచించి కొన్ని మహత్యములను చూపాలనుకొన్నాడు. మహత్యములు జ్ఞానములో ఉండవు కనుక తన మహత్యముల కొరకు ప్రత్యేకించి ఒక మనిషిని నియమించుకొనెను. మంత్రములచేత మహత్యములను చూపవచ్చును కావున ఆ దినములలో టక్కు, టమార, ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ మంత్ర విద్యలు నేర్చినవారిని నియమించుకొనెడివారు. మంత్రించువాడు కావున వానిని మంత్రి అనెడివారు. ఈ విధముగ మంత్రుల వ్యవస్థ ఏర్పడినది.

కాలము జరుగుచుపోగా కొన్ని వేల లక్షల సంవత్సరములలోనే మాయ ప్రభావము చేత గురువులుగ చెలామణి అయ్యేవారు వంశపారంపర్యముగ చలామణి అగుచు, చివరకు బ్రహ్మవిద్య ఏమాత్రము తెలియని రాజులు మాత్రము మిగిలి పోయిరి. రాజరికము మా వంశపారంపర్య హక్కు అని వారిలో కూడ రాజ్యకాంక్ష మొదలు పెట్టెను. బంధుప్రీతి సోదరభావము వదలి ఎవడు బలవంతుడైతే వాడు స్వయాన అన్నదమ్ములనే చంపి రాజుకావలెనని ప్రయత్నించిన చరిత్రలు ఎన్నోగలవు. జ్ఞానము లేని రాజులు తయారై, మంత్రములు లేని మంత్రులు కూడ తయారై, కేవలము కండబలము మీదనే రాజవ్యవస్థ నిలచిపోయెను. ఆ విధానములోనే శరీరదారుఢ్యమున్నవారిని సైనికులుగ తయారు చేసుకోవడము జరిగినది. ఈ విధము సైనిక వ్యవస్థ ఏర్పడినది. ప్రజలనుండి పన్నుల రూపములో డబ్బులు బలవంతముగ వసూలు చేయడము తయారైపోయినది. ఇట్లు పన్నుల వ్యవస్థ తయారైనది. ఈ విధముగ ఒక రాజు, ఒక మంత్రి, ఒక సేనాధిపతి, కొందరు భటులుగ ఉన్న రాజరికవ్యవస్థ జరుగంగ జరుగంగ పెద్దబావ కోతియైనట్లు వ్యవస్థ రూపు మారిపోయి, మంత్రులు అనేకులుగ తయారుకావడము, వారి క్రింద అధికారులు ఎంతోమంది కావడము జరిగినది.

మొదట తయారైన వ్యవస్థకు, ఇప్పుడున్న వ్యవస్థకు ఏమాత్రము పోలిక లేకుండ పోయినది. రాజాధిరాజయిన పరమాత్మ భూమి మీద భగవంతునిగ అవతరించినప్పటికి ఆయనను రాజుగ గుర్తించలేక మా బలమింత ఉంది చూడమని ఆయననే శిక్షించిన రాజులు కలరు. ద్వాపర యుగములో కృష్ణుని ఎదిరించినవారు, కలియుగములో ఏసును చిత్రహింసలు పెట్టిన రాజులు కలరు. నేటి కాలములో భగవంతుడు భూమి మీదకు వస్తే రాజులు మంత్రులుకాక చిన్న ఉద్యోగికాని ఒక పోలీస్ (రక్షక భటుడు) కాని లెక్క చేయని పరిస్థితి తయారైనది. సొమ్మొకడిది సోకొకడిదన్నట్లు జ్ఞానులతో ప్రారంభమైన జ్ఞానుల వ్యవస్థను, నేడు అజ్ఞానులు అనుభవిస్తున్నారు. ఆనాడు జ్ఞానముతో లభించునది, నేడు బలముతో లభిస్తున్నది. ఆనాడు శాంతితో కూడిన రాజ్యము, నేడు హింసతో కూడినదై అశాంతి రాజ్యమై పోయినది.

ఆనాడు బ్రహ్మవిద్యను తెలిసిన జ్ఞానిని గురువుగా చేసుకొని దాసులుగ ప్రేమతో సేవించు ప్రజలు నేడు రాజుల క్రిందగల చిన్న స్థాయి అధికారులకు డబ్బుకోసము ప్రేమలేకున్నా ఊడిగము చేయుచున్నారు. అధికారులు డబ్బిచ్చి బలవంతముగ ఇన్ని గంటలు పనిచేయవలెనను నియమము పెట్టగ, యోగము తెలియని ఉద్యోగులు (ఉత్తయోగులైనవారు) అవినీతితో కూడుకొని సరిగ పనిచేయని స్థితిలో ఉన్నారు. నాయకులలో బ్రహ్మజ్ఞానముగాని, సేవకులలో భక్తి భావము గాని ఏమాత్రములేని సమాజము తయారైన ఈ కాలములో, దేవుడే దిగివచ్చినా నాయకులలో దైవజ్ఞానమును, సేవకులలో భక్తి భావము కల్గించలేడేమో ననిపిస్తుంది. ఏది ఏమైనా పూర్వపు సమాజము రావాలనీ, భగవంతుని రాజ్యము ఏర్పడాలనీ, దేవుని రాజ్యము మోక్షములోనేకాక భూమి మీద ప్రజలలో ప్రతిష్ఠింప బడాలని కోరుకుంటాము.

**908. (8) పుంసత్వమనగానేమి?**

జ. ఆత్మజ్ఞానము కల్గి ఉండడము (పురుషున్ని తెలియడము)

**వివరము :** పురుషునికి వ్యతిరేఖ పదము స్త్రీ, స్త్రీకి వ్యతిరేఖ పదము పురుషుడు కాగ, రెండిటికి మధ్య ఉన్న పదము నపుంసకుడు. పురుషుడనగా ఆధ్యాత్మిక విద్య ప్రకారము ఆత్మయని, ఉత్తమ పురుషుడనగా పరమాత్మయని చెప్పుకోవచ్చును. స్త్రీ అనగ ప్రకృతియని చెప్పబడుచున్నది. ఆత్మ జ్ఞానము కల్గియుండిన వానిని పురుషత్వము కలవాడని, ఆత్మ జ్ఞానము లేక పూర్తి మాయ విషయముల తెలివికలవానిని ప్రకృతి తత్వము కల్గిన స్త్రీ లక్షణములుగల నపుంసకుడని చెప్పవచ్చును.

**909. (9) నపుంసత్వమనగా నేమి?**

జ. పురుషుని విషయము తన వద్ద లేకపోవడము.

**వివరము :** పైకి ఆకారము పురుషునివలె కనిపిస్తు లోపల స్త్రీ స్వభావములున్న వానిని నపుంసకుడని అందుము. పైకి దైవ జ్ఞానము తెలిసిన వానివలె కన్పిస్తు, లోపల దేవుని విషయము ఏమాత్రము తెలియక ప్రకృతి విషయములు తలలో నిండి ఉన్నవానిని, జ్ఞానము ప్రకారము నపుంసకుడని అనవచ్చును. ఇంకా లోపల అర్థము తీసుకొంటే ఆత్మ సంబంధము కల్గి ప్రకృతిలో చిక్కుకున్న జీవాత్మను నపుంసకుడని కూడ అనవచ్చును. ఒక విధముగ పైకి స్వాములై జ్ఞానులవలె కనిపిస్తు బోధించునది పరమాత్మ మార్గమని చివరకు ప్రకృతి మార్గమును గూర్చి చెప్పు బోధకులను జ్ఞానరీత్య నపుంసకులని చెప్పవచ్చును.

**910. (10) హర్షి అనుపదము కాలగమనములో ఏ విధముగ మారిపోయినది?**

జ. 'ఋషి' అనుపదముగ మారినది.

**వివరము :** హర్షి అనగ సంతోషించువాడని, ఆనందము కలవాడని అర్థము. హర్షి అనువాడు మహర్షి, రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి అను తెగలుగ ఉండెడివారు. హర్షి అను పేరు కాలగమనములో ఋషిగ మారిపోయినది. హర్షి అనుపదము

ఋషిగ మారినప్పటికి మహర్షి, రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి అను పదములు మాత్రము మారక మొదట ఎలాగున్నవి అలాగే ఉన్నవి.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపాలమడ** **తేది-21-10-2002**

**911. (1) పున్నమి చంద్రుడు అమావాస్య నక్షత్రము రెండిటిని ఎవరితో పోల్చవచ్చును?**

జ. భగవంతుడు, పరమాత్మ.

**వివరము :** పౌర్ణమి చంద్రుడు సంపూర్ణముగ ఉండును. మిగత దినములలో చంద్రుని పరిమాణము, కాంతి కొంత తక్కువగ ఉండును. మిగత దినముల చంద్రునికంటే పౌర్ణమి దినము చంద్రుడు కాంతిలోను ఆకారములోను సంపూర్ణత చెందియుండును. భూమి మీద ఎందరో జ్ఞానులు గలరు, వారంతయు ఒకే స్థాయివారుకాక అనేక స్థాయిల జ్ఞానము కల్గియుందురు. ఎందరు ఎన్ని స్థాయిల జ్ఞానమున్న వారైనప్పటికి సంపూర్ణ జ్ఞానము కలవాడు ఒకడే ఉండును. వాడే భగవంతుడు. భగవంతుడు పరమాత్మ జ్ఞానమునుగల్గి సంపూర్ణముగ పున్నమి చంద్రునివలె యుండును. పరమాత్మజ్ఞానము భగవంతుడైన వానికొక్కనికే తెలియును. ఎందుకనగా భగవంతుడు పరమాత్మలోని భాగమైయున్నాడు. అందువలన భూమి మీద అవతరించిన భగవంతుని పున్నమిచంద్రునిగ పోల్చి చెప్పవచ్చును.

వెలుతురు ప్రపంచములో కొన్ని చోట్ల మాత్రముండును. కొన్ని చీకటి ప్రాంతములు పగటిపూట కూడ కలవు. సూర్యుని వెలుగు ప్రసరించని చోటు ఉండవచ్చును, కాని చీకటి వ్యాపించని జాగా లేనేలేదు. సహజ సిద్ధముగ ఉండునది చీకటి. వెలుగుకు దీపమో సూర్యుడో ఎవరో ఒకరు ఆధారమై ఉండవలెను. ఇంకొక దాని ఆధారముతో లేనిది చీకటి. అంతట వ్యాపించి ఉన్నది చీకటి, కనుక దానిని

అంతట వ్యాపించియున్న పరమాత్మ శక్తితో సమానముగ పోల్చి అమావాస్య అన్నాము. అంతట వ్యాపించి శాశ్వితముగ పగలు రాత్రి ఎల్లపుడు ఒకడున్నాడని తెలుపుటకు నక్షత్రమును పరమాత్మతో సమానముగ పోల్చి చెప్పారు. చంద్రుడు భగవంతుడు, వెన్నెల జ్ఞానము, అలాగే నక్షత్రము పరమాత్మ, అమావాస్య చీకటిని వ్యాపించిన పరమాత్మ శక్తిగ పోల్చి చెప్పారు.

**912. (2) మతమనేది మన శరీరములో ఉన్నదా, శరీరము బయట ఉన్నదా?**

జ. శరీరములో ఉన్నది.

**వివరము :** మతము అనునది బయట ప్రజలలో కన్పిస్తున్నప్పటికి, వీరు పలానా మతస్థులని పిలుచుకొనుచున్నప్పటికి, మతము వాస్తవముగ శరీరముల బయట లేదు. అందరి శరీరములు పంచభూతముల సంబంధమైనవే కాని మతముతో పుట్టినవి ఏవి లేవు. మతము శరీరములోపలగల గుణములలోని గుణముకాని గుణము లాంటిదేనని చెప్పవచ్చును. మతమనగ ఒప్పుదల, ఇష్టము లేక శ్రద్ధ అని కూడ చెప్పవచ్చును. మనిషి గుణచక్రములో ఇష్టము అనునది కూడ ఒకటి గలదు. కనిపించని గుణములు ధైర్యము భయముకాగ, రెండు పక్షముల గుణములకు సంబంధించిన సూక్ష్మమైన గుణములాంటిదొకటి కలదు. అదియే శ్రద్ధ లేక మతము అని చెప్పవచ్చును. గుణములన్ని కర్మాధీనములో ఉండి కర్మప్రకారము జరుగుచుండగ శ్రద్ధ అనునది కర్మ ఆధీనములో లేనిదై స్వతంత్రభావమై ఉన్నది. అందువలన గుణముకాదన్నాము. లోపల గల శ్రద్ధనుబట్టి భక్తి ఏర్పడుచున్నది. ఆ శ్రద్ధయే బయట మతమై ఉన్నదని తెలియాలి. ఇదే పద్ధతిలో రాజకీయపార్టీలు కూడ గలవు. రాజకీయ పార్టీలలో ఏదో ఒకదానికి తెలుపు ఇష్టతను ఇంగ్లీషు భాషలో ఓటు ఇవ్వడము అనియు, తెలుగులో, సంస్కృతము, హిందీ భాషలలో మతదానమనియు అనుచుందురు. రాజకీయములో గాని, భక్తి మార్గములలోగాని ఉన్న పద్ధతులను శరీరములోని ఇష్టము ప్రకారము ఎన్నుకొని ఆ పద్దతిలో

నడచుకొనుచున్నారు. కావున మతమనునది శరీరాంతర్గతమున గుణచక్రములో గలదని చెప్పవచ్చును.

**913. (3) పుత్రుడు లేకపోతే పున్నామ నరకమంటారు, మగతనమే లేకపోతే వానిగతి ఏమి?**

జ. సాధారణ నరకమే వచ్చును.

**వివరము :** ప్రపంచరీత్యా సంతానములేని వారిని చూచి, లేక కొడుకులులేని వారిని చూచి, పుత్రుడు లేకపోతే పున్నామ నరకమని, దానిని తప్పించుకొనుటకు తప్పనిసరిగ కొడుకు కావాలని కొందరు కోరుకుంటూ ఉంటారు. అందరి ఉద్దేశ్యము అదే ఐనప్పటికి జ్ఞానము తెలిసినవారు పూర్వము చెప్పిన ఉద్ద్యేశమువేరై ఉన్నది. అది ఏమనగా! పుత్రులనగా రెండురకముల పుత్రులు గలరు. ఒక విధమైనవారు భిందు పుత్రులు, మరొక విధమైనవారు నాదపుత్రులు. పై మాట నాదపుత్రుల విషయములో చెప్పినదే, కాని భిందు పుత్రుల విషయములో చెప్పినది కాదు. శరీర సంబంధముతో పుట్టినవారందరు భిందు పుత్రులగుదురు. వీర్యభిందువుకు పుట్టడము వలన వారికి భిందుపుత్రులని పేరు వచ్చినది. అలాగే ఒక వ్యక్తి జ్ఞానము తెల్పుటవలన మరొకడు సంపూర్ణ జ్ఞానిగ మారితే, వానిని జ్ఞానము చెప్పిన వ్యక్తికి నాదపుత్రుడని చెప్పవచ్చును. దీనినిబట్టి శబ్దముతో కూడిన జ్ఞానబోధతో నాదపుత్రులు తయారగుదురని తెలియుచున్నది. దైవ మార్గములో పుత్రుడనగా నాదపుత్రునిగనే లెక్కించవలెను.

నరకమనునది ప్రపంచములో ఒకటే ఉన్నది కాని అందులో పున్నామ నరకమని, సాధారణ నరకమని అనేకరక తరగతులుగ లేవు. కావున పున్నామ నరకమని ఎందుకన్నారో చూస్తాము. తనకు దైవజ్ఞానము తెలిసియుండి మరియొకనికి తనకు తెలిసిన జ్ఞానము చెప్పకూడదని, చెప్పుటవలన మరొకడు కూడ జ్ఞానిగ మారునని, అట్లు ఇతరులు జ్ఞానులుగ మారకూడదని, తానే జ్ఞానిగ ఉండవలయునని, మిగతవారు తనకు సమానమైన జ్ఞానులుగ మారకూడదని,

స్వార్థముతో ఇతరులకు జ్ఞానము తెలియజేయనివానికి జ్ఞానమునకు సంబంధించిన పాపము అంటును. ఏ విషయములో తప్పుచేస్తే ఆ విషయమునకు సంబంధించిన పాపమే వచ్చుట సహజము. అందువలన జ్ఞాన విషయములో చేసిన తప్పుకు జ్ఞాన సంబంధమైన పాపమేవచ్చుట సహజము. జ్ఞానిని చంద్రునిగ, జ్ఞానమును పున్నమిగ పోల్చడము ఆధ్యాత్మికములోనున్న విషయమే. సంపూర్ణ జ్ఞానమును పూర్తి వెలుగు గల పున్నమితో సమానముగ పోల్చడము జరిగినది. కావున జ్ఞాన విషయములు ఇతరులకు చెప్పనివారికి పున్నమ నరకమొచ్చునని పెద్దలు చెప్పారు. పున్నమ నరకమనగా జ్ఞాన సంబంధమైన బాధలేనని అర్థము. కాలక్రమములో పూర్వముండిన పున్నమ నరకము మారిపోయి పున్నామ నరకముగ పలుకబడు చున్నది. పలుకడములో 'నా' దీర్ఘము ఏర్పడి పున్నామ నరకమనుట జరిగినది. జ్ఞానము ఇతరులకు చెప్పుటవలన నాదపుత్రులు ఏర్పడడము జరుగుచున్నది. జ్ఞానము తెలిసి చెప్పని వానికి నాదపుత్రులే ఉండరు కనుక అట్టివారిని గూర్చి పున్నమ నరకము పొందుదురని పెద్దలు తెలియజేశారు.

భూమి మీద జ్ఞానము తెలసినవారు బహుకొద్దిమందే ఉందురు. ద్వాపర యుగములోనే వేయిమందికి ఒకడు జ్ఞానము తెలియవలెనని ఆసక్తి కల్గియుండుట అరుదని భగవద్గీతలో కృష్ణుడు చెప్పాడు. ఆ కాలములోనే అట్లుంటే నవీన పరికరములతో ప్రపంచమునకతుక్కపోయిన ఈ కాలములో, లక్ష జనాభాలో ఒకడు జ్ఞానాసక్తుడై ఉండుట అరుదేనని చెప్పవచ్చును. ఒకవేల లక్షల సంఖ్యలో ఎవడైన జిజ్ఞాసపరుడుండినప్పటికి మాయ ప్రభావమువలన వాడు జ్ఞానిగ మారుట మరి అరుదు. అటువంటి వాతావరణములోనుండి ఎవడైన జ్ఞానము తెలిసి సంపూర్ణజ్ఞానిగ ఉంటే వానిని మగవాడనవచ్చును. ఏదైన కష్టముతో సాహసముతో కూడుకొన్న పనిని ఎవడైన చేస్తే వానిని వీడురా మగాడు అని అందరు అనుట వినియే ఉందుము. ప్రపంచములో వాస్తవముగ కష్టమైనది సాహసమైనది అన్నిటికంటే పెద్దది బ్రహ్మవిద్యయే. సాహసముతో కూడుకొన్న బ్రహ్మవిద్యయైన జ్ఞానము తెలియడము నిజముగ మగతనము కల్గియున్నట్లే. పూర్వము జ్ఞానము తెలియని

వానిని పురుషత్వము లేనివాడని, నపుంసకుడని, అటువంటివానికి నాదపుత్రులు పుట్టరని అనెడివారు. నిజముగ జ్ఞానియే పురుషత్వము గలవాడు, అజ్ఞాని మగవాడు కాదను భావముతోనే అన్ని తెలిసిన సంపూర్ణ జ్ఞానిని వీడుర మగాడు అనెడివారు. శరీరములో పురుషులైనప్పటికి ప్రత్యేకించి కొంతమందిలో ఒక్కన్ని మాత్రము వీడురా మగాడు అనడము ఇప్పటికి ఉండడము చూస్తే, పూర్వము ఈ మాటను జ్ఞానమున్నవారి ఎడలవాడెడివారని తెలియుచున్నది. వేష భాషలలో స్వామివలె యుండినప్పటికి, గురువువలె బోధలు చెప్పినప్పటికి, ఇతరులను సంపూర్ణ జ్ఞానులుగ మార్చలేనివాడు నపుంసకులతో సమానమేనని చెప్పవచ్చును. జ్ఞానము తెలియనివారందరు సాధారణ పాపపుణ్యములనే పొందుచుందురు. కావున అటువంటివారందరు పున్నమ నరకమును పొందరుగాని సాధారణ నరకమును పొందుదురు. జ్ఞానము తెలిసి చెప్పనివారు, జ్ఞానము తెలియకనే చెప్పెడివారు పున్నమనరకము పొందుదురు. జ్ఞానము ఏమి తెలియక సాధారణముగ ఉన్నవారికి సాధారణమైన కర్మలే వచ్చుచుండును.

**914 (4) మనుషులందరికి దేవుడొక్కడే అన్నది పూర్తి సత్యము, అలాగే దేవునికి మనషులందరు ఒక్కటేనా?**

జ. ఒక్కటి కాదు.

**వివరము :** జగతికంతటికి దేవుడొక్కడే కలడు. ఎన్ని మతముల వారున్నను వారివారి మతముల ప్రకారము మా దేవుడు మీ దేవుడు అనుచున్నప్పటికి అందరికి ఒకే దేవుడు గలడు. మనుషులు గుణములు కలవారైనందువలన దేవున్ని అర్థము చేసుకోలేక మతమునకొక దేవుడున్నాడనుకొన్నారు. మాయ మనుషులు ఏ మతము వారేమనుకొన్నను అందరి దేవుడొక్కడే అన్నది పూర్తి సత్యము. ఇకపోతే దేవునికి మనుషులందరు సమానమేనా అన్నది ప్రశ్న. ఈ ప్రశ్నకు జవాబుగ దేవునికి మనుషులందరు ఒక్కటికాదని చెప్పవచ్చును. దేవుని దృష్టిలో జ్ఞానులు అజ్ఞానులను భేద విభజన కలదు. అందువలననే భగవద్గీతలో కూడ వీరు నాకు ఇష్టులు వీరు

అయిష్టులన్నాడు. మనుషులలోనున్న జ్ఞానమును బట్టి కొందరు దేవునికి దగ్గరగ, కొందరు దూరముగనున్నారు. దేవునికి కొందరు మిక్కిలి భక్తులుకాగ, కొందరు మిక్కిలి శత్రువులుగనున్నారు. దేవునికి ఇష్టమైన భక్తుల యోగము యొక్క క్షేమమును కూడ నేనే చూస్తున్నానన్నాడు. అలాగే ఆయనకు ఇష్టములేని అజ్ఞానులకు జ్ఞానము యొక్క గట్టేదొరకకుండ చేసి, జన్మజన్మకు అధోగతి పొందునట్లు, మూర్ఖుల యొక్క గర్భములలో పుట్టునట్లు చేయుదునన్నాడు. గీతలో చెప్పిన ఈ విషయముల బట్టి దేవునికందరు సమానులు కాదని తెలియుచున్నది. మనిషి దేవుని గూర్చి నిరాకారుడనుకొన్నను, సాకారుడనుకొన్నను, మరేవిధముగ అనుకొన్నను దేవుడొక్కడే గలడు. ఆయనను మించినది లేదు, కావున ఆయన ఆయనగానే ఉండును. దేవుడు మనిషిని గురించి అనుకొంటే నీవు అంతటా కూడ ఉంటావని దేవుడన్నట్లు పెద్దలు చెప్పారు. ఇలా అన్ని విశదీకరించి చూచితే అందరికి దేవుడొక్కడేకాని దేవునికి అందరు ఒక్కటి కాదని తెలియుచున్నది.

**915. (5) దేవుని ప్రతినిధి భగవంతుడు. ఎందరో భగవంతులు దేవుని ప్రతినిధులుగ పుట్టిపోయారు. ఇస్లాంలోని హజరత్ మహమ్మద్ అల్లాకు, క్రైస్తవులలోని ఏసు ఎహోవాకు, హిందువులలోని కృష్ణుడు పరమాత్మకు ప్రతినిధులా లేక అందరు ఒకే దేవునికి ప్రతినిధులా?**

జ. అందరు ఒకే దేవునికి ప్రతినిధులు.

**వివరము :** మానవుని ఇష్టమునుబట్టి మతమనునది పుట్టినది. మతము దేవుని మార్గమును అనుసరింపజేయునదేయైనప్పటికి, దేవుని మార్గము అందరికి ఒక్కటేయైనందువలన, మతముల సారాంశమంతయు ఒక్కటేనని చెప్పవచ్చును. దేవునికి ప్రతినిధిగ భూమి మీదకు వచ్చినవారిలో మహమ్మద్‌గాని, ఏసుగాని, శ్రీకృష్ణుడుగాని దేవుని మార్గముననుసరించి మాయ మార్గమును వదలమన్నారు. పవిత్ర ఖురాన్‌లోగాని, పరిశుద్ధ బైబిలులోగాని, భగవద్గీతలోగాని మాయను దేవున్ని గురించియే చెప్పారుగాని మతముల గూర్చి చెప్పలేదు. మాయలేక సాతాన్

మార్గమును వదలి దేవుని మార్గమును అనుసరించమని తెలియజెప్పబడియున్నది. ప్రవక్తల ప్రబోధములన్ని ఒక్క దేవున్ని గురించియే ఉన్నవికాని వేరుగాదు. ఉన్నది ఒక్కడే దేవుడైనందు వలన ఎవరు దేవున్ని గురించి చెప్పిన, ఏ గ్రంథము చెప్పిన ఆయన గురించియే ఉండును. కావున ప్రవక్తలందరు ఒకే దేవుని ప్రతినిధులని చెప్పవచ్చును. ప్రతినిధి యొక్క వేష భాషలు వేరైనంత మాత్రమున వారు బోధించు దేవుళ్లు వేరువేరనుకోవడము పూర్తి పొరపాటని తెలియాలి.

**916. (6) ప్రవక్త భగవంతుడు ఇద్దరు ఒకటేనా?**

జ. ఒక్కటే.

**వివరము :** ప్రవక్త అనిన, భగవంతుడు అనిన, అవదూత అనిన, దూత అనిన అన్నియు ఒకే అర్థమును సూచించుచున్నవి. ముగ్గురు ఒకే దేవున్ని ఒకే మాయను గూర్చి చెప్పువారై ఉందురు. మాయనుండి తప్పించుకొని దేవుని చేరుమను విషయమే వీరిబోధలలో చోటుచేసుకొని ఉండును తప్ప వేరు విషయములుండవు. వక్త అనగ బోధించువాడు లేక వివరము చెప్పువాడని అర్థము. వక్త అనుపదములో విశేషము లేకున్నను ప్ర అను అక్షరములో పెద్ద విశేషతే గలదని చెప్పవచ్చును. ప్ర అనగ అన్నిటికంటే గొప్పదని లేక అతి ముఖ్యమైనదని అర్థము గలదు. ప్రవక్త అనగ అన్నిటికంటే గొప్పదయిన లేక అన్నిటికంటే ముఖ్యమైన దేవున్ని గురించి చెప్పువాడని అర్థము. దేవుని విషయము దేవునికే తెలియును, సాధారణ మనిషికి తెలియదు. దేవునిలో భాగమైన లేక దేవుని వద్దనుండి వచ్చిన వాడు తప్ప ఎవడు దేవున్ని గురించి తెలియజేయలేడు. దేవుని వద్దనుండి వచ్చినవాడు కనుక అతనిని దూత అనికూడ చెప్పవచ్చును. దేవుని అంశయై తల్లి గర్భమునుండియే జీవముతో పుట్టుచున్నాడు కనుక ఆయనను భగవంతుడని కూడ అనవచ్చును. ప్రవక్త ప్రవచనములు, భగవంతుని మాటలు అన్నియు ఒకే దేవున్ని గురించి తెలియ జేయునవేనని తెలియాలి.

**917. (7) జగతిలో దేవుడు మాయ రెండు గలవు వీరిలో ఎవరి రాజ్యము గొప్పది శాశ్వితమైనది?**

జ. మాయ రాజ్యము.

**వివరము :** జగతి ఉన్నంత వరకు మాయ రాజ్యము శాశ్వితముగ నుండుననుటలో ఏ మాత్రము సందేహము లేదు. జగతిలో దేవుని రాజ్యము కొంత కాలముండి కొంత కాలము క్షీణించుచుండును. ధర్మములకు ముప్పు ఏర్పడి తన రాజ్యము లేకుండ పోయినపుడు, దేవుడు తన అంశయైన వ్యక్తిని భూమి మీదకు పంపి, తన ధర్మములను తిరిగి బోధించి, తన రాజ్యము విస్తరించునట్లు చేయు చుండును. దేవుడు తన రాజ్యము విస్తరించుటకు చాలా కాలము పట్టును, కాని మాయ రాజ్యము క్షణాలమీద విస్తరించ గలదు. జగతియున్నంత కాలము ఒకే స్థితిలో దేవుని రాజ్యముండదు. దేవుడపుడప్పుడు తన రాజ్యమును విస్తరింపజేసినప్పటికి అది తొందరగ కృషించుచుండును. మాయరాజ్యము తొందరగ విస్తరించి చాలా కాలము బలముగ ఉండును. దేవుడు తన దూతను పంపు ప్రదేశములో మాయ తన దూతను ముందేపంపి, తన రాజ్యమునకు ముప్పులేనట్లు చూచుకొనుచుండును. దేవుడు తన దూతను ఒక్కనిని పంపి తన రాజ్యమును విస్తరించుటకు ప్రయత్నించగ, మాయ తన దూతలను అయిదారు మందిని తయారుచేసి, తన రాజ్యము సుస్థిరముగ ఉండునట్లు మేధావులు సహితము దేవుని మార్గములోనికి పోకుండ తన మార్గములో ఉండునట్లు, చేసుకొనుచున్నది. మాయ తన దూతలను దైవ దూతలగనే చెప్పుచు, తాము బోధించునది దైవజ్ఞానమేనని చెప్పుచు, దేవుని రంగుపూసి మాయ తనను బోధిస్తు, తన రాజ్యము విస్తరించుకొనునట్లు చేయుచున్నది. దానితో చాలామంది ప్రజలు మాయ మార్గమునే దైవమార్గమని నమ్మి, నిజమైన దేవుని దూతను కూడ నమ్మక, ఆయన చెప్పు దేవుని మార్గమునే వ్యతిరేఖించుచున్నారు. అందువలన దేవునిరాజ్యము అతి కష్టముగ విస్తరించినను తొందరగ నశించుచున్నది. మాయ తన దూతల ద్వార ఎన్నో మహత్యములతో ఇదే నిజమైన మార్గమని చెప్పుట వలన, మాయ రాజ్యము దేవుని రాజ్యముకంటే స్థిరమైనదని చెప్పవచ్చును.

**918. (8) శరీరములో జ్ఞానేంద్రియములు ఐదు గలవు, వాటిలో "సర్వేంద్రియానాం నయనం ప్రధానమ్" అని కొందరన్నారు. ఆ మాట నిజమేనా? ఏది ముఖ్యమైన ఇంద్రియము?**

జ. చెవి ముఖ్యమైన అవయవము.

**వివరము :** అందరు కన్నంటే నీవు మాత్రము చెవ్వంటావేమని ఆశ్చర్యమా! జ్ఞానరీత్యా చెవులు ముఖ్యము, ప్రపంచరీత్య కన్ను ముఖ్యము. ప్రపంచములో చెవికంటే కన్ను ప్రధాన అవయవముగనున్నది. కన్నులేనిది ఏమి కనిపించదు. స్థూల ప్రపంచము అర్థమగుటకు స్థూలదృష్టి కల్గిన కన్ను ముఖ్యము. దేవుని జ్ఞానము స్థూలమైనది కాదు సూక్ష్మమైనది. కనుక దానిని విని అర్థము చేసుకోవలసిందే, కాని చూచుటకు కనిపించునది కాదు. దేవాలయములలో కొన్ని గుర్తులు స్థూలముగ దైవ జ్ఞానమును గురించి పెట్టియున్నను వాటి యొక్క వివరము చెవుల ద్వారవిని తెలుసుకోవలసి ఉండును. పుస్తకములలో వ్రాసిన వ్రాత ద్వార జ్ఞానమును తెలుసుకోవచ్చును కదా అని అనుకొన్నప్పటికి, ఆ వ్రాత వ్రాయువాడు ముందు చెవుల ద్వార వినియేయుండును. అంతేకాక గురుముఖత విను జ్ఞానములో కొంత శక్తి కూడ ఇమిడియుండును. చదివే చదువులో శక్తి ఉండదు. ముఖత చెవుల ద్వార విన్న జ్ఞానము వలన కొంత మారుటకు అవకాశమున్నది. పుస్తకములు చదువుటలో అంత మార్పు ఉండదు. స్థూలమును స్థూల దృష్టిద్వార అర్థము చేసుకొన్నట్లు, శబ్దముతో కూడిన జ్ఞానమును చెవుల ద్వార విని అర్థము చేసుకోవచ్చును. సృతి స్మృతుల ద్వార జ్ఞానమును తెలియవచ్చునుగాని దృష్టి ద్వార అని చెప్పబడలేదు. సర్వేంద్రియానాం నయనం ప్రధానమ్ అను వాక్యము ప్రపంచ సంబంధమైనదేగాని పరమాత్మ సంబంధమైనది కాదు. పరమాత్మ జ్ఞానరీత్య "సర్వేంద్రియానాం కర్ణం ప్రధానం" అని చెప్పవలసి ఉన్నది. కన్నులేకపోయిన చెవి ద్వార జ్ఞానమును అర్థము చేసుకోవచ్చును, గాని చెవిలేకపోతే జ్ఞానమును సంపూర్ణ భావముతో అర్థము చేసుకోలేము.

**919. (9) వారమునకు ఏడు రోజులు గలవు. అందులో ముఖ్యమైనవి మూడు దినములు గలవు, అవి ఏవి?**

జ. ఆది, సోమ, మంగళ.

**వివరము :** సృష్టి మొదలైన దినము ఆదివారము. ఆదివారము ప్రపంచ వ్యాప్తముగ ఇప్పటికి ప్రత్యేకత కల్గియుండి సెలవుదినముగ ఉన్నది. పూర్వము కూడ ఆదివారమును సెలవుదినముగనే ఏ పనులు చేయకుండ గడిపెడివారు. పూర్వము ఉద్యోగములు లేకున్న, ఎక్కువ మంది వ్యవసాయపనులు చేసుకొనుచున్నను, ఆదివారము ప్రపంచము పుట్టిన దినమని, అందరు ఆధ్యాత్మిక విచారణ కల్గియుండవలెనని ఉద్దేశ్యముతో, ఏ ఇతర చెడుపనులు చేయక పవిత్రముగ గడిపెడివారు. పూర్వపు ఆచరణ ప్రకారము ఇప్పటికి ఆదివారము ప్రపంచము మొత్తము మీద సెలవు దినముగనే ఉన్నది. కాని పూర్వమువలె ఆదివారమును ఎవరు ప్రపంచము పుట్టిన దినమని అనుకోవడములేదు మరియు పవిత్రముగ గడపడము లేదు. ఆదివారము అన్ని దురభ్యాసములకు లైసన్సు దినములాగ ఉన్నది. మాంసము తినడము, మద్యము త్రాగడము, జూదమాడడము, మగువలతో విహరించడము వ్యభిచరించడము మొదలగు చెడుకార్యములందే లగ్నమై పోవుచున్నారు. కొందరు మా జ్ఞానము తెలిసినవారు ఆదివారమును పవిత్రముగనే గడుపుచున్నారు.

రెండవ రోజు సోమవారము. సోమవారమనగా చంద్రుని దినమని, చంద్రుడు జ్ఞాన చిహ్నమైనందున ఆ దినము జ్ఞానమునకు గుర్తని, ఆ దినమున జ్ఞానమును తెలుసుకోవలెనని పెద్దలు చెప్పెడివారు. ఆదివారము చెడుపనులు చేయకుండ ఆధ్యాత్మిక విషయములు తెలుసుకోవాలని యోచించవలెనని సోమవారము జ్ఞానమును తమయందు చేర్చుకోవలెనని పూర్వము తలచెడివారు. సోమవారము దినము ఆకారములేని దేవున్ని తెలియజేయు లింగప్రతిష్ట దేవాలయములకుపోయి లింగములోని అంతరార్థమును తెలుసుకొనెడివారు. ఇప్పటికి సోమవారము ఈశ్వర దేవాలయమునకు పోవు ఆచారమున్నను అర్థము

తెలియకుండ పోయినది. ఆరాధన రహితుడైన లింగ దేవునికి సాంప్రదాయబద్ధముగ సోమవారము పోవుచున్నను అభిషేకములు ఆరాధనలు చేయడము పొరపాటు. **(మా రచనలోని దేవాలయ రహస్యములు చదవండి).**

మూడవ రోజు మంగళవారము. మంగళవారమనగ శుభకరమైన దినమని అర్థము. మంగళవారము మోక్షమునకు, పరమాత్మకు చిహ్నమైనదినము. ఆదివారము చెడుపనులు వదలి ఆధ్యాత్మిక చింతన మీద ధ్యాస కల్గించుకోవడము, సోమవారము జ్ఞానము తెలుసుకోవడము, మంగళవారము మోక్షము లేక పరమాత్మ విధానమును గురించి తెలుసుకోవడము పూర్వము జరుగుచుండెడిది. అందువలన ఆది, సోమ, మంగళవారములు మూడు చాలా ముఖ్యమైన దినములుగ పరిగణింప బడెడివి. ఈ కాలమునకు వాటి విలువ తెలియకుండపోయినది.

**920. (10) మందు, మంత్రము ఒక రోగమును లేక పాము విషమును నయము చేస్తాయి. ఈ రెండిటిలో ఏది గొప్పది?**

జ. మంత్రము గొప్పది.

**వివరము :** రోగమునకు తగ్గ మందు, విషమునకు తగ్గ మంత్రము అవసరమని పూర్వము కొందరనెడివారు. రోగమునకు తగినమందువేయకున్నను, విషమునకు సరియగు మంత్రము వాడకున్నను అవి నయము కావు. రోగము శరీరములో కంటికి కనిపించక బాధించుచుండును. అలాగే విషము కూడ కనిపించక బాధించుచుండును. శరీరము స్థూలమైన, బాధ సూక్ష్మమైనది. స్థూలశరీరములో సూక్ష్మబాధను హరింపజేయునది ఔషధము మరియు మంత్రము. పూర్వము ఔషధముతో కొందరు వైద్యులు శరీర బాధలు హరింపజేయగ, మరికొందరు వైద్యులు మంత్రములతో నయము చేసెడివారు. ఈ విధముగ పూర్వము వైద్యులు రెండు విధములుగ ఉండెడివారు. ఔషధ వైద్యులు స్థూలమైన మందులనిచ్చి రోగము నయము చేయగ, మంత్రవైద్యులు సూక్ష్మమైన మంత్రములతో రోగములను నయము చేసెడివారు.

రోగమునకు తగిన ఔషధము తెలియక కొందరు వైద్యులు వేరు ఔషధములు వాడి రోగమును నయము చేయలేక పోయెడివారు. అలాగే కొందరు మంత్రవైద్యులు రోగమునకు తగిన మంత్రమును తెలియక వేరు మంత్రమువాడి రోగమునుగాని విషమునుగాని నయము చేయలేక పోయెడివారు. తగిన ఔషధము, తగిన మంత్రము తెలిసినవారు ఏ రోగమునైన బాగుచేసెడివారు. బాధను నివారించు రెండు పద్ధతులలో ఏది గొప్పదను విషయానికొస్తే, స్థూల ఔషధములో కూడ సూక్ష్మమైన శక్తి ఉన్నపుడే బాధ నివారింపబడేది. మంత్రములో ప్రత్యక్షముగ సూక్ష్మశక్తియే పనిచేయుచున్నది. మందులోను మంత్రములోను సూక్ష్మశక్తి పనిచేసినపుడు రెండు సమానమే కదా! అని అనుకోవచ్చును. కాని మందులో ఔషధశక్తి మాత్రముండగ, మంత్రములో కొంత దైవశక్తి ఇమిడి ఉండును. ప్రతి మంత్రమునకు ముందు ఓం ఉచ్చరింపబడుట వలన, మంత్రములోని బీజాక్షర శక్తితో పాటు ఆత్మశక్తి అందులో ఇముడుటవలన, ఔషధముకంటే మంత్రమే మేలని పూర్వమనెడివారు. మంత్రవైద్యము పూర్తి మాసిపోయి, మంత్రములంటే ఏమిటో తెలియని ఈ కాలములో, ఏ రోగమునకు ఏ మంత్రమో ఎవరికి తెలియక పోయినది. ఔషధములలో కూడ ఎన్నో మార్పులు వచ్చినవి. ఇప్పటికి కూడ బాలగ్రహ బాధలకు మందుకంటే మంత్రమే బాగ పనిచేయుట అక్కడక్కడ గలదు.

## జ్ఞాన పరీక్ష

**యాడికి** **తేది-19-11-2002**

**921. (1) ప్రకృతి క్షరమా అక్షరమా?**

జ. ఎక్కువ అక్షరము, తక్కువ క్షరము.

**వివరము :** ప్రకృతి నాశనమగునదే కదా! క్షరమే కదా! అక్షరమెట్లగునని కొందరనుకోవచ్చును. ప్రకృతి అంశయైన శరీరము లేక శరీరమైన ప్రకృతి నాశనమగునని చెప్పవచ్చును. వివరముగ చెప్పాలంటే చరప్రకృతి క్షరమని (నాశనమగునని) చెప్పవచ్చును. అచర ప్రకృతియైన పంచభూతములు నాశనము

కానివని వాటిని అక్షరమనియే చెప్పవచ్చునని తెలియవలెను. ఈ విషయము ఆధారము లేనిదని, ఈ విషయమునకు శాస్త్రబద్ధత లేదని కూడ కొందరనవచ్చును. వివరించి చూచుకొనిన బ్రహ్మవిద్యా శాస్త్రమైన భగవద్గీతయే ఆధారమని చెప్పవచ్చును. భగవద్గీత శాస్త్రమే శరీరములైన చర ప్రకృతికి నాశనము కలదని చెప్పినది. అట్లే ఆత్మ నాశనము లేనిదని, జీవాత్మ నాశనమగునని కూడ చెప్పబడినది. చర ప్రకృతిలోని భాగము జీవాత్మ నాశనముకాగ, ఆత్మ మాత్రము నాశనము కానిదై మిగిలి ఉండును. ఆత్మ జీవాత్మ రెండు పరమాత్మ అంశయైనప్పటికి ఒకటి నాశనము కావడము మరియొకటి నాశనము కాకపోవడమున విచిత్రముగ ఉన్నది కదా! ఇక్కడ విచిత్రమేమంటే పరమాత్మ చేత మొట్టమొదట పుట్టబడినది ప్రకృతి. మొదట పుట్టిన ప్రకృతి రెండు భాగములుగ విడిపోయి, ఒకటి ప్రపంచము మరియొకటి జీవరూపమైన జగతిగ ఏర్పడినది. జీవరూపమైన జగతికి నాశనము కలదుగాని, ప్రపంచరూపమైన పంచభూతములకు ఒక విధముగ నాశనములేదనియే చెప్పవచ్చును. ఎందుకనగా ప్రపంచము పుట్టిన తర్వాతనే ఆత్మ జీవాత్మలు పుట్టినవి. ప్రపంచముంటేనే ఆత్మకు జీవాత్మకు పని. ప్రపంచము లేకపోతే ఆత్మ జీవాత్మల ఉనికియే ఉండదు. జీవాత్మ ఎటూ క్షరమని (నాశనమగునని) చెప్పబడినది. అట్లే ఆత్మ అక్షరము (నాశనముకానిది) అని చెప్పబడినది. ఆత్మ నాశనము కాలేదంటే ఆత్మ నివాసము కొరకు ప్రకృతిలోని అచర ప్రకృతియైన పంచభూతములు ఉండవలసినదే. కావున ఆత్మ అక్షరమైనట్లు ప్రకృతి కూడ అక్షరమేనని చెప్పవచ్చును. ఇక్కడ అర్థము చేసుకొనుటకు కొంత గందరగోళ పరిస్థితి ఉండుటవలన జాగ్రత్తగ యోచించవలసి ఉన్నది. ప్రకృతిలో కొంత భాగము నశిస్తున్నప్పటికి, నశించని భాగము ఎక్కువ మిగిలి ఉన్నది. పంచభూతములు ఎంతో విశాలమైనవి, వాటిలో కొద్దిగనే జీవరాసులున్నవి. జీవరాసుల రూపమైన చర ప్రకృతి కొద్ది మాత్రము నశించినప్పటికి విశాలమైన అచర ప్రకృతి నాశనముకాక ఆత్మకు ఆధారమై ఉన్నది. ఆత్మ ఉన్నదంటే ప్రకృతి ఉన్నదని, ప్రకృతి ఉన్నదంటే ఆత్మ ఉన్నదని లెక్కించబడుచున్నది. ప్రకృతిలో ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి భాగములు

నశించినప్పటికి, నశించని ప్రకృతి కూడ కలదని అది నశించని ఆత్మకాధారమై ఉన్నదని తెలియవలెను. భగవద్గీత అక్షర పరబ్రహ్మ యోగము అను అధ్యాయములో 19వ శ్లోకమందు “భూత గ్రామ స్స ఏవాయుం భూత్వాభూత్వా ప్రలీయతే” అన్నారు. ప్రళయములో జీవరాసులే లయము పొందుచున్నవన్నాడు, కాని ప్రకృతిని గూర్చి చెప్పలేదు. ప్రకృతి కూడ లేకుండ పోవుట నిజమే కాని నాశనముకాక అవ్యక్తమై పోవునని తెలియాలి. కనిపించనంత మాత్రమున లేదని చెప్పుటకు వీలు లేదు. దీనిని బట్టి ప్రకృతి నాశనము కాగలదు, కాని అది చర ప్రకృతియని, ప్రకృతి నాశనము కాదు కాని అది అచర ప్రకృతియని తెలియాలి. చర ప్రకృతికంటే అచర ప్రకృతి ఎన్నో రెట్లు పెద్దది, కావున నాశనము కానిదే ఎక్కువైనందువలన పై ప్రశ్నకు ప్రకృతి నాశనము కానిదని జవాబు చెప్పవలెను.

**922. (2) పంచాంగములలో ఏది ముఖ్యము?**

జ. చెవి ముఖ్యము.

**వివరము :** పంచాంగములనగ ఐదు అంగములని తెలియాలి. జ్యోతిష్యములోని వారము, తిధి, నక్షత్రము, కరణము, వర్జ్యములలో తిధి ముఖ్యమైనట్లు, శరీర పంచాంగములలో చెవి ముఖ్యమైనది. ఐదు అంగములలో ప్రపంచరీత్యా కన్ను ముఖ్యమైనప్పటికి, ఆధ్యాత్మికరీత్యా చెవి ముఖ్యమైనది. దేవాలయములలో శంఖు చక్రనామములో నామము దేవుని గుర్తుకాగ, చక్రము కర్మ నాశనమునకు గుర్తుకాగ, శంఖము జ్ఞాన శబ్దమునకు గుర్తుగ ఉన్నది. జ్ఞానము శబ్దము ద్వార విని, కర్మను జ్ఞాన చక్రము (ఆయుధము) ద్వార ఖండించినపుడు, దైవము తెలియబడుననునది అక్కడి వివరము. మానవుని జన్మ యొక్క ముఖ్య ఉద్దేశ్యము, ఈ జన్మలోనే దేవుని తెలియడము. ఆ ఉద్దేశ్యమును మరచిపోయి మనిషి ప్రతి నిత్యము ధనము మీద ఆశతో మిగత పనుల మీద లగ్నమై పోవుచున్నాడు. అట్లుకాక ఎవడయిన దైవమును తెలియవలెనని గురువు వద్దకు చేరినప్పటికి, చెవులు లేకుండ కళ్ళు ఉన్నంత మాత్రమున గురువు చెప్పునది తెలియక జ్ఞానము లభించక పోవును. కళ్ళు చూచినంత మాత్రమున, గురువు చెప్పు శబ్దము తనకు తెలియని దాని వలన

వాడు జ్ఞాని కాలేడు. ఒకవేళ చెవులుండి కళ్ళు లేకపోయినప్పటికి గురువు ద్వార వచ్చునది శబ్దమే కావున దానిని గ్రహించి జ్ఞాని కాగలడు. అందువలన "సర్వేంద్రియానామ్ కర్ణం ప్రధానం" అనవచ్చును. నేత్ర, కర్ణ, నాసిక, జిహ్వా, చర్మములలో కర్ణము (చెవి) శ్రేష్టమైనది.

**923. (3) పంచాంగములు ఏ శాస్త్రము నుండి పుట్టినవి?**

జ. బ్రహ్మవిద్యా శాస్త్రము

**వివరము :** కాలమునకు కొలత పండ్రెండు గంటలన్నట్లు మరికొన్ని కొలతలు కాలమునకు గలవు. పూర్వము గడియలు విగడియల రూపములో కాలమును కొలిచెడివారు. గడియల కొలత అప్పటికి ఇప్పటికి గలదు. కాలమునకు పూర్వము గణితరీత్య ఐదు అంగములను గుర్తించారు. అలాగే శరీరమునకు ముఖ్యముగ ఐదు జ్ఞానేంద్రియములను గుర్తించారు. పూర్వము జ్యోతిష్య శాస్త్రము నుండి గడియలు విగడియల రూపములో వారము, తిధి, నక్షత్రము, కరణము, వర్జము అను వాటిని పంచాంగములుగ గుర్తించారు. బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము శరీరములోని పంచాంగములను గుర్తించారు.

**924. (4) విశ్వమనగా ఏమి?**

జ. ప్రపంచము జగము రెండు కలిపి విశ్వము.

**వివరము :** పరమాత్మ నుండి ప్రకృతి ఉద్భవించినది. ప్రకృతి నుండి ప్రపంచమనునది ఒకటి, జగతి అనునదొకటి రెండు ఉద్భవించినవి. రాజుకు కాల్బలము, వైమానిక బలము, సముద్రబలము అను మూడు బలములను యుద్ధ యోధులుందురు. అన్ని బలముల యోధులను కలిపి సైన్యము అంటాము. అలాగే ప్రకృతికున్న జగతి, ప్రపంచము అను రెండు భాగములను కలిపి విశ్వము అంటాము. ప్రకృతి అనిన విశ్వము అనిన రెండు ఒక అర్థము నిచ్చునవియే అగును. విశ్వములో ఉండే జీవకోటిని గురించిగాని, అనగా జగతిని గురించి గాని, అలాగే పంచ భూతములైన ప్రపంచమును గురించిగాని హద్దు పద్దులు ఎవరికి తెలియవు.

విశ్వమే తెలియనపుడు విశ్వమంత వ్యాపించిన పరమాత్మను గురించి ఎవరికి తెలుసును? స్థూలముతో విశ్వమునే చూడలేము, అందువలన సూక్ష్మముతోనే విశ్వమును చూడవలెను. అనగా జ్ఞానదృష్టితో ప్రకృతిని తెలియవచ్చును. ప్రకృతిని తెలిసిన తర్వాత విశ్వమంత వ్యాపించిన వానిని తెలియవచ్చును.

**925. (5) అడుగడుగున గుడి ఉంది, ఆ గుడిలో దీపముంది అంటారు. ఆ దీపము ఏది?**

జ. గుడి శరీరము, దీపము ఆత్మ.

**వివరము :** ప్రపంచములో భూమి మీద అడుగడుగున దేవుని నిలయమైన గుడి ఉంది. శరీరమనే గుడిలో పరమాత్మయనే దేవుడు నెలకొని ఉన్నాడు. లెక్కలేనన్ని శరీరములు భూమి మీద ఉండుట వలన వాటి సంఖ్య పెద్దదన్నట్లు గుర్తుగా అడుగడుగున గుడి ఉంది అన్నారు. శరీరమను గుడిని కొందరు **"దేహో దేవాలయ"** దేహమే దేవాలయమన్నారు. శరీరగుడిలో పరమాత్మ ఎల్లపుడు దేవుడై ఉన్నాడు. శరీరమునుకాక బయట మనుషులచేత కట్టబడిన గుడిని చూచిన అందులో మూల విరాట్ అయిన ప్రతిమ ఉండును, ప్రతిమను ఆరాధించు పూజారి ఉండును. గుడిలో ముఖ్యముగ దీపముండును. గుడిలో ప్రతిమ, దీపము, అర్చకుడు ముఖ్యముగ ఉందురు. గర్భగుడికి కిటికీలుండవు కావున చీకటిగ ఉంటుంది. అందువలన తప్పని సరిగ దీపమును ఆరాధనలో భాగముగ చేసి వెలిగించెడివారు. ఎల్లపుడు దీపము వెలిగేటట్లు ఉంచి అఖండ దీపారాధన అని పేరు పెట్టి చెప్పడము వినియే ఉందుము. ఇంకా కొందరు పెద్దలు తలుపులు లేని ఇల్లు, దీపము లేని గుడి ఉండకూడదనేవారు. అంతేకాక తలుపులు లేని ఇల్లు దొంగలపాలు, దీపములేని గుడి దయ్యాల పాలు అనెడివారు. అందువలన ప్రతి గుడిలోను దీపము ముఖ్యముగ ఉంటుంది.

భూమి మీద అన్ని చోట్ల ఉన్న శరీరములు అడుగడుగున ఉన్న గుడులతో సమానము. శరీరములు దేవుడు చేసిన గుడులు. శరీరములే దేవుడు నివాస

ముంటున్న గుడులు. శరీర గుడిలో పరమాత్మ దేవుడుకాగ ఆత్మ దీపమై గుడియంతయు వెలుగు నిచ్చుచున్నది. శరీరములోని జీవాత్మ దేవున్ని ఆరాధించు ఆరాధకుడుగ ఉన్నాడు. బయట గుడిలో అర్చకుడు దేవుడు ఉండినప్పటికి దీపము లేకపోతే ఏమి కనిపించక ఆరాధనలన్ని నిలిచిపోవును. అలాగే శరీరములో ఆత్మ లేకపోతే శరీరము ఏ మాత్రము కదలక పనులన్ని స్థంభించి పోవును. అందువలన గుడిలో దీపము ఎంత ప్రాముఖ్యత కల్గి ఉన్నదో, శరీరములో ఆత్మ అంత ప్రాముఖ్యము కల్గి ఉన్నది. ఆత్మ తన శక్తిచేత శరీరమునంతటికి వెలుగు కల్గించి చైతన్యమిచ్చుచున్నది. దీపములేని చీకటి గుడిలో పూజారికి పనిలేనట్లు ఆత్మ లేని శరీరములో జీవాత్మకు పనిలేదు. అందువలన ఆత్మ లేని దేహము జీవుడు కూడ లేనిదై శవమై పోవును. గుడిలో దీపము వెలుగైనట్లు శరీరములో ఆత్మ వెలుగై ఉన్నది. దేహము= దేవాలయము, జీవాత్మ= అర్చకుడు, ఆత్మ = దీపము, పరమాత్మ = దేవుడు.

**926. (6) ప్రకృతికంటే ముందు ఓం కార నాదము పుట్టిందంటారు నిజమేనా?**

జ. నిజము కాదు.

**వివరము :** మొదట పరమాత్మ నుండి ప్రకృతి పుట్టినది. ప్రకృతి పరమాత్మను ఆధారము చేసుకొని ఉంటున్నది. ప్రకృతి పరమాత్మకు పుట్టినది కావున పుత్రికతో సమానము. అదే ప్రకృతి పరమాత్మ గర్భమునకు కారణమై జీవరాసులకు తల్లిగ ఉండుటవలన పరమాత్మకు ప్రకృతి భార్యగ కూడ ఉన్నది. దీనిని బట్టి పరమాత్మకు మొదట ప్రకృతి పుట్టి, ఆ తర్వాత ప్రకృతికి అన్ని పుట్టినవని చెప్పవచ్చును. కావున ప్రకృతికంటే ముందు ఏది పుట్టలేదనుటకు ఆధారమున్నది. ప్రకృతి పుట్టిన తర్వాత రెండుగ చీలిపోయి చర, అచర ప్రకృతులుగ మారినవి. అచర ప్రకృతి పంచ భూతములుగ నిలచిపోగ, చర ప్రకృతి ఇరువదైదు భాగములుగ మారిపోయి, అందులో ఒక భాగము నాదము (శబ్దము)గ మారినది. దీనిని బట్టి ప్రకృతి పుట్టిన

తర్వాత ఓంకార నాదము పుట్టినది. కాని ప్రకృతి పుట్టకముందు ఏది కాని పరమాత్మ తప్ప ఏది లేదని తెలియవలెను.

**927. (7) పిండాకూడు అంటే ఏమిటి? ఎవరికి పెట్టవలెను?**

జ. కర్మ, మోక్షము పొందిన వారికి పెట్టవలెను.

**వివరము :** పిండాకూడు అనుమాట బహుశ అందరము వినియే ఉందుము. పిండాకూడును గురించి మనకు తెలిసినది ఏమంటే! ఒక మనిషి చనిపోతే కర్మతంత్రములను పేరుతో చనిపోయినవాని ఆకలి తీర్చుటకు పెట్టు ఆహారమును పిండాకూడని చెప్పుచుందురు. ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క రకముగ ఈ కర్మతంత్రములు బ్రాహ్మణుల చేత చేయించుచుందురు. కొందరు మనిషి చనిపోయిన మూడు దినములకు, పదకొండు దినములకు, సంవత్సరమునకు పిండాకూడు పెట్టుట చేయుచుందురు. కొందరు నెలకొకమారు నెల మాచికలను పేరుతో పిండాకూడు పెట్టుట కూడ జరుగుచున్నది. మరికొందరు సంవత్సరమునకు ఒకమారు పుణ్యక్షేత్రములవద్ద నది ఒడ్డున కర్మతంత్రములు చేయుచు పిండాకూడు పెట్టుట కూడ జరుగుచున్నది. తర్పణమని, తద్దినమని రకరకముల పేరుతో ఈ కార్యములు చేయుచుందురు. ఈ విషయమై కొందరిని అడుగగ వారు చెప్పు సమాధానమేమనగా! చనిపోయిన వానిని యమదూతలు వారి వెంటపిలుచుకొని పోవుచుందురని, అలా సంవత్సర కాలము వారిని నడిపిస్తు తీసుకపోవడము వలన ఆ జీవుడు ఆకలితో బాధపడుచుండునని, నెలకొకమారు పెట్టుటవలన జీవుని ఆకలి తీరునని, నెల నెల పెట్టువారు చెప్పుచుందురు. చనిపోయిన జీవుడు ఒక సంవత్సరమునకు యమ లోకమునకు చేరునని, ఆ దినము సంవత్సరదినమని పిండాకూడు పెట్టుటవలన వాని ఆకలి తీరి యమలోకానికి పోవునని కొందరు చెప్పుచున్నారు. యమలోకానికి పోవుదారిలో దూతలతో బందింపబడి పోవువాడు మనము పెట్టు పిండాకూడునెట్లు తినగల్గునని ప్రశ్నించిన, చనిపోయినవాడు కాకి రూపముతో వచ్చి తినిపోవునని చెప్పుచున్నారు. నీకు ఈ విషయము అంతమటుకు

తెలియదా! నీవు మీ నాన్నకుగాని, మీ తాతకు గాని పిండాకూడు పెట్టలేదా? కాకులు తినిపోయేది చూడలేదా? అని మాట్లాడుచున్నారు. గుంటూరు పొగాకు గూటిలోనున్న ఒక్కటే, నోటిలోనున్న ఒక్కటే అన్నట్లు కొందరు ఏ విషయమును తెలుసుకోక, తెలుసు కొనుటకు ప్రయత్నము కూడ చేయక, ఎక్కడున్నా ఎట్లున్నా సప్పగ రుచిలేని పొగాకు మాదిరి ఉందురు. గుడివాడ పొగాకు గూటిలోనున్నా ఘాటే నోటిలోనున్నా ఘాటే అన్నట్లు, కొందరు ప్రతిది తెలుసుకోవాలను ఘాటయిన చురుకుదనము కల్గియుందురు. అటువంటివారి మదిలో ఎన్నో ప్రశ్నలుద్భవించు చుండును. ప్రతిది తెలుసుకోవాలను తపన వారికుండును. పిండాకూడంటే అర్థమేమిటి? పిండాకూడనకుండ కూడు అనవచ్చును కదా! చచ్చినవారు పిండాకూడు తింటారా? వెంటతీసుకపోయే యమకింకరులు పిండాకూడు తినేదాని కొరకు ఏదైన లంచము తీసుకొని వానిని వదలి పెట్టెదరా? చచ్చినవాడు వారి కొడుకులు పెట్టే పిండాకూడు కొరకు కాకి అవతారముతో ఎందుకొస్తాడు? అలా కాకి అవతారమెత్తివచ్చి తినిపోతాడనే దానికి నేను నిత్యము చూచే కుంటికాకి స్మశానములో ఎందరి పిండాకూడునో తిన్నది, ఈ కుంటికాకిని ఎవరిగ చెప్పవలెను? ప్రతి దినము ఎన్నో లక్షల మనుషులు కొన్ని కోట్ల జీవరాసులు చనిపోతున్నాయి. వారిని తీసుకపోయేదానికి ఒక జీవునికి ఇద్దరు యమకింకరుల ప్రకారమైన యమకింకరులు ఎన్ని కోట్లమంది ఉండవలెను. తీసుకపోయేవారే ఎన్నో కోట్లమంది అయితే, యమలోకములో పాపములను అనుభవింపజేయువారు ఇంకెన్ని కోట్లమంది ఉండవలెను. అక్కడున్న యమకింకరులు, ఇక్కడి నుండి పోయిన వారు అందరు ఎన్ని కోట్లవుతారు. యమలోకము అంత విశాలముగ ఉందా? యమకింకరులు జీవున్ని తీసుకపోయేటపుడు దారిలో ఆకలవుతుందన్నారు. జీవునికి ఆకలయితే యమబటులకు ఆకలి కాకుండునా? వారికి ఆకలయితే సద్ది ఏమయిన తెచ్చుకొని ఉంటారా? లేకపోతే జీవునితోపాటు వారు కూడ కిందికి వచ్చి ఏ కూడయిన తినిపోతారా? పిండాకూడు పెట్టేవారు చనిపోయినవాడు త్రాగుబోతయితే సారాకాని, బ్రాందీ కాని పెట్టి రావడము చూచాము. పితరులు

కాకులైవస్తే అక్కడ పెట్టిన సారాను ఎందుకు త్రాగలేదు. మన పెద్దలు పిండాకూడు తినే దానికి వస్తే వారి మీద ప్రేమున్న మనము, ఎలాగో ఆ కాకిని పట్టుకొని మా నాయనే కదా! అని ప్రీతితో దినము మంచి భోజనము పెట్టవచ్చును కదా! అలా పట్టుకొని మన దగ్గరే ఉంచుకొంటే వానికి యమలోకానికి పోవుబాధ, అక్కడ పాపము అనుభవించు బాధలు అన్ని తప్పిపోవును కదా! ఎవరు అట్లెందుకు చేయకున్నారు? బ్రతికినపుడు పెట్టని కొడుకు చనిపోయిన తర్వాత పెట్టకపోతే ఏమి? తండ్రి ప్రాణముతో ఉన్నపుడు అతనిమీద లేని ప్రేమ దినాలనాడు ఎందుకొస్తున్నది? ఈ విధముగ అనేకమయిన ప్రశ్నలు చురుకైన తెలివి గలవారిలో ఉద్భవించుచుండును. నిజముగ ఇటువంటి ప్రశ్నలకు జవాబులున్నాయా? అని మనము యోచించవలసిన పని ఉన్నది. ఈ పద్ధతి ప్రకారము పూర్వము జ్ఞానము తెలిసిన పెద్దలు ఈ సాంప్రదాయములుంచారా? ఉంచితే ఏ ఉద్దేశ్యముతో ఉంచారు? పిండాకూడు ఎందుకు పెట్టాలి? ఎన్ని దినములకు పెట్టాలి? ఈ కార్యములో అసలు సారాంశమైన విషయమేమయినా ఉన్నదా? ఇది వాస్తవానికి ఇందూ సాంప్రదాయమా? అని యోచించితే ఏమి సమాధానము దొరుకుతుందో చూద్దాము.

పిండము అనగా శరీరమని చెప్పవచ్చును. ఎందుకనగా తల్లి గర్భములో నున్న దానిని పిండము అంటాము. తల్లిగర్భములో పిండము అడ్డము తిరిగిందను మాట కూడ వింటుంటాము. తల్లిగర్భము నుండి ప్రసవింపబడిన శరీరములో ఆత్మ చైతన్యముండి పెరిగి పెద్దదై, అనేక కర్మలను ఆచరించడము, క్రొత్తగ అనేక కర్మలను సంపాదించుకోవడము రెండు జరుగుచున్నవి. జరుగుచున్న పనిలో ఎంతకర్మ వచ్చుచున్నదని తెలియక పోయిన, అప్పటి పనిలో అనుభవించేది మాత్రము తెలియుచున్నది. అనుభవించేటపుడు కొందరు “ఇది నాకర్మ” అని తెలియకనే అంటుంటారు. గత జన్మలలో చేసుకొన్న కర్మలను అనుభవించే దానికే మనము పుట్టి ఉన్నాము క్షణక్షణము అనుభవించేదంతా కర్మనే. ఉన్న కర్మను లేకుండ అయిపోగొట్టుకోవడమును లేక అనుభవించడమును కర్మానుభవము అంటుంటాము. ఆహార పదార్థములను తిని లేకుండ చేసినట్లు కర్మలను అనుభవించి

లేకుండ చేయుచున్నాము. తినే అన్నమును అచ్చ తెలుగు భాషలో కూడు అంటాము. తినుటను కుడుచుట అంటాము. కూడు కుడచడము అనగా అన్నము తినడము అని అర్థము. అన్నమును తిని అయిపోచేసినట్లు కర్మలను కూడ అనుభవించి అయిపో చేయుచున్నాము. కావున జీవుడు ప్రతి నిత్యము కర్మల కుడుచుచున్నాడని పూర్వము అనెడివారు. మనము తిని అయిపోచేయు అన్నముతో పోల్చి కర్మను కూడు అనెడివారు. కర్మలన్నిటిని సజీవమైన శరీరమే అనుభవించవలసి ఉన్నది. కావున శరీరమును పిండమని, అనుభవించు కర్మలను కూడు అని, ఒక మనిషి యొక్క కర్మను పిండాకూడని అనెడివారు. శరీరముతో అనుభవించు కర్మను తెలిసిన పెద్దలు పిండాకూడు అనెడివారు. ఈ కాలములో కూడ సందర్భాను సారము నీ పిండాకూడు అనడము జరుగుచున్నది. నిత్యము ప్రతి జీవి అనుభవించు కర్మనే పిండాకూడు అనడము జరిగెడిది. ఇప్పటికి అప్పుడప్పుడు అది నీ కర్మ అనుటకు బదులు, నీ పిండాకూడు అని స్వయాన మేమే అనుచుందుము. కొందరు తెలియకుండిన పలుకుచునే ఉందురు.

ఒక వ్యక్తి చనిపోయిన తర్వాత బాహ్యార్థముగ పిండాకూడు పెట్టడము పూర్వము నుండి జరిగెడి సాంప్రదాయమే. కాని పూర్వము చనిపోయిన వ్యక్తులందరికి పిండాకూడు పెట్టెడివారు కారు. భగవద్గీతలో చెప్పినట్లు చనిపోయినవాడు తన జీవితములో యోగిగ ఉంటూ మోక్షాసక్తుడై ఉంటే, వాని మరణము పగలు శుక్లపక్షము ఉత్తరాయణమై సూర్యరశ్మి కల్గినపుడు జరిగియుంటే, అపుడు మరణించి నప్పటికి తిరిగి పుట్టడని, వాడు మోక్షము చెంది దేవునియందు ఐక్యమైనాడని భావించెడివారు. అటువంటివానికి కర్మ లేదని, వాడు ఇక పుట్టడని తెలుపు నిమిత్తము, కర్మతంత్రము అనుపేరుతో పిండాకూడు పెట్టడము జరిగెడిది. సజీవముతోనున్న ప్రతి జీవికి నవగ్రహముల వలననే కర్మ ఆచరణకు వచ్చుచున్నది. మోక్షము పొందిన వానికి నవగ్రహములతో సంబంధము లేకుండపోవును. బ్రతికి ఉన్నపుడు కర్మను అందించు నవగ్రహములు మోక్షము పొందిన వానికి కర్మ లేకపోవడముచే వానిని ఏమి చేయలేవు, జన్మకు తీసుకరాలేవు. అందువలన

కర్మనుండి విడువబడినవాడని తెలుపు నిమిత్తము, మోక్షము పొందిన వానికి తొమ్మిదవ దినమున కర్మ తంత్రములు చేసెడివారు.

మోక్షము పొందిన వానికి కర్మ లేదని తెలుపు నిమిత్తము, చనిపోయిన దినము నుండి సరిగ తొమ్మిదవ దినమున కర్మతో సమానమైన అన్నమును అనగా పిండాకూడని పేరు పెట్టబడిన అన్నమును, బయలు ప్రాంతములో పెట్టి జంతువులు గాని, పక్షులుగాని తినునట్లుంచి, పెట్టబడిన పిండాకూడును లేకుండ చేయుచుండెడి వారు. అలా చేయడములో పిండాకూడనబడు కర్మ ఇకలేదని బాహ్యార్థముగ తెలియబడుటకు పిండాకూడును లేకుండ చేసెడివారు. మోక్షము పొందిన వానికి పెట్టబడిన కూడును ఇతరత్ర ఏ జీవరాసులైన తినవచ్చును. ఒక కాకులే తినవలెనని చెప్పుకోవడము తప్పు. పూర్వము పెద్దలు పెట్టిన ఆచారములన్ని గాడి తప్పి అధర్మములైనట్లు, ఈ విషయము కూడ కాలగమనములో తెలియకుండ పోయి, చనిపోయిన పెద్దలు కాకుల రూపములో వచ్చి ఆహారము తిని పోవుదురనుట ఒట్టి కట్టు కథ తప్ప అందులో సత్యము లేదు. చనిపోయినవాడు తిరిగి కాకిగ రావడము అసంభవము, అసత్యము. ఈ విషయమై వేమన యోగి కూడ వ్యతిరేఖిస్తూ ఇలా అన్నాడు.

పిండములను జేసి పితరులదలపోసి
కాకులకు బెట్టు గాడ్దెలార
పియ్య తినెడు కాకి పెతరు లెట్లగయా
విశ్వదాభిరామ వినుర వేమా.

ఈ కాలములో చనిపోయిన పెద్దలను కాకులుగ పోల్చడము, ఆ కాకులకు పిండాకూడు పెట్టడమును చూచి అటువంటి వారిని గాడిదలారా అని తిట్టుచు మలము తిను కాకి పితరులెట్లగుదురని ప్రశ్నించాడు. ఈ పద్ధతి తప్పని వేమనయోగి కూడ తన పద్యములో చెప్పాడు. కర్మను సూచించు కూడును లేకుండ చేయడము పద్ధతికాని, కాకులే తినవలెననునది పద్దతికాదు. అక్కడుంచిన ఆహారమును పక్షులు

తినవచ్చు జంతువులు తినవచ్చు. ఈ పద్ధతి బయలు ప్రాంతములో ఆచరించువారికి కాగ, నది ఒడ్డున కర్మ తంత్రములు చేయువారు నదిలో కలిపెడివారు. పిండమనగా శరీరమన్నాము కదా చచ్చిన వాడు మోక్షము పొంది ఉన్నాడు. వానికిక శరీరము అవసరము లేదని, పిండాకూడని పేరు పెట్టి చేయుట మంచిదేగాని, చనిపోయిన వాడు మోక్షమునకు పోకున్నను, వాడు అజ్ఞానియైనను, వానికి కర్మతంత్రము చేయుట విడ్డూరము కాదా! నవగ్రహముల జోక్యమితని మీద ఉండదని తొమ్మిదవరోజు కర్మ తంత్రములను పూర్వము చేయగా, నేడు ఒక పద్ధతంటు లేకుండ పదకొండవరోజని కొందరు, పదవరోజని కొందరు, ఐదవరోజని కొందరు, మూడవరోజని కొందరు, అన్నిటికంటే ముఖ్యము సంవత్సర దినమని కొందరు చేయుట విచిత్రము కాదా! శరీరమనుభవించు కర్మను పిండాకూడని పేరుపెట్టి బాహ్యార్థముగ పూర్వము చేయగ, ఈనాడు పిండాకూడని సారా బ్రాందీలు, బీడీ సిగరెట్లు పెట్టడము విచిత్రము కాదా! తిరిగి జన్మ పొందని స్థితికి చేరుకొన్నాడని, మోక్షము పొందిన వానికి చేసిన విధానమును మరచి, యమలోకానికి యమభటుల చేత కొనిపోబడునని చెప్పడము అజ్ఞానము కాదా! బయలులో అయితే ఇతర జంతువులు, పక్షులు పిండాకూడును తినడము, నీటిలో అయితే జలచరములు తినడము జరిగి అక్కడ పెట్టినది లేకుండ పోవుచున్నది. శరీరమునకున్న కర్మ పోయినదని పిండాకూడు పెట్టగ, ఎవని పేరుతో పెట్టామో వాడె తిరిగి వచ్చి తింటాడనడము సమంజసమేనా!

శరీరమును పిండమని, శరీరమనుభవించు కర్మను పిండాకూడని, కర్మ శేషములేకుండ అయిపోవడము పిండాకూడు లేకుండ పోవడమని, నవగ్రహముల ఆధీనమిక లేదని తెల్పడము చనిపోయిన దినము నుండి తొమ్మిది దినములకు దినాలు చేయడమని, చేయవలసినది మోక్షము పొందిన వానికని, చేయువారు జ్ఞానము తెలిసినవారు ఎవరైన కావచ్చని పెద్దలు తెల్పియుండగ, కొడుకులే ఈ తంతు చేయవలెనని, కొడుకులచేత వంశీకుల చేత చేయించడము అజ్ఞానమే అగును. పోయినవాడు మోక్షమునకు పోయాడని తెల్పుటకు, అంతో ఇంతో జ్ఞానము

తెలిసినవారు ఈ విధానమిదియని తెల్పుచుపోతే, ఈ సాంప్రదాయము అందరికి తెలిసియుండేది. ఈ కాలములో చేయవలయుననునది ఉన్నది, కాని ఎందుకు చేయవలెను, ఎట్లు చేయవలెనను వివరము పూర్తి లేకుండ పోయినది. ఇప్పటికైన జీవితములో జ్ఞానము యోగము తెలిసి మోక్షమును పొందవలెనను ఉద్ద్యేశము కలవారు చనిపోతే, భగవద్గీతలో చెప్పినట్లు కాల సూత్రము వారికి వర్తిస్తే, అటువంటివారికి కొంత జ్ఞానము తెలిసిన బ్రాహ్మణులు చేతగాని, గురువులు అయినవారి చేతగాని, ఈ విధానము చేయించి వాడు ఇటువంటి స్థితికి చేరుకొన్నాడని బయటికి తెలియజేయవలెను. అట్లుకాక సాధారణ అజ్ఞానులకందరికి దినాలు చేయడము, పిండాకూడు పెట్టడము చేయకూడదు. చేయకపోతే వీనిపీడ మాకంటుకొనునని, తప్పనిసరిగ చేసి ఈ పీడ ఇంతటితోపోనీ అని స్నానము చేసి రావడము సాంప్రదాయ విరుద్ధమగును. పూర్వపు పెద్దలు ఈ కార్యమును పవిత్రముగ ఆచరించవలెనన్నారు గాని, అపవిత్రము పీడ పిశాచి అని చేయకూడదు. ఇంత చెప్పిన కొందరికి అనుమానము పీడిస్తు ఇది నిజమేనా, ఇప్పుడు ఇంత మందికి ఇంత పెద్దవారికి తెలియకుండునా, అనుకొంటే మేమేమి చెప్పలేము.

**928. (8) ప్రణవ మనగా నేమి?**

జ. పరమాత్మ.

**వివరము :** ప్రణవమనగా మొదటిదని, అన్నిటికంటే ముఖ్యమైనదని, సమస్తమునకు పెద్దదని ఇలా ఎన్నో అర్థములు చెప్పుకోవచ్చును. పరమాత్మయైన వాడే మొదటివాడు, ముఖ్యమైనవాడు, పెద్దవాడు. పరమాత్మయైన దానికి గుర్తుగ ఒక బీజాక్షరమును ప్రపంచములో చూపించారు. అదియే "ఓం" అనునది. ఓం ను ప్రణవమనవచ్చును. పరమాత్మ అందరికంటే మించినదని, దానిని ప్రకృతి ఏమి చేయలేదని, ప్రకృతికి నాశనము కానిదని, తెలియజేయుటకు క్షరములైన చర ప్రకృతికి బీజాక్షరములైన నమః శివాయ కు ముందు ఓం నుంచి, ఇది పంచమునకు నాశనము కానిదని పంచాక్షరి అన్నారు. పంచాక్షరి అను పేరు చాలామార్లు మనము వినుచున్నప్పటికి,

దానిని "ఓం నమః శివాయ" అను రూపముగ చూస్తున్నప్పటికి ఇది పరమాత్మ గొప్పతనమును, నాశనములేని తనమును చూపించు గుర్తని తెలియక దీనిని మంత్రముగ పోల్చుకొని జపించుచున్నారు. ఇది జపింప తగినది కాదని, ఐదు క్షరములకు అక్షరమైయున్నదని, ఐదుకు నాశనము కాని పంచాక్షరి అని గుర్తించలేక పోయారు. కొందరు తెలిసి తెలియని పెద్దలు ఇది ఐదక్షరముల మంత్రము అని అందువలన పంచాక్షరి అని పేరు వచ్చినదంటున్నారు. వారు చెప్పు మాట తప్పని, పంచాక్షరిని లెక్కించి చూచిన ఆరు అక్షరములు గలవని గమనించలేక పోయారు. భాషకు సంబంధించిన అక్షరములుగ గుర్తించుకోక, భావమునకు సంబంధించిన సూక్ష్మమైన పరమాత్మకు సంబంధించిన అర్థముతో కూడుకొన్న భావమని తెలియవలెను. ఇప్పటినుండయిన పరమాత్మను పంచాక్షరియైన ప్రణవముగ, ప్రణవమునకు భాషా గుర్తయిన 'ఓం' బీజాక్షరముగ తెలియవలసి ఉన్నది.

**929. (9) ఆది మధ్యాంత రహిత, ప్రభు, పురుషోత్తమ, పరంధామ, పరమాత్మ, ఖుదా, అవ్యక్తా, రాజా, పరబ్రహ్మ అన్నట్లు పరమాత్మను పలుకుటకు మరేదయినా పదమున్నదా? ఏది?**

జ. ఉన్నది, పెద్ద.

**వివరము :** ఆది మధ్యాంత రహిత అనగా మొదలు, నడుమ, చివర అనునది లేనివాడని అర్థము. ఇంకొక విధముగ పుట్టుక అనగా మొదలు, పెరగడము అనగా నడుమ, మరణము అనగా చివర అనునవి లేనివాడని అర్థము. దీనినే చావు పుట్టుకలు లేనివాడని ఒక్క మాటలో చెప్పవచ్చును. ఆది మధ్యాంతరహిత అనునది పేరు కాదని, దేవుని యొక్క గొప్పతనమును ఆయన యొక్క స్థితిని తెలియ చేయుచున్నదని తెలియుచున్నది. ప్రభు అనగా "భు" అనగా పుట్టినది "ప్ర" అనగా ముఖ్యమైనది, సారాంశమైనది, గొప్పది అను అర్థము గలదు. పుట్టిన వాటికంత అతీతమైనది, సృష్టికంతటికి ముఖ్యమైనది మరియు గొప్పది, సారాంశము గలదను అర్థము కలదు కావున ప్రభు అనునది కూడ పేరు కాదు.

సృష్టికంతటికి క్షరుడు అక్షరుడను పురుషులుండగ, వారిద్దరికంటే అతీతమైన, అన్యమైన, ఉత్తమమైనవాడు పరమాత్మ కావున అదే అర్థముతో పురుషోత్తమ అన్నారు. పురుషోత్తమ అనునది కూడ పేరుకాదని, ఆయన హోదాను తెలుపు పదమని తెలియవలెను. పరమాత్మకు ఒక నివాస స్థలమంటు లేదు. ఒక ఊరంటు లేని ఆయన విశ్వమంత వెలితిలేకుండ వ్యాపించి ఉన్నాడు. ఒక స్థలము ఊరు లేనివాడు కావున నివాసమునకతీతమైనవాడా అను అర్థమొచ్చునట్లు పరంధామ అన్నారు. పరంధామ అన్నది కూడ ఆయన వ్యాపకమును తెలియజేయు పదముకాని ఒక పేరు కాదు. ఆత్మ జీవాత్మలు పరమాత్మ అంశతో ఉన్నవి. జీవాత్మకంటే ఆత్మ ఎంతో గొప్పదికాగ, ఆత్మకంటే వేరైనవాడు పరమాత్మ, పర అనగ వేరని అర్థము. పరమాత్మ అనగ ఆత్మ కూడ కాక దానికంటే వేరుగనున్న వాడని అర్థము పరమాత్మ అను ఈ పదము కూడ పేరు కాదని తెలియవలెను.

ప్రపంచములోని అందరిని ఆడించు దానిని, పని చేయించు దానిని విధి లేక కర్మ అని అంటాము. ఎవడు కూడ తను స్వయముగ ఏ నిర్ణయము తీసుకోలేడు, ఏ పనిని చేయలేడు. అందరు కర్మాధీనములో ఉండి దాని ప్రకారము నడువవలసి ఉన్నది. పరమాత్మ ఒక్కడు మాత్రము కర్మాధీనములో లేడు. అందరిని ఆడించునట్లు కర్మ పరమాత్మను ఆడించలేదు. పరమాత్మ ఆధీనములో కర్మ గలదు, గాని దాని ఆధీనములో ఆయనలేడు. ఏమైన చేయవలసివస్తే పరమాత్మయే స్వయముగ నిర్ణయము తీసుకొని, తానే స్వయముగ చేయగలడు. దేనినయిన తానే ఖుదాగ చేయగలడు కావున ఇటువంటివాడని తెలుపు నిమిత్తము ఆయనను ఖుదా అన్నారు. ఖుదా అన్నది స్వయం నిర్ణయాధికారని తెలుపు పదము కాని పేరు కాదు.

పరమాత్మ కనిపించువాడు కాదు, వినిపించువాడు కాడు, ఏ ఇంద్రియము నకు తెలియని ఇంద్రియాతీతుడు. శరీరముతోనున్న వాడెవడైనగాని ఏ సాధన చేతగాని ఆయనను తెలియలేడు. యోగులకు సహితము వ్యక్తము కానివాడు. ప్రపంచమంత వ్యాపించి మనకు బయట, మనముందర, మనలోపల కూడ ఉన్న పరమాత్మ ఎవరికి ఏ విధముగ గోచరము కాని వాడు. అందువలన ఆయనను

అవ్యక్తా అన్నారు. ఈ పదము కూడ ఆయన యొక్క పద్ధతిని తెలియజేయునదే కాని నిర్ధిష్టమైన పేరు కాదు.

అందరిమీద ఆధిపత్యము కల్గిన వానిని రాజు అంటారు. అందరికంటే అన్నిటిలో గొప్పవానిని రాజు అనడమున్నది. కొంత రాజ్యముమీద అధికారము కల్గి తనేమనుకొంటే అది అమలుచేయు స్వయం అధికారమున్నవాడు రాజు. తన రాజ్యములోనున్న వారందరిలో గొప్పతనము కల్గి అందరిమీద అధికారము కల్గి అందరిని శాశించి తన అనుచరులచేత నడిపించువాడు రాజు. పరమాత్మకు ప్రపంచమే రాజ్యముగనున్నది. ఆయన అంతట వ్యాపించి అన్నిటి మీద అధికారము కల్గియున్నాడు. పరమాత్మ ప్రతి మనిషి మీద, ప్రతి జీవరాసి మీద తన ప్రకృతి ద్వార అధికారము కల్గియుండి జంత్రగాడు బొమ్మలనాడించు మాదిరి అందరిని ఆడించుచున్నాడు. ప్రపంచములో ఆయనకంటే గొప్పవాడుగాని, ఆయన ఆజ్ఞను అతిక్రమించునది గాని ఏది లేదు, కావున ఆయన అందరికి రాజు. రాజు అనుపదము ఆయన హోదాను తెలియజేయు పదమేకాని పేరు కాదు.

అన్నిటికంటే గొప్పది పరమాత్మ, పరమాత్మను మించినది సర్వజగత్తులోను, యావత్ ప్రపంచములోను, ఏదిగాని ఎవరుగాని లేరు. కావున అన్నిటికంటే పెద్దయిన పరమాత్మను పెద్ద అను పదముతో పిలిచేవారు. ఆ భావముతోనే ముగ్గురుగన్న అమ్మ మూలపు పెద్దమ్మ అన్నారు. ప్రకృతికి మూడు గుణములను సృష్టించినవాడు పరమాత్మ కావున ముగ్గురుగన్న అన్నారు. అన్నిటికి మూలమైనది ఆధారమైనది కావున మూలపు అన్నారు. అన్నిటికి పెద్దయిన పరమాత్మ ఆడదో మగదో ఎవరికి తెలియదు, కావున పరమాత్మను ఒకచోట అది, అని మరియొక చోట అతను అని పలుకుచున్నాము. అందరిని పుట్టించినదని కొందరు అమ్మ అన్నారు. అందరికి పెద్దయిన దానివలన పెద్దమ్మ అన్నారు. అట్లని ఆడదానిగ పోల్చుకుంటారేమోనని, పరమాత్మ ఆడది కాదు మగది అని తెల్పుటకు పెద్దమ్మకు మీసాలు పెట్టారు. ఇప్పటికి ఎక్కడయిన పెద్దమ్మ గుడులలో ప్రతిమకు మీసాలు

పెట్టు సాంప్రదాయమున్నది. పిలిచేది పెద్దమ్మని, కనిపించేది మూతి మీద మీసాల గుర్తులు. దీనితో పరమాత్మ ఆడదో మగదో ఎవరికి అర్థము కాదు. అలా ఏది కాదను విషయము తెలియజేయుటకు పూర్వపు పెద్దలు పెద్దమ్మకు కోరలు మీసాలు ఉంచారు. మగజాతి జంతువులకు కోరలుండుట వలన మగజాతిని తెల్పుకోరలు మీసాలు పెట్టి పెద్దమ్మ అన్నారు. దీనితో ఆడదో మగదో ఏది కాదని, ఏది కానివాడే పరమాత్మని తెలియబడుచున్నది. పూర్వము జ్ఞానము తెలిసిన పెద్దలు తమ జ్ఞానమును ఇతరులకు తెలియజేయుటకు పెద్ద అను పేరు ముఖ్యముగ ఉంచి అయ్యనో అప్పనో అర్థము కానట్లు, తల్లి తండ్రి అన్ని ఆయనే అన్నట్లు గుర్తుగ పెద్దమ్మను పెట్టారు. నేడు ఆ భావము ఏమాత్రము లేకుండ పోవడమేకాక, పెద్దమ్మకు కూడ ఆరుమంది చెల్లెండ్రను ఒక తమ్మున్ని సృష్టించి కథ అల్లి, సాధారణ దేవత క్రిందికి క్షుద్ర దేవత క్రిందికి జమకట్టారు. అక్కకున్నాయి కావున చెల్లెండ్రకు కూడ ఉండవలెనని సుంకులమ్మ, మారెమ్మ, పోలేరమ్మ, మాచమ్మ, పోచమ్మ, మైసమ్మ అనువారికి కొన్ని చోట్ల వెండి మీసాలు, కోరలు పెట్టడము కూడ ఉన్న విషయమే. వీరందరు గ్రామ దేవతలు కాగ వీరిలోనికి పెద్దమ్మను కలుపడము పొరపాటు. ఏడుమంది అక్కచెల్లెండ్రుండడము నిజమేకాని పెద్దమ్మ వీరిలోనిది కాదు. ఎల్లమ్మ అను గ్రామ దేవతను కలుపుకొంటే 1. సుంకులమ్మ, 2. మారెమ్మ, 3. ఎల్లమ్మ, 4. పోలేరమ్మ, 5. మాచమ్మ, 6.పోచమ్మ, 7. మైసమ్మ కాగ వీరి తమ్ముడు పోతులయ్య ఒక గ్రామ దేవున్ని కూడ పెట్టుకొన్నారు. వీరందరివి వాస్తవముగ పేర్లు కాగ, **'పెద్దమ్మ'** అనుపదము పేరు కాదని తెలియవలెను. అందరిమీద పెద్దరికమును తెలియచేయు పరమాత్మ గుర్తుగనున్నదని అర్థమగును. పరమాత్మ ఆడ మగకు అతీతము కావున పెద్దమ్మకు కోరలు మీసాలుంచారు. అన్ని విధముల పరమాత్మకు పెద్ద అను పదము సరిపోవునని పెద్దమ్మన్నారు. 'పురుషోత్తమ' అను పదములోఉత్తమ అనుపదము విశేషార్థమును తెలియజేయు నట్లు, పెద్దమ్మ, పెద్దన్న అనుపదములో 'పెద్ద' అనుపదము విశేషార్థమును తెలియజేయుచున్నది. కావున అన్ని లోకములకు తల్లి తండ్రి రెండు తానేయైన

పరమాత్మకు పెద్ద అని సరిపోవునని చెప్పవచ్చును. తల్లి తండ్రి అన్ని ఆయనేనని తెలియజెప్పు నిమిత్తము పెద్దకు అమ్మ అని జోడించి పెద్దమ్మ అని తల్లిని సూచిస్తూ, మీసాలు పెట్టి తండ్రిని సూచిస్తు పెద్దమ్మ అను బొమ్మను చూపారు. పెద్దమ్మకు మీసాలు పెట్టవచ్చునుగాని, సుంకులమ్మ మొదలగు గ్రామ దేవతలకు మీసాలు పెట్టకూడదు. ప్రాంతాలను బట్టి మిగత దేవతలకు పేర్లు మారుచుండవచ్చును గాని పెద్దమ్మ అనునది పేరుకాదు, కనుక పెద్దమ్మ అనుట మారక ఎచటనైన పెద్దమ్మగానే ఉన్నది.

**930. (10) చూపు రూపు ఏకమాయె అంటారు, చూపు రూపు ఏది?**

జ. చూపు మనస్సు, రూపు ఆత్మ.

**వివరము :** రూపు చూపు ఏకమాయె అను వాక్యము తత్త్వాలు అను పాటలలో కనిపిస్తుంటుంది. చూపు వివరించుకొంటే రెండు రకముల చూపులు మనకు గలవు. ఒకటి స్థూల చూపు, రెండవది సూక్ష్మ చూపు అంటాము. స్థూల చూపు కళ్లున్న వారందరికి గలదు. రెండవదైన సూక్ష్మ చూపు కూడ కొంతకు కొంత అందరికి ఉన్నదనియే చెప్పవచ్చును. కళ్లకున్న చూపును దృష్టి అంటారు. అలాగే రెండవ దృష్టి అయిన సూక్ష్మ చూపును జ్ఞానదృష్టి అంటారు. దృష్టి స్థూల కన్నుల కుండగా జ్ఞానదృష్టి జ్ఞాన నేత్రమునకున్నది. స్థూలదృష్టి రెండు కన్నుల ద్వార పారుచుండగ జ్ఞాన దృష్టి ఒక్కకన్ను ద్వార పారుచున్నది. సర్వులకు రెండు స్థూల కన్నులు, ఒకటి జ్ఞాన నేత్రము మొత్తము మూడు కన్నులు గలవు. స్థూల కన్నులకు పరిమితమైన చూపు ఉండును. స్థూల కన్నుల చూపు వయస్సు పెరుగుకొలది తగ్గిపోవు అవకాశము గలదు, కాని స్థూల చూపుని ఎవరు ఎక్కువ చేసుకోలేరు. సూక్ష్మమైన జ్ఞానపు కన్ను యొక్క చూపు సాధారణ మనుషులకు ఒకే స్థాయిగ ఉండదు. జ్ఞానదృష్టి అనబడు సూక్ష్మదృష్టి కొంత ఎక్కువ తక్కువలుగ మనుషులకుండును. సూక్ష్మదృష్టి మనస్సుకు అమరియుండుట వలన దానిని మనోదృష్టి అని కూడ అందురు. మనోదృష్టి అనబడు జ్ఞానదృష్టి గ్రుడ్డివారికి

సహితము గలదని చెప్పవచ్చును. జ్ఞానదృష్టికి పరిమితము లేదు. మనిషికి గల శ్రద్ధను బట్టి జ్ఞానదృష్టిని ఎంతయిన పెంచుకోవచ్చును. అలా శ్రద్ధతో జ్ఞానదృష్టిని పెంచుకొన్నవారు కొంతమంది గలరు. ఇపుడు ఇయ్యబడిన ప్రశ్నలకు కూడ జవాబులు సూక్ష్మదృష్టితో చెప్పవలసిందే. ఈ జ్ఞాన పరీక్షలు జ్ఞాన దృష్టి పరిమితిని లెక్కించి కొలుచునవేనని తెలియాలి. ఇటువంటి పరీక్షలలో మీ దృష్టిని లెక్కించుకొని తక్కువ ఉన్న ఇంకా పెంచుకోవలెనని తెలుపుచున్నాము. ఇంత వరకు చూపు విషయము తెలుసుకొన్నాము, ఇపుడు రూపు విషయము తెలుసుకొందాము.

చూపును దృష్టి అనియు, రూపును దృశ్యము అనియు చెప్పుట సహజమే. దృశ్యములు కూడ చూచే చూపును బట్టి రెండు రకములుగ ఉండును. దృశ్యములు కూడ స్థూలము, సూక్ష్మము అనుటలో అతిశయోక్తి లేదు. స్థూల కన్నుల దృష్టి పరిమితమన్నాము కదా! స్థూల దృష్టికి ఒక హద్దు గలదు. కన్ను ఎంతవరకు చూడగలదో అదే దాని హద్దు అని చెప్పవచ్చును. స్థూల కన్ను యొక్క చూపుకు హద్దు ఉన్నట్లు, జ్ఞాననేత్రము యొక్క జ్ఞానదృష్టికి కూడ ఒక హద్దు గలదు. సాధారణముగ ఒకడు చూచినంత దూరము మరియొకడు చూడలేకపోతే వానికి చూపు తక్కువ అంటాము. అలాగే ఒక వ్యక్తి తన జ్ఞాన దృష్టితో ఆత్మ వరకు చూడగలుగుచుండగ మరియొకడు ఆత్మ వరకు చూడలేక పోతే, చూడలేక పోయిన వానికి జ్ఞానదృష్టి తక్కువేయని చెప్పవచ్చును. వాస్తవముగ జ్ఞాన దృష్టి సంపూర్ణముగ కల్గినవాడు చివరి దృశ్యముగ ఆత్మను చూడగలుగుచున్నాడు. ఆత్మ మినహా ఎవరి దృష్టి పారదు, కావున జ్ఞానదృష్టి యొక్క హద్దు ఆత్మయని తెలియుచున్నది. చూపు యొక్క చివరి సామర్థ్యమునే రూపుగ లెక్కించవలసియున్నది. కనిపించునది రూపు లేక దృశ్యము అనవచ్చును. జ్ఞాన నేత్రము చూపు యొక్క రూపు ఆత్మ అని తెలియవలెను. మనస్సు లేక జ్ఞానదృష్టి ఆత్మ మీద లగ్నమై పోయినపుడు చూపు రూపు ఏకమాయె అన్నారు. దృశ్యము మీద ధ్యాస లగ్నము కావడమును ఏకమగుట అనవచ్చును. జ్ఞానదృష్టికి కనిపించు దృశ్యమైన ఆత్మ మీద ధ్యాసను కేంద్రీకరించి నపుడు చూపు రూపు ఏకమైనట్లేనని తెలియవలెను. దీనిని బట్టి జ్ఞానరీత్య చూపు

అనగ జ్ఞానదృష్టి అనియు, రూపు అనగా ఆత్మ దర్శనమనియు, ధ్యాసను లగ్నము చేయడమును ఆత్మతో ఏకము కావడమని అర్థమగుచున్నది.

## జ్ఞాన పరీక్ష

**కె.నరసాపురము** **తేది : 18-1-2003**

**931. (1) మనిషి పుట్టినప్పటినుండి ప్రారంభమగునది ఏది ?**

జ. ప్రారబ్ధకర్మ అనుభవము.

**వివరము :-** మనిషికాని మరి ఏ జీవరాసి కాని ప్రారబ్ధకర్మ కారణము చేతనే పుట్టుచున్నవి. మనము సంపాదించుకొన్న కర్మంతయు మన తలలోని కర్మ చక్రములో నిలువయుండును. ఆ నిలువ కర్మను సంచితకర్మ అంటున్నాము. మనిషి చనిపోయిన తర్వాత తిరిగి పుట్టవలసిన జన్మకు సంచితకర్మ నుండి కొంత కర్మ కేటాయించబడును. దానినే ప్రారబ్ధకర్మ అంటున్నాము. మనిషి పుట్టినప్పటి పుట్టుకను, చివరిలో మరణించు మరణమును నిర్ణయించునది కూడ ప్రారబ్ధకర్మయె. మనిషి పుట్టినప్పటి నుండి ప్రారబ్ధకర్మ అమలుకు వచ్చి ప్రతి చిన్న పనికి కారణమగు చున్నది. రోగములు, సుఖములు కష్టములు, బాధలు మొదలగు జీవితములోని అన్ని అనుభవములు ప్రారబ్ధకర్మను బట్టి జరుగుచున్నవి. జీవితములో మొదటి శ్వాసతోనే మొదలగునది ప్రారబ్ధకర్మ..

**932. (2) మనిషి పుట్టిన తర్వాత కొంతకాలము నుండి ప్రారంభమగునది ఏది?**

జ. ఆగామికర్మ సంపాదన.

**వివరము :-** మనిషికి లేక ఏ జీవరాసికైన నిలువయుండు కర్మను సంచితకర్మ అంటాము. సంచితకర్మ నుండి ఒక జన్మకు సరిపడునట్లు కేటాయించబడిన కర్మను ప్రారబ్ధకర్మ అంటున్నాము. ప్రారబ్ధకర్మ జీవితముతో మొదలయి ఖర్చుగుచున్నది. ప్రారబ్ధకర్మ ఖర్చుతోనే కార్యము జరుగుచున్నది. కార్యము

జరుగుపుడు ఆ కార్యముతో ఏ సంబంధము లేని జీవుడు శరీరములోని అహము చేత నేనే ఈ పనిని చేయుచున్నానని, ఈ పనికి నేనే కారణమనుకొని భావించు చున్నాడు. అట్లు తన నిజస్థితి తెలియని జీవుడు, అజ్ఞానము చేత ప్రారబ్ధకర్మను మరచి, తానే కార్యమునకు కారణమనుకోవడము వలన, జరిగిన కార్యములో క్రొత్తకర్మ వచ్చి మనిషిని అంటుకొనుచున్నది. అలా వచ్చు క్రొత్తకర్మను ఆగామికర్మ అంటున్నాము. మనిషి పుట్టినపుడు శరీరములోని సూక్ష్మమైన బుద్ధి, మనస్సు, అహము శరీరముతో పాటు లేత ప్రాయము కల్గి పనిచేయు సామర్థ్యము లేకుండుట వలన, పుట్టిన తర్వాత నాలుగు ఐదు సంవత్సరముల వరకు అహంభావము జీవునికి లేకుండట వలన, క్రొత్తకర్మ అయిన ఆగామికర్మ జీవునకు అంటుకొనదు. అందువలన మనిషి పుట్టిన తర్వాత కొంత కాలము నుండి ఆగామికర్మ ప్రారంభమగునని చెప్పవచ్చును.

**933. (3) మన చేతిలో లేనిది ఏది ?**

జ. విధి (ప్రారబ్ధము).

**వివరము :-** మన చేతిలో లేనిది ప్రారబ్ధకర్మ. దానినే విధి అంటాము. విధి అనుబడు ప్రారబ్ధకర్మ జీవిత విధానమునే నిర్ణయించును. కావున దానిని విధి అంటున్నాము. విధి ద్వారానే ప్రతిది నీకు విధించబడుచున్నది. నీవు ఏ విధముగ తినవలసినది, త్రాగవలసినది, మాట్లాడవలసినది, సుఖపడవలసినది, కష్ట పడవలసినది అన్నిటిని విధియే నిర్ణయించుచుండును. ఎవరు దేనిని స్వయముగ నిర్ణయించుకోలేరు. పైకి తాను చేయునట్లు కనిపిస్తున్నప్పటికి లోపల తనకు తెలియకుండ ప్రారబ్ధకర్మ అన్నిటికి కారణమై ఉన్నది. అందువలననే తాను తలచినట్లు జరుగవచ్చును జరుగక పోవచ్చును. ఎవరి చేతిలోను ప్రారబ్ధకర్మ లేదు. ప్రారబ్ధకర్మ చేతిలోనే అందరు గలరు.

**934. (4) మన చేతిలో ఉన్నదేది ?**

జ. ఆగామికర్మ.

**వివరము :–** మనిషి చేయు ప్రతి పనిలోను అగ్నికి వెలుతురు తగుల్కొని ఉన్నట్లు ఆగామికర్మ తగుల్కొని ఉన్నది. ప్రతి కార్యములో క్రొత్తగ వచ్చు ఆగామికర్మను మనిషి తన కర్మవరుసలోనికి చేర్చుకోవచ్చును లేక చేర్చుకోకుండ దానిని వ్యర్థము చేయవచ్చును. తనలోని సూక్ష్మ భావము చేత మనిషి ఆగామికర్మ పొందడము గాని, పొందక పోవడము గాని జరుగుచున్నది. ప్రారబ్ధకర్మలో అస్వతంత్రుడైన మనిషి, ఆగామికర్మ విషయములో స్వతంత్రుడన్న మాట. జ్ఞానముచే క్రొత్తగ పుట్టిన కర్మను తొలగించుకోవచ్చును. అజ్ఞానము చేత ఆగామికర్మను తగిలించు కోనూవచ్చును. ఇది మనిషి యొక్క జ్ఞానాజ్ఞానముల మీద ఆధారపడియుండుట వలన, జ్ఞాన అజ్ఞానములు మనిషి యొక్క ఇచ్చను బట్టి ఉండుట వలన, మన చేతిలో ఆగామికర్మను పెట్టుకోవచ్చునని చెప్పుచున్నాము. ఆగామికర్మను తల మీదికి ఎత్తుకోవచ్చు లేక క్రిందైన పారెయవచ్చు అంతా మనిషి చేతిలోని పని.

**935. (5) మనిషి జీవితములో చేతకాని దేది ?**

జ. పరమాత్మను ( దేవున్ని ) తెలుసుకోవడము.

**వివరము :–** మనిషి తన జీవితములో దైవశక్తిని సంపాదించి మహర్షి కావచ్చును. ఇంకా అధికుడై రాజర్షి, దేవర్షి, బ్రహ్మర్షి కావచ్చును. ప్రపంచ ధనమును సంపాదించి కోటీశ్వరుడని పేరుగాంచవచ్చును. దేనినైన సాధించు మనిషి తన జీవితాంతము ప్రయత్నము చేసిన పరమాత్మను తెలియలేడు. మనిషి తన జీవితములో తెలియలేని పరమాత్మను, శరీరమును వదలిన తర్వాత దేవునియందు ఐక్యమైనపుడు తెలియగలడు. అందువలన మనిషి జీవితములో చేతకాని పని దేవున్ని తెలియడమేనని చెప్పవచ్చును.

**936. (6) మనిషి జీవితములో చేతనయ్యేది ఏది ?**

జ. దైవజ్ఞానమును సంపాదించుకోవడము.

**వివరము :–** మనిషి శ్రద్ధమీద ఆధారపడి ఉన్నది జ్ఞానము. మనిషి దైవజ్ఞానమును

జీవితములో ఎంతైన సంపాదించ గలడు. ఎంత జ్ఞానియైన దేవుని యొక్క విషయములు తెలియవచ్చును గాని దేవున్ని మాత్రము తెలియలేడు. మనిషి జీవితము మొత్తము ప్రయత్నము చేసిన దేవున్ని తెలియడము చేతగాని పనియేనని చెప్పవచ్చును. తన ఇష్టప్రకారము దైవజ్ఞానమును తెలియవచ్చును.

**937. (7) శరీరములోని ఇంద్రియములకు బుద్ధికి జీవునికి మధ్యవర్తిలాగ పనిచేస్తు పిలిచినపుడు నిద్రలోనున్న వ్యక్తికి (జీవునికి) విషయము చేర్చి మేల్కొనునట్లు చేయునది ఏది ?**

జ. ఆత్మ.

**వివరము :-** శరీరములో బయటి ఇంద్రియములకు లోపలి ఇంద్రియములకు మ్ధ్యవర్తిగ పని చేయునది మనస్సని చాలామందికి తెలియును. మనసు యొక్క మధ్యవర్తిత్వము మనిషి మెలుకువలో ఉన్నపుడు మాత్రము జరుగుచుండును. మనిషి నిద్రలోనికి పోయినపుడు మనస్సు అంతరేంద్రియములకు బాహ్యేంద్రియములకు మధ్యవర్తి పని చేయక శరీరములోని బ్రహ్మనాడిలో నిక్షిప్తమై పోవును. అటువంటి నిద్ర సమయములో కూడ బయటి ఇంద్రియములు పనిచేయుచునే ఉండును. చెవుకు శబ్దము వినిపించుచునే ఉండును. లోపల మనస్సు లేని దానివలన ఆ శబ్దవిషయమును లోపలనున్న బుద్ధి గ్రహించలేదు. బుద్ధి గ్రహించలేదు కావున మిగత చిత్తమునకు, అహమునకు, జీవునకు తెలియు అవకాశమే లేదు. ఇది సాధారణముగ నిద్ర సమయములో ఉన్న స్థితి. కాని నిద్రలో కూడ లోపలనున్న బుద్ధికి బయటి ఇంద్రియవిషయములు చేరు తతంగము కూడ కలదు. ఈ వ్యవహారము చాలామందికి తెలియదు. కొన్ని అత్యవసర పరిస్థితులలో చెవిలో వినిపించు శబ్దమును, శరీరములో అంతట వ్యాపించియున్న ఆత్మ లోపల గల బుద్ధికి చేర్చును. శరీరములోని మనస్సు మెలుకువ సమయములో మాత్రము శరీరమంతటా వ్యాపించియుండి, నిద్రలో బ్రహ్మనాడి యందు చేరిపోవును. అలాగే ఆత్మ శరీరమంతట నిద్రలోను మెలుకువలోను వ్యాపించి

ఉండును. మెలుకువలో మనస్సు చేయుపనిని ఆత్మ ఏమాత్రము చేయదు. నిద్రలో మనస్సు లేని దానివలన కొన్ని ప్రత్యేక సమయములలో మాత్రము మనస్సు యొక్క పనిని తానే చేయును. అలాగని మనస్సు యొక్క అన్ని పనులు ఆత్మచేయదు. నిద్రించుచున్న వ్యక్తిని ఎవరైన పిలచినపుడు, వాని వరకు ఆ విషయము చేరదు, కావును అప్పుడు మాత్రము ఆ శబ్దమును లోపలికి చేరవేయును. అట్లే ఎవరైన నిద్రించువ్యక్తిని తట్టితే కూడ ఆ స్పర్శను బుద్ధికి తెలియజేయును. ఆత్మ ఎల్లపుడు శరీరమంత వ్యాపించియుండుట వలన కొన్ని సమయములలో మాత్రము అలా చేయగలుగు చున్నది. అత్యవసర సమయములలో ఆత్మ చేరవేసిన విషయము బుద్ధికి తెలియగ, బుద్ధి మనస్సుకు తెలియజేయుట వలన, మనస్సు వెంటనే శరీరమంత వ్యాపించి మెలుకువ కలుగజేయుచున్నది. శరీరములో నిద్రగాని, మెలుకువ గాని మనస్సును బట్టి ఉండును. పగలు శరీరమంత వ్యాపించిన మనస్సు రాత్రి బ్రహ్మనాడి చేరి నిద్రపొందుచున్నది. ఆత్మ అలాగాక ఎల్లపుడు శరీరమంత వ్యాపించి ఉన్నదని తెలియవలెను. మనస్సుకు నిద్ర అనెడి విశ్రాంతి గలదు. కాని ఆత్మకు అలాంటి విశ్రాంతి లేదు. ఆత్మకు నిద్రలేదు కాని నిద్రకంటే భిన్నమైన నిద్రలాంటి విశ్రాంతి ఒకటి కలదని చెప్పవచ్చును. అదియే బ్రహ్మయోగము. బ్రహ్మయోగము మనిషి ఆచరించడము లేదు కనుక మనో విశ్రాంతి ఉన్నట్లు మనిషికి ఆత్మవిశ్రాంతి లేదనియే చెప్పవచ్చును. నిద్ర విశ్రాంతి యొక్క సుఖమును చవిచూచిన జీవుడు, ఆత్మ విశ్రాంతిని ఒక్క మారు చవిచూస్తే, దానికంటే మించిన సుఖము లేదని తెలియగలడు. ప్రపంచములో ఎంతో తెలివి ఉపయోగిస్తున్న మనిషి తన యొక్క విషయము తాను యోచించలేక పోవుచున్నాడు. నిద్రంటే ఏమిటి ? నిద్రలో నేనేమవుచున్నానని ఆలోచించడము లేదు. నిద్రలో నాకు తెలియకుండనే పనిచేయు శక్తి ఏదని ప్రశ్నించుకోక పోవడము విడ్డూరము కాదా! ఇప్పటినుండైన నిద్రమెలుకువలను గూర్చి తన్ను తాను ప్రశ్నించుకోవలెనని కోరుచున్నాము.

**938. (8) ఆకాశము నీలివర్ణము అందులోని మేఘములు ఎరుపు నలుపు తెలుపు కనిపిస్తుంటాయి. పైన అలా నాలుగు రంగులు కనిపించడములో ఏదైన అర్థము కలదా? ఏమిటి?**

జ. జీవరాసులు నాల్గువర్ణములున్నవని అర్థము.

**వివరము :-** మన నుండి వచ్చు మాటలలోను, అలాగే కనిపించు దృశ్యములోను, ఎంతో దైవజ్ఞానము తెలియునట్లు దేవుడే పొందుపరచాడు. ఉదాహరణకు 'నీవు చీమంత లేవు' అని జీవుని గూర్చి తెలిసినట్లు, నాకర్మ అని కర్మను గూర్చి తెలిసినట్లు, అయ్యోపాపమని పాపమును గూర్చి తెలిసినట్లు, అనామకుని నోట కూడ మాట రావడము చూస్తూనే ఉంటాము. బాధ కల్గినపుడు తలను కొట్టుకోవడము, తలరాత అని చేతితో తలను చూపడము మొదలగు దృశ్యముల ద్వార కూడ మనకు ఎంతో జ్ఞానము తెలియునట్లు దేవుడే అమర్చాడు. అలాగే ఆకాశములో నాల్గురంగులు కనిపించడములో కూడ అర్థము గలదు. క్రింద భూమి మీద భగవద్గీతలో చెప్పినట్లు నాల్గు జాతుల జీవరాసులు గలవని, పై నాల్గు రంగులలో అర్థము ఇమిడి ఉన్నది. నాచేతనే తామసులు, రాజసులు, సాత్త్వికులు, యోగులను నాల్గుజాతులు సృష్ఠించబడ్డాయను దేవుని వాక్యము అందరికి గుర్తొచ్చునట్లు ఆకాశములో నాల్గురంగులు కన్పింపజేసాడు. చిరస్థాయియైన దేవుని సంబంధించినది యోగము, కావున దానికి గుర్తుగ ఎప్పటికి ఉండు నీలిరంగును శాశ్వితముగ ఆకాశములో ఉంచడము జరిగినది. చంచలమైనవి మూడు గుణములు, కావున స్థిరముగ లేకుండ మారు మూడు రంగులను పైన మేఘములలో కనబరచడము జరిగినది. చాతుర్వర్ణమైన పై రంగులవలె చాతుర్వర్ణమైన మనుష జాతులు కలవని అవియె యోగులు, సాత్త్వికులు, రాజసులు, తామసులని తెలియవలెను. నీలిరంగు యోగమును, సాత్త్వికము తెలుపును, నలుపు రాజసమును, ఎరుపు తామసమును చూచిస్తున్నవని తెలియవలెను.

**939. (9) జీవరాసులు అండజ, పిండజ, ఉద్భిజములుగ ఎందుకున్నవి?**

జ. త్రైతము తెలియజేయుటకు.

**వివరము :-** భూమి మీద ఏ జీవరాసి పుట్టిన అది మూడు ఆత్మల సంబంధము తోనే ఉండునని తెలియునట్లు జీవరాసులకు మూడువిధ జన్మలున్నవని తెలియవలెను. ప్రారబ్ధ, ఆగామి, సంచితమను మూడు కర్మలు గల జీవులు తామస రాజస సాత్త్వికమను మూడు గుణములతో జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను మూడు ఆత్మలు కల్గి పుట్టుచున్నవని తెలియునట్లు గ్రుడ్డు నుండి, పిండమునుండి, భూమినుండి మూడు విధములుగ జీవులు పుట్టునట్లు దేవుడు నిర్మించాడు. త్రైతవిధ జన్మలు త్రైతాత్మలతో కూడుకొన్నవని మానవుడు తెలియుటకే అండ, పిండ, బ్రహ్మాండములను దేవుడు సృష్ఠించాడు.

**940. (10) మనుషులకు ఆది గురువెవరు?**

జ. సూర్యుడు.

**వివరము :-** భూమి, చంద్రుడు, సూర్యుడు కొందరి లెక్కలలో దేవుళ్ళుగ ఉన్నారు. వాస్తవానికి పరమాత్మ, ఖుదా, పురుషోత్తమ, ఆది మధ్య అంత్యరహితుడైన దేవుడు తప్ప ఎవరు దేవునికి సమానులు కారు. ప్రజల లెక్కలలో ఎందరు దేవుల్లుండిన ఆ దేవుళ్లను కూడ పుట్టించిన ఆదిదేవుడైన దేవదేవుడు కలడు. ఆయనొక్కడే సృష్ఠికి అధిపతి మరియు పూజ్యనీయుడు. భగవద్గీతలో అన్ని నాయందే గలవు, అన్నిటికి నేనే అధిపతి అని దేవుడు చెప్పాడు. అంతేకాక సృష్ఠి ఆది కాలములోనే సూర్యునికి జ్ఞానము తెలియజేసానని కూడ చెప్పాడు. అసలైన దేవుని చేతనే మొదట జ్ఞానము తెలిసినవాడు సూర్యుడు, సూర్యుని ద్వార భూమి మీదగల మనుషులకు మొదట జ్ఞానము తెలిసినదని గీతయందే చెప్పబడి ఉన్నది. భూమి మీద అతి చిన్నగనున్న మనుషులకు జ్ఞానము తెలియక ముందే గ్రహములైన గోళములకు జ్ఞానము తెలియబడినది. మనిషి అజ్ఞానవశమున దేవున్ని మరచి

పోయినప్పటికి గోళములలో గల గ్రహములు దేవున్ని మరచిపోలేదు. అవి దేవుని నియమమును అనుసరించియే ప్రవర్తించుచున్నవి. అంతేకాక మీవలె మేము అండజములు కాదు, పిండజములు కాదు, ఉద్భిజములుకాదని కూడ తెలియ జేస్తున్నవి. ముఖ్యముగ ఆకాశములోని గ్రహములన్నియు గోళముగ యుండి ముఖ్యమైన జ్ఞానమును మనుషులకు తెల్పుచున్నవి. గోళమునకు ఇది మొదలని గాని, ఇది చివరని గాని ఉండదు. ఒక వృత్తాకారమును చూస్తే దానిలోని ఆది మధ్య అంత్యములుండవు. ఏ గోళమునకు కూడ ఆది మధ్య చివరలు లేవు. గోళములుగ గ్రహములన్ని ఎందుకున్నాయంటే మేము దేవుల్లము కాము, మమ్ములను తయారు చేసినవాడు ఆది మధ్యాంతరహితుడైన దేవుడని చెప్పు నిమిత్తము అలాగున్నవి. పూర్వము ఇతర దేశములలో సూర్యున్ని ఎక్కువ పూజించెడివారు. **క్రీస్తు పూర్వము ఇస్లాంకంటే పూర్వము అనేక దేశములలో గ్రహములనే దేవతలుగ పూజించెడివారు.** ఇప్పటికి సూర్యచంద్రుల్లను దేవుళ్ళుగ భారతదేశములో కూడ పూజించుట కలదు. మనుషులలోని అటువంటి భావము పోయి గ్రహములను కూడ తయారు చేసినవాడు ఈ విధముగ చివర లేకుండ ఉన్నాడని తెలియునట్లు, ఆది మధ్యాంతరహితులమైన గోళముల మీద తన విధానమును గుర్తుగ కనిపించునట్లు, మొదలు చివరలేని వానికి పేరు పెట్టుటకు వీలుకాదని తెలియునట్లు గుండ్రముగనున్న గోళములో గురుత్వాకర్షణ శక్తి కల్గి మనిషికి జ్ఞానము తెల్పు గురువు అనువాడు పుట్టాడని, గుండ్రము నుండి వచ్చిన గురువే అందరికంటే ముందు వచ్చి బోధించిన సూర్యుడని, సూర్యుడు మానవులకు ఆది గురువని, ఆదిగురువైన సూర్యుడు కూడ పరమాత్మను గురించి తన బోధలో తెలిపాడని అందరు తెలియాలి. సూర్యుడు సూర్యోదయములో గుండ్రముగ ప్రపంచములోని మానవులందరికి కనిపిస్తు దేవుడు పరిపూర్ణుడని, ఆది, మధ్య, అంత్యములు లేనివాడని అర్థమగునట్లు తన దర్శనములో అందరికి తెలియజేయుచున్నాడు. సూర్యోదయములోనే తన బోధను తెల్పు దృశ్యమును చూపుచున్నాడు. కావున సూర్యుడు ఆనాటికి ఈనాటికి మనుషులందరికి ఆది

గురువే అని చెప్పవచ్చును. భూమి మీద మనుషులైన బోధకులు ఏ జ్ఞానము చెప్పిన తాను మాత్రము ప్రతినిత్యము దినమునకు ఆదియైన ఉదయమే తన బోధను తెలియజేయు ఆది గురువు రవి అని తెలియవలెను. పూర్వము మొట్టమొదట మనుషులకు జ్ఞానము తెలిపి ఆది గురువైన సూర్యుడు, నేటికి ఉదయమే దేవుని జ్ఞానము తెల్పు ఆది గురువుగనే ఉన్నాడు. ప్రపంచములో ఎప్పటికి మనుషులకు తెలిసిన తెలియకున్నా చందమామ అందరికి మామయే, అలాగే సూర్యుడు అందరికి ఆది గురువే. సూర్యుడు తన ఉదయముతో ఎంతో గొప్ప దేవుని జ్ఞానము తెలుపుచు, అజ్ఞాన అంధకారము దేవుని జ్ఞానము వలన తొలగిపోవునన్నట్లు, తన ఉదయవెలుగుతో చీకటిని లేకుండ చేయుచున్నాడు. మనిషి ఆధ్యాత్మికచింతతో సూర్యున్ని చూస్తే ఎంతో విలువైన దైవవిషయము తెలియగలదు. అలా కాక ఆయనను ఒక దేవునిగ తలచి మ్రొక్కిన, ఎన్ని సూర్యనమస్కారములు చేసిన కొంచెమైన జ్ఞానము కలుగదు. అజ్ఞాన చీకటులు మనిషిలోపల అలాగే ఉండును. ఇప్పటినుండైన సూర్యున్ని ఆది గురువను భావముతో చూస్తే ఎంతో జ్ఞానము కల్గును.

## జ్ఞాన పరీక్ష

**బందర్లపల్లి** **16-02-2003**

**941. (1) ఈగ ఈనితే దోమ నాకిందంట ఈగ ఏది? దోమ ఏది?**

జ॥ మనస్సు, బుద్ధి.

**వివరము :-** ఈగ దోమ రెండు అండజములే, అంతేకాక ఈగకు దోమకు రెండిటికి తొండము ఉండును. అండజమైనందు వలన ఈగ ఈనదు, అలాగే దోమకు తొండముండుట వలన దోమ నాకుటకు వీలులేదు. దోమకు నాలుక లేదు, ఈగకు పిల్ల పుట్టదు, కావున ఈ ప్రశ్నకు జవాబు ప్రపంచ సంబంధముగ చెప్పుటకు అవకాశమే లేదు. ఆధ్యాత్మిక సంబంధముతోనే పోలిక కుదరవచ్చును, కావున మన దృష్టినంతటిని ప్రపంచ సంబంధము వీడి పరమాత్మ సంబంధము

వైపు త్రిప్పి చూడవలెను. ఈ ప్రశ్నలో ఈగ ద్వార పుట్టిన దానిని దోమ రుచిచూచినదని చెప్పడమే విశేషమైన సారాంశము. ఈగ ఒకే పదార్థము మీద నిలకడగ కూర్చొనదు. ఈగకు ప్రక్క నిఘా ఎక్కువగా ఉండును. పదార్థముల యొక్క వాసనలను గ్రహించి అనుభవిస్తున్న పదార్థమును వదలి ప్రక్కనున్న మరొక పదార్థము మీదికి పోవుట దాని సహజత్వము. దోమ అలాకాక ఒక వ్యక్తి మీద వ్రాలి, రక్తమును తొండముతో పీల్చను మొదలు పెడితే ఇక ప్రక్క చూపు చూడదు. కడుపు నిండిన వదలదు. కడుపు నిండిపోయిన రక్తమును పీలుస్తు విసర్జనావయవము ద్వార బయటికి కూడ వదలుచుండుట చూచియే ఉందుము. రక్తము పీల్చునపుడు ప్రక్క చూపులేనందువలన అపుడపుడు మనిషి చేతికి కూడ దోమ దొరికి పోవడము జరుగుచుండును. దీనినిబట్టి చూస్తే ఈగ చంచల మైనదని, దోమ చంచలము లేనిదని తెలియుచున్నది. ఈగ దోమ రెండు అండజము లైన ఒకే జాతివి, కావున ఈ రెండిటిని ఆధ్యాత్మిక దృష్ఠిలో శరీరములోని ఆకాశతత్త్వము వలన పుట్టిన ఒకే అంతరేంద్రియ జాతిగ పోల్చవచ్చునని తెలియు చున్నది. ఈగ చంచలమైన దృష్ఠి కలది కావున మనస్సుగను, దోమ చంచలము లేనిది కావున బుద్ధిగను పోల్చడమైనది.

మనస్సు అందించు విషయములనే బుద్ధి గ్రహించి, ఆ విషయము మీద లగ్నమై ప్రక్క ధ్యాస లేక యోచించను మొదలు పెట్టును. బుద్ధి యోచించు విషయము మనస్సు అందించినదే, కావున మనస్సు ఈనితే దోమ నాకునన్నాము. మనస్సు ద్వార ఆలోచనలు పుట్టుచు బుద్ధి ద్వార యోచింపబడుచున్నవి. అందువలన శరీరములోని చంచలమైన మనస్సును చంచలమైన ఈగగ పోల్చి, చంచలములేని బుద్ధిని చంచలము లేని దోమతో పోల్చి చెప్పడమైనది. మనస్సు బుద్ధి రెండు ఆకాశముచేత పుట్టినవి, కావున రెండిటిని గ్రుడ్డు చేత పుట్టిన వాటిగ చెప్పడమైనది. మనలోని ఈగ, దోమయైన, మనో, బుద్ధులను గమనించి విషయముల మీద వాలకుండ ఈగను, ప్రపంచ విషయముల రుచిలో మునిగి పోకుండ దోమను సోపుతుండ (అదిలిస్తుండ) వలెను. శరీరములోని జీవుడు

శ్రద్ధ అను గుడ్డతో మనో బుద్ధులను ఈగ దోమలను సోపితే యోగమను నిద్ర హాయిగవచ్చును.

**942. (2) పందికి పది పిల్లలు పుట్టాయి. కాని వాటి అరుపు ఒక్కటే, పంది ఏది ?**

జ॥ గాలి (వాయువు).

**వివరము :-** మన శరీరములోని వాయువు పది రకములుగ విభజింపబడి ఉన్నది. పంచవాయువులు ఐదు కాగ, వాటికి ఉపవాయువులు ఐదు గలవు. శరీరములోని గాలికి పుట్టినవి మొత్తము పది గాలులు, కావున పందికి పది పిల్లలు పుట్టాయి అన్నాము. వాయువు శబ్దము చేయునది, కావున గట్టిగా అరచు పందిగ వాయువును గుర్తించాము. అరుపు గల పంది పిల్లల శబ్దము అంతా ఒక్కటే కావున వాటి అరుపంతా ఒక్కటే అన్నాము. పంది పిల్లలు పదిరకములు అరచినట్లు శరీరములోని గాలి శబ్దము దశవిధనాధములుగ ఉన్నదన్నారు. ఆపదలో పందులు అరచినట్లు శరీరములోని వాయువుల శబ్దములన్ని శరీరము యొక్క ఆయుస్సు నిమిత్తమే ఉన్నవి. ముఖ్యముగ ప్రాణవాయువు లెక్కింపులో వాయువు యొక్క పాత్ర ప్రశంసనీయమైనది. శరీరము యొక్క పటుత్వము తగ్గుటకు కూడ వాయువు యొక్క పాత్ర గలదు. ఏది ఏమైన వాయువే మానవుని జీవితకాలమును కొలుచుటకు ఉపయోగపడుచున్నదని చెప్పగలము. పూర్వము శరీరము యొక్క జీవిత కాలమును నిర్ణయించునది వాయువే అనెడివారు. కాలక్రమమున వాయువు ఆయువుగ మారినది. 1) వ్యానవాయువు 2) సమానవాయువు 3) ఉదానవాయువు 4) ప్రాణవాయువు 5) అపానవాయువులు కాగ ఉపవాయువులు 1) నాగవాయువు 2) కూర్మవాయువు 3) కృకురవాయువు 4) దేవదత్త వాయువు 5) ధనంజయ వాయువు అనునవి కలవు. పదివాయువులకు మూలమైన గాలినే పంది అనడము జరిగినది.

**943. (3) అద్దములో ముఖము కనిపిస్తుంది. ముఖములో ఏది కనిపిస్తుంది ?**

జ॥ గుణ భావములు.

**వివరము :-** మనిషి తలలో 12 రకముల గుణములు గలవు. ఒక్కొక్క సమయములో ఒక్కొక్క గుణము చెలరేగడము జరుగుచుండును. 12 గుణములు ఒక్కొక్కటి 9 రకములుగ విభజింపబడి ఉన్నవి. అందువలన మొత్తము 108 గుణములుగనున్నవి. ఇందులో 12 మొదటి గుణములు మొదలుకొని రెండు మూడు భాగములువరకున్న పెద్ద గుణములు తగులుకొనినపుడు, వాటి ప్రభావము చేత ముఖములో మార్పుచెందును. ముఖములోని వర్చస్సు మార్పులు గుణములను బట్టి ఉండును. ముఖములో వచ్చు మార్పును బట్టి లేక ముఖములో ఏర్పడు మార్పును బట్టి ప్రస్తుతము తలలో ఏ గుణమున్నది చెప్పవచ్చును, అందువలన ముఖములో గుణ భావములు కనిపించునని చెప్పవచ్చును. ఉదాహరణకు కోప గుణము యొక్క 9 భాగములలో మూడు భాగముల వరకు ఏది జీవునకు ఏర్పడిన వాటి ప్రభావము ముఖము మీద కన్పించును. 9 భాగములలో మొదటి కోపము పెద్దదై, తర్వాత భాగములు ఒక దాని తర్వాత చిన్నవిగ ఉండుటవలన ముందు మూడు భాగముల ప్రభావము పైకి కనిపించును. తర్వాత చిన్నవైన ఆరు భాగముల ప్రభావము కనిపించదు. కోపము యొక్క మొదటి భాగము జీవునకు తగుల్కొనినపుడు ముఖము చాలా రౌద్రముగ కనిపించును. తర్వాత భాగమునకు కొంత తక్కువ, ఆ తర్వాత భాగమునకు మరికొంత తక్కువ కనిపిస్తు మిగత భాగములకు అంతగ కనిపించకుండ పోవును. అందువలన ఒక మనిషి కోపము చెందినపుడు వాని ముఖవర్చస్సును బట్టి వీనికి చాలా కోపమొచ్చినదని, కొంత కోపమొచ్చినదని, కొద్దిగ కోపమొచ్చినదని అంటుంటాము. చిన్న కోపము బయటికి కనిపించదు, కావున దానిని గుర్తించలేము. అద్దములో ముఖము కనిపించినట్లు ముఖములో గుణముల భావములు కనిపించుట సత్యమైన మాట

**944. (4) "కంచుమ్రోగునట్లు కనకము మ్రోగునా" అన్నారు. కంచు ఏది? కనకమేది ?**

జు॥ అజ్ఞానము. జ్ఞానము.

**వివరము :-** ఈ విషయమే వేమన యోగి ఒక పద్యరూపములో కూడ చెప్పాడు. ఆపద్యమేమనగా :

అల్పుడెపుడు పల్కు ఆడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను
కంచు మ్రోగినట్లు కనకంబు మ్రోగునా
విశ్వధాభి రామ వినురవేమ.

ఈ పద్యములో జ్ఞాని అజ్ఞానుల విషయము చెప్పడము జరిగినది. అజ్ఞానమును గురించి మాట్లాడు వారు అజ్ఞానులే అగుదురు. అలాగే జ్ఞానమును గురించి మాట్లడు వారు జ్ఞానులే అగుదురు. ప్రస్తుత కాలములో అజ్ఞాన విషయములు మాట్లడు వారు తప్ప జ్ఞాన విషయములు మాట్లడు వారు మచ్చుకైన కనిపించరు. జ్ఞాన విషయములు మాట్లడు వారు జిల్లాకొకరు కనిపించుట కూడ అరుదేనని చెప్పవచ్చును. లోహములలో కంచులోహమును కొట్టితే ఎక్కువ శబ్దము చేయుచు ప్రక్కనున్న వందమంది వినునట్లు చేయును. అదే విధముగ బంగారును కొట్టితే ప్రక్కనున్న ఒక్కనికి కూడ వినిపించు శబ్దము చేయలేదు. బంగారును కంచుతో పోల్చి చూచితే బంగారు ఎంతో గొప్ప విలువైనది. విలువైన బంగారు శబ్దము చేయడములో, విలువ తక్కువైన కంచుకంటే చాలాతక్కువ. అలాగే ప్రపంచములో పవిత్రమైనది, దానితో సమానమైనదేది లేని జ్ఞానము మనుషులను తనవైపు ఆకర్షించలేకున్నది. పవిత్రత లేనిదైన అజ్ఞానము ప్రజలనందరిని తనవైపు లాగుకొనుచున్నది. జ్ఞాని మాట్లాడు జ్ఞానముకంటే, అజ్ఞాని మాట్లాడు అజ్ఞానమే గొప్పగ కనిపించడము సహజమైపోయినది. ఉదాహరణకు ఒక దేవాలయములో సాయంకాలము జ్ఞానమును గురించి చెప్పబడును, చివరిలో

ప్రసాదము కూడ ఇవ్వబడును, అని చెప్పినప్పటికి జ్ఞానము వినేదానికి పట్టుమని పదిమంది కూడరారు. ఒకవేళ వచ్చిన ముసలి ముతక తప్ప మిగతవారుండరు. వచ్చిన వారు విన్న విషయమును అర్థము చేసుకోలేని తలమాంద్యము కలవారే ఉందురు. వయసు మళ్లిన వారి మెదడు బలహీనమై ఉండును. యువకులు గాని, మెదడు గ్రహించు స్థోమత కల్గినవారు గాని వచ్చియుండరు. అదే ఒక సినిమా సాయంకాలము క్రొత్తగా వచ్చిందంటే వందలతో ప్రయాణమై పోతారు. టికెట్లు దొరకకుండిన, అంగీలు చించుకొనియైన, సినిమా చూచిరావలెననునది వారి ఉద్దేశము. సినిమాకు యువకులే కాక ముసలివారు కూడ పోవడము చూస్తూనే ఉన్నాము. సినిమాకు పోతే జేబులో డబ్బులు కూడ పోక తప్పదు. అదే గుడి దగ్గరుకు వస్తే నీది పోకున్న ప్రసాదమైన దొరుకుతుంది. తల కెక్కించుకుంటే జ్ఞానము దొరుకుతుంది. జ్ఞాన లాభము ప్రసాదలాభమున్న జ్ఞానబోధలను వదలి డబ్బులు పోగొట్టుకొను సినిమాకు పోవడము చూస్తే 'కంచుమ్రోగినట్లు కనకంబు మ్రోగునా' అన్నట్లుంది కదా!

## 945. (5) మనిషికి ఆకలి దేనిద్వార దేనికి తెలుస్తుంది ?

జ॥ ఆత్మ ద్వార బుద్ధికి తెలుస్తుంది.

**వివరము :-** బయటి జ్ఞానేంద్రియ విషయములు లోపలి బుద్ధికి, లోపల చిత్తము చెప్పిన విషయములు బయటి కర్మేంద్రియములకు తెలియజేయడము మనస్సు యొక్క పని. బయటి విషయములు లోపలికి చేర్చడము లోపలి విషయములు బయటికి చేర్చడము మనస్సు యొక్క పని అని సులభముగ చెప్పవచ్చును. కాని లోపలి విషయములు లోపలికి చేర్చునది మనస్సు కాదు. లోపలి విషయములను లోపలికి చేర్చి జీవుని అనుభవింపజేయునది శరీరములో గల ఆత్మయే. ఆకలి బాధగాని, రోగముల బాధలైనగాని, కడుపు నొప్పి, కాలు నొప్పి, తలనొప్పిని గాని, తెలియజేయునది శరీరమంత వ్యాపించిన ఆత్మయేనని తెలియాలి. శరీర ఉపరితలము యొక్క ఐదు జ్ఞానేంద్రియముల విషయములను

మాత్రమే మనస్సు తీసుకపోగలదు. శరీర అంతరములోనున్న దేనిని గాని మనస్సు తెలియలేదు. అలా తెలిసియుంటే ఏకముగ శరీరములోని ఆత్మనే తెలియవచ్చును. శరీరములోని అన్ని విషయములను తెలియవచ్చును. శరీరము లోని బాధలను గాని, సుఖములను గాని తెలియవచ్చును. బుద్ధి రహస్యమును, చిత్తము యొక్క నిర్ణయాధికారమును తెలియలేక పోవడమునకు కారణము మనస్సుకు వాటి విషయము తెలియదు. శరీరములోపలి విషయములన్నిటిని ఒక ఆత్మ తప్ప మిగత దేనికి తెలియదు. అందువలననే మనిషి ప్రయత్నము చేసి మనస్సుకు లోపలి విషయములను తెలుసుకొనునట్లు అలవాటు చేయడమే యోగమని కొందరంటున్నారు. మనస్సుకు అభ్యాసము చేసి లోపలి విషయము లందు లగ్నము చేయడము బ్రహ్మయోగము అంటున్నాము. మనస్సుకు అలవాటు చేయనిది లోపలి విషయములేవో తెలియలేదు. లోపలి విషయములను బుద్ధికి చేర్చునది ఆత్మయేనని, బయటి విషయములను లోపలికి చేర్చునది మనస్సని తెలియవలెను.

**946. (6) నీవు గోరుముద్దలు తిన్నావా లేదా?**

జు॥ తిన్నాను.

**వివరము :- 'ప్రబోధ సేవా సమితి'** లో సభ్యులుగానున్నవారంత గోరుముద్దలు తిన్నట్లే లెక్క. ఎందుకనగా గోరుముద్దలనబడు జ్ఞానముయొక్క రుచి వారు చూచినట్లే. కనుక జ్ఞానమును తెలియుచున్న వారంత గోరుముద్దలు తినుచున్నట్లే. గోరుముద్దలు అనగ జ్ఞానమని తెలియాలి. చిన్నపుడు కన్నతల్లి ఆహారమును ముద్దలుగ తినిపిస్తుంది. అన్నమును చిన్నచిన్న ముద్దలుగ తినిపించడము చూస్తే అవి వేలి ముద్దలేగాని, గోరుముద్దలు కావని తెలియాలి. తల్లి వేల్లతో తినిపించునది ఆహారమే. అదే విధముగ గురువువద్ద క్రొత్త జన్మ తీసుకొన్నవానికి గురువు గోరుముద్దలు తినిపించడము జరుగును. గోరుముద్దలుగ ఆహారమును గురువు తినిపించడు. గోరుముద్దలుగ జ్ఞానమునే బుద్ధికి తినిపించడము జరుగుచున్నది.

ఆహారమును తల్లి వేలి ముద్దలుగ కడుపుకు తినిపిస్తే, గురువు జ్ఞానమును గోరుముద్దలుగ తలకు తినిపించును లేక నేర్పించును. జ్ఞానమును నోటితో చెప్పునుగాని గోరుముద్దలనడమేమిటని ప్రశ్నరాగలదు. దానికి సమాధానము ఏమనగా! వేలికి మూడు గెనుపులుండి, అవి మూడు గుణములుగ గుర్తించబడి ఉన్నవి. అందువలన వేలిముద్దలనగ మూడు గుణములతో కూడిన ప్రపంచ జ్ఞానమని తెలియాలి. అట్లే వేలికి పూర్తి చివరిలో గోరు ఉండును. గోరు జ్ఞానము, యోగము, మోక్షమునకు గుర్తుగనున్నది. గోరులోని చంద్రబింబ ఆకారము జ్ఞానముగను, మిగత గోరు యోగముగను, చివర నొప్పి లేని గోరు మోక్షముగను గుర్తించబడియున్న విషయము అందరికి తెలుసును. అందువలన గురువు చెప్పు దైవ జ్ఞానమును గోరుముద్దలుగ చెప్పడమైనది. **ప్రబోధ సేవాసమితి** వారు జ్ఞానమును తెలియుచున్నారు, కావున గోరుముద్దలు తినుచున్నవారేనని చెప్పవచ్చును. ఒకవేళ మీరు ప్రతిదినము వేలిముద్దలు తినుచున్నప్పటికి, ఇప్పటి వరకు గోరుముద్దలు తినకపోతే ఇప్పటినుండయిన, వారమునకొకమారయిన, గోరుముద్దలు తినవలెనని తెలియజేయుచున్నాము.

**947. (7) శరీరమునకు గుడ్డనుచుట్టితే అందము ఏర్పడును, అలాగే శరీరములోపల ----------కు----------ను చుట్టితే --------- అనునది ఏర్పడును?**

జ॥ మనస్సుకు, యోగమును చుట్టితే జ్ఞానయజ్ఞము అనునది ఏర్పడును.

**వివరము :-** శరీరమునకు గుడ్డను చుట్టితే అందము ఏర్పడుట సహజమే. అలాగే శరీరములోపల **మనస్సు** కు **యోగము** ను చుట్టితే **జ్ఞానయజ్ఞము** అనునది ఏర్పడును. ఈవిషయములో చాలామందికి చాలా ఊహలు వచ్చియుండవచ్చును. వారి ఊహలలో ముఖ్యమైనది జీవాత్మకు ఆత్మను చుట్టితే మోక్షమనునది ఏర్పడునని

చెప్పుట గలదు. అలాగ జీవాత్మకు ఆత్మను చుట్టినప్పటికి వెంటనే మోక్షము రాదు. జీవాత్మకు ఆత్మను చుట్టితే యోగమే అగునని మరువకూడదు. అదియు లోతుగ యోచించినట్లయితే జీవాత్మకు ఆత్మను చుట్టడము జరుగదు, మనస్సుకు యోగమనునది చుట్టవచ్చును. మనస్సును యోగమను తాడుచేచుట్టి కదలక కట్టివేయవచ్చును. మనసును కదలక కట్టివేసినపుడు జ్ఞానయజ్ఞము ఏర్పడును.

**948. (8) హారములో వెదకితే దారమును చూడవచ్చును. శరీరములో శోధించితే ఆత్మను తెలియవచ్చును నడి ఊరిలో ఉన్న బొడ్డురాయిలో వెదకితే ఏది గోచరించును?**

జ॥ పరమాత్మ అర్థము. ( పరమాత్మ గుర్తింపు ).

**వివరము :-** పూర్వ కాలము ఒక ఊరును నిర్మించునపుడు మొదట ఒక బొడ్డురాయిని పాతి పెట్టి దాని చుట్టు ఊరును నిర్మించుకొనెడివారు. ఎటు చూచిన ఊరికి మధ్య ఉండునట్లు బొడ్రాయిని ఉంచెడివారు. అలాగుంచడములో పూర్వికుల ఉద్దేశ్యము ఈవిధముగ ఉండెడిది. సర్వ ప్రపంచమునకు మూలమైనవాడు మరియు ఇరుసులాంటివాడు పరమాత్మయని, పరమాత్మను ఆధారము చేసుకొని ప్రకృతి పరిభ్రమించుచున్నదని వారి ఉద్దేశ్యము. ఆ ఉద్దేశ్యము ప్రకారమే బొడ్రాయిని మధ్యలో ఉంచి, దానిని పరమాత్మగ భావించి, ఊరును ప్రపంచముగ భావించి కట్టెడివారు. మనిషికి మధ్యలో బొడ్డు కలదు. బొడ్డు ఆధారముతోనే తల్లి కడుపులో శిశువు పెరుగుట జరుగుచున్నది. శరీరము మొదట తయారగుటకు బొడ్డుయే మూలాధారము. ప్రపంచమునకు మూలాధారము పరమాత్మయే. కనుక ఊరిమధ్యలో పాతి ఉంచిన రాయికి బొడ్డురాయి అని పేరు పెట్టడము జరిగినది. బొడ్డురాయి భూమిలోనికి సగము పాతి, సగము పైకి కనిపించునట్లు పెట్టబడి ఉండును. బొడ్రాయి ఈశ్వరలింగము యొక్క ఆకారము కల్గి ఉండును. గుడిలోని ఈశ్వరలింగము పాణిమట్టముతో సహా ఉండును. నడి ఊరిలోని బొడ్రాయి పాణిమట్టము లేని ఈశ్వరలింగముగ కనిపించును. పాణిమట్టము లేని దాని

వలన భూమిలోనికి పూడ్చిన గుండ్రని రాయిలాగ కనిపిస్తుండును. బొడ్రాయి ప్రపంచమునకు ఆధారమైన పరమాత్మను తెలియజేయు గుర్తుగనున్నది. కనుక దానిని పురుషుడని తెలియునట్లు పోతులయ్య అనడము కూడ జరిగినది. పోతులయ్య అనగా పురుషోత్తముడని అర్థము. సర్వప్రపంచమునకు సృష్ఠికర్త అయిన దానివలన ఊరుకంటే ముందే బొడ్రాయినుంచి, తర్వాత ఊరును నిర్మించెడివారు. ఊరికాధారమైనది, ఊరికి మూలము మరియు బొడ్డులాంటిది, కావున దానిని బొడ్రాయి అనడము జరిగినది. ఊరంతయూ ప్రపంచమని, మధ్యన రాయి పురుషుడైన పరమాత్మ అని తెలియునట్లు మరియు పురుషోత్తముడని తెలియునట్లు, బొడ్రాయిని పోతులయ్య అనడము కూడ జరిగినది. అందువలన బొడ్రాయిలో పోతులయ్య అయిన పరమాత్మ భావము కనిపిస్తుందని చెప్పవచ్చును.

## 949. (9) నీకు శోభనమైనదా? శోభనమంటే ఏది?

జ॥ జ్ఞానము ప్రకారము నడిచివానికి శోభనము అయినట్లు, నడువనివానికి కానట్లు.

**వివరము :-** పెళ్ళి, శోభనము అన్నియు ఇందూసాంప్రదాయములు. పెళ్లి దినము తలంబరములు స్త్రీ పురుషులు తలలమీద పోసుకోవడము తెలిసిన విషయమే. తలంబరముల అర్థము ఆచరించినపుడే నిజముగ భార్యభర్తలగుదురని వాటి వివరములో తెలియజేయడము కూడ జరిగినది. తలంబరముల అర్థము ప్రకారము భార్యభర్తలు ఒకరికొకరు జ్ఞానమును తెలుపుకొనక పోతే, వారిది దాంపత్య జీవితము కాదని, అది అక్రమ సంబంధమేనని ఇంతకు ముందే తెలియజేసాము. సాంప్రదాయ పద్ధతి ప్రకారము శోభనము కూడ కలదు. దానిని వివరముగ చూచితే శోభిల్లుట అనగా ప్రకాశించుట అని అర్థము, శోభ అనగ ప్రకాశము లేక వెలుగు అని అర్థము. ప్రకాశముగాని లేక వెలుగు కాని ఒక అగ్ని ద్వారానే కల్గును. జ్ఞానమను అగ్ని ఎపుడు శరీరములో ప్రజ్వరిల్లుచున్నదో అపుడు శోభనము జరుగును. భార్య భర్తలు శారీరకముగ కలియడము శోభనమైతే, ఆ

కార్యమును ఎల్లపుడు శోభనమనే అనాలి. అలాకాకుండ మొదటి కలయికనే శోభనము అనడములో అర్థమేమిటని, యోచించిన, స్త్రీ పురుషుల మొదటి కలయిక చాలా ప్రాముఖ్యమైనదిగ ఆధ్యాత్మికము ప్రకారము చెప్పబడినది. పెళ్లి కార్యములో ఇందూసాంప్రదాయముల ప్రకారము అనేక తంతుకార్యములకు అర్థములుండుట తెలిసిన విషయమే. పెళ్లి అరుందతి నక్షత్ర దర్శనముతో ముగియగ వారి జీవితములు శోభనముతో ప్రారంభమగును. స్త్రీ పురుషులిద్దరికి శోభనమునే వారి ఆధ్యాత్మిక జీవన ప్రారంభ దినమని కూడ అందురు. అందువలనే ఆ దినమును మొదటి దినమని, మొదటిరాత్రని చెప్పుకొను చుందురు. శోభన దినమనగ ప్రకాశదినమని అర్థము. జీవితములో అంతవరకు లేని జ్ఞానాగ్ని ఆ దినము నుండి ప్రజ్వరిల్లును, కావున దానిని శోభనము అంటున్నాము. పెళ్లి కార్యములో అంతవరకు తెలుసుకొన్న సాంప్రదాయములకన్నిటికి జ్ఞానాగ్నియే ముఖ్యము. భార్యభర్తలు కలసి ఒక్క కుటుంబముగ ప్రారంభించు దినము నుండి జరుగు కార్యములన్నిటిని యజ్ఞ కర్మగ చేయవలెనని తెలుపు దినమే శోభనదినము లేక ప్రకాశదినము అందురు. అర్థము తెలియని ఈ కాలములో శోభనము అంటే వేరుభావము కల్గియున్నారు. అర్థము తెలియక శోభనమునకు పవిత్ర భావము లేకుండ పోయినది. జ్ఞానాగ్నిని రగిలించుకొను మొదటి దినము జీవిత సాఫల్యతకే మొదటిదినము. జ్ఞానాగ్నిని ఇంతవరకు రగిలించుకొనక పోతే ఇప్పటివరకు మీకు శోభనముకానట్లే. ఒకవేళ ఇంతవరకు మీరు శోభనము చేసుకోనట్లయితే మీకు వయస్సు ఎంతవుండిన ఫరవాలేదు, ఈ వయసులో నాకు శోభనమా! అనుకోక శోభనము చేసుకోండి. శోభనము యొక్క అర్థము, పద్ధతి, ఇతరులకు కూడ తెలిపి అది జీవితములో ముఖ్యమైన దినమని తెలియజేయండి. జ్ఞానాగ్నిని ప్రారంభించు దినము కావున ఆ దినమును భార్యభర్తలు పండుగలాగ ప్రారంభించవలెనను ఉద్దేశ్యముతోనే చేసుకొనెడి వారు. మనిషి జీవితములో పెళ్లికార్యము మరువలేని పండుగ కార్యము కాగా, రెండవ పండుగలాంటిది శోభనమని తెలియాలి. జీవితములో మరువలేని దినములకు జ్ఞానపరముగ పవిత్ర

భావము జోడిస్తే ఎంతో గంభీర అర్థముతో నిండిపోవును. మన జీవితములకు సాఫల్యమేర్పడును.

**950. (10) వెన్నతో పెట్టిన విద్య అంటారు, అటువంటిది నీకేదయిన ఉన్నదా?**

జ॥ ఉన్నది.

**వివరము :-** భూమి మీద చాలా మందికి చాలా విద్యలుంటాయి. వాటిలో వెన్నతో పెట్టిన విద్య ఉందో లేదో తెలియదు. బహుశ అందరికి పప్పుతో చారుతో పెట్టిన విద్యలుంటాయి. కాని వెన్నతో పెట్టిన విద్య బహు అరుదుగ ఉండును. అసలుకు వెన్నతో పెట్టిన విద్య అంటే ఏమిటో తెలుసా! ఇపుడు తెలుసుకొందాము. వెన్న చంద్రునిలాగ తెల్లగ ఉండును. చంద్రుడు జ్ఞానచిహ్నమని ముందే తెలుసుకొన్నాము చంద్రబింబములాంటి వెన్నముద్దను కృష్ణుడు తన చేతిలో చిన్నపుడే పట్టుకొన్నాడని చూపించారు.. వెన్నతో పెట్టిన విద్య అనగా జ్ఞానమేనని తెలియాలి. దైవజ్ఞానము ఎవరికుండునో వారికి వెన్నతో పెట్టిన విద్య కలదని చెప్పవచ్చును. దైవజ్ఞానము లేని వారికి వెన్నతో పెట్టిన విద్యలేదని చెప్పవచ్చును. జ్ఞానముతప్ప మిగత విద్యలెన్ని ఉండినప్పటికి అవి అన్నియు పప్పుచారు విద్యలేనని అవి అనేక ప్రపంచ విషయములను తెలుపునవేనని తెలియాలి. ఇక్కడ ప్రబోధ సేవా సమితిలో ఉన్నవారంత జ్ఞానము తెలుసుకొను వారే, కనుక వారికి వెన్నతో పెట్టిన విద్య కలదనియో, లేక ఆవిద్యను నేర్చుచున్నారనియో చెప్పవచ్చును. ప్రస్తుత కాలములో వెన్నతో పెట్టిన విద్య అనగ అర్థము మారి పోయి ఒక విద్యలో ప్రావీణ్యత చెందిన వానికి ఆవిద్యను వానికి, వెన్నతో పెట్టిన విద్య అంటున్నారు. ప్రతి మనిషి ఏదో ఒక పనిలో అనగ విద్యలో ప్రావీణ్యత గడించియుండవచ్చును. అతనికున్న విద్య ప్రపంచములో బ్రతుకు తెరువుకు ఉపయోగపడునది, కావున కూటి కొరకు కోటి విద్యలన్న సామెత ప్రకారము, జ్ఞానములేని ఏ విద్య అయిన అవి పప్పుచారు విద్యలేనని తెలియాలి. జ్ఞానవిద్య మాత్రము దైవమార్గములో బ్రతుకుటకు ఉపయోగపడును. కావున దానిని మాత్రము వెన్నతో పెట్టిన విద్య

అనడము జరిగినది. ఇంత వరకు నీకున్న విద్యలు కూటికొరకైనవో, దైవమార్గము కొరకై ఉన్నవో చూచుకొనుము. ఒకవేళ నీకు పప్పుచారు విద్యలలో ఎంత ప్రావీణ్యత ఉండిన ఏమి ప్రయోజనము లేదని తలచి, ఇప్పటినుండైన వెన్న పాలు విద్యలు నేర్చుకుందాము. జ్ఞానమును సూచించు పాలు వెన్నను శ్రీకృష్ణుడు చిన్నపుడే దొంగలించి వాటికి ప్రాధాన్యత చూపినట్లు, మనము జ్ఞానము యోగములను ఇతరులవద్దనుండైన నేర్చుకుందాము.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొడమల** **తేది-04-05-2004**

**951. (1) భగవద్గీతకు ఆ పేరు ఏ కాలమునుండి వచ్చినది?**

జ॥ ద్వాపరయుగము నుండి వచ్చినది.

**వివరము :-** భగవంతుడు చెప్పిన బోధను భగవద్గీత అంటున్నాము. శ్రీకృష్ణుడు ద్వాపరయుగము యొక్క అంత్యములో చెప్పిన, దానిని భగవద్గీత అనినప్పటికి, ఆ బోధ అంతయు సృష్ఠి ఆదిలోనే చెప్పబడి ఉన్నది. సృష్ఠి ఆదిలో చెప్పినది, ద్వాపరయుగములో చెప్పినది రెండు ఒకటే అయినప్పటికి సృష్ఠి ఆదిలో భగవంతుని చేత చెప్పబడలేదు. స్వయముగ పరమాత్మయే సూర్యునునకు తెలియజెప్పినది. శరీరదారియై చెప్పినది కాదు, కనుక ఆనాడు దేవుడు తెలిపిన జ్ఞానమునకు భగవద్గీత అని పేరు రాలేదు. ద్వాపరయుగములో దేవుడు శరీరదారియై చెప్పిన జ్ఞానమును భగవద్గీత అన్నారు. దేవుని అంశ శరీరదారియైనపుడు భగవంతుడని పేరు కల్గుట వలన, ద్వాపరయుగములో తెలియజేసిన దానిని భగవద్గీత అన్నారు.

**952. (2) వేదముల పేరు భగవద్గీతలో చెప్పారు. వేదములు గీతకంటే ముందునుండి ఉన్నాయా? లేక తర్వాత వచ్చాయా?**

జ॥ గీత తర్వాత వచ్చాయి.

**వివరము :-** వేదములు సృష్ఠి ఆదిలో లేవు. సృష్ఠి తర్వాత కొంత కాలమునకు

వేదములు ఏర్పడినవి. సృష్ఠి మొదలులోనే జ్ఞానమును సూర్యునకు పరమాత్మ తెలియజేశాడు. అందువలన మొదట పుట్టినది దైవజ్ఞానమని చెప్పవచ్చును. జ్ఞానము తర్వాత కొంతకాలమునకు వేదములు పుట్టుకొచ్చినవి. **జ్ఞానము దైవరచితమైనది కాగ, వేదములు మానవ రచితమైనవి.** మానవజాతి వృద్ధి అయిన తర్వాత కొంత కాలమునకు, కృతయుగములోనే మానవుని గుణముల విషయము లతో నిండిన వేదములుద్భవించినవి. అందువలన గీతయందు 'త్రై గుణ్య విషయా వేదా' అని చెప్పబడినది. దేవుని నుండి పుట్టినది గీత, గుణముల నుండి పుట్టినది వేదమని తెలియాలి. సృష్ఠి మొదటిలోనే శరీర రహిత, గుణరహిత దైవమునుండి పుట్టినది గీత జ్ఞానము. శరీర సహిత, గుణ సహిత మానవుని నుండి పుట్టినది వేదము.

**953. (3) దేవునిపట్ల దూషణ, భూషణ, తిరస్కారులని ఇప్పటి మానవులలో ఎవరిని అనవచ్చును?**

జ॥ నాస్తికులు, ఆస్తికులు, హేతువాదులను అనవచ్చును.

**వివరము :–** దూషణ, భూషణ తిరస్కారులనుటలో కొంత అర్థము గలదు. దూషణులనగా దేవుడు దేవుని విషయమంటే కోపగించుకొని దూషించువారని అర్థము. ఇటువంటివారు దేవుడను భయము ఏమాత్రములేకుందురు. దేవుడున్నాడని తెలిసి కూడ దేవునికి విలువివ్వక దూషించువారిని దూషణులన వచ్చును. అలాగే భూషణులనగా! దేవున్ని, దేవుని విషయము వింటూనే సంతోషించి దేవున్ని కీర్తించువారని అర్థము. ఇటువంటివారు దేవునికి ఎంతో విలువనిచ్చు చుందురు. దేవుని విషయమును, దేవున్ని గొప్పగ చెప్పుకొనుచు, దేవుని పట్ల విశ్వాసము వినయము కల్గిన వారిని భూషణులని అనవచ్చును. అలాగే తిరస్కారు లనగా దేవున్ని దేవుని విషయమును తిరస్కరించువారని అర్థము. వీరు దేవుడున్నా డని చెప్పరు మరియు లేదని చెప్పారు. వీరు దూషణులు కాక భూషణులు కారు. దేవుడు హేతుబద్ధముగ ఉంటే ఉండాడంటాము, హేతుబద్ధముగ లేకపోతే లేదని అంటాము అని మాట్లాడుదురు. వీరు దూషణ భూషణులకు మధ్యనగలవారని

చెప్పవచ్చును. దైవదూషణులను నాస్తికులని, దైవ భూషణులను ఆస్తికులని, తిరస్కారులను హేతువాదులని కూడ చెప్పవచ్చును.

**954. (4) అభిమానము, అవమానము, అనుమానము అనగానేమి? వాటిని దేవుని పట్ల ఎవరు చూపుచున్నారు.**

జ॥ భూషణ, దూషణ, తిరస్కారమనవచ్చును. ఆస్తికులు, నాస్తికులు, హేతువాదులు చూపుచున్నారు.

**వివరము :-** మానము అను మాటకు అభి, అవ, అను పదములను కలిపితే అభిమానము, అవమానము, అనుమానము అను పదములు ఏర్పడుచున్నవి. మానము అనగ మనిషికున్న విలువ అని అర్థము. అలాగే మనిషి దేవుని పట్ల చూపే విలువను కూడ చెప్పవచ్చును. ఒక మనిషికున్న విలువను గుర్తించి, సమానముగ లేక ఎక్కువగ గౌరవించడమును అభిమానించడము అంటాము. అలాగే ఒక మనిషికున్న విలువను తక్కువగ గుర్తించి, గౌరవించక పోవడము లేక తక్కువ గౌరవించడమును అవమానించుట అంటాము. అలాగే ఒక మనిషియొక్క విలువను ఏమాత్రము గుర్తించక, ఎటు తేల్చలేక పోవడము వలన, గౌరవించక అగౌర పరచకుండుట అనుమానించడము అంటాము. మనిషియొక్క విలువ లేక గౌరవము పట్ల అవమానించువారిని, అభిమానించువారిని, అనుమానించువారిని దూషణ, భూషణ, తిరస్కారులని అనవచ్చును. అదే విషయమును దేవుని పట్ల కూడ లెక్కించవచ్చును. అటువంటి వారినే నాస్తికులు, ఆస్తికులు, హేతువాదులని చెప్పవచ్చును.

**955. (5) ద్వాపరయుగములో ఆచరణ కల్గిన మహర్షులు, ఋషులు, వ్యాసుడు మొదలైన మునులు, తపస్వికులు ఎందరో గలరు. అందరు ఉన్నప్పటికి ఆనాడు ధర్మమునకు ముప్పు ఏర్పడినదని శ్రీకృష్ణుడు చెప్పిన మాట సత్యమా? అసత్యమా?**

జ॥ సత్యము.

**వివరము :-** ద్వాపరయుగ అంత్యములో వ్యాసుడు పదునెనిమిది పురాణములను వ్రాసి ప్రచారము చేయడము వలనను, వాటినే సత్యమని చాలామంది నమ్మడము వలనను, ఋషులందరు యజ్ఞయాగాదులు చేయుట వలనను, చాలామంది మహర్షులు తపస్సునే ఆచరించడము వలనను, రాజులందరు దానములను ఎక్కువగ చేయుట వలనను, బ్రాహ్మణులందరు వేదపఠనము చేయడము వలనను దైవ ధర్మములకు ముప్పు ఏర్పడినది. అధర్మములు చెలరేగి ధర్మములు లేకుండ పోయినపుడు, ధర్మములను ఉద్ధరించుటకు నేను తప్పక వస్తానని పరమాత్మ గీతయందు చెప్పినట్లు, శ్రీకృష్ణుని రూపమున దేవుని అంశ పుట్టినది. దైవము కృష్ణుని రూపముగ పుట్టి, తన ధర్మములను తెలిపి పోయాడు. ఇక్కడ కొందరికి పెద్ద సంశయమొచ్చు అవకాశము గలదు. అదేమనగా! యజ్ఞయాగాదులు, జపతపములు, దానము, వేదపఠనము అధర్మములగునా? వీటన్నిటిని గూర్చి ముఖ్యముగ తెలిపిన పురాణములు, వాటిని వ్రాసిన వ్యాసుడు, యజ్ఞములు, తపస్సులు చేసినవారు, వేదముల పఠించువారు అధర్మమును ప్రోత్సహించిన వారా? వ్యాసునికి ఆనాడు ధర్మములు తెలియవా! అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా!

దైవ అంశతో పుట్టిన భగవంతుడు ధర్మములను తెలుపుటకే వచ్చాడు. అధర్మములను ఖండించి, ధర్మములను నెలకొల్పుటయే ఆయన పని. కావున ఆయన చెప్పిన వాక్కులు ఏవి అసత్యము కావు. వ్యాసుడు మన దృష్ఠిలో ఎంత పెద్దవాడైన, కృష్ణుడు భగవద్గీత చెప్పకముందు పూర్తి జ్ఞాని కాదనియే చెప్పవచ్చును. అందుకు తార్కాణము వ్యాసుడు పదునెనిమిది పురాణములను వ్రాయడమేనని కూడ చెప్పవచ్చును. భగవద్గీతలో దేవున్ని తెలియుటకు ఏవి పనికి రావని చెప్పాడో వాటిని గూర్చి గొప్పగ చెప్పుకొన్న పురాణములను వ్రాశాడు. ఆ కాలమున గీతకంటే ముందు ప్రచారము చేయబడినవన్నియు అధర్మములని భావించిన భగవంతుడు ధర్మములను నెలకొల్పుటకై వచ్చి తన బోధలో నన్ను తెలియుటకు యజ్ఞములు,

దానములు, వేదాధ్యాయములు, తపస్సులు పనికిరావని నొక్కి చెప్పాడు. శ్రీకృష్ణుడు భగవద్గీతను చెప్పిన తర్వాత వ్యాసుడు దానిని గ్రహించి గీతను గ్రంథరూపముగ వ్రాశాడు. గీతకు ముందు తెలియని జ్ఞానమును గీతను విన్నాక తెలుసుకొన్నాడు. శ్రీకృష్ణుడు తెలిపిన జ్ఞానమును అర్జునుని ద్వార విన్న వ్యాసుడు గ్రంథరూపముగ గీతను వ్రాశాడనుట సత్యమని తెలియవలెను. తనకు మొదట ధర్మములు తెలియవని అంతరంగములో వ్యాసుడు ఒప్పుకొని గీత ధర్మస్వరూపమని అందరికి తెలియునట్లు గ్రంథరూపము చేశాడు. వ్యాసుడు మొదలగువారున్న ఆ కాలములో ధర్మములు పోయి అధర్మములు వచ్చినమాట సత్యమే.

**956. (6) జీవితము అంటే ఏమిటి?**

జ॥ జీతమునకు కారణమైనది.

**వివరము :-** జీవితము అన్న పదముకంటే జీతము అన్న పదము ఎక్కువ మందికి తెలుసుననుకుంటాను. జీవితము అను పదములో 'వి' తీసివేస్తే జీతము అగుచున్నది. జీతము అనగ ఉద్యోగస్తులకందరికి తెలిసిన విషయమే. నెలసరి ఆధాయమును జీతము అంటున్నాము. పైకి కనిపించు డబ్బు ఒక నెల జీతముగ తీసుకొని దానిద్వార అహారపదార్థములు కొంటున్నాము, అవసరములు తీర్చుకొంటున్నాము. ఒక ఉద్యోగి నెలకు వచ్చు జీతముతో కాలము గడుపుచు బ్రతుకుతున్నాడు. అదే విధముగనే వ్యాపారస్తులు వారి వ్యాపారములో వచ్చు లాభముతో బ్రతుకుతున్నారు. వ్యవసాయదారులు వారి వ్యవసాయములో వచ్చు ఆదాయముతో బ్రతుకుచున్నారు. ఈ విధముగ పైకి కనిపించు ధనముతో మనిషి బ్రతికినట్లు కనిపించినప్పటికి కనిపించని విధానమొకటి కలదు. ఒక పనికి పైకి కనిపించు ఆదాయ మొకటున్నట్లు కనిపించని ఆదాయము కూడ కలదు. పైకి కనిపించునది డబ్బు అయితే, కనిపించని దానిని కర్మ అంటున్నాము. మనిషి పని చేసిన, వ్యాపారము చేసిన, వ్యవసాయము చేసిన వాటినుండి వచ్చు ఆదాయము

రెండు రకములుగ ఉండును. ఒకటి లాభము రెండు నష్టము అనునవి మనిషి సంపాదనలలో కనిపిస్తుండును. అలాగే కనిపించని సంపాదనలో కూడ ఒకటి పుణ్యము రెండు పాపము అనునవి కలవు. లాభ నష్టములున్నట్లు కనిపించని పుణ్యపాపములు కలవని తెలియుచున్నది. కనిపించు సంపాదనలోని రెండు ఫలితములైన లాభనష్టములను జీతము అంటున్నాము. అలాగే కనిపించని సంపాదనలోని రెండు ఫలితములైన పాపపుణ్యములను జీవితము అంటున్నాము. జీతము జీవితము రెండు మనిషి యొక్క కనిపించని జీవన విధానమని తెలియవలెను. కాని ముఖ్యముగ తెలియవలసినదేమనగా! జీతము ద్వార జీవితము ఏర్పడుచున్నదా? జీవితము ద్వార జీతము ఏర్పడుచున్నదా అనునది ముఖ్యమైన ప్రశ్నగ చూచుకోవలెను. చేసెడి పనుల ద్వార పాపపుణ్యములు వస్తున్నవా? లేక పాపపుణ్యముల ద్వార పనులు జరుగుచున్నవా అనునది ప్రశ్న. ఇపుడు చేయు పనుల ద్వార పాపపుణ్యములు వస్తున్నవని, అందువలన మంచి పనులు చేయమని కొందరి వాదన కాగ, గతములోని పాపపుణ్యముల ద్వార మంచి చెడు పనులు జరుగుచున్నవని కొందరి వాదన వినిపిస్తున్నది. ఇపుడు నీవు ఆలోచించి జీతము ద్వార జీవితమో, జీవితము ద్వార జీతమో తెలుసు కొనుము.

**957. (7) శ్రద్ధ జ్ఞానములో ఉండునా? అజ్ఞానములో ఉండునా?**

జ॥ రెండిటిలోను ఉండును.

**వివరము :-** శ్రద్ధ అనునది రెండు వైపుల పదునుగల కత్తిలాంటిది. అది జ్ఞానము వైపు ఉండగలదు. అజ్ఞానము వైపు ఉండగలదు. శ్రద్ధ అను పదమునకు సరియైన భావము తెలియక దానిని కొందరు వేరు గుణముగ పోల్చుకొన్నారు. ఇది ఒక గుణము కాక పోయిన, గుణములాంటిదని చెప్పవచ్చును. ప్రేమ అనునది ఒక గుణము, దానికి వ్యతిరేఖమైన అసూయ అను గుణము కూడ కలదు.

చాలామంది శ్రద్ధను ప్రేమగ పోల్చుకొన్నారు. అలా పోల్చుకోవడము శ్రద్ధ అని చెప్పవలసిన చోట ప్రేమ అని చెప్పడము చాలా పొరపాటు. చాలామంది ఆధ్యాత్మికవేత్తలు పొరబడి శ్రద్ధను ప్రేమగ చెప్పుచున్నారు. శ్రద్ధను వివరించుకొని చూస్తే ఇష్టము అను పదముగ సరిపోవుచున్నది. ఇష్టము లేక శ్రద్ధ రెండు ఒక్కటే కొందరికి అజ్ఞానము మీద ఇష్టముండగ మరికొందరికి జ్ఞానము మీద ఇష్టముండును. దీనిని బట్టి శ్రద్ధ రెండు రకములని తెలియుచున్నది.

**958. (8) కృష్ణునికంటే రాముడు భౌతికముగ, అభౌతికముగ పెద్దవాడ చిన్నవాడ?**

జ॥ భౌతికముగ పెద్దవాడు, అభౌతికముగ చిన్నవాడు.

**వివరము :-** భౌతికముగ చూస్తే రాముడు ముందుపుట్టిన వాడు, కృష్ణుడు చాలా వెనుక పుట్టినవాడు. అంతేకాక రాముడు ఎంతో సచ్ఛీలుడు, ఏకపత్నీ వ్రతుడు. కృష్ణుడు సచ్ఛీలుడు కాడు, ఏకపత్నీవ్రతుడుకాడు. ఆ విధముగ చూస్తే భౌతికముగ రాముడు కృష్ణునికంటే ఎన్నో విధములు పెద్దవాడనియే చెప్పవచ్చును. కాని అభౌతికముగ చూస్తే రామునికంటే కృష్ణుడు చాలా గొప్పవాడని చెప్పవచ్చును. భౌతిక ఆచరణను మంచిగ కనిపించకుండినప్పటికి అభౌతికమైన జ్ఞానములో కృష్ణుని సాటి ఎవరులేరనియే చెప్పవచ్చును. అంతరంగములోనున్న జ్ఞానము అపారమైనది. రాముడు జీవాత్మయే కాగ, కృష్ణుడు పరమాత్మయై ఉన్నాడు. కనుక అభౌతికముగ అన్ని విధముల రామునికంటే కృష్ణుడు చాలా పెద్దవాడని, రాముడే చిన్నవాడని చెప్పవచ్చును.

**959. (9) గుంపులో గోవింద, నలుగురితో పాటు నారాయణ అను మాటలు అజ్ఞానులు, జ్ఞానులలో ఎవరిని గురించి అన్నవి?**

జ॥ అజ్ఞానులను గురించి అన్న మాటలు.

**వివరము :-** గోవింద అనుమాటను గాని, నారాయణ అనుమాటను గాని వాటి

అర్థము తెలిసినవారు స్వతహాగ పలుకునవి. వాటి అర్థము విలువ తెలియని వారు స్వతహాగ వారంతకు వారు పలుకరు. ఎవరైన పలుకునపుడు తాము కూడ భక్తి పరులనుకొనునట్లు ఇతరులు చూచుటకు గుంపులో గోవింద అని పలుకుచుందురు. అలాగే నలుగురితో పాటు వారు నారాయణ అంటే ఇతను కూడ నారాయణ అనుచుండును. అంతే కాని జ్ఞానము తెలిసి పలుకడము లేదు కనుక గుంపులో గోవింద అను పదమును, నలుగురితో పాటు నారాయణ అను మాటను అజ్ఞానులను గూర్చి సామెతగ అన్నారు.

**960. (10) శరీరములో ఉత్తరాయణము దక్షిణాయణమున్నట్లు బయట ఏమైన ఉదాహరణ ఉన్నాయా?**

జ॥ ఉన్నాయి.

**వివరము :-** శరీరములోని పోలికలు బయట, బయట పోలికలు శరీరములో చాలా కలవు. శరీరములో ఉత్తరాయణమునకు దక్షిణాయణమునకు గుర్తుగ బయటి ప్రపంచములో కూడ ఉత్తర దక్షిణ దృవములు గలవు. సూర్యుడు ఉత్తర దృవము వైపు ప్రయాణించునపుడు ఉత్తరాయణమని, దక్షిణ దృవము వైపు ప్రయాణించునపుడు దక్షిణాయణమని పేరు కల్గియున్నది. అలాగే సూర్యకిరణములోని ఏడురంగులు, ఆకాశములోని స్వర్గబాట అనబడు పాలపుంతకు శరీరములోపల పోలికలు కలవు.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొడమల** **తేది -28-10-2004**

**961. (1) దూప, దీప, నైవేద్యములు దేనికి గుర్తు ?**

జ॥ అజ్ఞానము, జ్ఞానము, కర్మనాశనముకు గుర్తు.

**వివరము :** దూపము అనగ పొగ. పొగ తెల్లగ దట్టమైనదైయుండుట వలన దాని అవతల ఉన్న వస్తువు కనిపించదు. ఎదురుగ ఉన్న దృశ్యము పొగచేత

కనిపించకుండ పోవుచున్నది. ఉన్నదానిని తెలియకుండ చేయునది దూపము. అందరి శరీరములలోను ఆత్మ కలదు మరియు పరమాత్మ కూడ కలదు. జీవాత్మ అజ్ఞానము వలన ఆత్మను చూడలేకున్నాడు. అజ్ఞానము లేకుండ పోయినపుడు జీవాత్మకు ఆత్మ తెలియుచున్నది. ఏ విధముగ పొగచేత ఎదుటి వస్తువులు కనిపించలేదో అదేవిధముగ అజ్ఞానముచేత తన శరీరములో జీవునకు ఎదుటనున్న ఆత్మ తెలియకుండ పోవుచున్నది. అందువలన దూపము (పొగను) అజ్ఞానముగ పెద్దలు పోల్చారు.

దీపము వెలుగునిచ్చునది. చీకటిలో కనిపించని వస్తువునైన కనిపించునట్లు చేయునది దీపము. అజ్ఞాన అంధకారములో తెలియని ఆత్మను జ్ఞానప్రకాశములో తెలుసుకోగలుగుచున్నాము. ఏ విధముగ చీకటిలోని వస్తువు దీపముచేత కనిపిస్తున్నదో, అదేవిధముగ అజ్ఞానచీకటిలో తెలియని ఆత్మ, జ్ఞానజ్యోతి కల్గినవారికి తెలియుచున్నది. అందువలన దీపమును జ్ఞానముగ పెద్దలు పోల్చారు.

నైవేద్యము అనగ చివరికి ఆహారమని అందరికి తెలియును. దేవుని ప్రతిమల ముందర అహారపదార్థములనుంచి వాటికి నైవేద్యమని పేరుపెట్టి చివరకు ప్రసాదమను పేరుతో మనమే తింటున్నాము. ప్రతిమ ముందర పెట్టిన ఆహారము పూజానంతరము లేకుండ పోవుచున్నది. మన శరీరములో కూడ కర్మఅనునది మనము అనుభవిస్తు అయిపోగొట్టుచున్నాము. అంతరంగములో అనుభవిస్తు కర్మను అయిపోవునట్లు చేయుచున్నాము. బాహ్యారంగములో (బయట) ఆహారమును తింటూ అయిపోవునట్లు చేయుచున్నాము. దైవపూజ చేసిన తర్వాత ప్రసాద రూపములో అయిపోవునది నైవేద్యముకాగ, అదే విధముగ దైవ ఆరాధనైన యోగము ఆచరించిన తర్వాత యోగశక్తికి (జ్ఞానాగ్నికి) అయిపోవునది కర్మని తెలిసిన పెద్దలు నైవేద్యమును కర్మతో పోల్చారు. దీనిప్రకారము దూపమును అజ్ఞానముగ, దీపమును జ్ఞానముగ, నైవేద్యమును కర్మగ పోల్చవచ్చును.

**962. (2) వేదములు అపౌరుషములు అంటే ఏమిటి?**

జు॥ పురుషత్వము లేనివి.

**వివరము :** స్త్రీ పురుషులు జగతిలో ఉండుట అందరికి తెలుసు. స్త్రీ పురుషులు ప్రకృతి పరమాత్మలకు గుర్తని కొందరికి తెలుసు. భగవద్గీతయందు కనిపించెడి ప్రకృతినంతటిని స్త్రీగ వర్ణించి, కనపడని పరమాత్మను పురుషునిగ వర్ణించడము జరిగినది. వేదములు ప్రకృతి జనితములని, అవియే గుణత్రయమని, త్రిగుణముల విషయములే వేదములందు గలవని, వేదములను వదలి వేద అంతుడవైనపుడే పురుషుడైన పరమాత్మను తెలియగలవని, గీతయందు భగవంతుడు స్పష్టముగ తెలియజేశాడు. దీనిని బట్టి వేదములు పురుషుడైన పరమాత్మను తెలియజేయునవి కావని తెలుపుటకు వేదములు అపౌరుషమని పెద్దలన్నారు. కొందరు వేదములు పురుషుడు వ్రాసినవి కావు, అవి అన్నియు ప్రకృతి రచనలే అన్నారు. ఇవన్నియు వదలి మరికొందరు వేదములు అపౌరుషములనగ మనిషి వ్రాసినవికావు దేవుడే వ్రాసినవని వక్రీకరించి చెప్పడము కూడ జరిగినది. అపౌరుషములను పదములో పురుషునికి సంబంధించినవి కావని తెలియుచున్నది. కాని మనిషి వ్రాసినవని అర్థమురాదు. కనుక వేదములు ప్రకృతి సంబంధములని, పురుషుని సంబంధము కాదని తెలియాలి.

**963. (3) ఆలోచితము అనాలోచితములలో ఆలోచితము ఏది? అనాలోచితము ఏది?**

జ॥ 1. ఆత్మ 2. పరమాత్మ.

**వివరము :** మన శరీరములో జీవుడు మినహా ముఖ్యమైన భాగములు 24 గలవు. అందులో మనస్సు విషయములను జ్ఞాపకము చేయగ, బుద్ధి వాటిని ఆలోచిస్తుంది. ప్రపంచ విషయములను జ్ఞాపకముచేయుట మనస్సు యొక్క పని. మనస్సు పనిచేయనపుడు బుద్ధి ఆలోచించుటకు ప్రపంచ విషయములుండవు. అటువంటి సమయములో బుద్ధి లోపలి ఆత్మను గురించి యోచించగలుగుచున్నది. బుద్ధి కొంతకాలము యోచించగ, ఆత్మ బుద్ధి ఆలోచనకు తెలియుచున్నది. లోచనము అనగ చూచుట అని అర్థము. ఆలోచన అనగ బుద్ధితో చూడడము. ఆత్మను

బుద్ధి చూచి జీవునకు తెల్పుచున్నది. అందువలన శరీరములోని ఆత్మను ఆలోచితము అంటున్నాము. శరీరములోపల బయట గల పరమాత్మ బుద్ధి ఆలోచనకు కూడ అందనిది. సజీవముగ ఉన్న మనిషి ఎవరుగాని పరమాత్మను తెలియలేడు. పరమాత్మ (దేవుడు) అనువాడు మానవునికి ఎప్పటికి ప్రశ్నార్థకమైన వాడేగాని తెలియువాడు కాడు. వెదకబడేవాడు, దేవులాడబడేవాడు కావున దేవుడు అన్న పదమును పరమాత్మకు ఉంచాము. ఎప్పటికి, ఎవరికి, దేనికి తెలియబడని వాడు దేవుడు, కనుక అనాలోచితము పరమాత్మ అన్నాము.

**964. (4) జ్యోతి అనగ కాంతినిచ్చునది. జ్యోతులు ఎన్ని విధములు గలవు?**

జ॥ రెండు విధములు.

**వివరము :** ప్రపంచములో వెలుగు నిచ్చునది చిన్న దీపము మొదలుకొని పెద్ద సూర్యుని వరకు గలవు. కంటికి వెలుగునిచ్చు జ్యోతులన్నిటిని ఒక విధముగ లెక్కించవచ్చును. వీటికి తెలియునవి ప్రత్యక్షముగనున్న దృశ్యములు మాత్రమేనని చెప్పవచ్చును. శరీరములో పరోక్షముగ ఉండి పనిచేయుచున్న ఆత్మ బయట వెలుగునిచ్చు జ్యోతులకు కనిపించదు. ఆత్మను చూచుటకు ప్రత్యేకమైన జ్యోతి కావలెను. అదే జ్ఞానజ్యోతి అనబడుచున్నది. జ్ఞానజ్యోతి వలన కంటికి కనిపించని శరీరములోని ఆత్మను తెలియవచ్చును కావున, జ్ఞానజ్యోతి జ్యోతులలో ప్రత్యేకత కల్గియుండి రెండవ విధమైనది. కనిపిస్తు వెలుగునిచ్చునవి ఒక రకము జ్యోతులు కాగ, దీపము కాని వెలుగు కాని కనిపించని జ్ఞానజ్యోతి రెండవరకము.

**965. (5) 0 నుండి 9 వరకు గల సంఖ్యలలో బేసి సంఖ్యలైన 1,3,5,7,9 ఆధ్యాత్మికములో ముఖ్యమైనవిగ ఉన్నవా. అది ఏవిధముగ?**

జ॥ ఉన్నవి.

**వివరము :** సున్నానుండి తొమ్మిది వరకు గల పది అంకెలలో ఐదు సరిసంఖ్యలు పోగా మిగిలినవి ఐదు బేసి సంఖ్యలు. బేసి సంఖ్యలు ఆధ్యాత్మికవిద్యలో గుర్తింపు

స్థానమును కల్గియున్నవి. ఏ విధముగ ఉన్నవో వివరించుకొందాము. మొదట బేసి సంఖ్య ఒకటి పరమాత్మకు గుర్తు. పరమాత్మ ప్రపంచమంత వ్యాపించియున్న ఒకే ఒకశక్తి. దానికి మించినది ఏదిలేదు, కావున అద్వైతమునకు గుర్తుగా, ఏక పరబ్రహ్మమునకు గుర్తుగ ఒకటినుంచారు. ఒకే పరమాత్మ మూడు ఆత్మలుగ విభజింపబడినది. జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగనున్న విభజనకే మూడు సంఖ్య గుర్తుగ ఉన్నది. ఆత్మలకు స్థానమై, ఆత్మలకు వ్యతిరేఖ భావము కల్గిపుట్టినది ప్రకృతి. పరమాత్మ చేత ఉద్భవించిన ప్రకృతి ఐదు భాగములుగ ఉన్నది. శరీరములోనున్న ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ప్రకృతి భాగములకు గుర్తుగ ఐదు సంఖ్యను ఉంచారు. పంచభూత నిర్మితమైన శరీరములో ఆత్మ ఏడునాడీ కేంద్రముల ద్వార శక్తిని, ఏడు గ్రంథుల ద్వార ఆరోగ్యమును పంచుచున్నది. ఆత్మ శరీరములో వ్యాపించు ఏడు నాడీకేంద్రములకు గుర్తుగ మరియు ఏడు గ్రంథులకు గుర్తుగ ఆధ్యాత్మికములో ఏడు సంఖ్యను ఉంచారు. శరీరములో తొమ్మిది గ్రహముల ద్వార కర్మ తొమ్మిది విధములుగ జీవుని మీద ప్రసరింపబడుచున్నది. కావున తొమ్మిది గ్రహములకు గుర్తుగ తొమ్మిది సంఖ్యను ఉంచారు. జగతిలోని ఒక్క పరమాత్మకు, శరీరములోని మూడు ఆత్మలకు, శరీరములోని ఐదు ప్రకృతి భాగములకు, శరీరములోని ఏడు ఆత్మ కేంద్రములకు, శరీరములోని కర్మనుపాలించు తొమ్మిది గ్రహములకు గుర్తింపుగ ఉన్నవే 1,3,5,7,9 బేసి సంఖ్యలని తెలియాలి.

**966. (6) రహస్యమునకు వ్యతిరేకమైన పదము ఏది?**

జ॥ జ్యోతిష్యము.

**వివరము :** తెలియని దానిని రహస్యము అంటాము. తెలియని దానిని తెలుసుకొనుటకు రెండు విధానములు గలవు. చీకటిలో కనిపించని దానిని జ్యోతి ద్వార తెలుసుకోవచ్చును. బయటి రహస్యములను ఏదో ఒక విధముగ తెలుసుకోవచ్చును. కాని రహస్యములలో పెద్ద రహస్యమైన భవిష్యత్తు తెలుసుకొనుట

చాలా కష్టము. దానిని కొంతవరకు తెలుసుకొను విధానము గలదు. భవిష్యత్తును జ్యోతి ద్వారానే తెలియనగును. కనిపించని వాటిని కనిపించెడి దీపము ఉపయోగించి చూచినట్లు, కనిపించని విషయములను కనిపించని దీపము ద్వార తెలియనగును. కనిపించని దీపము మనతలలో గలదు. దాని ద్వార భవిష్యత్తు కర్మను తెలుసుకోవడమును జ్యోతిష్యము అంటాము. ప్రపంచములో అతిపెద్ద రహస్యము ఆత్మ అంటే ఏమిటో తెలియకపోవడము. శరీరములోని ఆత్మను తెలియుటకు కూడ ఒక జ్యోతి అవసరము, అదియే జ్ఞానజ్యోతి. ప్రపంచ శాస్త్రములలో చివరిది ఐదవది జ్యోతిష్యశాస్త్రము. ప్రపంచ విధానములో పెద్ద రహస్యము భవిష్యత్తు. తెలియని భవిష్యతును తెలియడమే జ్యోతిష్యము అంటాము. ఆరవశాస్త్రమైన బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము పెద్దరహస్యము ఆత్మ. జ్ఞానజ్యోతి ద్వార ఆత్మను తెలియడమును జ్యోతిష్యము అనము, ఆత్మదర్శనము అంటాము. ప్రపంచ విషయములకు ఆత్మ విషయములకు తేడాను చూపుటకు అలా అనవలసి వచ్చినది. సూత్రము ప్రకారము తెలియబడు విధానముండి తెలియకున్నది రహస్యము. విధానము ప్రకారము తెలియబడునది జ్యోతిష్యము.

**967. (7) మృతము అంటే చావు. అమృతము అంటే చావులేనిది. మృతము ఏది? అమృతము ఏది?**

జ॥ మృతము జీవాత్మ, అమృతము పరమాత్మ.

**వివరము :** మృతము అనగా నాశనము అని అర్థము. అమృతము అనగా నాశనములేనిదని అర్థము. మనిషి మరణించినపుడు జీవుడు మృతుడు కాడు. దేహము మాత్రము మృతమైపోవుచున్నది. అందువలన జీవుడు వదలిన దేహమును మృతదేహము అంటున్నాము. మరణములో జీవుడు మృతము కాలేదు. మరణములలో నాశనముకాని జీవుడు శరీరములను మార్చుకొంటూ పోవుచున్నాడు. ఇలా జరుగుచు పోయినప్పటికి చావులో నాశనము చెందని జీవుడు చివరకు కొన్ని యుగముల తర్వాత కాని, ఎన్నో యుగ కల్పముల

తర్వాతగాని, నాశనము చెందవలసి ఉన్నది. జీవాత్మగ నాశనము చెంది పరమాత్మగ మారిపోవలసిన పద్ధతి ఒకటి గలదు. మూడు పొరల మధ్య బంధింపబడిన జీవాత్మ, ఆత్మ ఆధీనములోనున్న జీవాత్మ, సుఖ దుఃఖములను అనుభవించు జీవాత్మ, జనన మరణములలో శరీరములను మారుచున్న జీవాత్మ, అన్నిటి నుండి విడుదలపొంది, జీవాత్మ స్థితిని కోల్పోయి పరమాత్మగ మారుచున్నాడు. జీవాత్మ నాశనము చెంది పరమాత్మ స్వరూపముగ మారిపోవుచున్నది. అందువలన మృతము జీవాత్మయని ఎప్పటికి పరమాత్మ అమృతమని చెప్పబడుచున్నాడు.

**968. (8) శరీరములోని కామక్రోదాది గుణములను శత్రువులుగ పోల్చినపుడు,మిగత దానదయాది ఆరు గుణములను ఏమిటిగ పోల్చవచ్చును?**

జ॥ మిత్రరూపమునున్న శత్రువులుగ.

**వివరము :** కొందరు పెద్దలు అరిషట్‌వర్గము అని కామక్రోదాది ఆరు గుణములను అన్నారు. దాని అర్థము కామ, క్రోద, లోభ, మోహ, మధ, మాత్సర్యమను ఆరు గుణములు మనిషికి శత్రువులుగ ఉన్నవని ఇంతవరకు చెప్పిన వారందరు అదే విషయమును చెప్పారు. అందరికి చెడు గుణములైన ఆరు గుణములే కనిపించాయి కావున వాటిని శత్రువులుగ పోల్చి చెప్పారు. ఆరు చెడు గుణములకు విభిన్నముగ వ్యతిరిక్తముగనున్న మిగత దాన దయాది మంచి గుణములైన ఆరును ఎవరు ఎక్కడ చెప్పలేదు. వీటిని గురించి కొందరినడిగితే చెడు గుణములు శత్రువులైతే మంచి గుణములు మిత్రులగును కదా అన్నారు. మేము చెప్పునదేమనగా! చెడు గుణములు పాపమును సంపాదించిపెట్టి మానవునికి మరుజన్మలో కష్టములు దుఃఖములు కలుగజేయుచున్నవి. అదే విధముగ మంచి గుణములు పుణ్యమును సంపాదించి పెట్టి మరు జన్మయందు సుఖములను కలుగజేయుచున్నవి. చెడు గుణముల వలన వచ్చు పాపముగాని, మంచి గుణముల వలన వచ్చు పుణ్యముగాని రెండు మానవునికి జన్మబంధనము కలుగజేయునవే. కావున రెండు వర్గముల గుణముల మానవునికి బంధనములే అయినందువలన రెండిటిని శత్రువులుగనే

పోల్చి చెప్పవచ్చును. బంధ విముక్తము చేయు దైవజ్ఞానమును మాత్రము మిత్రునిగ పోల్చవచ్చును.

**969. (9) 'కులము' అను పదము దగ్గర సంబంధమైన ఏ పదమునుండి పుట్టినది?**

జు॥ 'హలము' అను పదమునకు దగ్గర సంబంధమైనది.

**వివరము :** పొలములో దున్నునది హలము అంటాము. హలమును మడక లేక నాగలి అని కూడ అందురు. చదురుగనున్న పొలమును హలము (మడక)తో దున్నినపుడు చదురుగనున్న భూమి రెండు చీలికల గీటుగ ఏర్పడును. ఒక్కమారు నాగలి (హలము)తో దున్నినపుడు చదురుగ సమస్థాయిలో ఉన్న భూమిమీద గీత ఏర్పడి రెండు భాగములుగ కనిపించును. నాగలితో అనేకమార్లు పొలములో దున్నినపుడు పొలమంతయు గీతలుగ అనేక చీలికలుగ ఏర్పడుచున్నది. మొదట సమస్థాయిలో ఒకే చదురుగనున్న భూమి ఒక్కమారు హలమును త్రిప్పుటచేత ఒక గీత ఏర్పడి రెండు భాగములైనట్లు కనిపిస్తున్నది. ఎన్నిమార్లు హలమును త్రిప్పితే అన్ని గీతలు ఏర్పడి అన్ని భాగములుగ కనిపిస్తున్నది. ఒకే భూమిమీద హలము చేత ఏర్పడినవే ఎన్నో గీతల హద్దులు. మొదట మానవ సమాజము కూడ సమానముగ ఏ కులములు లేని వ్యవస్థగ ఉండెడిది. సమతలముగ ఉన్న భూమిలో ఏ విధముగ హలముచేత గీతలు భాగములు ఏర్పడినో, ఆ విధముగనే సమ సమాజములో గీతల హద్దులు ఏర్పడినవి. భూమి మీద హలముచేత గీతలు హద్దులు ఏర్పడినట్లు, మానవ సమాజములో కులముచేత గీతలు హద్దులు ఏర్పడినవి. సమభూమిని హలము ఎట్లు చీల్చినదో సమసమాజములో కులము అట్లే చీల్చినది. అందువలన భూమిని చీల్చిన హలమునకు దగ్గర పదముగ, సమాజమును చీల్చిన దాని పేరు కులము అని పెట్టారు. హలములో కులములో ఒకే అక్షరము తేడా గలదు.

**970. (10) బ్రాహ్మణ, మంగళ, యాదవ, మాదిగ అను కులములు అర్థముతో కూడుకొన్నవై ఉన్నవి. అలాగే మరేదైన అర్థముతో కూడుకొన్న కులము గలదా!**

జ॥ ఎరుకల కులము కలదు.

**వివరము :** బ్రాహ్మణ అనగ బ్రహ్మజ్ఞానము కలవారని, మంగళ అనగ శుభకరమైన మోక్షమును తెలుపు జ్ఞానము కలవారని, యాదవ అనగ ఎల్లపుడు తమమీద తాము జ్ఞాపకము కలవారని, మాదిగ అనగ ఏమాత్రము జ్ఞానము లేకుండ జ్ఞానముకలవారికంటే తక్కువవారని అర్థములున్నట్లు, ఆ విధముగ అర్థముతో కూడుకొన్న కులము ఎరుకల కులము. ఎరుక అనగ తెలియడము అని అర్థము. ఎరుకల వారనగ తెలిసినవారని అర్థము. ప్రపంచములో అన్నిటికంటే ముఖ్యమైనది మానవుని శరీరమును నడిపించు ఆత్మను తెలుసుకోవడమే. తమలోని ఆత్మను తెలిసినవారను అర్థముతో ఎరుకకలవారు అని పూర్వము ఒక తెగను అనెడివారు. కాలక్రమేణ ఆ మాటలో కొంత మార్పువచ్చినది. ఎరుకకలవారు అను పదములో ఒక 'క' అను అక్షరము లేకుండ పోయినది. అపుడు ఎరుకలవారు అను పదము ఏర్పడి ఈనాటికి ఆ పదము, ఆ కులము కలదు. పూర్వము ఎరుకలవారు అర్థమునకు తగినట్లు ఆత్మను తెలిసిన జ్ఞానము కలవారై ఉండిరి. నేడు పేరుకు మాత్రము ఎరుకలవారు కలరు, కాని ఆత్మంటే ఏమిటో, ఆత్మజ్ఞానమంటే ఏమిటో, ఏ మాత్రము తెలియకుండ పోయినది.

ఆత్మజ్ఞానము పవిత్రమైనది పరిశుద్ధమైనది. కావున ఏ కల్మషములేని జ్ఞానమును ఆత్మజ్ఞానమనెడివారు. శుద్ధమైన ఆత్మను ఆత్మజ్ఞానమును తెలిసిన ఎరుకల వారు పూర్వము ఇతరులకు శుద్ధమైన జ్ఞానమును తెల్పెడివారు. జ్ఞానమును తెల్పుటయే తమ పనిగ, ముఖ్యమైన వృత్తిగ పెట్టుకొని ఉండెడివారు. తీరిక సమయములలో ప్రక్క ఊరికి పోయి తెలియనివారికి జ్ఞానమును తెల్పెడివారు. ఆత్మజ్ఞానము మనిషిని పరిశుద్ధుని చేయును, కావున ఆ దినములలో జ్ఞానమును

శుద్ధి అనికూడ అనెడివారు. ఎరుకలవారు మేము శుద్ధి చెపుతామని ఇతరులతో చెప్పెడివారు. ఎరుకల వారికి ముఖ్యవృత్తి శుద్ధి చెప్పడమే. కాలక్రమేణ శుద్ధి అను మాట గద్ది అను మాటగ మారిపోయినది. ఎరుకల వారు గద్ది చెప్పుతారనుట కొందరికి తెలిసిన విషయమే. శుద్ధి గద్ది అని పేరు మారినట్లే వారు చెప్పునది జ్ఞానము కాకుండ పోయినది. గద్ది చెప్పువారంటే ప్రపంచవిషయములైన జరిగినవి, జరుగబోవునవి చెప్పువారని కొందరికి తెలిసిన విషయమే. ఎరుకల కులము నేటికిని ఉన్నప్పటికి వారివద్ద శుద్ధి గద్దిగ మారినది, జ్ఞానము జ్యోతిష్యముగ మారినది. ఈ విధముగ పూర్వము జ్ఞానము కల్గి ఎంతో అర్థముగల ఎరుకల కులము నేడు జ్ఞానములేని కులముగ మారిపోయినది.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొడమల** **తేది-26-11-2004**

**971 (1) కాల, కర్మచక్రముల చక్రములో మొత్తము ఎన్ని గుండ్రని భాగములు గలవు?**

జ॥ ఐదు కలవు.

**వివరము :-** క్రింద గల గుణచక్రము తర్వాత గల కర్మచక్రము. అటు తర్వాత గల కాలచక్రము, అన్నిటికంటే పైన గల బ్రహ్మాచక్రము నాలుగు గుండ్రముగనున్న చక్ర భాగములు కాగ ఐదవది కూడ ఒకటి కలదు. అన్ని చక్రములకు మధ్యన గల ఇరుసులాంటి బ్రహ్మనాడి గుండ్రముగ ఉన్నదే కావున దానిని కూడ కలుపుకొంటే మొత్తము ఐదవుచున్నవి. ప్రత్యేక మైన విషయముతో కూడుకొని, ప్రత్యేకమైన పని కల్గినది, ప్రత్యేక భాగముగ గుర్తించితే, గుణచక్రములో ప్రత్యేక గుణములు గలవు మరియు ప్రత్యేకమైన పని కలదు. అలాగే కర్మచక్రమునకు ప్రత్యేకమైన కర్మ కలదు మరియు ప్రత్యేకమైన గమనము పని కలదు. అదే విధముగ కాలచక్రము కార్యప్రత్యేకత కల్గి ప్రత్యేక కార్యాలు చేయుచున్నది. అదే

విధముగ బ్రహ్మాచక్రము ప్రపంచ ఆయుస్సును కల్గి ప్రత్యేకమై ఉన్నది. అన్నిటికి ఇరుసువలె ఆధారమైన ఆత్మ అన్నిటికి మధ్యలో గుండ్రముగ ఉండి అన్నిటిని పనిచేయించుచున్నది. కావున అన్నిటిని కలిపి ఐదు భాగములని చెప్పవచ్చును.

**972. (2) ధర్మముల అవసరాన్ని బట్టి భూమిమీద దేవుడు భగవంతునిగ జన్మించునన్నారు. అలా జన్మించిన భగవంతుడు భూమి మీద ఎన్నో మతములుండుటను చూచి ఏమనుకొనును. మతద్వేషము ఆయనకు కూడ ఉండునా?**

జ॥ సర్వ ప్రపంచమునకు అధిపతియైన, విశ్వమునంతటిని సృష్ఠించిన దేవుడు కొన్ని వేల సంవత్సరములకో లేక కొన్ని లక్షల సంవత్సరములకో భూమిమీద ఒక మనిషిగ పుట్టవలసిన అవసరమున్నది. దేవుని ధర్మములు ప్రజలకు తెలియకుండ పోయి అధర్మములు మనుషులలో నిండిపోయినపుడు, దేవుడే స్వయముగ భూమి మీద పుట్టి తన ధర్మములను గురించి తెలుపవలసిన అవసరమున్నది. తన ధర్మములను తెలుపు నిమిత్తము దేవుడు మనిషిగ పుట్టితే అపుడు దేవుడను పేరు ఆ మనిషికి వర్తించదు. అట్లు అవతరించిన వానిని భగవంతుడు అనాలి. తనకు అవసరమొచ్చినపుడు మనిషిగ పుట్టు దేవుడు ఎవరికి చెప్పి పుట్టడు. కావున భూమిమీద భగవంతుడు ఎవడని ఎవరికి తెలియదు. మనిషికి కనిపించెడు భగవంతుడు తెలియడు, అట్లే కనిపించని దేవుడు తెలియడు. కనిపించని దేవున్ని యోగముల ద్వార చివరకు తెలుసుకోవచ్చును. అట్లే కనిపించెడు భగవంతున్ని జ్ఞానము ద్వార తెలుసుకోవచ్చును. యోగము లేకుండ దేవున్ని, జ్ఞానము లేకుండ భగవంతున్ని కనుగొనుటకు సాధ్యము కాదు. అభౌతికముగనున్న దేవున్ని తెలియుట ఎంతకష్టమో, భౌతికముగనున్న భగవంతున్ని తెలియుట కూడ అంతే కష్టమగును. భగవంతుని రూపములోనున్న దేవుడు తెల్పిన యోగముల ద్వార దేవున్ని తెలియవచ్చును. అలాగే దేవుని ప్రతినిధి రూపములోనున్న భగవంతుడు తెల్పిన జ్ఞానము, ధర్మముల ద్వార భగవంతున్ని తెలియవచ్చును.

ఈ సూత్రముల ద్వార భగవంతున్ని తెలియుటకు ఆయన చెప్పిన జ్ఞానము, ధర్మములనే చూడవలయును. భగవంతుని జ్ఞానము ప్రకారము 1) బాహ్య యజ్ఞములు, 2) దానములు 3) వేదాధ్యయనములు 4) తపస్సులు దేవున్ని తెలుపలేవు. అట్లే 1) బ్రహ్మయోగము 2) కర్మయోగము 3) భక్తియోగము అనునవి మాత్రమే దేవున్ని తెలుపగలవు. ముఖ్యముగ నాలుగు అధర్మములు, మూడు ధర్మములు ఎక్కడైతే తెలియబడుచున్నవో అక్కడే భగవంతుడు కలడని తెలియగలదు.

దైవజ్ఞానము మీద ఆధారపడియే భూమిమీద మతములు సృష్ఠింపబడి నవి. ఇప్పటి కాలములో ఎన్నో మతములు గలవు. ఒక్కొక్క మతములో ఒక్కొక్క బోధ, ఒక్కొక్క ఆచరణ గలదు. దేవుడు భగవంతునిగ భూమిమీదకు వచ్చినపుడు తన జ్ఞానమునకు ఆటంకముగ వ్యతిరేఖముగ ఎన్నో మతములు గలవని ఆయనకు తెలుసు. అయినప్పటికి ఆయనకు ఏ మతము మీద ద్వేషభావముండదు. విభిన్న ధర్మములతో కూడుకొన్న విభిన్న మతములను చూచిన భగవంతుడు అందులో తన ధర్మములులేవని కూడ గ్రహించును. **భూమి మీదున్న మతములలో తన ధర్మములు లేకుండపోయి ఇతర మతముల ధర్మములు అభివృద్ధి అయినపుడే భగవంతుడు భూమిమీదకు వచ్చును.** అటువంటి సమయములో భగవంతుడు అవలంభించు విధానము ఒకటేవుండును. తన జ్ఞానమును మాత్రమే బయటికి తెల్పుట తన ఏకైక విధానము. తన విధానములో నాలుగు అధర్మములను, మూడు ధర్మములను తెలుపడమే ఉండును. దైవ ప్రతినిధియైన మనిషి (భగవంతుడు) తెల్పు విధానములో ఎక్కడగాని, ఏ సందర్భములోగాని ఇతర మతముల ప్రసక్తి ఉండదు, వాటి ద్వేషము ఉండదు. తాను తెలుపవలసిన ధర్మములను అధర్మములను మాత్రమే తెల్పును, కాని ఎచట కూడ పరమత దూషణ చేయడు. అదియే భగవంతునిలోని గొప్పతనము. ఆయన తెల్పిన ధర్మములనుబట్టి భూమిమీద అసలైన దేవుని మతమేదో, దేవుని మతము కాని మాయ మతములేవో సులభముగ తెలియగలవు.

మనిషికి రోగములు ఎన్నైన ఉండవచ్చును, ఆరోగ్యము మాత్రము ఒకటే కలదు. ఒక రోగమున్న మనిషి తనకు ఆరోగము పోయి, వేరే మరొక రోగము రావాలని కోరుకొనడు. ఏ రోగముండినా మనిషికి అనారోగ్యమున్నట్లే కదా! కావున ఏ రోగముండిన ఆరోగము పోయి ఆరోగ్యము కావాలని మనిషి కోరుకొనును. ఈ విధముగనే భూమిమీద ఎన్నో రోగములను పోలిన మాయమతములు ఎన్నోగలవు. అన్ని రోగములకంటే ఆరోగ్యమే ముఖ్యమన్నట్లు, అన్ని మతములకంటే దైవజ్ఞానమే ముఖ్యము. మనిషి ఏ విధముగ ఆరోగ్యమునే కోరుకుంటాడో ఆ విధముగ మనిషి దైవజ్ఞానమునే కోరుకోవాలి. ఆరోగ్యమెపుడు కల్గునో అపుడు ఏరోగముండదన్నట్లు, మనిషికి దైవజ్ఞానము ఎపుడు కల్గునో అపుడు మనిషి మతాతీతుడు కాగలడు. అందువలన రోగమును ద్వేషించుటకంటే ఆరోగ్యమును కాంక్షించుట మేలు అను సూత్రము ప్రకారము, మతమును ద్వేషించుటకంటే మతాతీతమైన దైవజ్ఞానమును కాంక్షించుట మేలు. అందువలన భూమిమీదకు వచ్చిన దేవుడు కూడ మతముల ప్రసక్తి ఎత్తకుండ కేవలము ధర్మములను, అధర్మములను మాత్రమే తెల్పాడు. భగవంతుడు తెల్పిన మూడు ధర్మములను, నాలుగు అధర్మములను బట్టి భూమి మీదున్న మాయమతములేవో, దేవుని ధర్మములేవో తెలియగలవు. భగవద్గీతలో ధర్మములు, అధర్మములు మాత్రమే చెప్పబడినవి కాని మత ప్రసక్తి ఎక్కడ లేదని గ్రహించవచ్చును.

**నీవు ఆరోగ్యములో ఉన్నావా - నీవు దైవ మతములో ఉన్నావా?**
**నీవు ఆరోగములో ఉన్నావా - నీవు మాయ మతములో ఉన్నావా?**

**973. (3) ఉదాహరణకు సమాన పదము ఏది?**

జ॥ సామెత.

**వివరము :-** ఒక దానిని గురించి అర్థమగునట్లు వివరించి చెప్పుటకు వాడబడు సమాన వివరమును ఉదాహరణ అని అనుచున్నాము. అట్లు చెప్పుదానిని సమత అని పూర్వమనెడివారు. ఆత్మశక్తి శరీరమంత వ్యాపించి ఉన్నదని అర్థమగునట్లు

చెప్పుటకు సూర్యుడొక్కడు ఈ లోకమును ప్రకాశింప చేసినట్లు అని సమానమైన వివరమును చెప్పారు. శరీరమంత ఆత్మశక్తి వ్యాపించి ఉన్నదంటే అర్థము కాదని, దానికి పోలికగ సూర్యుడు తన కిరణముల చేత లోకమంత ప్రకాశింప చేసినట్లు అని చెప్పారు. దీనినే సమత అనెడివారు. కాలక్రమమున 'సమత' అను పదము 'సామెత' అను పదముగ మారిపోయినది. ఆత్మశక్తి శరీరమంత వ్యాపించి ఉందని చెప్పుటకు సూర్యుడు లోకమంత ప్రకాశింప చేసినట్లు అని వాడుటను ఎట్లు సమతగ ఉన్నదో వివరించుకొందాము.

| | | | |
|---|---|---|---|
| **సూర్య** | **ప్రకాశము** | **లోకమంతా** | **వ్యాపించియున్నట్లు** |
| **ఆత్మ** | **శక్తి** | **శరీరమంతా** | **వ్యాపించియున్నట్లు** |
| **సూర్యుడు** | **ఒక్కడు** | **లోకమును** | **ప్రకాశింపజేసినట్లు** |
| **ఆత్మ** | **ఒక్కడు** | **శరీరమును** | **ప్రకాశింపజేసినట్లు** |
| **మనిషి పాత** | **వస్త్రమును** | **వదలి క్రొత్త** | **వస్త్రమును ధరించునట్లు** |
| **జీవుడు పాత** | **శరీరమును** | **వదలి క్రొత్త** | **శరీరమును ధరించునట్లు** |

ఈ విధముగ అర్థమగు విషయమును ముందు చెప్పి, దానికి సమానముగ అర్థము కాని విషయమును చెప్పితే, సులభముగ అవగాహన కాగలదని చెప్పుదానినే సమత అనియు, సామెత అనియు అంటున్నాము.

**974. (4) ఉదాహరణగ చెప్పలేనిది ఏది?**

జ॥ పరమాత్మ.

**వివరము :-** ప్రపంచములోని అన్ని వస్తువులను, అన్ని పదార్థములను వాటికి సమానమైన వాటిని పోల్చి ఉదాహరణగ చెప్పవచ్చును. చివరకు జీవాత్మకు ఆత్మకు సమానముగ కూడ పోలికలు గలవు. ఒక్క పరమాత్మను గూర్చి ఉదాహరణగ దేనిని చెప్పలేము. పరమాత్మకు సమానమైనది ఇటు ప్రపంచములో అటు జగతిలో ఏది లేదు. ఎటు చూచిన ఏ పోలికకు అందని దానిని ఎవరు ఉదహరించలేరు. విశ్వములో ఎవరు ఒక్కమారు కూడ చూడని పరమాత్మను చెప్పుటకు ఏమాత్రము వీలుపడదు.

**975. (5) నీవు రుచి చూచిన ఇతరులకు చెప్పలేనిది, చూపలేనిది ఏది?**

జ॥ ఆత్మ

**వివరము :-** తెలుసుకోవలెనను పట్టుదల కల్గియుంటే చివరకు ఆత్మనైన తెలుసు కోవచ్చును. మనిషి విశేషమైన శ్రద్ధను జ్ఞానము మీద కల్గియుంటే, ఆత్మయొక్క అనుభవమును రుచి చూడవచ్చును. తాను తెలుసుకొన్న ఆత్మను ఇతరులకు ఇట్లుందని చెప్పుటకు, ఇట్లుందని చూపుటకు వీలుపడదు. ఏ మనిషి అయిన జ్ఞానము ద్వారానే ఆత్మను తెలియనగును. కొంత కాలము జ్ఞానము చెప్పుట వలన, జ్ఞానప్రకారము కొంత కాలము సాధన చేయుట వలన, ఎవరికి వారు చూడవలసినది ఆత్మ. అంతేకాని ఒక్కమారుగ ఎవరు చెప్పలేనిది, ఒక్క మారుగ ఎవరు చూపలేనిది ఆత్మ. కావున ఆత్మను ఆత్మజ్ఞానము చేతనే తెలియవచ్చును. కాని ఇతర మాటలవలన ఇతర దృశ్యముల వలన సాధ్యపడదు.

**976. (6) ఆత్మ, పరమాత్మ కాకుండ ఎదురుగ ఉండి కనిపించనిదేది?**

జ॥ సూక్ష్మశరీరము.

**వివరము :-** ఆత్మ పరమాత్మ కాకుండ జీవాత్మతో పాటు మరి పదునాల్గు భాగములుగ ఉన్న సూక్ష్మశరీరము మన ఎదురుగ ఉన్న కనిపించదు. భూమి మీద ఎన్నో జీవరాసులు స్థూలశరీరమును కోల్పోయి సూక్ష్మశరీరముతోనున్నవి. వాటిని స్థూలశరీరముతోనున్న మనము చూడలేకున్నాము. సూక్ష్మశరీము స్థూల కన్నులకు కనిపించదు.

**977. (7) ఒక పదార్థమైయుండి ఎవరికి తెలియనిది మరియు అన్ని పదార్థములైయుండి ఎవరికి తెలియనిది ఏది?**

జ॥ పరమాత్మ.

**వివరము :-** ప్రతి అణువులోను పరమాత్మ వ్యాపించి ఉన్నది. అందువలన ఒక

పదార్థములోగాని, అన్ని పదార్థములలోని గాని పరమాత్మ వ్యాపించి ఉన్నది. పరమాత్మలేనిది విశ్వములో ఏది లేదు. అన్నిటియందు అణువులో, పరమాణువులో గల పరమాత్మ ఎవరికి తెలియడము లేదు. తెలుసుకోవాలనుకొనిన తెలియని విధానముతో అందరియందు అన్నిటియందు పరమాత్మ గలదు.

**978. (8) దేహి అనగ ఆత్మ అని అర్థము. ద్రోహి అనగ అర్థమేమిటి?**

జ॥ ఆత్మకు ఇబ్బంది కలుగజేసినవాడు.

**వివరము :-** ఆత్మ, జీవాత్మగల ప్రతి శరీరములోను గలదు. జీవాత్మ శరీరములో మనగలుగుటకు ఆత్మశక్తి తప్పనిసరిగ అవసరము. శరీరములో ఆత్మ ఆహారశక్తిని ఉపయోగించుకొని అన్ని కార్యములు చేయుచున్నది. ఇతర శరీరములోని ఆత్మకు గాని, తన శరీరములోని ఆత్మకు గాని ఎవడైన ఇబ్బంది కలుగజేస్తే అది ద్రోహమగును. కావున ఇబ్బంది కలుగజేసినవానిని ద్రోహి అనవచ్చును. తన శరీరములోని ఆత్మకు ఆహారము పెట్టకుండ ఆత్మశక్తిని ఇబ్బంది పెట్టడము గాని, ఇతర శరీరములో ఆత్మ నివాసము చేయకుండ ఆత్మను హత్య చేయడము, రెండు కార్యములు ఆత్మద్రోహమే అగును. అటువంటి కార్యములు చేయువానిని ఆత్మద్రోహి అంటారు.

**979. (9) ఆడితే ఆట, పాడితే పాట, నిదురించితే నిద్ర, మాట్లాడితే మాట వస్తుంది. ఏమి చేయకపోతే ఏమిరాదు. అయినప్పటికి లాభమే, ఆ లాభమేమిటి?**

జ॥ యోగము.

**వివరము :-** ఏది చేసిన అది కార్యమే అగును. ఆ కార్యమునకు కనిపించెడి ఫలితముండును, అట్లే కనిపించని కర్మ అంటుకొని ఉండును. ఏమి చేయనపుడు కనిపించెడు ఫలితముండదు, కాని కనిపించని ఫలితము మాత్రముండును.

కనిపించెడు ఫలితమున్నట్లే కనిపించని ఫలితములు కూడ గలవు. అవి ఒకటి పాపపుణ్య మిశ్రితమైన కర్మ, రెండవది కర్మను కాల్చగల జ్ఞానాగ్ని. ఏ పని చేయనపుడు అది యోగమగును. యోగము చేసినపుడు తప్పక జ్ఞానాగ్ని వచ్చును. అదియే ఏమి చేయనపుడు వచ్చు లాభము. శరీరముతో పనిగాని, మనస్సుతో ఆలోచనగాని చేయనపుడే ఏమి చేయని వాడగును. శరీరముతో పని చేయక లోపల మనస్సుతో ఆలోచించుచుండిన అది పని చేసినట్లే అగును. మనస్సు కూడ పనిచేయనపుడే బ్రహ్మయోగమగును.

**980. (10) నీ నీడ నీ శరీరమును అంటి ఉండునట్లు నీవు ఎక్కడికి శరీరముతో పోయిన, శరీరము లేకుండ పోయిన నిన్ను అంటివచ్చునవి మూడు గలవు. అవి ఏవి?**

జ॥ 1) గుణములు 2) కర్మ 3) కాలము.

**వివరము :–** జీవుడు శరీరము ధరించి ఉన్నపుడు కాని, శరీరము వదలి మరొక శరీరమును చేరుటకు పోయినపుడు కాని జీవుని వెంట గుణములు, కర్మ, కాలము అను మూడు ఉండును. మన శరరములో నాలుగుచక్రముల చిత్రము ఒకటి గలదు. క్రింది చక్రములో గుణములుండును. గుణములు మూడు భాగములుగ విభజింపబడి ఉన్నాయి. ఆ మూడు భాగములలో ఏదో ఒక దానియందు జీవుడు నివాసము చేయుచున్నాడు. శరీరమున్నపుడుగాని, శరీరమును వదలి మరొక శరీరమును చేరుటకు పోయినపుడు గాని జీవుడు గుణములనుండి బయటపడుటకు అవకాశమే లేదు. గుణచక్రముతో పాటు కర్మచక్రము కాలచక్రము అనుసంధానమై ఉండుట వలన జీవుడు ఎక్కడుండిన గుణములు, కాలము, కర్మము వాని వెంటనే నీడవలె అంటుకొని ఉండును. జీవుడు వీటినుండి విడుదల పొందడమే మోక్షమగును.

**చిన్నపొడమల** **తేది-07-09-2006**

**981. (1) చీకటి వెలుగులలో ఏది శాశ్వితమైనది ? వాటిని జ్ఞాన అజ్ఞానములలో ఏమిటిగ పోల్చవచ్చును?**

జ॥ చీకటి. వెలుగును జ్ఞానముతో, చీకటిని అజ్ఞానముతో పోల్చవచ్చును.

**వివరము :** ప్రపంచమే చీకటిమయము. సూర్యుడున్న కొంత ప్రాంతము వెలుతురుతో కూడియున్నది. సూర్యుడు లేని ప్రాంతమంతయు చీకటితో కూడుకొని ఉన్నది. దీనినిబట్టి భూగోళమంతయు సగభాగము చీకటితో కూడుకొని ఉన్నదని చెప్పవచ్చును. ఎప్పుడైన సంపూర్ణ సూర్యగ్రహణము ఏర్పడితే ఉన్న సగభాగము వెలుగు కూడ తగ్గిపోవును. చీకటి వెలుగులో చీకటి శాశ్వితమైనదనుటకు ఒక చీకటిగదిలో దీపమును వెలిగించితే చీకటి లేకుండపోవును. దీపము ఆర్పిన వెంటనే చీకటి ఉండును. ఇక్కడ దీపము దాని వెలుగు తాత్కాలికమగుచున్నది. చీకటి మాత్రము శాశ్విత కాలమగుచున్నది. అలాగే ఒక చీకటి ప్రాంతములో దీపము వెలిగిస్తాము. అక్కడ దీపము చుట్టు కొంత వెలుతురుండి దూరముగ పోవు కొలది చీకటియుండును. దీపకాంతి కిరణములు దూరముగ పోవుకొలది బలహీనపడిపోయి అంత్యమయి పోవుచున్నవి. అందువలన దీపమునకు దూరముగ చీకటి ఉండగలుగుచున్నది. దీపముంటే వెలుగు లేకపోతే చీకటి అను సూత్రము ప్రకారము చీకటియే శాశ్వితముగ ఉన్నది.

చీకటి వెలుగులలో చీకటిని అజ్ఞానముగ, వెలుగును జ్ఞానముగ పోల్చ వచ్చును. చీకటి భూమి మీద శాశ్వితముగ ఉన్నట్లు, అజ్ఞానము కూడ మనుషులలో శాశ్వితముగ ఉన్నది. దీపమున్నపుడు వెలుగువచ్చి, దీపము పోయిన వెంటనే చీకటి ఉండునట్లు, మనిషిలో జ్ఞానమను దీపము వెలిగినపుడు కొంత అజ్ఞానము పోవుచున్నది. జ్ఞానమను దీపము పోయిన వెంటనే అజ్ఞానమను చీకటి ఏర్పడు చున్నది. దీపము పెద్దదైతే ఎక్కువ వెలుగువచ్చును. అట్లే జ్ఞానము పెద్దదైతే అజ్ఞానమను చీకటి కూడ ఎక్కువ పోవును. దీపము చిన్నదైన కొంత వెలుగు

వచ్చును. అలాగే చిన్న జ్ఞానమైన దానికి తగినంత అజ్ఞానము పోవును. ఏది ఏమైన ప్రపంచములో చీకటి శాశ్వితముగ ఉన్నట్లు మనుషులలో అజ్ఞానము శాశ్వితముగ ఉన్నది. అందువలన దేవుడు భగవంతుని రూపములో అపుడపుడు భూమి మీదకు వచ్చి వెలుగునిచ్చి పోవుచున్నాడు.

**982. (2) ఊహ అనగానేమి?**

జ॥ క్రొత్తగ పుట్టి వచ్చి పోవునది.

**వివరము :** హృదయములో పుట్టునది ఊహ. చాలామంది ఊహను ఆలోచనను ఒకటిగ పోల్చుకొనుచుందురు. అది సరియైన పద్ధతికాదు. ఊహ వేరు ఆలోచన వేరు. ఆలోచన మనస్సునుండి పుట్టునది. ఊహ హృదయమునుండి పుట్టునది. క్రొత్తగ పుట్టివచ్చి తిరిగి అణిగి పోవు దానిని ఊహ అంటాము. ఒక్క మారు వచ్చిన ఊహను మనస్సు తనలో లగ్నము చేసుకొని తిరిగి దానిని మననము చేసుకొంటే అది ఆలోచన అవుతుంది. ఊహ మొదట మనస్సు నుండి పుట్టదు. ఊహ హృదయమునుండి పుట్టుచున్నది. హృదయము అనగ చాలామంది మనిషిలోని గుండె అనుకోవడము కూడ జరుగుచున్నది. హృదయము అనగ గుండెకాదు. హృదయము అనగ మనిషి శరీరములోగల వెన్నెముకనందున్న బ్రహ్మనాడి అని మేము అనేక మార్లు చెప్పాము, ఇపుడు కూడ హృదయము అంటే బ్రహ్మనాడి అనియే చెప్పుచున్నాము. బ్రతికియున్న మనిషిలోగల బ్రహ్మనాడి యందు ఆత్మగలదు. ఆత్మనుండియే జ్ఞానము, ఊహ కల్గుచున్నవి. ఈ వివరమునే భగవద్గీత పురుషోత్తమప్రాప్తి యోగమను ఆధ్యాయమున పదిహేనవ శ్లోకములో **"సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ"** అన్నాడు. స్మృతి వేరు, జ్ఞానము వేరు, ఊహ వేరని తెలిసినది, వీటిలో మూడవదైన ఊహ అన్న పదము ఒక విశిష్టమైనది. ఎవరికి తెలియని దానిని ఆత్మ ఊహ ద్వార అందించుచున్నది. స్మృతి అందరికి కలుగుచున్నది, జ్ఞానము కొందరికి కలుగు చున్నది. ఊహ అరుదుగ ఏ ఒక్కరికో కల్గుచున్నది. ఊహ ఒక్కమారు పుట్టి పోతుంది. దానిని మనస్సు దాచి పెట్టుకుంటే తిరిగి యోచన అవుతుంది. ఈనాడు

మానవుడు క్రొత్తగ సాధించిన రేడియోలు, టీవీలు, కెమెరాలు, కంప్యూటర్లు మొదలగునవి. ఎక్కడ లేనివి మానవుని ఊహకు మొదట ఆత్మద్వారా అందించ బడినవి. ఊహ అను పదమును నోటితో శబ్దము లేకుండ ఉచ్ఛరించి చూడండి. **"ఊ"** అన్నపుడు బయటినున్న గాలి లోపలికి వచ్చి "హా" అన్నపుడు బయటికి పోవునట్లు తెలియుచున్నది. కనిపించని గాలి నోటిలోనికి వచ్చి బయటికి పోవునట్లు, ఎవరికి తెలియని రహస్యము ఒక మారు మానవుని హృదిలోనికి వచ్చి పోవుచున్నది. ఆత్మ తెలిపిన ఊహ ద్వారనే మనిషి పరిశోధకుడగుచున్నాడు. నేడు సైన్సు అభివృద్ధి అగుటకు శరీరములోని ఆత్మ అందించిన ఊహయే కారణము. మనిషి కనుకొను క్రొత్త సిద్ధాంతముగాని, క్రొత్త ప్రయోగముగాని, క్రొత్త పరికరము గాని హృదయమునుండి ఆత్మ ప్రేరణతో వచ్చినవేనని తెలియాలి. ఊహకు మనిషి కారణము కాదు, మనిషిలోపలయున్న ఆత్మ కారణమని తెలియాలి. ఊహ అనగ శూన్యమునుండి వచ్చు రహస్యము అని తెలియునట్లు "ఊ" అనడములో శూన్యము లోని గాలి వచ్చుచున్నది. "హా" అనడములో లోపలి గాలి బయటికి పోవుచున్నది. దీనిని బట్టి ఊహ వేరని, ఆలోచన వేరని తెలియుచున్నది. ఊహను ఆత్మ అందించగా, ఆలోచనను మనస్సు అందించుచున్నదని గ్రహించవలెను.

**983. (3) భ్రమ అనగానేమి?**

జ॥ తిరిగి వచ్చునది.

**వివరము :** భ్రమరము అనగ తిరుగునది. భ్రమ అనగ తిరిగివచ్చునదని అర్థము. రెక్కలుగల పురుగుగాని, పక్షిగాని తన గూడును వదలిపోయి తిరిగి సాయంకాలము నకు తన గూడువద్దకు చేరుచున్నది. అలా తిరిగి చేరుటనుబట్టి వాటిని భ్రమరములు అంటున్నాము. మన శరీరములో మనస్సు అను గూడులోనున్న విషయము మనస్సులో లేకుండ పోయి, తిరిగి ఒకప్పటికి మనస్సులోనికి వస్తున్నది. అలా వచ్చు విషయమును భ్రమ అంటున్నాము. ఒకని ఆలోచనను మరియొకడు ఖండించునపుడు అది నీభ్రమ అని అంటున్నాడు. అనగ అది నీయోచన నాయోచన అలాకాదని అర్థము. పరిభ్రమించుట అనగ చుట్టు తిరుగుట అని అర్థము. మన

చుట్టు ఎన్నో విషయములు పరిభ్రమించుచున్నవి. అందులో ఒక్క సమయములో ఒక్కటి మాత్రము మనస్సును చేరుచుండును. అలా చేరిన ఒక్క విషయము మనస్సును వదలి పోయిన తర్వాత మరొక విషయము మనస్సును చేరుచుండును. దీనిని బట్టి మనస్సు అను గూడు ఒక్కటే అందులో చేరు విషయములు అను భ్రమరములు ఎన్నో వేలు. ఏది మనోగూటిలో శాశ్వితముగ ఉండదు. విషయ భ్రమలు అపుడపుడు తిరిగి వచ్చుచుండును. దీనినిబట్టి భ్రమ అన్నది ఒక్క విషయము మాత్రమే. అందువలన విషయ భ్రమలలోపడవద్దని పెద్దలన్నారు. దాని అర్థము విషయములలో చిక్కుకోవద్దని తెలియాలి.

**984. (4) మానవ జీవితము మీద పని చేయు గ్రహములు ఎన్ని?**

జ॥ 12 గ్రహములు.

**వివరము :** మానవ జీవితము మీద పనిచేయు గ్రహములు తొమ్మిది అని విన్నాము. కాని అది సరియైన జవాబు కాదు. వాస్తవముగ పండ్రెండు గ్రహములు పనిచేయు చున్నవి. అకాల మరణము పొందిన తర్వాత మరియు స్వప్నావస్థలోను ఎవరికి తెలియని మూడు గ్రహముల పాత్ర చాలా ఉన్నది. మనిషి బ్రతికి ఉన్నపుడు జాగ్రత్తావస్థమీద పనిచేయు తొమ్మిది గ్రహములను మాత్రము అందరు చెప్పుకోవడము జరుగుచున్నది. జీవితము మీద మిగత మూడు గ్రహములు పనిచేయు వివరము తెలియక పోవడము వలన జ్యోతిష్యశాస్త్ర పరిశోధన ముందుకు సాగలేదని చెప్పవచ్చును.

**985. (5) మానవ జీవితములో గల రాసులెన్ని ?**

జ॥ 12 రాసులు.

**వివరము :** మానవ జీవితమునకు సంబంధించినవి మొదటినుండి చెప్పుచున్న పండ్రెండురాసులేనని చెప్పవచ్చును. పండ్రెండు రాసులకు పండ్రెండు గ్రహములు అధిపతులై ఉన్నవి. పండ్రెండు గ్రహములను బట్టి పండ్రెండు రాసులేర్పడినవి.

**986. (6) గ్రహములు ఎన్ని గుంపులుగనున్నవి? ఒక్కొక్క గుంపులో ఎన్ని గ్రహములు గలవు?**

జ॥ రెండు గుంపులుగ ఉన్నవి. ఒక్కొక్కగుంపులో ఆరు గ్రహములు గలవు.

**వివరము :** గ్రహములు శని గుంపు, గురు గుంపు అని రెండు గుంపులు గలవు. శని గుంపులో ఆరు గ్రహములు, గురు గుంపులో ఆరు గ్రహములు గలవు. ఒక మనిషికి ఏదో ఒక గుంపు గ్రహములు అనుకూలముగ ఉండును. మరొక రకము గుంపు గ్రహములు ప్రతికూలముగ ఉండును. అనుకూల ప్రతికూలములను బట్టి గ్రహములను రెండు రకములుగ విభజించుచున్నాము.

**987. (7) గ్రహములు ఎన్ని విధములుగ ఉన్నవి?**

జ॥ మూడు విధములుగ.

**వివరము :** స్థూలగ్రహములు, ఛాయాగ్రహములు, సూక్ష్మగ్రహములని గ్రహములు మూడు విధములుగ ఉన్నవి. గ్రహములు స్థూలములు, సూక్ష్మములు కాకున్నను వాటిని అలా విభజించవలసివచ్చినది. గ్రహములు పండ్రెండని, అవి మూడు విధములుగ ఉన్నవని తెలియక పోవడము వలన, జ్యోతిష్యశాస్త్రము పూర్తి పరిశోధనలో లేకపోవడము వలన, జ్యోతిష్యమును శాస్త్రము కాదని కొందరు అనుచున్నారు. సరియైన పరిశోధన జరిగితే జ్యోతిష్యము శాస్త్రమని అందరికి తెలియగలదు.

**988. (8) మూఢత్వమునకు, మూర్ఖత్వమునకు తేడాగలదా?**

జ॥ గలదు.

**వివరము :** దైవజ్ఞానము తెలియనపుడు మూఢత్వమవుతుంది. ప్రపంచజ్ఞానము తెలియనపుడు మూర్ఖత్వమవుతుంది. పరమాత్మ జ్ఞానమునకు, ప్రపంచ జ్ఞానమునకు ఎంత తేడాగలదో అంతే తేడా మూఢత్వమునకు, మూర్ఖత్వమునకు గలదు. ప్రపంచములో మూర్ఖులు కొంతమంది, మూఢులు చాలామంది గలరు.

**989. (9) ప్రకృతికి, ఆకృతికి తేడా గలదా?**

జ॥ కొంత తేడా గలదు.

**వివరము :** 'కృతి' అనగ చేయబడినది లేక వ్రాయబడినది అని అర్థము. ప్రకృతి అనునది ఆకృతి అనునది రెండు చేయబడినవే. దేవుని చేత చేయబడినది ప్రకృతి, ప్రకృతి చేత చేయబడినది ఆకృతి. ప్రకృతి చిర కాలముండునది, ఆకృతి కొంత కాలముండునది. "ప్ర" అను అక్షరము విశేషార్థము కలది. "బోధ" అనగ తెలియజేయునది అని అర్థము. బోధ అను రెండక్షరముల ముందర ప్ర అను అక్షరమునుంచుట చేత విశిష్టమైన బోధ అనియు, సారాంశముగల బోధ అనియు తెలియుచున్నది. అలాగే కృతి అను పదము ప్ర అను అక్షరమును చేర్చడము వలన ప్రకృతి అని విశేషార్థము గల పదము తయారైనది. ఇలాంటిదే ప్రపంచము అను పదమును, పంచభూతములకు "ప్ర" అను అక్షరము చేర్చడమువలన పంచభూతములు ప్రత్యేకమైనవని తెలియుచున్నది. ప్రకృతి శాశ్వితముకాగ ఆకృతి అశాశ్వితమైనది. ప్రకృతి వలన ఏర్పడిన ఆకృతి కొంతకాలముండునదే. ప్రకృతి అనగ పంచభూతములు. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు కలిసి ప్రకృతి అనబడుచున్నది. ఈ ఐదు కాకుండ మిగత ఏవైన ఆకృతికి సంబంధించినవే. చెట్లు చేమలు, పచ్చికబయళ్ళు ప్రకృతి అందాలు అంటారు కొందరు. వాస్తవానికి అవి ప్రకృతి కాదు ఆకృతి మాత్రమే. కనిపించు ఆకృతి శాశ్వితముగ ఉండదు. మానవులు జంతువులు ఆకృతి కల్గియున్నవి. ఇవన్నియు శాశ్వితము కాదు. అందువలన అశాశ్వితమైనది ఆకృతి అనియు, శాశ్వితమైనది ప్రకృతి అనియు చెప్పబడుచున్నది.

**990. (10) శరీరములో ప్రపంచ జ్ఞానమును దేనితో పోల్చుతాము? పరమాత్మ జ్ఞానమును దేనితో పోల్చుతాము?**

జ॥ ప్రపంచ జ్ఞానమును హస్తములోని ఐదు వ్రేళ్లతోను, పరమాత్మ జ్ఞానమును గోరు క్రింద తెలుపు భాగముతోను పోల్చుతాము.

**వివరము :** హస్తములోని ఐదు వ్రేళ్ళను ప్రపంచ జ్ఞానముగ లెక్కించి, వ్రేళ్ళకున్న మూడు గెనుపు భాగములను మూడు గుణములుగ లెక్కించుచున్నాము. ఐదు వ్రేళ్లను ఐదు ప్రపంచ జ్ఞానేంద్రియములుగ లెక్కించుచున్నాము. ఐదు వ్రేళ్ళకు మూడు భాగములు కలవు, కావున ప్రపంచజ్ఞానము మూడు గుణములుగ విభజింపబడియున్నదని చెప్పుకొంటున్నాము. వ్రేలి చివర పై భాగములో వెనుక భాగమున గోరుమీద తెల్లని అర్థచంద్రాకారమును దైవజ్ఞానముగ, ఎర్రని గోరును యోగముగ, ఎర్రగోరు అంచున గల నీలి రంగు గోరును పరమాత్మగ లేక మోక్షముగ చెప్పుకొంటున్నాము. దీనిని బట్టి శరీరములోని హస్తములో ప్రపంచ జ్ఞానము పరమాత్మ జ్ఞానము ఇమిడియున్నదని తెలియుచున్నది.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొడమల** **తేది-18-09-2006**

**991. (1) పాపమునకు పుణ్యమునకు మధ్యలో ఏమి కలదు?**

జ॥ జ్ఞానాగ్ని లేక యోగము.

**వివరము :** మనిషి ఏ పని చేసిన అందులో పాపముగాని, పుణ్యముగాని ఇమిడి ఉండును. మనిషి పని చేస్తున్నప్పటికి పాపముగాని, పుణ్యముగాని రెండు అంటని విధానము కూడ కలదు. ఆ విధానమును యోగము అంటాము. యోగములో పాపపుణ్యములను కాల్చు జ్ఞానాగ్ని కలదు. ఇటు పాపమునకు అటు పుణ్యమునకు మధ్యలో జ్ఞానాగ్ని (యోగము) ఉండుట వలన మనిషి యోగములో ఉన్నపుడు పాపముగాని, పుణ్యముగాని కాల్చివేయబడుచున్నది. పాపపుణ్యములను కర్మ అంటాము. ఇటు పాప కర్మనుగాని అటు పుణ్యకర్మనుగాని లేకుండ చేయు యోగము యొక్క విధానము మంచి చెడు కర్మములకు మధ్యలో కలదని చెప్పవచ్చును.

**992. (2) నీతి, న్యాయమునకు మధ్యలో ఏమి కలదు?**

జ॥ కార్యాచరణ కలదు.

**వివరము :** ప్రపంచములో మనిషి నడుచుకొను విధానమును తెలియజేయునది నీతి. తెలుసుకొన్న విధానమును ఆచరించినపుడు న్యాయము అగును. తెలుసుకొన్న నీతి తర్వాత ఆచరణ, ఆచరణ తర్వాత న్యాయము కలదని తెలియుచున్నది. దీనిప్రకారము ప్రపంచములో ఎటువంటి నీతి అయిన ఆచరణ లేనిది న్యాయము కాదు. అందువలన నీతికి న్యాయమునకు మధ్యలో ఆచరణ కలదని చెప్పవచ్చును.

**993. (3) జ్ఞానమునకు, ధర్మమునకు మధ్యలో ఏమి కలదు?**

జ॥ యోగసాధన.

**వివరము :** పరమాత్మ విధానములను తెలుపునది జ్ఞానము. జ్ఞానము తెలుసుకొన్న తర్వాత దాని ప్రకారము ఆచరించడమును యోగసాధన అంటాము. అట్లు ఆచరించడమును ధర్మము అంటాము. మనిషికి మొదట జ్ఞానము తర్వాత యోగసాధన అయిన తర్వాతనే ధర్మమగును. అందువలన జ్ఞానమునకు ధర్మమునకు మధ్యలో సాధన కలదని చెప్పవచ్చును.

**994. (4) నీకు, నీటికి మధ్యలో ఏమి కలదు?**

జ॥ ప్రకృతి, ఆత్మ రెండు కలవు.

**వివరము :** నీలోను, నీటిలోను పరమాత్మే గలదు. అందువలన మధ్యలో పరమాత్మ కలదను జవాబు సరికాదు. ఎందుకనగ మధ్యలోనేకాక ఆదిలోను అంత్యములోను కలదానిని మధ్యలోనని చెప్పుటకు వీలులేదు. నీ తర్వాత నీటి వరకు ప్రకృతి, ఆత్మ గలవని చెప్పవచ్చును. ఎందుకనగ శరీరములోగల నీ తర్వాత ఆత్మ వ్యాపించియున్నది. ఆత్మ తర్వాత నీటి వరకు ప్రకృతి వ్యాపించియున్నది. నీరు కూడ ప్రకృతియే అయిన ప్రకృతిలో ఇంకను నాలుగు వస్తువులున్న దానివలన వాటిని కూడ ప్రకృతియే అనవలసి వచ్చినది. కావున నీటిని మినహా ఉన్న ప్రకృతి అని అర్థము చేసుకోవలెను. అందువలన ఈ ప్రశ్నకు సరియైన జవాబుగ ప్రకృతి, ఆత్మ అని చెప్పవచ్చును.

**995. (5) యోగములలో బ్రహ్మయోగమునకు, కర్మయోగమునకు మధ్యలో ఏమి కలదు?**

జ॥ భక్తియోగము.

**వివరము :** ప్రపంచములో యోగములు మూడేగలవు. మూడు యోగములలో రెండు యోగముల పేర్లు చెప్పి వాటి మధ్యలో ఏమి కలదన్నపుడు పేరు చెప్పని మూడవ యోగమని సులభముగ చెప్పవచ్చును. అదియే గీతలో చెప్పిన భక్తియోగము. బ్రహ్మ కర్మయోగములలోలేని యోగి భక్తియోగి అనియు, కర్మయోగము బ్రహ్మయోగముకాని యోగము భక్తియోగమని చెప్పవచ్చును.

**996. (6) జీవాత్మకు, పరమాత్మకు మధ్యలో ఏమి కలదు.?**

జ॥ పరమాత్మ.

**వివరము :** జీవాత్మకు ఆకారము, హద్దు కలదు. పరమాత్మకు ఆకారముగాని, హద్దుగాని లేదు. జీవాత్మ కూడ పరమాత్మలోనే కలదు. అందువలన జీవాత్మ లోపల కూడ పరమాత్మ కలదు. జీవాత్మకు హద్దు ఆకారముండుట వలన జీవాత్మకు పరమాత్మకు మధ్యలో ఏమున్నదని ప్రశ్న అడుగవచ్చును. కాని జీవాత్మలోపల పరమాత్మ, పరమాత్మలోపల జీవాత్మ కలదు కావున దీనికి సరియైన జవాబు పరమాత్మయే కలదని చెప్పవచ్చును.

**997. (7) సాధారణ మనిషి యొక్క మనస్సులో యోచనకు, ఆలోచనకు మధ్యలో ఏమి కలదు.?**

జ॥ ఏమి లేదు.

**వివరము :** యోచన అనిన ఆలోచన అనిన రెండు ఒక్కటే. యోచనను ఆలోచన అని కూడ అనవచ్చును. మనిషి యొక్క మనస్సులో ఒక ఆలోచన తర్వాత వెంటనే మరియొక ఆలోచన వచ్చుచుండును. మనిషి జాగ్రత్తావస్థలో ఉన్నంత

కాలము ఒకదాని తర్వాత ఒకటి విరామము లేకుండ యోచనలొచ్చుచుండును. మనస్సు ఎప్పుడు ఖాళీగ ఉండదు. ఏదో ఒక ఆలోచన దానియందుండును. ఒక యోచన మనస్సునుండి పోతే వెంటనే మరియొక ఆలోచన మనస్సులో చేరుచుండును. అటువంటి వానిని సాధారణ మనిషి అంటాము. యోచనకు యోచనకు మధ్యలో ఖాళీగ ఏర్పడితే ఆ కాలమును యోగము అంటాము. ఇక్కడ అడిగినది సాధారణ మనిషి యొక్క మనోవిధానము, కావున యోచనకు, యోచనకు మధ్యలో ఏమి లేదనుట సరియైన జవాబు.

**998. (8) యోగి యొక్క మనస్సులో యోచనకు, ఆలోచనకు మధ్యలో ఏమి కలదు?**

జ॥ యోగము కలదు..

**వివరము :** ఇది బ్రహ్మయోగికి సంబంధించిన విధానము. యోగి యోగములోలేని సమయమున యోచనలు వచ్చుచుండును. యోగి అహర్నిశలు యోగములో ఉండడు. యోగి ఎపుడో ఒకపుడు యోగమాచరించును. యోగి యొక్క యోగమునకు ముందు ఒక యోచన ఉంటుంది. యోగము తర్వాత ఒక యోచన వస్తుంది. బ్రహ్మయోగియొక్క యోగమునకు ముందు వెనుక యోచనలే కలవు. కావున యోగియొక్క మనస్సులో యోచనకు, యోచనకు మధ్యలో యోగము కలదని చెప్పవచ్చును.

**999. (9) సాధారణ మనిషి యొక్క మరణమునకు, చావుకు మధ్యలో ఏమి కలదు.?**

జ॥ జీవితము కలదు.

**వివరము :** మనిషి మరణించిన తర్వాత జన్మకల్గును. జన్మ తర్వాత ఎంతో కొంత కాలమునకు మరణము సంభవించును. పుట్టుకనుండి చావు వరకు ఉన్న బ్రతుకునంత జీవితము అంటాము. కావున మరణముకు, మరణముకు మధ్యలో జీవితము కలదని చెప్పవచ్చును.

**1000. (10) యోగియొక్క యోగమునకు, యోగమునకు మధ్యలో ఏమి కలదు.?**

జ॥ కార్యము (యోచన).

**వివరము :** యోగి యోగమును వీడిన వెంటనే అతనిలో గుణముల యోచనలు పొడచూపును. యోచనలు కర్మరీత్య కార్యమును చేయుచుండును. యోగి తిరిగి యోగము చేయువరకు మధ్యకాలములో ఎన్నో కార్యములు చేయవలసి వచ్చును. ఒకవేళ కార్యము చేయకుండిన యోచనలన్నా చేయవలసివచ్చును. బయటి కార్యములు చేయకుండిన, మనస్సులో మనో కార్యములైన యోచనలన్నా చేయవలసివచ్చును. బయటి కార్యములు చేయకుండిన మనస్సు మనోకార్యములైన యోచనయిన చేయుట వలన అతను కార్యము చేసిన దానితో సమానమే అగును. అందువలన యోగియొక్క యోగమునకు, యోగమునకు మధ్యలో కార్యము కలదని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొడమల** **తేది-25-09-2006**

**1001. (1) నీ శరీరగృహములో కర్మాచరణ లేని వాడెవడు ?**

జ॥ పరమాత్మ.

**వివరము :** శరీరములో ఏ కార్యము చేయనివాడు ఒకే ఒక పరమాత్మ. కర్మాచరణ అనగా పాపపుణ్య కార్యములైన చెడు మంచి కార్యములని, వాటిని చేయువాడు శరీరమంత వ్యాపించిన ఆత్మని చాలామంది సులభముగ తలచవచ్చును. జీవాత్మ ఏకార్యము చేయడములేదు కదా అని కూడ తలచవచ్చును. కాని జీవాత్మ కూడ సుఖదుఃఖములను అనుభవించు పనిచేయుచున్నాడు కదా! కర్మ ఫలితమును అనుభవించడము కూడ ఒక విధమైన కార్యమే అగుచున్నది. పనిగాని, అనుభవము గాని రెండు కర్మకు సంబంధించినవే. కావున రెండు కర్మాచరణలోని భాగములే

అగుచున్నవి. సుఖమును అనుభవించు జీవుడు నా అదృష్టము (పుణ్యము) అని అనడము, అట్లే దుఃఖమును అనుభవించుచున్నపుడు నా దురదృష్టము (పాపము) అనడము జరుగుచున్నది. అనుభవములు రెండు జీవునివే, అట్లే జీవుని అనుభవము కొరకు చేయు మంచి చెడు కార్యములు రెండు ఆత్మవి. ఆత్మ కార్యముగాని, జీవాత్మ అనుభవములనిగాని పాపపుణ్యములను బట్టియే కలవు. కావున కార్యములు అనుభవములు రెండు కర్మాచరణకు సంబంధించినవే. అందువలన శరీరములోని ఆత్మ జీవాత్మలు రెండును కర్మాచరణ కలవారే. శరీరములో జరుగు ఏ కార్యమునకు గాని, ఏ అనుభవమునకు గాని సంబంధము లేకుండ పరమాత్మ అతీతముగా ఉన్నాడు.

**1002. (2) నీ శరీర గృహములో కర్మాచరణ కలవాడెవడు ?**

జు॥ ఆత్మ మరియు జీవుడు.

**వివరము :** కార్యము + అనుభవము = కర్మాచరణ. ఈ సూత్రము ప్రకారము కార్యములు చేయు ఆత్మకాని, పాపపుణ్యములను అనుభవించు జీవాత్మగాని ఇద్దరు కర్మాచరణ కలవారేనని చెప్పవచ్చును. కర్మాచరణతో పరమాత్మకు సంబంధములేదు.

**1003. (3) నీ శరీర గృహములో ఆత్మను చూడగలదేది ?**

జు॥ పరమాత్మ.

**వివరము :** బ్రహ్మయోగము చేయు సమయములో మాత్రము బుద్ధి ఆత్మను చూడగలదు. సాధారణ మనిషి బ్రహ్మయోగికాదు, కనుక శరీర గృహములో బుద్ధి మనో విషయములను చూడగల్గుచున్నది, కాని ఆత్మను చూడలేదు. శరీరములో అహర్నిశలు ఆత్మను చూడగలిగినది, ఆత్మకు సాక్షిగ ఉన్నది ఒకే ఒక పరమాత్మ. ఆత్మను చూడగలిగినది పరమాత్మ తప్ప ఎవరు లేరు.

**1004. (4) నీ శరీర సంసారములో చిక్కుకొన్న వాడెవడు ?**

జు॥ ఆత్మ.

**వివరము :** శరీర బయట సంసారములో చిక్కుకోవడము అందరికి తెలుసు. ఒక కుటుంబములో అందరి మధ్య మెలుగుచు వారికి అనుగుణముగ నడుచుకోవడమును కుటుంబములో చిక్కుకొన్నట్లు అనుకొందాము. అదే విధముగ శరీరములోపల 25 భాగములతో సంబంధము పెట్టుకొని, వాటితో కలిసి మెలగుచున్నవాడు శరీర కుటుంబములో చిక్కుకొన్నవాడని చెప్పవచ్చును. శరీరములో అన్ని అవయవముల మధ్యనుంటు వాటికి అనుగుణముగ నడుచుచున్నది ఆత్మ, కావున శరీర సంసారములో చిక్కుకొన్నవాడు ఆత్మయని చెప్పవచ్చును. శరీరములో 25 భాగముల మధ్యలో కాక ఒకచోట ప్రత్యేకముగ నున్నవాడు జీవాత్మ కావున శరీర సంసారములో చిక్కుకోక ప్రక్కనున్నవాడు జీవాత్మయని చెప్పవచ్చును.

**1005. (5) నీ శరీర సంసారములో ఇమిడియున్నవాడెవడు ?**

జ॥ పరమాత్మ.

**వివరము :** శరీరము లోపల శరీరము బయట అంతట ఆవహించినవాడు పరమాత్మ. శరీర భాగములలో కూడ అంతర్యామియై ఇమిడి కనిపించకయున్నవాడు పరమాత్మ. శరీర అవయవము వేరై తాను వేరైయున్నవాడు ఆత్మ. శరీర అవయవములకంటే వేరుగనున్న ఆత్మ శరీర అవయవములకు శక్తినిచ్చి నడిపించుచున్నది. పరమాత్మ ఏ అవయవములకు వేరుగ లేదు, ఏ అవయవములను నడిపించడము లేదు. ఏ అవయవమునకు అన్యదలేకుండ అవయవములందే ఐక్యమైయున్నది. అందువలన శరీర సంసారములో ఇమిడియున్నది పరమాత్మ అని చెప్పవచ్చును.

**1006. (6) నీ శరీరగృహములో ఎంత మంది గలరు ?**

జ॥ 27 మంది.

**వివరము :** స్త్రీతత్త్వము గలవారు అనగ ప్రకృతికి సంబంధించిన భాగములు 24

గలవు. అట్లే పురుషతత్త్వము గలవారు అనగ పరమాత్మకు సంబంధించిన వారు ముగ్గురు గలరు. అందరు కలిస్తే మొత్తము 27 మంది గలరని చెప్పవచ్చును.

**1007. (7) నీ శరీరగృహములో ఎవడెవడు గలడు ?**

జ॥ జీవాత్మ, ఆత్మ, పరమాత్మ.

**వివరము :** ఇక్కడ ఎవడెవడు అని పురుషులను మాత్రమే అడిగారు. కనుక శరీరములోని ముగ్గురు పురుషులనే చెప్పుట సరియైన జవాబు, కావున జీవాత్మ, ఆత్మ, పరమాత్మ గలరని చెప్పవచ్చును.

**1008. (8) నీ శరీరగృహము ఏ ప్రదేశములో గలదు ?**

జ॥ పరమాత్మయను ప్రదేశములో గలదు.

**వివరము :** దేశము అంటే కంటికి కనిపించునది. ఉపదేశము అనగ కనిపించకుండ ఉండునదని ఆధ్యాత్మిక భావము. అలాగే ఆధ్యాత్మిక అర్థములో ప్రదేశమునకు కూడ ప్రత్యేకమైన అర్థము కలదు. ప్రపంచ జ్ఞానరీత్య కనిపించునది ప్రదేశమైతే, ఆత్మ జ్ఞానరీత్య కనిపించని ప్రదేశము కూడ కలదు. "ప్ర" అను అక్షరమునకు ప్రత్యేకమైన విశేషభావము కలదని ముందే తెలుసుకొన్నాము. బోధ ప్రబోధ అన్నట్లు దేశమునకు ప్రదేశమునకు తేడా గలదు. ప్రదేశము అనిన ఉపదేశము లాంటి ప్రత్యేకమైన దేశమని అర్థము. ఉపదేశమనిన, ప్రదేశమనిన ఆధ్యాత్మిక అర్థము ప్రకారము పరమాత్మ అని అర్థము. అణువణువున అంతట వ్యాపించిన పరమాత్మయే ప్రదేశము. కావున శరీరము ఎక్కడుండిన పరమాత్మయందే కలదు, కావున పరమాత్మయను ప్రదేశములో శరీరగృహము కలదని చెప్పవచ్చును. శరీరమే ప్రకృతి కావున శరీరము ప్రకృతిలో ఉన్నదని వ్రాయకూడదు. ప్రకృతి కూడ పరమాత్మయందు కలదు కావున శరీర ప్రకృతి పరమాత్మ అను ప్రదేశములో ఉన్నదనుట సరియైన జవాబు.

**1009. (9) నీ శరీరగృహములో దీపమునకు నూనె ఏది ?**

జ॥ పరమాత్మ.

**వివరము :** లోకములో సూర్యుడు వెలిగినట్లు శరీరములో ఆత్మ వెలుగుచున్నదని భగవద్గీతలో కూడ చెప్పబడియున్నది. సూర్య కిరణములు లోకమంత ప్రకాశించి నట్లు ఆత్మశక్తి అను వెలుగు శరీరమంత వ్యాపించియున్నది. ఆత్మకు శక్తినిచ్చి వెలుగునట్లు చేయువాడు పరమాత్మ. ఆత్మ వెలుగుటకు నూనెవలె పరమాత్మ ఉపయోగపడుచున్నది. చాలామంది ఆత్మకు కర్మనూనె అనుకొంటున్నారు. ఆ విధముగ అయితే శరీరములో ప్రారబ్ధకర్మ అయిపోతే ఆత్మ దీపము ఆరిపోవాలి. అనగ ఆత్మనశించిపోవాలి. అలా నశించక వేరు శరీమువరకు పోవుచున్నది. ఆత్మకు నూనె అను శక్తియై వెలుగునిచ్చువాడు పరమాత్మ, కావున ఆత్మ శరీరములో ప్రారబ్ధకర్మ అయిపోయిన తర్వాత కూడ మనగలుగుచున్నది. కర్మ జీవిత నాటకము ఆడే విధానమే కాని ఆడించేశక్తి కాదు. శరీరములో ఆత్మకు ఆచరణను సూచించునది కర్మ. ఆత్మకు వెలిగే శక్తినిచ్చునది పరమాత్మ.

**1010. (10) నీ శరీరగృహములో వెలిగే దీపమేది ?**

జ॥ ఆత్మ.

**వివరము :** ఇక్కడ శరీరమును ప్రమిదగ, ఆత్మను దీపముగ, పరమాత్మను చమురుగ చెప్పుకోవలసియున్నది.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపాడమల** **తేది : 07-10-2006**

**1011. (1) నీవు ఆహారము తింటున్నది ఆకలికా? రుచికా ?**

జ॥ రుచికి.

**వివరము :** ఆహారము తింటున్నది కడుపుకొరకే అయిన ఇక్కడ ఆకలి, రుచి

అనునవి విడివిడిగ రెండున్నవి. ఆకలి కడుపులో, రుచి నోటిలో నాలుకమీద కలదని అందరికి తెలుసు. శరీర బలము కోసము ఆకలి అగుచున్నది. జీవుని ఆశ (కామము) నిమిత్తము రుచి కలదు. ఆత్మ శరీరమునకు శక్తి నిచ్చుటకు ఆహారము అవసరము, కావున ఆకలి ఆత్మ సంబంధమైనది. జీవుని ఆశ తీర్చుకొనుటకు రుచి ఉన్నది కావున రుచి జీవుని సంబంధమైనది. మానవుడు ఎల్లపుడు అహముతో కూడుకొని, జీవ భావముతోనే ఆహారము తింటు రుచిని అనుభవిస్తున్నాడు. అందువలన ఇవి రుచిగల పదార్థములు, ఇవి రుచిలేని పదార్థములని చెప్పగల్గుచున్నాడు. తిన్నది ఏ ఆహారమైన కడుపునిండుచున్నది. కాని తిన్నది ఏ ఆహారమైన అందులోని రుచులను అనేకముగ జీవుడు అనుభవిస్తున్నాడు. మనిషి ఆహారము తింటున్నది ఆకలికే, అయిన అందులోని రుచులనే కోరుకొంటున్నాడు. ఎవడు రుచిలేని ఆహారము తినాలని అనుకోడు. కడుపు నిండి లోపలికి పోలేని స్థితి ఏర్పడుచున్నది కాబట్టి మనిషి కొంతసేపే, కొంతే తింటున్నాడు. అటువంటి పరిస్థితి లేకపోతే రుచి కొరకు ఎంతైన, ఎంతసేపైన తినేవాడే. అందువలన మనము ఆకలికంటే రుచికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చుచున్నాము. ఆహారము ఆత్మయొక్క ఆకలికి అనుకోకుండ మన రుచికే అనుకొంటున్నాము కాబట్టి మనము తింటున్నది రుచి కొరకే అని చెప్పాలి. ఆకలికొరకే ఆహారమైతే ఒకే ఆహారమును ఎన్నుకొనేవారము. ఆహారము రుచికొరకే తింటున్నామనుకోవడము వలన అనేక ఆహారములను అనేక రకములుగ చేసుకొని తింటున్నాము. ఇంకా ఎక్కువ రుచికోసము ఏ విధముగ చేసుకోవాలని వంట వార్పు ప్రోగ్రాము చూస్తున్నాము. నేను అను భావముతో తింటున్న వారంత రుచికేనని తెలియాలి.

**1012. (2) నీ శరీరములో అణువైన ఆత్మ ఏది ?**

జ॥ జీవుడు.

**వివరము :** శరీరములో మూడు ఆత్మలు గలవు. ప్రకృతితో తయారైన శరీరములో

మూడు ఆత్మలను పరిశీలించి చూచితే శరీరములో ఒక్కచోట ఒక్క అణువువలె నున్నది జీవాత్మ. జీవుడు ఏ శరీరములోనైన రవ్వంత పరిమాణములో ఉన్నాడని తెలియుచున్నది. శరీరములో తలయందు ఎంతో చిన్నదైన గుణచక్రములో, దానిలోని చిన్నదైన ఒక భాగములో, ఒకే ఆకారముతో అణుపరిమాణములో ఉన్నవాడు జీవాత్మ అని తెలియాలి. ఈ ఆత్మల విషయములు, వాటి పరిమాణము, **త్రైత సిద్ధాంత భగవద్గీతలో** చెప్పబడినది. శరీరము ఎంత పెద్దదైన జీవుడు ఒక అణువంతవాడే.

**1013. (3) నీ శరీరములో అణువుకంటే పెద్ద ఆత్మ ఏది ?**

జ॥ ఆత్మ.

**వివరము :** శరీరములో ఒక చోట అణువైన ఆత్మ జీవాత్మ కాగ, శరీరమంత వ్యాపించి జీవునికంటే పెద్దగనున్న ఆత్మ రెండవ ఆత్మ. ఆత్మ శరీరములో మాత్రము వ్యాపించియుండి శరీరము బయటలేదు. కావున నీ శరీరములో అణువైన జీవాత్మకంటే ఆత్మ పెద్దదని చెప్పవచ్చును.

**1014. (4) శరీరములో సమానముగ ఉన్న ఆత్మ ఏది ?**

జ॥ పరమాత్మ.

**వివరము :** ఒక్క శరీరములో చిన్నది జీవాత్మ, పెద్దది ఆత్మకాగ, అన్ని శరీరములలో సమానముగ వ్యాపించియున్నది పరమాత్మ. ఒక్క శరీరములోనే కాక అన్ని శరీరములలో ఏమి చేయకుండ జీవాత్మ ఆత్మలకంటే పెద్దదిగ ఉన్నది పరమాత్మ. ఒక్క శరీరములో కర్మాధీనమై కర్మాచరణ కల్గియున్నవి జీవాత్మ, ఆత్మలు. అన్ని శరీరములలో ఏ కర్మాచరణ లేకుండ ఒకే స్థితిలో సమానముగ ఉన్నది పరమాత్మ.

**1015. (5) శరీరములో వ్యాకోచ సంకోచములు గల ఆత్మ ఏది ?**

జ॥ ఆత్మ.

**వివరము :** శరీరములో వ్యాకోచ సంకోచములుగల ఆత్మ ఒకటే గలదు. అదియే

రెండవ ఆత్మ. జీవుడు శరీరములో పెద్దగ వ్యాపించడము, చిన్నగ సంకోచించడము చేయడము లేదు. జీవుడు ఎల్లపుడు ఒకే స్థితిలో ఉండును. జీవుడు గుణచక్రము వదలి బయటికి వచ్చువాడు కాడు. పరమాత్మ అనిన అది ఎల్లపుడు అంతట నిండియున్నది. పరమాత్మ ఎప్పుడు మార్పు చెందునది కాదు. ఇకపోతే శరీరములో రెండవ ఆత్మ జీవుని జన్మలో శరీరమందు బ్రహ్మనాడిని చేరి, అచటనుండి నాడుల ద్వార శరీరమంత వ్యాపించుచున్నది. అట్లు జన్మలో ఒకమారు వ్యాపించిన ఆత్మ జీవుని మరణము వరకు శరీరమంతయుండి మరణ సమయములో తిరిగి సంకోచించి బ్రహ్మనాడి చేరి, అచటనుండి బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములతో సహా మరొక శరీరమునకు వెళ్ళిపోవుచున్నది. మరొక శరీరములో జన్మతో ప్రవేశించిన ఆత్మ అచటకూడ శరీరమంత వ్యాపించి జీవితమంత ఉంటున్నది. ఇట్లు ఆత్మ జన్మలో శరీరమందు వ్యాకోచము చెంది, మరణములో సంకోచము చెందుచున్నది. అందువలన శరీరములో వ్యాకోచ సంకోచముగలది ఆత్మని చెప్పవచ్చును.

### 1016. (6) ఒక అజ్ఞాని శరీరములో ఎన్ని ఆత్మలుండవచ్చును ?

జ॥ మూడు ఆత్మల తర్వాత ఎన్ని అయిన ఉండవచ్చును.

**వివరము :** ఒక శరీరములో సర్వసాధారణముగ మూడు ఆత్మలుంటాయి. అవియే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ. అజ్ఞాని శరీరములోనికి సూక్ష్మశరీరములు కూడ చేరవచ్చును. కావున వాని కర్మను బట్టి ఎన్ని ఆత్మలైన ఉండవచ్చును.

### 1017. (7) ఒక జ్ఞాని శరీరములో ఎన్ని ఆత్మలుండవు ?

జ॥ నాలుగు ఐదు ఆత్మలుండవు.

**వివరము :** జ్ఞాని శరీరములో జ్ఞానశక్తి ఉంటుంది. కావున సూక్ష్మ శరీరములు చేరుటకు వీలుండదు. సూక్ష్మశరీరములు జ్ఞాని శరీరములో ఉండవు కనుక

నాలుగైదు ఆత్మలుండవని చెప్పుచున్నాము. సూక్ష్మశరీరములో రెండు ఆత్మలుండును కావున నాలుగైదు అన్నాము.

**1018. (8) నీకు నాకు ఏమి తేడాగలదు ?**

జ॥ కర్మలో తేడా గలదు.

**వివరము :** మనిషికి మనిషికి ఆకారములో, అందములో, కులములో, బలములో, అధికారములో, అంతస్థులో, ధనములో, దానములో, మమతలో, మర్యాదలో, చావులో, పుట్టుకలో ఎన్నో తేడాలుండవచ్చును. ఆ తేడాలన్నిటికి మూల కారణము కర్మ. కావున మనిషికి మనిషికి కర్మలో తేడాగలదని చెప్పవచ్చును. ఆ విధముగనే నీకు నాకు కర్మలోనే తేడా గలదు.

**1019. (9) జీవితములో ఉన్నది, మోక్షములో లేనిది ఏది ?**

జ॥ కర్మ.

**వివరము :** కర్మ ఉంటేనే జీవితము, కర్మలేకపోతే మోక్షము. ఈ సూత్రము ప్రకారము కర్మసాహిత్యమే జీవితము. కర్మరాహిత్యమే మోక్షము. అందువలన జీవితములో ఉన్నది, మోక్షములో లేనిది ఒకే ఒక కర్మ అని చెప్పవచ్చును.

**1020. (10) దేవునికి లేనిది, దయ్యానికి ఉన్నది ఏది ?**

జ॥ కర్మ.

**వివరము :** శరీరమున్న మనిషి అయిన శరీరములేని దయ్యమైన జీవితమునే గడుపుచున్నారు. జీవితము కర్మవలన కల్గుచున్నది. దయ్యానికి కూడ కర్మ కలదు, దాని ప్రకారము జీవితము కలదు. దేవునికి శరీరములేదు, జీవితములేదు, వాటికి మూలకారణమైన కర్మలేదు. కావున దేవునికి లేనిది, దయ్యానికి ఉన్నది, ఒకే ఒక కర్మ అని చెప్పవచ్చును.

## జ్ఞాన పరీక్ష

**చిన్నపొడమల** **తేది-05-11-2006**

**1021. (1) శరీరములో శబ్దమును విని ఉలిక్కిపడువాడు జ్ఞానియా? అజ్ఞానియా ?**

జ॥ జ్ఞాని.

**వివరము :** ప్రతి శరీరములోను ఒక జ్ఞాని, ఒక అజ్ఞాని ఇద్దరుంటారు. సజీవ శరీరములో జీవునితో పాటు ఆత్మ కూడ ఉంటుంది. ఆత్మయే, సర్వము తెలిసిన జ్ఞాని. జీవాత్మయే సర్వము తెలియని అజ్ఞాని అని చెప్పవచ్చును. జీవాత్మ ఎంత జ్ఞాని అయిన కొంత తెలియనిదే ఉండును. కనుక జీవాత్మను అసంపూర్ణ జ్ఞాని అనవచ్చును. శరీరములో సంపూర్ణ జ్ఞానము కల్గినవాడు ఆత్మయే కావున ఆత్మను సంపూర్ణ జ్ఞాని అని అనవచ్చును. శరీరములో ఊహను, జ్ఞానమును జీవునికి అందించువాడు ఆత్మయేనని గీతలో కూడ చెప్పబడినది. శరీరమంతట వ్యాపించియున్న ఆత్మ జ్ఞాని అయినపుడు అతని అనుమతితో బ్రతుకుచున్న జీవుడు అజ్ఞాని అవుచున్నాడు. ఆత్మ జీవాత్మ నివాసము శరీరమే కావున ఒక జ్ఞాని, ఒక అజ్ఞాని శరీరములో ఉన్నారని అంటున్నాము. శరీరములో శబ్దమును జీవాత్మకంటే ఆత్మే ముందు వింటున్నాడు. ఆత్మ తర్వాతే జీవాత్మకు శబ్దము బుద్ధి ద్వార తెలియుచున్నది. శబ్దమును మనస్సు బుద్ధికి అందించగ, బుద్ధి జీవునికి అందించు చున్నది. మనస్సుకు జ్ఞానేంద్రియమైన చెవి అందించుచున్నది. ఈ వరుస క్రమములో చెవుకు శబ్దము తెలిసిన వెంటనే శరీరమంతట వ్యాపించియున్న ఆత్మకు మనస్సుకంటే ముందే తెలియుచున్నది. ఈ విధముగ శబ్దమును జీవునికంటే ముందే వింటున్న ఆత్మ కొన్ని శబ్దములకు మాత్రము అప్పుడప్పుడు ఉలిక్కి పడడము జరుగుచున్నది. శబ్దము యొక్క వినికిడికే కాక అపుడపుడు కొన్ని దృశ్యములకు, కొన్ని స్పర్శలకు ఉలిక్కిపడడము జరుగుచున్నది. గమనించదగ్గ విషయమేమంటే శబ్ద, రూప, స్పర్శలకు ఉలిక్కిపడు ఆత్మ నాలుక అందించు రుచికి, ముక్కు అందించు వాసనకు ఉలిక్కిపడడము లేదు. నాలుక ముక్కు రెండు ద్వంద

కార్యములు చేయుచున్నవని జ్ఞప్తిలో పెట్టుకోవలెను. ప్రత్యేకించి ఒక్క పనిని మాత్రము చేయుచున్న కన్ను, చెవి, చర్మము యొక్క శబ్దమునకు, దృశ్యమునకు, స్పర్శకు మాత్రమే ఆత్మ శరీరమును ఉలిక్కిపడునట్లు చేయుచున్నది.

ఆత్మ ఉలిక్కిపడడము వలన భయపడుచున్నదా అని కొందరడుగవచ్చును. భయము వేరు ఉలిక్కిపడడము వేరు. ఆత్మకు భయము ఉండదు. భయపడడము జీవునికి మాత్రమే ఉన్నది. శరీరము ఉలిక్కి పడినంతమాత్రమున ఆత్మ భయపడినట్లు కాదు. ఇక్కడ కొందరికి మరొక ప్రశ్నరావచ్చును. అదేమనగా ఆత్మ భయపడక పోతే ఉలిక్కిపడడము దేనికని అడుగవచ్చును. దీనికి జవాబేమనగా! ఉలిక్కిపడడములో పెద్ద జ్ఞానసందేశము కలదని చెప్పవచ్చును. మానవుడు పుట్టినప్పటి నుండి అజ్ఞానములో మునిగియున్నాడు. శరీరమే తానని, అన్నితానే చేయుచున్నానని, తన శరీరము తాను చెప్పినట్లే చేయుచున్నదను అహము కల్గియున్నాడు. తనకంటే గొప్పవాడు తన శరీరములో ఉన్నాడని ఎవరికి తెలియదు. అటువంటి అజ్ఞానులకు శరీరములోనే తనకంటే వేరుగనున్న ఆత్మ ఒకటున్నదని, అదియే శరీరమునకు శక్తియై కదలించుచున్నదని తెలుపు గొప్ప జ్ఞానసందేశమే ఉలిక్కి పడడము. ఉలిక్కిపడడము జ్ఞానసందేశమని ఏ నిఘంటువులో ఉన్నదని, ఏ ఋషులు చెప్పారని కొందరడుగవచ్చును. ఇది ఇంతవరకు ఏ నిఘంటువులోలేని మాట, ఏ ఋషులు చెప్పని మాట ఇప్పుడు మేము చెప్పుచున్నాము. అలా చెప్పడమే నా ప్రత్యేకత. మీకు ఇష్టమైతే వినవచ్చు, ఇష్టము (శ్రద్ధ) లేకపోతే వినకపోవచ్చు. మీ నిర్ణయము మీదే ఆధారపడి ఉంటుంది.

## 1022. (2) శరీరములో జ్ఞాని ఉంటాడా? అజ్ఞాని ఉంటాడా?

జ॥ జ్ఞాని అజ్ఞాని ఇద్దరు ఉన్నారు.

**వివరము :** శరీరములో ఎల్లపుడు ఇద్దరు నివాసముంటారు. వారే ఆత్మ, జీవాత్మలు. సజీవముగనున్న శరీరములో ఈ రెండు ఆత్మలు తప్పక ఉంటాయి. ఇందులో జీవాత్మ అజ్ఞానికాగ, ఆత్మ సర్వము తెలిసిన జ్ఞాని అని ముందు ప్రశ్నకు జవాబులో

కూడ చెప్పుకొన్నాము. శరీరములోని జీవాత్మ ఎంత జ్ఞాని అయినప్పటికి ఏదో ఒక విషయములో ఆత్మకంటే తక్కువగ తెలిసియుండుట వలన ఆత్మ ప్రక్కన జీవాత్మ అజ్ఞానిగానే ఉన్నది. అట్లే జీవాత్మ ప్రక్కన ఆత్మ జ్ఞానిగ ఉన్నది. ఈ విధముగ శరీరములో జ్ఞాని అజ్ఞాని ఇద్దరు ఉన్నారని చెప్పవచ్చును.

**1023. (3) శరీరములో రోగమొచ్చినపుడు రోగగ్రస్థుడు ఎవడు?**

జ॥ ఆత్మ.

**వివరము :** శరీరములో రోగమొచ్చినపుడు రోగము శరీరమంత వ్యాపించి యుండును. అట్లుకాకపోతే కొన్ని రోగములు శరీరములో కొంత భాగమునకే వ్యాపించి యుండును. జ్వరము మొదలగు కొన్ని రోగములు శరీరమంత ఉండగ, క్షయ కాన్సర్ మొదలగునవి శరీరములో కొంత భాగము వరకే ఉండును. శరీరములో రోగగ్రస్థుడు ఎవడు అన్నపుడు శరీరములో గల ఆత్మ జీవాత్మలకే ఆ ప్రశ్నవర్తించును. జీవాత్మ తలలోగల చతుర్చక్రసముదాయములో క్రింది చక్రమైన గుణచక్రమందు నివశిస్తున్నది. గుణచక్రములోనికి యోగముతప్ప రోగము చేరదు. కనుక జీవాత్మ ఎప్పటికి రోగగ్రస్థుడు కాడు. శరీరమంత వ్యాపించియున్నది ఆత్మ. అందువలన శరీరమంత రోగమొచ్చిన లేక శరీరములో ఒక భాగమునకు రోగమొచ్చిన రోగము పొందునది ఆత్మయే అందువలన రోగగ్రస్థుడు ఆత్మయేనని చెప్పవచ్చును. రోగము యొక్క బాధను అనుభవించువాడు జీవాత్మ. రోగముయొక్క బాధను అనుభవింపని వాడు ఆత్మ.

**1024. (4) శరీరములో యోగమొచ్చినపుడు యోగగ్రస్థుడు ఎవడు?**

జ॥ జీవాత్మ.

**వివరము :** శరీరములో యోగమునకు రోగమునకు ఎంతో తేడాగలదు. రోగము ఆత్మకు మాత్రమే వస్తుంది. యోగము జీవాత్మకు మాత్రమే వస్తుంది. యోగము గుణచక్రములో జీవునివద్దనే పుట్టుచున్నది. అందువలన యోగమును జీవుడే పొందును. జీవునికి అంటుకొనియున్న బుద్ధికి యోగమేర్పడుట వలన బుద్ధితో

పాటు జీవుడు యోగగ్రస్థుడు అగుచున్నాడు. ఇక్కడ యోగగ్రస్థుడు ఎవడు అన్న దానివలన బుద్ధి పురుషుడు కాదు కావున పురుషుడైన జీవున్ని యోగగ్రస్థుడు అనవలసి వచ్చినది. రోగము యొక్క అనుభవమును అట్లే యోగము యొక్క అనుభవమును బుద్ధి జీవునికే అందించుచున్నది. కావున రోగమునుకాని, యోగమునుకాని అనుభవించువాడు జీవుడే. ఇటు శరీరము మొత్తమునకు అటు జీవాత్మకు అణుసంధానమైనది బుద్ధి. బుద్ధియొక్క పని జీవునకు అనుభూతిని అందించడమే. కావున ఇటు శరీరములోని అటు గుణచక్రములోని అనుభవము లను బుద్ధి జీవునికి అందించుచున్నది. యోగము వచ్చినది గుణచక్రములోనే కావున యోగగ్రస్థుడు జీవుడే అగుచున్నాడు.

## 1025. (5) శరీరములో ఊపిరిని ఎవరు ఊపినారు?

జ॥ ఆత్మ.

**వివరము :** శరీరములో ఉన్నది జీవాత్మ ఆత్మయే, అయిన జీవాత్మ ఏ పని చేయక కేవలము కష్టసుఖ అనుభవములను మాత్రము అనుభవిస్తుండును. శరీరములో అన్ని పనులు చేయుచున్నది ఒకే ఒక ఆత్మ. ఆత్మ శరీర అవయవములను కదలించి పని చేయిస్తున్నది. శరీరములోపల ఊపిరితిత్తులను కదలించి శ్వాస ఆడునట్లు చేయుచున్నది ఆత్మయే. అందువలన శరీరములో ఊపిరిని ఊదువాడు ఆత్మని చెప్పవచ్చును. శరీరములోని అన్ని పనులను ఆత్మే చేయుచున్నది, చేయిస్తున్నది. అనుభవించడము తప్ప ఏ పని చేయనివాడు జీవాత్మయే.

## 1026. (6) శరీరములో ఊపిరియందు ఏ ఆత్మ ఉన్నది?

జ॥ పరమాత్మ.

**వివరము :** ఊపిరి శరీరమునకు వేరుగ ఉన్నది. ఆత్మ శరీరములోని ఊపిరితిత్తులను అదిమినపుడు అందులోని గాలి బయటికి త్రోయబడుచున్నది. ఊపిరితిత్తులు వేరు, గాలి వేరు. ఊపిరితిత్తులలో ఆత్మ వ్యాపించియున్నది. గాలి శరీరము

కాదు కావున ఊపిరిలో ఆత్మలేదు. ఊపిరిలో ప్రపంచమంత వ్యాపించియున్న పరమాత్మ కలదు. అణువణువున పరమాత్మ కలదు కావున ఊపిరిలో పరమాత్మయే కలదని చెప్పవచ్చును.

**1027. (7) శరీరములో ఆకలికి ఆహారము, రోగమునకు ఔషధము అంటారు. ఆహారమెవరికి? ఔషధమెవరికి?**

జ॥ ఆత్మకు.

**వివరము :** ఆకలి కడుపులో పుట్టుచున్నది కావున శరీరమంత వ్యాపించియున్న ఆత్మకే ఆకలి అని చెప్పవచ్చును. అలాగే రోగము కూడ శరీరమునకే వస్తున్నది కావున రోగగ్రస్థుడు ఆత్మే అగుచున్నాడు. అందువలన ఆకలికి వేయు ఆహారము గాని, రోగమునకు వేయు ఔషధముగాని రెండు ఆత్మకేనని చెప్పవచ్చును. ఆకలికి, రోగమునకు బాధపడునది జీవాత్మే అయిన ఆహారము, ఔషధము అత్మకే ఉపయోగపడును.

**1028. (8) శరీరములో రోగానికి ఔషధమున్నట్లు, యోగానికి ఔషధమేదైనా ఉన్నదా? ఉంటే ఏది?**

జ॥ ఉన్నది. మాయ.

**వివరము :** శరీరములో రోగమును లేకుండ చేయునది ఔషధము. దీనినిబట్టి రోగమునకు వ్యతిరేఖముగ ఔషధము పని చేయుచున్నదని తెలియుచున్నది. ఆ విధముగనే యోగమునకు వ్యతిరేఖముగ మాయ పనిచేయుచున్నది. శరీరములో గుణముల రూపములోనున్న మాయ యోగమును జీవుడు కోల్పోవునట్లు చేయుచున్నది. అందువలన యోగానికి ఔషధము మాయ అని చెప్పవలసి వచ్చినది.

**1029. (9) శరీరములో శబ్దము యొక్క పుట్టుక కంఠములోన, కడుపులోన, కాలులోన, వ్రేలులోన, ముక్కులోన, మూతిలోన ఎక్కడ?**

జ॥ శరీర భాగములోనే శబ్దము పుట్టుచున్నది.

**వివరము :-** ఆత్మ శరీరమును కదలించుచుండుట వలన శరీరములో కార్యములు జరుగుచున్నవి. ఆత్మశక్తిచే శరీరము నడుచునపుడు కాలు కీల్లలో శబ్దము వచ్చుచున్నది. అట్లే జీర్ణము చేయునపుడు కడుపులో శబ్దము వచ్చుచున్నది. మాట్లాడునపుడు కంఠములో శబ్దము వస్తున్నది. పని చేయునపుడు జారుడు కీలువలన వేలులోను శబ్దము పుట్టుచున్నది. శ్వాస ఆడునపుడు ముక్కులోను, అన్నము తినునపుడు, ఈల వేయునపుడు నోటిలోను శబ్దము వస్తున్నది. ఆత్మశక్తి చేతనే ఆయా స్థలములలో శబ్దము పుట్టుచున్నది. శబ్దము ఎక్కడ పుట్టుచున్నదో అదే దాని పుట్టుక స్థలమని చెప్పవచ్చును. డోలును కొట్టునపుడు శబ్దము డోలువద్దనే పుట్టుచున్నది. డోలును కొట్టు చేతిలో శబ్దము పుట్టలేదు. శబ్దము యొక్క పుట్టుక చేయా, డోలా అంటే డోలే అని ఎట్లు చెప్పగలమో, అలాగే ఆత్మ శరీరమును కదలించి శరీరములో శబ్దము పుట్టుటకు కారణమైనప్పటికి ఆత్మలో శబ్దము పుట్టలేదు. శరీర భాగములోనే శబ్దము పుట్టుచున్నది. అందువలన శరీర భాగములలోనే శబ్దము యొక్క పుట్టుక అని చెప్పవలెను.

**1030. (10) శరీరములో చనిపోయినపుడు పోవునవి ప్రకృతియా? ఆత్మలా? ఏవి పోతాయి?**

జు॥ ప్రకృతి, ఆత్మలు.

**వివరము :** చనిపోయినపుడు శరీరమునుండి పోవునది బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్ర సముదాయము. ఈ నాలుగు చక్రములలో క్రింది రెండు చక్రములలో ముఖ్యమైన సారాంశముండును. క్రింది చక్రమైన గుణచక్రములో ప్రకృతి జనితమైన గుణములు గలవు. మరియు జీవాత్మ కూడ కలదు. అలాగే నాలుగు చక్రములకు ఇరుసుగ ఆత్మ కూడ కలదు. కావున మరణములో గుణమయమైన ప్రకృతి మరియు జీవాత్మ, ఆత్మలు పోవుచున్నవని చెప్పవచ్చును.

# జ్ఞాన పరీక్ష

**తేది-04-04-2015 - త్రైతశకము-37 - చిన్నపొడమల (తాడిపత్రి మం॥)**

**గమనిక :- ప్రశ్నకు తగిన జవాబును ఒక మాటలోగానీ, ఒక వాక్యములో గానీ వ్రాయవలెను.**

సహజముగా ప్రతి మనిషీ తనను తాను గొప్పగా తలచుకొనుచుండును. ప్రపంచ జ్ఞాన విషయములోగానీ, పరమాత్మ జ్ఞాన విషయములో గానీ ఇతరులకంటే తాను తెలిసినవాడినని అనుకొనుచుండును. జ్ఞానము ధనములాంటిది. అందువలన పెద్దలు జ్ఞానధనము అని జ్ఞానమును ధనముతో సమానముగా పోల్చారు. ప్రపంచ ధనము ఎంతయున్నా తనవద్ద ధనమున్నదని చెప్పుకోని మనిషి, జ్ఞానధనము ఏమాత్రము లేకున్నా తనయొద్ద అందరికంటే ఎక్కువున్నదని చెప్పుకొనుచుండును. ప్రపంచ ధనమును ఉన్నా లేదని చెప్పు మనిషి, జ్ఞానధనమును లేకున్నా ఉన్నదని చెప్పుకోవడము జరుగుచున్న విషయమే. కొందరు దేవుడు చెప్పిన జ్ఞానమును మార్చివేసి, తమ సొంత భావములను దేవుని భావములుగా చెప్పుచూ, సమాజములో గొప్ప జ్ఞానులుగా చలామణి అగుచుందురు. వాస్తవానికి వారివద్ద యున్నది ఏమాత్రము జ్ఞానము కాకున్నా, తమది జ్ఞానమేయని ఇతరులను నమ్మించి మోసము చేయుచుందురు. దైవజ్ఞానమును కబ్జా చేసినవారు భూమిమీద అన్ని సమాజములలో ఉన్నారు. జ్ఞానమును కబ్జా చేసినవారు ఎవరూ గుర్తుపట్టని పెద్ద మోసగాళ్ళుగా యున్నారు. అయితే కొందరు ఒకరివద్దయున్న జ్ఞానమును హైజాక్ చేసి, ఇతరులు చెప్పు జ్ఞానము తమ జ్ఞానమే అని ప్రచారము చేసుకొని, బయట సమాజములో పెద్ద జ్ఞానులుగా చలామణి అగుచున్నారు. వాస్తవానికి వారివద్ద జ్ఞానము లేకున్నా, తాము కూడా గురువులుగా చలామణి కావలెనను ఉద్దేశ్యముతో, గురువు జ్ఞానమునే హైజాక్ చేసి గురువుకంటే తమనే పెద్దగా ప్రచారము చేసుకొనుచుందురు.

మనుషులకొరకు దేవుడు జ్ఞానమును గ్రంథరూపములో చెప్పితే దానిని కబ్జా చేసి, దేవుని గ్రంథముకంటే తమనే గొప్పగా ప్రటించుకొన్న సమాజ పెద్దలు కొందరుండగా, కొన్నిచోట్ల జ్ఞానమును చెప్పువారివద్ద చేరిన కొందరు, గురువుగారి జ్ఞానమును హైజాక్ చేసి తమను గురువుకంటే పెద్దగా ప్రకటించు కొన్నవారు కూడా కలరు. ఈ విధముగా ఎవరికి వారు మేము పెద్ద జ్ఞానులము అను ఉద్దేశ్యములో ఉన్నారని తెలిసిన దేవుడు వారి నిజస్వరూపము వారికే అర్థమగులాగున, వారికి జ్ఞానములో ఎంత హోదావున్నదో తెలియునట్లు అక్కడక్కడ పరీక్షకు గురిచేసి ఎవనిది వానికి అర్థమగునట్లు చేయుచుండును. దేవుడు మనిషిని సమస్యల రూపములో పరీక్షించుచుండును. **దేవుని జ్ఞానమును దేవుడు సమస్యల రూపములో పరీక్షించి ఎవరి స్థోమత ఎంతయుందో వారికే అర్థమగునట్లు చేయుచుండును.** అది దేవుని పనికాగా ఒక మనిషిగా మేము ప్రశ్నల రూపములో ప్రశ్నించి అందులో మీరు వ్రాసిన జవాబులనుబట్టి మీకు జ్ఞానము ఎంత యున్నదో తెలియునట్లు చేయుచున్నాము. ఇక్కడ ప్రశ్నించు వారము మేమే అగుటవలన వాటికి సరియైన జవాబును చెప్పవలసిన బాధ్యత కూడా మాకున్నది. అందువలన ఇక్కడ జ్ఞానపరీక్షలో ప్రశ్నించిన మేము ఆ ప్రశ్నలకు జవాబులను కూడా పొందుపరచి వ్రాయుచున్నాము. జవాబులు చెప్పవలసినది మేమని మా ఇష్టము వచ్చిన జవాబును మేము చెప్పలేదు. ప్రశ్నకు సరియైన జవాబుగా ఉండునట్లు, బ్రహ్మవిద్యాశాస్త్రమునకు లోబడి యుండునట్లు, దైవజ్ఞానమునకు ఎక్కడా వ్యతిరేఖము లేనట్లు జవాబులు వ్రాయడము జరిగినది.

**1031. (1) ఏ చరిత్రకూ అందనివాడు ఒకడు గలడు. అతనిని మూడు అక్షరముల పేరుతో పిలుస్తాము. రెండు అక్షరముల అర్థముతో చెప్పుకొంటాము. అతను ఎవరు?**

జ॥ ఈ ప్రశ్నకు జవాబు వ్రాసిన వారందరూ 'దేవుడు' అని జవాబు వ్రాయడము జరిగినది. చరిత్రకు అందనివాడు అని అన్నప్పుడు చరిత్ర లేనివాడు దేవుడే కదా!యని అందరూ అనుకోవడము జరిగినది. అంతేకాక మూడు అక్షరముల పేరుకలవాడు అని అన్నప్పుడు దేవుడేయని నిర్ణయించు కొని అదే జవాబునే అందరూ వ్రాయడము జరిగినది. అయితే ఇక్కడ దేవునికి పేరు లేదు కదా!యను విషయమును అందరూ మరచిపోయారు. వాస్తవానికి పేరు, ఆకారము జీవునికి, ఆత్మకు రెండిటికే కలదని, దేవుడు పేరు, ఆకారము లేనివాడని మరచిపోయారు. అందువలన అందరూ తప్పు జవాబును వ్రాయడము జరిగినది. ఈ ప్రశ్నకు అసలు జవాబును క్రింది పేరాలో చూడండి.

జీవుడు సృష్ట్యాదినుండి ఉన్నాడు. ఒకే జీవుడు ఒకమారు పుట్టి, ఒకమారు చస్తూ జన్మలు మారుచూ వచ్చుచున్నాడు. జనన మరణ గమనములో ప్రయాణించుచున్న జీవుడు సృష్ట్యాదినుండి నేటివరకు ఉన్నాడు. ఈ దినము ఒక మనిషిగాయున్న నేనుగానీ, నీవుగానీ మొదటి నుండి ఈ భూమిమీదనే జీవించుచున్నాము. అయితే గతములో భూమిమీద మనము జీవించిన చరిత్ర మనకున్నా గడచిన చరిత్ర ఎవరిది వారికి తెలియదు. ఒకనిది మరొకనికీ తెలియదు. అందువలన జీవున్ని చరిత్రకు అందనివాడు అని అనవలసివచ్చి నది. ఒక మనిషి (జీవుడు) గత జన్మలో ఎన్నో కష్టసుఖములను అనుభవించి యున్నా గతజన్మల అనుభవములను ఎవడూ చరిత్రగా వ్రాయలేదు. ఏమాత్రము ఊహించుకొని కూడా ఇలా జరిగిందని చెప్పలేదు. ఈ విధముగా జీవుడు చరిత్రకు అందనివాడేకాక అతడు ఆత్మశక్తితో కూడుకొని జీవించు చున్నాడు. అందువలన రెండక్షరముల అర్థముతో జీవ+ఆత్మ=జీవాత్మ అని చెప్పబడుచున్నాడు. ప్రతి జీవునితోనూ ఆత్మ కూటస్థునిగాయుండుట వలన ప్రతి జీవున్నీ జీవాత్మయని పిలువవచ్చును. అంతేకాక ప్రతి శరీరములోని

జీవుడు జీవాత్మగా పిలువబడినా, జీవునిగా పిలువబడినా అతను మూడక్షరముల పేరుతోనే పిలువబడుచున్నాడు. అందువలన ఈ ప్రశ్నలో చరిత్రకు అందని వానిని మూడక్షరముల పేరుతో పిలువబడువాడు అని అడిగాము. ఈ ప్రశ్నకు అన్ని విధములా సరియైన జవాబు 'జీవుడు' అని వ్రాయవలెను. అయితే అందరూ 'దేవుడు' అని వ్రాసిన దానివలన పూర్తి తప్పు జవాబుగా లెక్కించడము జరిగినది. ఈ పరీక్షలో ఏడు వందలమంది పాల్గొంటే అందరూ తప్పు జవాబును వ్రాసి రావలసిన మార్కును పోగొట్టుకున్నారు.

**1032. (2) ఆకాశమని దేనిని అంటారు?**

జ॥ ఈ ప్రశ్నకు చాలామంది ఏమాత్రము బుద్ధితో ఆలోచించకుండా 'శూన్యము' అని వ్రాశారు. 'గగనము శూన్యము' అను మాట ప్రకారము నూటికి తొంభైమంది శూన్యమను జవాబును వ్రాయడము జరిగినది. శూన్యము అనడములో తప్పులేదుగానీ, ఇక్కడ అడిగిన విధానమునకు చెప్పిన సమాధానము సరియైనది కాదు. ఇక్కడ 'ఆకాశమని దేనిని అంటాము' అని అడగడము జరిగినది. ఒకవేళ దేనిని ఆకాశమని, ఆకాశమును వెనుక చెప్పియుంటే శూన్యమను జవాబు కొంతవరకు సరిపోయేది. అయితే ఇక్కడ ప్రశ్నలో ఆకాశమని ముందే చెప్పి దేనిని అని వెనుక చెప్పాము. ముందు చెప్పినా, వెనుక చెప్పినా మీరు అడిగినది ఆకాశమునే కదా!యని అడుగవచ్చును. అయితే ముందు వెనుక అడగడములో కొంత తేడా యున్నది. 'ఆకాశమని దేనిని అంటాము' అని అడిగినప్పుడు రంగు, రూపు, పరిమాణమున్న ఒక పదార్థముగా చెప్పవలసి వచ్చినది. ఏదో ఒక ముక్కను చూపి దానిని ఆకాశమని చెప్పవలసియున్నది. ఒకవేళ 'శూన్యము' అని చెప్పిన జవాబు, ఒకటి అయిన దేనినీ చూపించదు. శూన్యము అనినా అది అంతటా వ్యాపించినదై రంగు

రూపులేనిదైవుంటూ ఒక వస్తువుగా లేక ఒక పరిమాణముగల ఆకారముగా కనిపించదు. అటువంటప్పుడు 'దేనిని' అను మాట సరిపోదు. 'దేనిని' అన్నప్పుడు అది గుర్తింపబడునదిగా ఉండవలెనను సూక్ష్మమును ఈ ప్రశ్నలో జ్ఞాపకముంచుకోవలెను.

ఆకాశము పంచభూతములలో మొదటిది, పెద్దది మరియు అంతటా వ్యాపించినది. అటువంటప్పుడు ఒక భాగముగానో, ఒక ఆకారముగానో వర్ణించి చెప్పుటకు వీలులేకుండా ఉండును. ప్రకృతి రూపములోయున్న పంచభూతములు ఒక్కొక్కటి ఒకరకమైన పనిని చేయుచుండును. ఏ పనీ లేనివాడు క్రియారహితుడు దేవుడు ఒక్కడే. పని చేయునది ప్రకృతి అయినందున ప్రకృతిలోని ఐదు భాగములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అన్నీ వాటివాటి పనులు చేయవలసియున్నది. భూమి పంటలనిచ్చునదేకాక, భూకంపములను సృష్ఠించును. నీరు పైరుకు, మనుషులకు ఒక భాగమైన ఆహారముగా ఉండుటయేకాక వరదలు, సునామీలను సృష్ఠించును. అగ్ని ఆహారమును పచనముచేయడమేకాక దావానలమై అన్నిటినీ దహించివేయును. గాలి అన్ని జీవరాసులకు ప్రాణవాయువును ఇచ్చునదేకాక దేనినైనా కూలద్రోయును. ఇకపోతే ఆకాశము అక్కడక్కడ మేఘముగా మారిపోయి వర్షించునదే కాక మనిషికి తెలియని ఎన్నో కార్యములను చేయుచున్నది. ఆకాశము మేఘరూపమై వ్యాధులను భూమి మీద వదలుచున్నది. తర్వాత ఆ వ్యాధులను భూమిమీదనుండి తీసుకొని పోవుచున్నది. ఈ విధముగా ఆకాశము 'మేఘము' అను పరిమాణముగల ఒక ఆకారముగా మారి తన కార్యమును తాను చేయుచున్నది. ఆకాశము మేఘముగా మారుటవలన మేఘమునకు రంగు, రూపు, కార్యము అని ఏర్పడినవి. అందువలన ఒక పరిమాణమున్న మేఘమును ఒక దానిగా భావించి 'దేనిని?' అని ప్రశ్నించడము జరిగినది.

ఆకాశమును ఒక పరిమాణముగల దేనిగాయున్నదని ప్రశ్నించడము జరిగినది. 'దేనిని?' అని ప్రశ్నవచ్చినప్పుడు ఆకాశము ఒక ఖండము (ఒక ముక్క) కాదు కదా! అలాంటప్పుడు 'దేనిని' అని ఒక గుర్తింపుగా ఎందుకు అడిగారని జవాబు చెప్పువారు ఆలోచించవలసియున్నది. అయితే అటువంటి ఆలోచన చేయకుండా మేఘమంటే శూన్యమని వ్రాయడము వలన ఆ జవాబును తప్పుగా లెక్కించవలసి వచ్చినది. ఈ ప్రశ్నకు వాస్తవమైన జవాబు "మేఘము" అని వ్రాయవలెను.

**1033. (3) "నేనే మార్గమును, సత్యమును, జీవమును నా ద్వారా తప్ప తండ్రి యొద్దకు ఎవడూ రాలేడు." ఈ మాటను ఎవరన్నారు?**

జ॥ ఈ ప్రశ్నకు కూడా బహుకొద్దిమంది తప్ప మిగతా వారందరూ ఏసు అని వ్రాశారు. బైబిలులో ఏసు అలా చెప్పాడని క్రైస్తవులు అనుచుండుట వలన ఆ మాటను విన్నవారంతా ఏసు అని జవాబు వ్రాశారు. ఇక్కడ కూడా ఈ జవాబును తప్పుగా పరిగణించడము జరిగినది. ఇందులో తప్పు ఏముంది? ఆ మాట అన్నది ఏసే కదా!యని అందరూ అనుకోవచ్చును. అయితే ఇక్కడ అందరికీ తెలియని తతంగము ఒకటిగలదు. అదేమనగా! 'నేనే మార్గమును' అని మొదటే చెప్పడము జరిగినది. మార్గము అన్న తర్వాత దానికి గమ్యము కూడా ఉంటుంది. ఇక్కడ ఆధ్యాత్మికరీత్యా "గమ్యము" అనునది "మోక్షము లేక దేవున్ని చేరడము" అని చెప్పవచ్చును. **"దేవునివద్దకు చేరుటకు నేనే మార్గమును, నా ద్వారా తప్ప తండ్రియొద్దకు ఎవడూ రాలేడు"** అని ఉండడము గమనిస్తే దేవుడు ఎవరికి తండ్రి అని ముందు చూసుకోవలసిన అవసరమున్నది.

దేవుడు ఆత్మకు తండ్రికాగా, ఆత్మ భౌతికముగా కనిపించు ఏసుకు తండ్రిగాయున్నది. ఏసు అని జవాబు చెప్పితే అతను తనకు తండ్రియను చెప్పుకొను ఆత్మవద్దకు పోవాలంటే 'నేనే మార్గము' అని చెప్పియుండాలి.

ఆధ్యాత్మికరీత్యా అసలయిన గమ్యము, అందరికీ గమ్యము దేవుడే అయినందున ఆత్మ గమ్యము కాదని తెలిసిపోయినది. భౌతికముగా కనిపించు ఏసుకు ఆత్మ తండ్రికాగా, ఆత్మకు తండ్రి దేవుడైయున్నాడు. ఏ మనిషి అయినా చివరికి చేరవలసింది దేవునివద్దకే కావున, ఈ మాటను ఏసు చెప్పలేదనీ, ఏసు లోపలయున్న ఆత్మయే చెప్పినదని చెప్పవలసి యున్నది. ఎవడయినా కానీ దేవునివద్దకు చేరాలంటే ఆత్మ ద్వారానే చేరవలసియున్నది. అందువలన ఏసు అని వ్రాయబడిన జవాబు తప్పుగా లెక్కించవలసి వచ్చినది. ఎవరయితే ఆత్మయని వ్రాశారో వారి జవాబును సరియైనదిగా పరిగణించడమైనది.

**1034. (4) రోగములు, ఔషధములు ఒక్కచోటే ఉన్నాయి, ఎక్కడ?**

జ॥ ఈ ప్రశ్నకు జవాబు 'రోడ్డు ప్రక్కన' అని బహుకొద్దిమంది వ్రాయగా, ఎక్కువమంది 'శరీరములో' అని వ్రాశారు. అంతేకాక ఒకరు లేక ఇద్దరు సరియైన జవాబు వ్రాయడము కూడా జరిగినది. రోగములు, ఔషధములు శరీరములోనే ఉన్నాయి అని వ్రాయడము కొంతవరకు సమంజసమే అయినా దానికంటే మెరుగైన జవాబు మరొకటియుండడము వలన 'శరీరములో' అనుమాటను అసలయిన జవాబుగా తీసుకోలేదు. ఒక జవాబు చెప్పితే దానిని గురించి రెండవ ప్రశ్న ఉండకూడదన్నదే మా ఉద్దేశ్యము. అందువలన 'శరీరములో' అను మాటకంటే ఉత్తమమైన జవాబును పరిగణలోనికి తీసుకోవడము జరిగినది. రోగములు ఔషధములు ఒక్కచోట ఉన్నాయి అన్నప్పుడు, అ ఒక్కచోటును ఖచ్చితముగా గుర్తించి చెప్పవలసిన అవసరమున్నది. ఒకవేళ 'శరీరములో' అన్నమాటను తీసుకొంటే రోగములు ఔషధములు శరీరములో ఉన్నమాట వాస్తవమే, అయినా రెండవ జవాబుగా శరీరములో ఫలానాచోటనే ఉన్నాయి అని చెప్పవలసివచ్చును. అందువలన శరీరము అను జవాబుకంటే ఉత్తమమైన జవాబుగా శరీరములో ఒక ప్రత్యేకమైన

జాగాను చెప్పవలసివచ్చినది. రోగములు పాపము వలన, ఔషధములు పుణ్యమువలన ఉంటాయి. దీనినిబట్టి రోగములకు, ఔషధములకు మూల కారణమైన పాపపుణ్యములు ఎక్కడుంటాయో అక్కడే రోగములు, ఔషధములు ఉన్నాయని చెప్పవచ్చును. రోగములకు, ఔషధములకు మనిషి కర్మే కారణమై నందున మనిషి శరీరములో కర్మ ఎక్కడుండునో అక్కడే అతని రోగములు, ఔషధములున్నాయని చెప్పవచ్చును. మనిషి శరీరములోని కర్మ అతని తలలోని కర్మచక్రములోయున్నది. కర్మ చక్రములోని కర్మ రోగములకు, ఔషధములకు నిలయమైనందున ఈ ప్రశ్నకు సరియైన జవాబుగా 'కర్మలో'యని చెప్ప వచ్చును. లేకపోతే 'కర్మచక్రములోయున్న కర్మలో' యని కూడా చెప్పవచ్చును. 'శరీరములో' అను మాటకంటే 'కర్మలో' అనుమాట ఉత్తమమైన జవాబుగా యున్నట్లు తలచవలెను.

**1035. (5) దైవజ్ఞానమును ఒక్కరు తప్ప ఎవరూ చెప్పలేరు? ఆ ఒక్కరు ఎవరు?**

జ॥ 'దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఏ మానవునికీ తెలియదు' అని ఒక దైవగ్రంథములో వ్రాయబడియున్నది. ఒక మనిషి దైవజ్ఞానమును తెలియాలంటే మరొక మనిషి ద్వారానే తెలియవలసియున్నది. అయితే దైవగ్రంథములోని వాక్యములో దేవునికి తప్ప వేరెవరికీ తెలియదని యుండుట వలన దేవుని జ్ఞానమును దేవుడే చెప్పవలసియున్నది. అయితే దేవునికి రూపములేదు మరియు దేవుడు మాట్లాడడు అను నియమముతో యున్నాడు. అందువలన దేవుడు ప్రత్యక్షముగా తన జ్ఞానమును మనిషికి తెలుపడు అని అర్థమయినది. అయితే దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు ఎవరికీ తెలియని దానివలన, దేవుడే ప్రత్యక్షముగా కాకున్నా పరోక్షముగానయినా చెప్పవలసియున్నది. దేవుడు పరోక్షముగా చెప్పవలసి వస్తే మనుషుల ఆకారములోనికి వచ్చి, మనుషుల

భాషలోనే చెప్పవలసియున్నది. దేవుడు మనిషిగా రావచ్చునుగానీ, మనిషి దేవుడు కాలేడు. దేవుడు మనిషిగా వచ్చినప్పుడు దేవుడుగా కాకుండా మనిషిగా కనిపించినా, అతను మనిషి కాడు. దేవుని జ్ఞానమును చెప్పువాడు దేవుడే అయినా అటు దేవుడూకాక, ఇటు మనిషీకాక రెండిటికీ తప్పిన వాడుగా యుండును. కనిపించేది మనిషి ఆకారమే అయినా అతను మనిషి కాడు. చెప్పేది దేవునిజ్ఞానమే అయినా అతను దేవుడు కాడు. అటు మనిషీ కాకుండా, ఇటు దేవుడూ కాకుండా మనిషిగా కనిపించు వానిని మనిషి అని అనలేము, అట్లే దేవుడు అని కూడా అనకూడదు. మనిషికి దేవునికి మధ్యలో మరొక పేరుగల వానిగా చెప్పవచ్చును. ఆ పేరే భగవంతుడు. భగవంతుడు అంటే దేవుడూ కాదు, మనిషి కాదని అర్థము. దేవుడు తన జ్ఞానమును మనుషులకు చెప్ప వలసివచ్చినప్పుడు భగవంతుడు అను మారుపేరుతో, మారువేషముతో వచ్చి చెప్పిపోవును. భగవంతుడు మనిషిగాయున్నా అతని శరీరములో పరమాత్మయే ఆత్మగా, జీవాత్మగా చీలి పని చేయుచుండును. జీవాత్మగా ప్రపంచములో కలుగు కష్ట సుఖములను అనుభవించుచూ సాధారణ మనిషివలె యున్నా, భగవంతుడుగా జ్ఞానము చెప్పవలసి వచ్చినప్పుడు ఆత్మగా జ్ఞానమును చెప్పుచున్నాడు. పరమాత్మగా సాక్షిభూతుడై ఒకే శరీరములో యుండడము జరుగుచున్నది. దైవజ్ఞానమును భగవంతుడు లేక గురువు అనబడు మనిషి చెప్పినా అతనిలోని ముగ్గురు పురుషులయిన జీవాత్మ, ఆత్మ, పరమాత్మలలో రెండవ వాడయిన ఆత్మయే జ్ఞానమును చెప్పును. అందువలన ఈ ప్రశ్నలో "దైవజ్ఞానమును ఒకరు తప్ప ఎవరూ చెప్పలేరు, ఆ ఒక్కరు ఎవరు?" అని అడిగాము. చాలామంది 'గురువు' అని వ్రాశారు. ఇంకా కొందరు 'భగవంతుడు' అని వ్రాశారు. గురువు, భగవంతుడు అని వ్రాసినా రెండూ సరియైన జవాబులే అయినప్పటికీ, ఇంకా లోతుగా చెప్పగలిగితే ఆత్మ అని చెప్పడమే సరియైన జవాబగును. గురువు లేక భగవంతుడు అని చెప్పితే అందులో

కూడా దేవుడు ముగ్గురు పురుషులుగా విభజింపబడి యుండుట వలన ముగ్గురిలో ఖచ్చితముగా ఎవరు అను ప్రశ్న రాగలదు. చివరికి ప్రశ్న మిగలకుండా చెప్పబడు జవాబే సరియైన జవాబగును. అందువలన ఈ ప్రశ్నకు ఆత్మ అని చెప్పడమే సక్రమమైన జవాబుగా లెక్కించడము జరిగినది.

**1036. (6) పాము అని పిలువబడుచు పాముకానిది ఏది?**

జ॥ ఇక్కడ మేము ప్రశ్నించినది ఆధ్యాత్మిక రంగములోని ప్రశ్న. అందువలన జవాబు కూడా ఆధ్యాత్మికముగానే ఉండవలెను. ఈ ప్రశ్నలను పొడుపు ప్రశ్నలుగా లెక్కించకూడదు. కొందరు అలాగే లెక్కించి అటువంటి జవాబునే వ్రాశారు. పాముకాని పాము వానపాము అని వ్రాశారు. అయితే దానిని మేము ఏమాత్రము జవాబుగా లెక్కించలేదు. కొందరు అలా వ్రాసినా చాలామంది సరియైన జవాబును వ్రాసి మార్కును సంపాదించుకొన్నారు. ఈ ప్రశ్నకు సరియైన జవాబు 'వెన్నుపాము' అని వ్రాయుట సరియైన జవాబగును. పాము తల తోక కలిగి కొంత పొడవుగాయుండి తలనుండి తోకవైపు పోనుపోను చిన్నగా ఉండును. మన శరీరములోని బ్రహ్మనాడి అనబడు పెద్ద నరము పాము ఆకారమును పోలియుండుట వలన వెన్నుపాము అని పేరుపెట్టి బ్రహ్మనాడిని పిలువడము జరుగుచున్నది.

**1037. (7) కర్మలేనిది జన్మలేదు అంటారు వాస్తవమేనా?**

జ॥ ప్రతి మనిషికి కర్మలేనిది జన్మ కలుగదు అనుమాట వాస్తవమే అయినా ఇక్కడ కొంత ఆలోచించవలసిన అవసరమున్నది. మనిషిగానీ, ఏ జీవరాసిగానీ పుట్టిందంటే దాని పుట్టుకకు కారణము కర్మయని అందరికీ తెలిసిన విషయమే. అయితే దేవుడు మనిషికి తన జ్ఞానమును తెలియజేయు నిమిత్తము మనిషిగానే వచ్చి పుట్టవలసియున్నది. అలా దేవుడు కనిపించు మనిషిగా పుట్టినా అతనికి కర్మ ఉండదు. దేవుడు మనిషిగా వస్తే ఆయన జన్మకు కర్మ కారణము

కాదు. దేవుడు కర్మలేనివాడు. కర్మలేని దేవుడు భగవంతుడు అనబడు మనిషిగా పుట్టునప్పుడు ఆయనకు కర్మలేదు. భగవంతుడు పుట్టిన తర్వాత లేని కర్మను సృష్ఠించుకొంటాడుగానీ, ఆయన పుట్టక ముందు ఆయనకు కర్మలేదని చెప్పవచ్చును. అందువలన భగవంతుని పుట్టుకకు కర్మలేదనీ, కర్మలేకుండా పుట్టువాడు భగవంతుడని చెప్పవచ్చును.

**1038. (8) కన్నును నేత్రమని ఎందుకు అన్నారు?**

జ॥ 'కన్ను' అను పదము 'కన్నము' అను పదమునుండి పుట్టినది. కన్నము అనగా రంధ్రము అని అర్థము. ముఖములో ఎముకచేత ఏర్పడిన రంధ్రములో నేత్రము ఉండుట వలన కన్నములోనిది అని తెలియునట్లు దానిని కన్ను అని అనడము జరుగుచున్నది. అందరూ నేడు నేత్రమును కన్ను అను పదముతోనే పలుకుచున్నారు. ఎక్కువ శాతము మనుషులు కన్ను అను పదమునే చెప్పుచున్నా కొన్ని సందర్భములలో కొన్నిచోట్ల మాత్రము కన్నును నేత్రము అంటున్నారు. నేత్రమును కన్ను అని ఎందుకు అన్నారో తెలిసిపోయినది. అయితే కన్నును నేత్రమని ఎందుకు అన్నారో ఇప్పుడు చెప్పుకోవలసియున్నది. కన్నములోయున్నది కన్ను అన్నట్లే త్రైతముతో యున్నది నేత్రము అని చెప్పవచ్చును. నేను ఇప్పుడు చెప్పునది కాదుకానీ, పూర్వము పెద్దలు మూడు భాగములుగాయున్నది నేత్రము అని అన్నారు. నేత్రము యొక్క అర్థమును పరిశీలించి చూస్తే, ఈ నేత్రము పదములో 'నేత్ర' అను రెండు అక్షరముల సారాంశముగల అర్థముతో కూడుకొన్నదని చెప్పవచ్చును. 'ము' అను అక్షరమునకు అర్థము లేదు పదమును ముగించుటకు 'ము' అను శబ్దమును వాడవలసివచ్చినది. నేత్రము అను మూడక్షరముల పదములో రెండక్షరములకే మనము అర్థము చెప్పుకోవలసియున్నది. "త్ర" అను అక్షరమును గమణించితే మూడు అని తెలియగలదు. త్రయము అనగా మూడు అని అర్థము. త్రయము

అను పదములో మొదటి అక్షరమును తీసుకొని నేత్రములో రెండవ అక్షరముగా చెప్పారు. 'నేత్ర' అను రెండు అక్షరములలో 'త్ర' పోగా మిగిలినది నే అను అక్షరము. నే అను అక్షరము నేర్పుట లేక నేర్చుట అను పదములో మొదటి అక్షరముగా వాడబడుచున్నది. నేర్పుట అను అర్థమునుండి నే అను అక్షరమును తీసుకొని నేత్ర అని పదముగా చెప్పడము జరిగినది. నేత్ర అను పదమునకు ముగింపు అక్షరముగా 'ము' అను అక్షరమును చేర్చి నేత్రము అని అన్నారు. నేత్రము లేక నేత్ర అనగా మూడును నేర్పునదని అర్థము. మూడు భాగములుగా కన్ను కలదు. తెల్లని గుడ్డులో నల్లని గుడ్డు ఉండగా, నల్లని గుడ్డులో చిన్నగా మరియొక గుండ్రని భాగము నల్లగా కనిపించుచుండును. అలా ఎవరి కన్నును చూచినా మూడు భాగములుగానే ఉండును. నేత్రములోని మూడు భాగములకు ఒక్కొక్క దానికి ఒక్కొక్క గుర్తింపుగలదు. అందులో పూర్తి తెల్లగయున్న విశాల భాగమునకు లేక పెద్ద భాగమునకు పరమాత్మ గుర్తుగా చెప్పవచ్చును. తెల్లని భాగము తర్వాత దానికంటే చిన్నదిగా నల్లని గుండ్రని భాగము కలదు. తెల్ల భాగములోని నల్ల భాగమును ఆత్మగా చెప్పవచ్చును. ఆత్మ యొక్క గుర్తుగాయున్న నల్లని భాగములో మధ్యన నల్లని చిన్న ఆకారముండును. దానిని జీవాత్మగా చెప్పవచ్చును. సృష్ట్యాదినుండి పరమాత్మలోనూ, ఆత్మలోనూ ఎటువంటి మార్పులేదు. అందువలన కంటిలోని ఆ రెండు భాగములలో ఏ మార్పు కనిపించకయుండును. అయితే జీవాత్మ అయిన వాడు ఒక జన్మలో తక్కువ కర్మతోనూ, మరియొక జన్మలో ఎక్కువ కర్మతోనూ పుట్టుచున్నాడు. జీవుడు కర్మనుబట్టి మారుచుండును. అంతేకాక కొన్నిచోట్ల జ్ఞానిగా, కొన్ని చోట్ల అజ్ఞానిగా కూడా ఉండడము జరుగుచున్నది. జీవునిలో అటువంటి మార్పులు ఉండుట వలన జీవాత్మగా గుర్తింపుపొంది చిన్నగా యున్న నల్లని భాగము కూడా మార్పులతో కూడియుండును. ఒక సమయములో చిన్నగా ముకులించు కొనియుండి మరియొక సమయములో పెద్దగా వ్యాకోచము చెందడము కూడా

జరుగుచున్నది. వెలుగులో చిన్నగాయున్న జీవము అను కంటిపాప చీకటిలో పెద్దగా మారడము జరుగుచున్నది. జీవుడు అనేక సందర్భములలో అనేక అనుభవములను పొందుటవలన కష్టాలలో ఒక విధముగా, సుఖాలలో మరొక విధముగా ఉండుట వలన జీవుని ప్రతి రూపముగాయున్న చిన్న నల్లని భాగము కూడా చీకటిలో ఒక రకముగా, వెలుగులో మరొకరకముగా ఉండును. దీనితో కష్ట సుఖాలకు స్పందించువాడు లేక మార్పు చెందువాడు జీవుడు అని తెలియుచున్నది. దేవుడు మూడు భాగములుగా, మూడు ఆత్మలుగా ఉన్నాడని భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమను అధ్యాయమున 16, 17 శ్లోకములలో కలదు. అక్కడ చెప్పిన త్రయితము కన్నులో కనిపించుచున్నది. అందువలన కన్నును నేత్రము అని పెద్దలనడమైనది.

**1039. (9) అత్యంత మెత్తనిది, అత్యంత గట్టిది ఏది?**

జ॥ ఈ ప్రశ్నకు కొందరు తప్పు జవాబు వ్రాయగా, కొందరు సరియైన జవాబు వ్రాశారు. కొందరు మాయ అని అన్నారు. కొందరు దేవుడని, కొందరు రాయి అని వ్రాయడము జరిగినది. కొందరు మాత్రము "మనస్సు" అని వ్రాశారు. మనస్సు అను జవాబే సరియైనదని మేము చెప్పడము జరిగినది. ఒక విషయమును నేను నా ఇష్టమొచ్చినట్లు చెప్పకుండా శాస్త్రబద్ధముగా ఉండునట్లు, జ్ఞానులందరూ ఒప్పుకొన్నదిగా సరిపోవునట్లు చెప్పుచుందుము. మన శరీరములో స్థూల అవయవములు కొన్నియుండగా, సూక్ష్మ అవయవములు కొన్ని గలవు. అందులో కంటికి కనిపించనిది, చేతికి దొరకనిది, కొలతలేనది మనస్సు. మనస్సు కొన్ని విషయములలో చాలా మెత్తగా, కొన్ని విషయములలో చాలా గట్టిగా (కఠినముగా) ఉండునని పెద్దలు చెప్పుచుందురు. ఈ విషయమును ధృవీకరించుచూ వేమనయోగి ఒక పద్యమును కూడా చెప్పాడు.

**పద్యము :-**

ఇనుమున చేసిన మైనపుకడ్డీ
ముంటిమొన నర్రివుల దొడ్డి
కూర్చుండి మేపిన కుందనపుగడ్డి
విప్పి చెప్పరా వేమారెడ్డి.

ఈ పదములో మొదటి చరణములో కడ్డీ అని కలదు. ఆ కడ్డీ ఇనుముతో చేసినదని చెప్పుట వలన చాలాగట్టిగా ఉండి, వంగక ఉండునని అర్థమగుచున్నది. అట్లే వాక్యము చివరిలో మైనపుకడ్డీ అని చెప్పడము వలన అది సులభముగా వంగిపోవునని కూడా తెలియుచున్నది. ఈ విధముగా ఒకే మనస్సు కొన్ని సందర్భములలో ఇనుమువలె కఠినముగా ఉండుననీ, కొన్ని సందర్భములలో మైనపుకడ్డీవలె మెత్తగా ఉండునని చెప్పకనే తెలియుచున్నది. కొందరు సినిమాను చూచునప్పుడు దృశ్యములో బాధాకరమైన సంఘటనయుంటే చూచేవానికి కూడా కన్నీరు రావడము జరుగుచున్నది. దీనినిబట్టి కొందరి మనస్సు కొన్ని సంఘటనలలో వెన్నవలె కరిగిపోతుందని కూడా చెప్పుచుందురు. దీనిని గురించి చెప్పుకొంటే ఎంతో లోతయిన సమాచారము ఉన్నది. అయితే ఇక్కడ సందర్భానుసారము అత్యంతమెత్తనిది, అత్యంతగట్టిది మనస్సని జవాబు చెప్పవచ్చును.

**1040. (10) అత్యంత కష్టమైనది, అత్యంత సులభమైనది ఏది?**

జు॥ ఈ ప్రశ్నకు సరియైన జవాబును నూటికి తొంభైమంది వ్రాశారు. కొందరు మాత్రము 'దేవుడు' అని కూడా వ్రాశారు. దేవుడు అనుమాట కొంతవరకు నిజమే అయినా దానికంటే ఉత్తమమైన జవాబు మరొకటి ఉండడము వలన దేవుడు అనుమాటను మేము ఒప్పుకోలేదు. దేవున్ని తెలియుటకు మొదట దేవుని జ్ఞానము అవసరము. దేవుని జ్ఞానము దేవుడే దిగివచ్చి చెప్పినా మనిషి అర్థము చేసుకోలేని స్థితిలోయున్నాడు. భూమిమీద

ఎంతో మేధావులున్నా వారికి దేవుని జ్ఞానము అవగాహనకు రాలేదు. **మనిషికి శ్రద్ధయున్నప్పుడే జ్ఞానము లభించునని దేవుడు తన ప్రథమ దైవ గ్రంథమయిన భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున 39వ శ్లోకములో చెప్పియున్నాడు.** శ్రద్ధయుండవలెనంటే చాలా కష్టము. ప్రకృతి ఆకర్షణ చేత మనిషి శ్రద్ధ యంతయూ ప్రపంచమువైపు పోవుచున్నది. మనిషి తలలోని గుణముల ప్రభావమును మాయ అని అనుచున్నాము. గుణ ప్రభావమను మాయచేత మనిషి తన శ్రద్ధను దేవునివైపు నిలుపలేకపోవుచున్నాడు. మనిషికున్న శ్రద్ధయంతయూ ప్రపంచమువైపు పోవుట వలన దేవుని జ్ఞానము మనిషికి ఏమాత్రము అర్థముకాక జ్ఞానము అత్యంత కష్టముగా కనిపించు చున్నది.

మనిషి శ్రద్ధ దేవునిమీద వుంటే దేవుని జ్ఞానము అత్యంత సులభముగా అర్థము కాగలదు. అయితే మనిషి శ్రద్ధను మాయ దారి మళ్ళించి ప్రపంచము వైపు పంపుటవలన మనిషి ఎంత మేధావియైనా దేవుని జ్ఞానము ఏమాత్రము అతనికి అర్థముకాకుండా పోయినది. మనిషి దేవుని జ్ఞానము తెలియాలని అనుకొని ప్రయత్నము చేసినా, దేవుని జ్ఞానమును అర్థము కాకుండునట్లు మాయ మనిషి శ్రద్ధను ప్రక్కకు మళ్ళించడము వలన మనిషి జ్ఞానమును తెలియలేకపోతే అది మనిషి తప్పుకాదు కదా! మనిషికి శ్రద్ధను లేకుండా చేసిన మాయది తప్పుకదా!యని కొందరు అడుగవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగాయున్నది. ఇక్కడ పైకి కనిపించు తప్పు మాయదే అయినా ఆ తప్పు మనిషిదేయనీ, మనిషిని బట్టి మాయ అలా చేసిందని చెప్పవచ్చును. వివరములోనికి పోయి చూస్తే, దేవునిమీద పైకి ఇష్టమును కనపరచి లోపల ప్రపంచ ధ్యాసలోయున్న వానిని దేవుడు ఇష్టపడడు. దేవునిమీద విశ్వాసమున్నట్లు అందరికీ కనిపించినా లోపల దేవునిమీదగానీ, దేవుని జ్ఞానముమీదగానీ విశ్వసించని వానిని దేవుడు ఇష్టపడడు. ఇంకా వివరముగా చెప్పితే తన

మతమును ప్రేమించుటయందు శ్రద్ధ కలిగి దేవుని వాక్యమును సహితము లెక్కించని వానిని దేవుడు ఇష్టపడడు. అటువంటి వానిని మాయ కనుకొని దేవునికి ఇష్టములేని వానికి దేవుని జ్ఞానము అర్థముకానట్లు చేయును. అప్పుడు వానికి దేవుని జ్ఞానము అత్యంత కష్టముగా కనిపించును.

ఉదాహరణకు ఈ మధ్యకాలములో శ్రీకాకుళము జిల్లాలో ఒక ముస్లీమ్ వ్యక్తి మేము వ్రాసిన **"అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు"** అను గ్రంథమును చూచి మా భక్తులతో వాదించడము జరిగినది. ముస్లీమ్ సమాజములో పునర్జన్మలు లేవు అని సమాజము మొత్తము చెప్పుకొనుచుండగా మీరు అందరికీ పునర్జన్మలున్నాయని వ్రాశారు. అలా వ్రాస్తే మా సమాజమును కించపరిచినట్లే కదా!యని అడిగాడు. దానికి మా భక్తులు దైవగ్రంథమును దానిని వ్రాసిన ప్రవక్తను గౌరవిస్తూ ఖుర్‌ఆన్ గ్రంథములోయున్న వాక్యము ప్రకారమే చెప్పాముగానీ మాస్వంతముగా చెప్పలేదు కదా!యని అడిగారు. దానికి అతను ఖుర్‌ఆన్ గ్రంథములో రెండు ఆయతులను చూపి మా సమాజమునకు వ్యతిరేఖముగా చెప్పితే మంచిదా!యని అడిగాడు. అలా అతను మాట్లాడడము వలన అతనికి దేవుని వాక్యము మీద నమ్మకము లేదని తెలియుచున్నది. అంతేకాక అతను మతములో మతపెద్దలు చెప్పవలెనంటూ, మతమునకే ప్రాధాన్యత నిచ్చాడుగానీ, దేవుని వాక్యమునకు ప్రాధాన్యత నివ్వలేదు. అటువంటి వారిని మాయ కనుగొని దేవునికి ఇష్టములేనివారికి దైవజ్ఞానము మీద శ్రద్ధలేకుండా చేసి వానిని మతము వైపే పంపునుగానీ, దేవుని వైపు పంపదు. అందువలన దైవగ్రంథమయిన భగవద్గీతలో **"నన్ను ఆరాధించని వానిని, నా మాట మీద నమ్మకము లేని వానిని మాయ నావైపు రానివ్వదు"** అని చెప్పాడు. అటువంటి వానికి మాయ దుస్సాధ్యముగా ఉండును. అటువంటివాడు మాయను జయించనిదే నా వద్దకు రాలేదు అని

కూడా చెప్పాడు. అందువలన శ్రద్ధలేనివానికి జ్ఞానము అత్యంత కష్టమైనదిగా ఉండును. శ్రద్ధయున్నవానికి జ్ఞానము అత్యంత సులభముగా యుండును.

ఇంతవరకు ఒక జ్ఞానపరీక్ష ప్రశ్నలకు జవాబులు చెప్పడము జరిగినది. ఇప్పుడు రెండవ జ్ఞానపరీక్ష ప్రశ్నలకు జవాబులు ఇచ్చుచున్నాము. ఈ పరీక్షలో ప్రశ్నలకు క్రింద నాలుగు జవాబులు ఇవ్వబడియుండును. ఆ నాలుగు జవాబులలో ఒకటి సరియైన జవాబు ఉండును. నాలుగు జవాబులలో సరియైన జవాబును గుర్తించి వ్రాయవలెను. అయితే ఇక్కడ ఇచ్చిన ప్రశ్నలలో ఒక ప్రశ్నకు మాత్రము నాలుగు జవాబులలో కూడా సరియైన జవాబు ఉండదు. ఆ ప్రశ్న ఏదో గుర్తించవలెను. దానికి సరియైన జవాబును స్వంతముగా వ్రాయకున్నా ఫరవాలేదు. ఇప్పుడు రెండవ పరీక్షలోని ప్రశ్నలను జవాబులను క్రింద చూడవచ్చును.

**1041. (1) వీటిలో అక్షయ ఆహారమేది?**

1) చిత్రాన్నము 2) పాలన్నము 3) పెరుగన్నము 4) పరమాన్నము

జ॥ పరమాన్నము.

**వివరము :-** భూమిమీద మనిషికి కావలసిన ఆహారములు రెండు విధములు గలవు. ఒక రకమైన ఆహారమును క్షయ ఆహారము అనీ, రెండవ దానిని అక్షయ ఆహారము అనీ అంటాము. క్షయము అనగా నాశనమనీ, అక్షయము అనగా నాశనముకానిదని అర్థము. క్షయ ఆహారమనగా జీర్ణాశయములో జీర్ణమైపోవునదని అర్థము. అక్షయ ఆహారమనగా నాశనముకాని ఆహారమనీ, ఎల్లకాలము ఒకే విధముగాయుండు ఆహారమని అర్థము. ఇక్కడ పై ప్రశ్నకు క్రింద ఇచ్చిన నాలుగు జవాబులలో జీర్ణమగు ఆహారములు మూడు గలవు. అవి వరుసగా చిత్రాన్నము, పాలన్నము, పెరుగన్నము. ఇకపోతే అక్షయ

ఆహారము చివరిలో పరమాన్నము గలదు. పరమాన్నమును వీడదీసి చూస్తే పరము+అన్నము = పరమాన్నము అని చెప్పవచ్చును. పరమాన్నము అనగా అన్నముకంటే వేరయినదని చెప్పవచ్చును. రెండు రకముల ఆహారములలో మొదటిదయిన క్షయాహారము జీర్ణమై (నాశనమై) పోవును. రెండవ రక ఆహారమైన అక్షయాహారము నాశనము కాని (జీర్ణము కాని) ఆహారముగా ఉన్నది. అటువంటి ఆహారము దేవుని జ్ఞానమే అని దైవగ్రంథములలో చెప్పబడినది. **"దేవున్ని విశ్వసించిన వానికి జీవాహారము ఇవ్వబడును"** అని చెప్పబడినది. ఇక్కడ జీవాహారము అన్నది దైవజ్ఞానమునే అని తెలియవలెను. ఒక మనిషి దైవ జ్ఞానమును తెలియగలిగితే అది వానివద్ద ఆ జన్మలోనేకాక రాబోవు జన్మలలో కూడా వానివెంటనే ఉండును. అలా ఒక మనిషిని అంటుకొని ఎప్పటికీ వానివద్దయుండు జ్ఞానమును నాశనములేని ఆహార మనియూ, అక్షయ ఆహారమనియూ పెద్దలు చెప్పుచున్నారు. దైవ గ్రంథములయిన మూడు గ్రంథములలో అక్షయ ఆహారము సంపూర్ణముగా యున్నది. క్షయాహారము కొరకు మనిషి శ్రమించినా అది మూడు గంటలకే జీర్ణమై పోవును. అక్షయ ఆహారమునకు శ్రమించవలసిన పనిలేదు. ఒకమారు సంపాదించుకొన్నది శాశ్వితముగా అతనిని వదలదు.

**1042. (2) మోసములలో పెద్ద మోసము ఏది?**

1) భార్య భర్తను మోసము చేయుట 2) భర్త భార్యను మోసము చేయుట 3) మనిషిని దేవునిగా మ్రొక్కడము 4) దేవున్ని మనిషిగా మ్రొక్కడము.

జ॥ మనిషిని దేవునిగా మ్రొక్కడము.

**వివరము :-** భార్య భర్తను మోసము చేసినా, భర్త భార్యను మోసము చేసినా, అవి మోసములే అయినా, వాటన్నిటికంటే పెద్ద మోసము మనిషిని దేవునిగా భావించి మ్రొక్కడమని చెప్పవచ్చును. ఇక్కడ కొందరు ఒక ప్రశ్నను

అడుగవచ్చును. దేవుడు మనిషి అవతారముగా వచ్చునని మీరే అంటున్నారు కదా! అలా దేవుడు మనిషిగా వచ్చినప్పుడు మనిషిని దేవుడని నమ్మి మ్రొక్కవచ్చును కదా! అందులో తప్పులేదు కదా! అయితే మీరు మనిషిని దేవుడుగా మ్రొక్కడము పెద్ద మోసమంటున్నారు ఎలా? అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! దేవుడు మనిషిగా రావచ్చునుగానీ, అలా వచ్చిన వానిని ఎవరూ గుర్తించలేరు. దేవుడు మనిషిగా వచ్చి దేవుని జ్ఞానమును చెప్పినా, వచ్చినవాడు ఫలానా వాడని మనిషి గుర్తించలేడు. అంతేకాక దేవుడు మనిషిగా వచ్చినా అతను ఎవరి చేత కూడా గుర్తింపబడడు. గుర్తింపబడనివానిని గుర్తించి మ్రొక్కలేము. అయితే మనిషే తాను దేవుడు కాకున్నా తానే దేవుడనని ప్రకటించుకోవడము వలన ఇతరులు మనిషిని దేవుడని నమ్ముచున్నారు. అలా ఎవరు నమ్మినా నేను దేవుడనని నమ్మించువాడు ఎప్పటికీ దేవుడు కాడు. దేవుడు మనిషివలె రావచ్చునుగానీ, మనిషి దేవునివలె నటించినా మహత్యములను చూపినా దేవుడు కాలేడు. అందువలన తాను దేవుడనని మ్రొక్కించు మనిషి ఇతరులను మోసము చేసినట్లగును. అంతేకాక అది దేవుని విషయమైనందున అతను చేయునది మోసములలోకెల్ల పెద్ద మోసమని చెప్పవచ్చును.

**1043. (3) వీటిలో పండు అని పిలువబడు కాయ ఏది?**

1) కొబ్బరికాయ 2) గుండెకాయ 3) మెడకాయ 4) కరక్కాయ

జ॥ నాలుగు జవాబులలో ఒక్కటి కూడా సరియైన జవాబు కాదు. ఇందులో పండు అని పిలువబడు కాయ ఏది లేదు. ఇక్కడ ముందే చెప్పినట్లు ఒక ప్రశ్నకు మాత్రము జవాబు ఉండదు. ఆ ప్రశ్న ఇదేనని ఇక్కడ ఇచ్చిన నాలుగు జవాబులలో ఒకటి కూడా సరియైనది లేదని తెలిసినది. జవాబులుగా ప్రకటించిన నాలుగు కాయలలో కొబ్బరికాయ అనునది ఎప్పుడూ అదే పేరుతో

పిలువబడుచున్నదిగానీ, కొబ్బరిపండు అని పిలువబడలేదు. అట్లే కరక్కాయ ఎప్పటికీ అదే పేరుతో పిలువబడుచున్నదిగానీ కరకపండు అని ఎప్పుడూ పిలువబడలేదు. కొబ్బరికాయ, కరక్కాయ రెండూ భూమిమీద వృక్ష జాతులకు కాయునవి కాగా, వృక్షముకాని వృక్షమయిన అశ్వర్థ వృక్షమను మానవ శరీరములో కాయ అని పిలువబడు గుండెకాయ, మెడకాయ అను రెండు పేర్లు చెప్పబడినవి. అశ్వర్థ వృక్షమునకు కాయబడిన ఈ రెండు కాయలు ఎప్పటికీ అదే పేరుతో పిలువబడుచున్నవి, ఎప్పటికీ గుండెపండనిగానీ, మెడపండని గానీ ఎవరూ చెప్పలేరు. ఇప్పుడు ఈ నాలుగు కాయలు సరియైన జవాబు కాదని తెలిసిపోయినది.

**1044. (4) అన్నిటికంటే వేగముగా పోవునది ఏది?**

1) కాలము 2) విమానము 3) మనస్సు 4) ఆత్మ

జ॥ ఆత్మ.

**వివరము :-** ఈ ప్రశ్నకు చాలామంది మనస్సు అని జవాబు వ్రాశారు. ఆత్మను వదలితే అన్నిటికంటే వేగమయినది మనస్సే అగును. అయితే ఆత్మయుండుట వలన మనస్సుకంటే వేగమయినది ఆత్మని చెప్పవలసివచ్చినది. వివరములోనికి వెళ్ళితే కాలము నిదానముగా ఒకే వేగముగా నడుచుచుండును. అందువలన కాలము అనునది ఏ విధముగా కూడా ఈ ప్రశ్నకు జవాబుకాదు. రెండవది విమానము అని కలదు. విమానము నాలుగువందల నుండి వెయ్యి కిలోమీటర్ల వేగముతో మాత్రమే పోగలదు. మనస్సుకంటే అతి తక్కువ వేగముకలది విమానము అయినందున విమానము అనునది కూడా సరియైన జవాబుకాదు. కాలము బయట గడియారములో గంటలు, నిమిషములుగా లెక్కించబడు చున్నది. అలాగే విమాన వేగము కూడా కొలవబడుచున్నది. ఈ రెండూ బాహ్య సంబంధమైనవి కాగా, శరీరములో అంతర్ముఖముగా మనస్సు, ఆత్మ

గలవు. అయితే ఆత్మ విషయము ఇంతవరకు ఎవరికీ తెలియదు. ఇప్పుడు మా గ్రంథములలో మాత్రము ఆత్మ అనునది ప్రత్యేకముగా ఉన్నదని చెప్పు చున్నాము. మనిషి శరీరముతో బ్రతికియున్నప్పుడు ఆత్మ చలించక శరీరములోనే యుండును. అయితే మనస్సు మాత్రము మనిషి బ్రతికి యున్నన్నాళ్ళు విషయముల మీదికి వేగముగా ప్రాకుచుండును. మనస్సు ప్రాకు వేగమును 'మనోవేగము' అని కొందరనుచుందురు. మనిషి బ్రతికినప్పుడు మాత్రము వేగముగా విషయముల మీదికి ప్రాకు మనస్సు మనిషి చనిపోయినప్పుడు లేకుండా పోవుచున్నది. అప్పుడు మనస్సు లేదు, మనస్సుకు వేగము లేదు. మనిషి బ్రతికి ఉన్నప్పుడు ఏమాత్రము చలనములేని ఆత్మ మనిషి చనిపోయిన వెంటనే ఆ శరీరములోని జీవున్ని అతని కర్మలను తీసుకొని బయలుదేరి, ఆ జీవుడు ఎక్కడికి వెళ్ళవలసి యున్నదో అక్కడికి అదే క్షణమే చేరిపోవును. జీవుడు ఇండియాలో చనిపోయి అమెరికాలో పుట్టవలసియున్నా అదే సెకండులోనే ఆత్మ జీవునితో సహా వెళ్ళిపోవుచున్నది. ఒకవేళ భూమండలములో కాకుండా చనిపోయిన జీవుడు వేరే గోళము మీద పుట్టవలసియుంటే ఆ గోళము ఖగోళములో ఎంత దూరమున్నా ఆత్మ అదే క్షణము అక్కడికి పోవు వేగము కలదిగాయున్నది. మనస్సుకంటే అతి వేగమయినది ఆత్మ అయినందున ఈ ప్రశ్నకు సరియైన జవాబు ఆత్మయనియే చెప్పవచ్చును.

**1045. (5) ఎక్కువ ఆనందము ఎక్కడ ఉన్నది?**

1) సుఖములోనా 2) దేవునిలోనా 3) ఆత్మలోనా 4) జ్ఞానములోనా

జ॥ జ్ఞానములో.

**వివరము :-** ఈ ప్రశ్నకు నూటికి 95 శాతము సరియైన జవాబు వ్రాశారు. వాస్తవముగా జ్ఞానములో ఉన్న ఆనందము దేనిలోనూ ఉండదని చెప్పవచ్చును. ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగుటకు అవకాశమున్నది. అదేమనగా!

సుఖములో లేని ఆనందమును మనిషి జ్ఞానములో పొందుచున్నాడు అంటే అది నమ్మదగిన మాటే. అయితే దేవుడు మరియు ఆత్మ తర్వాతనే జ్ఞానము గలదు. దేవునికి మరియు ఆత్మకు సంబంధించినదే జ్ఞానము. దేవునిలో లేని ఆనందము దేవుని జ్ఞానములో ఉంటుందా? ఆత్మలోలేని ఆనందము ఆత్మజ్ఞానములో ఉన్నదా?యని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఈ విధముగాయున్నది. మనిషి అనేక విషయములలో లేక అనేక సంఘటనలలో సుఖమును పొందుచున్నాడు. సుఖమును పొందినా ఆ అనుభూతిలో మనిషి పూర్తి ఆనందమును పొందలేకపోవుచున్నాడు. ఎప్పుడయితే ఆత్మజ్ఞానమును పొందుచున్నాడో అప్పుడు చెప్పలేని అనుభూతిని పొందుచున్నాడు. ఆత్మ జ్ఞానమును పొందినప్పుడు అనుభవించిన ఆనందము అంతవరకు ప్రపంచ సుఖములు ఎన్ని అనుభవించినా ఎక్కడా కలుగలేదని తెలిసిపోవుచున్నది. ఆనందములో పొందిన ప్రత్యేకమయిన అనుభవము వలన మనిషి కళ్ళలో నీళ్ళు వస్తున్నవి. దైవజ్ఞానములోగానీ లేక ఆత్మజ్ఞానములోగానీ అంత ఆనందమును మనిషి పొందుచున్నాడని చెప్పు మేము దేవునిలోగానీ, ఆత్మలోగానీ మనిషి జ్ఞానములో పొందిన ఆనందమును పొందలేడని చెప్పుచున్నాము. ఇక్కడ ఈ మాట విన్న ప్రతి ఒక్కరు ఆత్మజ్ఞానములో యున్న ఆనందము ఆత్మలో లేదా? దైవజ్ఞానములోయున్న ఆనందము దేవునిలో లేదా?యని ప్రశ్నించవచ్చును. ఈ ప్రశ్న పద్ధతి ప్రకారము అందరికీ వచ్చును. అయితే మేము అలా చెప్పుటకు కొంత కారణము కలదు. అదేమనగా! మనిషిగాయున్నవాడు అనగా మనిషి శరీరములోని జీవాత్మ బ్రహ్మయోగము చేసినప్పుడు శరీరములోనే యున్న ఆత్మలో కలిసిపోవును. 'పరుసవేది' అను ఆకుపసరు చేత ఇనుపముక్క బంగారుగా మారి పోయినప్పుడు అక్కడ ఇనుపముక్క అనునది లేదు కదా! అలాంటప్పుడు ఇనుపముక్క నల్లగాయున్నదని లేని ఇనుపముక్కను గురించి చెప్పలేము కదా! అలాగే బ్రహ్మయోగముచేత

జీవాత్మ ఆత్మలో కలిసిపోయినప్పుడు ప్రత్యేకించి జీవున్ని గురించి మాట్లాడుటకు జీవుడు లేడు కదా! పరుసవేది చేత బంగారుగా మారిపోయిన ఇనుపముక్కను గురించి ఎలా మాట్లాడలేమో, అలాగే బ్రహ్మయోగముచేత ఆత్మగా మారిపోయిన జీవాత్మ గురించి మాట్లాడలేము. ఎందుకనగా బంగారుగా మారిపోయిన తర్వాత ఇనుపముక్క లేదు, ఆత్మగా మారిపోయిన తర్వాత జీవాత్మలేదు. అందువలన లేని ఇనుమును గురించి, లేని జీవున్ని గురించి మాట్లాడలేము.

ఆత్మలో కలిసిపోయిన జీవాత్మ లేనిదానివలన జీవాత్మ అనుభవించునది ఏదీలేదు. అదే విధముగా దేవునిలో కలిసిపోయిన జీవుడు పూర్తి దేవునిగా మారిపోయివుండును. అటువంటి సమయములో జీవుడు ప్రత్యేకముగా మిగిలిలేడు కాబట్టి దేవునిలోయున్న జీవుడు ఏమీ అనుభవించుటకు వీలు లేదు. అందువలన ఆత్మలోగానీ, దేవునియందుగానీ జీవుడు ఆనందమును పొందలేడని చెప్పుచున్నాము. జీవుడు దేవునిజ్ఞానమును పొందినప్పుడు ఆనందమును అనుభవించుచున్నాడు. యోగము పొందినప్పుడు జీవుడు ఆత్మగాయుండుట వలన, మోక్షము పొందినప్పుడు జీవుడు దేవునిగాయుండుట వలన ఎవడుగానీ (ఏ జీవుడుగానీ) ఆనందమును అనుభవించుటకు వీలులేదు. మరొక్క విషయమేమంటే బ్రహ్మయోగములో ఆత్మలో కలిసియున్న జీవుడు యోగమును వీడిన వెంటనే ఆత్మనుండి బయటికి వచ్చి ప్రత్యేక జీవునిగా ఉండును. అయితే దేవునియందు ఒకమారు ఐక్యమై మోక్షము పొందినవాడు, తిరిగి దేవుని నుండి బయటపడుట అసంభవము. ఒకమారు మోక్షము పొందిన జీవుడు శాశ్వితముగా దేవునియందే నిలిచిపోవును. అటువంటివాడు తిరిగి ఎప్పటికీ జీవుడుగా బయటపడి జన్మలెత్తడము జరుగదు. ఆత్మలో కలిసిన జీవుడు ఆత్మనుండి బయటికి రావచ్చునుగానీ, దేవునియందు కలిసినవాడు తిరిగి బయటికిరాడు. అన్ని విధములా ఈ ప్రశ్నకు జవాబు జీవుడు జ్ఞానమును పొందినప్పుడు ఆనందమును పొందునని చెప్పవచ్చును.

**1046. (6) జ్ఞానములలో ఏ జ్ఞానము గొప్పది?**

1) ప్రకృతి జ్ఞానము 2) పరమాత్మ జ్ఞానము 3) ఆత్మ జ్ఞానము 4) జీవాత్మ జ్ఞానము

జ॥ ప్రకృతి జ్ఞానము.

**వివరము :-** ఈ ప్రశ్నకు సరియైన జవాబును ఎవరూ వ్రాయలేదు. చాలామంది పరమాత్మ జ్ఞానమనియో లేక ఆత్మజ్ఞానమనియో వ్రాశారు. వాస్తవానికి జ్ఞానములలో పరమాత్మ జ్ఞానము గొప్పదయినా, మనిషి నేర్చుకొనుటకు ప్రకృతి జ్ఞానమే గొప్పదని చెప్పవచ్చును. భగవద్గీతలోని విజ్ఞాన యోగమందు 14వ శ్లోకమున **"నాచేత తయారు చేయబడిన మాయను దాటుట దుస్సాధ్యము"** అని భగవంతుడే చెప్పాడు. ఆ మాట ప్రకారము మనిషి దేవునివైపు రావాలంటే మొదట ప్రకృతి సంబంధ జ్ఞానమును తెలియవలసియుంటుంది. ప్రకృతి సంబంధ జ్ఞానము అంటే ప్రపంచ విషయములని అనుకోకూడదు. ప్రకృతి జ్ఞానము అంటే ప్రకృతి జనితములయిన గుణములను గురించి, గుణముల సమ్మేళనమైన మాయను గురించి తెలుసుకోవడమని అర్థము. మాయను గురించి తెలియనిదే మాయను జయించి, దేవునివైపు రావడము చాలా కష్టమైన పనియగును. దేవున్ని తెలియాలంటే, దేవుని జ్ఞానము అర్థము కావాలంటే, ముందు మాయను జయించవలసి వచ్చును. మాయను జయించుటకు లేక దాటుటకు ముందు మాయను గురించి తెలియవలసియుండును. మాయ దుస్సాధ్యమైనది కనుక దేవున్ని నమ్మువాడు ముందు మాయను గురించి పూర్తి తెలియకుండ కేవలము దేవున్ని గురించి తెలియవలెనంటే అది జరిగే పని కాదు. అందువలన ముందు తెలియవలసిన జ్ఞానమేదో అదే మనిషికి గొప్ప జ్ఞానముగాయున్నది. దాని ప్రకారమే ప్రకృతి జ్ఞానమని సమాధానము చెప్పవలసి వచ్చినది. భూమిమీద చాలామంది ప్రకృతి జ్ఞానమును వదలి

నేరుగా దైవజ్ఞానమును ఆశ్రయించారు. అయినా వారికి దేవుని జ్ఞానము అర్థము కాకుండా పోయినది. భూమిమీదున్న మూడు ముఖ్య మతములయిన ఇందూ, ఇస్లామ్, క్రైస్తవముల వారు ప్రకృతి జ్ఞానమును వదలి దానిని తెలియకుండా నేరుగా దేవుని జ్ఞానము చెప్పుకొనుచుండినా, వారు మాత్రము మాయలో చిక్కుకొని పోయారు. మాయ కరుణించనిదే దేవుని వాక్యము ఎవరికీ అర్థముకాదు. అందువలన ఎంతో అనుభవ మున్న జ్ఞాని, యోగి అయిన వేమనయోగి తన పద్యములో **"పతియొప్పిన సతియొప్పును"** అని చెప్పాడు. పతి అనగా దేవుడు అనియూ, సతి అనగా ప్రకృతి అని ఆయన భావము. దేవుడు ఒప్పుకొంటేనే దేవుని అనుమతితోనే దేవునికి సతి అయిన మాయ మనిషికి జ్ఞానమును అర్థమగునట్లు చేయును. పతి సతి ఇద్దరి సహకారముంటేనే మనిషికి జన్మరాహిత్యము ఏర్పడును. అందువలన దేవుని జ్ఞానము అర్థము కావాలంటే ముందు మాయ జ్ఞానము తెలియవలెను. దేవుని జ్ఞానముకంటే మనిషికి మాయ జ్ఞానము చాలా కష్టమయినది. మాయా విధానము శరీరములో ఎలాగున్నదని తెలియకుండా బయట మేము దేవున్ని విశ్వసించాము, మేము దేవుని భక్తులము అనువారికి ఇంతవరకు దేవుని జ్ఞానము అర్థముకాలేదు. ఏ విధముగా ఒక మనిషికి తల్లితండ్రి ఎంత ముఖ్యమో, అదే విధముగా మనిషికి ప్రకృతి పరమాత్మ ముఖ్యముగాయున్నారు. తల్లిలేకుండా ఏ మనిషీ పుట్టలేదో అదే విధముగా ప్రకృతి లేకుండా ఏ మనిషీ పుట్టలేదు. తల్లి సహకారము లేనిది తండ్రి ఎలా తెలియబడడో అలాగే మాయ (ప్రకృతి) సహకారము లేనిది దేవుడు ఎవరయినది తెలియదు. నేడు మాయ విధానము తమ శరీరములలో ఎలాగున్నదో తెలియకుండా చాలా మతములవారు నేరుగా దేవుడు ప్రార్థన అని అంటున్నారు. అందువలన వారికి దైవగ్రంథరూపములో యున్న దేవుని జ్ఞానము ఏమాత్రము అర్థము కాలేదు. అయినా వారికి మీకంటే తెలిసినవారు లేరని మాయ వారిని నమ్మించి, ఎంతకాలమున్నా వారికి దేవుని

విధానమే తెలియకుండా చేసినది. అటువంటివారు జ్ఞానమంతా మాకు తెలుసు అను గర్వముతోయున్నారు. వాస్తవముగా వారికి ఏమాత్రము దేవుని జ్ఞానము అర్థము కాలేదని తెలియకుండా పోయినది. నేడు మేము మిగతా ప్రజలకంటే గొప్ప జ్ఞానులము అనుకొను మిగతా మతపెద్దలుగానీ, హిందూమతములో మిగతా ప్రజలకు బోధించూ బోధకులుగా యున్నవారు గానీ, మాయ విధానమును తెలియక దైవజ్ఞానమంతా తెలుసు అని అనుకొంటున్నారు. వారి చూపు వారి శరీరములోనున్న మాయ మీదకు ఏమాత్రము పోలేదు. వారికి మాయ జ్ఞానమయిన ప్రకృతి జ్ఞానము తెలియదు. జ్ఞానములలోకెల్ల గొప్పదయిన ప్రకృతి జ్ఞానమును తెలియని వారు తర్వాత సులభమయిన పరమాత్మ జ్ఞానమును తెలియక మేము తెలిసినవారమని ఇతరులతో వాదించుచున్నారు. తల్లి ద్వారా తండ్రిని తెలిసినట్లు ప్రకృతి ద్వారానే పరమాత్మను తెలియవలెనను సూత్రమును మరువకూడదు.

**1047. (7) మూలి ముగ్గురిని చెరిస్తే, వాని ఆలి నలుగురిని చెరిసింది. మూలి ఎవరు? వాని ఆలి ఎవరు?**

1) గ్రుడ్డివాడు 2) కుంటివాడు 3) ఏమీ చేయనివాడు 4) ఏమీ చేతగాని వాడు.

1) గ్రుడ్డివాని భార్య 2) కుంటివాని భార్య 3) ఏమీ చేయనివాని భార్య 4) ఏమీ చేతకానివాని భార్య.

జ॥ ఏమీ చేయని వాడు, ఏమీ చేయని వాని భార్య.

**వివరము :-** ఈ ప్రశ్నకు కూడా ఎవరూ సరియైన జవాబును వ్రాయలేదు. మూలి అను పదమే కొందరికి అర్థము కాలేదు. మూలి అను పదమును కొన్ని ప్రాంత్రములలో విరివిగా వాడుచుండగా, కొన్ని ప్రాంతములలో తక్కువగా వాడుచున్నారు. అంతేగానీ మూలి అను పదము పూర్తి క్రొత్త పదముకాదు. మాటలువచ్చి మాట్లాడక మౌనముగా ఉండువానినీ, చేయగలిగి ఏమీ చేయక

ఊరకుండువానిని మూలి అని అంటున్నాము. ఊరకుండు వానిని ముని అంటున్నాము. ముని అను పదము మూలిగా కూడా పిలువబడుచున్నది. మూలి అంటే ఇప్పుడు అందరికీ అర్థమయి ఉంటుంది. మూలి ముగ్గురుని చెరిస్తే అనడము ఎవరికీ అర్థము కాలేదు. చెడిపోవు మూడు ఏవి అనునది కూడా ఎవరికీ తెలియదు. మూలి అన్న తర్వాత మూలి ఆలి అని అతని భార్యను గురించి కూడా ప్రస్తావన వచ్చినది. మూలి భార్య ఎవరో ఒకరుండ వచ్చునుగానీ, అమె నలుగురుని చెరిసింది అని అన్నప్పుడు, ఆ నలుగురు ఎవరో ఎవరికీ అర్థము కానందున ఈ ప్రశ్నకు సరియైన జవాబును ఎవరూ వ్రాయలేకపోయారు.

ఈ ప్రశ్నకు జవాబు ఆరవ ప్రశ్న జవాబుకు దగ్గర సంబంధముగా ఉండును. అక్కడ ప్రకృతి పరమాత్మను సతి పతి అని చెప్పాము. ఇక్కడ అదే విధముగా పరమాత్మను మూలియని, ప్రకృతిని వాని ఆలియని చెప్పాము. ఇక్కడ పరమాత్మ పనిచేయనివాడని, అట్లే ఏదీ చెప్పువాడు కాదని మౌనముగా సాక్షిగా ఉండువాడని తెలియునట్లు మూలి అని అనడము జరిగినది. మూలి అనగా పరమాత్మ (దేవుడు) అనియు, ఆయన భార్య అనగా ప్రకృతియని తెలిసిపోయినది. ఇక మనకు ముగ్గురు ఎవరు అను విషయము, అట్లే నలుగురు ఎవరు అన్న విషయము తెలియవలసియున్నది. దేవుని అధికారము ఆయన భార్య అయిన ప్రకృతి మీద ఉన్నది. ప్రకృతి దేవుని ఆజ్ఞకు లోబడి నడుచుచున్నది. భార్య భర్తను అనుసరించి యుండునట్లు ప్రకృతి పరమాత్మను అనుసరించి పరమాత్మ ఆదేశానుసారము నడుచుచున్నది. ప్రకృతి బయట పంచభూతములుగాయుండినా, శరీరము లోపల దైవాజ్ఞ ప్రకారము నడుచుటకు అనుకూలముగా మూడు గుణముల రూపములోయున్నది. మూడు గుణములను కలిపి మాయ అని అంటున్నాము. పంచ భూతముల రూపములో బయటయున్న

దానిని ప్రకృతియనీ, మూడు గుణముల రూపములో శరీరము లోపలయున్న దానిని మాయ అని అనడము జరుగుచున్నది.

ఒక మనిషి దైవమార్గములో యున్నానని అనుకొనినా వాడు సరియైన మార్గములో ఉండవచ్చును లేక ఉండకపోవచ్చును. ఎవడయితే తల్లితండ్రులను గౌరవించినట్లు, ప్రకృతి పరమాత్మను సరిగా అర్థము చేసుకొని సమానముగా గౌరవించునో, వానికి మాత్రము దేవుడు కరుణించి తన భార్య అయిన మాయకు ఆ జీవున్ని తనవైపుకు పంపునట్లు ఆజ్ఞ చేయును. అప్పుడు ప్రకృతియైన మాయ తన భర్త మాటను గౌరవించి అలాగే చేయును. ఇక్కడ దేవుడు మాయకు ఆజ్ఞను చేయడమును అందరికీ అర్థముకానట్లు, జ్ఞానులకు మాత్రమే అర్థమగునట్లు చెప్పడమునే "మూలి ముగ్గురిని చెరిస్తే" అని అనడము జరిగినది. మూలి అనగా దేవుడనీ, ముగ్గురు అనగా తామసము, రాజసము, సాత్త్వికము అను మూడు గుణములనీ, చెరిస్తే యనగా మూడు గుణములను పని చేయనట్లు చేయడమని అర్థమగునట్లు ఆ విధముగా చెప్పారు. మనిషి శరీరములో దేవుని జోక్యముతో మూడు గుణములు ఏమాత్రము పని చేయనప్పుడు బ్రహ్మయోగము ఏర్పడును. అలా బ్రహ్మయోగి అయినవాడు యోగములో వచ్చు జ్ఞానాగ్ని వలన కర్మను కాల్చుకోగలిగి అనతి కాలములోనే మోక్షమును పొందగలుగును.

పరమాత్మ అనుకుంటే ఏ మనిషికయినా బ్రహ్మయోగము లభ్యమగును. ఇది ఒక విధానముకాగా, ఇక రెండవ విధానము కూడా మరొకటి కలదు. ఆ రెండవ విధానములో పరమాత్మ ఆలి అయిన ప్రకృతి అనుకొంటే నలుగురిని చెరుస్తుందని కలదు. నలుగురు అనగా! మూడు గుణముల భాగములను ముగ్గురిగా లెక్కించవచ్చును. నాల్గవ గుణరహిత భాగమును నాల్గవ వానిగా లెక్కించవచ్చును. ప్రకృతి అనుకుంటే నాలుగుకు సంబంధములేని కర్మ

యోగములో మనిషిని నిలుపుచున్నది. తమ బిడ్డకు తల్లితండ్రులు ఇరువురు ఎలా సహాయము చేయుచున్నారో అలాగే ఒక మనిషి దేవునివైపు పోవుటకు కావలసిన రెండు యోగములను ప్రకృతి, పురుషులయిన మాయ, దేవుడు చేకూర్చుచున్నారు. స్త్రీ అయిన ప్రకృతి కర్మయోగమును, పురుషుడయిన దేవుడు బ్రహ్మయోగమును శరీరములో జీవునికి కల్పించుచున్నారు. ఈ విషయమును తెలియజెప్పుటకు జ్ఞానులకు మాత్రము అర్థమగునట్లు మూలి ముగ్గురుని చెరుసును, వాని ఆలి నలుగురుని చెరుసును అని అన్నారు.

**1048. (8) సృష్ట్యాదిలో దేవుడు ఆకాశవాణి ద్వారా జ్ఞానమును చెప్పునప్పుడు మూడు ధర్మములను మాత్రము చెప్పాడు. తర్వాత ద్వాపర యుగములో తన దూత లేక భగవంతుడయిన శ్రీకృష్ణుని ద్వారా జ్ఞానమును చెప్పినప్పుడు నాలుగు అధర్మములను చెప్పాడు. మొదట చెప్పిన మూడు ధర్మములు ఏవి? తర్వాత ద్వాపరయుగమున చెప్పిన నాలుగు అధర్మములు ఏవి?**

జ॥ మూడు ధర్మములు బ్రహ్మయోగము, కర్మయోగము, భక్తియోగము అనునవికాగా, ద్వాపరయుగమున చెప్పిన అధర్మములు నాలుగు అధర్మ ములలో ఒకటి యజ్ఞములు, రెండు వేదములు, మూడు దానములు, నాలుగు తపస్సులు అని చెప్పవచ్చును.

**వివరము :-** ఇప్పుడు మేము చెప్పిన జవాబులు కొందరికి వింతగా కనిపించినా చెప్పిన విషయము మాత్రము వాస్తవమే. ఇది నేను ప్రత్యేకించి చెప్పినది కాదు. బ్రహ్మవిద్యాశాస్త్రమయిన భగవద్గీతలోనే ఈ విషయములు కలవు. మొదట సృష్ట్యాదిలో వాణి ద్వారా చెప్పబడిన జ్ఞానములో మూడు ధర్మములు దేవున్ని చేరు మార్గములైన మూడు యోగములుగాయున్నవి. తర్వాత మనుషులు దేవుడు చెప్పిన జ్ఞానమును వదలి అధర్మములను ఆచరించను మొదట పెట్టారు.

అధర్మముల ఆచరణ ఎక్కువయిన తర్వాత వాటిని అణచివేయు నిమిత్తము, ధర్మములను తెలియజేయు నిమిత్తము ద్వాపరయుగమున దేవుడు మనిషిగా వచ్చి జ్ఞానమును చెప్పాడు. అప్పుడు ధర్మములయిన బ్రహ్మ, కర్మ, భక్తి యోగములను తెలియజేయడమేకాక వాటితో పాటు అధర్మములను కూడా తెలియజేశాడు.

దేవుని ధర్మములను యోగముల రూపములో చెప్పినప్పటికీ మనిషి వాటిని అర్థము చేసుకోలేకపోయాడు. మనిషి దేవునివైపు పోవాలను ధృడ సంకల్పము లేనివాడైనందున, దేవుని సతి అయిన ప్రకృతి తన మాయచేత మనిషికి దేవుని జ్ఞానమును అర్థము కాకుండా చేసి ప్రక్క దారిలోనికి పోవునట్లు చేసినది. మనిషి దేవుని జ్ఞానమును అర్థము చేసుకోలేని స్థితిలో ఉండికూడా తాను అన్నీ తెలిసిన వాడినని గర్వపడడము వలన అతనికి అధర్మములను కూడా దేవుడే జతచేశాడు. దేవుని ఆదేశానుసారము ప్రకృతి మనిషికి నాలుగు అధర్మములను అంటగట్టినది. ఆ నాలుగు అధర్మములను అంటగట్టి వాటినే ధర్మములుగా లెక్కించునట్లు చేసినది. దానితో మనిషి ధర్మములయిన యోగముల స్థానములో అధర్మములైన యజ్ఞ, దాన, వేద, తపస్సులను ఉంచుకొన్నాడు. అసలయిన ధర్మాచరణలయిన మూడు యోగములను మనిషి మరచిపోయి అధర్మములైన యజ్ఞ, దాన, వేద, తపస్సులను ఆచరణగా పెట్టుకొన్నాడు. ఈ విధముగా మనిషి ధర్మములను అర్థము చేసుకోలేక వాటిని పూర్తి మరచిపోయి, వాటి స్థానములో యజ్ఞ, దాన, వేద, తపస్సులను కల్పించుకొన్నాడు. ఇదే విషయమునే భగవద్గీతలో భగవంతుని రూపములో యున్న దేవుడు తిరిగి చెప్పినా, ఈ నాటికి మనిషి దేవుడు చెప్పిన జ్ఞానమును వదలి అధర్మములను ఆచరించుచున్నాడు. ఇతరులచేత అధర్మ ఆచరణే ముఖ్యమన్నట్లు వాటినే చేయిస్తున్నాడు. నేడు స్వాములు, గురువులుగా

యున్నవారే అధర్మములను ధర్మములని ఆచరించడము వలన, ఏమీ తెలియని మిగతా ప్రజానీకము వారినే ఆశ్రయించి, వారు చెప్పినదే జ్ఞానమనుకొని, అధర్మ ఆచరణలు చేయుటకే అలవాటు పడిపోతున్నాడు. ఏదో ఒక భక్తి ఉంటే చాలని అనుకొన్నారు తప్ప, నేను చేయునది ధర్మాచరణా లేక అధర్మాచరణాయని ఏమాత్రము ఆలోచించకుండ ఉన్నారు. దానితో భూమిమీద అధర్మాచరణ పెరిగి పోయినది, ధర్మములంటే ఏమో తెలియనిస్థితిలో మనిషి ఉండిపోయాడు.

## జ్ఞాన పరీక్ష

**తేది-04-04-2016 - త్రైతశకము-38 - చిన్నపొడమల (తాడిపత్రి మం॥)**

**గమనిక :- ప్రశ్నకు తగిన జవాబును ఒక మాటలోగానీ, ఒక వాక్యములో గానీ వ్రాయవలెను.**

**1049. (1) కాలములో ఎన్ని అక్షరములు గలవు?**

జ) ఒక్క అక్షరమైన ఆత్మగలదు.

**వివరము :-** ఇది ఆధ్యాత్మిక పరీక్ష. కావున వీటి జవాబులు స్థూలముగా కాకుండా సూక్ష్మముగానే యుండును. అందువలన 'కాలము' అనునది మూడక్షరముల తెలుగు పదముగా తీసుకోకూడదు. స్థూలముగా వ్రాయబడిన పదములో చూస్తే మూడు కనిపించు అక్షరములు ఉండును. అయితే ఇక్కడ కనిపించే కాలము అగు వ్రాయబడిన పదమును గురించి అడుగలేదు. 'కాలము' అను పదము యొక్క పదములోయుండు అర్థమును గురించి ఇక్కడ అడగడమైనది. కాలము అనగా 'దైవము' అని భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమునందు 32వ శ్లోకములో **"కాలమును నేనే"** యని చెప్పియుండుట వలన కాలమనగా దేవుడేయని చెప్పవచ్చును. ఇక్కడ దేవునిలో ఎన్ని అక్షరములు గలవు? అని ప్రశ్న అడగడమైనది. **'అక్షరము'** అనగా నాశనము

కానిదని అర్థము. భగవద్గీతయందు పురుషోత్తమ ప్రాప్తి యోగమున 16, 17వ శ్లోకములలో క్షరుడు, అక్షరుడు అను ఇద్దరు పురుషులు గలరని, మూడవ పురుషుడు ఇద్దరి పురుషులకంటే ఉత్తమమైన పురుషోత్తముడని (పరమాత్మయని) చెప్పడమైనది. దీనినిబట్టి దేవుడు మూడు ఆత్మలుగా యున్నాడని అందులో నాశనమయ్యే ఆత్మ (జీవాత్మ) ఒకటికాగా, నాశనముకానిది అక్షరుడు (ఆత్మ) రెండవది కాగా, మూడవది పురుషోత్తముడని కలదు. పై ప్రశ్నలో కాలములో ఎన్ని అక్షరములు గలవు? అన్నప్పుడు నాశనము కాని ఆత్మ ఒక్కటే యుండుట వలన, ఒక్క అక్షరమే కలదని చెప్పడము సరియైన జవాబగును.

**1050. (2) జనులను ఏమంటాము?**

జ) 'పుట్టనివాడు' అని అంటాము. పుట్టినా పుట్టనివానితో సమానమైన వానిని అలా అనవచ్చును.

**వివరము :-** 'జనము' అనగా పుట్టినా పుట్టనివాడు. 'జ' అనగా పుట్టుటయని అర్థము. 'న' అనగా లేదు అని అర్థము. దీనిప్రకారము 'జనము' అనగా పుట్టినా పుట్టనివాడేయని అర్థము. మనుషులలో మను ధర్మమును ఆచరించు మానవులు గలరు. అట్లే దైవధర్మములను ఆచరించు ప్రజలు ఉన్నారు. "పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా" అన్నట్లు జన్మించి ఏ ప్రయోజనము లేని పుట్టినా పుట్టని వారితో సమానమైన జనము ఉన్నారు.

**1051. (3) ప్రతి జీవికి పదకొండు ఉంటాయి. అవి ఏవి?**

జ) ఏడు జతల కాడీ కేంద్రములు, నాలుగు అంతఃకరణములు మొత్తము పదకొండు ప్రతి జీవికి ఉన్నాయి.

**వివరము :-** ప్రతి మనిషి శరీరములోగానీ, ప్రతి జీవరాసి శరీరములోగానీ ఏడు నాడీకేంద్రములు, ఏడు గ్రంథి కేంద్రములు ఉండును. ఒక నాడీకేంద్రము,

ఒక గ్రంథి కేంద్రము రెండిటినీ కలిపి ఒక కాడీ కేంద్రము అంటాము. 'కాడి' అనగా జోడియని అర్థము. ఒక జోడి కలిసి పనిని చేయడమును ఒక కాడి పనియని చెప్పవచ్చును. ఏదయినా ఒక కాడియుంటే అందులో రెండు ఉంటాయి. ఒక మడకతో భూమిని దున్నే పనిని రెండు ఎద్దులు కలిసి చేస్తున్నాయి. అప్పుడు వాటిని 'కాడి' అనడము జరుగుచున్నది. ఒక కాడిలో ఎద్దులు ఉండవచ్చును. నాడి, గ్రంథి ఉండవచ్చును. ఇద్దరు వ్యక్తులయినా ఉండవచ్చును. నాడీ కేంద్రములో ఏ శక్తి ఉందో అదే శక్తే గ్రంథిలో కూడా ఉన్నది. నాడీలోనూ, గ్రంథిలోనూ మధ్యఆత్మ శక్తియే ఉన్నదని మరువకూడదు. ఆత్మశక్తి 'హర్ష' అని చెప్పడము జరిగినది. **'సప్తర్ష'** అనగా ఏడు ఆత్మలని అనవచ్చును లేక ఏడు సంతోషములని అనవచ్చును. నాడీ స్థానములను, గ్రంథులను స్తంభింపజేయడమును బ్రహ్మయోగము అని అంటాము. ప్రతి జీవి బ్రహ్మయోగమును చేయుటకు అవకాశముండునట్లు ఏడు జోడీలయిన ఏడు కాడీకేంద్రములను దేవుడు తయారు చేసియుంచాడు.

**1052. (4) జీవరాసులకు తోకలుంటాయా? ఎక్కడయినా మనిషికి తోకయుంటుందా?**

జ) తోకలుంటాయి. ప్రతి మనిషికీ తోక ఉన్నది.

**వివరము :-** మేము చిన్నతనములో ఒక సామెతను విన్నాము. పల్లెటూర్లలో ఇద్దరు కలిసి దారిలో పోవునప్పుడు ఇతరులు వారిని చూచి **"తోక వెంట నారాయణ అన్నట్లు ఇద్దరు తోడైనారా!"** అని అనెడివారు. ఇద్దరు కలిసి ఉన్నప్పుడు అలా అంటున్నారంటే దానికి ప్రత్యేకమైన అర్థముంటుందని తలచి నేను కొందరి పెద్దలను కలిసి ఆ మాటకు అర్థమేమి? అని అడిగాము. అయితే వారు సమాధానము చెప్పకుండా, అనేదే మాకు తెలుసుగానీ దాని అర్థము

తెలియదని చెప్పారు. దీనిని గురించి ఈ మధ్య కాలములో గురువు నుండి తెలిసిన వివరమును ఇప్పుడు మీకు తెలియజేయుచున్నాము చూడండి.

ప్రతి మనిషికి కనిపించనివాడు ఒకడు తోడుగాయుండి వాని వెంటనే పోవుచుండుట వలన, అలా వెంటవున్న వానిని మనిషికి అతుక్కున్న తోకలాంటి వాడని, కనిపించని వానిని (ఆత్మను) తోక అని అన్నారు. అంతేకాక తోకవలె మనిషి వెంటయున్న తెలియని వానిని గురించి వాడు ఇటువంటి వాడని అందరికీ తెలుపు నిమిత్తము మనిషి వెంట తోకగాయున్న వానిని 'నారాయణ' అని అనడము జరిగినది. అలా అనడములో 'తోకవెంట నారాయణ' అని చెప్పడమైనది. నారాయణ అనగా నాశరహితుడని అర్థము. నాశనము అనగా క్షరము అని అర్థము. నాశరహితము అనగా అక్షరము అని అర్థము. నాశరహితుడయిన అక్షరుడు అను ఆత్మ ప్రతి మనిషి శరీరములో జీవునితోపాటు యుంటూ శరీరములో పనిని చేయించుచున్నది. అందువలన ఆత్మను తోక అనియూ, ఆత్మ అక్షరమైనదనియు చెప్పుటకు 'తోక వెంట నారాయణ' అను వాక్యమును చెప్పారు.

**1053. (5) ఆహారము ఎన్ని రకములు. అవి ఏవి?**

జ) ఆహారము రెండు రకములు. ఒకటి క్షయ ఆహారము. రెండు అక్షయ ఆహారము.

**వివరము :–** ఇవి ఆధ్యాత్మికమైన ప్రశ్నలయిన దానివలన జవాబు ప్రపంచరీతిలో చెప్పక జ్ఞానరీతిగానే చెప్పవలసియున్నది. అందువలన జ్ఞాన సంబంధమైన జవాబుగా ఆహారము రెండు రకములనీ, ఒకటి క్షయాహారమనీ, రెండు అక్షయాహారమని చెప్పవచ్చును. క్షయాహారమనగా నాశనమగునది లేక జీర్ణమగునదని అర్థము. స్థూలమైన కనిపించే ఆహారములు ఎన్ని రకములుగాయున్నా అవి అన్నియూ తినిన మూడు గంటలకే జీర్ణమై (నాశనమై) పోవును. స్థూల

ఆహారము తిన్న తర్వాత దాని రూపురేఖలు మారిపోయి అది పూర్తి తన సామర్థ్యమును కోల్పోయి పూర్తిగా నాశనమైపోవును. ఇంకా వివరముగా చెప్పితే కడుపులో పడిన ఆహారము అక్కడగల జఠరాగ్నికి పూర్తి కాలిపోయి భస్మము మాత్రము మిగిలి పోవును. ఈ విధానమునే భగవద్గీతలో **"ద్రవ్యయజ్ఞమని"** పేరుపెట్టి చెప్పడమైనది. ఇకపోతే రెండవదయిన అక్షయాహారమును గురించి చెప్పితే అది కంటికి కనిపించునది కాదు, చెవుకు వినిపించునది మాత్రమే. దానినే **"జ్ఞానము"** అని అంటాము. జ్ఞానము బోధ రూపములో దొరుకును. అందువలన అక్షయాహారము చెవులకు మాత్రము తెలియునదని చెప్పాము. అక్షయమైన జ్ఞానమును ఎంత వినినా క్షయాహారము కడుపునిండినట్లు జ్ఞానబోధలు తలలో నిండిపోవు. ఒకమారు విన్న బోధను ఎంతమందికి చెప్పినా అది తనవద్దనుండి తరిగిపోవునది కాదు. దీనిని దొంగలు దోచుకోలేరు. ఏ విధముగా అది నాశనమగునది కాదు. అందువలన జ్ఞానబోధలను అక్షయ ఆహారమని చెప్పడమైనది.

**1054. (6) నొసలు మీద దేవునిముద్ర ధరించని వానికి ఎంత బాధ వరకు కలుగవచ్చును?**

జ) ఒక తేలు కుట్టినంత బాధనుండి ఐదు నెలల వరకు బాధను కలుగ చేయవచ్చును.

**వివరము :-** ఈ విషయమును గురించి ఇంజీలు గ్రంథములో చివరిలోని ప్రకటన గ్రంథమునందు 9వ అధ్యాయమున 4వ వాక్యమునుండి 6వ వచనము వరకు చూచిన ఇలా కలదు. **(ప్రకటన 9 అధ్యాయము 4,5,6 వచనములు)**

**4) నొసల్ల యందు దేవుని ముద్రలేని మనుష్యులకే తప్ప భూమిమీదున్న గడ్డికైనను, ఏ మొక్కలకైనను, ఏ వృక్షమునకైనను హాని కలుగచేయకూడదని వాటికి ఆజ్ఞ ఇయ్యబడెను. 5) మరియు వారిని చంపుటకు అధికారము**

ఇయ్యబడలేదు గానీ ఐదు నెలల వరకు బాధించుటకు వాటికి అధికారము ఇయ్యబడెను. వాటివలన కలుగు బాధ తేలు మనుష్యుని కుట్టినప్పుడుండు బాధవలె ఉండును. 6) ఆ దినములలో మనుష్యులు మరణమును వెదకుదురు గానీ అది వారికి దొరకనే దొరకదు. చావవలెనని ఆశపడుదురు గానీ మరణము వారివద్దనుండి పారిపోవును.

**1055. (7) భక్తుడు బాధపడితే దేవుడు ఏమి చేయును?**

జ) సాక్షిగా చూస్తూ ఉండును.

**వివరము :-** దైవగ్రంథములలో దేవుడు సాక్షిమాత్రమేయని చెప్పబడియున్నది. అంతేగాక **"దేవుడు నామ, రూప, క్రియా రహితుడు"** అను ధర్మమును అనుసరించి యుండును. అందువలన దేవుడు సాక్షియేగానీ ఏమీ చేయువాడు కాడు.

**1056. (8) మృతి అను పదము దేనినుండి వచ్చినది?**

**జ) 'స్మృతి' అను పదమునుండి 'మృతి' అను పదము పుట్టినది.**

**వివరము :-** స్మృతి అనగా జ్ఞప్తి యని అర్థము. ఎప్పుడయితే మనిషికి జ్ఞప్తి లేకపోవునో అప్పుడు వాడు మరణించిన వానిగా చెప్పవచ్చును. జ్ఞాపకమును లేకుండా చేయునదే మరణము. అందువలన స్మృతి లేనివానిని మరణము చెందిన వాడుగా లెక్కించవచ్చును.

**1057. (9) ఏకేశ్వరోపాసన ఎవరికి అవసరము? హిందువులకా, క్రైస్తవులకా, ముస్లీమ్‌లకా?**

జ) మూడు మతముల వారికి అవసరమే.

**వివరము :-** పైకి ఒక్క హిందూమతములో మాత్రమే ఏకేశ్వరోపాసన లేదు అనీ, మిగతా రెండు మతములలో ముందే ఏకేశ్వరోపాసన యున్నదని అందరూ అనుకోవడము జరుగుచున్నది. పైకి అట్లే అనిపించినా వాస్తవముగా ఏ

మతములో కూడా ఏకేశ్వరోపాసన లేదనియే చెప్పవచ్చును. **ఏకేశ్వరోపాసనయనగా ఒకే దేవున్ని విశ్వసించడము, ఒకే దేవున్ని ఆరాధించడము, ఇతరత్రా దేవుడు మరొకడు లేడని పూర్తిగా నమ్ముట.** ఈ మూడు విధానములున్న వాడు ఎవడయినా ఏకేశ్వరోపాసనలో ఉన్నట్లే. అట్లుకాకుండా ఏ ఒక్క విధానములోనయినా ఆచరణ భేదమున్నా, భావ భేదమున్నా అతను ఏకేశ్వరోపాసనలో లేనట్లే! హిందువులు అనేక దేవతలను పూజించుట వలన వారిలో ఏకేశ్వరోపాసన లేదని చెప్పవచ్చును. అట్లే క్రైస్తవులు, ముస్లీమ్‌లు ఇతర దేవతలను పూజించకపోవడము వలన ఒకే దేవున్ని ఆరాధించడము వలన వారు ఏకేశ్వరోపాసనలో ఉన్నారని అనుకోవడము జరుగుచున్నది. అయితే ఇక్కడ వారు ఇతర దేవుళ్ళనుగానీ, ఇతర దేవున్ని గానీ పూజించకుండా వారి దేవున్ని వారు పూజించుట వాస్తవమే, అయినా వారు ఇతర మతముల దేవుళ్ళున్నారని వారి దేవునికంటే మా దేవుడే గొప్పయని అనుకోవడము జరుగుచున్నది. ఇతరత్రా దేవుడు ఒకడున్నాడని తెలిసినప్పుడుగానీ, ఉన్నాడని అనుకోవడము వలనగానీ దేవుడు ఒకడను నమ్మకము లేనట్లేయగుచున్నది. అప్పుడు 'ఏకేశ్వరుడు' అనుమాటకు అర్థమే లేనట్లగుచున్నది. ఆరాధించడము ఒక్కన్నే అను మాటకంటే 'ఉన్నవాడు ఒక్కడే'యని తెలియడమే 'ఏకేశ్వరుడు' అనుమాటకు అర్థము చేకూరును. అట్లుకాకుండా ఇతరులున్నా నా దేవున్ని ఒక్కడినే నేను ఆరాధించుచున్నానని అనుకొనినా అది ఏకేశ్వరోపాసన అయినా, అతని లెక్కలో ఏకేశ్వరుడు లేనట్లేయగును. ముస్లీమ్‌లు హిందువుల దేవుడు వేరు, మా దేవుడు వేరు అంటున్నారు. అప్పుడు వారి లెక్కలో దేవుళ్ళు ఇద్దరైనారుగానీ ఒక్కరు కాలేదు కదా! అట్లే క్రైస్తవులు అంటున్నారు. అందువలన హిందువులు అనుకొన్నట్లు, మిగతా రెండు మతముల వారు అనుకోవడము వలన దేవుడు, దేవుని జ్ఞానము వారికి వేరువేరుగా కనిపించుట వలన, 'మా దేవుడు వేరు, మా జ్ఞానము వేరు' అను భావముండుట వలన వారికి ఏకేశ్వరుడు

కనిపించక వేరు దేవుడు కూడా ఉన్నట్లు భావము కలదు. అందువలన వారు ఒకే దేవున్ని పూజించినా అది ఏకేశ్వరోపాసనగా పైకి కనిపించినా వాస్తవముగా అది ఏకేశ్వరోపాసన కానట్లేయగును. అనేక దేవతలున్నారను హిందువులు తమ ఇష్ట దేవున్ని ఒక్కన్నే పూజించి మేము ఏకేశ్వరోపాసన చేయుచున్నా మనుకొనినా అది ఏకేశ్వరోపాసన కానట్లు, మిగతా మతములవారు కూడా వారి ఇష్టదైవమును ఆరాధించుచూ ఏకేశ్వరోపాసన అన్నా అది ఏకేశ్వరోపాసన కాదు. అందువలన ప్రపంచమునకంతటికీ ఒకే ఈశ్వరుడు (ఒకే అధిపతి) యున్నాడని నమ్మడమే ఏకేశ్వరోపాసన యగును. అట్టివాడు ప్రత్యేకమైన ఆరాధన చేయకున్నా వాని **నమ్మకమే** ఆరాధన యగును.

**1058. (10) నీ వెనుక ఏమున్నది? ఎవరున్నారు?**

జ) పరమాత్మ, ఆత్మ.

**వివరము :-** ప్రతి శరీరములోను జీవించు జీవాత్మయుండగా, అతన్ని నడుపుటకు లేక జీవింపజేయుటకు అతనితోపాటు తోడుగా, జోడీగా ఆత్మ మొదట గలదు. ఆత్మ నడుపుచుండగా జీవాత్మ నడుచుచుండును. వీరిద్దరినీ సాక్షిగా పరమాత్మ గమనించుచుండును. ఈ విషయమును మూడు దైవ గ్రంథములలో చెప్పియున్నారు. జీవాత్మ వెనుక ఆత్మ, పరమాత్మయున్నారని ఒక విధముగా చెప్పవచ్చును. సంపూర్ణ జ్ఞానము తెలిసిన తర్వాత జీవాత్మ ముందు ఆత్మ, జీవాత్మ వెనుక పరమాత్మ కలదని ఇంకొక విధముగా చెప్పవచ్చును.



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

సాక్షి న్యూస్ పేపరు, *12-10-2015*

# 'హిందూ పదానికి నిర్వచనం తెలియదు'

ఇండోర్: రాజ్యాంగం, న్యాయపరంగా హిందూ పదానికి నిర్వచనం తెలియదని కేంద్ర హోంశాఖ తేల్చింది. హిందూ పదం నిర్వచనం చెప్పాల్సిందిగా మధ్యప్రదేశ్‌కు చెందిన చంద్రశేఖర్ గౌర్ అనే వ్యక్తి సమాచార హక్కు చట్టానికి చేసుకున్న దరఖాస్తుకు బదులిస్తూ హోంశాఖ పై విధంగా స్పందించింది. ఆ పదానికి సంబంధించిన ఎలాంటి సమాచారంలేదని కేంద్ర పౌరసంబంధాల శాఖ అధికారి పేర్కొన్నట్లుగా కేంద్రం తెలిపింది. ఎలాంటి నిర్వచనం లేనప్పుడు ఫలానా వర్గంవారు హిందువులని ఎలా నిర్ధారిస్తున్నారని, దేశంలో హిందువులు మెజారిటీగా ఉన్నారని ఎలా చెబుతున్నారని గౌర్ ప్రశ్నించారు.

సాక్షి న్యూస్ పేపరు, *21-01-2014*

ప్రముఖుల లేఖ



# ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

# 1058
# ఆధ్యాత్మిక ప్రశ్నలు–జవాబులు

బ్రహ్మ చక్రం

కాల చక్రం

కర్మ చక్రం

గుణ చక్రం

రాజసములో జీవుడు

బ్రహ్మనాడి

*Author :*

*The Only GURU of Three Religions*

*The Spiritual Emperor, Thraitha Theorem Originator*

*Sri Acharya Prabodhananda Yogeeshwarulu*



**www.thraithashakam.org**